ఆమోద = వాసన.

మధుకర = తుమ్మెదల.

గరుత్ = రెక్కలు.

జాతపోతములు = పిల్లవాయువులు.

క॥ ననుపడు నిమిషము లయుటుర । మ్మనలజ్జ మునంగు ముగుదకపుడు పునర్ద।
ర్శనపు చ్చాఖిన్నరసఖీ । జనవాక్యములాత్మసంతసం బొనరించెన్॥ ౪౭

టిప్పణము.

విధుర = ఆతుర = సఖీ = చెలికత్తియ.

ఉ॥ అత్యధికానురాగభరితాంచితనైశరతిప్రరూఢవై।
యాత్యవచోనుజల్పకగృహోద్భృతకీరభవత్త్రపాభరా।
న్నత్యముదాడిమభ్రమకనన్మణిముద్రికఁగొల్పితత్ప్రిలా।
పాత్యయము ముష్టటింపుచురయంబునఁబాపెను బ్రౌఢధీరతన్॥ ౪౮.

టిప్పణము.

నైశ = రాత్రిసంబంధమగు.

వైయాత్య = ధార్ష్ట్యము—శంకలేని.

జల్పక = వచించు.

గృహోద్భృత = ఇంటసాఁకిన.

అత్యయము = అంత్యము.

ధీరతన్ = చాతుర్యముచేత.

శా॥ క్రీడామందిరమల్పనైశతిమిరాకీర్ణంబుగానుండన।
వ్రీడామంథరచేష్టప్రౌఢకుమనఃప్రీతిప్రదంబయ్యె వి।
బ్రీడాత్మప్రియకల్పితోరునఖసంఛాఘానుసీత్కారవే।
ళాడోలాయితదంతధాళగళిదోల్లచ్ఛంద్రికాసాంద్రమై॥ ౪౯

టిప్పణము.

అవ్రీడామంథరచేష్ట = సిగ్గుచేత మందముకాని చేష్టగలది=ఇచ్ఛానుగుణమైన చేష్ట గలది యనుట.

విభ్రాట్ = అలంకృతుడగు.
సీత్కారము శీశీయను ధ్వని.

---

సీ॥ (1) పద్మినీలతలభ్రమరకవక్త్రసంవ్యాప్తపద్మ [illegible]
(2) వానంతవనములవైఖరినసనుత్కాలికా [illegible]
(3) సరసులకరణిహంసకవలమూర్మికా భూరికంకణ [illegible]
(4) శారదదినములసరణినఖాలంకృత [illegible]
(5) పరవశత్వంబు [illegible] సంప్రాప్తమగు । [illegible]
వలనువానునవైరికాంతలునిమాహా । [illegible] ౫౦.

టిప్పణము.

---

(1) భ్రమరక = శృంగము—ముంగురులు. వక్త్ర = వక్రవాకము—మోము. [illegible] ముఖ = ముఖమువంటి పద్మమనియు, పద్మమువంటి ముఖమనియు గ్రహింపవలయును.

(2) ఉత్కలికా = మొగ్గలు—రోమాంచాదిభావములు.

(3) హంసక = మంజీరము—హంస. ఊర్మిక = తరంగము—ఉంగరము. భూరి [illegible] ప్ప—బంగారము. కంకణ = జలబిందువు—కడియము.

(4) నఖాలంకృత=నఖసంబంధములగు గాయములచే నలంకృతమగు—[illegible] రించని = ఆకాశమందు లేని—పయోధర = కుచము—మేఘము

(5) పరవశత్వము = వివశత్వము. జీవితేశ = యముడు—ప్రాణనాథుడు. పురం—పట్టణము—శరీరము—పరిరంభము=ఆలింగనము—

సీ॥ (1) పరిధూతకుసుమకేసరకేసరవ్యగ్రస్ఫురద్రజోరాజివిరాజితంబు।
(2) పుంభావరణితనూపురమణీరమణీవిలాసలీలాలాపలాలవంబు।
(3) కలికలరవముదాకరకుముదాకరశీకరోత్కరశైత్యసేవితంబు।
(4) విహితప్రియాళీవిరహితానురహితానువామాసవామ్యాపహారితంబు।
గీ॥ (5) అధికమోహామదసమర్పకదర్ప । దర్పసూచనాప్రదర్శితంబు।
వినరెనవుడుసురతవిస్మృతరాయాసాభి । వారణంబువరసమీరణంబు॥ ౫౧.

టిప్పణము.

---

(1) కేస = కేశము = కొప్పు. ఇట కసలకభేదము,

(౨) పుంభావ = పురుషాయితరతి,

(౩) కవి = జలపక్షి, కుముదాకర = సరస్సు,

(౪) ఆళీ = చెలికత్తె, విహితప్రియాళీ = విహితులును, ప్రియులును నగు, ఆళి = చెలికత్తెలచేత—విరహిత = విడువఁబడినట్టియు—రహితాసు—ప్రాణములు విడిచినట్టియు—అసు = మిగులమంచివారగు—వామా = స్త్రీలయొక్క—ఆసవ = మద్యసంబంధముగల—ఆశ్వాస = నిట్టూర్పుచేత—వాసితంబు = పరిమళముగలదిగా చేయఁబడినది.

(౫) దర్పక=మన్మథుఁడు, విసృమర=అంతటనువ్యాపించిన. సమీరణము = వాయువు,

---

ఉ॥ ఆయుపనాన్నృపాలసుతుఁడాత్తతరాఖ్యవిభూతిగాఢని।
ద్రాయతినుండిస్వప్నమునసద్భుతమొప్పఁగఁగాంచెనంచితా।
మేయపయోవిలాసరుచిమేదురసుందరగాత్రనొక్కయా।
ఘ్రాయతనేత్రఁజెప్పననయుంబునశక్యముదాని వైఖరుల్॥ ౫౨,

టిప్పణము.

---

అమేయ=చెప్పశక్యముగాని, మేదుర=దట్టమైన,

---

సీ॥ శాంగేయసుమహారశాలిశోరణచూతమారవిమోహనాగారమనఁగ।
కాంచనప్రాకారకలితమన్మథమహానిగ్రహమంచితకోశనిలయమనఁగ।
పోషితరుచిపరివేషభూషితసుధాడంబరరాకాబ్జబింబమనఁగ।
భాసితాయతపరిఘాసమాస్పదలోకపాలయబందీజనసదనమనఁగ।
తీవ్రపకేసకేశలాకాగురుప్రసక్తి । ఘనజగల్లోచనానందజగ్రహణకరణ।
నాళ్యలాలకమునగనాయమనయును । స్వర్ణమణిమేఖలాఘోషజఘనమహలరు॥ ౫౩.

టిప్పణము.

---

విమోహనాగారము = విలాసమందిరము,

కోశనిలయము = బొక్కసము,

## టిప్పణము.

---

రత్నపుటవకము = మణులచే నిర్మింపఁబడిన డబ్బి. దర్పకశిల = మదకరశిల. మహళి = గుచ్ఛము. ముకుళము = మొగ్గ. అంగరాగము = విలేపనగంధవిశేషము. చాతురికము = చీనామంటి సీసా. నిస్తుల = సమానరహితమైన.

---

సీ॥ లోలహారలతామృణాళలోభనిలీనచక్రవాకయుగప్రశస్తిదనర।
త్రిజగతీవిజయపరిశ్రమాభిన్నహృచ్ఛయవిశ్రమావాససరణియమర।
హారరోమాళిగంగారవిజాసంగమప్రయాగతటాతిమహిమయొనర।
సకలంకసకలావయవవినిర్మితిశేషలావణ్యపుంజవిలాసమలర।
గీ॥ వితతగురుపరిణాహతాపతనభయవి । రంచికీలితగిరిసారకాంచగురుశ।
లాకికాభ్రమమూదుకాస్తోకరుచిర । ఘనకుచాకుచలికుచముల్ గ్రాలునెపుడు॥ ౫౭

## టిప్పణము.

---

నిలీన = చేరిన. హృచ్ఛయ = మన్మథుఁడు. రవిజా = యమున. వినిర్మితి = సృష్టి. లావణ్యపుంజము = సౌందర్యరాశి. పరిణాహతా = బరువు. గిరిసారక = ఇనుము. ఘనకుచ = స్త్రీ. కుచలికుచములు = గజనిమ్మపండ్లవంటి స్తనములు.

---

చ॥ తరుణిసదారుణాధికసుధామధురాధరమొప్పురాగసా।
గరజనితప్రవాళమణిఖండముఖాలతలార్ధచంద్రమం।
దరతరతారకాభికలితప్రకటస్ఫుటసాంధ్యరాగమో।
నిరవధినిర్గతాంతరవినిర్భరరాగమొనావిచిత్రమై॥ ౫౮ .

## టిప్పణము.

---

ప్రవాళమణిఖండము = పగడపుతునక. తారకా = కనుగ్రుడ్డు—నక్షత్రము. నిరవధి = నిరంతర.

---

క॥ రదనవరహీరరసా । స్పదముగుసిందూరముద్రపగిదిసలరునా।
మదవతిమోవిజగజ్జన । హృదయవశాకర్షణాభిహితబింబరుచిన్॥ ౫౯.

టిప్పణము.

---

సిందూరముద్ర = చెందిరపు మొహరు. బింబ = దొండపండు.

---

సీ॥ హృదయవాసావాసహృచ్ఛయభోగిగవాక్షశంకావహవైభవములు।
స్వకగతిక్రమనిరోధకకర్ణకృతరోషరసవిభ్రమాపాంగరక్తిమములు।
మల్లికోత్పలసుమమాలాహసద్విభాసురసితాసితదృగ్విశోభితములు।
నవనవకమలకాననసనాథీకృతపరిసరభూపరిభ్రాజితములు।
గీ॥ తరుణకైతకసుమదళద్రాఘిమములు । లోలపక్ష్మలపటుచటులాలసములు।
ధళధళితధవళప్రభాదంతురములు । లోకమోహనములుదానిలోచనములు॥ ౨౦.

టిప్పణము.

---

హృచ్ఛయభోగి = మన్మథుఁడనురాజు. సనాథీకృతము = కూర్పఁబడినది. కైతక దళము = మొగలిరేకు. ద్రాఘిమము = నిడివిగలది. పక్ష్మలము = కనురెప్ప. దంతురము = మేదురము—నిండినది—దట్టమైనది.

---

ఆ. వె॥ రదనరత్నతులాదండరంజితంబు । రతివరయోమదనేభపరండకంబు।
బంధురాలోకనామృతసింధుసేతు । బంధనంబననాసికబరగుసతికి॥ ౨౧.

టిప్పణము.

తులాదండము = త్రాసుముల్లు—పరండకము = ఆలానము = ఏనుఁగను గట్టివేయు గూటము.

---

ఉ॥ అంబుజగంధిభ్రూలతలుయౌవననర్తకలాసికాభిరా।
మంబులుసమ్ముఖాబ్జభవమందిరతోరణమాలికావికా।
సంబులులోచనాంబురుహసంగతమత్తమధువ్రతాళికాం।
తంబులురాగసాగరనదప్రతిమంబులుచిత్రవైఖరిన్॥ ౨౨.

టిప్పణము.

---

లాసిక = నర్తకి. మధువ్రత = భృంగము.

---

సీ॥ (1) ఉల్లసద్ధారపయోధరయైఘనాఘనసమయాకాసకాంతిఁ దెగడు।
(2) ప్రస్ఫుటీకృతబలిభంగయైవిక్రమాభీలవామనమహాలీలఁ దెగడు।
(3) సమధికకర్ణవిశ్రాంతలోచనయైసుయోధనాయతధృతి యొరవుఁ దెగడు।
(4) నలినతిక్రాంతకన్యాతులయైవృశ్చికస్థితార్కప్రభాగరిమఁ దెగడు।
(5) గీ॥ మొగిఁదులాకోటిదీపితమూర్తియైవి । జయసముచితావనిపదానసరణిఁ దెగడు।
నహాహయానాతిసదభిజాత్యాభిరూప్య । వైభవములెన్న దరమెయెవ్వారికైన॥

## టిప్పణము.

(1) ఉల్లసద్ధార = ప్రకాశించుహారములుగల—అధిక వారిధారలుగల. పయోధరము = మేఘము—కుచము—ఘనాఘనసమయము = వర్షించు మేఘములుగలకాలము = వర్షాకాలము.

(2) వలిభంగము = వబలకభేదము గనుక-బలిభంగమనగా - మహాబలిచక్రవర్తియొక్క భంగదశ—వలి = త్రివళీసంబంధమైన = భంగ = రేఖలు.

(3) కర్ణవిశ్రాంతలోచన = చెవులవరకు వ్యాపించిననేత్రములు గలది—కర్ణుని యొక్క జాగరూకమగు జ్ఞానముతోఁగూడినవాఁడు.

(4) అతిక్రాంత = అతిక్రమించిన—కన్యా = కన్యకలయొక్క—తుల = సమానముగలది=ఇతరకన్య లీకన్యకు సమానులుగారనుట. కన్యాతులారాసులను అతిక్రమించినది.

(5) తులాకోటిదీపితమూర్తి = పాదకటకములచేఁ బ్రకాశించునాకారము. తులా = త్రాసుయొక్క—కోటి = అగ్రమునందు—దీపిత=ప్రకాశించు—మూర్తి=శరీరముగలవాఁడు.

---

క॥ శచియునఁగనందనేక్షణ । రుచిరైయైవింధ్యాటవీనిరూఢతశశ్వ।
ద్రుచిరావిచలశ్యామల । కుచయైయొప్పానుకుటిలకుంతలయెపుడుఁ॥ ౬౮.

## టిప్పణము.

నందనేక్షణరుచి = నందనవనమును చూడవలెనను కాంక్ష—హర్షప్రదమగు చూపులకాంతి. ఉత్తుంగశ్యామలకుచ = ఉత్ =ఉన్నతములగు—తుంగ = పున్నాగవృక్షముల చేతను—శ్యామ = తమాలవృక్షములచేతను—లకుచ = గజనిమ్మచెట్లచేతనుకూడినది వింధ్యాటవి. ఉత్తుంగ=ఉన్నతమైనట్టియు—శ్యామల = శ్యామలవర్ణయుక్తములైనట్టియు—కుచ=కుచములుగలది కన్య—

(1) పున్నాగే పురుషస్తుంగః—అని అమరకోశము.
(2) తమాలశ్శ్యామలః కాలః— డిటో
(3) లకుచో లికుచో డహుః— డిటో

---

క॥ ఆవామనయనవరను । గ్రీవాంగదశోభియై ప్రకీర్తింపఁగ నం।
భావితవానరసైన్యము । హా విభవ సమగ్రతాప్తినలరుధరిత్రిన్॥ ఉ.౫.

టిప్పణము.

సుగ్రీవాంగదశోభి = మంచికంఠముచేతను—అంగద=బాహుపురియను నాభరణము చేతను—శోభి = ప్రకాశించునది—సుగ్రీవుఁడు—అంగదుఁడు—అనుకపిశ్రేష్ఠులచేత ప్రకాశించునది—

సీ॥ (1) భాస్వదలంకారభాసమానాంగక శ్వేతరోచిఃస్ఫురత్స్మితయుతాస్య।
(2) సురుచిరలోహితాధరవికాసవిశేషవరసౌమ్యదర్శనావయవవిభవ।
(3) కోమలోన్నతవృత్తగురునితంబాభోగఘనసితహారసంకలితవక్ష।
(4) సంతతాతనుశనైశ్చరపాదవిభ్రమసమధికవికచలోచనవిలాస।
గీ॥ (5) లోకమోహనకరచక్రవాకవిజయ । కేతువైభవకనదురోజాతయుగళ।
యైవిచిత్రాభిరూప్యవిఖ్యాతినలరు । నావరారోహ గ్రహమయియగుటయరుదె॥

టిప్పణము.

(1) భాస్వత్ = ప్రకాశించు—సూర్యుఁడు. శ్వేతరోచిః = ధవళకాంతి—చంద్రుఁడు.
(2) లోహిత = ఎఱ్ఱని—అంగారకుఁడు. సౌమ్య = సుందరమైన—బుధుఁడు.
(3) గురు = గొప్ప—బృహస్పతి. సిత = తెల్లని—శుక్రుఁడు.
(4) శనైశ్చర = మంచిగమనముగల—శని. వికచ = వికసించిన—రాహువు.
(5) కేతు = ధ్వజము—కేతువు. గ్రహమయి = నవగ్రహరూపిణి.

---

చ॥ అతులపరాక్రమక్రమవిహారుఁడుమారునిజైత్రయాత్రను।
ధృతమయి క్రాలునాజయపతాకయొతన్మహనీయశౌర్యసం।
గతరణరంగభూమియొతగందదమోఘవిమోహకృన్మహా।
స్త్రతవరమంత్రశక్తియొయనంగమలాననయొప్పునెప్పుడున్॥ ఉ.౭.

క॥ వనితామణిమణియనుసం । జనితోద్యమమన్మథేంద్రజాలకధృతభూ।
జనవిజయదృగ్విసర్పం । ధనదివ్యౌషధమొనాగఁదనరుధరిత్రిన్॥ ౬౮.

సీ॥ వరసూత్న్రరుచిరయౌవనరసాయనసిద్ధి కాంతశృంగారసంకల్పవృత్తి।
చారుసౌందర్యవిహారనిష్కుటసీమలలితసౌభాగ్యవిలాసభూమి।
సమధికలావణ్యసంకేతరంగమస్తోకసౌద్గుణ్యరత్నాకరంబు।
ఘనపితామహజగజ్జనవిలోభనసృష్టిచిత్తకౌతుకనిధానోత్తమంబు।
గీ॥ సారత్రైలోక్యరంగసంసారభిత్తి । చిత్రలేఖావిశేషంబుచెలువచెలువు।
గాననాచానవర్ణింపఁగాఁగవీంద్ర । కోటులకునైనవాచామగోచరంబు॥ ౬౯.

టిప్పణము.

---

నిష్కుటసీమ = గృహారామవీధి. విలోభన = ఆశగొలుపు.

---

మ॥ కలనేత్రాదృశరూపయౌవనగుణాకల్పాంగిఁదన్వంగిరా।
జలలాముండటుగాంచితత్కుచతటీసంసక్తచిత్తాబ్జని।
స్తులితానూనమనోనురాగజనితానూయాతిరేకంబునం।
బలెనిద్రాస్థిరసౌఖ్యమున్వదలివిభ్రాంతాత్ముఁడైయొంతయున్॥ ౭౦.

సీ॥ రాజబింబముబింబరాజంబునుహసించుసన్ముఖాధరవికాసంబుతోడ।
మృగమదంబునుమదమృగమును నిరసించుసౌరభాలోకనోత్సవముతోడ।
ఘనసారమునుసారఘనమునునగుదంతకాంతికచప్రభాగరిమతోడ।
గంధనాగము నాగగంధమువిదళించుగమనరోమాళివిభ్రమముతోడ।
గీ॥ గోత్రచక్రచక్రగోత్రాహితస్ఫూర్తిఁ । గనునితంబకుచయుగములతోడ।
లలితనవ్యదివ్యలావణ్యరుచితోడ । నబలప్రోలనిలచినట్లుదోఁప॥ ౭౧.

టిప్పణము.

---

రాజబింబము = చంద్రమండలము. బింబరాజము = శ్రేష్ఠమగు దొండపండు. మృగమదము = కస్తూరి. మదమృగము=మదించినలేడి. ఘనసారము = పచ్చకర్పూరము. సారఘనము = నీలమేఘము. గంధనాగము = మదగజము. నాగగంధము = సర్పముయొక్క గర్వము. గోత్రచక్రము = పర్వతసమూహము. చక్రగోత్రము = చక్రవాకపక్షులవంశము.

---

సీ॥ కలికినీముఖకంఠములకాంతి ధగధగల్ రుచిరాబ్జరుచిరాబ్జరుచులనణఁచు।
లలననీగురుకుచాలకభార వకచకల్ సారంగసారంగసారమణఁచు।
గమణినీదృక్ప్రదాసమదీప్తి మిసమిసల్ రాజీవరాజీవరాజినణఁచు।
తరుణినీవరకరాధరరుచి నిగనిగల్ లలిప్రవాళప్రవాళములనణఁచు।
గీ॥ చెలువనీదంతనఖదళంధళలుధరణిఁ। దవిలి తారాళితారాళిదర్పమణఁచు।
మగువనీ వేణినాభులజగజగలుని। జము నిజంబుగ నాగనాగములణఁచు॥ ౭౨.

టిప్పణము.

అబ్జము = చంద్రుఁడు—కమలము. సారంగము = చక్రవాకము—శృంగము. రాజీవము = మత్స్యము—కమలము. ప్రవాళము = చిగురు—పగడము. తారాళి = ముత్యములు—నక్షత్రములు. నాగము = పాము—సురపొన్న పుష్పము.

ఉ॥ నీమహితాభిరూప్యమును నీనవయౌవనకోమలత్వముఁ।
నీమృదుసౌకుమార్యమును నీమహనీయకళావిలాసముఁ।
నీమధురోక్తినైపుణియు నీరుచిరాభినవానుభావముఁ।
సామదినాటె మారుఁడును నాటె సుమాస్త్రము హుఃపరంపరల్॥ ౭౩.

సీ॥ నిత్యంబులోచనోన్నత్యంబు ననమునఁగమలజాతస్తుతిగరిమఁ బెనుప।
ననిశంబు ముఖమంజులాభిరూప్యంబాత్మ సంపూర్ణఘనవిధుస్మరణమనుప।
నిరతంబుఁగుచవినిర్భరపాటవము మదివరగిరీశానుభావంబుఁజొనుప।
సతతంబునధరసౌష్ఠవము హృత్స్ఫుటమునరహిసువర్ణజపానురక్తినునుప।
గ బరినారదభావసంకలనననుప। మధురవాక్తతి శుకమహామహిమవినుప।
గమనములసద్వహంసవిభ్రమమునుఁబనుపఁ। దరుణిశీలిలమత్పుణ్యధరణితలఁపు॥ ౭౪.

టిప్పణము.

కమలజాత = బ్రహ్మ—కమలసమూహము. విధు = విష్ణువు—చంద్రుఁడు—గిరీశ = ఈశ్వరుఁడు—పర్వతశ్రేష్ఠము. సువర్ణజపానురక్తి = మంచిస్తోత్రముల చింతనాసక్తి—మంచి రంగుగల యెఱ్ఱదాసానిపువ్వు. నారద = నారదుఁడు—
చిలుక. హంస = యతి—రాజహంస. పుణ్యధరణి = వ

సీ॥ తుంగాగ్రహర్మ్యాంతరంగాత్తసురతప్రసంగాంగసంశ్లేషసంభ్రమముల।
లీలాగృహోవేలడోలాసమాలోలవేళానుకూలానులాలనముల।
వామాసమారామసీమావిహారాభిరామావిరామనర్మక్రమముల।
నానానునయవాగ్విధానానతమనోనవీనానురాగాతివిభ్రమముల।
గీ॥ చంద్రికాద్యూతకేళికాచంక్రమముల । శారికాకీరవచనశిక్షావిధముల।
భావగుంభితపరిహాసభాషణముల । నేలుమిఁకజాల నేతాళిఁజాలననుచు॥ ౨౫.

---

సీ॥ వామాభిరూప్యలావణ్యామృతముగ్రోలుకరణివిస్తృతనేత్రకమలుఁడగుచు।
శ్యామాతనూలతాసంశ్లేషమొనరించుకరణినుద్ధృతబాహుకాండుఁడగుచు।
భామాసమాహ్వానభాషణంబులువల్కుకరణినాగచ్ఛమాగచ్ఛయనుచు।
రామావియోగవిభ్రమవిస్మృతుండగుకరణినిశ్చలదేహకలితుఁడగుచు।
గీ॥ పరివృహ్యాతాఖిలమోదసంభరితఖేద । చిత్తదత్తకవాటనిషిద్ధసకల।
పరిజనుండయియూనాఁటిపగలుగడపె । బహువిచిత్రప్రచారముల్బయలువడఁగ॥ ౨౬.

క॥ కలమఱలఁగలికిఁగనుఁగొనఁ । గలననుసదియాసరాత్రిఁగడపియుదంచ।
త్కలరవశుకపికముఖఖగ । కలరవముల మేలుకనినఁగాంచిరినీతిన్॥

టిప్పణము.

అడియాస = వట్టికోరికె. కలరవ = పావురము—అవ్యక్తధ్వని.

---

క॥ మకరందుఁడుమధురవచో । మకరందుండనఁగనొప్పుమహీపునిసఖుఁడ।
త్యలంకతనతనిమనో । వికలత్వముమాన్ప నెడము వేచివెరవునన్॥ ౨౮.

ఉ॥ ఆపృథివీశుఁగాంచివినయంబునయంబుప్రియంబుమీఱనా।
లాపవశంబునంహృదయలగ్నవినిర్భరతద్వియోగచిం।
తాపరతంత్రతాయతియుఁదజ్జనకంబగుస్వప్నదృష్టిక।
న్యాపరమాభిరూప్యవిభవాతిశయంబు నెఱింగియిట్లనున్॥ ౨౯.

క॥ దీనికినై సంతాపము । బూనుటతగవగు నెయిట్లుభూపాలనము।
న్మానుటఁగనివగచెభవ । న్మానితబుధమిత్రమంత్రిమండలమెల్లన్॥ ౩౦.

సీ॥ రాకాసుధాకరాలోకనామోదప్రవర్థితాయతదుగ్ధవార్ధిచయమఁగ।
మండితమార్తాండమండలోదయవిభాస్తోకహర్షితకోకలోకమఁగ।
ఘనఘనాఘనసమాగమభావితానందసారపూరమయూరవారమఁగ।
సంతతవాసంతసమయసమ్ముదితవాచాలలాలితపికజాలమఁగ।
గీ॥ నిరుపమానమహారత్నపురవరాభి । రామమహనీయతరయావరాజ్యవిభవ।
మహితునినుగనియలరుచుమనుప్రజాళి । యధిపనీవిట్టులుండినవడలకున్నె॥ ౨౧.
శా॥ అంభోరాశిగభీరరాజ్యరమసత్యంబౌరనీవోఁపరీ।
రంభంబుంగననారికూర్మపటిమారామాసమాశ్లేషసం।
రంభోరస్థలుఁడయ్యెశేషుఁడునురారాజద్వ్యధూగానవి।
స్రంభోదారవిహారుఁడయ్యెఁజిరభారశ్రాంతివోఁగాంచుచున్॥ ౨౨.
ఉ॥ నిత్యకళప్రతాపములునీవువహించిధరన్భరింపఁగా।
సత్యమునత్యముర్వఁగలసర్వతమంబులడంగెదృష్టిసా।
హిత్యఖిలద్విజావనసమృద్ధిజెలంగెఁదొలంగెరాజహం।
సాత్యధికప్రభావమునుమహాద్భుతమంచుజనుల్నుతింపఁగన్॥ ౩.

టిప్పణము.

---

నిత్య = ఎడతెగని. ప్రతాపము = శౌర్యము—వేడిమి. తమము = పాపము—చీఁకటి. దృష్టి = చూపు—జ్ఞానము. సాహితి=పాండిత్యము. ద్విజ=బ్రాహ్మణులు—పక్షులు. రాజ = చంద్రుఁడు—రాజు. హంస = సూర్యుఁడు—శ్రేష్ఠుఁడు.

తా॥ చంద్రునకు రాత్రియందును, సూర్యునకు పగటియందునుమాత్రమె కళాప్రతాపములు గలిగియుండుటచే నవి యెడతెగనివి కావనియు, నొకచోట వెలుతురు గలిగియుండఁగా మఱియొకచోట చీఁకటి గలిగియుండును గాన సమస్తతమమును నేకకాలమునఁ బోఁగొట్టు సామర్థ్యము చంద్రసూర్యులకు లేదనియు, చకోరచక్రవాకములకు రాత్రిపగళ్లయందు దృష్టిపాటవము లేకయుండుననియు, చంద్రసూర్యులు చకోరచక్రవాకములనుమాత్రమె రక్షించువారు గాన వారికి సమస్తద్విజములనఁగాఁ బక్షులరక్షణాశక్తి చాలదనియును, రాజా నిత్యకళాప్రతాపములు గలవాఁడై సర్వతమములననఁగా పాపములనుఁ బోఁగొట్టఁజాలి, సమస్తద్విజావనదక్షుఁడుగా నుండుటచేఁ జంద్రసూర్యులకన్నను శ్రేష్ఠుఁడను నర్థము స్ఫురించుచున్నది.

---

ఉ॥ ఎందుభవద్గుణాభినుతియెందుభవన్మహిమానువర్ణనం।
బెందుభవత్ప్రపాలితమహీజనహర్షసమాహితోక్తియెం।
డెందుభవన్మహోజయసమిద్ధవిచిత్రకథాప్రసంగమా।
నందమొనర్చుధారుణిఘనంబగుఁదత్సుఖసూచకస్థితిన్॥ ౨౪.

క॥ తావకరాజ్యవిరామద । శావశతననాథగతిరసాతలమతిదుః।
ఖావిలమగురిపుచోరఖ । లావళినానాభయావహస్థితిఁగనుటన్॥ ౨౫.

క॥ దుష్టులదుర్గుణములవి । స్పష్టంబుగఁదెలిసిపలుకఁస్రష్టకునుఁగడున్।
గష్టమనువారసుఘధ । భ్రష్టదశాపాదిపాపభాజనులగుటన్॥ ౨౬.

సీ॥ అత్యంతహైన్యసమాక్రాంతఘనపాపమూర్తులుఖలచక్రవర్తులరయ।
నతిశయసుజనరంధ్రాన్వేషణేచ్ఛాప్రపూర్తులుఖలచక్రవర్తులరయ।
అతివేలపరదూషణార్జితనీచాపకీర్తులుఖలచక్రవర్తులరయ।
అతిమాత్రమిత్రసౌఖ్యాపహానాశయస్ఫూర్తులుఖలచక్రవర్తులరయ।
గీ॥ అతిసముచితానుచితహితాహితవివేచ । నావిహీనావినీతనానావిధప్ర।
వర్తులెంతయుఖలచక్రవర్తులరయ । వారికెడమిచ్చఁదగునెయెవ్వారికైన॥ ౨౭.

## టిప్పణము.

---

ఖలచక్రవర్తులు = ఖలుఁడనఁగా దుష్టుఁడు. దుష్టులకు – చక్రవర్తులను. బహు వచనరూపమగు శ్రేష్ఠవాచకమును చేర్చుటచే స్తుతిరూపమగు నిందగానుండును.

చక్రమనగా మోసముగానఁ జక్రవర్తియనఁగా మోసపు నడవడిగలవాఁడు. ఖలచక్రవర్తియనఁగా మోసఁగాఁడగు ఖలుఁడు

వివేచన = యుక్తాయుక్త పరిజ్ఞానము. ఎడము = ఆస్పదము.

---

చ॥ అతికటుకస్వభావుఁడయియాతఁడుసూపుమహోరసంబుసం।
తతమునుభీముఁడయ్యునుసదానబకాహితలీలఁజూపునా।
తతముగనాశ్రయాశుఁడయియాతఁడుసూపునుమాతరిశ్వతా।
యతిసతతంబుదుష్టజనుఁడాతనిసామ్యమగమ్యమేరికిన్॥ ౨౨.

క॥ అవధూతమయ్యెఁబాయక । తవిలిశిరస్థ్సలిఁగషాయితంబొనరింపన్ ।
దిపురుపటుపాదరజమర । భువిఖిలభావంబుగలుషభూయిష్ఠముగన్ ॥ ౯౧.

టిప్పణము.

అవధూతము = ఎగరఁగొట్టఁబడినది. కషాయితము = కలుషితము = ధూళిచెనెఱ్ఱగా నొనర్పఁబడినది.

---

క॥ సత్యమువిషతరుసుమసాం । గత్యముగతిదుర్జనానుగతిసుజనులకున్ ।
నిత్యమునుదద్విమోహము । సత్యధికమొనర్చుననుభవానుగుణముగన్ ॥ ౯౨.

టిప్పణము.

విషతరు = అతివసనానుచెట్టు. అనుగతి = అనుసరణ. స్నేహము=సహవాసము. తద్విమోహము = దానియందాసక్తి. అనుభవానుగుణముగన్ = (వాడుకచేసిన క్రైల్లా)

---

క॥ బహుమత్సరప్రచారము । బహుసుమనస్తాపకృత్ప్రభావమునుఁగడున్ ।
మహిఁగలిగిబలునిహృదయము । బహుళీయముగినిదాఘదివనిభంబయి వెలయున్ ॥ ౯౩.

టిప్పణము

మత్సరప్రచారము=చేపలసంచారము. "మత్సరోన్యశుభద్వేషే దంశభేదేచనాత్వయం" అని క్రూరత్వప్రచారము. సుమనస్తాపము = పుష్పములకు తాపము. పండితులకు తాపము. నిదాఘము = ఎండకాలము. నిభము = సమానము.

---

క॥ ధరణింజక్రధరుండనఁ । బరఁగివిరూపాక్షుఁడనఁగఁబ్రబలిఖిలజనుం ।
దరయుఁబరమాద్భుతంబుగ । హరిహరులహాసింపఁదానహర్నిశముఁగడున్ ॥ ౯౪.

టిప్పణము.

చక్రధరుఁడు = రథాంగధారి=విష్ణువు. మాయాధరుఁడు = మోసగాఁడు. "చక్రం ధాంగేసేనాయాం ధర్మవ్యస్త్రాంతర ఇతి కోశః" విరూపాక్షుఁడు = త్రినేత్రుఁడు. శివుఁడు = దోషదృష్టిగలవాఁడు.

(3) పరిపరిమండలభ్రమణసంకలితాతతాత్మఘోషణసముద్యమముకలన।
(4) బహుళతమోనిబిడవిభావరీభావితకటపలాశాభ్రాంతిగరిమకలన।
గీ॥ (5) ప్రకటసురభియానవికలభావంబునఁ।
(6) దనరుబంధుతాపదర్శనమునఁ।
(7) గుజనరంధ్రకారకుంజరకాకగో।
మాయువృషభశవసమానుఁడెపుడు॥ నా.

## టిప్పణము.

---

(1) దోషానుబంధము = రాత్రిసంబంధము—పాపసంబంధము.

విశ్వకర్మావలోపనము = సమస్తక్రియలలోపము—రాత్రియందే పనులు జరగవనుట. దుష్టుఁడగుటచే గర్మహీనుఁడుగా నుండుననుట.

(2) స్వవశాతిలోలప్రచారము. = స్వకీయములగు నాడ యేనుఁగులయందలి యాశచే సంచరించుట—స్వాయత్తమైన చంచలమగునడువడి.

~~అధరీకృతదానరీతి~~ = కారుచున్న మదోదకరీతి. తిరస్కరించఁబడిన త్యాగరీతి. లోభియనుట.

(3) మండలభ్రమణము = చుట్టుకొని తిరుగుట—పదేపదే వచ్చుచుండుట.

ఆత్మఘోషణము = తనపేరును తానేకూయుట కాకి తనపేరును కాకా అని కూయుట ప్రసిద్ధము —ఆత్మస్తుతి.

(4) బహుళతమో నిబిడవిభావరీభావితము = బహు గాఢాంధకారముచే నిబిడమగు రాత్రియందు పొందబడినది—బహు పాప భూయిష్ఠములగు పరనిందలచే నార్జింపబడినది తమః=చీఁకటి—పాపము. విభావరీ = రాత్రి—విభా = బుద్ధి—అవరీ = అపక్షేపణ = పరుల బుద్ధులను అపక్షేపించుట.

కటపలాశాభ్రాంతి = కటశవముయొక్క - పల = మాంసమందలి—ఆశా = అపేక్షచేత—భ్రాంతి = తిరగడము.—

“గజగండేశపరథేశలేచకటఉచ్యత” అని. కటపల= లంచమందలి-ఆశాభ్రాంతి= ఆశావికారము.

(5) సురభి = గోవుయొక్క—యాన = ప్రాప్తిచేత—వికల = విశేషము మదించిన—లేక - వికలమైన—భావము

సురభి = పండితులయొక్క—యాన - ప్రాప్తిచేత—వికల = అన్యస్తమైన—భావము.

(6) బంధు = బంధుజనులకు—తాప = వ్యసనమును—పర్శనము = దూపుట—కలుగఁ జేయుట.

బంధుతా = బంధుజనసమూహమునకు—అపదర్శనము=అగుపడక తప్పించుకొనుట.

---

క॥ పొంకమును బింకమునుని । శ్శంకమును నబీజకాండసంభవము నిరా।
తంకమునను ఖిలదుర్వ్యసనాం । కురముదనర్చున సదృశాభేద్యముగన్॥ ౯౯.

టిప్పణము.

---

అబీజకాండ సంభవము = విత్తులేకనే పుట్టినది—మొదలులేనిది = నిష్కారణమైనదనుట.

---

మ॥ ధరణిం దోషలవంబు కాపురుషచిత్తంబొంది పెంపొందుస।
త్పురుషస్వాంతముఁ జేరదయ్యది లసిందుం దాఁ బ్రమాదంబునన్।
సరగం జేరినఁ జూవారదము నోజం గానభూమీశ యే।
కరణిం జూచిన మేలగున్ సుజనసాంగత్యంబు తథ్యంబుగన్॥ ౧౦౦.

చ॥ సమతవినోదవిందులకు సాధువులాం మృగపాళి నాసదా।
శ్రమగులు గా రె భూరమణ సాధుజనోచితమార్గమూనిని।
త్యము నఖిలప్రపంచపరిహాసవచోయతిఁ బారిఁ బాలికా।
గమవిహితప్రవర్తనలుఁ గాంచి మెలంగుము లెమ్ము లెమ్మికన్ ౧౦౧.

టిప్పణము.

---

వీనాం పక్షిణాం - మోదం - ప్రేరణం - వేత్తీతి - వినోదవిందుః = వినోదవిందులనగా వేటకాండ్రు—వినోదం = శాస్త్రమును—విందుః—తెలిసినవారు = పండితులు.

సదాశ్రమగులు=సర్వదాశ్రమచేఁ బొందతగినవారు—సదా=సర్వదా—అశ్రమగులు= సులభగమ్యులు.

---

శా॥ ధీచాతుర్యవచోవిలాసవిలసద్దివ్యప్రభావాధిక।
ప్రాచుర్యప్రతిభాప్రతాపరణశుంభద్విక్రమోపాయస।

త్యాచారంబులుగల్గిరమ్యగుణసాంద్రారాజరాజేంద్రనీ।
వా చంద్రార్కము గాఁగ నేలుము సమస్తాశావకాశావనిన్॥ ౧౧౨.

క॥ దుష్టులునిర్భయులైరు । శ్రేష్టులుమీఱన్ విశిష్టశిష్టజనులకుం।
గష్టదశఁగూర్చిరధికా । నిష్టోత్పాదనరసోత్తరేచ్ఛానుగతిన్॥ ౧౧౩.

---

చ॥ అనిసచివుండు దెల్పహృదయంబుననించుకధైర్యమూదియా।
ఘనుఁడిపుడేమి సేయుదు సఖా వివరింపుము రమ్మటంచు తే।
చినఁగనిసంతసించివనసీమకుఁబోయినఁదాపశాంతియా।
మనమునకంచునల్పశతమాత్రముదోకొనిపోయియుండటన్॥ ౧౧౪.

## టిప్పణము.

---

నల్వము = నన్నూఱుమూరల ప్రమాణముగల త్రోవ. (నల్వః కష్కుచతుశ్శతం)

---

॥ ఆరాజకుమారునకు, (1) నగస్త్యవచనసంభృతబ్రహ్మాండఖండగతశిఖాసహస్రుండును, (2) కందరాంతరలతాగృహప్రసుప్త విద్యాధరమిథున గీతాకర్ణన సుఖితచమరీ గణ మార్గణోత్సుక శబరకులాకుల కచ్ఛతటుండును, (3) కటకగతకరిక రాకృష్ట భగ్న హరించనస్యందమాన రసామోద గంధవాహిగంధవాహశిశిరితశిలాతలుండును, (4) సుకుమారపతన భగ్నతాలఫల రసార్ద్రీకరితలాస్వాదనోత్సుక శాఖామృగకదంబకుండును, (5) ప్రలంబమాన నికటనిర్ఝరోపాంతరసాలసాలశాఖానివిష్టకీర మిథునలిహ్యమాన మధుర పరిపక్వఫలరస వాసనావాసితపరిసరుండును, (6) శిఖావలగ్నతారాగణ భ్రమాపాది సరభసకేసరిసహస్రఖరనఖరధారావిదారిత మత్తమాతంగకుంభస్థల విగళిత స్థూలముక్తాఫలశబలిత శిఖరని కరుండును, (7) పిండాలక్తకరక్త పదపఙ్క్తి సూచిత సంచారసురవారవారవిలాసినీ సంకేత కేతకీమంటప మండితుండును, (8) హరివంశంబు కరణిఁ బుష్కరాక్ష ప్రాదుర్భావరమణీయుండును, (9) కర్ణునికరణి ననుభూతశతకోటి దానుండును, (10) సాధుజనునికరణి సానుగ్రహ ప్రచారప్రకటిత మహిమావిశేషుండును, (11) మీమాంసా న్యాయంబు కరణి పిహిత దిగంబర దర్శనుండును, (12) నలకూబర చిత్తవృత్తి కరణి సంతతాదృతరంభాసంరంభుండును, (13) నీచదేశనది కరణి న్యగ్రోధోపచితుండును, (14) మత్తమాతంగంబుకరణి ఘుంటార వావేదిత మార్గుండును, (15) సదీశ్వరసేవకరణి దూరోద్గత బహుఫలుండును, (16)

విరాటలక్ష్మీకరణి నానందిత కీచకశతాన్వితుండును, నగు వింధ్యనగేంద్రుంజూపి తత్పరి సరంబునం బ్రవహించు, (17) సమదకలహంస సారసరసితో ద్భ్రాంతోత్కట వికట కుంజకచ్ఛ వ్యాఘాత కమలషండగళిత మకరందబిందుసందోహ సురభిత సలిలయు, (18) తీరప్రరూఢ కేతకీ కానన పతిత ధూళీనికురుంబసంజాతసైకతసుఖోపవిష్టతరుణ సురమిధున నిధువన లీలామ్లాన సురతరుకుసుమవిసర పరిమళ సాక్షికూలోపవననివహ యు, (19) తటావస్థిత వికసితాంభోజషండమంటపాంతర సుఖిత జలదేవతా విగా హ్యమాన బహుళ ప్రమోదసముదాయయు, (20) తీరప్రరూఢ వేతసవనాభ్యంతర నిలీ నదాత్యూహ మదోత్కటకేళి కుహూకుహూరావకౌతుకా కృష్టసురమిధున సంస్తూయ మానోపభోగయు, (21) సుపకూలసంజాత నళిన పుంజకుంజ పుంజితకుక్కుట ఘుటాఘూ త్కార భైరవయు, (22) అతప సేవాసముత్సుక జలమానుషీ మృదితసుకుమార తర పులినయు, (23) సుపవనపవనాందోళిత తరళతరంగయు, (24) నళినీనికుంజపుంజని విష్టదుష్ట బకోటక కుటుంబినీ నిరీక్ష్యమాణవృద్ధశఫరయు, (25) తరంగమాలా సంత రదుద్దండవాల దర్పవధావదతి చపల రాజిలరాజిరాజితయు (26) ఖంజరీట మిధున నిధువన దర్శనోప జాతనిధి గ్రహణకౌతుక కిరాతక ఖన్యమాన తీరయు, వైమతీ యును, (27) దినారంభ లక్ష్మీకరణిఁ బ్రవర్ధమాన వేలయు, (28) భారత సమరభూమి వలె నృత్యత్కబంధయు, (29) ప్రావృట్కాలంబు గతి విజృంభ మాణశతపత్ర పిహిత విషధరయు (30) క్రుద్ధయువతీ విధంబున దర్శిత ముఖభంగయు, నగు రేవానదీ జలంబులం దాహంబుఁ దీర్చి, యొక్క శీతల తమాల తరుచ్ఛాయనవ్వసియింపఁ జేసి మధుర పరిపక్వ ఫలంబులు ముందటంబెట్టి ప్రస్తావ వశంబున మనస్తాపోప శాంతి సేయువాఁడై, యావింధ్య ధరాధరేంద్రుంగూర్చి మంత్రికుమారుం డిట్లనియె॥ గం౫౪.

టిప్పణము.

---

(1) సంప్లావిత = పోఁగొట్టఁబడిన.

(2) కందర = గుహ—శబర = బట్టల కుమాఱుగా నాకులు గట్టుకొను నాటవికులు = పుళిందులు. కచ్ఛతటి = సానుప్రదేశము—కచ్ఛస్తు పార్శ్వగుహ్యేచ - అని కోశము.

(3) కటక = నితంబము—స్యందమాన = కారుచున్న. గంధ = లేశము—గంధోగంధక సంబంధామోదలేశ స్మయేషుచ-అని నానార్థరత్నమాల—శిశిరత = చల్లగాఁ జేయబడిన.

(4( సుదూర = బహుదూరమునుంచి = ఎత్తునుంచి-ఆస్వాదన = రుచిచూచుట—కదం

(5) ప్రలంబమాన=వ్రేలుచున్న—నివిష్ట=కూర్చున్న—లిహ్యమాన = నాకఁబడుచున్న—వాసిత = సురభిత.

(6) శిఖా = కొన—అవలగ్న = తగులుకొన్న—ఖర = తీక్ష్ణములగు—నఖర = గోళ్లు, శబలిత = నానావర్ణములుగలదిగాఁ జేయఁబడిన—చిత్రకిమ్మీరకల్మాషశబలైతాశ్చకర్బురే—అని అమరము.

(7) పిండాలక్తక = యావకపంకము—యావోలక్తశ్చిరారాయాస్సపిండాలక్తక స్మృతః—అని కోశము.

(8) హరివంశ = హరివంశమను గ్రంథము—పుష్కరాక్ష = వాసుదేవునియొక్క—ప్రాదుర్భావ = అవతారముచేత—రమణీయము = మనోజ్ఞము—పక్షమున—పుష్కరాక్ష=పద్మబీజములయొక్క—ప్రాదుర్భావ = ఉదయము—

(9) అనుభూత = అనుభవింపఁబడిన—శతకోటి—వజ్రాయుధముయొక్క = దానుఁడు=దెబ్బగలవాఁడు—శతకోటి = అనేకకోటి ద్రవ్యముయొక్క—దానము = త్యాగము.

(10) సానుగ్రహ = దయాయుక్తమైన—ప్రచార = నడవడి—సాను = సానుప్రదేశములయందు గ్రహ = సూర్యాదిగ్రహములయొక్క—ప్రచార = సంచారము.

(11) పిహిత = న్యక్కృతమగు = తిరస్కృతమైన—దిగంబరదర్శనుఁడు=జైనసిద్ధాంతముగలవాఁడు—దర్శనమనగా శాస్త్రము—వేదాంత—సాంఖ్యవైశేషిక—న్యాయ—పూర్వమీమాంస—ఉత్తరమీమాంస—యీయాఱును దర్శనములనఁబడును.
పిహిత = ఆచ్ఛాదితములగు—దిగంబర దర్శనుఁడు=దిక్కులయొక్కను—ఆకాశముయొక్కను దర్శనముగలవాఁడు—

(12) ఆదృత = ఆదరింపబడిన—రంభా = అరటిచెట్లు—రంభా = రంభయను నప్సరస,

(13) న్యగ్రోధ = కూలిన తీరముగల—న్యక్—లేని—రోధ = కూలము.
న్యగ్రోధ = మఱ్ఱిచెట్టు—ఉపచితి = ఆధిక్యము.

(14) ఘంటారవ = ఘంటానాదము—ఆవేదిత = తెలుపఁబడిన.
ఘంటారవ = గిలకచెట్టు.

(15) దూరోద్గత = ఉచ్ఛ్రితమైన—బహుఫలి = ఒక కానొకవృక్ష విశేషము—బహుఫల = అనేకఫలములు.

(16) కీచక = టొల్లువెదురు—కీచకోపకీచకులను సూర్గురు.

(17) సారస = బెగ్గురుపక్షి—రసిత = కూజితము ఉత్కట = మత్స్యవిశేషము—కుంబకచ్ఛ = వాల పార్శ్వము.

(18) ప్రరూఢ = ప్రసిద్ధమగు—నిధువన = సురతము ఆమ్లాన = వాడిన—పరిమళసాక్షి = వాసనకు సాక్షిభూతమగు—కూల = గట్టు.

(19) అవట = గర్తము—షండ = సమూహము—విగాహ్యమాన = స్నానముచేయుచున్న హ్రద = మడుగు—

(20) వేతస = ప్రబ్బలి చెట్టు—దాత్యూహ = భరతపక్షి—ఉత్కట = అధికమైన—ఆకృష్ట = ఆకర్షింపఁబడిన—ఉపభోగ—మాహాత్మ్యము.

(21) ఘటా = సమూహము—భైరవ = భయంకర.

(22) ఆతపసేవ = యెండ కాచుకొనుట—జలమానుషీ = నీటిపాపలు—మృదిత = మెత్తఁగాఁ జేయఁబడిన—సుకుమార = కోమలమైన = ఇసుకదిబ్బ—

(23) ఆందోళిత = ఊచబడిన—తరళ = చలించు

(24) బకోటక = వాలుకొంగ—కుటుంబినీ—భార్య—శఫర = మత్స్యము.

(25) సంతరత్ = అంతటాకదలుచున్న—ధావత్ = పరుగెత్తుచున్న—రాజిల = మత్స్య విశేషము.

(26) ఖంజరీట = కాయకపిట్ట—నిధువన=సురతము—విధిగ్రహణ = శకునపరీక్ష—కాటుకపిట్టలుకలసినచోట ద్రవ్యముదొరకునని ప్రసిద్ధము—కిరాత = శబరులు—ఖన్యమాన—త్రొవ్వఁబడుచున్న.

(27) వేల = కాలము—తీరము.

(28) [illegible] మొండెము—ఉదకము.

(29) శతపత్ర = నెమలి—కమలము—విషధర = మేఘము—పాము.

శతపత్రౌ రాజకరే దార్వాఘాటె బిఖావళే = అని నానార్థరత్నమాల.

(30) ముఖభంగ = ముఖతరంగము—ముఖ వికారము. రేవానది = నర్మదానది. తమాల= కానుగచెట్టు.

---

సీ॥ (1) సలలితశారదామలహాసరుచిజనితామోదమునఁజతురాస్యుఁడితఁడు।

(2) మానితపద్మాభిమండితవనమాలి కావిఖ్యాయతి వాసుదేవుఁడితఁడు।

(3) ప్రకటీశివావినాయక సమాహితగుహాస్తోకవిభూతి పినాకియితఁడు।

(4) మంజులచ్ఛాయాసమంచితసప్తపత్రస్యందనాప్తిమార్తాండుఁడితఁడు।

గీ॥ (5) స్ఫూర్జదతులమల్లికార్జునవైఖరి । శ్రీగిరిప్రభావిశేషియితఁడు।

(6) కలితబహులతాతిగహనత్వమునసదా । నల్పకృష్ణపక్షకల్పుఁడితఁడు। గాంక

# టిప్పణము.

---

(1) శారదా = సరస్వతి—బూరుగుమాను-చందనలత—

2. "కాలానుసారీబస్తాంద్రీ చందనోత్పల శారిబా ప్రతానికాశారదాచ కాష్ఠకోష్ఠాచ శారిబా" అనియును అభిధాన రత్నమాల.

1. శాల్మలీ కుక్కుటామోచాకర్కశా రక్తపుష్పకాశారదా పుష్పరమ్యాత్వకూపూరణీకంటకీచసా = అనియు—

అమల = స్వచ్ఛమైన—అశ్వత్థవృక్షము.

"పవిత్రః పిప్పలోబోధివృక్షోశ్వత్థోగజాశనః దీర్ఘాయుశ్చామలశ్చైత్ర పాదోచంచలపత్రకః" అని-అభిదానరత్నమాల.

హాస = నవ్వు—గన్నేరుచెట్టు—

కరవీరోహాసవీరాదీర్ఘపత్రోవిషద్రుమః అభిదానరత్నమాల.

రుచి = కాంతి, దవనము—

"రుచిర్దమన కోదంతవినీతః పాండురోగకః" అభిధానరత్నమాల—

ఆమోద = సంతోషము—వాసన.

"సౌగంధ్యహర్షావామోదౌ" అని నానార్థరత్నమాల—

చతురాస్యుఁడు = బ్రహ్మ—

(2) పద్మాభిమండితము = పద్మా = లక్ష్మీదేవిచేత—మండితము = అలంకరింపఁబడినది పద్మ = కములములచేత—అభిమండితము అలంకరిపఁబడినది—

వనమాలికా = పుష్పమాల—వనపఙ్క్తి.

(3) శివా = నక్క—పార్వతి.

"శివాభవేదామల కీభవానీహారీత కీసక్తుపలా సృగాలః॥ నానార్థరత్నమాల.

వినాయక = పక్షిశ్రేష్ఠము—విఘ్నేశ్వరుఁడు.

వి "అనగాపక్షీ = విశ్చిత్తుపివ్యోమ్ని వాతే పరమాత్మని పక్షిణః" నానార్థరత్నమాల.

గుహా = పర్వతకందరము—కుమారస్వామి.

"సింహాపుచ్ఛీకందరయోర్గుహాస్త్రీషణ్ముఖేతునా" నానార్థరత్నమాల.

పినాకి = ఈశ్వరుఁడు—

(4) ఛాయా = ఛాయాదేవి (సూర్యునిభార్య)—నీడ సప్తసప్త = ఏడుగుఱ్ఱములు—ఏడాకులరటి—లేక—ఏడాకుల పొన్న—

«పత్రపర్ణేవాహానేచ» నానార్థ. «సప్తసప్తే వినాలత్వాచ్ఛారదోవిషమచ్ఛదః» నానా—

«సప్తచ్ఛ యుగ్మపర్ణస్సప్తాం గోగుచ్ఛ పుష్పకః। సుచ్ఛపత్రోబృహత్పత్రో సువర్ణచ్ఛ దనశ్చసః» అభిధానరత్నమాల—

స్యందన = రథము—నెమ్మిచెట్టు—

«స్యందనంస్రవణేతోయేనాతు నేమిద్రుమేరథే» నానార్థరత్నమాల—

(5) మల్లికార్జున = మల్లికార్జున స్వామి. అనగా నీశ్వరుఁడు.

మల్లికా = మల్లెతీగె—అర్జున = మద్దిచెట్టు.

శ్రీగిరి = శ్రీశైలము—

(6) బహుల తాతిగహనత్వము = బహుళ సత్త్వముచే గహనమైనది—అనేక లతల చేతగహనత్వము—

క॥ ఘనశరభకుముదకేసరి । పనసగవయసేవ్యమానపాదచ్ఛాయా।
జనితాతిశయునినీతని । జనవరసుగ్రీవుఁడనుటజనదేజగతిన్॥ ౧౦౭.

టిప్పణము.

శరభ = ఎనిమిది కాళ్లమృగము—శరభుఁడను వానరుఁడు—కుముద సర్పవిశేషము—కుముదుఁడను వానరుఁడు—

«కుముదం కైరవేనాతు దిగ్గజే భుజగేకపౌ» నానా—కేసరి = సింహము—కేసరియను వానరుఁడు—పనస = పనసమాను—పనసుఁడనుకపి—గవయ = మనుబోతు—గవయుఁడనుకపి—

క॥ నరవాహనదత్తునిసెం । దరయంధరదారయునలప్రియంగుశ్యామా।
విధతాభియోగమునసీ । ధరణిధవుండితనిఁబోగడఁదరమేతలఁపన్॥ ౧౦౮.

టిప్పణము.

నరవాహనదత్తుఁడను రాజునకు—ప్రియంగుశ్యామయను వది—పట్టపురాణి.
ప్రియంగు = ప్రేంకణపుచెట్టు.

శ్యామా = నీలిచెట్టు—సుగంధపాలచెట్టు—నల్లతెగడతీగ.
"శ్యామాషోడశవర్షాస్త్రీ త్రివృత్తాశారిబానిశా—నీలీప్రియంగువర్ణేషు పుంస్యయంతద్వి త్రిషు" అని నానార్థరత్నమాల—

---

క॥ బహుధాతువికారస్థితి । సహితుఁడును బ్రవృద్ధగుసల్మంగతుఁడునునై।
మహిపయితడహారంబును । బహురోగియనంగధరణిఁబరగుట దెలియన్॥ ౧౦౯.

టిప్పణము.

---

ధాతు = వాత—పిత్త—శ్లేష్మ—నాడులు.—గైరికాదిధాతువులు—
గుల్మ = జ్వరమువలనఁ గడుపునఁబుట్టుగడ్డ—పొద.

---

గీ॥ మొనసివరశిఖండిముక్తార్థచంద్రాచి । తాంగునితని భీష్ముఁడనుటజనదె।
ధాత్రి నెపుడుఁగలితధాత్రీభృతిస్థితి । నలరునితని బాలుఁడనుటదగదే॥ ౧౧౦.

టిప్పణము.

---

శిఖండి = ద్రుపదపుత్రుఁడు—మయూరము.
అర్ధచంద్ర = అర్ధచంద్రాకారమగుబాణము—నెమలియీకలు—
"అర్ధచంద్రస్తదాకారే బాణే బర్హే శిఖండినః" అని కోశము—
ఆచిత = వ్యాప్తమైన—
ధాత్రి = దాది—నెల్లిచెట్టు.
"ఉపమాతాచ ధాత్రీస్యాద్భూమిరామలకీదసా" అని నానార్థరత్నమాల.
తా॥దాదిచెనత్తఁబడుస్థితి బాలునియందును—నెల్లిచెట్లను భరించియుండుస్థితి వింధ్యాని యందును గలదనుట.

---

ఆ, వె॥ దీపితారుణప్రభాపాటలితపత్త్ర । వనవిరాజమగుచుఁదనరునితఁడు।
భాసమానదివ్యవాసరారంభవి । కాసినాగమిగులవాసిఁగాంచు॥ ౧౧౧.

టిప్పణము.

అరుణ = సూర్యసారథియగు ననూరుఁడు—ఎఱ్ఱని—
పాటలిత = ఎఱ్ఱబారిన.
పత్ర = ఆకులు—

క॥ ఆలోలవికచవనమా । లాలంకృతిఁబంకజాక్షుఁడన నొప్పియునీ।
శైలాధిపుఁడలశంబర । జాలాశ్రయుఁడగు చు వృత్రసామ్యతనలరున్॥ ౧౧౨.

టిప్పణము.

వనమాల = విష్ణువుధరించుమాలిక—వనపంక్తి—శంబర = రాక్షసుఁడు—ఎఱ్ఱని జింక. వృత్ర = వృత్రాసురుఁడు—అంధకారము.

ఆ, వె॥ మల్లనాగఘటితమహితకాంతారసా । మోదగరిమఁగుధరముఖ్యుఁడలరు।
వితతకామసూత్రవిన్యాసభాసినా । మహిపచిత్రమితనిమహీమవోగడ॥ ౧౧౩.

టిప్పణము.

మల్లనాగ = కామసూత్రవిన్యాసమను గ్రంథకర్తయగుఋషి—మదపుటేనుఁగు.
ఘటిత = కల్పింపఁబడిన—
కాంతారసామోదగరిమ = వనసంబంధియగు వాసనా విశేషముతోఁగూడియుండుట—స్త్రీలసంతోషాది రసములవలనఁ గలిగిన సంతోషాధిక్యము—
కామసూత్ర విన్యాసము = ఈ పేరుగల గ్రంథము—కామశాస్త్ర వివరణము—

క॥ గిరిసానుదరీముఖగత । జరదజగరభోగములరుజననాథమరు।
ద్వరకులిశక్షతరంధ్రాం । తరనిర్గతజాఠరాంత్రనాళవిధమునన్॥ ౧౧౪.

టిప్పణము.

దరీ = గుహ—జరత్ = ముదిసిన—అజగర = గొప్పపాము—భోగ - శరీరము—మరుద్వర = దేవేంద్రుఁడు—కులిశ = వజ్రాయుధము—క్షత = గాయము—జాఠర = జఠర సంబంధమైన-అనగా-పొట్టలోని—అంత్రనాళ = పేగు—

క॥ క్షితిధరుఁడునిజగుహాసం । గతబహుదంతాంతరాళగతవివిధకపి।
ప్రతతినలకుంభకర్ణా । ద్భుతసాహసగరిమఁదెలుపఁబూనెడుఁగంటే॥ ౧౧౫.

టిప్పణము.

---

దంత = పల్లు—గొప్పబండ—పర్వతమధ్యప్రదేశము—దంతో ద్రికటకేపుంజేరదనే
పృష్న్నతోపలే—నా నా—

రామాయణయుద్ధమునఁ గుంభకర్ణుఁడు-గవులను మ్రింగినది ప్రసిద్ధము—

---

గీ॥ మీనమకరకటకమిథునసంగతి నాగ । శకునిభద్రబాలవకులయుక్తి।
నీధరాధరేంద్రుఁడెంతయునారాశి । కరణమండలములకరణినలరు॥ ౧౧౬.

టిప్పణము.

---

1 మీనమకరకటకమిథునములను రాసులు—మీనమకర కుళీరములయొక్క మిథున
ములు.

2 నాగశకుని భద్రబాలవములను కరణములు—నాగ = సర్పము—శకుని = పక్షి—
భద్రబాల = ఖంజరీటము—(ఇచటవబలకిభేదము)—వకుళ = వకుళవృక్షము—
కుల = సమూహము.

---

శా॥ కాంతారోషరసానుభూతియువియోగప్రోచ్ఛలన్మన్మథా।
క్రాంతస్వాంతసముజ్జ్వలాకృతియురంగత్పాండుగండప్రభా।
త్యంతస్ఫూర్తియుఁగల్గికామిగతివింధ్యాహార్యమూర్ధన్యుఁడా।
శ్రాంతంబుంగననొప్పెభూరమణయుష్మత్ప్రక్రియంజూచితే। ౧౧౭.

టిప్పణము.

---

కాంతారోషరసానుభూతి = స్త్రీలరోషరసానుభవము—కాంతార—వనముల
యొక్కయు—ఊషర = చౌటిభూములయొక్కయు—సాను = చఱులయొక్కయు—
భూతి = కలిమి.

వియోగ = విరహము—వి=పక్షులయొక్క—యోగము—కలసికొనుట =కూటమి.

మన్మథ = మోహము—వెలగచెట్టు

కపిత్థేపిచమన్మథః॥ నానార్థరత్నమాల—

స్వాంత = మనస్సు—స్వ = తనయొక్క—అంత = శిఖరము—కొన—పాండుగండ

ప్రభ = తెల్లచెక్కిళ్ల కాంతి—తెల్లనిగొప్ప బండలకాంతి

---

సీ॥ (1) అకులీనుఁడయ్యు నత్యకలంక సద్వంశ భూషితోన్నతి ధాత్రిఁ బొదలు నెపుడు।
(2) దర్శితాభయుఁడయ్యుఁ దత సన్నిహితమృత్యుఫలదాయివిఖ్యాతిఁ బరగు నెపుడు।
(3) పిహితాంబరుఁడయ్యు బహువిధాధిక సముజ్జ్వలదంశుకవ్యాప్తి నలరు నెపుడు।
(4) సప్రస్థుఁడయ్యు లోకప్రకటీకృతాపరిమాణమూర్తి నాఁ బరగు నెపుడు।
గీ॥ (5) నీమహామహుఁ డారయ భీముఁ డయ్యు । కీచకాభిహితోద్వృత్తిఁ గేరలు నెపుడు।
(6) నరవరోత్తమ మతియు సనాదుఁ డయ్యు । వినుము నిశ్శబ్దవైఖరి వెలయు నెపుడు।

## టిప్పణము.

---

(1) అకులీనుఁడు = కులీనుఁడనగా సద్వంశమునందు బుట్టినవాఁడు—కులీనుఁడు కాని వాఁడు-అకులీనుఁడు = నీచవంశజుఁడు—కు = భూమియందు లీనము గానివాఁడు = ఉన్నతుఁడు—

సద్వంశభూషితుఁడు = శ్రేష్ఠవంశతిలకుడు—మంచి వెదుళ్లుగలవాఁడు—

(2) దర్శితాభయుఁడు = చూపఁబడిన అభయముగలవాఁడు – అభయమిచ్చినవాఁడు—విశేషభయమును అగుపరచువాఁడు—

మృత్యుఫలదాయి = మరణము నిచ్చువాఁడు—ముష్టిపండ్లుగలవాఁడు—

(3) పిహితాంబరుఁడు = తిరస్కరించబడిన వస్త్రముగలవాఁడు = దిగంబరుఁడు—వ్యాపింపఁబడిన—అంబరముగలవాఁడు = ఆకాశమువరకు వ్యాపించినవాఁడు.

అంశుకవ్యాప్తి = వస్త్రవ్యాప్తి—కిరణవ్యాప్తి.

(4) సప్రస్థుఁడు = కుంచమనుకొలతచేఁ గూడినవాఁడు = కుంచముపరిమాణము గలవాఁడు—గొప్పశిలలు లేక సానువులు గలవాఁడు. ప్రస్థోస్త్రీ నిసానుమానలోరితి కోశః

(5) భీముఁడు = కుంతీపుత్రుఁడగు వృకోదరుఁడు—భయంకరుఁడు—కీచకుఁడు = సింహబలుఁడు—వెదుళ్లుగలవాఁడు.

(6) సనాదుఁడు = శబ్దయుక్తుఁడు = మృగాదుల ధ్వనులతోఁ గూడినవాఁడు—నిశ్శబ్ద వైఖరి = శబ్దరాహిత్యరీతి—నిర్గత = బైలు వెడలిన = ఉత్థితమగు—శబ్దవైఖరిగలవాఁడు = విశేషశబ్దము గలవాఁడు.

---

చ॥ అలఘునితండఖర్వశిఖరాగ్రగవారిజమిత్రశత్రుమం।
డలములుతాలసాలచనంబులు వారణబృంహితధ్వనుల్।
వెలయనగస్త్ర్యమానిపఘవీక్షణముంగరసంజ్ఞయుఁదగన్।
నిలువకరండటంచునతనింబతిమాలుచుఁబిల్చెకైవడిన్॥ ౧౧౯.

శా॥ స్ఫారోదంచదవాంచదంచితవపుఃప్రాగర్ధపశ్చార్ధభా।
గ్భూరిప్రోత్థితపృష్ఠనిష్ఠితమనాగ్భుగ్నాగ్రలాంగూలభృ।
త్ప్రారజ్యద్విచలత్సటావికటదంష్ట్రాకోటివక్త్రస్ఫుర।
ద్ఘోరాకారము బొల్చెసింహముమహాక్రూరక్రియారంహమై॥ ౧౨౦.

టిప్పణము.

---

ఉదంచత్ = ఎత్తఁబడిన—అవాంచత్ = వంచఁబడిన—అంచిత=ఒప్పుచున్న—పూర్వార్ధ = ముందరియర్ధశరీరము—పశ్చార్ధ = వెనుకటియర్ధశరీరము = ముందరిభాగము నెత్తుకొని వెనుకభాగమునువంచికూర్చున్న యనిభావము—మానాక్ = కొంచముగా—భుగ్న= వంచఁబడిన—అగ్ర = కొనగల = లాంగూల = తోఁక — సటా = సింహముగొంతుమీఁది వెంట్రుకలు — ప్రారజ్యత్ = ప్రకాశించు.

---

శా॥ ఉత్కర్ణోరుసటాచ్ఛటావికటదంష్ట్రోగ్రాస్యరంధ్రంబుచం।
చత్కంఠోత్కటపృష్ఠనిష్ఠితబలిష్ఠస్తబ్ధవాలంబుమా।
ద్యత్కుంభీంద్రశిరఃస్థలప్రవిచలత్సంకోచితాంగంబుక।
ప్యత్కంఠీరవమూర్తిచిత్రములిఖింపంవచ్చునేయేరికిన్॥ ౧౨౧.

చ॥ లలిశబరీగణంబుగిరులంజరులందరులంవిలోలస।
ల్లలితలతాళిఁగ్రాలుఁబొదలంగదలంమెదలంగలేకమా।
లలనిదురించుమించుహరులంగరులంగిరులంగలంచికో।
లలనరివ్రాసియేసెమెడలందొడలంపడలంరయంబునన్॥ ౧౨౨.

టిప్పణము.

---

గిరులు = పర్వతములు—కిరులు = పందులు.

---

ఉ॥ రోదసినిండెనిండుఁదొగరుల్ జిగురుల్ నవమౌక్తికైక ర।
ఖాదళనాభిరూప్యగుళికల్ కళికల్ విలసత్ప్రమంచితో।
మోదసురాగసూనసమముల్ సుమముల్ విచరద్విహంగస।
మ్మోదకృదాత్మపుష్యఫలముల్ ఫలముల్ వెదచల్లువాసనల్॥ ౧౨౩.

టిప్పణము.

రోదసి = భూమ్యాకాశ మధ్యప్రదేశము—తొగరు – రక్తవర్ణము—గుళిక = మాత్ర– ఉండ.

చ॥ మనుకొనితేనెలానుముదముల్ మదముల్ గనిపాడుతేటులా।
కొనిఫలముల్ మెసంగుఁగులుకుల్ బలుకుంబసగల్గుఁబుట్టులా।
మునఁజెలఁజెలాడియాడిచలముల్ బలముల్ దగఁబోయఁగోతులిం।
పునఁగవగూడిమాడిసతముల్ రతముల్ సలుపుల్ సుఖస్థితిన్॥ ౧౨౪.

టిప్పణము.

ఆమ్ = ముదము—క్రొవ్వు—చెలఁజెలాడు = సంచరించు—కవ = జంట—సతము = ఎడతెగక.

చ॥ అదనునమేతనీరుకలయన్ వెలయన్ దినిత్రాగితూగిబల్।
కుదురగుమేనమాలుమసగున్ బొసగన్ గడుఁగండక్రొవ్వుపెన్।
రొదలునుగల్గియెందునదరున్ బెదరన్ మదిగానకెప్పుడున్।
ముదముననుండుపన్యమృగముల్ జగముల్ వెఱగందనిప్పనిన్॥ ౧౨౫.

ఉ॥ ఓమహిపాగ్రగణ్యవినుముత్తరగోగ్రహణంబుభాతిను।
ద్దామబృహన్నళాభ్యుదయదర్పితముత్సుకపాండవగోష్ఠికా।
భూమివిభాతిఁబల్లవవిభూషితముంవిటపీతసన్మధు।
వ్యామిళితంబువింధ్యవనవాటముపాటితచిత్రవైఖరిన్॥ ౧౨౬.

## టిప్పణము.

ఉద్దామ = అధికమగు—బృహన్నళ = షండరూపియగు నర్జునుఁడు—ఉన్నతమగు నది—అభ్యుదయము = జయము—ప్రాబల్యము. పానగోష్ఠిక = పదిజనముచేరి మధ్యపానముచేయు స్థలము—పల్లవ = చిగురు—గోవుల మేపువాఁడు—

“పల్లకా సూర్యగోపాలా” నానా—విటపీత = విటపి = వృక్షములచేత—ఇత = పొందఁబడిన = తరువులంబుట్టిన—విట = విటపురుషులచే—పీత = త్రాగఁబడిన—మధు = తేనె—మద్యము.

---

క॥ ఆహావిచిత్రమీవిం । ధ్యాహార్యప్రాంతగతమహావనవాటం।
బూహింపపముదితార్కా స । మూహంబయిప్రళయకాలమున్బురడించెన్॥ ౧౨౭.

ఆ, వె॥ ఆతతాపరాజితానేకరూపాభి । కలితమగు మవనము గాననయ్యె।
మనుజనాథవరరమానాథలీలావి । శేషమహిమగాంచిచిత్రమరయ॥ ౧౨౮.

## టిప్పణము.

అపరాజిత = జయింపఁబడని—సోమిందచెట్టు—రూప = ఆకారము—లేడి.

---

క॥ భూరిప్రరూఢబహుళో । దారార్జునము గుచు వనము తద్దయు వెలసెన్।
భూరమణవిదితమగు నా । భారతరణభూమికరణిబహు చిత్రగతిన్॥ ౧౨౯.

## టిప్పణము.

ప్రరూఢ = చిగిరించిన—ప్రసిద్ధుఁడగు. ఉదార = ఎత్తయిన—కార్యనిర్వాహకుఁడైన—అర్జున = మద్దిచెట్టు—గాండీవి.

---

క॥ నిరతముసజ్జనసంపదఁ । బురుడించునశోకసరళపున్నాగసము।
త్కరపరిశోభితమీసురు । చిరవనరాజమునృపాలశేఖరకంటే॥ ౧౩౦.

## టిప్పణము.

---

అశోక = వ్యసనరహితులైన—అశోకవృక్షము—సరళ = గంభీరులైన—దేవదారు వృక్షము. పున్నాగ = పురుషశ్రేష్ఠులు—పొన్నచెట్టు.

---

క॥ క్షితిధవవైదేహీసం । గతి రాఘవచిత్తవృత్తికరణి ; పలాశ।
ప్రతతిపరిసేవ్యమాన । స్థితిలంకవిభాతి ; వనము చెన్నువహించెన్॥ ౧౩౧.

## టిప్పణము.

---

వైదేహి = సీతాదేవి—పిప్పలిచెట్టు. పలాశ = రాక్షసుఁడు—మోదుగుచెట్టు.

---

క॥ సింధూరతిలకముఖబహు । సుందరము, ప్రవాళపుష్పశోభితమున్నై।
యిందలివనముసుమంగలి । చందమునరహించిమించెజనవరగంటే॥ ౧౩౨.

## టిప్పణము.

---

సింధూర = చెందిరము—సింధువారవృక్షము—తిలక = బొట్టు—తిలకవృక్షము. ముఖ = ఆననము—మొదలగునవి. ప్రవాళ = వెంట్రుకలు—చిగురు.

---

ఆ, వె॥ సమదధార్తరాష్ట్రసహితంబుమతిభీష్మ । శల్యయుతముద్రోణసంగతంబు।
నగుచుకురుబలాభమగువనమర్జున । బాణసంవృతముగఁబరగెనధిప॥ ౧౩౩.

## టిప్పణము.

---

ధార్తరాష్ట్ర = ధృతరాష్ట్రతనూజులు—హంసలు. భీష్మ = భయంకరములగు—భీష్ముఁడు.—శల్య=మద్రరాజు—ఏదుపంది. ద్రోణ=ద్రోణాచార్యుఁడు—మాలకాకి. అర్జున= అర్జునుఁడు—మద్దిచెట్టు. బాణ = బాణము—నల్లగోరింటచెట్టు.

---

క॥ క్షితిధరకనుఁగొనుమీప । ర్వతరాజవిరాజమానవనరాజిసమం।
చితమగుననంతమూల । స్థితిఁబన్నఁగరాజ్యలక్ష్మిచెన్నువహించెన్॥ ౧౩౪.

టిప్పణము.

---

అనంతమూలస్థితి = శేషుఁడాధారముగాఁగల స్థితి—అనేకములగు (బహుశాఖ్యము లైన) గడ్డలకాధారమగు స్థితి.

---

క॥ ఐరావతామృతేంద్రా । ణీరమ్యము, జీవమాననీయము, శక్రో।
దారవిలాసము, నగుచుమ । హారణ్యముస్వర్గవైభవాస్పదమయ్యెన్॥ ౧౩౫.

టిప్పణము.

---

ఐరావత = తెల్లయేనుఁగు—నిమ్మచెట్టు. అమృత=సుధ—ఉసిరికెచెట్టు, కరకచెట్టు. ఇంద్రాణీ = శచీదేవి—వావిలిచెట్టు. జీవ = బృహస్పతి—పాలతీగె శక్ర = ఇంద్రుఁడు—కొడిశెచెట్టు.

---

సీ॥ ఏలాలతాలోలడోలాసుఖితకేకిజాలాలలితనాదసంకులంబు।
నానాలతాగ్రప్రసూనాసవానూనపానాళిఝుంక్రియాబంధురంబు।
సారాభినవఫలాహారామదితకీరవారారవప్రౌఢదారవైభవంబు।
జాతామ్రపల్లవవ్రాతానుభవపికజాతాతిమృదునాదసంభ్రమంబు।
గీ॥ బహుళికాసారచంగదభంగభంగ । రాజిరాజితరాజీవరంగరంగ।
దఖిలజలఖగబహువాక్ప్రసంగసంగ । రంజితంబగునివ్వనరాజమధిప॥ ౧౩౬.

---

సీ॥ లాలితమదనశలాకాంచితంబయికామినానిరతంబుఁగ్రాలఁగాంచి।
బహువిధఘనసత్రఛాసితింబగుచుయాత్రోద్యతనృపతినానొప్పఁగాంచి।
భూరిశాఖావళీభూషితంబయిసదావేదాధికఖ్యాతివెలయఁగాంచి।
నవనవానేకపల్లవసముజ్జ్వలమయిగణికావిలాసాభిగణనఁగాంచి।
గీ॥ చాలనలరారెనికటరసాలసాల । మధిపకనుఁగొనుమచెయుంచునధికవాక్ప్రౌ।
మత్కృతియలమనమలరంగమటియుమత్తియుఁ । బరిపరివిధంబులనతండుబలుకునపుడు॥

## టిప్పణము.

మదనశలాక=నఖాగ్రము—చిలుక. "శారీమదనశలాకావిదగ్ధయోషిన్నఖాగ్రంచ" పత్రము = గుజ్జము—ఆకు. శాఖ = ఆరుణకాఠకాది వేదశాఖలు—కొమ్మలు. పల్లవ=విటుఁడు—చిగురు. గణికా = వేశ్య. సాలము = వృక్షము.

---

చ॥ అలసహకారభూజముననాతతరోషకషాయితేక్షణం।
బులుబరుషోక్తులందనరమ్రోలబరస్పరనిందసల్పుచున్।
గలకలబల్కుఁగీరమిథునంబుగనుంగొనిభూవిభుండుత।
త్కలహవిధంబుఁదజ్జనకకారణముంగనఁగోరుచున్నెడన్॥ ౧౩౮.

చ॥ శుకినిజభర్తఁగాంచిమదిశోకముదోఁపఁగనిట్లుబల్కునీ।
వకటప్రియాదయావిరహితాత్మతనీగతినన్యశారికా।
నికరవిమోహదాహమతినిచ్చలునన్నెడబాసిపోవనే।
గకవికనొందినీతెఱవుగానకయెంతయువంతగుందితిన్॥ ౧౩౯.

ఉ॥ ఱెక్కలురానిపిల్లలిటుఱేపటినుండియుఁదిండిఁగానమిన్।
సొక్కుచుసోలిప్రాలియవెసొమ్మసిలెన్ వెరవేదియేనిటన్।
జిక్కితిఁజొక్కినీచెడుగుఁజేతలకెంతయురోసిగాసిలోఁ।
బ్రక్కఁగలేకవాఁడిపలుకుల్వచియించెదనాడుఁబాపలన్॥ ౧౪౦.

మ॥ పతిమూలంబునతీవ్రకాండమఖిలాపత్యోపశాఖంబువి।
స్తృతబంధుచ్ఛదమార్తిధర్మకుసుమంబిచ్ఛాఫలౌఘంబుసం।
వృతమిత్రాప్తఖగాళిసంకులముసద్వృత్తాలవాలంబుశా।
శ్వతపుణ్యాంబువివర్ధితంబునగుసంసారావనీజంబిలన్॥ ౧౪౧.

ఉ॥ సారకృపావిశేషముప్రసారముగానిజమంచువాక్సుధా।
సారముశోకరుగ్భయవిసారములన్బొడసూపుతాపవి।
స్తారమునార్పఁజొన్పిసతిసారెకువారకతేర్పకున్నసం।
సారమసారమూవికచసారసలోచనకేమిజెప్పుదున్॥ ౧౪౨.

## టిప్పణము.

ప్రసారము = వ్యాపించినది; —రుక్ = రోగము; విసారము = సమూహము.

---

క॥ భీకరసంసారమువ । ల్మీకంబగుశశ్వదసుసమీరణహరణా।
స్తోకేంద్రియముఖతృష్ణా । కాకోదరవిభునకదనికాయ్యంబగుటన్॥ ౧౪౩.

టిప్పణము.

వల్మీకము = పుట్ట; తృష్ణ = ఆశ; కాకోదర = సర్పము.

సీ॥ గాఢదుఃఖోల్లోలకల్లోలచలదకూపారఘోరంబుసంసారమరయ।
నామయామోఘదంష్ట్రాభీలఘునశింశుమారఘోరంబుసంసారమరయ।
నాతతాపన్మహోహాద్యద్భూరిధారకుతారఘోరంబుసంసారమరయ।
నాసన్నమృత్యుక్షుధాపన్నరాక్షసాకారఘోరంబుసంసారమరయ।
గీ॥ సంకటోట్టంకికంటకాశాపథస్థ । విషయగుల్మాంతరచ్ఛన్నవృజినతస్క-
రారివర్గమృగోగ్రకాంతారగతివి । హారఘోరంబువినుముసంసారమరయు॥ ౧౪౪.

టిప్పణము.

కల్లోల = అలలు ; అకూపార = సముద్రము ; ఆమయ = రోగము ; శింశుమార = మొసలి ; గుల్మ = పొద ; వృజిన = పాపము.

వ॥ ఇట్టి మహాఘోరంబగు నసార సంసారంబునందు. ౧౪౫.

సీ॥ పరికింపబుధపార్థబహుఫలప్రదదివ్యపారిజాతౌదార్యభార్యగాదె।
సతతదుఃఖోల్లోలసంసారసాగరతరణప్లవాధారధారగాదె।
సుచిరసంతానసుఖవైభవామృతజనకార్ణవామేయజాయగాదె।
ధవయశోపయశోభినవసుఖాసుఖబీజరత్నరాజితరత్నిపత్నిగాదె।
గీ॥ ఆత్తగృహధనపశురక్షణాదిబహుస । హాయఘటనాద్వితీయద్వితీయగాదె।
శయనమునరంభపోషణజననికార్య । కరణములమంత్రియనవాలుఁగ్రాలుగాదె॥ ౧౪౬.

టిప్పణము.

ప్లవ = తెప్ప ; రత్ని = పిడికిలి (ఆంధ్రదీపిక) పిడితక్కువమూరయును ; ద్వితీయ = భార్య—కరణ = నిదానము—సాధనము—

సీ॥ ఆలోకనార్హపదార్థోత్తమం బెద్ది భార్యాముఖాబ్జబింబంబు గాదె।
శ్రవణార్హమంజులశబ్దరాజం బెద్ది దారవచోనినాదంబు గాదె।
ఘ్రాణార్హమహనీయగంధతల్లజ మెద్ది పత్నీతనూసౌగంధంబు గాదె।
రసనార్హవరరుచిరసనత్తమం బెద్ది జాయాధరసుధారసంబు గాదె।
సతతసర్వాంగతోషణసౌఖ్య మెద్ది । గృహిణీపరిరంభ సంరంభకేళి గాదె।
యద్వితీయైహికైశ్వర్య మనఁగ నెద్ది । సద్వధూయానులాభప్రసక్తి గాదె॥ ౧౪౭.

శా॥ మాయాజాలవిశారదుల్ బహుమనోమత్తుల్ స్వకార్యావనో।
పాయత్రాణపరాయణుల్ నిజమనోభావప్రసగోపాయనే।
చ్ఛాయత్తుల్ కపటుల్ వ్రతుల్ చపలు లవ్యాజక్రుధాపాదితా।
పాయుల్ పూరుషు లెంచ వారి నలరింపన్ శక్యమే యేరికిన్॥ ౧౪౮.

టిప్పణము.

అవన = రక్షణ; గోపాయన=దాఁచుట; క్రుధ=క్రోధము; అవ్యాజ-నిష్కారణమైన.

చ॥ సురుచిరయౌవనాగమము శోభిలు నప్పుడు సుందరిస్పృహా।
దరపరిరంభగుంభనవిధానములం దనివోవ నేలిని।
ర్ఝరజర పైకొనం జివికిపాయ దలంతు రనేకభంగులం।
బురుషులు నూతనప్రియులు బోయను వాక్కుయథార్థమై తగన్॥ ౧౪౯.

ఉ॥ నమ్మినప్రాణభర్త సదనమ్మిటు చేరక నాతికోరికల్।
వమ్ముగఁ జేసి దానినిల వమ్ముగఁ జూచినఁ దాపమార బ్రా।
ణమ్ములనట్టి వానిచరణమ్ముల కర్పణసేయకుండినన్।
సమ్మతమా నెదానికిల సమ్మదమారు నెవానికిన్ మదిన్॥ ౧౫౦.

చ॥ కుడువగ భక్ష్యభోజ్యములు గోరినమేల్కనకాంబరంబులున్।
తొడుగ విభూషణావళులు దోఁగ నుభోష్ణనవాంబుపూరముల్।
ముడువగఁ బుష్పమాలికలు మూర్కొనదివ్యసుగంధగంధముల్।
బడిబడిగల్గి వ్యర్థము లెభామకు భర్తృవియోగధామకున్॥ ౧౫౧.

సీ॥ ఆశ్రమాంతరముననడఁగుగృహస్థధర్మావలంబనకుసంజీవకరణి।
దాంపత్యజాత్యంతసంసారసౌఖ్యసన్నాహంబుగూర్చుసంధానకరణి।
గురుభర్తృగృహశుభాకరయశోరుచిరధావళ్యంబుఁజేర్చుసవర్ణకరణి।
ఆత్తదైనందినాయత్తతాపత్రయశాంతినొసంగువిశల్యకరణి।
గీ॥ ఆధిసమిధలనేర్చుసుతాగ్నికరణి । మించుసంసారవార్ధిదాటించుఁదరణి।
విమలపురుషార్థదివ్యరత్నములబరణి । తరుణియగుగాదెసంతోషసరణిధరణి॥ ౧౫౨.
క॥ పతియును గుణవతియుఁబ్రజా । వతియుననగుభార్యఁగూడివారనిసౌఖ్యో।
న్నతిగల్గిసుతులఁబడయుట । లతిశయమగుఁబుణ్యవశతనగుఁగాకసదే॥ ౧౫౩.

---

సీ॥ అకలంకజననీజనకమనోముదసదాధారముల్గాదెకుమారులరయ।
బహుజన్మసూనృతపాదపోదితఫలాకారులుగాదెకుమారులరయ।
పరితాపదావతాపశ్రాంతిదామృతాసారులుగాదెకుమారులరయ।
నాభీలపున్నరకాటవీచతుష్కుఠారులుగాదెకుమారులరయ।
గీ॥ నట్టిసుకుమారులనుబడయంగగనని । యాకులములాకులములగునాకులీను।
లాకులీనులనెనయుదురట్టివారి । ఆలయములాలయములననలరునరయ॥ ౧౫౪.
క॥ గృహిణియకదశాస్త్రంబుల । గృహమనఁగాఁబరగునట్టిగృహిణితొలఁగినన్।
గృహమేటికిపశుధనసం । గ్రహమేటికిమతియుఁబ్రదుకగానేమిటికిన్॥
క॥ సతికన్నమేటివస్తువు । బతికిన్ క్షితిగలదెమొల్లభంగులదలఁపన్।
గతమింతలేకశోపము । మతినిడికులపత్నినిట్లుమానందగునే॥ ౧౫౫.
సీ॥ మన్మఖాలోకనామందసౌభాగ్యంబుకన్నులకానందగరిమఁగూర్ప।
మద్వచశ్రవణసంసత్స్వరంపరకర్ణపుటములకాహ్లాదపటిమఁజేర్ప।
మచ్ఛిరోఘ్రాణనమహితవైభవమునాసాప్రియామోదప్రసక్తిఁజేర్ప।
మత్తనుస్పర్శనమహనీయవిభవంబుసర్వాంగపులకనోత్సవముఁదార్ప।
గీ॥ మదధరామృతపానసంభ్రమముజిహ్వ । కమితహర్షప్రసారణాయతినొనర్ప।
నఖిలసుఖములగనియేనదైయెతలిర్ప । నలరుచుండుటమరువంగనగునెయిట్లు॥ ౧౫౬.
క॥ కనుమొఱఁగిజారకార్యము । లూనరింపఁగఁబోలుగానియుచితమెసరిగా।
దనకిట్టులన్యశారికఁ । గొనివచ్చుటమదినొకింతగొంగకనిటపన్॥ ౧౫౭.
మ॥ అనిశోకావిలమానసాంతరదురంతానంతచింతామహాం।
బునిధిన్మున్గుచునేడ్చుఁబ్రేమసిఁగృపాపూర్వంబుగాఁజూచినె।

మ్మనమూరార్పఁగఁగీరమూ సమయ సంబంధానులాపంబుపొం।
దునని ష్యందమరందబిందుగణమాధుర్యంబు గానిక్లినుల్॥ ౧౫౯.

క॥ నీతులుకుప్పలుకుప్పలు । నాతిరోవలికెదవునిను ము నా నా నీతి।
వ్రాతములు నేనెఱుంగుదు । నీతతీనవికొన్ని నీకు నెఱిఁగింతునిటన్॥ ౧౬౦.

చ॥ అతిభయభక్తియుక్తి సతతాంచితసవ్యమనూనగాగిసం।
గతమృదుమంజులోక్తి నధికప్రమదప్రదవైఖరీని నా।
యతహృదయప్రసక్తి మనమూరగబాయక హార్ని శంబుఁగాఁ।
బతిపరిచర్య సేయుటలు భామినికిందగుఁగా దెధానుణిక్॥ ౧౬౧.

ఉ॥ అంగనభక్తి మైయహరహంబునుఁ బత్పతిపాదసేవనా।
సంగతభావ నేతరవిచారవిదూరతనున్నఁ జాలునా।
తంగెటిజున్ను ముంగిటినిధానము చెంగటికల్పకంబునుం।
గొంగుపసిండి యైమదిని గోరినదారునమోక్షమబ్బెడున్॥ ౧౬౨.

---

సీ॥ భార్యాముఖోత్పలావార్యహర్షదమెద్దిభర్తృవక్త్రాబ్జబింబంబుగాదె।
దారాలసద్భృక్చకోరావనం బెద్దిధవహాసచంద్రికోత్సవము గాదె।
పత్నీమనోభృంగరత్నజీవన మెద్దిపతిహృదబ్జకృపాసవంబుగాదె।
జాయాకనత్తటిచ్ఛాయాశ్రయం బెద్ది నాథనవ్యఘనాఘనంబుగాదె।

గీ॥ చిత్రముగనొప్పఁ బ్రేయసీచిత్రమునకు । ధాత్రినాధారమిదియనఁ బనఁగునెద్ది।
తెలియకున్నను దెలిపెదఁ దెలియుమబల । ప్రియసమాఖ్యాకమగు పరబ్రహ్మ గాదె॥ ౧౬౩.

సీ॥ భామాముఖాబ్జప్రభాకరస్మితభానుబాలత్విషాంపతిపతియుకాదె।
రామానుగుణరత్నరాజితాశయవార్ధిభాస్వత్త్విషాంపతిపతియుకాదె।
వామాహృదభిరామవాంఛాఫలస్తోమఫలభాగ్యవనస్పతిపతియుకాదె।
శ్యామామనోహృద్యసంతానసుఖసుధాప్రతిపాద్యపాంపతిపతియుకాదె।

గీ॥ పాపజలనిపదావర్తతాపభంగ । రోగనక్రసుతద్వీపకుద్ధభవము।
హార్ణవంబున నుస్నేహము నెడుపడవఁ । బడతికిదునట్టతరిపతిపతియుకాదె॥ ౧౬౪.

క॥ సత్యములసత్యములుగ । నసత్యంబులుసత్యములుగ సలుపనలంతుల్।
ప్రత్యక్షరాక్షసులునా । నత్యంతము వినమెయువతులదినిజమకదా॥ ౧౬౫.

సీ॥ పరికింపఁబురుషబంధురభూరిదుర్యశోధామలంకదదుష్టభామలెపుడు।
తిలకింపబహుళసంకులకులవనదావకీలలుగదపాపశీలలెపుడు।

గుణితింపసుఖపయోఘటగతవిషకణాయత్తలుగదస్వైరచిత్తలెపుడు।
బుసడింపఁబర్యంకచరఘోరపన్నగాకారలుగదజారనారులెపుడు।
గీ॥ గట్టివాయితనంబునుగణుకుఁజూపు । గటికడెందముచెడుఁజాడగఱటివెయ్యు।
లానహీలబహుమూర్తిస్వభావసమధి । యోగులగుదురుగదజగత్తాఁగలెపుడు॥ ౧౬౬.

సీ॥ అతిరిక్తుఁడనిరోసిపతిఁగఠినోక్తులజాలివెట్టఁగఁజాలునాలుతేలు।
ఊడుగకపతిఁబట్టితొడవులులేవనిసారెదూరఁగఁబారునారిమారి।
పలుమరుఁగలహించిపతిఁదిట్టివెలికీడ్చిరోతసల్పఁగుజాతినాతికోతి।
వెతఁగుందుబతికిని సమ్మతినాదరింపకపులుకుపుల్కనఁజూచుచెలువచిలువ।
గీ॥ సతికిననుకూలమతిగాకయతనిఁదొఱఁగి । సతతమిచ్ఛావిహారసంగతులఁదగిలి।
యాడెఁకువకురాకయడరునాయన్నమన్న । గాదెయిదినీవెఱుంగుదుగాదెచెపుమ॥

సీ॥ అతులమాయోపాయసతతగోపాయితాత్మీయమనోగతాసూయలగుచు।
నసమకైతవకల్పితానూనహృదయానురాగసాధితకార్యభాగలగుచు।
నసదృశానల్పలౌల్యాస్థిరీకృతచిత్తసంకల్పయుతదురాచారలగుచు।
ననుపమాన్యాయవైరాధికక్రూరతాత్యాయతాపాదితాపాయులగుచు।
గీ॥ వారకెప్పుడుస్వైరవిహారలగుచు । మానకెప్పుడుబహుమదోన్మత్తలగుచు।
వలచుమగలనుబలుసిలుఁగులఁగలంచు । పొలఁతులనునమ్మఁదగదెందుఁబురుషులకును॥

ఉ॥ మానకనారతంబుసతిమానుగమానసవీథిఁజొక్కపున్।
మానమునూఁదుచుందురభిమానముమానిమనోధినాథునన్।
మ్మానితుఁజేసివానియభిమానమునూనముమానిలోకస।
మ్మానమునొందుదీనికనుమానమెమానినినీవెఱుంగవే॥ ౧౬౯.

క॥ కోపప్రసాదములుబతి । చూపులగుమెత్తిఁజేఁగిభక్తిసూపునతనిన్।
బ్రాపుగఁగొనిమెలఁగుమసం । తాపాహ్లాదములసమతఁదాల్కొలుపఁదగున్॥ ౧౭౦.

క॥ క్రూరుఁడుపతియనికోపము । వారకమదిఁబూనెనేనివనితతుదనిరా।
ధారతమరణావధివి । స్తారమహాపత్పయోధిఁదానీదవగున్॥ ౧౭౧.

సీ॥ బహుపుణ్యచయధరాధరకూటవజ్రంబుపాపాగ్నివృద్ధిప్రభంజనంబు।
సంసారసుఖసారసాలకుఠారంబుదుఃఖలతావ్యూహదోహదంబు।
ప్రతిభామహావార్ధిపరిశోషణౌర్వంబుగాఢమహాఘతమోద్రికందరంబు।
మాత్సర్యకాలాహిమహితస్త్రీకంబుఘనకలహాసారకంధరంబు।

గీ॥ క్రూరతరయాతనాఘోరరౌరవాది । సకలనరకమహాద్వారసన్నిభంబు।
అల్పబహుభవఫలదాయికల్పకంబు । గాదెకోపంబుమదిదినిఁగానవైతి॥ ౧౭౨.

క॥ అతిపలసుఖదుఃఖంబులు । క్షితిఁబూనుషహర్షకోపచిత్తాఘన।
స్థితినలరు కెంజేఁగిజలజా । యతలోచనకోపమూననగు నేనీకుఁ॥ ౧౭౩.

సీ॥ ప్రాప్తనపుణ్యసంభవభవ్యగుణమహాభాగంబుగా దెక్షమాగుణంబు।
స్వర్గసౌఖ్యావహాశాశ్వతసుకృతాభియోగంబుగా దెక్షమాగుణంబు।
ప్రతిపాదితామలాపారయశోఘనాభోగంబుగా దెక్షమాగుణంబు।
బహువిధాధికభోగభాగ్యప్రదాగ్రకల్పాగంబుగా దెక్షమాగుణంబు।
గీ॥ నిజమహాత్పానిలోద్ధూతవృజినచయన । రాగమునఁగా దినుగువక్షమాగుణంబు।
చను నెయిటుదానిమానుటసావధాన । మతివినందగుఁగలకార్యగతులు గలియు॥ ౧౭౪.

క॥ నినునింటను నిచి నేనీ । వనమున నాహారవాంఛవడిఁద్రిమ్మరు చుఁ।
జనిచనియేనటనటఁగనుఁ । గొనివచ్చినవార్తిలిపుడు కోమలి వినుమా॥ ౧౭౫.

క॥ శుకపికనికరంబులబడి । సుకరోడ్డీనాదిగతులసొబగుదలిర్పన్ ।
నికటావనిఁబొసిసను । త్సుకతన్గనుచుండనొక్కచోభయదగతిన్॥ ౧౭౬.

సీ॥ ఘుంఘుమారవమహాఘోరార్ణవోల్లోలకల్లోలమాలాప్రకాండమగుచు।
నభ్రభ్రమత్కుంజారభ్రసంఘాతఝంపాపతత్కాలాభ్రపటలమగుచు।
ఘనశైలబహుగుహాఘటితఝాంకరణప్రఘూర్ణితాశాంతరోద్విగ్నమగుచు।
ప్రోద్ధూతధూళీసముద్భూతసాంద్రకాదంబినీచ్ఛన్నమార్తాండమగుచు।
గీ॥ త్స్మాపతత్సర్వగీర్వాణసంఘమగుచు । వ్యోమపథదుతమానవవ్యూహమగుచు।
గాటముగవీచెబ్రహ్మాండకోటిరప్ర । భంజనంబగుఝంఝాప్రభంజనంబు॥ ౧౭౭.

క॥ రంగదభంగోత్తుంగత । రంగలుతద్వీపులగగనరంగనటత్తై।
మింగిలశాబకమంబుధి । చంగద్గతిఁబొంగికడు నెసంగెన్నింగిన్॥ ౧౭౮.

క॥ సంధితసాంద్రఘనాఘన । బంధురగాఢాంధకారపటలీపటుసం।
బంధగతి నెల్లెడన్బహు । శాంధీకృతమగుచుభూనభోంతరమడరెన్॥ ౧౭౯.

క॥ ఘుర్ఘురితపటపటాయిత । నిర్ఘోషాజాండగర్భనిర్భేదమహా।
నిర్ఘాతపాతములబహు । దీర్ఘభ్రమగప్పెఁదప్పెఁదెలివిజనులకున్॥ ౧౮౦.

క॥ ఘళఘళగర్జద్ఘనఘన । ధళధళితతటిద్విభాప్రదర్శితశశ్వ।
త్ఖేళఖేళగళదురుకడకా । దళితశిరోభాగులగుచుదాగిరిజనముల్॥ ౧౮౧.

ఆ, వె॥ ఇట్టిగాలివానసెండదేనివివశుఁడ । నగుచుఁబోయిపోవుగువయేను।
విధివశమునఁబ్రదికివెసనిటవచ్చుచుఁ । గన్నచిత్రమొకటిగలదువినుము॥ ౧౭౨.

## శృంగారశేఖరచరిత్రము.

క॥ అస్పృశబహువిజయధ్వజ । విసరసమీరప్రచారవిపతత్కల్ప।
ప్రసృమదసుగంధికుసుమము । కుసుమపురంబనఁగనొకటికోమలివెలయున్॥ ౧౭౩.

ఉ॥ అంబరచుంబిసౌధనటదబ్జముఖీసదనూనగానజా।
తాంబుజరాగవారిజనితాంచితజాతిసుమాతిసౌరభా।
డంబరపూరితాంబరవిడంబిసమీరకిశోరకప్రచా।
రంబుకరంబుకాసుమపురంబుగనంపగుదానివైఖరుల్॥ ౧౭౪.

### టిప్పణము.

అంబరచుంబి = ఆకాశమునొరయుచున్న, అంబుజరాగ = పద్మరాగమణి, జాతిసుమ = జాజిపూవులు.

క॥ వినుముమహాబలిశోభిత । మునువివిధభుజంగసంఘమును సైధరణిన్।
ఘనమగుఁబాతాళమునా । జను నాపురవరముఁబొగడశక్యమెయెందున్॥ ౧౭౫.

### టిప్పణము.

మహాబలి = బలిచక్రవర్తి—మహాబలవంతుఁడు, భుజంగసంఘము = సర్పసమూహము—విటనికరము.

సీ॥ (1) పరికింపసుచిరమందరగిరిశృంగసుందరము నానవసుధాధవళితంబు।
(2) హవణింపవిదితబృహత్కథాలంబంబు నాసాలభంజికాభాసురంబు।
(3) తర్కింపదివ్యవృత్తప్రాంచితంబు నాలలితమాణవకలీలాయుతంబు।
(4) భావింపనుగ్రసుగ్రీవసైన్యంబు నావిలసద్గవాక్షాభివిశ్రుతంబు।
గీ॥ (5) భువనవితతియుచటబలిభవనంబునా । సుతలసన్నివేశశోభితంబు।
సమతఁజూడమతియుసాముబసమితినా । మత్తవారణాభిమండితంబు॥ ౧౭౬.

## టిప్పణము.

(1) సుధా = అమృతము—సున్నము.

(2) సాలభంజిక = సాలభంజికయను విద్యాధరస్త్రీ. చిత్రపుత్రిక ; బృహత్కథాలంబమను గ్రంథమున సాలభంజికయను విద్యాధరస్త్రీవిషయము చెప్పఁబడియున్నది.

(3) మాణవక = ఛందోబద్ధమగు నొకానొకవృత్తము—వటువు.

(4) గవాక్ష = ఒకానొకవానరుఁడు—కిటికీ.

(5) బలిభవన = పాతాళము; సుతల = సుతలమనుపాతాళము; సన్నివేశ = విన్యాసము—సుతలసన్నివేశ = మంచిభూప్రదేశము. సుత్రివారః = సుపగజము—వలభిప్రదేశము. (చంద్రశాల.)

---

సీ॥ మజ్జత్సురానురమకుటప్రసూనవమాలాభివాసితసలిలానుషంగ।
లీలావిలోలామరీలసత్కుచనితంబాతతతరళితోద్యత్తరంగ।
వీచికావ్యాలోలవికచకల్హారడోలాలాలితప్రవలద్విహంగ।
మత్తమనాఙ్మగ్నమాతంగమదజలేచ్ఛాంచన్మధుపఝుంక్రియాప్రసంగ।
కుతలపతితసగరసుతసురపురసమా । రోహణాతిహితనిరూఢపుణ్య।
రజ్జుసన్నిభాంగరంగదృశోభంగ । గంగపరిసరమునఁగ్రాలు నెపుడు॥ ౧౦-౭.

## టిప్పణము.

మనాక్ = కొంచెముగా; సగరసుత = సగరచక్రవర్తికొడుకులు.

---

గీ॥ సతతసూర్యాత్మజోపశోభితయు రాజ । హంసవిభ్రాజితయుబుధాహ్లాదకరయు।
నగుచుజాహ్నవిగ్రహమండలాభయగుచుఁ । బొలుచుఁజిత్రంబుదానిమపూర్వమహిమ॥

## టిప్పణము.

సూర్యాత్మజ = శని—యమున, రాజహంస = చంద్రసూర్యులు — హంసపక్షులు. బుధ = బుధుఁడు—పండితుఁడు. జాహ్నవి = గంగానది.

సీ॥ మహితనురాసురమౌళిమాలాలాలితాంచితవరచరణారవింద।
ప్రబలశుంభనిశుంభబలవనస్తోమభీషణరోషదారుణజ్వలనకీల।
మహిషాసురామోఘమహీభృద్విదారణావార్యశౌర్యనిశాంతవజ్రధార।
భక్తజనవ్రాతపాపాంధకారనిస్తంద్రప్రభాసాంద్రచంద్రరేఖ।
గీ॥ ప్రణతసాంబజటాజూటపటలగళిత । జాహ్నవీజలవీచికాక్షాళితాంఘ్రి।
జలజనివసించునప్పురిఁజండికాభి । దానకాత్యాయనీదేవితప్పకెపుడు॥ ౧౮౯.
సీ॥ (1) భరతచరిత్రంబుభాతినెంతయుసదారామాశ్రయస్థితిరహింపవహించి।
(2) వరమహోవీరవైఖరి సంతతము నారికేళీధరాంచితకీర్తిఁగాంచి।
(3) పరమమౌనీంద్రునికరణినత్యంతంబుఘనతరారుణజపాకలనమించి।
(4) భీకరసింహంబుజోకనుత్ఫుల్లకేసరసమాలీఢతఁబరిఢవించి।
గీ॥ (5) మునియుతంబయ్యుమదనాభిముఖ్యమునుభ । జించిసారిష్టమైచిరజీవియూఁదర।
హించితిద్దయునాశ్చర్యమెసఁగనెపుడు । బరగునుపవనపాదపసక్తియచట॥ ౧౯౦.

టిప్పణము.

---

(1) భరత = శ్రీరాములతమ్ముఁడు. సదారామాశ్రితస్థితి = సర్వదా రాముల నాశ్రయించినస్థితి—శ్రేష్ఠములగు నుద్యానవనముల నాశ్రయించిన స్థితి;
(2) నారికేళీధర = శత్రు~~క్రీడాధురులానాని వారు—స్త్రీక్రీడాభూములు.~~
(3) అరుణజపా = రెయ్యిదాసనపూవు; అరుణజపము.
(4) కేసర = సింహము మెడమీఁది రోమములు—సురపొన్న చెట్టు.
(5) ముని = ఋషి—వృక్షవిశేషము; అరిష్ట = గ్రహపీడాద్యశుభము — కుంకుడుచెట్టు; చిరజీవి = దీర్ఘాయుష్మంతుఁడు—కాకి.

---

మ॥ ఖనటచ్చంద్రచమూరుచంక్రమణసంక్రాంతామృతాసారసే।
చనసంవర్ధితపల్లవారుణవిభాసందర్శితాకాలసూ।
తనసంధ్యావిభవంబులాపురిమహోద్యానాలయారామసం।
జనితక్ష్మాజవిభేదముల్ సుమగుళుచ్ఛప్రాంచితామోదముల్॥ ౧౯౧.

టిప్పణము.

---

చమూరు=జింక; చంక్రమణ = త్రొక్కుడు. సేచన=తడుపుట; గుళుచ్ఛ=గుత్తి.

వ॥ విను మప్పురంబునంగల జనంబులు. (1) ధనదులయ్యుం బ్రచేతసులును, (2) గోపాలు రయ్యు రాములును, (3) ప్రియంవదులయ్యుఁ బుష్పకేతులును, (4) భరతులయ్యు శత్రుఘ్నులును, (5) తిథిపరులయ్యు నతిథిసత్కారప్రవణులును, (6) అమర్మభేదుల య్యు వీరతరులును, (7) అపతితులయ్యు నానాసవాసక్తులును, (8) సుదర్శనులయ్యు నచక్రులును, (9) అజాతమదులయ్యు సుప్రతీకులును, (10) పరమహంసులయ్యు న పక్షపాతులును, (11) అవిదితస్నేహక్షయులయ్యుఁ గులప్రదీపులును, (12) అగ్రజన్ములయ్యు వంశాంకురంబులును, (13) అగ్రహులయ్యు కావ్యజీవజ్ఞులును, (14) నిదాఘ దినంబుకరణి వృషవర్ధితరుచులును, (15) మాఘవిరామదివసంబువలెఁ దపస్యారంభు లును, (16) నభస్వంతునిభాతి సత్పథగాములును, (17) వివస్వంతునిగతి గోసతు లును, (18) మహేశ్వరునివిధంబునఁ జంద్రధారులునునై జగదాశ్చర్యకరులగుచు వెలయుచుందురు వినుము మఱియును. ౧౫౨.

## టిప్పణము.

(1) ధనదులు = కుబేరులు—ద్రవ్యమును దానమిచ్చువారు. ప్రచేతసులు - వరుణులు— ప్రకృష్టమగు బుద్ధిగలవారు.

(2) గోపాలురు = కృష్ణులు—పశుపాలురు లేక వాక్పాలురు. రాములు = బలరా ములు—అభిరాములు.

(3) ప్రియంవదులు = ప్రియంవదలును రాజులు—ప్రియవాక్యములు బలుకువారు. పుష్ప కేతులు = పుష్పకేతులను రాజులు — పుష్పములచేఁ జేయఁబడిన శేఖరము గలవారు లేక పౌజన్యధ్వజులు (పుష్పేహోర్తవసౌజన్యే.)

(4) భరతులు = భరతులనువారు—భం = నక్షత్రము. రతులు - ఆసక్తులు—అనఁగా జ్యోతిశ్శాస్త్రనిపుణులు. శత్రుఘ్నులు = శత్రుఘ్నులనువారు—రిపుహంతలు.

(5) తిథిపరులు = శ్రాద్ధదానాద్యర్హకతిథికాలజ్ఞానపరులు. అతిథి = ఆగంతుకపూజా ప్రవణులు.

(6) మర్మ = జీవస్థానం—వీరతరులు = శూరతరులు.

(7) అపతితతులు = పాతకరపాతులు. నానాసవాసక్తులు = నానా = అనేకవిధము లగు, ఆనవ = మద్యములయందు—ఆసక్తులు = అపేక్షకలవారు; నానా = అనేకములగు సవ = యజ్ఞములయందు—ఆసక్తులు—ఇచ్ఛకలవారు.

(8) సుదర్శనులు = చక్రముకలవారు—శోభనకరమగు రూపముగలవారు. అచక్రులు= చక్రములేనివారు—మాయయనగా మోసములేనివారు.

(9) అజాతమదులు = మదరహితులు—సౌమ్యులు సుప్రతీకులు = సుప్రతీక నామకదిగ్గజులు—మంచి యవయవములు గలవారు.

(10) పరమహంసులు = శ్రేష్ఠములగు హంసపక్షులు—మహాశ్రేష్ఠులు. అపక్షపాతులు= ఱెక్కలుకొట్టనివారు—పక్షపాతములేనివారు—అనగా—మధ్యస్థులు.

(11) అవిదితస్నేహక్షయులు = అక్షయమగు నూనెగలవారు = నశించని మైత్రికలవారు—కులప్రదీపకులు = గృహదీపములు (గేహోదేహో జనపదేసజాత యగణేన్వయేకులం)—వంశోద్ధారకులు—వంశాలంకారులు.

(12) అగ్రంథులు = గంట్లులేనివారు—కుటిలమార్గములేనివారు (పర్వణ్యనార్జతే గ్రంథిః) వంశాంకురంబులు = వెదురు మొలకలు—కులపుత్రులు.

(13) అగ్రహులు = గ్రహములు కానివారు—గ్రహణమనగా బంధనము—అదిలేనివారు—అథవా—అః = విష్ణువును—గ్రహులు = గ్రహించినవారు—అనగా—విష్ణుభక్తులు. కావ్యజీవజ్ఞులు = శుక్ర—గురు—బుధులు—కావ్యతత్వవేత్తలు.

(14) నిదాఘు = ఎండకాలము; వృషవర్ధితరుచులు = వృషభరాసిచే వృద్ధినొందింపఁబడిన దీప్తిగలవారు—ధర్మములయం దధికమగు నిచ్ఛగలవారు (స్యాద్ధర్మమస్త్రియాం పుణ్యం శ్రేయసీసుకృతం వృషఇతి కోశః.)

(15) తపస్యారంభులు = తపస్యమనగా ఫాల్గుణమాసము—అది యారంభముగాఁ గలవారు—తపస్సునందు కృతప్రారంభులు. (స్యాత్తపస్యః ఫాల్గునిక.)

(16) సత్పథగాములు = సన్మార్గవర్తులు—నక్షత్రమార్గ సంచారులు.

(17) గోపతులు = కిరణములుగలవారు—పండితులు (గో = వాక్కు.)

(18) చంద్రధారులు = శశిధరులు—సువర్ణధారులు = ధనికులు. (చంద్రంసువర్ణంచ గాంగేయమితి కోశః.)

---

సీ॥ (1) వర్ణింపనరుణప్రవాళమండనరేఖ వేలాతటంబునా వెలయువారు।
(2) గణుతింపదర్శితఖండాభ్రవైఖరి శరదాగమంబునాఁబరగువారు।
(3) పుకడింపబహుపరపుష్టతలీలా యతిఘునకోకలాభ్రషైగాలువారు।
(4) చర్చింపసురతాను సక్తచిత్తస్థితియాయజూకులభాతినలరువారు।

గీ॥ (5) తతవిలాసిహృదయతాపకృద్దర్శన । స్ఫూర్తిలైవైనతేయుబోలువారు।
నసుచువారవనితలానగరాధిరా । జమునసుందురధికసంభ్రమమున॥ ౧౯-౩.

టిప్పణము.

---

(1) ప్రవాళ = పగడము — గొప్పజడ. వేలాతటి = సముద్రతీరము.

(2) ఖండాభ్ర = మేఘశకలములు (శకలీ కృతమేఘము) — నఖక్షత విశేషము (ఖండాభ్రంభుజ మూలేయత్కలాకారం నఖక్షత మితి కామతంత్రే.)

(3) పరపుష్ట = కోకిలలు (కాకులవలనఁ బోషింపఁబడినవి) — పరులవలనఁ బోషింపఁబడువారు.

(4) సురత = అమరత్వము — మైథునము. యాయజూకులు = సోమయాజులు.

(5) విలాసి = విటపురుషుఁడు — పాము (బలేభిద్రె అసితుం శీలంయస్యవిలాసీ సర్ప ఇత్యర్థః — రబయోరభేదః.)

---

క॥ సుచిరమగునింద్రాణీ । పరిచయవైదగ్ధిగలిగిపరికింపగన।
ప్పురవారతిలాసినులల । సురవనితలఁబోలి వెలయుచుండుగునగరణిక॥ ౧౯-౪.

టిప్పణము.

---

ఇంద్రాణి = శచి — సురతవిశేషము. (తిష్ఠతో మిథునస్యైవ యుద్రతం పుష్టపంజరే రాగోత్పాతక్షణ భ్రష్టం తదింద్రాణ్యాహ్వయం విదుః) — సురవనితలు = అప్సరసలు.

---

క॥ సంగదరంగాంగీకృత । చంగద్రిపుజయరమానుషంగుండగుచుఁ।
శృంగారశేఖరాజ్యన్ను । పుంగవుఁడు జెలంగునటనపూర్వవిభూతిక॥ ౧౯-౫.

టిప్పణము.

---

అంగీకృత = స్వీకరింపఁబడిన ; అనుషంగ = కూడిక.

---

గీ॥ సురతరభసఖిన్నసు ప్తసీమంతినీ । కర్ణభూషణాంకకలితబాహు।
మండితారిన్నపరమా కేశిపాళవి । కాసిమండలాగ్రభాసియుతఁడు॥ ౧౯-౬.

టిప్పణము.

మండలాగ్రము = ఖడ్గము.

సీ॥ (1) బహుధాన్యకార్య సంపాదకుండా మేటిదగుసుప్రశస్తకేదారపటిమ।
(2) సతతసుభద్రాభిసంగతుండా రాజు వెలయునంచితపార్థవిభవపటిమ।
(3) రహిసత్యభామానురక్తుఁడాధన్యుండుబరగుశ్రీకృష్ణసత్పదవిపటిమ।
(4) భీమసేనాతతాభీలుఁడామాన్యుండువఱలుఁబాండవబలానార్య పటిమ।
గీ॥ (5) దనరుమఱియుభీష్మధర్మప్రసంగసం। భావ్యగరిమశాంతిపర్వపటిమ।
స్వవశకాలధర్మసంశోభియాఘనుం। డలరుశాంతనవనయాతిపటిమ॥ ౧౯౭.

టిప్పణము.

(1) బహుధా = అనేకవిధముల—అన్య = ఇతరులయొక్క—కార్య = పనులను—సంపాదకుఁడు సఫలముచేయువాఁడు, బహు = మిగుల—ధాన్య = ధాన్యములయొక్క—కార్య = ఉత్పాదనాదికార్యములను—సంపాదకుడు = కలుగఁజేయువాఁడు; కేదార = మడి.

(2) సుభద్రాభిసంగతుఁడు = సుభద్రాదేవితోఁ గూడినవాఁడు; మంచిమంగళములు

(3) సత్యభామానురక్తుఁడు = సత్యభామయం దనురక్తుఁడు—సత్యప్రకాశ లక్ష్ములయం దనురక్తుఁడు.

(4) భీమసేన = వృకోదరుఁడు—భయంకరసైన్యము.

(5) కాలధర్మ = మరణము—కాలము ధర్మము.

క॥ ఇలనిజమార్గణనికరము। లలిరిపుపురములనభంగలక్ష్యాప్తిఁగనన్।
సలలితదానయశోన్నతి। చెలువా చెలువారనతనిఁజెందుధరిత్రిన్॥ ౧౯౮.

టిప్పణము.

మార్గణ=యాచకుఁడు—బాణమురిపుపుర=శత్రుపట్టణము—శత్రుశరీరము లక్ష్యాప్త=లక్ష్యప్రాప్తి (గురి)—లక్షసంఖ్యాకధనప్రాప్తి. (లక్షం శరవ్యేవ్యాప్యజేచ—నానా.)

క॥ రణమున నిజజీవాక । ర్షణమతఁ డొనరింప శత్రురాజుల సువులా।
క్షణమున నవిడుతు రెల్లరు । గణుతింప విచిత్రమని జగంబులు పొగడన్॥ ౧౯౯.

టిప్పణము.

---

జీవాకర్షణ=ప్రాణాకర్షణ—జ్యాకర్షణ—(జీవో బృహస్పతి ప్రాణేష్వప్యాత్మ ఖగేషు నా మౌర్వ్యాం వచాయాం జీవన్త్యాం జీవా జీవతి(త్రిషు) అని. నానార్థరత్నమాల.

---

క॥ అతఁడు విముక్తక్షుఁడై । యతులితగతి నడరఁగడఁగు నాక్షణమునన।
ద్భుతమొదవ నరిశిరస్తతి । వితతము గక్షమాభియోగవిస్తృతి వెలయున్ ౨౦౦.

టిప్పణము.

---

విముక్తక్షుఁడు = భూమిని విడచినవాఁడు—క్షమాగుణమును విడచినవాఁడు.

---

క॥ పరమాద్భుతము ధరణీ । భరణుని రిపుమండలములు పంచత్వంబున్।
బొరయుఁ దగ నతఁడు సంఖ్యాం । తరమున వర్ధిలుటఁ గని మనంబులు గలగన్ ॥ ౨౦౧.

టిప్పణము.

---

పంచత్వం = పంచసంఖ్యాత్వము—మరణము సంఖ్యాంతరం = వేఱుసంఖ్య—యుద్ధమధ్యప్రదేశము (ఏకత్వాదౌ విచారేచసంఖ్యా సంఖ్యంతుసంయుగే.) నానా.

---

చ॥ నిరృతిఁ బ్రచేతసుం ధనదు నింబలవైరి మహోబలాఢ్యు శం।
కరు సమవర్తిఁ బావకు ననాధయశోమహిమాఢ్యు నాధరా।
భరణుని నష్టమూర్తియని పాయక లోకము లెన్నఁ దా నిరం।
తరము నవష్టమూర్తియనఁ దద్దయు భాసిలు నాతఁ డెంతయున్॥ ౨౦౨.

టిప్పణము.

---

నిరృతి=నిరృతియను దిక్పాలుఁడు—నిర్వ్యసనుఁడు (ఋతిర్గమనఘృణయోః—కో) ప్రచేతసుఁడు = వరుణుఁడు—ప్రకృష్టమగు మనస్సుగలవాఁడు. ధనదుఁడు = కుబేరుఁడు—

ద్రవ్యదాత. బలవైరి = ఇంద్రుఁడు—బలవంతులకు వైరి. (సైన్యాక్షి రూపరేతస్స్థౌల్యశక్తిషు చేద్బలంక్లీచే వాట్యాలకే స్త్రియాంత్రిషు బలవతి నాసీరి దైత్యే కాకేషు—నానా.) సదాగతి = వాయువు—సత్పురుషుల యాగమనముగలవాఁడు—శంకరుఁడు = ఈశ్వరుఁడు—సుఖకరుఁడు—మంగళకరుఁడు (అథశంక్లీచే శాస్త్రేశ్రేయసి మంగళే—నానా.) సమవర్తి = యముఁడు—నిష్పక్షపాతి. పావకుఁడు = అగ్ని—పవిత్రుఁడు-సదాచారి (పావకోగ్నౌ సదాచారే భల్లాతకవిళంగయోః—నానా.) అష్టమూర్తి = అష్టదిక్పాలకమూర్తి—అనష్టమూర్తి = అష్టదిక్పాలకమూర్తి కానివాఁడు—స్వరూపహానిలేనివాఁడు = అనగా మానహానిలేనివాఁడనుట.

---

చ॥ కరమునవిల్లువింటశితకాండముకాండమునన్విరోధికం।
ధరమరికంధరంబునను ధారుణి ధారుణిఁబూర్వనాయక।
స్మరణముపూర్వనాయకులసంస్మరణంబునఁగీర్తికీర్తిచే।
సరగజగత్రయంబును నెసంగుఘనుండతఁడాజినిల్పినన్॥ ౨౦౩.

సీ॥ (1) రూఢకన్యాతులారోహణంబలచంద్రునందకానిగృహస్థులందులేదు।
(2) గాఢదుర్వర్ణయోగముకర్ణికాదులయందకాని వెలందులందులేదు।
(3) బాఢజాతివిహీనభావంబుమాలికలందకానికుజాతులందులేదు।
(4) కలితమాణిక్యముక్తమును నౌదార్యంబునందె కాని ప్రజాళియందులేదు।

గీ॥ (5) మఱియుమార్గాధిగమములమహితగాన । లీలలనెకానివరపిరపాళిలేదు।
నిత్యనిర్మలనిజరాజనీతిచతురుఁ । డతఁడుపాలించునవనియందద్భుతముగ॥ ౨౦౪.

టిప్పణము.

---

(1) కన్యాతులారోహణము = కన్యకలనుద్రాసులలో నెక్కించుట—అనగా—కన్యావిక్రయము—కన్య—తుల—యను రాసుల ప్రవేశములు.

(2) దుర్వర్ణయోగము = హీనజాతివారినిఁ గూడుట—రజతయోగము (దుర్వర్ణ = వెండి)—కర్ణిక = కర్ణభూషణము.

(3) జాతివిహీనభావము = ఆభిజాత్యరాహిత్యము అనగా మంచిజాతివారు కాకపోవుట. మాలతీకుసుమరాహిత్యము. (జాతిశ్ఛందసిమాలత్యాం సామాన్యే జన్మగోత్రయోరితికోశః.)

## టిప్పణము.

---

మహిళా = స్త్రీ; సర్వమంగళ = పార్వతి; చంద్రరేఖ = బాలచంద్రుఁడు—శిరోభూషణ విశేషము (అర్ధచంద్రము) సుకుమార = కుమారస్వామి కొడుకుగాఁగలది—సౌకుమార్యయుక్త.

---

క॥ నవమాలికోజ్జ్వలయుతభ్రూ । నవసురుచిరచిత్రకాననయు నైయామా।
నవతీమణివనరాజస । మవిభాయతినలఘునుదు సముంచితగరిమన్ ॥ ౨౧౨.

## టిప్పణము.

---

నవమాలిక = నూతనమాల —విరజాజిచెట్టు—చిత్రకానన = విచిత్రములగు వనములు గలది—తిలకముగలముఖము.

---

గీ॥ అలయమునంగవతీ నామజలరుహాక్షిమధ్యకోపాంతపయసుమంజులాభ్రి।
రూప్యరేఖావిలాసనిరూఢయైన । కన్యనతిమాననౌజనఁదనరఁగనియె॥ ౨౧౩.

కోశసంకోచము=బొక్కసము—అనగా—ధనరాశితగ్గుట—మొగ్గలయొక్క సంకోచము—అనగా మొగ్గలు ముడుఁచుకొనియుండుట.—అనంగ వికారము = అంగహీనవికారము—కోహవికారము.

---

క॥ భరితాధరరాగంబులు । పరిజనములఁజెందకెపుడుభాములఁజెందెన్ ।
స్ఫురితచలరాగసంగతి । వరవిటులన్వదలిగీతవైబరినిలచెన్ ॥ ౧౦౭.

## టిప్పణము.

---

అధరరాగము = హీనరాగము—ఓష్ఠరక్తిమ. చలరాగము = ఖలానురాగము = చెడుప్రేమ = నిలుకడలేనిప్రేమ. (ఖలచంచలయోశ్చలః—నానా)—రాగచలనము.

---

హీర = సింహము—వజ్రము—సర్పము. (హీరస్సింహాహివజ్రేషు—నానా)

---

క॥ హరిసమరమణీయానన । హరిరుచిరవచోవిలాసహరినిభవేణిన్
హరిమధ్యహరితనుద్యుతి । హరిహరియారమణి బొగడనలవియె యెందున్॥ ౨౧౮.

టిప్పణము.

---

హరి = చంద్రుఁడు—చిలుక—సర్పము—సింహము—బంగారుచాయ.

(యమానిలేంద్రచంద్రార్క విష్ణుసింహాంశువాజిషు । శుకాహికపిభేకేషుహరిర్నా కపిలేత్రిషు—నానా)

---

గీ॥ మాలతీరుచిరంబులా మాలతీమ । తల్లిదరహాసతనురుచితల్లజములు।
పద్మినీరుచిరంబులా పద్మినీమ । తల్లివరయానఘనవాభితల్లజములు॥ ౨౧౯.

టిప్పణము.

---

మాలతి = వెన్నెల—జాజిపూవు. మాలతీమతల్లి = స్త్రీశ్రేష్ఠము (మాలతియనగా

సీ॥ ఆభోగభోగభాగ్యాభీష్టసంపూర్తినా రాజు సురరాజు ననుకరించు।
లోకలోకాలోకలోకముత్కరమూర్తినా రాజు వలరాజు నతిశయించు।
శ్లాఘ్యధైర్యస్థైర్యసంపత్సువిస్ఫూర్తినా రాజు గిరిరాజు నధికరించు।
శుభ్రాభ్రవిభ్రమాదభ్రశుభ్రకీర్తినా రాజు నలరాజు ననుసరించు।
గీ॥ నతఁడు రిపురాడఖర్వగర్వాపహరణ । గుణరణాద్భుతభేరికాఘోరభూరి।
ధంధణంధణధణడవాడంబరప్ర । పూరితాఖిలదిగ్భాగనభోవ్రజుండు॥ ౨౧౦.

టిప్పణము.

---

లోక = భువనము—జనము—సమూహము. ఆలోక = చూపులు.

---

క॥ ఆరాజమహిషియగుమహి । భారత్నముసర్వమంగళాసన్నిభయౌ।
భూరితరచంద్రరేఖా । ధారయుసుకుమారయునునుదాదతనగుటన్॥ ౨౧౧.

హీర = సింహము—వజ్రము—సర్పము. (హీరస్సింహాహివజ్రేషు—నానా)

క॥ హరిసమరమణీయానన । హరిరుచిరవచోవిలాసహరినిభవేణిన్
హరిమధ్యహరితనుద్యుతి । హరిహరియారమణి బొగడనలవియె యెందున్॥ ౨౧౬.

టిప్పణము.

హరి = చంద్రుఁడు—చిలుక—సర్పము—సింహము—బంగారుచాయ.

(యమానిలేంద్రచంద్రార్క విష్ణుసింహాంశువాజిషు । శుకాహికపిభేకేషుహరిర్నా కపిలేత్రిషు—నానా)

గీ॥ మాలతీరుచిరంబులామాలతీమ । తల్లిదరహాసతనురుచితల్లజములు।
పద్మినీరుచిరంబులాపద్మినీమ । తల్లివరయానఘననాభితల్లజములు॥ ౨౧౭.

టిప్పణము.

మాలతి = వెన్నెల—జాజిపూవు. మాలతీమతల్లి = స్త్రీశ్రేష్ఠము (మాలతియనఁగా బ్రాయపుస్త్రీ.) పద్మిని = ఆఁడయేనుఁగ—సరస్సు—పద్మినిజాతిస్త్రీ.

గీ॥ కలితఘనసారసచ్ఛాయనలరుఁగలికి । కచకరాననహాసవికాసరేఖ।
విదితసారంగమదహాదివిభ్రమంబు । వెలఁదితనుయానచికురదృగ్విలసనంబు॥ ౨౧౮.

టిప్పణము.

ఘన = మేఘము; సారస = కమలము, (చంద్రుఁడు)—ఘనసార = పచ్చకర్పూరము—సారంగమద = కస్తూరి;—సారంగ = ఏనుఁగు—భృంగము—జింక.

క॥ మధురాధరనిర్జితమగు । సుధవదలకవాదియగుచుసారిది వెదిరితా।
నధమమగుమగువపృథుకటి । నధరీకృతమగుచునిలచెవచలత్వమునన్॥ ౨౧౯.

టిప్పణము.

సుధ = అమృతము; వాది = వాదముకలది = ద్వేషి—వకారమాదియందుఁగలది = వసుధ.

---

క॥ నీరజపల్లవములురమ । ణీరమణీయాంఘ్రిరుచిత్రుణీకృతనిజశో।
భారాజినడఁగెవిముఖా । కారరజోలవమహావికారస్థితులన్॥ ౨౨౦.

టిప్పణము.

---

విముఖ = ఓడిన—ముఖవర్ణరహితమైన;

తా॥ నీరజపల్లవములు పాదములకోడి రజోలవములు—అనగా—దుమ్ము—అయిన వనుట—నీరజపల్లవములకు ముఖవర్ణములు లోపించఁగా రజము—లవము—నిలుచును.

---

క॥ కేసరమాకోమలితను । వాసనకెనగాకముఖవివర్ణత్వమునన్।
వాసిచెడిహస్తజితమై । రోసెవడిన్దిరిగియధరరుచితనుఁగెలువన్॥ ౨౨౧.

టిప్పణము.

---

కేసరము = చంపకము; ముఖవివర్ణత్వము = ముఖవైవర్ణ్యము—ఆదివర్ణలోపము. సరము = పుష్పమాల; తిరిగి = వెనుకతిరిగి = అనగా రసరూపమై యనుట—రసము = అమృతము.

---

గీ॥ గంధనాగమజ్జగంధియానమునని । ర్గంధమగుచురోమరాజిఁదొడర।
మొనసిజనితహ్రస్వముఖవర్ణతాప్తిను । రోజగరిమకోడిదోసినిలిచె॥ ౨౨౨.

టిప్పణము.

---

గంధనాగము = మదగజము; నిర్గంధము = గర్వభంగముకలది—గంధమనువర్ణములు లేనిది = నాగము = పాము. హ్రస్వముఖవర్ణము = కొంచమైన ముఖచ్ఛాయ—దీర్ఘరహితమైన మొదటియక్షరముకలది = నగము = పర్వతము.

---

క॥ ఘనసారసుచిఋనగవున । కెనయకనిస్సారమగుచునింతికచభరం।
బునకోడినగమగుచునీ । ఘనమహ్యస్థితిభజించిచొప్పడఁగెఁదుదన్॥ ౨౨౩.

## టిప్పణము.

ఘనసారము = పచ్చకర్పూరము. నిస్సారము = సారహీనము—సార—అనునక్షర రాహిత్యము — ఘనసారశబ్దమందు — సారవర్ణములు లోపించగా ఘనము నిలిచినది—ఘనము = మేఘము; సగమగుచు = చింతచేక్షీణించి యనుట—ఘనము సగముకాగా—న—యను నక్షరము నిలిచినది—న = శూన్యము, మధ్యస్థితి = కౌనుయొక్కస్థితి—సాధారణ స్థితి.

---

క॥ కనకముమందారంబును । వనజాననదేహకాంతివాసనలసమం।
బెనయమికిపగచిఘనతరు । లనునాఖ్యకుఁబోలఁగెఁగడునపార్థస్ఫురణన్॥ ౨౨౮.

## టిప్పణము.

కనకము = సంపెఁగ—ఉమ్మెత్త. మందారము = పారిజాతము—జిల్లేడు—ఘనతరులు = గొప్పవారు—గొప్పవృక్షములు.

తా॥ కనకమందారములు స్త్రీయొక్క దేహకాంతి వాసనలకు సమానములుగాక మిగుల నపార్థస్ఫురణచేతఁ గొప్పవృక్షములలోఁ జేరక క్రమముగ నుమ్మెత్తచెట్టునకును—జిల్లేడుచెట్టునకును నామములై నిలిచెననుట.

---

క॥ ఇలమాల్యవత్సుకేశో । జ్జ్వలయగునాబాలబహువిశంకటరక్షః।
కుల వైభవంబుగతిఁదా । నలరుచుజననేత్రపర్వ మైవిలసిల్లున్॥ ౨౨౯.

## టిప్పణము.

మాల్యవత్సుకేశోజ్జ్వల = పుష్పమాలికలచేనొప్పు మంచివెంట్రుకలుగలది—మాల్యవంతుఁడు—సుకేశుఁడు—అను రాక్షసులచే నొప్పునది—రక్షఃకుల = రాక్షసవంశము.

---

ఉ॥ మేరుమహామహీంధ్రఘన మేఖలభాతిసుజాతరూపశో।
భారమణీయయున్ విమలభాస్వరశారదరాత్రిభాతివి।
స్తారితతారకాభిరుచిసాంద్రయుసత్పరిషద్విభాతివి।
స్తారశుచిద్విజప్రవరపంక్తియునైయలబాలపొల్పగున్॥

## టిప్పణము.

సుజాతరూప = మంచిబంగారు—మంచి సౌందర్యము. తారకా నక్షత్రములు—కనుగ్రుడ్లు—పరిషత్ = సభ; శుచిద్విజప్రవరపఙ్క్తి=పవిత్రులగు బ్రాహ్మణశ్రేష్ఠులసమూహము—తెల్లని మంచిదంతములవరుస.

---

క॥ బాలికయౌవనమునవతి । లాలితగతినొప్పెజనితలావణ్యమిచి।
వ్యాలీఢయగుచువీచీ । జాలవిశాలాంబురాశిసన్నిభయనఁగన్॥ ౨౨౭.

## టిప్పణము.

లావణ్యము = లవణభావము—సౌందర్యము. వ్యాలీఢ = కూడినది.

---

క॥ వరసుమనోహరయైనుం । దరిమందసమీరణంబనందగమఱియున్।
దరుణి సదాకల్పకయై । సురుచిరనందనమునాఁగశోభిల్లెఁగడున్॥ ౨౨౮.

## టిప్పణము.

సుమనోహర= పుష్పములనుహరించునది—మంచిమనోజ్ఞ. సదా కల్పక= సర్వదా కల్పవృక్షములతోఁ గూడినది—మంచిభూషణములు గలది. ఆకల్పకము = భూషణము.

---

క॥ భరితవయఃపరిణామ । స్ఫురణంబునఁదరుణిధరణిశోభిల్లియుఁబా।
పరిణయపరాఙ్ముఖత్వముఁ । బొరసెన్బరమాద్భుతాభిభూయిష్ఠగతిన్॥ ౨౨౯.

## టిప్పణము.

వయఃపరిణామస్ఫురణము=యౌవనపరిపాకము. పరిణయపరాఙ్ముఖత్వము=వివాహవాంఛలేమి.

---

క॥ ఎంతయువింతగనపుడతి । కాంతముగవసంతములచెకాంతాంబింతా।
న్వంతరతికరణచణరతి । కాంతమ్మతతిమంఖరితమంతను కాంతమునగుచున్॥ ౨౩౦.

## టిప్పణము.

కాంతముగ=మనోహరముగ. రతి=ఆసక్తి—సురతము. రతికాంత=మన్మథుఁడు. సుతనుకాంతము = స్త్రీపురుషులు గలది.

---

క॥ నవపల్లవములుదగెమా । ధవవనలక్ష్మీవివాహధామాగతసో।
త్సవఖగరవభాషాపా । టవకుటజటిచయులపటుజటాపటలమనన్॥ —౨౩౧.

## టిప్పణము.

సోత్సవ = సంతోషయుక్తులయిన, కుటజటి = వృక్షములను జడదారులు. (అనోకహఃకుటస్సాలః ఫలాశ్రీద్రుద్రుమాగమః. అమరము.)

---

ఉ॥ కోరకరాజిరాజిలెనకుంతపికానకనాదసూచితో।
దారవిహారపాంధజనతాప్రవిదారకమారజైత్రయా।
త్రారవితాళిఝుంకరణరాగయుతాగలతాంగనాపరీ।
వారకరాగ్రదీపసమవాయవిభాయతినద్భుతంబుగాన్॥

## టిప్పణము.

కోరక = మొగ్గలు; రాజి = సమూహము; అకుంత = తెమ్మెవకాన; ఆనక = భేరి; పాంథ = విరహి; జనతా = జనసమూహము. జైత్రయాత్ర = యుద్ధయాత్ర = దాడి; సమవాయ = సమూహము.

---

సీ॥ (1) సుమనోవరశివాభిశోభితంబుకుబేరవరుణశ్వసనశక్రపసుయుతంబు।
(2) మహితసుపర్ణమన్మథసమాకలితంబుజీవతరణిచంద్రసేవితంబు।
(3) గాలవశాండిల్యకౌశికసహితంబుసంభ్రమద్ద్విజరాజిసంకులంబు।
(4) హైమవతీశారదాగమోపేతంబురంభోరుగణికావిరాజితంబు।
గీ॥ (5) విపులఘంటారవాధికవిభ్రమంబు । కుసుమఫలచందనామోదగుంభితంబు।
జనరెనభినవమాధవవనరమాస । మానవనమానితోద్వాహమంటపంబు॥ —౨౩౩.

## టిప్పణము.

(1) సుమనోవర = బ్రహ్మ—మంచిపుష్పములుగల. శివ = ఈశ్వరుఁడు—శివా = ఉసిరికచెట్టు—జమ్మిచెట్టు. (శివాభ వేదామలకీభవానీ హారీతకీసక్తుఫలాస్పృగాలః నానా.) కుబేర = కుబేరుఁడు—నందివృక్షము. వరుణ = వరుణుఁడు—ఉలిమిరిచెట్టు. శ్వసన = వాయువు—మంగచెట్టు. శక్ర = ఇంద్రుఁడు—కొడిసెచెట్టు. వసు = అష్టవసువులు—జిల్లేడు—ఒకపుష్పము.

(2) సువర్ణ = గరుత్మంతుఁడు—రేలచెట్టు. మన్మథ = మన్మథుఁడు—వెలగచెట్టు. జీవ = బృహస్పతి—పాలతీఁగె. తరణి = సూర్యుఁడు—చాగచెట్టు. చంద్ర = చంద్రుఁడు—కంపిలపుఁజెట్టు.

(3) గాలవ = గాలవముని—లొద్దుగచెట్టు. శాండిల్య = శాండిల్యముని—మారేడు చెట్టు. కౌశిక = కౌశికముని—గుగ్గిలపుఁ జెట్టు. ద్విజరాజి = బ్రాహ్మణసమూహము—పక్షిసమూహము.

(4) హైమవతి = పార్వతి — తెల్లవస—ఉసిరిక. శారద = సరస్వతి —ఏడాకులరఁటి. ఆగమ = రాక—వృక్షము. కాంత = సుందరులగు—బ్రేంకణపుఁ జెట్టు. రంభా = రంభయనునచ్చర—అరఁటిచెట్టు. గణికా = వారస్త్రీ—అడవిమొల్ల.

(5) ఘంటారవ = ఘంటానాదము—గిలకచెట్టు. మాధవ = విష్ణువు—వసంతుఁడు.

---

శా॥ ఏమేమాధవియేమెమాలతిమరేమేయేమెవాసంతియం।
చామోదించిపరస్పరంబుఁగలకంఠాకుంఠనాదంబులం।
బ్రేమంజీరిలతాతనుప్రతతి సంప్రీతాళి గానక్రియా।
సామగ్రింజెలరేగెకాసుమరజోజాలంబుఁబైఁజల్లుచుఁ॥ ౨౩౮.

## టిప్పణము.

మాధవి = మాధవియను స్త్రీ—పువ్వుల కురువిందలత—మాలతి=మాలతియను స్త్రీ—జాజితీగె—వాసంతి = వాసంతియను స్త్రీ—అడవిమొల్ల. (వాసంతీ మాధవీ యూథోత్పాటలాయాం క్రమేళకే) నానా. ఆమోదించి—సంతోషించి—వాసించి. లతాతనుప్రతతి = లతాంగుల సమూహము—లతలయొక్క గొప్ప సముదాయము—అళి = తుమ్మెద—అళి = చెలికత్తె.

చ॥ సలలితరీతిమాధవుఁడసారపలాశవినాశకృన్మహా।
బలుఁడునుఁబొలితాతనుసుపర్ణలసత్సుమనోవిరాజియుఙ్।
ఫలితమనోరథప్రమదభాషితమంజులవాగ్ద్విజాళి సం।
కులుఁడునునై ఘటించెధరకున్శుభమవ్వనలక్ష్మిసంగతిఙ్॥ ౨౩౬.

## టిప్పణము.

---

మాధవుఁడు = విష్ణువు—వసంతుఁడు—అసార=బలహీనులయిన—ఎండిన, పలాశ = రాక్షసులు —ఆకులు. (పత్రేపలాశంహరితే రాక్షసేకింశుకేపుమాఙ్, నానా.) మహాబలుఁడు = విశేషబలవంతుఁడు —వాయువు, అతను = మన్మథుఁడు—అధికమైన. సుపర్ణ=గరుడుఁడు — మంచియాకులు. సుమనః = దేవతులు —పుష్పములు ద్విజ = బ్రాహ్మణులు——పక్షులు.

---

చ॥ సలలితనూతనార్తవలసద్రుచియౌవనరేఖఁబొల్చుఁగొ।
మ్మలనలరించెఁబల్లవసమాజములామనినంచుమించునా।
సలలితనూతనార్తవలసద్రుచియౌవనరేఖఁబొల్చుఁగొ।
మ్మలనలరించెఁబల్లవసమాజములామనిఁజిత్రవైఖరిఙ్॥

నూతనార్తవ = క్రొత్త సమర్త సంబంధమగు —నూతనపుష్పములు (ఆర్తవం స్త్రీరజః పుష్పమృతుసంబంధిని త్రిషు) నానా — లసద్రుచి యౌవనరేఖ = ప్రకాశించుకాంతిగల తారుణ్యవైఖరి — ప్రకాశించుకాంతిగల వనరేఖ. కొమ్మలు = స్త్రీలు—శాఖలు. పల్లవ= చిగురు—విటులు.

---

ఉ॥ మాలతియోస్త్రశశ్వదసమానసముత్కలికాప్రవాళియుం।
లాలితచిత్రపత్రసమలంకృతయుఙ్విలసద్విలోలభృం।
గాలియునై తదీయనికటాంచితకాంతదృఢానుషంగము।
ద్వేలతఁగాంచిమించెషనవీథిమనూజ్జ్వలలీలఁగ్రాలుచుఙ్॥ ౨౩౭.

## టిప్పణము.

మాలతి = యౌవన స్త్రీ—జాజితీగె—రాగ = అనురాగము—రక్తము. ఉత్కలికా= శంకాసూయాది సంచారీభావములు—మొగ్గలు—ప్రవాల = నిడుదవెండ్రుకలు—చిగురు— "వాలఃకచే శ్వాదిపుచ్ఛె హీఁజేరేతు నపుంసకం—నానా." చిత్రపత్ర = చిత్రితమకరికాది పత్రములు—విచిత్రములగు నాకులు. భృంగ = ముంగురులు—తుమ్మెదలు. "భృంగస్త్వళిని ధూమ్యాటెపిఙ్గెభృంగంతు కుంతలే" నానా—కాంత = ప్రియుఁడు—తియ్యమామిడిచెట్టు. ఆమ్రశ్చూతశ్రావత్రైల కాంతఃపిండపలశ్చనః. అభిదానరత్నమాల. ప్రేంకణపుఁజెట్టు— (కాంతంచారా స్త్రీతుయోషి త్ప్రియంగావుపలేపినా.) నానార్థరత్నమాల. మధు = మద్యము—తేనె. .

---

క॥ ఇలనెల్లెడమధుసంగతి । నలరనిఘనతరులుగలుగుటరిదివినుముకా।
వలనతిముక్తమునివ్రజ । మలఘుతపోవర్ధనాప్తినలరుకతమునన్॥ ౨౩౯.

## టిప్పణము.

మధుసంగతి = మద్యసహవాసము ~~= మద్యపానము—~~ వసంతయోగము. ఘనతరులు = గొప్పవారు—గొప్పవృక్షములు. అతిముక్త = మిగులముక్తులగు—పువ్వులగురువింద. ముని = యతులు—వృక్షవిశేషము. (మునిర్బుద్ధద్రుమర్షిషు) నానా. తపోవర్ధనాప్తి = గ్రీష్మకాలాధిక్యప్రాప్తి—తపస్సుయొక్కక్షీణగలిచే. (ఉష్ణఉష్మాగమస్తపః) అమరము. అలరు = సంతోషించు—పుష్పించు.

---

క॥ లోలరసాలోజ్జ్వలసుమ । మూలనిలీనాళితతివిమోహకమారా।
భీలశరపుంఖలిఖితవి । శాలాక్షరపంక్తియనువిచారమునెఱపెన్॥ ౨౪౦.

క॥ వృంతవినిర్గతవికచల । తాంతాంతర్ద్వివరగుంజదళిశింజితమ।
త్యంతమునుగంతుధాటీ । సంతతశంఖారవంబుసమతవహించెన్॥ ౨౪౧.

---

చ॥ అరయవధూజనాభినవయావకపంకకృతారుణాంకసూ।
పురరణితాతిమార్దవవిభూషితపాదపయోజయోగభా।
క్సురుచిరపల్లవప్రసవశోభితరాగమశోక మొప్పెనా।
వరతరుణీవిమోహపరివర్ధితరాగముఁబూను కైవడిన్॥ ౨౪౨.

టిప్పణము.

యావక = లత్తుక, పంక = బురద. రణిత = మ్రోయుచున్న, అశోకము = మోదుగుచెట్టు.

శా॥ ఈషన్నూత్నవికాసభాసివకుళాహీనప్రసూనాతిసం।
తోషాపాదకసౌరభోత్తమము స్వాదుప్రక్రియన్మించె న।
ద్యోషాభూషితవక్త్రసంభరితమాధుర్యోల్లసత్సీధుగం।
డూషప్రాప్తిసముల్లసత్పరిమళాటోపభ్రమాపాదియై॥ ౨౪౩.

టిప్పణము.

వకుళ=పొగడచెట్టు. స్వాదు=ఇంపైన. సీధు=మద్యము. గండూష=పుక్కిలి.

ఉ॥ శ్రోణిరహించె నెంతయునుగుంజదమందమిళిందబంధుర।
శ్రేణివినీలకాంతిపరిచిహ్నితదివ్యధగద్ధగన్మహా।
శోణవిఖాంచితంబగునశోకగుళుచ్ఛము మన్మథార్ధని।
ర్వాణచితానురూపపరివర్ధితసర్వజనానుతాపమై. ౨౪౪.

టిప్పణము.

గుళుచ్ఛము = పుష్పగుచ్ఛము. అర్ధనిర్వాణ = సగముకాలిన. చిత = కాష్ఠము.

ఉ॥ రాజిలెనాసపార్శ్వవిచరన్మధుపాశ్రితఫుల్లమల్లికా।
రాజివసంతసంక్రమణరాజితసవ్యలతాంగనాపరి।

భ్రాజిమహేంద్రనీలయుతభవ్యసితాసితకాంతిసంపదు।
త్తేజితతారహారవరదివ్యకళాయతినద్భుతంబుగాన్॥ ౨౮౫.

టిప్పణము.

---

ఆసవ = తేనె, తారహార = ముత్తెపుసరము.

---

చ॥ విరహిజనప్రభంజకుఁడువీఁడుమారుఁడుశూరతన్మరో।
త్కరములుసానవెట్టనధికంబుగడెంబుననెత్తుపాంథభీ।
కరఖరశాణచక్రములకైవడిఁజూడఁగనొప్పెనాగకే।
సరవికచప్రసూనములుసారసమీరవిలోలములవ్వనిన్॥ ౨౮౬.

క॥ మహివిరహిహృదయమత్స్య । గ్రహణోత్సుకమన్మథప్రకల్పితబహుళగు।
స్నుహపాలావలులోయన । మహితములగుపాటలీసుమంబులువెలసెన్॥ ౨౮౭.

టిప్పణము.

---

పాలావలి = మత్స్యములఁ బట్టుటకు నిర్మింపఁబడిన సాధనవిశేషము. (కోడెము.)

---

వ॥ మఱియు నవ్వసంతసమయంబు. (1) విజృంభమాణసహకారకోరక నికురుంబనిపతిత మధుకరమాలామదకలఝుంకారహుంకారజనిత పథికజ్వరంబును. (2) కోమలమలయ మారుతోద్ధూత చూతప్రసవరసాస్వాదకషాయ కంఠకలకంఠ కుహూకుహూరావభరిత సకలదిఙ్ముఖంబును. (3) వికచకమలషండనిలీయమాన మత్తకలహంససకులకోలాహల ముఖరితసరోవరనివహంబును. (4) పరభృతఖరత్రోటీపాటితపాటలీకుట్మలపటలవివర వినిర్గతమధుధారాసారశీకరనికరసమారబ్ధదక్షిణసమీరణమారవారణప్రణీతపథిక వధూ హృదయంబును. (5) దుష్కులుని భాతి జాతిహీనంబును. (6) రావణునిపోల్కి నాపీతలోహితపలాశశతసంసేవ్యమానంబును. (7) రాజచంద్రునిమహిమసమృద్ధకువ లయంబును. (8) వాస్తవికునివలె వర్ధితసుఖాసంబును. (9) సత్కవికావ్యప్రబం ధంబు క్రియ ననవబద్ధతుహినలంబును. (10) సత్పురుషుని మాడ్కిదోషానుబంధరహి తంబును. (11) కైవర్తునిచాడ్పున బద్ధరాజీవోత్పల జాలంబును. (12) సమృద్ధకా సారసార్థంబు లాగున నానందితమరువకంబును. (13) దేవేంద్రుని విధంబున నింద్రా

ణీయచిరంబును. (14) మహీధరుని పోలుపున నధరీకృతదమనకంబును. (15) సిద్ధప్రభావంబున నామ్లానసుభగంబును నైయొప్పు నకాలంబునఁ (16) గందర్వకేళీలంపటలాటీలలాటతటలులితాలకధమ్మిల్ల భారకుసుమపరిమళ సమృద్ధమధురిమగుణంబును. (17) కామకలాకలా పనిపుణకర్ణాటక సుందరీసుందర స్తనకలశ యుగళఘుసృణధూళీపటలపరిమళామోదభరితంబును. (18) రణరణకరసితాపరాంతకాంతాకుంతలోల్లసితసంక్రాంతపరిమళమిళితాళిమాలామధురఝుంకార ముఖరితనభస్స్థలంబును. (19) నవయౌవనోద్ధతకేరళీకపోలపాళీపత్త్రాళీపరిచయచతురంబును. (20) చతుష్షష్టికళావిదగ్ధముగ్ధము ఖరమాళవీనితంబబింబసంవాహన సుభగంబును. (21) సురతపరిశ్రమపరవశాంధ్రపురంధ్రీనీరంధ్రపీనపయోధరభారనిదాఘజలకణనికరశిశిరంబును నగు మలయమారుతంబు సర్వజనాహ్లాదకరంబుగ వీచుచుండె నప్పుడు.

## టిప్పణము.

---

(1) నిపతిత=వ్రాలిన ; కల=అవ్యక్తమగు ; వథిక=విరహి.

(2) ఆస్వాద=త్రాగుట ; కషాయ=ఒగరుగల.

(3) షండ=సమూహము, నిలీయమాన=వ్రాలుచున్న.

(4) పరభృత=కోవెల, త్రోట=ముక్కు. పాటిత=చీల్పఁబడిన, పాటలి=కలిగొట్టుచెట్టు సమారబ్ధ=చర్చిత, వ్రణిత=గాయముచేయఁబడిన.

(5) జాతిహీనము=కులహీనము——మాలతీకుసుమములులేనిది.

(6) ఆపీత=విశేషించి త్రాగఁబడిన, లోహిత=రక్తముఁగల. పలాశ=రాక్షసులు. ఆపీత=ఈషత్పింగళలోహిత వర్ణముగల, పలాశ=మోదుగుచెట్టు.

(7) కువలయ=భూమండలము —నీలోత్పలము.

(8) వాస్తవికుఁడు=వాస్తునిర్మాణపరుఁడు, (వాస్తువు=గృహము)—వర్థితసుఖాశము = వృద్ధిచేయఁబడిన సుఖమందలి యాశఁగలది—ఖ=అకాశము—ఆశా=దిక్కులుగలది.

(9) అనవబద్ధ=విడువబడిన—తుహినము=అప్రయుక్త ప్రయోగములుగలది.

(10) దోష = పాపములయొక్క——అనుబంధము సంబంధము——దోషా = రాత్రుల యొక్క——అనుబంధం=దైర్ఘ్యం.

(11) కైవర్తుఁడు=చేపలఁబట్టుబెస్తవాఁడు—జాలికుఁడు, రాజీవ=మత్స్యవిశేషము—కమలము—ఉత్పల = మత్స్య విశేషము —కలువ — (రాజీవమజ్జేరాజీవో మృగేమత్స్యే—నానా.) (ఉత్పలశ్శకులశ్శాలో రాజీవో మద్గురస్తిమిః—కోశము.)

(12) సమ్బృద్ధ=ప్రవృద్ధము—కాసార = సరస్సు—సార్థం = సమూహము—మరుపక = మరువము—మరు = నీళ్లులేనిప్రదేశములయందలి—బకము=కొంగలుగలది (వబలకభేదము)

(13) ఇంద్రాణి=శచి—రుచిర = కామరము,—వావిలిచెట్టు—రుచిర = మనోజ్ఞము. ఇంద్రాణీ స్యాత్సిందువారే పౌలోమీరతిబంధయోః—నానా.

(14) అధరీకృత = అణచఁబడిన—దమనకము—శత్రువులుగలది—దవనముగలది.

(15) షిద్గ = శృంగారి—అమ్లాన=హర్షయుక్తుఁడు—అమ్లానవృక్షవిశేషము—సుభగ = సుందరము.

(16) లంపట = లాలస = ఆయాసపడినది—లులిత = చెదరిన—వ్రాలిన—ధమ్మిల్ల = కొప్పు—సమ్బృద్ధ=వృద్ధి చెందిన.

(17) కామకళా=కామశాస్త్రంబు—కలాప = సమూహము, ఘుసృణ=కుంకుమపువ్వు.

(18) రణరణక=ఉత్కంఠ = మిగులననుట, రసిత=ధ్వనిచేయు—అపరాంత = పశ్చిమదిగంతము—సంక్రాంత=కూడిన—ముఖరిత = మ్రోయుచున్న.

(19) పత్రాళీ=మకరికాపత్రసమూహము.

(20) సంవాహన=సంమర్దనం = పిసుకుట.

(21) నీరంధ్ర=దట్టమగు—నిదాఘజల=స్వేదోదకము—శిశిర=చల్లని.

---

సీ॥ సారశీతలవారిపూరకాసారోర్మివారశీకరభాక్సమీరమగుచు।
నానతాగలతావితానసంపుల్లప్రసూనకామోదనిదానమగుచు।
రామణీయకగృహారామరామాళ్యవిరామగానరవాభిరామమగుచు।
నాతతసౌఖ్యప్రభూతసంతతముదాన్వితభూతలజనవ్రాతమగుచు।
గీ॥ దోఁచెగుసుమరజోధూళిధూసరంబు । బహుళకలకంఠకలకంఠభాసురంబు।
వాసనావాసకేసరకేసరంబు । మీనరంబగుమధుమాసవాసరంబు॥ ౨౭౫.

## టిప్పణము.

---

కేసర = పొగడచెట్టు—సురపొన్న—చెట్టు—ధూసరము = బూడిదెవర్ణముగల—వాసనావాస = పరిమళస్థానములగు.

---

క॥ ఆయెడవిభుఁడుసఖీనము । దాయముదినుపింపనిజసుతాహృదయాభి।
ప్రాయంబుఁదెలిసియొకసదు । పాయముఁజింతించెభిన్నభావుండగుచున్॥ ౨౭౬.

క॥ ధరణిఁగలరాకుమారుల । సురుచిరరూపముల నెల్ల సుందరి యొకచోఁ,
బరికింపఁబోరయుబహుని । ర్భరమోహోత్సాహవివశభావము మదికిన్॥ ౨౫౦.
క॥ తరుణియుపుష్కోకనివలచిన । వరపరిణయవాంఛ మదిన వారణఁబొడమఁగన్।
గరమిది యుకార్యమనితా । ధర నెల్లెడలన్ స్వయంవరము చాటింపన్॥ ౨౫౧.
సీ॥ లాటగాంధారకర్ణాటసౌరాష్ట్రవరాటనాటాంధ్రాధిరాజవరులు।
వంగకాశ్మీరకకళింగకోసలకేరళాంగబంగాళధరాధిపతులు।
చోళమాళవమళయాళపాంచాలనేపాళగౌళావనీపాలమణులు।
వత్ససాల్వావంతికుత్సబర్బరసింధుమత్స్యతురుష్కాభిమానధరులు।
గీ॥ భోజఘూర్జరకుకురుకాంభోజవిభులు । కొంకణోత్కలటెంకణక్షోణివరులు।
బహుళరథదంతితురగసద్భటులుగొలువ । వచ్చిరచటికివేవేగ నిచ్చనలరి॥ ౨౫౨.
సీ॥ గంభీరరుచిసముజ్జృంభితమణిశాతకుంభకుంభస్తంభసంభృతంబు।
చీనిచీనాంబరశ్రేణికామాలికాకాండవితానాభిమండితంబు।
ఘనసారమృగనాభికాసాంకవామోఘఘుమఘుమాయితగంధగుంభితంబు।
కామనీయతరలాస్యకామినీగాయినీరమ్యవీణాగానరంజితంబు।
గీ॥ బహుళయంత్రవిచిత్రాతిబంధురంబు । రత్నపాంచాలికారాజిరాజితంబు।
సకలరాజాధిరాజాళిసంకులంబు । నగుస్వయంవరమంటపమలరెనపుడు॥ ౨౫౩.

## టిప్పణము.

శాతకుంభ = బంగారు, చీనిచీనాంబర = చీనా కొచ్చించైనా దేశములబట్టలు; వితాన = మేలుకట్టు, సాంకవ = పునుఁగు, లాస్యకామినీ = నట్టువస్త్రీలు, గాయినీ = సంగీతముపాడు స్త్రీలు, పాంచాలికా = బొమ్మలు.

క॥ పరికలితనందిఘోష । స్ఫురితంబై రాజసభవసుంధర బహుని।
ర్భరపార్థసమరధారుణి । కరణింగననొప్పెనపుడు కడుచిత్రగతిన్॥ ౨౫౪.

## టిప్పణము.

నందిఘోష = అర్జునునిరథము. వందిజనులధ్వని (నందిమాగధవంశజ్ఞా వందిమంగళపాఠకాః॥ (కోశము.)

క॥ ఆరాజసభారంగము । భూరిసురాజోపహారభూషితమగుటన్।
వీరనృపాస్థానముగతి । ధారుణిశొప్పారెఁగడునుదారప్రభలన్॥ ౨౫౫.

టిప్పణము.

రాజోపహార=రాజయోగ్యములగు కానుకలు. ఉపహార=ఉపాయనము, (కానుక) సామగ్రి—ర. ల. వర్ణములకభేదమగుటచే లాజోపహారభూషితమని స్వయంవరమంటప పరమున.

---

క॥ బహుళవితానోజ్జ్వలమై । మహితంబగుఁదాపసాశ్రమంబననలరెన్।
బహుసుమనోవిలసితమై । మహినాసభతనరెస్వర్గమాన్యంబగుచున్॥ ౨౫౬.

టిప్పణము.

వితాన = యజ్ఞము—(మేలుకట్టు. [ఉల్లోచము] చందువా) “వితానస్త్రక్రతూల్లోచౌ వితానంత్రిషుతుచ్ఛకః” కోశము. సుమనః = దేవతలు—పుష్పములు.

---

క॥ పరిదగ్ధదహ్యమానా । గరుమహిషాక్షాదిదివ్యగంధద్రవ్యో।
త్కరధూపధూమసౌరభ । భరభరితంబగుచునాసభాస్థలివెలసెన్॥ ౨౫౭.

టిప్పణము.

అగరు = ధూపద్రవ్యవిశేషము. మహిషాక్ష = గుగ్గిలము.

---

సీ॥ అంగీసదాభంగసంగీతరాగప్రభంగీతరంగాభిభాసురంబు।
లాటీమహామోఘవీటీకలితనవ్యపాటీరవాసనాబంధురంబు।
చోళీపృథూరోజపాళీధృతప్రసూనాళీలసత్సౌరభాంచితంబు।
భోజీవలన్మిళిందాజీవవరకర్ణరాజీవపరిమళభ్రాజితంబు।
గీ॥ మాళవీకేరళీతనుమహితమలయ । జప్రకృష్టతమామోదసంభ్రమంబు।
విసరెనాసభనపుడలవీరమార । వారణంబుమందసమీరణంబు॥ ౨౫౮.

టిప్పణము.

భంగి = పరిపరివిధములు, వీటీ = తాంబూలము, వలత్ = సంచరించుచున్న, మిళింద=తుమ్మెద, ఆజీవ=ప్రాణప్రాయమైన, మలయజ=పచ్చకర్పూరము. మారవారణ= మస్తకగజము.

---

ఉ॥ అంత సభాముఖంబునమహారణవీరభటాభిరక్షిత।
ప్రాంతచరత్సఖీజనకరప్రచలద్బహుచామరానిలా।
త్యంతవిలోలకుంతలసమంచితయైయలరాజకన్యసం।
క్రాంతవిశేషభూషణవికాసవిభాసితరూపరేఖతోన్॥ ౨౫౯.

ఉ॥ మంగళవాద్యఘోషములుమండితవిప్రవధూకులాంగనా।
మంగళగీతనాదములుమానితరాజపురోహితోక్తస।
న్మంగళమంత్రరావములుమాగధకీర్తితమానినీమహా।
భంగగుణస్తవధ్వనులుబాధగతింబెరయన్నయంబునన్॥ ౨౬౦.

శా॥ చంచత్కాంచనరత్నశోభితఘనస్తంభాదికంబున్మహా।
దంచత్పుష్పఫలాదికాఖిలశుభద్రవ్యోజ్జ్వలంబున్సదా।
కించిత్సౌరభధూపదీపవిసదాకీర్ణంబునై మించుస।
న్మంచంబంచితరీతినెక్కెనయానానందంబుఁగావించినన్. ౨౬౧.

ఉ॥ మాళవకేరళాధిపులుమత్స్యకళింగకళింగవంగబం।
గాళతురుష్కభూవిభులుగౌళవిదేహవిదర్భచోళనే।
పాళకురుక్షమావరులుపాండ్యపుళిందవరాటలాటపాం।
చాళమహీధవుల్సరయసంభ్రమసంభరితానురాగులై॥ ౨౬౨.

సీ॥ (1) సమధికరూపానుసారప్రవృత్తులైయాఖేటకాసక్తులనఁగఁబరగి।
(2) తవిలితభాగతద్వంసనోద్యుక్తులైయవనిమీమాంసకులనఁగఁబరగి।
(3) అమితమారప్రవృద్ధాశావిశాలురైశారదదినములసరణిఁబరగి।
(4) ప్రకటకార్తస్వరప్రకలితులైకడునతులితహేమాద్రులనఁగఁబరగి।
గీ॥ (5) సారిదిద్రోణశాస్త్రసూచకులైకర । మపుడుకురుకుమారులనఁగఁబరగి।
రహిసభాంతరమునరాకుమారకులెల్ల । నలరిరాత్క్షణముననద్భుతముగ॥ ౨౬౩.

## టిప్పణము.

(1) రూప = మృగమును, అనుసార = అనుసరించిన అనఁగా వెంటనంటిన, ప్రవృత్తులు = ప్రచారముగలవారు. ఆఖేటక = వేట. రూప = సౌందర్యమును, అనుసార = అనుసరించిన అనగా వలచిన—ప్రవృత్తులు = ఉనికిగలవారు. (నడవడి)

(2) తథాగతి = బుద్ధదేవుని - అనగా - బౌద్ధులను ధ్వంసనోద్యుక్తులు. తథాగత ధ్వంసనోద్యుక్తులు = యెటువచ్చినవారినటు—అనఁగా-కార్యాకార్య—సమయాసమయములఁ జూడక—చంపనుద్యుక్తులు. అథవా—తమవంటి వేషములను ధరించివచ్చినవారు గాని-తామేకార్యమునకు గానువచ్చిరో అదేకార్యముగూర్చి వచ్చినవారు గాని. తథాగతులు—రాజులు తాము తాము వాసవదత్తను స్వీకరించువలెనను వాసక్తితో నితరులను చంపనుద్యుక్తులై రనుట.

(3) ఆశా = దిక్కు—వాంఛ.

(4) కార్తస్వర = క = కుత్సితమగు — ఆర్త = పీడితమైన = స్వర = ధ్వనిచేత—ప్రకలితులు=కూడినవారు. (క=కుత్సితము - కాపథమునందువలె)—బంగారు.

(5) ద్రోణ = ద్రోణాచార్యులయొక్క—శాస్త్రం = శస్త్రసమూహము. ద్రోణ = కాకులయొక్క—శాస్త్రం = అనగా శకునశాస్త్రం—రాజులు శకునములు చూచుకొని రనుట.

---

క॥ మానవనాథులుపాండవ । సూనులుగతినలరిరరసి చూడఁగ సతతా।
నూనవిహితాక్షహృదయా । జ్ఞానహృతక్షులుదివ్యచక్షులునగుచున్॥ ౨౬౮.

## టిప్పణము.

విహిత = విశేషహితమైన—హితముకాని—అక్షహృదయ = జూదము—అక్ష = ఇంద్రియము—హృదయము—మనస్సు—హృతక్షములు=అపహరింపఁబడిన భూమిగలవారి-పోఁగొట్టుకొనఁబడిన తాలిమిగలవారి—దివ్యచక్షు = అర్జునుఁడు—సుగంధద్రవ్యవిశేషము-పార్థాత్మజ్ఞానినోరపి—కోశము.

---

క॥ పరనృపసంహారణోద్యమ । పరభసులనఁదనరిరపుడుస్వబలార్థివిని।
ర్భరహృదయాలగుచుధరణీ । ధరసూనులు మాఁడనద్భుతంబుగనచటన్॥ ౨౬౯.

## టిప్పణము.

స్వ = తమయొక్క—బల = సైన్యములయందు—అర్థి = ఇచ్ఛగలవారు—వాసవదత్తకొఱకు నితరరాజులతో యుద్ధముచేయను తమతమ సైన్యములను బిలువనిచ్చించిన వారైరనుట—సు = సుందరియగు—అబలా= స్త్రీయగు వాసవదత్తయందు—అర్థి=కోరికగల.

---

గీ॥ భూపవరులువిశ్వరూపావలోకన । జనితమగుచునింద్రజాలచిత్ర।
మైనప్రత్యయమునవలరుచునాసభ । ధార్తరాష్ట్రిలనఁగఁదనరిరపుడు॥ ౨౩౬.

## టిప్పణము.

---

విశ్వరూప=కృష్ణమూర్తియొక్క విశ్వరూపమును—అవలోకన=చూచుటవలన—జనిత = కలిగిన—ఇంద్రజాల=మాయయను—చిత్రమైన=అద్భుతమైన—ప్రత్యయం=జ్ఞానం. వి=పక్షిని—శ్వ = కుక్కను—రూప = మృగమును—అవలోకన = చూచుటవలన — జనిత=కలిగినది. ఇంద్రజాల = ఇంద్రజార = శచి (జ. ద. వర్ణములకును—ర. ల. వర్ణములకును నభేదము.) శకునములు జూచుటవలన గలిగినదియును—శచీదేవిని స్మరించుటచే నద్భుతమైనదియును—నగు జ్ఞానము కలవారైరనుట—స్వయంవరములయందుఁ గలుగు కలహములను శచీదేవి పోఁగొట్టుచున్నదను సంప్రదాయము గలదు కాన కొందఱు రాజకుమారులు—వాసవదత్తకొఱకు యుద్ధములు గలుగునో—యేమో. అను శంకతో శకునములు చూచుకొని, తన్నివారణార్థము శచిని స్మరించిరనుట—

---

గీ॥ తవిలిసాంవత్సరికఫలదర్శనులును । సుశకునశ్రావకులును నై సారిదిగాకు।
మారులలరిరిపరికింపమహితఖంజ । నాభులును వ్యాధసన్నిభులగుచునచట॥ ౨౩౭.

## టిప్పణము.

---

సాంవత్సరికఫలదర్శనులు=జ్యోతిష్కులచేఁ జెప్పఁబడు ఫలములను జూచువారు. సంవత్సరసమాప్తికి పూర్వమందు కలుగబోవు ఫలములను చూపునవి— ఖంజన = కాటుకపిట్టలు కాటుకపిట్టల గమనాగమనముల నాలోకించుటచే సంపత్సరఫలము దెలియవచ్చునని వాడుక.—

శకునశ్రావకులు = పక్షులను వంచించుటకుగాను దీముపిట్టలను బలుకఁజేసి విను వారు—వ్యాధులు = వేటకాండ్రు—శకునములు వినువారు.

---

క॥ క్షితిభాస్వద్దర్శనమీ । లితులై కుముదాకరములలీలసమస్త।
క్షితివరులుబొలిచిరాసభ । నతిమోహవిలోభమాత్మనలమఁగలఁగుచుఙ్॥ ౨౬౮.

టిప్పణము.

---

భాస్వత్ = సూర్యుఁడు—ప్రకాశించువాఁడు.

---

క॥ కరమధరీకృతులయ్యును । స్థిరులై గారుతులుపరవశీకృతనిజని।
ర్భరదేహస్థితిఁదనరిరి । పరమాద్భుతరసనిమగ్నభావములలరఙ్॥ ౨౬౯.

టిప్పణము.

---

అధరీకృతులు = భూమిగాఁ జేయఁబడనివారు—భూమిగాఁ జేయఁబడనివారు—స్థిరులగుట సిద్ధించదు—తిరస్కృతులు.

---

ఉ॥ ధారుణినాథులిట్లువివిధంబులమారవికారమాత్మల।
న్నారెఁగలంపనుండుటలుచయ్యవవాసవదత్తగాంచిదు।
ర్వారవిరక్తభావముధృవంబుగనూల్కొనఁదత్తఱంబక।
ర్ణీరథమట్టిడిగ్గిరమణీయగృహాంతరసీమకేగెఙ్। ౨౭౦.

టిప్పణము.

---

మారవికారము = మోహవికారము. విరక్త = వైరాగ్యము—ఇచ్ఛలేమి. కర్ణీరథ= మంచము = మంచె.

---

ఉ॥ భూపకుమారకుల్గరముఁబొంపిరివ్రాయెడుమోహకోపసం।
తాపవికారముల్సముచితంబుగనాత్మలదాఁచిలేశముం।

దోఁపఁగనీకసత్కృతులనూనముగాఁగనియేగిరెల్ల నే।
నాపరివారముల్దముఘనంబుగఁగొల్వగనంతనిచ్చటన్ ॥ ౨౭౧.

టిప్పణము.

---

బొంపిరి = పూర్ణము. సత్కృతులు = మర్యాదలు = పూజలు. సముచితంబుగ= యుక్తమగునట్లుగ.

---

ఉ॥ వింతగ నాఁటిరాత్రి పృథ్వీవరనందన గాఢనిద్రన।
భ్యంతరసీమనున్న సమయంబున స్వప్నమునందుఁ గాంచెన।
త్యంతముదంబెలర్పఁగజయంతివసంతిలతాంతకుంతసం।
క్రాంతవిలాససాంద్రునినొకానొకరాజకుమారచంద్రునిన్ ॥ ౨౭౨.

శా॥ ఆరాజేంద్రునిరూపసౌష్టవము రామాకర్షణప్రౌఢిమి।
స్ఫారస్వర్ణమృగప్రభందనరు నాసత్యాత్మునుద్యన్మహో।
శూరత్వంబు సత్త్వసంకలితతేజోయుక్తి నత్యంతమ।
ర్ణోరాశిప్రతిమానవైఖరి సదారూఢస్థితిన్బొల్పగున్ ॥ ౨౭౩.

టిప్పణము.

---

రామా = రాఘవుఁడు—స్త్రీ). సత్త్వ = బలము—జంతువులు. అర్ణోరాశి = సముద్రము.

---

చ॥ అతఁడుకుహూముఖంబుగతినంచితహారిసుకంఠవిభ్రమో।
న్నతిఁగడుమించు నెంతయుఘనాఘనవైఖరిభూరిభూజనా।
హితకరకప్రభాయతిరహించుసముజ్జ్వలితాంగదోపశో।
భితవిభవాప్తివాలిరుచిఁబెంపువహించుసమంచితంబుగన్ ॥ ౨౭౪.

టిప్పణము.

---

కుహూముఖము = కోకిల; హారిసుకంఠవిభ్రమోన్నతి = మనోజ్ఞమగు మంచికంఠస్వరవిలాసాధిక్యము—హారయుక్తమగు కంఠవిలాసాధిక్యము. ఘనాఘన =వర్షకాబ్దము;

భూజనాహితకరకప్రభాయతి = భూజనులకు నహితములగు వర్షోపలములు—భూజనులకు మిగులహితమగు హస్తప్రభ; (ఇచటస్వార్థమునకప్రత్యయము). అంగద = అంగదుఁడను వానరుఁడు—బాహువలయము.

---

సీ॥ ప్రకటాభిరూప్యకల్పకమూలకందంబు కలితలావణ్యముక్తాఫలంబు।
వైదగ్ధ్యసహకారవాసంతసమయంబు రూఢసద్గుణరత్నరోహణంబు।
బహుదానధర్మసంపత్కోశనిలయంబు కరుణామృతాసారకంధరంబు।
దివ్యయశఃకౌముదీచంద్రబింబంబు చండప్రతాపార్కమండలంబు।
గీ॥ శౌర్యబడబానలామోఘసాగరంబు । మహితవిజయరమాస్వయంవరవరంబు।
గాఁగనాతనియాకృతిఘనతరాద్భు । తావహక్రియనలరారుననుదినంబు॥ ౨౬౫.

గీ॥ అతఁడుచింతామణియనుభూపాగ్రగణ్యు । తనయుఁడనియునుమఱియుఁగందర్పకేతు।
నాముఁడనియును నాతిస్వప్నమున నెఱిఁగి । తత్పురాయత్తచిత్తయైతత్తరమున॥ ౨౬౬.

క॥ కనుఁదెఱచియతనిఁగానక । కనుమఱలన్మూసియుతనిఁగానకచింతన్।
వనజేక్షణశయ్యాగృహ । మున నాతనినరసియరసిమూర్ఛిలియుంతన్॥ ౨౬౭.

క॥ తెలిసిసకలంబుఁగలయుని । తెలిసికలందానుగన్నదివ్యపురుషుని।
న్గలసిబహుసౌఖ్యరీతుల । మెలసిమనన్వలపుగదిరిమేనుగగుర్పన్॥ ౨౬౮.

చ॥ క్షితిఁదనసృష్టికౌశలవిశేషముఁజూపురతిజ్ఞగత్త్రయా।
యతిసమవాయరూపపరమాణుగణంబులఁగూర్చిమంజులా।
మృతరససేచనంబుననమేయనిజానుభవానుభావని।
శ్చితగతినామహామహుసృజించెవిరించిసమంచితంబుగన్॥ ౨౬౯.

క॥ అటుగాకున్నతదీయో । త్కటరూపవిలాసరేఖగలదెధరణిసె।
చ్చటనయిననతఁడుననుని । చ్చటువలచినధన్యనగుదుసర్వవిధములన్॥ ౨౭౦.

మ॥ తిలకింపన్దమయంతియానిషధధాత్రీనాథచంద్రున్శకుం।
తలదుష్యంతమహీంద్రుచంద్రమతినిత్యంబున్హరిశ్చంద్రుమై।
థిలిధన్యాత్మనిరామచంద్రుఁగడుఁబ్రీతింగోరుటల్సారెని।
ప్ఫలమంచున్మదినెంతునన్నతఁడుసంభావించిచేపట్టినన్॥ ౨౭౧.

మ॥ రతికందర్పవిమోహమున్గనుటవ్యర్థంబంచుభావింతుసం।
తతమున్రోహిణిచంద్రుఁబొందుటనిరర్థంబంచునూహింతుస।

ష్మతిపౌలోమిపురందరున్వలచి ప్రేమఁ గొరు టెన్నఁ వృథా।
స్థితి యుంచున్మది నెంతు నాకతఁడు ప్రీతింజిక్కినఁ జొక్కుచుఁ॥ ౨౮-౨.

మ॥ అని చింతించుచు ముర్మురాగ్ని కణమధ్యస్థస్థితిం గాంచురీ।
తి నితాంతాంతిక దావపావక సముత్థి ప్తజ్వలజ్జ్వాలికా।
ఖని వేశస్థితి గాంచు భాతి విరహాభివ్యక్తసంతాపతి।
ప్తనిజాంగస్థితిఁ గాంచి కామిని ప్రదీప్తశ్వాసనిశ్వాసయై॥ ౨౮-౩.

## టిప్పణము.

---

ముర్మురాగ్ని=తుషాగ్ని—ముర్మురమనఁగా నుముక.

---

ఉ॥ లాలితమందమారుతములన్వలయోగ్ర సమగ్రపావకా।
ఖిలశిఖాపరంపరలు పేర్చితకున్గబళింపఁ బ్రసుక్కుచుఁ।
వ్రాలి వసంతకాలసుమరాజిరజోజలరాశిమున్గుచుఁ।
దేలికతోరమారశరతీవ్రతకున్గడు సోలితూలుచుఁ॥ ౨౮-౪.

చ॥ ప్రసవదసప్రమత్తమధుపవ్రజమంజులగుంజితంబులు।
ల్లసితరసాలసాలకిసలగ్రసనవ్యసనైకకోకిల।
ప్రసృమరగీతముల్మధురపక్వపలప్రకరప్రసారలా।
లసశుకశారికాకలకలంబులు వేమరు నొవ్వఁ జేయఁగఁ॥ ౨౮-౫.

ఉ॥ వావిరి కేళికాకాగృహావివర్ధితలాలితనవ్యమంజులా।
రావసముల్లసచ్ఛహాళిరాజమరాళమయూరకీరపా।
రావతిముఖ్యముల్ హృదయరంజకభావజమంత్రతంత్రసా।
ఖ్యావహలీలలంగనుటలారసియాత్మవిరాళిమించఁగఁ॥ ౨౮-౬.

క॥ అలరాజన్యకుమారకు । లలితాంచితరూపరుచివిలాసముతనహృ।
త్ఫలకలిఖితంబుగతిని । శ్చలముగమదినిగళితంబుచాట్పునమటియుఁ॥ ౨౮-౭.

## టిప్పణము.

---

హృత్ఫలకలిఖితము = హృదయమను పలకయందు వ్రాయఁబడినది; నిగళితము = శృంఖలాబద్ధము.

---

శా॥ ఉత్కీర్ణంబునుప్రాణమిశ్రితముప్రత్యుప్తంబుసంకీలితం।
బుత్కృష్టాంతరమర్మసంగతముమాంసోపేతమంగాంగచం।
చత్కీలాలయుతంబుశల్యగతమజ్జాసంప్రయుక్తంబునై।
యుత్కంఠస్థితిఁదోఁచినన్మగువమోహాస్వాదవిభ్రాంతయై॥ ౨౮౮.

## టిప్పణము.

---

ఉత్కీర్ణము = విభక్తము. ప్రత్యుప్తము = ఆరోపితము. సంకీలితము = శంకుబద్ధము—మేకుచే బిగింపఁబడినది. కీలాలము = రక్తము. మజ్జా=ఎముకలలోని క్రొవ్వు.

---

క॥ అధికోన్మత్తయుమూకయు । బధిరయునంధయునుశూన్యభావయునగుచున్ ।
విధువదనఘూతబాధిత । విధమువనలరారెవిరహవేదనకడిమిన్ ॥ ౨౮౯.

సీ॥ తూగురాగార్ణవాస్తోకతరంగప్రకంపితాంగాంగియైకదలుకరణి।
నిల్చుదర్పకబాణనికరకీలితగాత్రవల్లియైస్థిరవృత్తిపఱలుకరణి।
పఱచుశృంగారాభిభావనావిషరసప్రాప్తభయార్తయైపాఱుకరణి।
వ్రాలునాతతశీతవాతహృతిప్రాణజాలయైధారుణిగూలుకరణి।

గీ॥ పొరలునిజతల్పకలితసంఫుల్లహల్ల । కాంచితాంగారకణికలనడలుకరణి।
నేడ్చుకరగతనిధిదాఁచునెడముమఱచి । కరమువిలపించునిరుపేదకరణితగుణి॥ ౨౯౦.

క॥ కలికియిటువిరహవేదనఁ । గలఁగుటగనివెసఁదదీయకారణమమరం।
దెలిసిచెలులెల్లనెయ్యము । కలిమిన్శైత్యోపచారకలనాతురలై॥ ౨౯౧.

చ॥ విడివడిమోముదమ్మిపయిప్రేలుసుపేశలకేశపాశము।
న్మడియిడిజాఱువారనతిమోమునజాఱుబ్బశ్రమపూరముల్।
దుడిచితుషారవారిపలితుంపరలింపుజనింపనల్లనం।
బడిబడిమేననించికలపంబులలందవెలందినొయ్యనన్॥ ౨౯౨.

ఉ॥ కల్పితకౌసుమాస్తరణక్రమమృదూజ్జ్వలహంసతూలికా।
తల్పమునందుఁజేర్చివివిధంబులశైత్యమహోపచారముల్।
సల్పియుఁబుజ్జగించియుఁబ్రసంగవశాగతపూర్వసత్కథా।
నల్పవిచిత్రముల్దెలియనాడియుఁబాడియుదాపమారమిన్॥ ౨౯౩.

టిప్పణము.

కౌసుమ = పుష్పమయమైన—ఆస్తరణ=రత్నకంబళి—పఱుపు.

చ॥ భగవతిభక్తపాలనకృపామతినల్లననిద్రనిచ్చియీ।
మగుదనుఁబ్రోవుమోభువనమోహనకామదయారసాప్తినీ।
మగువనుఁగావుమోమలయమారుతప్రేమవహించిలేమనిం।
పుగమనఁజూడుమోర్వదికభూరివియోగభరానలార్చులన్॥ ౨౯౪.

ఉ॥ భూతములారకీరపరపుష్టమరాళమయూరశారికా।
జాతములారసారమధుజాతమదాంచితచంచరీకసం।
ఘాతములారతామరసకాంచనకేసరకుందకుట్మల।
వ్రాతములారమీకువరవర్ణినిఁబ్రోవరెయేచకర్మిలిన్॥ ౨౯౫.

సీ॥ అమృతోపమస్వాదుతమభక్ష్యసుచిరశాల్యన్నంబుభుజియింపసున్నమయ్యె।
మణిమయానేకభూషణదుకూలాద్యలంకారంబుసవరింపఁగారమయ్యె।
భరితసుగంధబంధురగంధపుష్పసంభారంబుభరియింపభారమయ్యె।
మసృణసాంకవపంకఘుసృణసంకలితసిందూరంబుతిలకింపదూరమయ్యె।
గీ॥ సారకాసారవారనీహారవారి। పూరమాతప్తతైలాతిఘోరమయ్యె।
నిద్రకక్షుద్రరౌద్రదారిద్ర్యమయ్యె। నతివకక్కటయిఁకనేదిగతియొతెలియ॥ ౨౯౬.

టిప్పణము.

సంభారము=సామగ్రి, మసృణ=చిక్కని, ఘుసృణ=కుంకుమపువ్వు.

క॥ అళులుమధుపములుకోకిల। ములుపరభృతములుసమీరములుగంధవహం।
బులుకాముఁడుకందర్పుఁడు। కలికియబలయేమికీడుగానున్నదియో॥ ౨౯౭.

టిప్పణము.

మధుపములు = తుమ్మెదలు—మద్యపానముచేయునవి, పరభృతములు=పికములు—శత్రురక్షితములు అనగాశత్రుపక్షములు, గంధవహంబులు=వాయువులు—గర్వముకలవి,

కందర్పుఁడు = మన్మథుఁడు—కుచ్ఛితదర్పముగలవాఁడు, (గురుబాలప్రబోధిక.)

---

చ॥ అనిచెలులాడు వేళవనజాయతలోచనకాత్మసంభవుం।
డనుపమశీతలానిలశతాంగమునంబరివారయుక్తినా।
తననిశితాస్త్రిశస్త్రిసహితప్రథితప్రకటాట్టహాసభీ।
షణగతిఁదోఁచినట్లయిన సంభ్రమితాత్మకయైరయంబునన్॥ ౨౯౮.

టిప్పణము.

---

ప్రథిత = ప్రసిద్ధమైన ; ప్రకట = స్ఫుటమైన ;

---

ఉ॥ కాతరనేత్రమూర్ఛనుగని కామినులెల్ల భీతిఁజిం।
తాతరళాకులాత్మలయి వాసనశీతలవారిసాస్యకం।
జాతము మీఁదజల్లి బహుచామరచాలనజాతశీతవా।
తాతిసహాయభూతి వనజాననఁ దేర్చియథోచితంబుగన్॥ ౨౯౯.

సీ॥ క్షణమాత్రమతిచిత్రకనకారవిందసుందరనిమ్నగాపులినస్థలముల।
క్షణమాత్రముస చైత్రగంధవహోల్లసత్కుందళకదళీకాకాననముల।
క్షణమాత్రముగ్నాత్రసారతుషారాంబులలితశీతాంశుశిలాతలముల।
క్షణమాత్రమాచ్ఛత్రసమసహకారచంచనతసుచ్ఛాయావితర్దికముల।
గీ॥ క్షణముకాసారకేళికాచంక్రమముల । క్షణముడోలావిహారగ్రపనక్తగతుల।
క్షణముమదనాద్యపాలంచసంభ్రమములఁ । జెలువనలరించియప్పుడా చెలులు చెలఁగి॥

క॥ వాసవదత్తసహితగతి । భాసిలుకందర్పకేతుభావము తెలియన్।
వాసిగఁబనిచిరిమ్ముదుభా । షాసముచితమాలికాఖ్యశారికనిటకున్॥ ౩౦౧.

క॥ అలమాలికయాశారిక । యలరాజకుమారిచరితమంతయుఁ దెలియం।
దలఁచియటనిలిచితడసితి । నలుగకుమిఁక నొకటిఁ దెలియుమదివినుపింతున్॥ ౩౦౨.

క॥ కందర్పకేతుఁడ దెమక । రందుండను సఖుఁడు గొలువ రాజితసుమనో।
బృందములనందమగుమా । కందతరుచ్ఛాయ నొప్పెఁగనుఁగొనుమిచటన్॥ ౩౦౩.

చ॥ అనిశుకమూరకుండుటయు నాధరణీశకుమారుఁ డెంతయు।
న్మనమున సంభ్రమంబడర మాలికమాలికమాలికాయటం।

చును పలుమాఱుఁ జేరినగుచుం వెసశారిక నెత్తి నెత్తియూ।
రొక్కనిఁ కొనియాడి ముద్దుగొని కోరికలీరికలెత్తనత్తతిన్॥ ౩౦౪.

ఉ॥ వాసవదత్తఁగూడి ప్రతివాసరమున్సుఖగోష్ఠినుండను।
ల్లాసముమీఱ నాలలనలాలననిచ్చఫలోపహారముల్।
గ్రాసమొనర్చ నాతికరకంజమునన్నిరతంబుఁ బాదవి।
న్యాసము సల్పఁగల్గుటఘనంబగు నీసుకృతంబు శారికా॥ ౩౦౫.

చ॥ లలనమనోగతంబు నిఖిలంబునుఁ దెల్లము నీకు చూడనా।
కలికిమనోనురాగమధికంబుగ దాపరికింపనిప్పుడా।
వెలఁది భరించు మద్విరహవేదన వేడిగదా తలంపనా।
పొలఁతి విమోహదాహమునఁ బొక్కఁగదాఁ గణుతింప నెంతయున్॥ ౩౦౬.

చ॥ నినుఁగననాతిఁ గన్నకరణి న్మదినింపు జనించె నాకు నా।
వనజదళాయతాక్షి కడువాడిమిగాఁడినకంతుబాణము।
ల్దనువడి నేచఁగా విరహతాపము నోర్వఁగఁజాలకెంతయు।
న్వనటమునింగఁ బోలు నిలువంజనదింకట నేఁగఁగాఁదగున్॥ ౩౦౭.

చ॥ అనిముదమారఁ బల్కఁ సమయింబున నెంతయుఁ జిత్రమైవినూ।
తనమగునీకథాక్రమము దారుణమధ్యమలోకవాసులె।
ల్లనుఁగడు సంభ్రమంబుమిగులన్వినఁబల్కఁగ డిగ్గివచ్చెనో।
యనవనజాప్తబింబమపరాద్రిపయిం బొలిచెన్ ఘనంబుగన్. ౩౦౮.

వ॥ అప్పుడు. ౩౦౯.

సీ॥ రాజితసిందూరరంజితసురవరాదభ్రసామజకుంభవిభ్రమంబు।
కర్బురఘనగరుత్కలితవాసరతామ్రచూడచూడాచక్రసుందరంబు।
వారుణీరమణీయవారవిలాసినీమణికుండలవిభాసమంచితంబు।
నవనవసంధ్యాభినవ్యసీమంతినీసరసయావకపత్రసన్నిభంబు।
గీ॥ స్ఫుటమహానటపటుజటాచూటపటల । బద్ధవాసుకిఫణరత్నబంధురంబు।
రమ్యముగనొప్పెరహిఁ బహురక్తిమాభి । మండితంబగుమార్తాండమండలంబు॥ ౩౧౦.

టిప్పణము.

---

కర్బ్బుర = చిత్రవర్ణములుగల (నానార్థరత్నమాల.) తామ్రచూడ = కోడిపుంజు. చూడాచక్ర = కోడిచుట్టు, యావకపత్ర = లాక్షాకృతపత్రరేఖ, మహానట = తాండవేశ్వరుఁడు.

---

క॥ భువిజనులకద్భుతంబుగ । రవియపుడొప్పెసఁగెనధికరక్తిమకలిమిన్ ।
సవిషాదుండుపరిత్య । క్తవసుండునునగుచుదుర్విదగ్ధునికరణిన్ ॥ ౩౧౧.

టిప్పణము.

---

రక్తిమ = ఎఱుపు; సవిషాదుఁడు = వ్యసనయుక్తుఁడు— మేఘయుక్తుఁడు; వసు = ద్రవ్యము—కిరణములు, దుర్విదగ్ధుఁడు = దరిద్రుఁడు.

---

గీ॥ వారుణీసంగతస్థితివఱలిభద్రుఁ । గలితరక్తాంశుకస్థితినలరిశాక్యు ।
భవ్యసంజ్ఞాభిసంయుక్తిఁబరగిప్రాజ్ఞుఁ । బోలిరవిదోఁచెనస్త్రాద్రిఁబొలుచునపుడు॥ ౩౧౨.

టిప్పణము.

---

వారుణీ = పశ్చిమదిశ—మద్యము, భద్రుఁడు = బలదేవుఁడు = బలరాముఁడు. రక్తాంశుకము = కాషాయవస్త్రము—ఎఱ్ఱనికిరణములు, శాక్యుఁడు = బుద్ధుఁడు, సంజ్ఞా= ఛాయాదేవి—తెలివి (సంజ్ఞానామ్నిరవేర్జాయాయాం చైతనేప్యర్థసూచనే—నానా.)

---

క॥ పగలువగఁగులుకునళినీ । మృగలోచనవలచికలసిమెలఁగినకలుషం।
బగలరవిచరమనగమున । భృగుపాతమొనర్చెననగుభిల్లునగ్రుంకన్ ॥ ౩౧౩.

టిప్పణము.

---

భృగు = కొండచఱి—భృగుపాతము = కొండ, చఱినుండి దుమికి ప్రాణత్యాగము చేయుట. ఇది దివాసంగమముఁ జేసినవారికి ప్రాయశ్చిత్తము. (భృగురైత్యాగురౌశంఖౌ జమదగ్నిప్రతాపయోః—నానా.)

---

చ॥ మొనసిప్రచేతసుండలత్రిమూర్తిమయాత్మకుసూర్యుఁదానెదు।
రొ్కొనవిరచించునవ్యమణికుట్టిమమండితమండపాంతనూ।
తనపటుపాటలాంశుకవితానవితానముబోలెనెంతయుఙ్ ।
ఘనమగుసాంధ్యరాగమధికప్రభనొప్పెవిచిత్రవైఖరిఙ్ ॥ ౩౧౮.

టిప్పణము.

---

ప్రచేతసుఁడు = వరుణుఁడు, కుట్టిమ = రత్నఖచితభూమి, వితాన= మేలుకట్టు— సమూహము.

---

మ॥ చరమాబ్ధినివ్వలసిల్లువిద్రుమలతాసంఘప్రభాజాలమం।
బరకాసారవిఫుల్లహల్లకకలాపస్ఫూర్తికందర్పపు।
ష్పరథప్రాంచితకేతకచ్ఛలినభస్సాధాగ్రమాంజిష్ఠసుం।
దరశోభాతిశయంబునాఁదనరెసంధ్యారాగమప్పట్టునఙ్ ॥ ౩౧౯.

టిప్పణము.

---

కలాప = సమూహము, కూటమి. పుష్పరథము = విహారరథము. మాంజిష్ఠ= హరిద్రాసంబంధమైన.

---

వ॥ మఱియు నాసంధ్యాసమయంబు. (1) రజోలుంఠితోత్థిత కులాయార్థికలహ వికలకల వింకకుల కలకలవాచాలశిఖరంబులగు శిఖరినికరంబులును. (2) వసతిసాకాంక్షం బులగు ధ్వాంక్షంబులును. (3) అనవరతదహ్యమాన కాలాగరుధూపపరిమళోద్గారంబులగు వాసాగారవివరంబులును. (4) దూర్వాంచితతటినీతటనివిష్టగోష్ఠీవిదగ్ధజనప్రస్తూయమానకథాశ్రవణోత్సుకశిశుజన కలకలకరవ్రొత్కుపిత సమృద్ధులగు వృద్ధులును. (5) విరచితకందర్పముద్రులగు క్షుద్రులును. (6) కాముకజనానుబధ్యమానదాసీజనవివిధాశ్లీలవచఃశ్రుతివితసీకృతలగుకామినులును. (7) సంధ్యావందనోపవిష్టులగు శిష్టులును. (8) రోమంథ మంథర కురంగకుటుంబాధ్యాస్యమానప్రదిష్ఠగోష్ఠీనాగణ్యంబులగు నరణ్యంబులును. (9) నిద్రావిద్రాణ ద్రోణకాకకులకలిల, కులాయంబులగు గ్రామసముదాయంబులును. (10) కాపేయవికలకపికుల, కలిలంబులగు నాశ్రమతరు

నిచయంబులును. (11) నిర్గమనేచ్ఛావికలజరత్తరుకోటరకుటీర కుటుంబికౌశికకులంబులును. (12) విశ్రాంతకథానుబంధప్రవర్తమాన పథికజన గృహాగమ నత్వరంబులగు చత్వరంబులును. (13) సమాసాదితకుక్కుటంబులగు కిరాతజననిష్కుటంబులును. (14) కృతయష్టిసమారోహణంబులగు బర్హిణంబులును. (15) విహితసంధ్యాసమయవ్యవస్థులగు గృహస్థులును. (16) స్వపతిసంకోచోదంచదుచ్ఛ్రితర కేసరకోటిసుకటకుశేశయోదరకోటరకుటీరకుటిలశాయికంబులగు షట్చరణచక్రంబులునుం, గలిగి. (17) లక్ష్మికరణి స్వయంవరగృహీత పీతాంబరంబును. (18) వారవధూటివిధంబున పల్లవానురక్తంబును. (19) కామినింబోలె కాశేయాతామ్రపయోధరంబును. (20) బభ్రువుగతి కపిలతారకంబును నై కనుపట్టెనప్పుడు. ౩౧౬.

## టిప్పణము.

---

(1) లుఠితము=పొరలినది; కలవింక=ఊరఁబిచ్చుక; శిఖరి=వృక్షము. (2) వసతి=గూడు; ద్వాంక్ష=కాకి. (3) ఉద్గారము=వెళ్లఁగ్రక్కుట; వాసాగారవివరము=గవాక్షి—కిటికి. (4) దూర్వా = గఱికి; గోష్ఠి = సల్లాపము, విదగ్ధజన = నేర్పరులగువారు; ప్రస్తూయమాన = చెప్పఁబడిన; సమృద్ధులు=ఆఢ్యులు. (5) కందర్పముద్ర = కామచేష్ట. (6) అనుబధ్యమాన = నియమింపఁబడిన; అశ్లీల = సిగ్గులేని; విరసీకృతులు = అసహ్యపడినవారు. (7) ఉపవిష్టులు = కూర్చున్నవారు. (8) రోమంథము = నెమరు; మ్రదిష్ఠ = మృదువైన. (9) నిద్రావిద్రాణ = నిద్రాధీన; ద్రోణకాక=మాలకాకి; కలిల = యుక్త; (10) కాపేయ=చపల; కలిల=కూడిన. (11) కుటుంబి=వసించు. (12) చత్వరము = నాలుగుత్రోవలుకలిసిన ప్రదేశము—చతుష్పథము. (13) నిష్కుటము = గృహోపవనము. (14) బర్హిణము = నెమలి. (16) కుశేశయ = తామర. (17) స్వయంవరమునఁ బెండ్లాడినవిష్ణువునుగలది—స్వబలముచేతఁ బొందఁబడిన రక్తవర్ణముగల యాకాశముచేఁ గూడినది. (18) విటులయందనురాగముగల—చిగుళ్లవలె నెఱ్ఱనైన. (19) కాశేయ = కుంకుమ; పయోధర = స్తనము—మేఘము. (20) బభ్రువు = ముంగిస; కపిల=గోరోచనవర్ణముగల; తారక = కనుగ్రుడ్డు—నక్షత్రము.

---

సీ॥ (1) నక్షత్రసూచనాదక్షతాయతిమహాగణకప్రభావాభిగణనఁ గాంచి।
(2) ప్రకటితతారకాధికబలాయతిమహాదనుజచమూస్థితిఁ దనరఁగాంచి।

(3) సంచరత్కౌశికాసముదాయతిమహానందనాతిశయంబుఁజెందఁగాంచి।
(4) కుంఠితకువలయోత్కంఠతాయతిమహాభాస్కరోదయరేఖఁబరగఁగాంచి।
గీ॥ (5) వారితద్రోణవిహగవిహారకలన । ద్రుపదరాజాత్మజోద్వృత్తిఁదొడరఁగాంచి।
మించిజగమెల్లవడినాక్రమించిమ్రింగు । భీషణత్వంబుదోపఁబ్రదోషమడరె॥ ౩౧౭.

## టిప్పణము.

(1) గణక = జ్యోతిష్కుఁడు.
(2) తారక = తారకాసురుఁడు—నక్షత్రములు.
(3) కౌశిక = దేవేంద్రుఁడు—గుడ్లగూబ.
(4) కువలయ = కలువ—భూమండలము.
(5) ద్రోణవిహగ = మాలకాకి—ద్రోణాచార్యుల బాణములు.

---

క॥ ఘటమానదళపుటాంచిత । పుటకినులన్మదితమధుపపుంజముదిరిగెన్।
బటుతిమిరతిమిరహతినిజ । చటులగతిన్ భాసికుటిలచంక్రమగతులన్॥ ౩౧౮.

## టిప్పణము.

ఘటమాన = ముకుళించుచున్న, పుటకిని = పద్మిని, తిమిర = చీఁకటి — నేత్రరోగము.

---

చ॥ జలవిహగారవంబువిలసత్ప్రతిబింబితసాంధ్యరాగము।
న్గలుగుసర: కృపీటములఁగానఁగనయ్యె సరోజినుల్ ప్రియ।
ప్రలయవిషాదరోదనమపారముగానతిభక్తియుక్తిను।
జ్జ్వలితచితాగ్నికీలలనవారణఁజొచ్చికలంగుఁగైవడిన్॥ ౩౧౯.

## టిప్పణము.

సరోజిని = తామరతీఁగె, ప్రలయ = మరణము, చిత = సొద.

---

సీ॥ (1) ఉద్దీపితంబు సముద్యన్మహానీలపటుతరమధుకరపటలికలన।
(2) సంవర్ధితంబు ప్రజ్వలితాగ్నిహేత్రవిస్ఫుటవిశంకటధూమపటలికలన।
(3) మాంసళితంబు భామాకేశసంస్కారపరమసౌరభధూపపటలికలన।
(4) మేచకితంబు సమిద్ధపేచకిఘటాకటదానశీకరపటలికలన।
గీ॥ (5) మఱియుఁ బుంజీకృతంబు తమాలపాద । పచ్ఛటాపాటితప్రభాపటలికలన।
నిడియనఁగ నొప్పి భువిదివి యెల్లనుండి । చటులగతిఁ గాంచె ఘనతమఃపటలమపుడు.

టిప్పణము.

---

విశంకట = విశాలమైన, మాంసళితము = బలిసినది, మేచకితము = నల్లనైనది, పేచకి = గజము — పేచకీ ద్విరదః పద్మలికోశః.

---

ఉ॥ ప్రావరణంబు రాత్రియను పాంసులకున్బలితౌషధంబుదై।
న్యావిలవృద్ధవారవనితావళికిన్బ్రియమిత్రమత్యసం।
భావితదుర్జనాళికిని పత్యమసత్కులికాలకాలర
క్షోవరమాళికిం దగనకుంఠితగాఢతమోవ్రజంబిలన్॥ 3_౨౧.

టిప్పణము.

---

పాంసుల = జారస్త్రీ; ప్రావరణము = ముసుకు పలితౌషధము = ముదిమికి మందు; నెరసిన వెంట్రుకలకు మందు.

---

క॥ వితతప్రత్యక్షుద్ర । వ్యతిరస్కృతిబౌద్ధమతము వైఖరివినివా।
రితసకలాంతరసంగతి । క్షితిదుష్టమహత్త్వ సమరుచిం దమ మొలసెన్॥ 3_౨౨.
క॥ క్షితినంధతమసమనలము । గతిబహుకాష్ఠాపహారకస్థితిఁ దగిసం।
తతముఁ గురురాజసైన్యముగతి ముదితోలూకము ఖవికాసముగాంచెన్॥ 3_౨౩.

టిప్పణము.

---

కాష్ఠాపహారకము = దిక్కుల నావరించినది — కట్టెలను కాల్చునది—ఉలూక = గుడ్లగూబ—దుర్యోధనుని మేనమామయగు శకునియొక్క కొడుకు.

---

సీ॥ (1) దుర్భరభూభారనిర్భుగ్నదిక్కరికరసముద్వాంతశీకరములనఁగ।
(2) దూరభ్రమణఖిన్నతోయజాప్తతురంగమాస్యఫేనస్తబకాళియనఁగ।
(3) పటుమహానటజటాపటలచాలనసముజ్ఝితగాంగఝురపృషద్వితతియనఁగ।
(4) సాంధ్యరాగానలశమనవేళాసముత్కీర్ణస్ఫులింగప్రకీర్ణమనఁగ।
గీ॥ (5) వెసజగత్త్రయవిజిగీషవెడలుమగని । పుష్పరథమునఁగడుఁబరిపూర్ణరక్తి।
లలితగతిరతి వెదచల్లులాజలనఁగఁ । బ్రకటముగఁదోఁచెఁదారకానికరమపుడు॥ ౩౨౪.

ఉ॥ నీరజయోనిచంద్రకఠినీశకలంబుఁదమోమషీయుతో।
దారనభస్స్థలాజినముఁదాలిచిపూనికమీఱమర్త్యసం।
సారసుఖంబులన్గణనసల్పుచునిల్పునభావసూచనా।
ధారకశూన్యబిందుసముదాయమునాఁదగెఁదారకౌఘముల్॥ ౩౨౫.

టిప్పణము.

కఠినీశకలము = బలపపుముక్క.

మ॥ మగనింజంద్రునెదుర్కొనంగడఁగిప్రేమన్ జక్రవాళంబునాఁ।
దగునశ్మంతమునన్సముజ్జ్వలితసంధారాగవహ్నింమహా।
గగనభ్రాష్ట్రమునందమందరజనీకాంతావతంసంబుపె।
ల్లుగఁబ్రేల్చన్ బ్రసరించులాజలనఁబ్రాలుందారకానీకముల్॥ ౩౨౬.

టిప్పణము.

అశ్మంతము = పొయ్యి. భ్రాష్ట్రము = పెనము—స్వేదని.

క॥ గాసిలెనతిదీర్ఘతరో । చ్ఛ్వాసముసంశ్లేషవక్త్రసంఘటనముచే।
వాసిఁగనుచక్రమిథునము । భాసురసుకవిప్రబంధబంధురమగుచున్॥ ౩౨౭.

టిప్పణము.

దీర్ఘతరోచ్ఛ్వాసము = నిట్టూర్పు—గొప్ప పరిచ్ఛేదము. సంశ్లేషవక్త్రము = సంశ్లేషార్థముగల వృత్తవిశేషము—కూడినముఖము.

చ॥ కమలకుఱుంగసంచరణకారణలగ్నమరందలుబ్ధము।
గ్ధమధుపమాలికాకలితగాత్రముకోకనుమూర్తిముద్రఘూ।
ర్ణమఘనశాపవాక్యచయదండధరాతతచండపాశబ।
ద్ధముగతినొప్పెప్రాణదయితన్విడనాడితొలంగెనవ్వగన్॥ 3౨౮.

క॥ హిమకరదయితునొందుఱొక్కను । గమకమునన్వికచముఖవికాసముగలయా।
కుముదినికిరుపార్శ్వంబుల । భ్రమరంబులుదూతికాళిపగిదిందనర్చెన్॥ 3౨౯.

క॥ ఇనవిరహతాపదుఃఖిత । వనజవధూతిలకమపుడువారణఁబొగిలెన్।
ఘనకింజల్కవ్యాజం । బునహృదయముఁగఱఁచునధికముర్మురవహ్నిన్॥ 330.

సీ॥ (1) ప్రాచీలలాటసంభరితబంధూకప్రసూనచిత్రకచక్రసుందరంబు।
(2) లోకత్రయీజయోత్సేకమన్మథశుభప్రస్థానకలశాభిభాసురంబు।
(3) చటులదిక్కాంతాప్రసాధికాకరధృతాలక్తకపిండాభిలాలితంబు।
(4) యామినీరాజకన్యామణీహస్తసమాలోలమణికందుకాంచితంబు।
గీ॥ (5) రాజితోదయగిరిశిఖరప్రఫుల్ల । విపులమందారసుమగుచ్ఛవిభ్రమంబు।
పొలిచెజనలోచనోత్సవోజ్జ్వలవిభాభి । మండితంబగుశీతాంశుమండలంబు. 33౧.

క॥ చంద్రుఁడలలక్ష్మణాన్వితి । సాంద్రమహోదారరామచంద్రునిమతిని।
స్తంద్రానురక్తతారుఁగ । పీంద్రునిఁబలఁపించెఁదదనుహితగుణగరిమన్॥ 33౨.

క॥ వినుతింపరక్తమండలుఁ । డునుమృదుకరనికరసహితుఁడునువిబుధసదా।
వనధుర్యుఁడుశార్వరభే । దనచర్యుఁడునగుచురాజుదగెరాజనఁగన్॥ 333.

క॥ హిమకరమండలగతరా । గముక్షీణంబయ్యెవిరహికాంతాహృత్సం।
క్రమితమగుఁగరణిజనసం । భ్రమకరముగఁదోఁచెధవళిమంబమలరుచిన్॥ 33౪.

క॥ మారప్రేరితబహుదు । ర్వారవియోగానలంబువడిదగిలింపన్।
సారెరతిద్రవ్పస్ఫటికో । దారవ్యజనంబునాసుధానిధివెలసెన్॥ 33౫.

సీ॥ (1) భావసంభవసార్వభౌమసంభృతసముద్భాసితశ్వేతాతపత్రమనఁగ।
(2) మానితోదయశైలమానీంద్రహస్తప్రసంగతస్ఫాటికలింగమనఁగ।
(3) యామినీయమునాఝరాయస్థలసముజ్జ్వలసమంచితచాలపులినమనఁగ।
(4) ఘూర్ణితగగనమహార్ణవప్రోదీర్ణవిశాలలోలవళత్కుశంఖమనఁగ।
గీ॥ (5) చండతరకాలకాలోరగాండమనఁగఁ । గగనగంగాభవశ్వేతకమలమనఁగ।
వరచకోరతపఃఫలవర్యమనఁగ । చంద్రుఁడలరారెబహుకళాసాంద్రుఁడగుచు॥

క॥ లోకత్రయజయదీక్షా । స్తోకమనోజాభిషేకశోభితనవదూ।
ర్వాకలితరజతకలశము । జోకమ్ముగాంకుండుదోఁచెసురుచిరలీలన్॥ 33౭.

మ॥ ప్రమదామోహకమారవీరకృతదీప్యత్స్వారదామోఘపిం।
డమొతన్మార్ఘ్యవిభేదకాత్మభవచండప్రాసయుక్శాణచ।
క్రమొతద్భూభర్త్యభిమానహారకమహాకామభ్రమచ్చక్రబా।
ణమొనానొప్పెమ్ముగాంకమండలమురాణన్ కాంతినిస్తంద్రమై॥ 33౮.

శా॥ క్షీరాంభోనిధిమగ్నమున్బహుతరాక్షీణామృతాసారవి।
స్తారక్షాళితమాపయిన్మఱియుశ్వేతద్వీపసంస్థాపితో।
దారప్రాభవశోభితంబునగుచందంబొప్పలోకంబువి।
స్ఫారస్వచ్ఛసితప్రభంబొలిచెదీప్యచ్చంద్రికాసాంద్రమై॥ 33౯.

ఉ॥ అంతటరాకుమారకుఁడుహర్షమెలర్పఁగఁగాల్యకృత్యమా।
ద్యంతముఁదీర్చిమేలగుఫలావళినాకలిఁదీర్చిమాలికన్।
జెంతమహీజశాఖనటుజేర్చిసఖుండొనగూర్చునవ్వనా।
భ్యంతరసాలమూలకుసుమాస్తరణాంచితశయ్యనొయ్యనన్॥ 3౪౦.

ఉ॥ ధూర్తమ్ముగావళిందొలఁగఁదోలుమమిత్రుఁడుగావనిద్రసం।
సంపూర్తిసుఖంబెసంతటనభోజలజాకరసీమఁగాలకై।
వర్తకుఁడంధకారతరివర్యమునెక్కిచరించుచున్ రయ।
స్ఫూర్తిహరించుమత్స్యములబోలిక్రమంబుగమాసెఁదారకల్॥ 3౪౧.

చ॥ ప్రమదమెసర్చెనవ్యమధుపానకృతాదరపుష్పలిణ్ణినా।
దముశతపత్త్రిపుస్తకముదాలిచిదివ్యసరఃకృపీటపీ।
ఠమునఁబ్రభాతమౌనిప్రకటస్థితినధ్యయనంబొనర్చను।
త్తమమగుసామగానమహితంబయియొంతయుఁబాంథకోటికిన్॥ 3౪౨.

ఉ॥ రాజిలెనాసవార్థవిచరన్మధుపాళిసముల్లసద్రజో।
రాజిమధుప్రపంకిలవిరాజితవారిరుహాలవాలవి।
భ్రాజితటాకభూస్థలులరాత్రికృషీవలుఁడుంచునాతమో।
బీజసమాజవిభ్రమముపెంపువహించిసమంచితంబుగన్॥ 3౪3.

చ॥ భ్రమరవినీలదీధితులుభాసిలెనప్పుడుభానురాకసం।
భ్రమమునశుక్రదూతదెలుపన్మధుసంగతినోలినంబుజా।

స్య మువికసింపకోకిసకియ స్వైసఁగూడి సరోగృహంబున।
న్గమలిని సంతరించినసుగంధయుతాగరుధూపమో యనన్॥ ౩౪౪.

చ॥ అలహరిరాకసన్ గలఁగునట్టిత మోవిభుఁగూడియామినీ।
లలనపలాయనాచరణలాలసబుద్ధివిశాలరోదసీ।
నిలయునభోంగణస్థరజనీకరభాస్వరులూఖలంబునన్।
జలిదికి నైనడింపవెలిఁజల్లినబియ్యముఁబోలెఁదారకల్॥ ౩౪౫.

టిప్పణము.

రోదసి = భూమ్యాకాశమధ్యప్రదేశము. ఉలూఖలము = రోలు పోలెను = అనుకరించెను (ఇది సమాపకక్రియ.)

క॥ వ్రాలెనుడుగణముప్రాతః । కాలకపిప్రచలితాంధకారతమాల।
వ్యాలోలదశదిశాశా । ఖాలూనపతత్ప్రసప్రకాండముకరణిన్॥ ౩౪౬.

ఉ॥ రాజిలెనన్నుఁగూడిద్విజరాజుక్షణక్షణవిస్ఫురత్కళా।
రాజియుసత్ప్రథక్రమవిరాజియునై యదెవారుణీస్పృహం।
దేజముఁగోలుపోయిచలిదేరియధోగతి నేగెనంచుఁబ్రా।
చీజలజాక్షినవ్వెననఁజెన్నువహించెనుషఃప్రభావళుల్॥ ౩౪౭.

క॥ స్ఫురదరుణతరుణకేసరి । ఖరనఖరవిదారితాంధకారమదాంధ।
ద్విరదతనురక్తపూరము । కరణినుషస్సాంధ్యరాగకాంతులువెలసెన్॥ ౩౪౮.

క॥ భూరినభస్సరసింగల । తారాకుముదములుగోయుఁదమకంబునవే।
సారెరవిజాచుఁగరముల । తీరునవొప్పారెఁగిరణదీధితులుదివిన్॥ ౩౪౯.

క॥ ఉదయాచలకూటాంచిత । విదితజపాకుసుమకాంతివిభ్రమవిభవా।
స్పదమగుచుసాంధ్యరాగము । మదిముదమొదలించెవిబుధమండలికెల్లన్॥ ౩౫౦.

క॥ త్వంగత్తుంగపతంగతు । రంగఖురాగ్రాహతాబ్జరాగపరాగా।
భంగరుచివిభ్రమంబుబొ । సంగఁబ్రభాతారుణంబెసంగెన్‌జదలన్॥ ౩౫౧.

క॥ ప్రకటోదయగిరిగతనై । రికనిర్ఝరవారిపూరరీతినగెన।
త్యకలంకసాంధ్యరాగా । ధికదీధితిప్రాణిలోకదృక్పర్వముగన్॥ ౩౫౨.

క॥ తారాతండులశబలిత । భూరినభోంగణచరద్విభూషితసమయో।
దారకృకవాకుచూడా । కారభ్రమఁగొల్పెనుదయకాంతిచయంబుల్॥ ౩౫౩.

సీ॥ లలితదినారంభలక్ష్మీకరాగ్రదీవ్యన్నవ్యరత్నదర్పణమనంగ।
వరనభఃపురమహాద్వారగోపురసముత్తంభితాయతహేమకుంభమనఁగ।
ప్రాచీలలాటసంభరితకుంకుమరజఃస్ఫీతచిత్రకబిందుచిత్రమనఁగ।
పూర్వాచలాభోగభోగీంద్రసంధ్యారుణస్ఫటాస్ఫుటితరత్నంబనంగ।
గీ॥ చిత్రసంధ్యారుణామోఘసూత్రసంఘ। సంగ్రథితపూర్వదిగ్వధూస్వర్ణకాంచి।
సంఘటితదివ్యదీనారచక్రమనఁగ। బాలరవిబింబమద్భుతభంగిఁదోఁచె॥ ౩౫౪.

టిప్పణము.

ఉత్తంభిత = ఎత్తఁబడిన, చిత్రక = తిలకము, స్ఫటా = ఫణము, సంగ్రథిత = కట్టఁబడిన, దీనారచక్ర = కాంచనకింకిణీసమూహము.

క॥ అరయనారయుసంహృత। తారకుఁడునుగోపతిత్వదర్పితుఁడునునై।
వారిజసఖుఁడుప్రతాపో। దారతఁగడుశక్తివజ్రధరులహసించెన్॥ ౩౫౫.

టిప్పణము.

సంహృతతారకుఁడు = పోఁగొట్టఁబడిన నక్షత్రములు గలవాఁడు సంహరింపఁబడిన తారకాసురుని గలవాఁడు. గోపతిత్వ = కిరణాధ్యక్షత్వము—స్వర్గాధిపత్యము. శక్తివజ్రధరులు = శక్తినిధరించిన కుమారస్వామిని, వజ్రమునుధరించిన యింద్రుని.

ఉ॥ అంతటనిద్రలేచివసుధాధిపసూనుఁడుకాల్యకృత్యమా।
ద్యంతముదీర్చిమాలికయుఁనాత్మసఖుండునుదానునవ్వనా।
భ్యంతరదివ్యభూరుహఫలాదులనాకలిఁదేర్చిహర్షమ।
త్యంతమెలర్పఁగాసుమపురాభిముఖుండయిపోయిముందటన్॥ ౩౫౬.

మ॥ భువిశ్రీశైలేంద్రపురీశరాఘవపదాంభోజద్వయీచింతనో।
త్సవరొద్దంహనుమంతరాయకృతచిత్రశ్లేషహృద్యాంధ్రవా।
సవదత్తాఖ్యమహాప్రబంధమునశశ్వన్నవ్యసారస్యసం।
స్తవనీయంబగుపూర్వభాగమిదియాచంద్రార్కమైపొల్పగున్॥ ౩౫౭.

సీ॥ అమలాగ్రజన్మమాహాత్మ్యవిశేషంబు సద్వశిష్ఠసగోత్రసంభవంబు।
ఘనమగు నాశ్వలాయనసూత్రకథనంబు బడగనాడన్వయప్రాభవంబు।
మాన్యమౌనద్వైతమతనిశ్చితత్వంబు సతతతత్త్వవిచారసంభ్రమంబు।
పూర్ణాంధ్రవిద్యాప్రవీణతాధిక్యంబు కవితారసజ్ఞానకౌశలంబు।
తేజరిలు న్యాయవాదివృత్తిక్రమంబు । విబుధజనతావిధేయతావితరణంబు।
గలిగి వినయవివేకము ల్వెలయు నలరు । వాఁడ హనుమంతరాయాఖ్యవరలువాఁడ॥ ౩౫౮.

క॥ ఘనగిరిసంస్థానంబన । మును బహువిఖ్యాతి గాంచి మునుకొని ప్రకృతం।
బున్ఁబెనుగొండసమాఖ్య । విను తింగను పురమునందు వెలయుచునుందున్॥ ౩౫౯.

ఉ॥ అండజవాహదివ్యచరణాంబుజభక్తిరతుండు సంచితా।
ఖండసదా నిరామయసుఖప్రదయోగయుతుండు సత్కృపా।
మండితదానధర్మపరమానసవృత్తిహితుండు కృష్ణరా।
యుండన నొప్పు మజ్జనకుఁ డాతతపూర్ణశతాయురున్నతిన్॥ ౩౬౦.

చ॥ అమలినభక్తి నాతనిని హర్నిశమున్ గనుచున్న సత్పథ।
క్రమమునఁ గొల్చి సాధ్వి యనఁ గాంతల నెంతయు వాసిఁ గాంచియు।
త్తమనిరతాన్నదానకలితస్థిరవృత్తి రహించి మించి సా।
కమ్మ యన నొప్పు మజ్జనని యంచితదీర్ఘ సుమంగలీస్థితిన్॥ ౩౬౧.

శా॥ ధాత్రీమండలమండనాయితసమస్తస్త్రీణసమ్మాన్యతా।
పాత్రీభూతసుశీలసువ్రతసురూపప్రాభవోద్దామ ; స।
ర్వత్రస్తుత్య పతివ్రతానుగతభాస్వత్పుణ్యనిస్సీమ ; సా।
విత్రీనామ దనర్చు మద్దయిత సావిత్రీపవిత్రాకృతిన్॥ ౩౬౨.

క॥ కలరార్వురన్నదమ్ములు । నలువురు భగినీజనములు నాకున్ మతినా।
కిలఁగలరు సుతులు మువ్వురు । లలి నొకకూఁతురు సురూపలావణ్యనిధుల్॥ ౩౬౩.

క॥ అందఱు పితృహితమానసు । లందఱు బహుసదయహృదయ లందఱు నిరతా!
నందితబుధబృందులు మఱి । యందఱు హరిభక్తియుక్తి నందఱు వారల్॥ ౩౬౪.

క॥ ప్రకటమగు శాలివాహన । శకమునఁ గుల శైల చంద్రసామజశశిసం।
ఖ్యకుఁ గలమన్మథసమశా । ర్తికమాసమునందు విస్తరించితి దీనిన్॥ ౩౬౫.

సమాప్తము.

శ్రీ శ్రీధరాయనమః.

శ్రీమన్మహారాజరాజశ్రీ వేంకటగిరిపురాధీశ్వరులగు

శ్రీ రాజగోపాలకృష్ణయాచేంద్రబహద్దరు, కె. సి. ఐ. ఇ.

మహారాజాగారి కంకితంబుగా

శ్రీబొబ్బిలిపురాధీశ్వరులగు

మహారాజరాజశ్రీ రాజా శ్రీ వేంకటశ్వేతాచలపతి

రంగరావు బహద్దరు, కె. సి. ఐ. ఇ.

మహారాజావారి యాస్థాన విద్వత్కవులలో నొకరగు

బ్రహ్మశ్రీ

మండపాక పార్వతీశ్వర కవీశ్వరులచే

రచియింపఁబడిన

# శ్రీకృష్ణాభ్యుదయము.

ఇది

శ్రీ వేంకటగిరి పురాధీశ్వరులచే నముద్రితగ్రంథచింతామణియందుఁ

ప్రకటితమైనదై పసుప[illegible]డి

నెల్లూరు పురమతల్లి నుల్లసిల్లు

విక్టోరియా, రంగనాయకీవిలాస, రమానిలయ

ముద్రాక్షర శాలలలో ముద్రితమై

అముద్రిత గ్రంథచింతామణి పత్త్రికాధిపతియగు

పూండ్ల రామకృష్ణయ్యచేఁ బ్రకటితమయ్యెను.

రమానిలయ ముద్రాక్షరశాల.

నెల్లూరు.



1—5—03.

# ప్రకటనము.

ఈ గ్రంథము సంకితముంబొందినట్టి మహారాజ రాజశ్రీ- ఉముదే- రాజే- రాజసా- రాజా- శ్రీ- వెలుగోటిరాజగోపాల కృష్ణయాచేంద్ర బహద్దరు పంజహజారిమన్సబు దారిత్యాదిబిరుదాంకితులగు శ్రీ వేంకటగిరి ప్రభువుగారు దీనిని మాపత్త్రికయందుఁ బ్రకటితమగుటకుఁగా ననిచిరిగావున ముద్రింపించి ప్రకటించితిమి. ౧౮౬౭ సం॥ ౨౦ రు ఆక్టు ప్రకారము దీని రిజిస్టరుచేయించి యున్నారము. ఇఁక నెవ్వరు దీనిన్ముద్రింపఁగూడదు.

ఇట్లు

నెల్లూరు
౧-౫-౦౩

పూండ్ల రామకృష్ణయ్య,
అముద్రితగ్రంథచింతామణ్యధిపతి.



శ్రీ శ్రీధరాయనమః

# శ్రీ కృ ష్ణా భ్యు ద య పీ ఠి క.

1. ఈ గ్రంథమును (శ్రీకృష్ణాభ్యుదయమును) మండపాక పార్వతీశ్వర కవిగారు విరచించిరి. వీరుబొబ్బిలి సంస్థానాస్థానంపు విద్వాంసులలో నొకరుగానుండి దీనిని శ్రీవేంకటగిరి పురవరాధీశ్వరులగు మహారాజరాజశ్రీ శ్రీమద్రాజగోపాల కృష్ణయాచేంద్రులవారికిఁ గృతినిచ్చిరి. పార్వతీశ్వరకవీశ్వరులు వారిగ్రంథమును 1895 సరియైన మన్మథ సంవత్సరమునఁ బ్రారంభించి యతిశీఘ్రకాలములోఁ బూర్తిఁజేసిరి. దీనింగ్రంథకర్తగారు రాజునాజ్ఞపై రచియించినట్లుగా "నాత్మపర్యాయచర్యాసపర్య" అనెడు హరిహరేశ్వర శతకమున వ్రాసియున్నారు. ఈ హరిహరేశ్వర శతకమును మేము ముద్రింపించియున్నారము. దీనియందుఁ బార్వతీశ్వర కవిగారి చారిత్రమంతయునగపడును. అద్దానింబార్వతీశ్వరులవారే విరచించియున్నారు. దానిం బఠించినవారికెల్లఁదత్కవిసింహుని జీవితచరితమంతయుఁగరబదరాయమాణమనియెంచియిందుఁబెంచి లిఖింప విరమించితిమి. అయిననించుక దీనలిఖింప మనసయ్యెడు.

2. ఈకవి బ్రాహ్మణుఁడు. వైదికి. విశాఖపట్టణముమండలములోఁజేరినబొబ్బిలికి సమీపముననున్న పాలతేరను గ్రామము కాపురస్థలము. వీరు 1833 సంవత్సరము జూన్ తే 30 దీన జన్మించి 1897 సంవత్సరము జూన్ తే 29 దీనఁ బరమపదించిరి. వీరు తమ పంద్రెండవ వత్సరము మొదలుగ ననఁగా 1845 సంవత్సరమునుండి కవిత్వము వ్రాయుచువచ్చిరి. అపుడు "కవితాలతాంకురమును" నాకఘంటలోఁగాఁబంతగించి వ్రాసియున్నారు. ఇదియేవారి యాదికవిత్వము. (చూడుఁడు, హరిహరేశ్వర శతకము- పుట 29.) ఇఁక వారియంత్య కవిత్వము 1897 సం॥ జూన్ తే 25-26 27-28.దులలో మృత్యుంజయ స్తవమునొనరించి 35 పద్యములువ్రాసి తే 29 దీనఁ గాలధర్మమునొందిరి. ఈపద్యములన్నియును, "మృత్యుంజయునకునమస్కరింతుఁదరింతును" అనిమకుటముగానుంచి మృత్యువు నోటిలోదూరునపుడు వ్రాయఁబడినవి. (చూ, హరిహరే, పుటలు 30,31,32.) ఇఁకవారి జీవితములో వారువ్రాసిన పద్యములకును మాలికలకును, దండకములకును లెక్కయే లేదు. పోయినవి పోఁగా నిపుడువారి గ్రంథములు 84 మిగిలియున్నవి. వీనినామములన్నియు హరిహరేశ్వర శతకమునఁ జేర్కొనఁబడియున్నవి. వీరిప్రతిగ్రంథమును గ్రంథములోని ప్రతిపద్యమును రస

పుష్టిగలిగియుండును. చప్పిడికవనమన నెట్టిదో వారెఱుఁగరు. ఇందులకు నిదర్శనముగా వారిగ్రంథములలో "గోపాలకృష్ణ" శతకములోని పద్యములఁ గనుఁగొన్నఁజాలు. ఆ శతకము ముద్రితముగానందున గ్రంథకర్తయొద్దనే ఖిలమైనదఁట. దానికై మేము గ్రంథకర్త జీవించియుండఁగానే ప్రయత్నించితిమిగాని కాగితములు ఖిలములైనవనియు దానియందలి యొకకొన్ని పద్యములు మాత్రము గపడినవనియు వానినిమాకంపిరి. వానిని 1893 సం॥ జూన్ జూలై నెలల మయూఖములలోఁ బ్రకటించియున్నారము. ఆపద్యములనేయిపుడీ శ్రీ కృష్ణాభ్యుదయమున 53వ. పుటయందు 274 275. 276. 277. పద్యములుగా గ్రంథకర్తగారు చేర్చియున్నారు. ఇదికవులకు నైజమే. భారతకవులు నిట్లెతమపద్యముల నొకచోనున్నవానిని మఱియొక్కచో నెక్కొలిపియున్నారు. వారిపద్యములకు వారధికారులు. ఇది గ్రంథచౌర్యము గాదు.

3. ఈ గ్రంథమునకుఁ గృతిపతియగు శ్రీ వేంకటగిరి ప్రభువుగారు తామీ గ్రంథము నంకితము నొందినమాపత్రికానామమును సార్థకపఱుపఁ దలంచియో, లేక, మాకుఁ బార్వతీశ్వరకవీశ్వరులవారియెడఁ గలుగు ననురాగ మెట్టిదో దీనినిమాపత్రికలోఁ బ్రకటించుటకుఁగా 9-2-01నఁ బంపిరిగాన వారియాజ్ఞ శిరసావహించి మార్చి నెలనుండి ముద్రణమునకుఁ బ్రారంభించినను 1901 1902 సంవత్సరములలో బత్రికచక్కఁగఁ బ్రకటింపఁ బడనందున నింతకాలముగడిచినది.

4. వేంకటగిరి సంస్థానము ప్రప్రథమమునుండి విద్యావిషయపుఁజర్చలలోఁ బేరెన్నికఁగన్నది. బమ్మెరపోతనామాత్యుఁడాదిగా నేటిదనుక లెక్కలేని కవులకిక్కయైన సంస్థానమిదియొక్కటియేయని నొక్కి వక్కాణింపవలసియున్నది. విద్వత్సంస్థానమనియే దీనిం బిలువఁదగు. సంస్థానపుఁ బ్రభువులు విద్వత్ప్రభువులే గదా. రెంటూరి రంగరాజుగారీసంస్థానపుఁ బ్రభువులలో నొక్కరికై భానుమతీపరిణయము నంకితమిచ్చియున్నారు. ఆ కవనముం జూచినచో నచటి ప్రభువులకెట్టి కవనముపై యభిరుచిగలదో తెలియనగును. ఎప్పటిసంగతియో యిప్పుడేల. ఈ శ్రీ కృష్ణాభ్యుదయ గ్రంథకర్తగారు వ్రాసినట్టి "రాధాకృష్ణసంవాదము" అను శ్రీ రాజగోపాలకృష్ణయాచేంద్రులవారి పట్టాభిషేక మహోత్సవ వర్ణనాగ్రంథముం గన్న నది హస్తామలకమగును. తామరతంపరంబోలి యీసంస్థానమిట్లే నెగడవలయునని శ్రీ జగదీశ్వరుని వారకప్రార్థించుచుందుము. మఱియు వాల్మీకిరామాయణమును జక్కఁగఁ దెలిఁగించి తమతండ్రిగారి కంకితముం జేసిన గోపినాథము వేంకటకవీంద్రునిచేతనే వీరును మాఘకావ్యముం దెనిఁగింపించి యంకితముంబొందియున్నారు. అది 1904బి యే పరీక్షా పఠనీయగ్రంథముగ వన్నెవాసింగన్నదనివిని ముదమందుచున్నారము.

౫. ఈసంస్థానపువారు గ్రంథముల నెంత శ్రద్ధతోఁ జదువుదురోయని విన్నఁ గోరుదురేని యించుక వినుఁడు. ఈ గ్రంథమున 86వ పద్యమున నేనవబంతియందు "దౌల్యమువహించి" అనుటకుఁగా "దౌత్యమువహించి" అనిమేముపొరఁబాటున ముద్రింపించి మా మాససంచికను వారికిఁ బంపినవెంటనే దానింబఠించి యర్థము గామి సంశయించిగాఁబోలు, మా పేరనిట్లుగా వ్రాయించినారు. ఎట్లన:—

"86 వ సీసపద్యమున 'దౌత్యము' అని మూలమందేయున్నదా? ఉన్నచోనెట్లర్థముంజేసి ముద్రింపించితిరో తెలుపవలయును. దౌత్యముతప్పేని ధౌర్త్యమా, తౌల్యమా, యెట్లుండవలయునని సమన్వయించితిరో తెలియఁగోరి శ్రీ శ్రీయేలిన వారు సెలవిచ్చిరిగాన విన్నవించితి.

ఇట్లు
తిరుమలసెట్టి జగన్నాథము."

వేంకటగిరిటౌ౯ }
1- 6- 02. }

అని వ్రాయించినారు. చూచితిరా, శ్రీప్రభువుగారి భాషాభిమానము. తమకున్న రాచకార్యంపుఁబనులయొత్తడిలో నిట్టిచిట్టివిద్యావిషయంపుఁ బత్త్రికంగరమునం బట్టి పఠించియందలి లోపాలోపములఁ దత్తదధిపతులకుఁ దెలుపునట్టి రాజసింహులు మాపత్త్రికకు నిత్యపోషకులుగ నున్నారని మేమువిజ్ఞాపిగుచున్నారము. ఒకవీరే కాదు. వీరిసోదరులగు శ్రీవేంకటకృష్ణయాచేంద్రులవారును సంతతము విద్యావినోదములతోనే కాలముగడుపుచుందురనుటకును మాజనవరి సంచికయే సాక్షిగదా.

౬. కృతిపతులవలెనే కృతికర్తలగు పార్వతీశ్వరశాస్త్రులవారికినిమాయందు నెక్కుడనురాగముగలిగి మాపత్త్రికకు వారెన్నియో మాలికలు వ్రాసిపంపియున్నారు. వానింజదివి యానందింపవలయునేగాని, యవి రసపుష్టి గలవియని యెంతవర్ణించినను వ్రాయనలవిగాదు. మా కోరికపైవారు ప్రబంధసంబంధ బంధనిబంధన గ్రంథమును వ్రాయఁగా దానిన్మేము మాపత్త్రికలోఁ బ్రకటించియున్నారము. మఱియు మా మాటను వారువమ్ముచేయక తమచారిత్రము ఛందోబద్ధముగ "నాత్మపర్యాయచర్యాసపర్య" అను నామాంతరముగల హరిహరేశ్వర శతకమువ్రాసి మాకిచ్చిరి. ఆ శతకమునందు వారు మమ్ముంగూర్చి వ్రాసినపద్యముల నీ గ్రంథమందె మఱియొకచో విషయసూచికకుఁ దర్వాతఁ బ్రకటించియున్నారము. ప్రబంధ బంధములను గూర్చివారి ట్లాగ్రంథమున నేవ్రాసియున్నారు.

సీ. శ్రీమత్పినాకినీ సింధుతీరమున భాసిల్లుపెల్లూరిలోనుల్లసిల్లు
పూండ్లవంశంబునఁ బొడమియాపుడమిలోఁ గవిపక్షపాతియన్ఖ్యాతివడయఁ

నడఁగి ‘యముద్రితగ్రంథచింతామణి’ యనుపత్రికను బ్రకటన మొనర్చు
శ్రీరామకృష్ణాఖ్యులేఁ దనర్చు సుధారకవిగారి వ్రాసిన కారణమున
మహితబొబ్బిలిపురినుండు మండపాక। పార్వతీశ్వరకవి కతిపయకవిత్వ
బంధములకోకలక్షణగ్రంథమిపుడు। క్రొత్తగా నేర్చినట్లానగూర్చెనిట్లు॥

చ॥ సుకవులు బంధలక్ష్యము లెచూపిరిగాని తదస్త లక్షణం
బొకరును జూపరైరని తమద్ధరణార్థము పూండ్లరామకృ
ష్ణకవిదృఢప్రతిజ్ఞుఁడు రసజ్ఞుఁడు గావునఁ బూనియుండెఁగా
తుకమునఁ బార్వతీశ్వరుఁడు దోడ్పడఁ దత్ఫలసిద్ధికబ్రమే॥

7. ఈగ్రంథమున రేఫ శకటరేఫలకు సాంకర్య మగపడకున్నను నీగ్రంథకర్త గారావిషయమున కిష్టపడియున్నట్లుగ వారి రాధాకృష్ణ సంవాదమున నాల్గవ యాశ్వాసమున 62 వ పద్యపుఁ డీకలో నగపడుచున్నది. సూత్రమున "రయోస్తు నిత్యంస్యాత్" అని వ్రాసినవా రేల సాంకర్యముం జేసియుందురు? ప్రయోగములగపడుచున్నవందురేని వానిం దద్గ్రంథకర్తయే వ్రాసినాఁడనుటకు వారికేఁ గల ప్రబల నిదర్శనములేవియో తెలియవు. అట్టి ప్రయోగములు పెక్కులగపడుచున్నవన్న "గతానుగతికోలోకః" అని యున్నదిగదా. దీనినొప్పకున్న నీమార్గము "ఒజ్జలపుచ్చకాయం" బోలియుండుంగదా. అట్లేల భావింపవలయునో విచారింపుఁడు. అట్లే యికారసంధిం గావించి దానికిఁ గొంత సమాధానము నీగ్రంథకర్తగారు రాధాకృష్ణసంవాదమున నాల్గవయాశ్వాసమునందే 50 వ పద్యమున "మింటనుండిం టికిక్" అను సంధిం గూర్చి విశేషముగాఁ జర్చించియున్నారు. పూర్వకవులలో నేమి యిప్పటివారిలో నేమి యిట్లు భిన్నాభిప్రాయము గలిగి యుండుట నైజము గానే యగపడుచున్నది. ఏది యెట్లున్నను లక్షణమునకును రసోజ్జృంభణతకును సంబంధము లేదు. చేమకూర వేంకటకవిగారి విజయవిలాసము దీని కుదాహరణము. అందుఁ గొన్ని లక్షణ విరుద్ధములున్నను పద్యము లమృతరసమును జిమ్ముచుండును. శ్రీ పార్వతీశ్వరులవారికవిత్వములో నభిప్రాయభేదము గల మార్గములు కొన్ని యగపడినను గవనము ముద్దులు మూటగట్టుచుండును. ఈగ్రంథమున 16-17-68 99-107-154-171-173-274-275-276-277-308 మొదలగు పద్యములం జదివినచోఁ గవిత్వములోని లావణ్యము శ్రుతి గోచరమగును. అట్లే పీఠికలోని 14-15-20 పద్యములను సహః పఠించి సంతోషాంబుధి నోలలాడంగోరుచున్నారము. రాధాకృష్ణ సంవాదము నుండియుఁ గొన్ని పద్యములవారి కవనలావణ్యముం జూపుటకై ప్రకటింతుము:—

సీ॥ మీ ప్రపితామహుండై ప్రసిద్ధుండగు లక్ష్మణాఖ్యుఁడహీన లక్షణుండు
పాలించి తానన్నమాటఁ దప్పని మేటి వరసుమిత్రానంద వర్ధనుండు
విజయ రామావనీ విభుఁ డగ్రహారాఢ్యభూదేవతా జాతిపోషణమున
శ్లే. నునుపఁగ భూతనయోక్తి వశంబునఁ బుణ్యాజనాధీనముల నానర్చి
విభుని వలని భయంబున విడిచెఁ దనువు। దానిఁ గాంచి విభుండు ఖేదము వహించి
యలవిరోధిపడంచి శ్రీ నధిగమించి। లక్ష్మణకుమార చింతఁ గోల్పరచెఁ గాడె॥

సీ॥ అనియంత నిలువక వినియంత పలుకులు వినియంతకంతకు విస్మయమెనయఁ
జని యంత రాయ మొందనియంతిపురమునఁ దీని యంతరంగంబు దనియ నిలుపు
మనయంత వారము మనయంత మనమింత మనయంతర మెఱింగి మసలవలదె
నిజయంత్ర చింతమాని జయంత రథవాజి గజయంత లచ్చరల్ గలసి రాఁగ
రాగమున ఘాసురాగ సురాగ సుమప। రాగవాసిత వనుల నిరాగసుండ
వగుచు నిర్భరముగ సుఖివగుట మాని। మానివయ్యున్మానివై యిటిది మానితంబె॥

ఉ॥ యాచకకల్పవృక్షము క్రియాచతురుండు రిపుక్షితిపాల్ష్మమా.
యాచణశేముషీవిధి నయాచరణాచరణుండు సద్విధే
యాచలమానసుం డురుదయాచతురాస్యగురుండు రూపధే
యాచమిత స్మరోజ్జ్వలుఁడు యాచమపేంద్రుఁడు మర్త్యమాత్రుఁడే॥

ఉ॥ చల్లని మానసంబున నెసంగుచు నిర్మలపక్షపాతియై
యెల్ల ద్విజవ్రజంబు నుతియింపఁ బయోంబుగతిన్ గుణాగుణం
శ్లే. బుల్ల ఘుకీర్తి నేర్చి తగవున్ తగఁ దీర్పఁగ నేర్చి భూమిభు
త్కల్లజ రాజహంసమనఁగా భవదగ్రసుతుండు రాజిలున్॥

ఉ॥ వారిప్రసన్న జీవనత వారియ వారిత పావనత్వమున్
వారిసుశీతలత్వమును వారిజగత్పరిసేవ్యవృత్తియున్
శ్లే. వారిసముద్రసత్వగతి వారిసశైవలసత్క్రియాప్తియున్
వారిప్రభూత గౌరవము వారికపీడ్యత వారికేతగున్॥

మ॥ కడియాలంబున వైరులౌ దురను చుంగట్నంబుగా జాళువా
కడియాలంబు డుకం గరంబులకలంకారంబుగాఁ దాల్చియు
క్కడియాలంబున నింతయొప్పునె యనంగాఁ జాలు మెప్పూనిపె
క్కడియాలంబుల పాజు రాజు నెదుటన్ సాశ్చర్యచర్యం దగెన్॥

క॥ ఎంతటిమతిమంతులకును । మంతులుగనవచ్చుఁగృతుల మహిఁగవన శ్రీ
మంతులు సామంతులు ధీ । మంతులు మంతులుదొరంగి మంతురు గుణముల్॥

క॥ నాతీయేమనిచెప్పుదు । నాతీరున నగరువెడలు నపుడు నృపుఁడు నా
నాతీర్థప్రజగన గణ । నాతీతోత్సవమొనర్చెనదియెట్లన్నన్॥

క॥ రాజాగమనమువేళన్ । క్ష్మాజనులకు సకల శకున సంతతిగల్గెన్
రాజాగమనమువేళన్ । క్ష్మాజనులకు సకల శకున సంగతిగాదే॥

క॥ యమునాతరంగిణీతో । యమునాఁదమమమరె నచటునగు హంస నికా
యమునాఁదగె నుడుసముదా । యమునాఁటిదినాంతదీపికావళిలేవన్॥

క॥ ఘనచంద్రహాసరుచులం । గనితగెనారాచకోరికలనన్ జగముల్
ఘనచంద్రహాసరుచులం । గనితగె నారాచకోరికలనం దగదే॥

క॥ అవనీతలావతీర్ణం । బవనీ పావకచతుర్థ తనయుండగు శ్రీ
నవనీతకృష్ణవిభుమా । ర్దవనీతులరీతులెన్నఁ దరమే మాకున్॥

క॥ దేవరసజ్జమనోజ్ఞుఁడు । దేవరతొలుపట్టి కృష్ణదేవుఁడ యగుఁగా
దేవరగుణగరిమనువసు । దేవరసేంద్రుఁడని మిము నుతింపఁగవలదే॥

(ఇట్టివి దివ్యమైన పద్యములున్నవి- చూ, హరిహారే, పుటలు 21-22-23,)

8. శ్రీ పార్వతీశ్వర కవీశ్వరులవారి కవనాదులనుగుఱించి యనేకులు సదభిప్రాయములఁ బ్రకటించియున్నారు. వానినెల్ల నిటఁ బ్రకటించుటకు స్థలముసాలదు. అయిన నట్టివానిలో శ్రీరావుబహద్దరు, కందుకూరి వీరేశలింగముపంతులవారును, మచ్చ వేంకటకవిగారును, వ్రాసి ప్రకటించియున్నట్టి యభిప్రాయములమాత్ర మిచ్చుట స్థలముసాలమి నీగ్రంథమునకుఁ గట్టకడట ముద్రింపించి యుంచితిమిగానఁ బాఠకులెల్లరు వానిం జదువఁ బ్రార్థితులు.

9. ఇందుఁ గచభార, కుచభార, కటిభారాది వర్ణనలు మచ్చునకైన నగపడక కేవల కథాప్రవాహమే ప్రసరించుచుండుటంగాన యూనివర్సిటీవారు దీనిం బ్రవేశపరీక్షకుఁ బఠనీయగ్రంథముగ చేర్పఁదలఁచి, కృతిపతికిని, గృతికర్తవంశజులకును, గృతిం బ్రకటించినవారికిని మోదముఁ గలుగఁజేయుదురుగాత.

ఇట్లు
పూండ్ల రామకృష్ణయ్య,
అముద్రితగ్రంథచింతామణ్యధిపతి.

1-5-03
నెల్లూరు.

శ్రీ కృష్ణాభ్యుదయము నందలి

# విషయసూచిక.

# ప్రకటన.

సీ॥ ప్రకృతమ ముద్రిత గ్రంథచింతామణి
పత్త్రికాధిపతినై పరఁగు పూండ్ల
రామకృష్ణామాత్యరత్న మకృత్రిమ
మిత్రమై మిగుల నామేలుఁ గోరి
మచ్చరిత్రంబుఁ దానచ్చువేయఁదలంచి
పలుమాఱు జాబులు పంపఁజొచ్చి
నను నిపు ప్రేరేచి నాచేతనే నా చ
రిత్ర వ్రాయించి యామిత్రునకిపు
డంపఁబూనినకతన జన్మాదిషష్ట
వత్సరంబుల చర్యసే వ్రాసినాఁడ
నిదె నిజమ్మని నమ్మింపుమెల్ల ప్రజల
హరిహరేశ్వరదేవ మహానుభావ॥

సీ॥ ఆసేతుశీతలాంత భూమాలవేల
కొలఁదిగా మిత్రులు గలరుగాని
పూండ్లకులామృతాంబుధిచంద్రుఁ డగు రామ
కృష్ణకవీంద్రుఁ డకృత్రిమాను
రాగసాంద్రుండయి శాకపాకలుదర్శ
నస్పర్శనంబులెన్నఁడును లేక
యున్నను మిగులఁ బ్రసన్నుఁడై నాచరి
త్రధరిత్రినిక శాశ్వతముగ నిల్చు
మాడ్కి ముద్రింపఁ దలఁచి పల్మాఱుఁ గోరె
నిట్లుగోరినవారు లేరితఁడు దక్క
నితని సంకల్ప మీడేర్చి యేలుకొనుము
హరిహరేశ్వరదేవ మహానుభావ॥

ఇట్లు

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

శ్రీ బొబ్బిలి సంస్థానాస్థానకవి.

27—3—95.

# శ్రీకృష్ణాభ్యుదయము.

## శ్రీమన్నండపాక పార్వతీశ్వర కవీశ్వర విరచితము.

### ఏకాశ్వాసము.

---

అవతారిక.

ఇష్టదేవతాప్రార్థనాపూర్వక మంగళాచరణాదికము.

శా॥ శ్రీలానీలలు మేలుమేలన సముజ్జృంభత్సమాలింగన
శ్రీలాభంబుల నెక్కుటం దనుపుచుం జెన్నొందు వెన్నుండు సు
శ్రీలుండై వెలుగోటివంశమణియౌ శ్రీరాజగోపాల కృ
ష్ణేలాపాలకమౌళికీవుత మనోభీష్టంబు లెల్లప్పుడున్॥ 1.

శా॥ శర్వుం గొందఱు శౌరిఁ గొందఱు సరోజాతాయతాక్షుల్ దమిన్
సర్వావస్థలఁ గొల్చునట్లు దను భాషాయోష నామాకృతుల్
వేర్వేఱన్ గొనికొల్వ నుబ్బువిధి తీవిన్ రాజగోపాల కృ
ష్ణోర్వీపాలవరున్ నిరామయచిరాయుశ్శ్రీయుతున్ జేయుతన్॥ 2.

మ॥ జనులాత్మీయసమత్వమున్ బొగడఁగా సామేన నామేనకా
తనయన్ స్వర్ధునిమూర్ధమందునిచి తద్వంద్వంబునం దేకనం
దనుఁగాస్కందునిఁగాంచిమించు శివుఁ డుద్యద్రాజగోపాలకృ
ష్ణనృపాలాగ్రణికిచ్చుతన్ బహుముఖాంచచ్ఛాశ్వతైశ్వర్యముల్॥ 3.

*సీ॥ తనకుసాజంబుగాఁ దనరుచాంచల్యంబు చంచలాక్షుల దృగంచలములందుఁ
దనకునైజంబైన దయితవక్షస్థలి కొమ్మల రతివిశేషమ్ములందుఁ
దనకుబీదలపట్లఁ దనరువైముఖ్యంబు కలికిమిన్నల పాలయల్కలందుఁ
దనకుసాదులపట్లఁ దనరుకాఠిన్యంబు కుంభికుంభస్తనీ కుచములందు
నునిచి యనుచితవృత్తులిట్లునిరసించి। సరసతరహించి సరసిజసద్మపద్మ
పద్మజాగ్రణియగుకృతిభర్తయింట। నిలుకడవహించినిరతంబునిలుచుఁగాత 4.

---

పాఠాంతరము.

*సీ॥ తనచంచలత్వంబు వనచరాగ్రణులందు మత్తవారిసామజములందుఁ
దనపంకజాతాప్తి దర్పితాఖలయందు నీచాశ్రయత వారి నెలవులందుఁ
దనవతితోషణాదర మనుత్తములందు జడవృత్తి వారి యాశ్రమములందుఁ
దనమధుపాప్తి ధనార్తకదంబములయందుఁ ద్రిమ్మరిట వారి నేత్రమ్ములందు
నునిచి యనుచితవృత్తులిట్లు నిరసించి। సరసత రహించి సరసిజసద్మపద్మ
పద్మజాగ్రణియగుకృతిభర్తయింట। నిలుకడవహించి నిరతంబు నిలుచుఁగాత॥

మ॥ సదలంకారగుణధ్వనుల్ వెలయఁగా సద్వృత్తయై సద్రసా
స్పదయై సత్పదరీతియై సతతభాస్వల్లక్షణాకారయై
బుధమెచ్చం గవిరాజమాన సరసాంభోరాశి జన్మించి పెం
పొదవన్ సత్కృతిలక్ష్మి వేంకటగిరీంద్రోల్లాసముం గూర్చుతన్ 5.

సీ॥ తనరసజ్ఞాశ్రయత్వం బాశ్రితులకిచ్చి వెలయించుచుండు నే విశ్వజనని
తనశతానందోచితవ్యాప్తి భక్తులకొదవించి మనుచు నే సదయహృదయ
తనదివ్యసారస్వతస్ఫూర్తి దాసుల కొసఁగి మన్నించు నే యసమచరిత
తననిసర్గాక్షరాత్మకశక్తి నతులకు వఱలించి ప్రోచు నే వర్ణనీయ
యట్టిశారద రసనాగ్రమందు నిలిచి। నవ్యసత్కృతికర్తగా నన్నొనర్చి
భవ్యవెలుగోటిరాజగోపాలకృష్ణ। విభుని సత్కృతిభర్తఁ గావించుఁగాత॥ 6.

*మ॥ చను శృంగారరసంబె శాంతరసమై, శాంతంబె శృంగారమై
కను సఖ్యంబనుచున్ దదైక్యము శివాఖ్యం దెల్పి నానారసా
యన చర్యల్గల యార్యకార్యచతురుండౌ రాజగోపాలకృ
ష్ణనరేంద్రాగ్రణికిన్ సమగ్ర సకలానందంబులఁ గూర్చుతన్॥ 7.

శా॥ బంగారీచమనాయఁ డిష్టుఁడని స్వప్నంబందుఁ బ్రత్యక్షమై
గంగాంతర్గతలింగమింకొకనికిం గాన్పించి తద్యుక్తిచే
తం గాశీస్థలినుండి వేంకటగిరిస్థానీయముం జేరి తే
వం గొల్వంబడు విశ్వనాయకుఁడు తద్వంశాగ్రణిం బ్రోచుతన్॥ 8.

శా॥ భూమిం గాంచి యశంబుఁ గాంచి నిగమంబుల్ పుణ్యకోట్యంచితం
బీ మేల్ ప్రోలనమించు వేంకటగిరిన్ స్వేచ్ఛం బ్రవేశించి పూ
జామోదంబునఁ బొల్చు శ్రీవరదరాజస్వామి తత్పట్టణ
స్వామిం గామితకల్పకంబగుచు వాత్సల్యంబునం బ్రోచుతన్. 9.

శా॥ స్వస్వామిత్వము వర్ధిలన్ వరదరాజస్వామిఁ గోదండరా
మస్వామిన్ స్వయమాగతుండయిన సమ్యక్కాశికా విశ్వనా
థస్వామిన్ గనవచ్చునంచుబలె మధ్యస్థాయియౌ నాంజనే
యస్వామిన్ గృతిభర్తఁ గొల్చి విజితస్వామిత్రుఁడై యొప్పుతన్॥ 10.

---

మ॥ ధర నాద్యంత రసద్వయంబునకు భేదం బింతయున్ లేదఁట
న్న రహస్యంబు శివాఖ్యచేఁ దెలుపుచున్ నానా రసాకార యా
చు "రసోవై" యను సూక్తిచేత నదియే సూచించుచున్ బొల్చు నీ
శ్వరి సర్వజ్ఞకుబేశ్వరుం గృతిపతిన్ వర్ధిల్లఁగాఁ జేయుతన్॥ (పాఠభేదము.)

శా॥ శ్రీ సర్వజ్ఞకుమారయాచ మహీభృ ద్బృందావనానీత పూ
జా సాధోదర సంప్రతిష్ఠిత సదా సంపూజ్య మానోజ్జ్వల
ద్రాసేశ్వర్యధినాధపాదుకలు జాగ్రద్రాజగోపాలకృ
ష్ఠాసాధారణ ధారుణీంద్రునకు సర్వాభీష్టముల్ గూర్చుతన్॥ 11.

చ॥ అనుభవశాలివై యభినయాగమముం బచరించితీవు నా
కనుభవసిద్ధమీవని గజానన! కాదన వాదులాడఁ జా
ల ననెడు వల్లభాంగన తలంపు నెఱింగి తదిష్టపూర్తిఁ జే
సిన గణనాయకుండు దయచే మదభీష్టము లెల్లఁ గూర్చుతన్॥ 12.

ఉ॥ ప్రామిమకుల్ నిజాకృతిగ భానిలుచుం గమలోదయార్హ్యచ
ర్యామహనీయుఁడై నరకహారిగురున్నతి వర్ధనుండునై
వేమఱు శ్రీధరుండనెడు విశ్రుతిఁ గాంచి వెలుంగు నావెలుం
గామయముల్ వెలార్చి తమమార్చి క్రమమ్ముగ మమ్ముఁ గావుతన్॥ 13.

ఉ॥ వ్యాసు నివేదతత్త్వ పరమార్థపదవ్యగవస్మృతఖోద్ధ తి
వ్యాసురసంపదాద్యచిరహాస్యనివేదక సారభారత
వ్యాసు గతాగతక్రమ భవత్ప్రణవాత్మకహంసమంత్ర భ
వ్యాసునిజాంతరంగ జలజాంతర నిత్యనివాసుఁ గొల్చెదన్॥ 14.

సీ॥ శ్రీవత్సహితశుచిదృగ్రుచిసంవృక్తి సత్యాత్మబంధుదక్షగురుభక్తి
యమవిరోధము లేని విమలధర్మవ్యక్తి యక్షతశ్రుతపౌరుషానురక్తి
సుస్థిరబ్రహ్మచరస్థాపనాసక్తి పుక్కటవిషమూనఁ బోనిసూక్తి
సూర్యవతంసయశో భాష్యపదయుక్తి కాసాలికాది వాగ్స్ఫురణశక్తి
మనఁగ కళానిధిమండలమధ్యవర్తి యై యభవుఁడై ప్రకృతి నద్వితీయుఁడై యు
నుగ్రుఁడై శంకరాచార్యజాగ్రదాఖ్య నవతరించిన సర్వజ్ఞు నభినుతింతు॥ 15.

చ॥ కవనగురుండు దండ్రియగు కామకవీంద్రుని సత్కళాగురుం
డవు నల తాతసూరయ సమాఖ్యకవిన్ నిగమాంతమంత్రముల్
సవిధిగఁ దెల్పినట్టి గురుచంద్రునిఁ ద్రైపద మస్కరీంద్ర పుం
గవు గురుమండలాన్వితముగా భజియింతుఁ బ్రబోధసిద్ధికిన్॥ 16.

ఉ॥ పూజలొనర్తు వాక్కుసుమ పుంజములం గుశలాభివృద్ధికై
భ్రాజితసత్కవిత్వరసరంజిత సర్వ జగత్పవిత్ర తే
జో జయశాలి కీర్తిజితశుభ్రమయూఖకళాశయాజికిన్
రాజితసర్వసద్గుణ విరాజికిఁ దిక్కన సోమయాజికిన్॥ 17.

చ॥ సదయ నరాజితస్థితులు సద్రుచులున్ విబుధాళు లౌననం
బొదలు మహాకృతుల్ దనరఁ బుణ్యజనుల్ సుమనస్కులాత్మ స
త్పదముల నాశ్రయింప సమదర్శనసంతతపూర్ణసత్కళా
స్పదమగు చిత్రచర్యగల సత్కవిచంద్రుల సన్నుతించెదన్॥ 18.

మ॥ ప్రవరశ్లాఘ్యపదన్ మహాకృతిరమం బాటించి నొప్పించుచో
భువిలోఁ గాకవి లోకమొందిన ఫలంబుం బొందుటబ్రంబె కా
క విలోకం బనుకూల ధర్మ నసమగ్రవ్యాప్తిలేకున్నక
న్న విపన్నత్వము లేదు కాకవుల కెన్నన్ సర్వకాలంబులన్॥ 19.

వ॥ అని యిబ్భంగి నభంగుర గురు దేవతాచరణ పరిచరణ సమాచరణ సమా
దరణ రమాభరణ నిజాంతఃకరుణావధానంబును గృతిపతి మంగళ సంవిధా
నంబును సుకవి మహిమానుసంధానంబును గుకవిముఖ విధానంబునుం
బ్రధానంబుగాఁ బచరించి విరించిప్రేరణంబు కారణంబుగా శ్రీ కృష్ణా
భ్యుదయాభిధానంబగు నొక శృంగార కథావిధానంబునం గృతార్థతా
నిధానంబుగాఁ దలంచి యొకనాఁ డాత్మగతంబున॥ 20.

* గ్రంథరచనా నియమనము. *

సీ॥ శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్ర రసానాయకుండు రసజ్ఞుఁడగుట
నస్మత్కృతార్పితంబైన "రాధాకృష్ణసంవాదకృతి" నంది సత్కరించి
నందింపఁజేసి యానందకందంబైన నందనందనుకథ నందమొందు
శృంగారకృతి నొనరింపుఁడటంచు సగౌరవంబుగ మున్నె కోరియున్న
కతనఁ దనమును గోరినకతన కృతినొ|నర్చినఁ దనర్చి నరపతి నన్నుధన్యుఁ [తు.
జేయునని యెంచి తత్కృతినాయకాన్వ|యక్రమము సంగ్రహించి నేనభినుతిం

* కృతిపతి వంశానువర్ణనము. *

మ॥ కలఁడామ్నాయ నికాయగేయ ఘనగంగాతోయ మారంద స
ద్మ లసత్పద్మదళాక్ష దక్షపదపద్మ పోద్భవత్వార్థవ
జ్జలజాతాక్ష కటాక్ష లబ్ధనిధిసంజ్ఞావ్యూహసంజ్ఞా విభా
కలనామాన్యుఁడు పద్మనాయకసమాఖ్యన్ ధన్య మూర్ధన్యుఁడై॥ 22

చ॥ అతని కులంబునన్ వెలమలందఱుఁ బుట్టిరి వారు సప్తస

త్పత్తి విధశాఖలై మనిరి వారలలో వెలుగోటిరాజు లీ
ధృతఁగని రిర్వదేడు పురుషాంతరములఁ గడచెన్ మహోన్నతిం
గృతిపతిపూర్వులట్లిపుడు కీర్తివహింపుచునుండెనన్నిటన్॥ 23.

శా॥ తద్వంశోన్నతిఁ దద్గుణోన్నతియు మద్వంశక్రమంబున్ సము
ద్యద్వైదుష్యమెలర్ప మద్రచిత "రాధాకృష్ణసంవాదమం"
దుద్వేలంబుగఁజెప్పఁగాఁబడియె మున్నాంగ్లాంధ్రజాద్యగ్వాచో
వ్యాద్వేద్యంబగుచుండఁగా, నిపుడు వేఱే చాటఁగా నేటికిన్॥ 24.

కృతిపతి వర్ణనము.

సీ॥ మహితసర్వజ్ఞకుమారయాచేంద్రమహారాజమణి కుమారార్థియగుచు
రామేశ్వరాదియాత్రలకేగునప్పుడు దక్షిణద్వారకాధ్యక్షుఁడైన
శ్రీరాజగోపాలకృష్ణుఁబ్రార్థించి, తద్దత్తవరప్రసాదమునఁగన్న
తనయుఁడుగాన నీతనికదేపేరుంచె నితనివెన్కన్ ననేకసుతులఁగనియె
నట్టిశ్రీరాజగోపాలకృష్ణవిభుని । జన్మసంశుద్ధి సద్బుద్ధి సత్త్వసిద్ధి
సుతసమృద్ధి విద్యావృద్ధి సుప్రసిద్ధి । వేఱె వర్ణింపఁగానేల విపులలీల॥ 25.

ఉ॥ డించు జనార్తిఁగీర్తినిగడించు సుధీజనగోష్ఠిగల్గి క్రీ
డించు ముదంబుచే నినుమడించు నయోన్నతి నుగ్గడించు నో
డించు నెదిర్చువారిఁ బురడించు జయంబున దిక్కులందుఁ బా
డించు యశంబుఁ గేల్వ ముడించు బుధాళి కితం డతంద్రతన్॥ 26.

సీ॥ నిర్నిమిత్తముగఁ గానియును వెచ్చము సేయఁ దర్హకాలములనెంతైననిచ్చుఁ
దానెంత చనవరికైననుమనసీఁడు లోకుల మనసంతలోగ్రహించు
నొకరిని నమ్మినట్లుండుటయేకాని నమ్మియేమరియుండఁడెవ్వనైన
నరసిపూనిన నిగ్రహానుగ్రహంబులు ఫలకాలమునఁగాని బైలుపఱుపఁ
డిట్టియీరాజగోపాలకృష్ణవిభుని । కిష్టుఁడైరాజగోపాలకృష్ణమూర్తి [గాత॥
పుత్త్రపౌత్త్రాయురారోగ్యములనొసంగి । యీయుగాన నజేయుగాఁ జేయుఁ

షష్ఠ్యంతములు.

క॥ ఏతాదృశగుణజాతా । న్వీతునకు వినీతునకుఁ బునీతునకు ధునీ
జాత సువిజ్ఞాత కవి । ఖ్యాత కృతిప్రీతునకు సయస్మితునకున్॥ 1.

క॥ శ్రీరాధాకృష్ణపదాం । భోరుహ భృంగాయమాన పూతాత్మునకున్
గారుణ్యమయాత్మునకుం । బౌరాణిక గదిత విదిత పరమాత్మునకున్॥ 2.

క॥ పద్మాపతి పదపద్మజ । పద్మజకులపద్మపద్మపతికతికృతిక
ఛద్మునకు విమలమానస । పద్మునకు సమగ్రసత్కృపాసద్మునకున్॥ 3

క॥ నవనీత మృదులహృదయున । కవనీతల భాగ్యదేవతాభ్యుదయునకున్
భువనాదర భవనాదర । కవనాదర సత్కవిప్రకర సదయునకున్ ॥ 4.
క॥ రేచెర్ల గోత్రభవునకు । భూచక్ర లసద్యశో విభూతి భవునకున్
స్వాచార ప్రభవునకున్ । యాచకశరణార్థి హితదయా విభవునకున్ ॥ 5.
క॥ శ్రీసత్యవచనరాగో । ల్లాసోత్తమునకు వెలుగోటిలక్ష్మీనరసాం
బా సర్వజ్ఞకుమార । క్ష్మాసుత్రామనుత సప్తక జ్యేష్ఠునకున్ ॥ 6.
క॥ నిజవితరణాదిసుగుణ । వ్రజస్వతఃప్రీత హూణరాజ్ఞీమణి ద
త్త జగత్ప్రసిద్ధబిరుదున । కజస్రహితసస్యహితదయా శరదునకున్ ॥ 7.
క॥ అకలంకద్యుతిఘృణికిన్ । సకలారికరీంద్రసృణికి సజ్జనబృందా
రకమణికి రాజగోపా । ల కృష్ణయాచేంద్ర నృప లలామాగ్రణికిన్ ॥ 8.

## కథాసంబంధము.

వ॥ శ్రేయస్కరంబుగా నేఁజేయంబూనిన యశస్కర జగదభ్యుదయ నిబంధ
నంబగు శ్రీ కృష్ణాభ్యుదయ ప్రబంధంబునకుఁ గథా సంబంధం బనుసంధిం
చుచు॥ 1.
శా॥ శ్రీమాంగల్యము దేవసేనవొగడం జెల్వొంది పల్మోములం
బ్రేమిస్కంగొన వెన్నశక్తి సుకుమారస్వామి భావం బభి
ఖ్యామూలంబుగ శ్రీనివాసపద చిహ్నంబౌను బ్రహ్మంబు స
త్యామోదాస్పదమై సలక్షణముగా నస్మత్కృతిం బ్రోవుతన్ ॥ 2.
శా॥ నేనెవ్వారలచే సుఖించినను నిన్నే సౌఖ్యసంధాయిఁగా
నానాకారుఁడవంచు నెంచితిఁ గృతఘ్నత్వంబు రాకుండఁ బై
కేనెవ్వారల నెట్టులెన్నినను నిన్నే యెన్నినట్లెన్ని న
న్నానందివఁగనిమ్ము వన్నగనగాధ్యక్షా జగద్రక్షకా॥ 3.
శా॥ శ్రీయున్ లక్ష్మియు సర్వమంగళయు ధాత్రిన్ వల్లభాదేవియున్
ఛాయాదేవియుఁ బంచశక్తులుగ నంచద్దేవతాపంచకం
బై యుద్వృత్కవిమై గురుండయి యుపాస్యంబై ఫలంబై ధ్రువం
బై యానందమయంబునైన మహిమన్ ధ్యానించి ధన్యుండనై॥ 4.
వ॥ అనియిట్లు శ్రీనివాస పదగర్భిత తత్పద సంస్మరణా విఖ్యాత హరిహర
హిరణ్యగర్భ బ్రహ్మగర్భ జగద్గురు పరబ్రహ్మసాన్నిధ్య సందర్భ నిర్భరుండనై
విన్నవింతు నవధరింపుము. 5.

క॥ శ్రీచిరభోగసురేంద్రా । రేచెర్లసగోత్రకులసత్పతిచంద్రా
భూచరనుతగుణసాంద్రా । యాచేంద్రా సకలసత్క్రియా నిస్తంద్రా॥ 6

## కథారంభము.

శా॥ పుణ్యం బశ్రుతదృష్టపూర్వ మునినైపుణ్యంబు శ్రీనైమిశా
రణ్యం బార్యశరణ్యమట్టి సుపవిత్రక్షేత్రమందున్న బ్ర
హ్మణ్యుల్ శౌనకముఖ్యులచ్యుత చరిత్రాకర్ణ నాకీర్ణులై
గణ్యోత్కృష్టుని రౌమహర్షణిని వేడ్కం గాంచి మన్నించుచున్॥ 1.

ఉ॥ సూత పురాణజాత పరిశోధన బోధన పూతవాగను
స్యూత విచిత్రముల్ విజయ సూతచరిత్రము లెంతవిన్న సం
ప్రీతిని తృష్ణదీర దలకృష్ణుని జన్మదినంబునేఁడు మా
కీతఱి వాక్యచాతురి వహించి తదభ్యుదయంబుఁ జెప్పుమా॥ 2.

చ॥ అనవుడు సూతుఁడిట్లనియె నార్యశిరోమణులార మీతలం
పున మఱినాతలంపు మనపుణ్యవశంబున నేకమయ్యెఁ గృ
ష్ణుని చరితం బనంత మది సూత్రవిధంబున సంగ్రహించి నే
వినుతు నవీనులట్లిపుడు వీనులకింపుగ నాలకింపుఁడీ॥ 3.

సీ॥ ఒకనాఁటి గోష్ఠిలో సకలపురాణ పరస్పర భేదకారణము నడుగ
బాదరాయణమౌని సాదరంబుగఁ దెల్పె నదిపరమరహస్య మైనవినుఁడు
మనమనోవాసనల్ గనిమనముదరింపఁగోరి పురాణముల్ గూర్చె నదియుఁ
గ్రమత నర్థప్రధానములు పామరులకు భావప్రధానముల్ పండితులకుఁ
గవులుధ్వనికావ్యముత్తమకావ్యమంద్రు । దీనికి నిదర్శనము వాసుదేవచర్య
యిట్లనెసమస్తచర్యలూహింపవలయు। నదియు నిదియుఁ దలంప ముఖ్యములు మనకు
వ॥ తత్క్రమం బెట్టిదనిన॥ 5.

గీ॥ మురళి ప్రణవంబు గోపికల్ ముక్తజనము । గోగణంబు చిరంతన గోగణంబు
రాధమూలప్రకృతిలక్ష్మి బ్రహ్మవిద్య। కృష్ణుఁడానందమయతత్త్వమి దెనిజంబు। 6.

మ॥ పరమార్థజ్ఞులెఱింగి పొందఁదగు గుప్తంబైన వేదాంత త
త్త్వరహస్యంబిది వ్యావహారికదశం దత్తత్పురాణోక్తమీ
శ్వరరూపంబు తదేకభక్తిసులభోపాయంబు మోక్షార్థికి
ద్ధర సిద్ధంబిది నేనిదే ప్రకృతమాధారంబుగాఁ జెప్పెదన్॥ 7.

## దశావతార స్తవము.

ఉ॥ ఎవ్వనిచే జగంబు భరియింపఁగనయ్యె యుగాంతకాలమం

దెవ్వని కుక్షిలోనిలిచె నెవ్వఁడు వారిచరస్వరూపుఁడై
మవ్వపు వేదబృందము నమందకటాక్షముచేతఁ బ్రోచెఁదా
నవ్వనజాయతేక్షణు ననంతుని నే శరణంబు నొందెదన్ ॥ 8

చ॥ విగతరజస్తమోగుణుఁడు విశ్వమయుండు ననాదిరూపుఁడై
నెగడినయెవ్వఁడీశ్రుతుల నేర్పడలిర్ప సృజించిమించె ని
జ్జగతి నజస్రముం గమఠసత్తముఁడై ధరియించె నెవ్వఁ డ
య్యగనిలయప్రియున్ హరి ననంతుని నే శరణంబు నొందెదన్ ॥ 9

చ॥ సురరిపుభీతిచే బెగడుచున్ ఫణివాసము దూసియున్న యి
ద్ధరణి సముద్ధరింప నిశితస్ఫురనిష్ఠుర భీకరస్ఫుర
త్ఖుర నికరక్షతిన్ దనుజకోటులమీటి కిటీంద్రరూప మే
హరి ధరియించె నయ్యజు ననంతుని నే శరణంబు నొందెదన్ ॥ 10

ఉ॥ పోదిచెడన్ హిరణ్యకశిపు క్రతుభుగ్రిపురాట్ఛతారధా
రాధృతవక్షమగ్రనఖరప్రకిరంబుల గ్రుచ్చివ్రచ్చి ప్ర
హ్లాదున కేదయానిధి హితావహుఁడయ్యె నృసింహమూర్తియై
యాదనుజవ్రజాంతకు ననంతుని నే శరణంబు నొందెదన్ ॥ 11

ఉ॥ వేలుపుప్రోలనేలుటకు వేలుపులీల నొసంగ వామనుం
డై లఘురీతి నబ్బలిగృహంబున కేఁగి త్రిపాదమాత్రమీ
నేలవరించి యేఘనుఁడు నేర్పడలిర్పఁగ మూఁడులోకముల్
పెళిహరించె నాహరి ననంతుని నే శరణంబు నొందెదన్ ॥ 12

చ॥ క్షితిపతులం బరశ్వధముచే వధియింపుచుఁ దక్షితీశ్వర
క్షతజ జలంబుచేతఁ బితృకర్మమొనర్చి తనర్చె నెవ్వఁ డ
వ్వితతపరాక్రమాకరు నపేలవిభా విజితప్రభాకరున్
హత నతపాపసంతతి ననంతుని నే శరణంబు నొందెదన్ ॥ 13

ఉ॥ వావిరి నేయవిక్రియుఁ డవక్రపరాక్రమధాముఁడై త్రిలో
క విపినానలుం గలుషకృత్యు నశేష విశేష ధర్మవి
ద్రావణు రావణున్ సదమదంబొనరింపుచు రామనామకుం
డై విలసిల్లె నాఘను ననంతుని నే శరణంబు నొందెదన్ ॥ 14

చ॥ అసురవిభీతి భంగురపరాత్తధరాస్థలినుద్ధరింప నే
బిసరుహపత్త్రలోచనుఁడు ప్రేమ పొదంబొదలంగ లాంగలో
ల్లసితకరాబ్జుఁడౌచు యమరాట్స్వసృకర్షణ దర్పితోరు వీ

ర్యసహితుఁడయ్యె నయ్యజు ననంతుని నే శరణంబు నొందెదన్॥ 15.

ఉ॥ హంస బకాఘ కంస నరకాది నృశంస వతంస వంశ వి
ధ్వంసనమాచరింప యదువంశమునం జనియించెఁగృష్ణుఁడై
హంస నవచ్ఛవి ప్రవికచాబ్జరుచి ప్రచురాస్యుఁడెవ్వఁడా
హంస సముల్లసద్యశు ననంతుని నే శరణంబు నొందెదన్॥ 16.

ఉ॥ చండతరస్వరూపుఁడయి సర్వసుఖావహ సత్క్రియాంగనా
షండ కలిప్రభావ కలుష స్వకులాశ్రమధర్మషండ పా
షండ విఖండనార్థము వెసం గొనునెవ్వఁడు కల్కిభావ మ
య్యండజరాజవాహను ననంతుని నే శరణంబు నొందెదన్॥ 17.

సీ॥ మత్స్యమై బ్రహ్మకామ్నాయంబులనొసంగి కూర్మమై కుధరంబుఁగుదురుకొల్పి
భూదారరూపమై భూతలంబువహించి నృహరియై ప్రహ్లాదునెలమిఁగాచి
వామనాకారుఁడై వసుధయాచనచేసి భార్గవుఁడై ధరాపతులగెల్చి
రామభద్రుండయి రావణాదులఁద్రుంచి బలభద్రుఁడై ఘోషిభద్రపఱచి
బుద్ధుఁడై యెల్లభక్తులనుద్ధరించి। కల్కియై మ్లేచ్ఛులజయింపఁగల్గునట్టి
శ్రీరమానేత సేవకశ్రీవిధాత। మంచిదయచేత మనలరక్షించుఁగాత॥ 18.

## శ్రీకృష్ణావతారప్రశంస.

శా॥ ఆ గోవైభవ పుష్ట దష్ట వహనాయాసంబునన్ గోవు గో
వై గోలోకముఁజెంది కుయ్యిడఁగ శయ్యన్ రాముగా రోహిణీ
స్త్రీ గర్భంబునఁబుట్టఁబంచి యటపై శ్రీరాజగోపాలుఁడే
ప్రాగుక్తక్రియ దేవకీతనయుఁడై ప్రాదుర్భవించెన్ భువిన్॥ 19.

మ॥ దయితాజ్ఞన్ రమ భైష్మియై పొడమె రాధాసంజ్ఞయైపుట్టె రా
ధయు గోమాతలుగోవులైరి మునినేతల్ వ్రేతలై రర్జునుం
డయి జన్మించె హరిప్రియుండగునరుం డయ్యెసురల్ రాజులై
నియమింపంబడినట్లుపుట్టి రిలలో నిర్ణీత కాలంబులన్॥ 20.

క॥ రామాకృతిఁ గామాకృతి। గా, ము న్నేమునులుగాంచి కడుమోహితులై
కామాతురతంజూపిరొ। యామునులే, గోపవనితలై పుట్టిరిలన్॥ 21.

మ॥ లలి మీనంబయి సోమకుందునిమె కోలంబై హిరణ్యాక్షుమున్
బొలియించెన్ నరసింహుఁడై యతనితమ్ముం గ్రుమ్మె గుజ్జై బలిం
గెలిచెన్ రామసమాఖ్యుఁడై నృప దశగ్రీవాదులంగూల్చె ని
క్కలికాదిన్ జనియించెఁ గృష్ణుఁడయి తత్కంసాది హింసాదృతిన్॥ 22.

## దేవకీవసుదేవుల కారాగృహప్రాప్తి.

సీ॥ అదితి దేవకియయ్యె నల కశ్యపబ్రహ్మ వసుదేవుఁడై పుట్టె వారు నూత్న
దంపతులై యేగుతఱిఁ గాలనేమియై క్రాలు కంసుఁడు తేరుఁదోలునప్పు
డశరీరవాణి యాయమ యెన్మిదవచూలు దెగటార్చు నిన్నన బెగడి భగిని
నొంపరా బతిమాలి యుదయించుశిశువులనిచ్చునట్లుగ మాటయిచ్చిన విని
మఱలవారలఁదోడ్తెచ్చి మథురయందు। శృంఖలలఁదార్చి చెఱసాలఁజేర్చె వారి
నిసువులనుదున్మెఁ గ్రమత నెన్మిదవశిశువు। మాయగావునఁ జెయిజాఱి మాయమయ్యె

## దేవకీపుత్రషట్కపూర్వవృత్తాంతము.

సీ॥ ఊర్ణామరీచుల కుదయించి రాఱ్వురుసుతులు వారొకనాఁడు సుతయుఁబితయు
నగువాగజులు రమింపఁగఁజూచి నగుటచే నజుఁడు రక్కసులుగండని శపించి
కాలనేమికిఁబుట్టి ఘనతపమొనరింప వారికవధ్యత్వ వరమొసంగెఁ
దనుమాని యజుఁగొల్చిరని కినిసి హిరణ్యకశిపుఁడు పాతాళగర్తమందు
నత్తమిలి దండ్రిచేఁజత్తురంతమీఁద। ననుచుశపియించెఁ గంసుఁడైయవతరించి
కాలనేమివధించెఁ దత్కాలబాల। షట్కమే దేవకీగర్భషట్కమయ్యె॥ 24.

క॥ మునులారకీర్తిమంతుం। డనఁగ మఱియుభద్రసేనుఁడనఁగ సుషేణుం
డనఁగ సుదర్శనుఁడన ఋజుఁ। డన భద్రుఁడనంగఁ గంసహతులార్వురొగిన్॥

## యోగమాయా ప్రశంస.

క॥ వానిచెడిన కంసుని దు। ర్వాసనలకురోసి వ్రేటువాసి చని శుభా
వాస నభోవాసునికి సు। వాసినియై మాయ వింధ్యవాసిని యయ్యెన్॥ 26.

## బలరామ జన్మప్రశంస.

సీ॥ రోహిణి మదిరయు రోచన యిళ భద్ర బడబయు సుతనువు బాహ్లికసుత
లేఁడ్గు రిర్వురుకోసలేశ్వరపుత్రికల్ కౌసల్య పౌరవి కాశిరాజ
కన్యవైశాఖి సృగాలపుత్రిసునామ్ని దేవకసుతులు శ్రీదేవయు శ్రుత
దేవయు సుపదేవ దేవరక్షిత శాంతిదేవయు సహదేవ దేవకియును
వీరు వసుదేవు దేవులు వీరియందు। దేవకీగర్భమునసున్న దివ్యపురుషు
నుంచెరోహిణి కడుపునయోగమాయ। దానసంకర్షణుండయ్యెఁదక్షుఁడుండు॥ 27.

## శ్రీకృష్ణజాతకనిరూపణము.

సీ॥ ఏతద్యుగావ్యవహితమైన ద్వాపరాంతమున విశ్వావసునామవత్స
రమున శ్రావణమున రవిసింహమునసున్న కృష్ణపక్షాష్టమి నిందుసుతుని
వారంబున నిశీథవరసమయంబున రోహిణీసహితచంద్రుండు లగ్న

మగు వృషభంబున నర్ధోదితుండుగా నొంది కర్కటకంబునందు వెలయ
శనియుశుక్రుండుతులను గన్యను బుధుండు। వృశ్చికంబున రాహువు విబుధగురుఁడు
మీనమున నర్కుఁడు నమహీసూనుఁడుండ । దేవదేవుని దేవకీదేవి గనియె॥ 28.
క॥ కష్టమగు స్పష్టముగ నీ । కష్టమగర్భమునఁ గంసయమమినుమిన్కో
దృష్టాంతమయ్యెఁగృష్ణుం । డష్టముఁడవతారపురుషులందని మనకున్॥ 29.

నిజరూపప్రదర్శనాది ప్రశంస.

మ॥ హరి గర్భంబుననుండఁగా నలినగర్భాద్యాదితేయుల్ మునీ
శ్వరులున్ నిర్భరభక్తిచేఁబొగడిరా పైఁ దల్లికిందండ్రికె
వ్వరికిం జూపనిరూప మబ్బురముదోఁపంజూపి పాశ్రైతదా
తురతంబాపి విధేయముందెలిపి తోడ్తో నర్భకుండై తగెన్॥ 30.

భగవదాజ్ఞాచరణము.

మ॥ తన యాజ్ఞన్ వసుదేవుఁడర్కతనయుం దాటించి నందాంగనా
తనయం గైకొని యందుఁదత్తనయుఁగాఁ దన్నుంచఁగాఁ బంచి వీ
తనయుండై తనయున్నతిం గనమి విధ్వంసార్హుఁడా గంసుచే
తనయత్నంబునఁ జిక్కకుండ హరిదాఁదప్పించె మాయాసుతన్॥ 31.

కంసప్రతినారదోపదేశము.

మ॥ శిఖిపింఛవ్యజనంబు శక్రధనువై చెన్నార వాతాహతిన్
ముఖరంబైన విపంచి మించుటుముమైమోగ్రియన్ జడల్ మించులై
యఖిలాశ్చర్యకరంబుగా మెఱయ దివ్యన్నారదవ్యక్తి స
మ్ముఖ మంద వ్పటికవ్వఁడుట్టి పడియెన్ మోదాశ్రువుల్ వృష్టిగాన్॥ 32.
మ॥ ననలైసూక్తులు పాద్యమై ప్రవహదానందాశ్రుసంవత్తి సాం
పానరన్ శ్రీమధురేశుచేనపుడు ప్రత్యుత్థాన సాష్టాంగ వం
దనపూర్వంబుగ సత్కరింపఁబడి తద్దత్తాసనాసీనుఁడై
జనితానుగ్రహుఁడౌచుఁదత్ప్రియ చికీర్షం దెల్పి తానేగినన్॥ 33.

కంసప్రార్థన.

మ॥ వసుదేవున్ విడిపించి రాఁబనిచి బావా! దైవయోగంబునన్
విసువుల్ గిట్టిరి నెట్టపంటగ వృథా నేనమ్మితిన్ నానుడిన్
విసువంబాడియె నానుడిన్ వినుచు లేవిన్ దేవకీదేవితో
డ సుఖంబుండుమటంచు గంసుఁడనై వ్రీడానమ్రుఁడై మ్రొక్కుచున్॥ 34.

కంసదుర్నయము.

ఉ॥ నారదసూక్తికులిక్కిపడి నాఁడు మొదల్కొని పోతపాతన
కారిరుల పూతనాదులని కోరి నృశంసుఁడు కంసుఁడంపఁగా
వారలు దన్నుఁగాంచుటకు వచ్చిరి చచ్చిరి తన్నుఁగాంచుటన్
వారికిఁజిక్కెనెట్లు తనవారికిఁజిక్కులఁ బాపఁబావఁడై॥ 35.

పూతనాసంహారము.

క॥ ఆపోవఁగనుండనివగ । వాపోవఁగఁజన్నుఁగుడువవచ్చిన నసువుల్
వే పోవఁగ నెగఁబీలిచి । పోపో వగలేలయనుచుఁ బూతన నడఁచెన్॥ 36.

పూతనా పూర్వవృత్తాంతము.

క॥ పూతనయులార పూతన । నూతనగాదు మును వామనునిఁదనయునిఁగా
నీతనిఁగోరిన బలిసుత । యీతనువున నిట్టులై తరించె వరమునన్॥ 37.

శకటాసురభంజనము.

క॥ అకటా వికటాకృతియై । నికటాగతుఁడై తనుంగొనిచనంగను నా
శకటాసురుఁ డెగటార్చెను । బ్రకటార్భకుఁడై హరిం దరంబె నుతింపన్॥

తృణావర్తునికథ.

మ॥ ధునిఁగ్రీడాదరుఁడై త్రపా విధురుఁడై దుర్వాసు దుర్వార శా
ప నిమిత్తంబునఁ బాండ్యరాజసురతాపాప్తిం దృణావర్తుఁడై
పెనుగాడ్పై తను మింటికింగొనిచనన్ వ్రేగౌచు వ్రేలాడి యా
చెనటిం గ్రిందికిడించి కృష్ణుఁడు వధించెన్ వాఁడు ముక్తింగనెన్॥ 39.

వసుదేవరహస్యాగమనము.

మ॥ వసుదేవుండు రహిన్ రహస్యముగ వ్రేపల్లెంగనంబోయి నం
ద సమక్షంబున మందలోనిలిచి కృష్ణప్రేక్షణప్రీతుఁడై
పసులున్ మీరును దూరదేశమున కీపైఁబోయి కంసార్తి లే
క సుఖంబుండుఁడటంచుఁ దెల్పి చనియెం గాలానుకూలంబుగాన్॥ 40.

గర్గాగమనము.

మహాస్రగ్ధర॥ వసుదేవప్రేరితుండై వ్రజమునకు వెసన్ వచ్చిగర్గుండు తత్ప్రో
క్తసమాచారంబులెల్లం గ్రమతఁదెలిపి యేకాంతమందా యశోదా
ఖ్యసతీనందుల్ వినంగా గతభవమున వేడ్కం ధరాద్రోణులై వి
ష్ణుసమీక్షం గోరశ్రీకృష్ణునిఁగనఁగలిగెన్ సూచ్యమాలింపుఁడింకన్॥

నామకరణాదిప్రశంస.

గీ॥ రాధ మూలప్రకృతి కృష్ణుఁడీశ్వరా భ । రంబు మీఁద నుద్భవిల్లిన బ్రహ్మమగున
టంచుఁ దద్భావిచర్య సూచించి నామ । కరణమొనరించి హరిఁ బెంచి గర్గుఁడరిగె॥ 42

బాలక్రీడాప్రశంస.

శా॥ బాలక్రోడము లెక్కఁ జొక్కు నెపుడుం బాలిశు లట్టంచుం బ్రసూ
మూలక్రోడము వీడఁ డెన్నడును రూపుం జూపు నింటింటఁ ద
ద్బాల క్రీడలఁ జూడ నెన్నఁగలరే ప్రస్ఫారసంసార జం
బాల క్రీడలఁ జూడఁ గ్రుమ్మరెదు నస్మాదృశ కుక్షింభరుల్ ॥ 43

ఉలూఖలబంధనము.

శా॥ వ్రేతల్ వ్రాతములై యశోద వినఁగాఁ గృష్ణుండు గావించు బల్
చేతల్ చేతులు ద్రిప్పికొంచుఁ బలుకం జిట్టాడుఁ దన్నట్టిరా
మాతన్ మాతరుణీవిభుండు గెలిపింపం జక్కఁగాఁ జిక్కఁగాఁ
బ్రీతిం ద్రాటిగ రోటఁ గట్టి దిగఁ దార్చెన్ మద్దులందద్దయున్ ॥ 44

చ॥ నయమున నెంత చెప్పిన గుణంబు గనంబడకుండె నింత ని
ర్భయము గుణహీనుఁ గాన మఱి రా గుణవంతు నొనర్తునంచుఁ ద
ల్లి యొకగుణంబు చాలమి బలేయని యెన్నిగుణంబు లంటఁ గ
ట్టియు నవి చాలమిన్ వినువ శింభకుఁ డంబకుఁ జిక్కెనొక్కటన్ ॥ 45

అర్జునద్రుమభంజనము.

క॥ ముద్దుల కృష్ణుఁడు ధృష్ణుఁడు । మద్దిలవలెనున్న రోలు మధ్యమెనయరా
మిద్దెలకడ మొద్దువలె । మద్దులు పడఁగెంచుఁ దల్లి మదిఁ దల్లడిలెన్ ॥ 46

నలకూబరమణిగ్రీవశాపవిమోచనము.

శా॥ కేళీచ్ఛన్ నలకూబరుండును మణిగ్రీవుండు గ్రావాటవిన్
వ్రీళాభగ్నులు నగ్నులై సురమునిన్ వీక్షించి తచ్ఛాప రూ
పాలాపంబుల మద్దులై యిపుడు కృష్ణాకృష్టులై గిట్టి యా
లీలాబాలకు నాజ్ఞఁ గొంచుఁ జనిరోలిన్ దివ్యరూపంబులన్ ॥ 47

నవనీతభక్షణకారణము.

శా॥ చోరుండై ప్రతియింట వెన్నఁదినెఁ గృష్ణుం డేటికో యందు రీ
సారస్యంబు వినుండు లభ్యఫలదీక్షన్ భావ్యనర్థప్రతీ
కారంబాదిన చేయుటర్హమనుదీక్షన్ భావిదావార్చులన్
క్షీరంబుం గొనుభంగి మ్రింగ నుభయక్షేమార్థమైనైతగన్ ॥ 48

విశ్వరూపప్రదర్శనప్రశంస.

ఉ॥ పక్షములేదు కృష్ణునకు భక్తశరణ్యుఁడు జాతమాత్రుఁడై

రూక్షులు గానలేని నిజరూపముఁజూపెను గన్నతల్లికిన్
రక్షణ లక్షణ శ్రమధురంధరతం బరికించిచూపె వృ
ద్ధ్యక్షణ జృంభణ క్రియలఁబాలకమాతకు విశ్వరూపమున్ ॥ 49

## బృందావనప్రవేశము.

క॥ నందనులకగు నుపద్రవ । ముం దలఁచి భయం బమందముగ మందలతో
నందాదులు బృందావన । ముం దాదులతోడనేగి ముదమొందుతతిన్ ॥ 50

## పురనిర్మాణప్రశంస.

సీ॥ నందనందనుఁడు వారందఱువినుచుండ నిందు సుందరదేవమందిరములు
గలవవి దేవతాకరుణచేఁగాని కన్పడ విప్వనాధిదేవతను గొల్వఁ
డన వారు చండికనర్చించి నిదురింప విభుతలంపు నెఱింగి విశ్వకర్మ
యక్షులు పదిలక్ష లాత్మశిష్యులుమూఁడు కోట్లుఁదానును రత్నకోట్లుదెచ్చి
పంచయోజనపరిమిత పట్టణంబు । సపరికరముగనిర్మించిచనిన వెనుక
మేలుకని చూచి కృష్ణుని మెచ్చివారు । దమకుఁదగునిండ్లలోఁదిగి తనిసిరపుడు ॥ 51

## బృందావనప్రశంస.

సీ॥ నందింద్రకలహాంబునందు ముక్కంటి మిక్కిలికంటిమంట మున్గిప్పతినుతి
నంబుధిదరిఁజేర్ప నది జలంధరుండయి బృందను బెండ్లాడి యింద్రుగెలిచి
సురమునిప్రేరేప గిరిజకై యాసింప హరునకాతనికిఁ బోరాటమయ్యె
హరిసిద్ధుఁడై బృందదరికేగి గోష్ఠిలోఁ దత్పృష్టుఁడై జలంధర కబంధ
మాసలికిఁజూపి బ్రతికింపుఁడనఁగనందుఁ । జొచ్చిక్రీడించె బృందయాచొప్పుఁదెలిసి
యలిగిసాదఁజొచ్చె హరియందుఁదులసినాఁటె । నాటిబృందావనంబెబృందావనంబు ॥

సీ॥ మునురాధికాశాపమున సుదాముఁడు శంఖచూడుఁడై ధరత్మధ్వజానిసుతయగు
తులసియుఁదానుఁ జతురుత్మఖుపంపున దంపతులయి సుఖియింపుచునొక
మన్వంతరంబేలె మహినప్పు డమరులు స్వాధికారభ్రష్టులగుట కలిగి
హరుఁడుబోరాడరా హరివిప్రుఁడై స్వదత్తకవచ మాదనుజు నడిగి
తొడిగి శంఖచూడుండయి తులసినెనయ । శంఖచూడుని హరుఁడొంచె శౌరితులసి
దుర్గయముల సారగ్రావ తులసులైరి । తద్వనంబయ్యెనిపుడు బృందావనంబు ॥ 53

సీ॥ శ్రీదారభక్తుఁడై కేదారనృపతి భూదారులయందు నుదారుఁడగుచు
బహుయజ్ఞములొనర్చి భగవదర్పితములుచేసి జైగీషవ్య శిష్యుఁడగుచు
ఘోరతపమొనర్చి గోలోకమెనసెఁ దద్విభుపేరఁగేదార తీర్థమయ్యె
నందు బ్రమందినవారి కలవడుమోక్షమాతని పుత్రి బృందయుఁ దపమొనర్చి

హాగినివరునిగ వరియించి యతనితోడ । లోలయగుచుఁగ్రీడించి గోలోకమెనసి
రాధతోఁగుల్యయైయుండె రమణకరుణఁ । దత్తపోవనమయ్యె బృందావనంబు॥ 54

శా॥ రాధా షోడశనామమధ్యగతమై రాజిల్లు బృందాఖ్య త
ద్రాధా కృష్ణవిహారయోగ్య వనమే తానయ్యె బృందావనం
బాధన్యుల్ ధర నప్పతిల్ల నదియుం బ్రాదుర్భవించెన్ వినుం డీ
ధాత్రింబ్రతికల్పమందు నిదియే బృందావనంబై తగన్ ॥ 55

## వత్సాసురసంహారము.

క॥ వత్సాసురుఁడొకతతిగో । వత్సాకారమునఁ దన్నువచ్చినఁ గని శ్రీ
వత్సాంకుఁడతని నైదవ । వత్సరమున ద్రవ్చె గోపవత్సలుఁడగుచున్ ॥ 56

## బకాసురభంజనము.

గీ॥ మాధవునిఁ బ్రధానమల్లనిబర్హ్మాణ । న్యాయమైతఁగ్రమింగె నతఁడుపొంగె
నోర్వజాల కమిసె నుమిసిన హరి బకా । సురునిఁజీల్చి కూల్చె సురలు పొగడ॥ 57

## అఘాసురసంహరణము.

గీ॥ పేరుసార్థకముగఁ బెనుపాఁప రూపూని । మ్రింగెగోపకులను కృష్ణు నఘుఁడు
పాపహారిశౌరి యాఁపిరి కడ్డమై । త్రుంచు వాని తేజమెనసె హరిని ॥ 58

## శ్రీరాధాకల్యాణము.

సీ॥ నందుఁడానందంబున సనందనుండయి మందడాయఁగఁ బోయి యుందమంద
కందబృందంబు మిన్నంది గోబృందంబు బెదర వల్లవులెల్ల బెదర నుఱుము
నురమునఁ గృష్ణుఁజేర్చిరి రక్షసేక్షించు నెడ రాధ రా మెచ్చి కృష్ణునిచ్చి
నగ్గోష్ఠిఁగని రాధికకుఁ బ్రమొక్కి తద్దత్తవరుఁడయ్యె రాధయుంవరునిఁగూడి
చనుచు సంకల్పజనిత రాసస్థలమునఁ । దరునిజస్థితిఁ బలుచునంత విధివచ్చి
యుభయులకుఁ బ్రమొక్కి కూతుఁడొజ్జయగుచుఁగ । రాధనప్పుడు పెండ్లాడె మాధ
(వుండు ॥ 59

## రాధావతారకారణప్రశంస.

సీ॥ పితృకన్యలు కళావతి రత్నమాల మేనకయును నాఁ గలరు మేనకహిమాద్రి
సతియై యుమను గాంచె జనకరాట్పత్నియై రామపత్నిని గాంచె రత్నమాల
మనుకులేంద్రుని సుచంద్రునిఁ గళావతిఁ బెండ్లియై మాధవాంశజు నతనిఁగూడి
వేయేండ్లుఁగ్రీడించె విధిఁగొల్చియతఁడు ముక్తినిగోరసహాముక్తి కనుమతిఁగొనె
నతఁడు వృషభానుఁడుగఁ గళావతిగఁ దాను । బొడము గోలోకమున రాధమును సుదామ
శాపమున వారికుదయించె సరవివార్యఁ । దనుఁగని విముక్తులగుడుఁ గృష్ణునివరించె ॥ 60

సీ॥ కృష్ణుండు విరజయుఁ గ్రీడించుటరసి నెచ్చెలు లెచ్చరింప నొచ్చి కనవచ్చు
రాధ సుదాముఁ డురానీమి నదలించు టెఱిఁగి శ్రీకృష్ణుఁడదృశ్యుఁడయ్యె
నదియయ్యె విరజ యింతయుఁ గాంచిచనె రాధ యేటిబోటినొనర్చి కృష్ణుఁడెనయ
సుతులనేడ్వురఁ గాంచి పతిరాధనొంద నందనులబ్ధులగునట్లునది శపించె
మనుజుఁడవు గమ్ము లెమ్ము పొమ్మనుచుఁ గృష్ణు । ననిచియు సుదాము ననుర
(గమ్మనియె రాధ
కామినివిగమ్మనుచు రాధికను శపించి శంఖచూడుఁ డతండయ్యె శాపమహిమ ॥ 61

## పర్యుషితాన్నభక్షణము.

సీ॥ విధుపరివేషంబు విధమున గోపకుల్ విధుఁబరివేష్టించి వివిధ విధుల
గారవింపుచుఁ గోరి కోరగింపుచుఁ జల్దు లారగింపుచునుండ శౌరి లేచి
క్రేపు లేపొలమున మేపులకేగెనో కనివత్తుఁ దినుచుండుఁ డనుచుఁ జనుచు
వానిఁ గానక వచ్చి వారిఁ గానక మెచ్చి వారిజాసనుమాయ వమ్ముసేయ
నన్నిరూపులు దానయైయింటనింట । గుట్టుఁ బైఁ బెట్టకొక్కయేఁ డిట్టుగడపఁ
గడపట భుజింపడుచునల్వవేడుకకొల్వ । నగుచు మెప్పించి యెప్పటి పగిదినుండ॥ 62

ఉ॥ వచ్చితె నెచ్చెలీ యనుచు వత్సలు వత్సలఁ గాంచి వచ్చుటక్
మెచ్చుచునున్న యన్నములు మెక్కుచు నిక్కుచు నింద్లకేగి త
మ్ముచ్చతరాహిమ్రింగ నితఁడున్నతుఁడై బ్రతికించెనంచుఁ దా
మచ్చెరు మచ్చటింపఁ గరమచ్చెరువై హరి మెచ్చి రందఱుక్ ॥ 63

## ధేనుకాసురసంహారము.

సీ॥ పలుగండములు దప్పెఁ బౌగండదశయొప్పె నని యుత్సవమొనర్ప నారగించి
గోపాలకులఁ గూడి గోగణంబులతోడఁ జని యాటలాడుచు వనటఁ గూరి
తాళీవనముఁ జేరి తత్ఫలంబులు గోరి యొకచెట్టు బిట్టూఁప నున్న చెట్టు
లొండొంటితోఁ దాఁకి పండులు జలజల రాలుచప్పుడు విని రాసభమును
తన్నురా ధేనుకాసురుఁ దటిమిపట్టి । తట్టి గిరగిరఁ జుట్టి యాతాటిచెట్టు
విరిగిపడునట్లు విసరిచంపించె శౌరి । హలికిఁ దాలాంక నామంబు గలుగునట్లు ॥ 64

## కాళియమర్దనము.

సీ॥ జనులహిభీతులై మును నెలనెలకు భక్ష్యములు భోజ్యములు వృక్షముల క్రింద
నిడ సర్పములు వాని నెల్ల నిజాంతికుండగు ఖగపతికిడ నవివారించి
గరుడభయంబునఁ గాళియుండదు డెంచి సౌభరిమత్స్య హింసను సహింప
కురగాంతకుండు రాకుండ శాసించిన యమునాహ్రదంబున నడఁగియుండ
తద్విష విమిశ్రతోయంబుఁ ద్రావిపడిన । గోపగోపాళి బ్రతికించి యాం పిసాళి
నడఁగఁ ద్రొక్కియుఁ దత్సతీప్రార్థనమున । విడిచెఁ గృష్ణుండు రక్షగా నడుగుఁ బెట్టి॥ 65

దవానలభక్షణము.

ఉ॥ కాళియసర్పమున్ విడిచి కంజదళాక్షుఁడు నిర్గమింప గో
పాలురు నందముఖ్యులును బంధుగుణంబు గడుం సంతసించి రా
పై లలిఁ గాఱుచిచ్చుఁ బొదువంగ ననంతుఁడు గ్రోలి లీలమైఁ
గేళి నెపంబునం దునిమెఁ గృష్ణుఁడు గాడ్పుబలెం బ్రబలంబు నిన్॥ 66

మ॥ నిలువుం డీరనుఁ జొచ్చెఁ జిచ్చు పసులన్ నిండారఁగా సైగలం
బిలువుం డీరమరం గనుంగొనకుఁ డీపీడం దొలంగించు మీ
చెలువుం డీఱము గాసుఖాంతమని యాచిచ్చున్ వడిన్ మ్రింగి తా
నలభాండీరముఁ జేర్చె వారి హరి కవ్యాక్షిప్త డిండీరమున్
దళడిండీరము, కాననాబ్ధికి మధూద్యద్గండ పెండారమున్॥ 67

గోపీవస్త్రాపహరణము.

సీ॥ పల్లెవన్నెవులుల్లసిల్ల నల్లనిగొల్లపిల్ల పిల్లనగ్రోవి పెదవిఁబొదవి
మెల్లమెల్లన నూఁది యల్లిబిల్లిగ నూది గొల్లవ్రేళ్లను బాఁదుకొలిపి మెలపి
త్రుళ్లిమ్రోల్లిగురింపఁ జల్లచల్లఁగ రాగమల్లనల్లనఁ బాడు ననుచుఁ జనుచుఁ
దల్లిపిల్లనుఁ బిల్లతల్లి నొల్లకవిని గొల్లతల్లి మరులొల్కు ననుచు ననుచు
నుల్లమునఁ బొల్చినదినిల్చి యుల్లెలొల్చ । మొల్లముగఁ బెట్టి నీరాడఁ గొల్లఁగొట్టి
యుల్లసములాడి మెఱచి సిగ్గెల్లఁ జెఱచి । పల్లవుండయ్యె రాధికావల్లభుండు॥ 68

విప్రవనితాశాపవిమోచనము.

మ॥ పసులం గాచుచు నాఁకటం బడలు గోపశ్రేణి నంపించి భా
త్రిసురల్ పొందన వారియొద్ద కడఁ గోరింపన్ సతుల్ భక్ష్య భో
జ్యసమేతంబుగ వచ్చి యిచ్చిరని మోక్షంబిచ్చె తచ్ఛాయల
వ్వసుధాదిత్యుల చేరఁబంచె హరి తత్ప్రాగ్జనత్రాపఘ్నుఁడై॥ 69

విప్రవనితాశాపకారణము.

మ॥ ఇది యెట్లన్న వెలుంగుఁడాంగిరసు లగ్నిచ్ఛన్ విమర్శింప కీ
ముదితల్ మోహితలై రటన్న భ్రమచే మున్నుగ్రశాపంబొసం
గి పయన్నిక్కమెఱింగి కృష్ణుకృప ముక్తిం గాంచి మీచాయలన్
సుదతీత్వంబు వహించి మమ్మెత్తనయుం డంచుఁబల్కు వీరై రిటుల్॥ 70

గోవర్ధనోద్ధరణము.

సీ॥ ఏఁటేఁటఁ బచరించు నింద్రయాగము మాన్పి శైలేంద్రయాగనిశ్చయ మొనర్చి
గోవులకును భూమిదేవులకును దీనజీవులకును దృప్తిఁ జేయఁబనిచి

గిరిరూపధారియైకృష్ణుండు నందాదులొసఁగినవరదపాయసము లెల్లఁ
దానారగింపఁబంతమున నింద్రుఁడు సప్తవాసరంబులు ఱాళ్లవానగురియ
గోవులను గోపికల నెల్లగోపకులను । గావ గోవర్ధనంబెత్తి కదలకుండ
గొడుగుగాఁబట్టుటరసి శక్రుండు వేడ । నతనిరక్షించె సప్తమహాయనమున ॥ 71

## ఇంద్రప్రార్థనాంగీకారము.

మ॥ వెఱఁగై యింద్రుఁడు చిక్కి మ్రొక్కి సుతుఁడా విప్వచ్చుపై వత్సల
త్వ రమం బాయక ప్రోవుమంచుఁ బలుకం బ్రాణంబుల ప్పాండవుల్
ధరయేలింతును వారిచే రణములో ధాత్రీభరం బెల్లఁ దీ
ర్తు రహిం గంసముఖాదులందు నిమి తోడ్తోనంచు గృష్ణుండ నెన్ ॥ 72

## సర్వలోకప్రదర్శనాదిప్రశంస.

చ॥ వ్రతమొనరింప నందుఁడొకవాసరమందసురార్థవేళ నా
ప్లుతుఁడగుచుండఁగా వరుణలోకముఁ జేర్చిరి తద్భటుల్ మహా
ద్భుతముగఁ గృష్ణుఁడేఁగి పితఁదోడ్కొనిరా వెఱగందిరంద ర
చ్యుతుఁడును సర్వలోకములఁ జూపెఁ దదర్థనసార్థకంబుగన్ ॥ 73

## సాయంకాలాద్యభివర్ణనము.

ఉ॥ అంత దినాంతమయ్యె హరిదంతరదంతురకాంతిశాఖి శా
ఖాంతర నంతరాయతనిజాయతి నాపతనాతనూద్యమా
ద్భ్రాంతశకుంతమంతికదురంత వియోగభయాగతిక్షత
స్వాంతనితాంతతాంతమదనాకలనాకుల కోకకాంతమై ॥ 74

* మ॥ అపరాద్రీభవిభుండు రాకతఱి ఛాయానక్రసంగ్రస్తదే
హపరార్థుండగుచున్ విభావసుతుఁడాటాలించి మేలెంచి కా
లపయోజాత్ముఁడు లీలఁ దద్గ్రాహముదూలన్ సూర్యచక్రంబు వై
చి పడంగొట్టఁగఁ జిమ్ముత్రిరక్తమన నిమ్మెచెన్ సాంధ్యరాగంబొగిన్ ॥ 75

క॥ ఇనశశులిరుమొగములఁ గాం । చనమగు లలిగరిణికిరణజాలము వాలై
తనరెడురోదసిమద్దెల । యనఁదగె ఖగరుతముగొనుకదిగా దుగదా ॥ 76

## చంద్రోదయవర్ణనము.

క॥ ఉదయాచలవలీశకా । భ్యుదితసమయభోగిభోగమోయనఁ జంద్రుం
డు దనర్చెఁ దత్కళంకము । మృదురుచియగు కృష్ణపాదమే కాదుగదా ॥ 77

---

*పద్యాంతరము॥ క॥ అపరగిరికరితనువనా । తపమకరిగ్రహించు నెఱిఁగితఱియున్ హరియుం
దపన సుదర్శనమునఁ ద । ద్రిపుఁ ద్రుమఁగఁ గ్రమ్ము త్రినెత్తురే సంజగదా ॥

క॥ చదలనెడు జమునమడువునఁ । బొదలు సమయకాళియాహిభోగఫలకమ
ల్లుదితశశిబింబములరెం । దదంకము యమునాద్వహానిపదము గాదుగదా॥ 78

క॥ మిన్నని యెడిమున్నీటన్ । ఛిన్నంబగుశుక్తికరణిఁ బెంపెసలారన్
వెన్నెలదొర తారకలు స । మున్నతిఁ బైఁబడినముత్యములు గావుగదా॥ 79

సీ॥ అలశరద్రాత్రియందలరుచుఁ గృష్ణుండు మురళి వాయింపఁ గాముదితబల్లఁ
దమపనుల్ విడిచి తత్సన్నిధిఁ కేగిరి రారానిసతులు తత్ప్రియణచిత్త
వైరముక్తిఁ గనిరున్న యన్న మిన్నలఁ గని వెన్నుఁడు కన్నన్ని యోవిధులు దెల్పి
పోమరిన్నఁ బోకున్న మురిసికన్పడకున్న వెదకియుఁ గనలేక విసికి కొసకు
తనత్రయతఁ గాంచిజనాత్రదితచ్చరితలు । దామె యొనరించి మధురగీతములఁ బాడ
దమకు గలిఁగితోఁచి బ్రతిమాలిదానవారి । బాను వారిరాసక్రీడఁ దనిసి తనిపె॥ 80

## సరోవరవర్ణనము.

చ॥ పరిపరి కేళికూళియను పల్లైరమం దరమోదపూతమిత్రకీ
ల్పరిణలఁ గ్రమిత్రతుమెత్రన కొలమిత్రలపేరిఁటి వేల్పుతాలఁ గొ
ల్పరిహిపహించి గట్టుపయిఁజుట్టునుఁబుట్టినమ్రాకు లాకులున్
విరులును బువ్వుఁదేనియలు వెండియుఁబండులు రాల్పు మెండుగన్॥ 81

ఉ॥ తమిత్రల గుంపునందలి రుతమిత్రలపెంపున శీతవాతపో
తమిత్రల పంపున నత్రధుష్పృతమిత్రలనింపు ననంగునంపము
త్తమిత్రల సొంపున స్పహాగతమిత్రలముంపున నీదు హంసజా
తమిత్రల తెంపునం బలుకతమిత్రలనింపు నయిఁచుఁ జాడ్కికిన్॥ 82

సీ॥ జిగినాఁచుడీఁగలు చిగురుదర్భలు గాఁగ నలిననాళములింధనములు గాఁగ
ఫుల్లరక్తాంబుజంబులు నిప్పుకలు గాఁగ ఘనకేసరంబు లక్షతలు గాఁగ
మధుగిసపూరంబు మధురాజ్యధారగా మధుకరరాజి ధూమంబు గాఁగఁ
దీరభూజములు బుత్విగ్జనంబులు గాఁగఁ దక్షగిధ్వనులు మంత్రములు గాఁగఁ
దమిత్రమొగ్గలుబలుయూపదాదువులుగ । మనత్రథాధ్వరిగావించు మానినీజ
నాతిమానాశ్వమేధమహాధ్వరంపు । నెలవనుతెలంపు నింపు నకొల్కులనిసొంపు॥ 83

క॥ క్రమమత్స్యకూర్మశేఖో । ద్గమసంకుల కంకణోరిత్రకాశ్రీకరమై
కమలాకరమాయన్నద । త్క్రమలాకర మొప్పు విమలకమలాకరమై॥ 84

చ॥ భువనధురీణతాగుణతనభోగనుతస్థితియై కవీడ్యశ
బ్దవివృతిసౌష్ఠవాకలనభాసిలి దృక్ప్రతిభావభావ్యమై
సువిశదమై రసాతలముశోభిలఁజేయుచుఁబదత్రిలోచనా
నవరతశయ్యనా నది యనంతవిలాసముఁజూపు నెంతయున్॥ 85

సీ॥ సమ్యక్ప్రసాదవత్సరసభావంబున ఘనమధుపాటనాకలనవలనఁ
ప్రబలగాంభీర్యధౌరంధర్యసంగతి మహనీయభువనసంభరణగరిమ
మత్స్యకూర్మాదిసంభవహేతుకస్థితిఁ గువలయవిలసనానంతమహిమ
సంతాపమునడంచుచల్లఁదనంబున నాశ్రితసులభమై యమృతమిడుఔ
దాత్యమువహించియును సుదంచితద్విరేఫ। శబ్దలక్ష్మీత్రిద్యదమితాబ్జసముదయాస్ప
దత్వగౌరవమున మీఱుదానవారి। మానసము నేమనఁగవచ్చు దానిసొబగు॥ 86

చ॥ అరుణకరోత్కరారుణ సుమాంచల చంచల చంచరీక సం
చరణసమంచితామ్రతరుసంచయముల్ జలబింబితంబులై
పరఁగుఁదదీయతీరమున వహ్నికిఁగఁటి ముపర్యధోముఖ
స్ఫురణము నేఁటికిందఱుచుఁ జూపరులబ్బురమంది చూడఁగన్॥ 87

ఉ॥ మీఁదుగఁబాదముల్ వఱపి మేదిని నాదలలూఁది మాధవై
కోదయ సాదరాత్మక వనోదరమందు జపించువారిగా
నాదరిసున్న యున్నతసురాగములం గమలాకరప్రస
న్నోదకమందుఁజూచి చెలియొక్కతె త్రొక్కఁగ నవ్వెరందఱున్॥ 88

జలక్రీడాదిప్రశంస.

శా॥ రాసక్రీడలఁజేసెడెందనిపి యా రాజీవనేత్రుండు పే
రాసన్ వారివిహారముల్ సలిపి నిర్యచ్చంద్రికాసాంద్రధా
రాసంపాతసుశీతసైకతములన్ రాజాస్యలంగూడి యా
రాసంభోగమొనర్చె నస్ఖలితుఁడై ప్రత్యేకరూపంబులన్॥ 89

గోపీసంశయవిచ్ఛేదము.

సీ॥ తత్త్వజ్ఞులస్ఖలితబ్రహ్మచారిగా నిచ్చకంబాడుదు రింతదాని
యిందఱితోఁగృష్ణుఁడిట్లురమింపుచు నస్ఖలితుండెట్టుకానటంచు
నగుమగువలకెల్ల నమిత్రకపుట్టుట శోకరేయిదుర్వాసుఁడుగ్రుఁడగుచు
నాకొంటినన్నముల్ దేవున్నశపియింతునని యమునాపారమందు మెఱయ
యమునదాఁటి రాఁగ నసమర్థలై వారు। పన్నినట్లుచేసి యన్నములిడి
కృష్ణుఁడస్ఖలితుఁడు ఋషిశశ్వదుపవాసి। యనుచు నమిత్రవేఁడుకొనిరి వారి॥ 90

## గంధర్వ శాపవిమోచనము.

మ॥ నగె మున్నాంగిరసుల్ గురూపులని గంధర్వుండు వారల్ శపిం
పఁగఁ బాములైయుటనందు మ్రింగె హరియొంపఁ దొంటి రూపంబుతో
గగనంబంటి సుదర్శనుండను భవత్కారుణ్య సంపత్తిచేఁ
దెగె మచ్ఛాపమటంచు మ్రొక్కిచనియెన్ దేదీప్యమానాకృతిన్ ॥ 91

## శంఖచూడచూడామణి హరణము.

చ॥ కొనకొని శంఖచూడుఁడను గుహ్యకుఁ డొక్కవిలాసవేళ న
ల్లనచని వల్లవీజనములంగొని పాఱఁగ శౌరి సీరితో
వెనుచని చీరి వారి విడిపించుచు వానివధించి తన్మణిం
గొని చనుదెంచి యిచ్చెనిట గోపికలంగని కాముసీరికిన్ ॥ 92

## కపిత్థాసుర (కాలకవికుల) సంహారము.

సీ॥ బలియున్నయసు కాలకవియాసురక్కసి వెక్కసముగనిక్క వెలఁగయగుచు
వెలఁగె నబ్బలియుని బలగముకంటకతరువులై పెరివె నాతనిసహస్ర
సుతవతులగు సప్తసుతులు గోమూర్తులై ఘుటతుల్య తత్ఫలచ్ఛటలఁ దినుచు
బలిసేరఁదమ్ము గస్త్కల్లవివవాతంబు లాభీర గోనివహార్తిఁ జేయ
శంభుఁగొల్చి తత్ప్రేషితశంఖకర్ణ । భూతవరవశ విధివాక్యముల నెఱింగి
సిరతో శౌరిచనివారిఁ జీల్చి కాల్చి । మనిచెగొ గోపకుల నిరామయులఁ జేసె ॥ 93

## వృషభాసుర సంహారము.

మ॥ వృషభంబౌచు నరిష్టనేమియను దైత్యేంద్రుండు దీండ్రించి గో
వృషముల్ గొందలమంద మందపయిఁ బర్వెం బర్వఁ బర్వెందుఁడు
నిశ్చిషితధ్వాంతమునట్లడంచె నవుహానీరేజ నేత్రుండు త
ద్విషమాకార విషాణమూన్చి యదియే దివ్యాస్త్రమై తోడ్పడన్ ॥ 94

## కేశి సంహారము.

క॥ శైశవమునఁ గేశవుఁడ । క్లేశంబున నీసడించి కేశియనెడు నా
కేశవిరోధినడఁచిలో । కేశవినుతిఁ గాంచె వశమయిది శిశువులకున్ ॥ 95

## కేశి ప్రలంబ వత్స బకాసురుల పూర్వవృత్తాంతము.

సీ॥ గంధమాదనమున గంధవాహాఖ్య గంధర్వతపస్వికి నందనులయి
తగు సుదర్శన సుహోత్ర సుదేవులును సుపార్శ్వుఁడును దుర్వాస శిష్యులయి
యోగబలమున రాకేశ పార్షదులై పవిత్రపూజనిత్య వ్రతంబుగఁ దదర్థ
ముమకొలనికిఁ బోయి కమలముల్ గోయుచు శివపృష్టులైతమ చెద్దిఁ దెల్పఁ
జిత్రసరసికి మున్నున్న శివునియాన । దప్పదని కృష్ణుఁడై వారితలఁపుఁ దీర్చ
శివుఁడు విడువంగ వారకేశి ప్రలంబ । వత్సబక దైత్యులై ముక్తిఁ బడసిరిపుడు ॥ 96

## వ్యోమాసుర సంహారము.

మ॥ ఇటులశ్వంబగుకేశిఁజంపి యటుపైఁగృష్ణుండుగోపాళితో
నటవింటాఁగిలిమూఁతలాడునెడ వ్యోమాఖ్యాసురుండర్భకుం
డటులై యాటమిషన్ గభీరగుహలో నాభీరులన్ దాప న
క్కుటిలుం ద్రుంచి గుహాగతార్భకుల దోడ్కొంచుఁజనెన్ మందకున్ ॥ 97

## మాతులాహ్వానము.

సీ॥ వినుఁడు నారదుఁడు కంసునకుఁ గృష్ణప్రశంసయును గృష్ణునకుఁగంస ప్రశంస
యును దెల్పవినికంసుఁ డుగ్రుఁడై వసుదేవు నటకరా వారించె నారదుండు
పిమ్మట నక్రూరుఁబిలిచి పిమ్మటలచందములెల్లఁ జెప్పి బృందావనమున
కిప్పుడనీవేగి యప్పనంబులఁగొని రామకృష్ణుల ధనుర్యాగమునకుఁ
దోడుకొనిరమ్మన నతండు గూడదనుచు। నెంత చెప్పిన వినకున్న నీశ్వరాజ్ఞఁ
ద్రోయరాదనిమొఱఁగి యక్రూరుఁడరిగి।రమ్మనఁగఁబోయి రాచరిత్రముల వినుఁడు

## దివ్యరూప ప్రవర్ణనము.

మ॥ యమునం దాఁటి రథాధిరూఢులయి వారక్రూరు నీక్షింప- గో
యమునం ద్రుంగుచు నీటఁబైటన్నాక నాలంగాంచె శ్రీకృష్ణ కా
యముసంతిక్ భ్రమదీరమున్గ యతఁడాయ్యం బాపరాశయ్యనె
య్యమునన్ వర్తిలుమూర్తిఁగన్గొను వెరంగై మ్రొక్కి ధ్యానింపుచున్ ॥ 99

సీ॥ మలనూని విలువోని నలువ్రాని చెలువారు పులిగోరు తీరు కన్బొమలవాని
తొలిగుండు తలనుండు నలనిండు నెలమించుఁ గిలరించు తెలిబొమిడికమువాని
కటితాల సరిగ్రాలు నెతిచాలు నెతిచాలు గదిశెడు కుదురైనసుదురువాని
కొలగాని మెఱుఁగాని నెఱితూనికంబుల నందమౌ హెచ్చుబాజాబందువాని
తెలిహొంమాశేని మానికంబుల జగాని। గారమొగిఁగేరి జగిదేరి మీఱునోసనల
వడకువిడినివ్వటిల్లుమవ్వంపుదివ్య।చొక్కమొకచక్కిఁ జేర్చుచేర్చుక్కవాని ॥ 100

## దివ్యరూప వర్ణనము.

సీ॥ అంగదంబంగదలంగదలంకించు చౌలంగదముల నెసంగువాని
మురిపెంపు సిరిపెంపుసరహింపు రతనంపు పేరు పేఱురమున మీఱువాని
యురుగుల్ మెఱుంగుటుంగరములుం గరములం గరమలంకృతులుగాఁ గలుఁగువానిఁ
జెను మించులనుమించు పికిలిపించెపుఁగుచ్చు వ్రేలాడుమొలత్రాడు వెలయువాని
శలుకుమగతాలుఁ దొగతాలుఁదమ్మితాలుఁ। బుల్గుదొరతాలుఁగటితాలుఁ బ్రొద్దు
[తాలుఁ
దాయొరలచాలు నెలతాలుఁ దలువుతాలుఁ గలుఁగుమేల్కొందనపుటంచెల
[లరువాని॥ 101

సీ॥ అలసంపఁగుల జొంపముల పెంపడఁగఁ బొల్చు నాసఁ గలుఁగువానిఁ
గురువిందములఁ గెంపు టరవిందములఁ బెంపుఁ దూలఁగించు మోవి నవ్వులయువానిఁ
గ్రమవృత్తసమ చిత్తజమహాత్తరనిషంగ కమనీయ జంఘాయుగంబువాని
వెలిదమ్ములు మదమ్ము వెలిజిమ్ము చెలువమ్ము గలనిగుడు వాలుఁ గన్నులవాని
నిడుభుజంబులవాని నుందొడలవాని । నొగులడఁచువాని గూఢజానువులవాని
మేలిడెందువానిఁ జక్కనిమేనువాని । శ్రీరమాజానిఁ బ్రభుని దర్శించి వచ్చి॥ 102

చ॥ నను విను చూలి మేఁత పయినూల్కొని సెబ్బెపులిబ్బి ప్రబ్బబో
టి నెరులు మేలి త్రీటూరవు కడిందియనుంగున గొప్పనొప్పఁ జా
లినకొనగోటఁ జిక్కువెడలింపుచు నింపుగఁ బాలవెల్లియం
దు నెగడుచున్న నిన్నుఁ దలఁతుఁ జుమీ మురమర్దన శ్రీజనార్దనా॥ 103

ఉ॥ ఈనదిలో మునింగి భవదీక్షణతృప్తుఁడనై భజించితిన్
మానసికార్చనార్పితసుమంబులు నీపయినుంటఁ గంటి ని
ట్లైనిపుడీ వెఱుంగనటు లేమిగనంబడె నీట నంటి వో
దీనశరణ్య కృష్ణ భవదీయమహత్త్వ మెఱుంగ శక్యమే॥ 104

శా॥ దేవా కృష్ణుఁడు వాసుదేవుఁడని మూర్తిస్ఫూర్తి లీక్షించి యీ
శ్రీమన్ గొల్లడవంద్రుఁడుగాని నిజమీక్షింపఁ జగత్కుక్షివే
కావే కావవె భావనామయ నీకల్యాణరూపంబు స
ర్వావస్థావసరంబులన్నిలిపి మాయం బాపి చేకొమ్ము వే॥ 105

అక్రూరస్తవము.

[illegible] శ్రీకంఠుండే సేవ్యుండంచుం జెప్పన్ వేదశ్రేణుల్ దొల్తన్
వైకుంఠుండే వంద్యుండంచుం వాదించున్ దర్వాతన్ దామే
యేకాకారంబై బ్రహ్మంబై నీమూర్తుల్ దానే యౌనంచున్
నాకుం దోఁచున్ నామాకారానందార్థం బీన్యాయంబౌటన్॥ 106

సీ॥ అనుదినమును నిను మనమునఁ గనుఁగొను మనుజుని వెనుకొని మనుతువనుచు
విను నెడఁ గను నెడఁ జను నెడఁ దిను నెడ వసు నెడ నను విడకెనయుమనుచుఁ
దెలిసియుఁ దెలియక సలిపిన కలుషము లయుతములయినను సయిపుమనుచుఁ
బనుల కొలఁది పలుతనువులనొసఁగిన నలయక తలఁపున మెలఁగుమనుచు
బహుళసుఖముల నిహమునఁ బరమపదము చరమగతి నిడుమని నిను గరిమఁ గొలుతుఁ
గరముఁ గనికరమున మదిగరుగ నభయకరము శిరమున నిడుమిక పరమపురుష॥ 107

ల॥ ఇలయును జలమనలమును చలి నెలవు గగనమును గల సకలజగములను దలఁపున నెసల్పన్
నిలుపఁ బురికొలుపఁ దరిఁ గలుపమతియితరులకుఁ బలుమఱును గనఁబడక ఘలముల
[నొసంగన్॥
బలుదెగలయవతరణములనవనిఁ గళఁబడియుఁ బలిఁ దెలియఁబడని మహిమలను చెలు
[వొందన్॥

నరసి రతిచ్ఛచే నాత్రైశమదిఁగోరఁ గాలనేమియుఁ దదాకారమూని
వచ్చిరమింపఁగా నచ్చెరువఁదుచూచి కలయికలో భర్తగామిఁ దెలిసి
తనసతీత్వముఁ జెఱచినదనుజుఁ దెగడి । కంసుఁ దనుజుఁగఁ బడసితత్ఖలవినాశ
కరుఁడు దనకులమునఁ బుట్టుఁగాక యంచుఁ । గోరి నాతండె కృష్ణుఁడై కూర్చె నిట్లు॥

జననీజనకసంభావనాదిప్రశంస.

మ॥ కుసుమంబుల్ గురిపించి రత్తఱి సురల్ గోవిందుఁడున్ దేవకిన్
వసుదేవున్ విడిపించి వేడుకొని యాపై నుగ్రసేనాఖ్యుఁ ద
ద్వసుధం బ్రోవఁగ నుంచి పిమ్మట యశోదానందులం గొంత సం
తసిలం జేయుచు వీడుకొల్పి నిలిపెన్ రావించి భోజాదులన్॥ 124

ఉపనయనమహోత్సవము.

చ॥ మహితముహూర్తమందు మహిమప్రతిభర్గుఁడు గర్గుఁ డొజ్జగా
రహి నుపనీతులై చనిరి రాముఁడుఁ గృష్ణుఁడుఁ దొంటికన్నవి
గ్రహములు బ్రహ్మతేజమునఁ గన్నులకున్ మిఱుమిట్లు గొల్పఁగా
నహహ రవీందులో, పటికనార్చిన బంగరుబొమ్మలో, యనన్॥ 125

విద్యాభ్యాసము.

సీ॥ ఏపీటనివసించి యెల్లజీవులకు విశ్వేశ్వరుండు విముక్తి నిచ్చుచుండు
నేపీట బ్రహ్మాది దేవతలుత్తములు యోగులును మోక్షార్థులై నిలిచియుండు
రేపీట మంత్రియై యిందిరాపతి క్షేత్రపాలుఁడై భైరవుండేలుచుండు
నేపీట నారసి నానావిశ్వపావని గంగాతరంగిణి పొంగిపొరలు
నట్టిమహిమాంబురాశియైనట్టి కాశి । కరిగి విజ్ఞానసందీప్తుఁడై తనరుచ్చ
నట్టిసాందీపువలన విద్యలు గ్రహించి । పుత్రదక్షిణ యిచ్చుట చిత్రమయ్యె॥

గురుదక్షిణాప్రదానప్రశంస.

ఉ॥ నైపుణిఁ జూపి యొక్కొకదినంబున నొక్కొకవిద్య గాఁగ ని
ర్లోపున విద్యలన్నియుఁ గ్రహించి రహించుటకబ్రమందిసాం
దీపుఁడు నందనందనులఁ జేరిగనుంగొనవారిఁ గోరెమో
తాపసవర్య యార్యగురుదక్షిణయంచుఁ దదీప్సితజ్ఞులై॥ 127

మ॥ ఒకనాఁ డబ్ధిప్రభాసతీర్థమున మునుఁగ నత్కుజ్జకుండై తద
ర్భకుఁ డంతర్హితుఁ డౌటెఱింగి శరధిం బ్రార్థించి తత్పూక్తిను
త్తికటుం బంచజనున్ వధించుచుఁ దదస్థిన్ బూరగాఁ గొంచు నం
తకుఁ బంకించి తదర్పిత ప్రసవదానశ్రేణిఁ దాచార్యులై॥ 128

మథురాపురప్రవేశము. కుబ్జామనోరథపూరణము.

మ॥ తదనుజ్ఞంగొనివచ్చుచున్ మథురచెంతం బాంచజన్యస్వనం
బొదవింపందమరాకఁగాఁదలఁచి స్వీయుల్ సెయ్యెం దృప్తిమం
ద దృగానంద మొనర్చి కృష్ణుఁడు యశోదానంద గోపీజిదృ
ష్ట దయుందెల్పఁగ నుద్ధవుంబనిచి కుబ్జావాంఛఁదీర్చెందమిన్ ॥ 129

సృగాలసంహారము.

మ॥ జలజాక్షక్షతుఁడై తొలంగిన జరాసంధున్ విసర్జించి సే
నలతోడన్ దమఘోషుఁడచ్యుతుని చెంతంజేరి ప్రేరేఁపఁగా
హలితోనేఁగి సృగాలుఁగూలిచి తదీయ స్త్రీలు ప్రార్థింపఁగా
నిలిపెందత్కరవీరపట్టణమునన్ వెన్నుండు తన్నందనున్ ॥ 130

జరాసంధయుద్ధము.

సీ॥ పితృవియోగమున మాకిళితులైరి పాండవుల్ధృతరాష్ట్రవిభుఁడంధుఁడతనితనయుఁ
డతిమదాంధుఁడుకుంతి సుతులెట్టులైయుండిరోయని కపటకక్రూరుఁబనిచి
జిగిమిషుఁడైయుండ జగమిషువులఁ జెండఁదగినంత సేనతోమగధనేత
దనకుఁబుత్త్రికలుకంసునకుఁ బత్నులునైనయస్తియుఁ బ్రాప్తియుఁగస్తివడఁగ
ముట్టిపడిమధురాపురిముట్టడింప । రామకృష్ణులు వారియుర్వ్యాదియమూఁడు
నైనయక్షౌహిణులఁగొట్టివానిఁబట్టి । యనువిడిచిపెట్టిరామూఁడిపనులఁబట్టి॥

కాలయవనహననము.

సీ॥ మఱియుంజరాసంధుఁడఱేఁగి యొఱిఁగియుఁ బదునేడు సారులీపగిదిఁ బాఱి
పదునెనిమిదవసారి బయలుదేరుటకు సన్నద్ధుఁడౌనంతలో నారదుండు
హరిపల్పుతులఁ దెల్పిపురికొల్పఁగా దర్పమునఁ గాలయవనుండుమూఁడుకోట్ల
యవనసైనికులతో నవనియీనినచందమున మధురాపురిముట్టడింపఁ
కృష్ణుఁడఖిలజ్ఞుఁడగుటచే ధృష్టుఁడైని । రాయుధుండయిరాఁగనియతఁడుదఱుమ
హరియుంగిరిగుహఁజొరఁగవాఁడరిగిహరిగఁ । దలఁచియందున్నముచికుందుఁదన్ని చచ్చె॥

కాలయవనజన్మవృత్తాంతము.

సీ॥ యాదవుల్గమిగొజ్జనగునన్న వన్యఁడు పరిహసించియతండు షండఁడెగాక
పురుషుఁడేయనితమపోలఁబ్రేలఁగమించు మిన్నకుండిరటంచుమిగులఁబొగిలి
యదుకులభీకరుండగుసుతుఁగోరి పండ్రెండేడులుక్కుపిండిఁదినుచుండి
ఘనతపమొనరింపఁగరుణించిభర్గుఁడు గర్గుండడిగినట్లుకలుగువరఁగ
నాతఁడచ్చరయందుఁగన్నట్టిసుతుని। యవనపతిపెంచితనరాజ్యమునవలనొసఁగ
నాతఁడే కాలయవనుఁడౌననిముకుందుఁ । డెంచిమచికుందు చేతమ్రందించెనిట్లు॥

వాసుదేవప్రభావప్రశంస.

చ॥ హరిగరిమంబెఱుంగఁ దరమా పరమాత్ముఁడతండు నేఁడు భూ
భరముహరింపఁ గృష్ణుఁడయి భక్తులఁబ్రోచుచుఁ బాపయుక్తులం
బోరిఁగొనుచున్నవాఁడు వెలుపల్ మఱుపల్ గలవాఁడుగాఁడు భం
గురమతులెట్టులన్న ముచికుందరిరక్షణ నర్చనీక్రియన్॥ 134

ముచికుందచరిత్రము.

సీ॥ ముచికుందునిచరిత్రము వినుఁడతండు మాంధాతృపుత్త్రుఁడు దేవతాహితార్థి
వాసవప్రార్థితుండై సమరములందు నసురులఁ జయంబున మరఁ జేసి
సురలుప్రసన్నులై వరమీయఁదలఁచిన దనవాఁగుఁ లేమి నిద్రనువరించి
లేపినవానిఁ గూల్చెద నంచుఁబన్నంట హరియెఱుంగునుగాన నతనినిపుడు
మేలుకొల్పుటకిరీటిఁ గీలుకొల్పి । స్వాజ్ఞ చేవిశ్వకర్తమున్నద్భుతద్వ
మునసృజించినద్వారకాపురిఁ జేర్చె । యోగమహిమను మధురలోనున్నజనుల॥

క॥ వీక్షించుచు ముచికుందుఁడు । పేక్షింపక మోక్షసుఖను పేక్షింపఁ గృష్ణన్
రక్షింపనున్నజలజా । క్షునిటుల్ బాగడఁదొడఁగెనతఁడానతుఁడై॥ 136

ముచికుందస్తవము. బాలకృష్ణస్తవము.

శా॥ శ్రీనందప్రియనందనుండవగుచున్ ద్రేపల్లెలోఁ బుట్టి నీ
వానందప్రియమూర్తివై తిరిగి నీయాకారమే కారణం
బైనసూత్రములు చేసి కన్పఱచి నన్నానందమొందింపుమీ
నానామంగళసంఘసంఘటన కృష్ణా బాలకృష్ణాహరీ॥ 137

శా॥ నేనే వాఁడననంటి వేఁడుకొనుచుంటిం బ్రోవుమంటిం గృపన్
నానేరంబులు సైపుమంటి భవసంతాపంబు నే నోర్వఁగా
లేనంటిన్ నినువంటివేల్పులెవరున్ లేరంటి రక్షింపుమీ
నానామంగళసంఘసంఘటన కృష్ణా బాలకృష్ణాహరీ॥ 138

శా॥ నేనేకార్యముఁ జేయుచున్నవది నీనిత్యార్చగాఁ జూచి నా
దీనత్వంబెడఁ ద్రోచి కేవలకృపాదేదీప్యమానుండవై
నేనిం జెందఁగనీక యేమరక నిత్యానందమొందింపుమీ
నానామంగళసంఘసంఘటన కృష్ణా బాలకృష్ణాహరీ॥ 139

శా॥ జ్ఞానంబించుకయైన లేనికతనన్ సంసారసౌఖ్యంబులన్
మానంజాలఁగనైతి నట్టులయినన్ మత్పూర్వపుణ్యంబునన్
నీనామస్మరణంబు గల్గెనిఁక దానిన్ నిల్పి రక్షింపుమీ
నానామంగళసంఘసంఘటన కృష్ణా బాలకృష్ణాహరీ॥ 140

శా॥ నీ నాభీకమలంబునం బొడమి వాణీభర్త నీతత్త్వ మిం
తైనం గన్గొనఁజాలఁడన్యు లనఁగా నస్మాదృశాత్యంతమూ
ఢానీకంబు గనుంగొనంగలదె ప్రత్యక్షంబవై యేలుమీ
నానామంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 141

శా॥ సూనుం డెంతటి నేరపోతయిన సంక్షోభంబు లేకుండుచుం
దానం దండ్రి సహించి ప్రోచుకరణిన్ నానేరముల్ సైచి నీ
యానం ద్రిప్పి యొసంగు మైహికసుఖం బాముష్మికానందమున్
నానామంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 142

శా॥ విశ్వంబంతయు నీవుగాఁగనుచు దేవిన్నిన్ను సేవించువా
రైశ్వర్యంబిహమందునొంది పరమం దైక్యంబుఁ బ్రాపింతుర
న్విశ్వాసంబునఁ దత్ఫలార్థినగుచు న్నిన్గొల్చుచుంటిం జుమీ
శశ్వన్మంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 143

శా॥ అక్షుల్ నిన్గనునట్లు హస్తములు నిన్నర్చించునట్లాత్మ ని
న్నక్షీణంబుగ నమ్మునట్లు చెవి నిన్నాలించునట్లాస్యమున్
దీక్షన్ నిన్గొనియాడునట్లు కరుణన్వీక్షించి రక్షింపుమీ
సాక్షాన్మంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 144

మ॥ సుగతిం గోరుదుఁ గాని యేసుకృతమెచ్చోనైనఁ జేయంగ నై
తి గజేంద్రస్థితి నింటి నిన్గొలుచుచుంటిం బారతంత్ర్యంబుచే
త గుటుందప్పించరించుచుంటి నయినం దాసుండ నైతిం జుమీ
జగతీమంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 145

మ॥ మును నీసన్నిధిఁ దక్కఁ దక్కినఫలంబుల్ పుట్టుచుం గిట్టుచుం
గనుఁగొంటిం గనుఁగొంచునుంటి నిటపైఁ గారుణ్యమే పారఁగా
ననునీసన్నిధిఁ జేర్చుకొమ్మిదె సుమీ నా ప్రార్థనీయంబు స
జ్జనతామంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 146

క॥ చనువుననింతియనా కో। రినయది నీవింతమాత్ర గృపసేయఁగదే
వినతాశ్రితవనచైత్రా। వినతాసుతపత్ర వేదవినుతచరిత్రా॥ 147

క॥ అని యీగతి వినయాగతిఁ। దనరారఁగ భక్తియుక్తితత్పరుఁడగుచున్
వనజాక్షుని వినుతించిన। జనితానందమున సుప్రసన్నుండగుచున్॥ 148

## ముచికుంద వరప్రదానాదిప్రశంస-

ఉ॥ కోరి ముకుందుఁడట్లు ముచికుందునకున్ వరమిచ్చి వచ్చి, కాం

తారములేలఁగాలయవనప్లుతనం జతనంబులేక దా
సీరియు నేకమై తునిమి శ్రీమథురా ధనధాన్యసంపదల్
వారక ద్వారకాపురికిఁ బంప జనుల్గొనిపోవుచుండఁగాన్॥ 149

## శ్రీద్వారకాపుర ప్రవేశము-

సీ॥ అంత జరాసంధుఁడంతక నిభసైన్యములతోడ మథురను ముట్టడించి
రామకృష్ణులు ప్రవర్షణగిరిశిఖరంబునకుఁ బోవుటగని వెన్కదవిలివారి
మతమెఱుంగక భయంపడిమఱుపడిరని బ్రహ్మసివారి దహించువాఁడు బోలె
నగ్గిరి డగ్గరి యగ్గిరవులొల్పి ప్రగ్గిరి వారని మరలి పోయెఁ
బదునొకండామడలపొడవెత్తఁగియున్న । యున్నతగ్రావశిఖరంబుమండి హరియు
హలియునింతకుమున్నె సైన్యముల వెలికి। దాఁటి ద్వారకఁ జేరి రత్యద్భుతముగ॥

## శ్రీమథురా క్షేత్ర మాహాత్మ్యము-

శా॥ శ్రీకృష్ణాభ్యుదయంబునన్ మథురయే క్షేత్రోత్తమంబౌచు నా
దా కాశ్యాదులకన్న జన్మమరణ బ్రహ్మోపదేశాంగదా
హోకార క్రియలంజతుర్విధముగా నైక్యప్రదంబౌచు ను
ద్రేకించెన్ మహిమంబునన్ జతురశీతిక్రోశమధ్యంబునన్॥ 151

## శ్రీద్వారకాపుర వర్ణము-

శా॥ మున్నింద్రాదిపురంబులెల్లఁ దనకూర్పున్నేర్పు రాజిల్లనో
జన్నిర్మించిన విశ్వకర్మ హరియాజ్ఞం జేర్చి నిర్మించె న
మ్మున్నీరంతరమిచ్చె లక్ష్మికదియే పుట్టిల్లునట్టిల్లుఁ బెం
పెన్నన్ ద్వాదశయోజనంబులు తరంబే ద్వారకంజేర్పగన్। 152

సీ॥ అకలంకనిత్యపూర్ణకళావిరాజిత ద్విజరాజరాజిప్రదీపితంబు
సంతతక్రతువృద్ధిసంపాదనానుగ్రరాజావతంస విరాజితంబు
మిత్రసంప్రీణనస్తోత్రపాత్ర నిధీశపుణ్యజనార్యవిస్ఫూర్జితంబు
సఫలహలక్రియాసంపూర్ణబలభద్రశూద్రవర్ణబలాభిశోభితంబు
విబుధకులవృద్ధి శైత్యవర్ధి శుభసమృద్ధి పుణ్యాభివృద్ధి జడేతరర్ధి
శుద్ధి ధనవృద్ధి బహుముఖసిద్ధి విజిత। సురవరపురంబు ద్వారకాపురవరంబు॥

చ॥ లలనలు తత్పురీ దయితులం దమిఁగాఁగిటఁజేర్చి చంద్రశా
లల నలువొంద ముక్కా రతివిలాసి జయించుటకేఁగి వారి లీ
లల నలలోచనప్రతిఁ జెలంగఁగనుంగొని భీతినింద్లగన్

లలనలు దిక్కులన్ విడుచు లక్షణముం దెలుపన్ వెడల్విరుల్॥ 154

చ॥ తనరు హరిన్నభంబులను ద్వార వితానములొంది చిల్వఱేఁ
డను వెలఁదాల కంబమున నందము నొంపుచునున్న భూతలం
బని యెడు మేడలో నిడిన యంతత దర్పణదీపయంత్రమో
యన ఘన భర్మహర్మ్యసహితాచ్ఛమణీకృతవప్రమప్పురిన్॥ 155

చ॥ తరమె నుతింపఁ గ్రాలుమణివితాన వితాన తతానపాయముం
దిరరుచి కౌముదీ ముదిత దివ్యచకోర ముదశ్రుపూర సా
గర సురదీర్ఘికా వలన ఖండితపత్త్రిసరోరుహాస్థ బం
భర ఫణిభోగశాయి హరి పశ్యదశేషసురిన్ మహాపురిన్॥ 156

మ॥ పురమూశాంతరవర్తికీర్తికలశాంభోరాశిరాడంతర
స్ఫురదత్యున్నతవప్రశృంగదళవిస్ఫూర్జత్స్వపక్షోత్కటో
త్కరబద్ధాలయకాంతిరేఖావిలసత్పద్మాక్షభృంగోజ్జ్వల
ద్ధరిదుర్గాంబుజనాళలీలఁదగు నుద్యత్కేతనంబప్పురిన్॥ 157

క॥ ఆపుర మున్నతగోపుర। మ్మై పరఁగి పయోరుహాసనాండోర్ధ్వపుటం
బేపున భేదించియ కా। చే పుటభేదనసమాఖ్యఁ దెచ్చెఁ బురులకున్॥ 158

మ॥ వినతానందన విశ్రుతిం దనరుచున్ వేదాత్మకత్వంబునన్
గనుటన్ వ్యాకరణప్రవీణత ననంతఖ్యాతిసంపత్తిచే
మనుటన్ ముప్పదిరెండునాఁ దనరుసమ్యగ్బ్రహ్మవిద్యల్ గనుం
గొనుటన్ నామము సార్థకంబగుచు వెల్గుం దద్ద్విజశ్రేణికిన్॥ 159

మ॥ నరమాత్రుల్సొరరానిచోటవలనన్ నానాప్సరోయక్ష కి
న్నర విద్యాధర సిద్ధకింపురుష గంధర్వాదులయ్యోపనుల్
పురిఁ గావించి గడించుచున్న విభవంపుం బెంపు నీక్షించుచున్
హరి కర్పింపని నాటికల్మిగని యత్యాఖ్యాతుఁడౌ నింద్రపన్॥ 160

శా॥ అన్నాళీకదళాక్షుఁ డన్నిటికి నధ్యక్షుండు నుం గారణం
బిన్నానావిధ విష్టప ప్రతతి తత్సృష్టంబు తత్పుష్టముం
దన్నిష్టంబును దద్వినష్టమగుఁ గ్రీడామాత్రమాప్రోఢకే
తన్నిర్మాణభృతి ప్రభృత్యఖిల కృత్యంబెన్న నత్యంతమున్॥ 161

ఇంద్రాద్యమరసమర్పిత తత్తద్వైభవ ప్రశంస-

సీ॥ పారిజాతంబులోఁ బరమాద్భుతంబగు తగుసుధర్మను బురందరుఁడొసంగె

శ్రవణైకదేశమేచకమనోజవశుక్లవర్ణతురంగముల్వరుణుఁడొసఁగె
వరనామకంబైనవరనిధినొక్కటి దక్కఁదక్కిన నిధుల్ధనదుఁడొసఁగెఁ
దక్కినదిక్పతుల్దమకుమున్నీశ్వరుండిచ్చిన సంపదలెల్లనొసఁగి
రిట్టిసంపదలకునెల్లఁబుట్టినిల్లు। నైపరఁగుద్వారకాపురి నధివసించి
హలధరుఁడు రేవతిం బెండ్లియాడెఁ గృష్ణుఁ। డష్టమహిషులఁ బెండ్లాడె నద్భుతముగ॥

రేవతీ పరిణయము-

సీ॥ కృతయుగమందు రైవతుఁడను రాజు రేవతియనఁదగుతనసుతకుఁ బెండ్లి
సేయఁదలంచి యేక్షితిపతినొల్లక కన్యతో సత్యలోకమున కరుగ
నృపుతలంపు విరించి యెఱిఁగి యిర్వదియెన్మిది మహాయుగములు గతించె ద్వాప
రయుగాంతమిపుడయ్యె రాముఁడు కృష్ణాగ్రజుఁడు గాన వర్యుఁడీసుతనొసంగు
మనఁగనాతఁడు ద్వారకకరిగి యొరగి। తనతలంపును నల్వపంపు నెఱిఁగింప
లాంగలంబునఁ గ్రిందికిలాగి కుఱుచఁ। జేసి రేవతిఁ బెండ్లాడె సీరధరుఁడు॥

అష్టమహిషీకల్యాణ ప్రశంస.

౧- శ్రీరుక్మిణీ కల్యాణము.

సీ॥ శ్రీశాంధృతి విదర్భదేశాధిపతి భీష్మకుండు కుండినపురి నుండు నాత
నికి రమాంశమున జనించిన రుక్మిణియందుఁ గృష్ణుఁడుఁ గృష్ణునందు రుక్మి
ణియుఁ బరస్పర మోహానిర్మగ్నులై యుండ రుక్మిణి యన్నయౌ రుక్మి పూని
శిశుపాలునకొసంగ సిద్ధమైయుండుట ద్విజునంపి రుక్మిణి దెల్పఁ గృష్ణుఁ
డరిగి పురశక్తిఁ గనఁబోవుటరసి యామె। నరదమెక్కించుకొని పోవ నడ్డుపడినఁ
దలగొఱిగి రుక్మినదలించి తరలివచ్చి। యంటరుక్మిణిఁ బెండ్లాడెఁ గృష్ణమూర్తి॥

ద్రౌపదీ స్వయంవర ప్రశంస-

సీ॥ ద్విజవేషమున ద్రౌపదీస్వయంవరరంగమునఁ బాల్చు పాండునందనులఁ బోల్చి
శౌరి సీరికిఁ జూపి జయమొందునేఁడిందు విజయుండనుచుఁ దెల్పి స్వజనములను
గదలకుండఁగ నిల్పికనుచుండఁ దమకసాధ్యంబైనయంత్రమత్స్యంబు నేసి
యాజ్ఞసేని వరింప నరుగు నరుం గని యెదిరించి యోడిర య్యనసుతాదు
లంత పైఁ గొంతికాడుకులయంతికమున। కరిగి లాక్షాగృహవిముక్తులైన మిమ్ముఁ
గంటి మిదిపుణ్యదినమమేల్గల్గు మీకు। టంచు వీడ్కొనివచ్చి రిహరియు హలియు॥

౨- జాంబవతీ పరిగ్రహణము-

సీ॥ రవి నిత్యమష్టభారసువర్ణమిడు శమంతకమును సత్రాజిత్తునకొసంగెఁ

దదనుజుండుప్రసేనుఁ డడవిఁజొచ్చి వేఁటకుఁజన్న వానిసింగంబుదునిమిదానిఁ
గొనె దానిఁదునుమాడి కొనె జాంబవంతుఁడీకృత్యమెల్లనుదనదేయటన్న
నింద చతుర్థినాఁడిందునిఁదాఁగన్నఫలమని కృష్ణుండుదలఁచి పెలుచ
నడుగుజాడనుగుహఁజొచ్చియచటజాంబ।వంతుతోఁబోరియాతనివరమువీర్చి
మణిని జాంబవతింగొనిమరలివచ్చి। మణినతనికిచ్చితననిందమాన్పికొనియె॥

క॥ పాపోపడఁ జూపోపని। పాపోప నిబద్ధలకటపటుకటుచటుల
వ్యాపారంబేపారఁగ। లాపనలం బన్నుచుంబ్రలాపించిరిగా॥ 167

## ౩. సాత్రాజితీ వివాహము.

సీ॥ హరిగోరినప్పుడీనైతి నూరకనింద మోపితి నతనిపైఁబాపినైతి
ననుచుఁబశ్చాత్తప్తుఁడగుచు సత్రాజిత్తుమణితోడసత్యభామనుసమర్ప
ణముచేయహరియుఁ గన్యామణిఁ బెండ్లాడిమరలనాతనిక యమ్మణినొసంగెఁ
దనకిచ్చెద నటన్నతనయ నన్యునకిచ్చెనని శతధన్వుఁడాతనివధించి
మణినిగొనివచ్చి కృతవర్మమరుఁగుఁజొరఁగ। నతఁడునిరసించనక్రూరుఁడట్లయనఁగ
నతనికడనిడిచనుచుండహరివధించి। మణికినక్రూరురావించిమరలనొసఁగె

వ॥ అదియెట్లనిన,

సీ॥ నను నిల్పి శతధన్వుఁదునిమి శమంతక మపహరించితివి లేదంటివడుగ
శపథములుకాపథములెల్లఁ జాలునునమ్మఁజాల నిన్ననిసీరి శౌరివదలి
మిథిలలోనూఁడేండ్లుమెదలి దుర్యోధనునకుఁ దా గదా కదనంబుఁగఱపె
సవనదీక్షాకవచసురక్షితుండౌచుఁ గాశికాపురినుండెఁగాందినేయుఁ
డపుడవగ్రహశాంతికైయతనినితనిఁ। బిలిచిమణిఁగొనికలుఁద్రావుహలధరుండు
నేనుస్త్రీలోలుఁడను నీవునియమశాలి। ఉంచమనిగాందినేయునికే యొసంగె॥

## ౪. కాళిందీ కల్యాణము.

సీ॥ పాండుసూనులఁ జూడఁ బుండరీకాక్షుఁ డింద్రప్రస్థపురికేగితానునింద్ర
నందనుండును యమునాతటంబున వేఁటలాడుచునొకకన్యనందుఁగాంచి
తన్వరింపఁగనీటఁదన్వితపించుట కాళిందియాదిత్యకన్యయగుట
విజయదౌత్యంబున వినిసంతసిలితదన్వితముగాఁ దోతెంచివిశ్వకర్మ
వీరిపురిఁ జిత్రతరముగాఁగింపఁబంచి। ఖాండవముఁద్రాఁచునెడఁగాచిగాండివాదు
లగ్నిసభమయుఁడిడఁ గ్రీడికబ్బఁజేసి। ద్వారకకువచ్చియామె నుద్వాహమయ్యె॥

## ౫. మిత్రవిందా పరిణయము.

సీ॥ అల నవంతిదేశాధీశులైన వింధానువిందులు కౌరవాధిపత్యా
ధీనులై కృష్ణుని మేనత్తయైన రాజాధిదేవికిఁ గడునను(ఁ)గుపట్టి
తమకుఁ జెల్లెలు నయితగు మిత్రవింద కుద్వాహంబనుచు స్వయంవరము సాటఁ
బనిచిన విని చనివనరుహనయనుండు రాజరాజు మొదలైన రాజులరయ
నయన విజితారవింద దంతజితకుంద। చికురజితనీలకంద దృగ్జితమిళింద
మిత్రబృందావనానంద మిత్రవింద। నపుడు చేకొనె నృపులంద ఱుకుఁజెంద॥

## ౬. నాగ్నజితీ పరిణయము.

సీ॥ నగ్నజిత్తనియెడు నామధేయమునఁ గోసలదేశమున కధీశ్వరుఁడు గలఁడు
నాగ్నజితియనందనర్చు నాతనికన్య యామెను రాజన్యులడుగఁ గాఁగ
సప్తగోవృషముల సమ్ముఖమ్మున నిల్పి వీనిఁ బట్టినవానికే నొసంగు
వాఁడెఁ గన్య ననంగ వశను గాకుండఱు విముఖులై పోవుటవిని చని హరి
సప్తరూపమ్ములై గోవృషములఁ బట్టి। గట్టిగాఁ గొట్టి యీడ్చి పొగడ్త కెక్కి
నాగ్నజితి నప్డు పెండ్లాడి నగరి కరిగె। నద్దముగ వచ్చి వివ్వచ్చుఁడరులఁదునుమ॥

## ౭. భద్రోద్వాహము.

సీ॥ సౌందర్య సౌశీల్య సౌభాగ్య సౌముఖ్యముఖ్య సద్గుణగణాద్భుత సముద్ర
బంధుమిత్రాతిథిపండితకవి భృత్యసాధుదీనార్థిపోషణ వినిద్ర
పతితపాషండ దుర్వ్యాపారపిశునాదిహీనసంభాషణమౌనముద్ర
భర్తృశుశ్రూషాది పరమధర్మాభ్యాసపాటవతులితశుంభత్సుభద్ర
మందగమనవినిర్జితమహితభద్ర। పరమపావనచారిత్ర భద్ర భద్ర
మేనమఱఁదలు గావున మేరసెడక। కేకయుఁడొసంగఁ బెండ్లాడెఁ గృష్ణుఁ డెలమి॥

## ౮. లక్షణా కల్యాణము.

సీ॥ మద్రాధిపతులకు సద్రాజధానియై పొలుపొందు శాకల్యపురమునందుఁ
దగు బృహత్సేనభూధవశిరోమణికిఁ దులస్యంశమునఁ బుట్టె లక్షణాఖ్యా
నాకకన్య-యామాన్య కుద్వాహమొనరింపఁ దొడఁగునప్పుడు నారదుండు వోయి
కృష్ణచర్యలు సంగ్రహించి తెల్పుచుఁ గృష్ణునికిఁ గన్యనిచ్చువానిగ నొనర్చి
కృష్ణు కడ కేగి లక్షణాకృతి నుతింపఁ। గృష్ణుఁడు స్వయంవరోదంత మెఱిఁగి యరిగి
యంత్రమత్స్యమునేసి కన్యను గ్రహించి। వైరులను గెంటి యింట నుద్వాహమయ్యె॥

క॥ కల్యాత్ముఁడష్టమహిషీ। కల్యాణకథాభరంబు కర్ణరసజ్ఞా
కుల్యల జాలోత్కల్పుచు సా। కల్యమునం గాంచు నిష్టకల్యాణములన్॥ 176

## తీర్థస్నానాభిగమనము.

సీ॥ శౌరి శమంతపంచకతీర్థమునకు ప్రాప్తముగ సూర్యగ్రహణమునకరిగి
స్నానదానాదులు సలిపినపై యశోదానందపాండుసనందనముఖాప్త
జనులను వేర్వేఱ సముచితరీతిగా సల్లాపములనుల్లసిల్లఁ జేసి
కుంతియు వసుదేవుఁడెంతయు స్వప్రశంసనానర్చికొనుటకు సంతసించి
కృష్ణుఁడును కృష్ణముఖులొకకెలనముండఁ। గృష్ణయును గృష్ణసతులొకకెలనమందె
సరససల్లాపములొనర్చు సమయమందు। నిందఱను జూచి ద్రౌపదియిట్టులనియె॥

శా॥ రాకాచంద్రనిభాస్యలార కనులారం జూడ కన్నాఁడ మీ
ప్రాకామ్యంబు ఫలించునట్లు చెవులారన్ వించు సానందనై
మీకల్యాణచరిత్రఁ దెల్పుఁడనఁ జెల్మిం దెల్పి రా చెల్వలా
జోకన్ లక్షణ దెల్పెఁ దెల్పితినటుల్ సూత్మప్రకారంబులన్॥ 177

## నరకాసుర సంహారము.

సీ॥ నరకాసురుఁడు క్రొవ్వి సురమాతృ కర్ణకుండలములు వరుణఛత్రంబు సురల
మణిపర్వతము హరింప నిలింపపతి దీనుఁడై విన్నవింపఁగా హరియు సత్య
భామతో రథమెక్కి ప్రాగ్జ్యోతిషము జేరి దుర్గసప్తకముఁ దాత్తుమురుఁ జేసి
మురునైదుశిరములు ధరఁ గూల్చి తత్సప్తనందనుల వధించి నరకుఁ ద్రుంచి
వానిసుతు భగదత్తు సంపన్నుఁ జేసి। ఛత్రకుండలములు మాలిశాచిత్రరత్న
దాత్రియై ధాత్రి వేడఁ దద్వశగ సశత। షోడశసహస్రకన్యలఁ దోడి తెచ్చె॥

## సశతషోడశసహస్ర స్త్రీ ప్రశంస.

శా॥ అష్టావక్రుఁడు నీటనిల్చి సురకన్యానృత్తగీతాదులన్
హృష్టుండై హరిపత్నులౌనటు వరంబిచ్చెందనున్ నవ్వఁగా
రుష్టాత్ముండయి భక్తిలేక శబరుల్ రోధింప మీవిష్టపం
బిష్టప్రక్రియఁ జేరువారనిడె వారే వీరు నిక్కంబుగాన్॥ 179

క॥ మురపాశపరివృతం। బాశరగిరిశస్త్రాగ్నివాయుజలదుర్గంబై
కరమరుదగు ప్రాగ్జ్యోతిష। పురముఱులు జయింపఁగలరె భువిహరిదక్కన్॥

## పారిజాతాపహరణము.

క॥ కుండలములు దితికిచ్చెన్। మండలము లభించినట్లు మాతయు మెచ్చెన్

ఖండనమునఁ బురివిచ్చెన్ । హిండనమునఁ బారిజాతమింటికిఁ దెచ్చెన్॥ 181

శా॥ పౌలోమీరితరీతిఁగా నదితికిన్ భక్తిప్రయుక్తాంకము
న్పైలోమిం గసత్యభామ వినతుల్గావించి సేవించు పెం
పౌలోమీతన వేడ్కచేఁ గనుచు నిత్యాగణ్యతారుణ్యమున్
మీలో మీరనురక్తినొందుఁడనుచున్ దీవించె దేవాంబయున్॥ 182

మ॥ హరికే చెల్లెనుగాక పాకరిపు నుద్యానంబుఁ గాల్పింపఁగాఁ
దర మెవ్వారికిఁ బారిజాతముల కీధన్యుండుగా కన్యులె
వ్వరు దేఁజాలిరి కిలికిలములఁ ద్రావన్ గోవులం బ్రోవ భూ
ధరమెత్తం గరినొత్త మత్తులను మొత్తన్ గొల్లకుం జెల్లునే॥ 183

సాత్రాజితీ గౌరవాభివర్ణనము.

మ॥ క్షితి ప్రార్థింపఁ దదర్థమై యవతరించెన్ గృష్ణుఁడై విష్ణుఁ డా
క్షితి సాత్రాజితిరూపమూని జనియించెం గాన సర్వోన్నతా
దృతి పాత్రంబయి సత్యభామ దనరారెం గానిచోఁ బారిజా
త తరుప్రాపణమే నిదర్శనము సౌందర్యాదు లట్లుండఁగా॥ 184

శ్రీ రుక్మిణీప్రణయకలహ నివారణము.

శా॥ ఓహో రుక్మిణి లక్ష్మియయ్యుఁ దన పెంపూహింప నట్లుండెఁ ద
న్మోహోద్రేకముఁ దీర్తునంచు విరసంబుల్ వల్కియుల్కించి పూ
ర్వాహోపూరుషికంబె కల్పి సదయుండై తత్ప్రియం బెట్లటుల్
స్నేహోత్సాహము తేర్పడంగ నలరించెం గృష్ణుఁ డా రుక్మిణిన్॥ 185

నారదసందేహ నివారణము.

చ॥ లలిఁ బదియాఱువేల సతులం బతియుం బదియాఱువేల రూ
పులగుచుఁ బెండ్లియాడెనఁట పోయి కనుంగొని వత్తు నిప్డె దే
చెలువున నుండునో యనుచుఁ జిత్తమునం దలపోసి నారదుం
డెలమిని ద్వారకా నగరి కేగి సవిస్మయుఁడయ్యెఁ దత్కృతిన్॥ 186

అతిథిసత్కార ప్రశంస.

సీ॥ కృష్ణస్వభావపరీక్షకై దూర్వాసుఁ డరుదెంచి వికటచర్యల నటించి
పాయసవాంఛఁ దీర్పవె కృష్ణ యనన ట్లకూర్చి తెచ్చిన దానిఁ గొంత గుడిచి
తనమేన నలఁదించుకొని కొంత రుక్మిణీకాంత కలందించి యయ్యంతిరథ్య
రూపిణిగా రథారూఢుఁడై కొట్టుచు నల్లట్టు పెట్టియు వెల్లఁ జట్టి

యగ్గరితఁ బ్రెగ్గతిలనగ్గి డిగ్గనుఁజికి। బుగ్గిసేఁజల్లి పాయసంబునాఁడ లెల్లఁ
బూసితివి కృష్ణ యడుగునఁ బూయవైతి। వందుఁదక్కఁ గను తెంచుఁగిడొందవనుచు॥
మ॥ కరుణింపం దలపోసి రుక్మిణి నటుల్ గాసిల్లఁగాఁ జేసి యా
తరుణిం జూచి వెలందులందు నజహాత్సౌందర్యసౌభాగ్య వి
స్ఫురణన్నిస్తులవౌదు నీవని చనెన్ శోభావిభూత్యన్వితం
బురణించెం దమ దేహ గేహములు విప్రుం డెచ్చి రాదంపతుల్॥ 188

## దూర్వాసుని జన్మ వృత్తాంతము.

సీ॥ శ్రుతులశ్వములు చంద్రసూర్యులుండలు భూమిరథము విధాత సారథి సురాద్రి
ధను వనంతుఁడు నారి దారధికుండునై, యమపుంఖ శుచిశల్య హరిశరమున
రుద్రుండు త్రిపురాసురుల సంహరించి మున్నయ్యస్త్రము నిజాంకమందుఁ జేర్చి
కూర్చుండెఁ బంచశిఖుండగు సంయమి యయ్యెనయ్యమ్మ నెయ్యమ్మహత్త్రి
కృత్తివాసుండు దుర్వాసుఁ డీతఁడని యొనత్రిప్రార్థింపఁ దత్పుత్త్రుఁ డయ్యెనతఁడు
నిగ్రహానుగ్రహసమర్థుఁడు గ్రుఁడాగ్ర। హించి బ్రహ్మాండమదహించుఁ బెంచు దయను॥

## సుభద్రా పరిణయము.

సీ॥ శపథభంగంబు బీజము గాఁగ విజయుండు తీర్థయాత్రకు వెలుదేరునపుడు
లూచి చిత్రాంగద నేచి వివాహమై యతివేషమున ద్వారవతికి రాఁగ
నతని చిత్త మెఱింగి హరి యంతిపురిఁ జేర్చి పరిచరించుటకు సుభద్రను నిచి
పశుపతిపూజనెపంబుగా రామాదిఘనుల నంతర్ద్వీపమునకుఁ జేర్చి
తానునింద్రుఁడు స్మరణమాత్రమునఁ గూడి। పెండ్లి చేసి సుభద్రను విజయునని చి
హాలి కినుక మాన్పి వారికి హరణ మొసఁగి। పాండవాప్తుఁడై వచ్చె ద్వారవతికి॥

## కైలాసయాత్రా ప్రశంస.

సీ॥ రుక్మిణి వాంఛఁ దీర్చుటకుఁ బుత్త్రార్థియై వాసుదేవుండు కైలాసయాత్ర
కై వెలువడి బదరీవనంబున ఘోరతపమొనర్చుచున్న తఱిఁ బిశాచ
నాయకుండైన ఘంటాకర్ణుఁ డలకృష్ణుఁ డెందొప్పఁ గని తరియింతునెప్పు
డనుచు వేఁటాడుచు నాత్మసన్నిధికి రాఁ బ్రశ్నోత్తరములఁ దద్భక్తి నరసి
లోను వెలి నేకరీతిఁ గాఁ దానతోఁచి। ద్విజశవము పావనము దీనిఁ దినుమన నగి
హితమెఱింగి సాయుజ్యహేతువైన। దివ్యరూపమొసంగె భక్తికెనగలదె॥

## ప్రద్యుమ్నోపాఖ్యానము.

సీ॥ ప్రద్యుమ్నుఁడై పుట్టెరతిపతి రుక్మిణీకృష్ణులకనివిని కీడు మూడ

నని శంబరుఁడు సప్తమనిశీథమున మాయవలన దొంగిలి వాని వార్ధిపైవ
నాఁక మీను మ్రింగె జాలికుఁడు దానిం బట్టి యిత్తుమతిపురికేగి శంబ
రావరోధమగు మాయావతి కొసఁగెఁ దద్గర్భముఁ జించి యందర్భకుఁగని
పెంచి మాయలు నేర్చి మోహించితాను। రతియగుటఁ దెల్పి పురికొల్ప రక్కసుని వ
ధించి యతఁడు నమ్మాయావతియును రాఁగ। యదుకులము సంతసిలె నారదాభినుతిని॥

## రామకృష్ణుల సంతాన ప్రశంస.

కం॥ శరుఁ డుల్ముకుండు రణ్యకర్ణులు గుపుత్రులు గఁబడసి రాముఁడు పుత్రిం
గరినవకుచం గనకాంగి। జరనీయగుణాఁ సుభద్ర పట్టికొసంగెన్॥ 193

సీ॥ సరవిఁ బ్రద్యుమ్నుండు చారుచంద్రుండును జారుదేష్ణుండును జారుబాహు
జారుదేహ సుచారు చారులు ప్తవిచారు భద్రచారు సుదేష్ణు లద్రినిభులు
పదుగురు తనయులొప్పైఁ జారుమతియను తనయ రుక్మిణియందు జననమైరి
సాంబ సహస్రజిచ్ఛతజిత్సుమిత్ర మిత్రక్రతు విజయులు ప్రవిదచిత్ర
కేతు పురజిత్తులనఁగఁ బ్రఖ్యాతిగన్న। సుతులఁ బదుగురఁ గని మిత్రవతియనంగ
వినుతికెక్కిన చక్కని తనయనాకతెఁ।గనియె జాంబవతీదేవి మన ముదనియ॥

సీ॥ భానుఁ బ్రభాను స్వభాను స్వర్భాను శ్రీభాను బృహద్భాను భానుమంతు
నతిభానుఁ బ్రతిభాను నలచంద్రభానునిఁ జారుభ్రమరికను సత్య గనియె
శ్రుతకవివృషవీరసోమకశాంతి భద్రులు పూర్ణిమాసదర్శులు సుబాహుఁ
డను పదుగురుపుత్రులను గాత్రవతియను తనయ విక్రమతనయ గనియెఁ
బవనవృషనారగృధ్రాంకవహ్నివర్ధ। నానిలమహాశనత్సుధులనెడు సుతులఁ
బదువుర సుభద్రవతియనఁ బరఁగు సుతను।వేడ్కలిగురాత్రగా మిత్రవిందగనియె

సీ॥ వీరచంద్రవృషాశ్వసేన వేగవదామవసుకుంతి శంకువీరపదభిఖ్యు
లగు పదుగురు పుత్రుల నలస్వేతయనంగఁ జెలఁగు పుత్రిని నాగ్నజితియు గనియె
శరవిశూర సుభద్ర సంగ్రామజిద్వామ సత్యక ప్రహరణజయులు హరిచి
త్రాయుర్బృహత్సేనులను పుత్రులను దామ్రపక్షికయను సుత భద్ర గనియె
బలుఁ బ్రఘోషుని సింహుని బ్రబలు నూర్ధ్వు। సహజు నపరాజితుని మహాశక్తి నజుని
గాత్రవంతుని సుతదశకంబుగాఁ జ। లందమను పుత్రిగాఁ గనె లక్షణయును॥

సీ॥ వినుఁడింకఁ బదియాఱువేల నూర్గురియందుఁ బ్రత్యేకముగ సుతుల్ పదుగురేని
పుట్టిరి వారును బుత్త్రులఁ గాంచుచు యదువృష్ణిభోజాంధకాదులనఁగ
జగతి నేకోత్తరశతశాఖలైరిట్లు ప్రబలిన హరిపుత్త్రపౌత్త్రజనము

వసుమూఁడుకోట్లయెన్బదియొనిమిదివేల నూర్గురుగురువులావర్గసంఖ్య
భర్గుఁడైననుగృతజగత్స్రష్టుఁడైన। నింతయనిచెప్ప లేరన్ననితరులెన్నఁ
గలరె వలతేనితంత్రిజగత్కుటుంబి। తత్కుటుంబము గానిదిధ్ధరణిఁ గలదె॥

శా॥ కుబ్జాకృష్ణులకుద్భవించి సువివేకుండై యుపశ్లోకుఁడ
య్యబ్జాతాసనుపుత్త్రుశిష్యుఁడయి దివ్యజ్ఞానియై తా నను
ష్టుబ్జాలంబునఁగూర్చె సాత్వతమనంజూపట్టుతంత్రంబదే
న్యబ్జాస్త్రీపరిచారికాపదజమోక్షోపాయమంత్రంబుగన్॥ 198

## అనిరుద్ధవివాహమహోత్సవము.

సీ॥ స్వస్వవత్సలుఁడు రుక్మిస్వసుతయై తగురుక్మవతిని శ్రీరుక్మిణీసుతులయందుఁ
బ్రద్యుమ్ననకొసంగి ప్రద్యుమ్నసుతుఁడైన యనిరుద్ధునకుఁదన మనుమరాలి
రుక్మలోచనయను రుచిరాంగి నొసఁగెఁ దత్పరిణయాగతులైన ధరణిపతులు
పెరరేపఁగా దురోదరమునదబ్బరలాడిన రుక్మిని హలివధించెఁ
బరిణయానంతరమునదంపతులఁదోడు। కొనుచు ద్వారకకేతెంచి రనుపమాన
మానసీయోత్సవంబుతో మాధవాదు। లవల బాణాసురుని గర్వమడఁచి విడిచె॥

## ఉషా పరిణయము.

సీ॥ హరదత్తవరమత్తుఁడగుచు బాణాసురుండతఁడు గాశలియుండ నతిశయించి
యుండెఁదత్పుత్త్రికయుష యొక్కచక్కని పురుషుతో స్వప్నసంభోగమొందె
నందటివిలెనుడమిందెలిసి తదాప్తసఖి చిత్రరేఖ తత్స్వాంతమెఱిఁగి
రాజరూపములెల్ల వ్రాసిచూపఁగ ననిరుద్ధునిఁజూపి తత్సిద్ధిఁగోర
యోగబలమునఁ బ్రియుఁదనకొసఁగ నతని। వలననుష గర్భవతియాటఁ దెలిసి బాణుఁ
డతని ఫణిపాశమునఁగట్టె నని విని హరి। శోణపురికేగి చేసిన చొప్పవినుఁడు॥

## బాణాసురగర్వ పరిహారము.

సీ॥ వాసుదేవుండు కైలాసయాత్రకుఁ బోయి యుపమన్యునుపదేశమొంది ఘోర
తపమొనరింపఁ బ్రత్యక్షమై త్ర్యక్షుండు మున్ను వరంబిచ్చి యున్నదియును
బ్రహ్మసునకువధింపఁ ద్వాదీయులనటంచు మున్ను వరంబిచ్చియున్నదియును
గారణంబులుగ రక్షకుఁడై యెదిర్చిన ఫాలాక్షునంతలోపల విదిర్చి
సమవివాదవివాహముల్ శ్లాఘ్యములని। పట్టిబాణాసురునిఁ జతుర్బాహుఁ జేసి
విడిచి యుషతోడ ననిరుద్ధు వేడ్కగాఁగఁ। గొంకొనుచువచ్చె ద్వారకాదుర్గమునకు॥

## కరిపురోత్పాటనాది ప్రశంస.

సీ॥ అలసుయోధనుకూఁతురగు లక్షణను వివాహమున సాంబుఁడు సాహసమున నెత్తి
కొనిచనఁ గనుఁగొని మునుకొని కినుకను జెనఁగొను మనమున వెనుచనిచని
రాధేయశల్యసుయోధనప్రభృతులు గవియఁగా నిభృతుఁడైకవియుటరసి
యందఱుఁ బోదివి నిరాయుధుఁ జేసి సుందరి నాతనిం గరిపురికిఁ దెచ్చు
టమరముని దెల్పనని కేగు హరిని నిల్పి। హలియచటి కేగి విఫలప్రయత్నుఁ డగుచు
నమరనదిఁ గల్పఁ గరినగరముఁ జెకల్పు। వినతులై వారినాసఁ గఁదోడ్కొనుచు వచ్చె॥

## పౌండ్రకవాసుదేవ సంహారము.

మ॥ అహహా పౌండ్రకవాసుదేవుఁ డనువాఁ డత్యుద్ధతిన్ దూత నం
చి హరి న్నిందయొనర్పఁగా హరియుఁ గాశిం జేరి వానిన్ వధం
చె హరుం గొల్చెఁ దదాత్మజుం డనలుఁ డిచ్చెం గృత్తిఁ బుత్తెంచె దా
ని హరిప్రేరితమై సుదర్శనము దానిన్ వానిఁ గాల్చెం బురిన్॥ 203

## కాళిందీ భేదనము.

మ॥ ప్రియులన్ బంధువులన్ గనన్ హలి లలిన్ ద్రేపల్లెకుం బోయి త
త్ప్రియగోష్ఠిన్ విహరించుచున్ వరుణనిర్దేశాగతన్ మద్యభా
వయుతన్ వారుణి నాదరించి సొలపై వాఃకేళికిం బిల్వ ను
ల్కయి రామిన్ విదళింప నయ్యమున యేత్రైదీర్చెఁ దత్కామనన్॥ 204

## యమునానదీ వర్ణనము.

సీ॥ ఆవర్తనాభి దీప్యత్సైకతశ్రోణి చక్రవాకస్తని సరసహృదయ
వీచీభుజాక్షేప విస్ఫురన్మీనాక్షి భృంగరోమావళి ఫేనహాస
కలహంస కలవాఢ్య కల్హారకర్ణిక శైవాలకచ ధాతుచందనయుత
ప్రక్వణత్కంకణ భాస్వద్విజశ్రేణి ఘనప్రస్పమయవేణి కంబుకంఠి
వికసితాంబుజవదనయై విభునిసదన। మనకుఁ జను సాలజవ్వని ననుకరించి
తనరెనారవికర్తనతనయ పేరు। సార్థకముగాఁగ వాఁకయైయెదుగునపుడు॥

చ॥ ఒకయెడ మందమందగతి నొక్కొకచో నతిశీఘ్రయాన మిం
కొకదరి సంకుచత్వ మొకయోర వికాసము ప్రత్యగార్ద్రిత
త్వకలన నొక్కచోట నొకవంకఁ బరాఙ్ముఖతం గభీరమం
బొకదెస నొక్కచో నిలుపు నొక్కకడం గుటిలత్వ మొందుచున్॥ 206

సీ॥ స్ఫటికయోగాత్త ప్రసాదయై హరిభక్త్యుదాత్త సాంశయికచిత్తంబువోలి
గిరిమూలఘట్టనోత్కీర్ణాంబుకణికయై శరదభ్ర కనదభ్రఘరణివోలి
దగ్ధాటవీసంగ దిగ్ధకాలుష్యయై మలినాప్తిమదోద్యోగి మనసువోలి
కఠినమాళప్రతిఘాతనివృత్తయై దుష్కర్మవిముఖసాధుమతివోలి
యున్నతానున్నతోద్గతానుద్గతప్రసారయై సంపదాపత్ప్రసాదసాద
సహితసామాన్యజనమానసంబువోలి। తనరె నిర్వ్యాఁక నర్వాఁక తగ్గులేక॥ 207

వరుణాగమనాది ప్రశంస.

మ॥ జలధీశుండు హలిం గనం జని సుధాపక్షాభూషలర్పించి యు
జ్జ్వల వారుణ్యనుభావముత్తరముగా వర్ణించుచుం బంపఁ ద
త్కలితామోదము మోదముం బెనుప పీకం గ్రోలి కాళిందిలో
జలకేళిన్ విహరించి నిచ్చ నిటు లిచ్చం గొన్ని నాళ్ళచ్చటన్॥ 208

ద్వివిదాసుర సంహారము.

మ॥ అల సుగ్రీవునిమంత్రి మైందుఁడు తదీయభ్రాతయై భౌమమి
త్రులలో మేటియునైన యాద్వివిదుఁ డెంతో మిత్రవైరంబుఁ దీ
ర్పలలిన్ రామునితోఁ బెనంగుటకు రా శాఖాగ్రముల్ మెచ్చ న
బ్బలితోఁ బోరి వధించె నబ్బలుఁ డనిం బాణిప్రహారంబులన్॥ 209

మాతృమనోరథ పూరణము.

చ॥ దయ దయివారఁ దల్లి గురుదక్షిణగా మృతుఁడైన తత్సుతున్
రయమునఁ దెచ్చియిచ్చిన పరాక్రమమిప్పుడు చూపి కంస దు
ర్నయమృతపుత్త్రిషట్కముఁ గనంబడఁ జేయుఁ డనంగ నట్ల చే
సి యశము నొంది శౌరియును సీరియుఁ బాపిరి వారిశాపముల్॥ 210

గీ॥ అఖిలయజ్ఞభోక్తయునాద్యంతరహితుండుఁ ।బరమపురుషుఁడైన పద్మనాభుఁ
డార్యవర్యు లెన్న భార్యాన్వితుండయి। యజ్ఞదీక్షనున్న సవసరమున॥ 211

విప్రశిశుప్రదానాది ప్రశంస.

సీ॥ క్షితిసురుఁ డేఁటేఁట మృతపుత్త్రికుండౌచు వగచుచుఁ గృష్ణునిఁ దెగడుటవిని
బ్రతికింతునని క్రీడిప్రతినచే శరపంజరముగట్టి కాచియుండ మృతుఁడయ్యె
సుతుఁడని నిందింపఁ జూడంగఁ దగినచోట్లెల్లనుజూచి నిస్పృహతఁగలిగి

సాదఁజొరఁబోవఁ గృష్ణుండువారించి తత్సహితుఁడై రథమెక్కి జాముపేళ
కుత్తరసాగాబ్ధితమములనుత్తరించి। జ్వాలలోఁ జొచ్చిపరమేశ వశగ శిశు గ
ణమ్మునఁ దోడ్తెచ్చిద్విజునకు నెమ్మినిచ్చి। వచ్చిక్రతుశేషమునొనర్చె నచ్చెరువుగ॥

## జరాసంధ సంహారము.

సీ॥ దృఢజరాసంధబందీ కృతరాజులు విప్రముఖంబున వేడుటయును
రాజసూయమునధర్మజరక్షణ మపేక్ష్యమంచు నారదుఁడు విధించుటయును
మగధేశుఁ దెగటార్పుమార్గంబు సూచించి ప్రీతినుద్ధవుఁడు ప్రార్థించుటయును
స్వమతంబునకు నుపష్టంభకంబులుగ నింద్రప్రస్థపురికి సాప్తముగ నరిగి
ధర్మజానుమతంబునఁ దదనుజన్ము। సహితముగ విప్రతనుజరాసంధుఁ జేరి
పోరుఁగోరితమ్మెఱిఁగించిచీరివైరి। భీముచేతఁజంపించిభూవిభులఁ దనిపె॥ 213

## శిశుపాలశిరచ్ఛేదము.

మ॥ కృశశీలుండు యుధిష్ఠిరుండిచట ధాత్రీదేవులుంచుండఁగా
దిశలేలుండని ధాతనిల్పినధరిత్రీ పాలురుంచుండఁగాఁ
బశుపాలుండు ప్రపూజ్యుఁ డయ్యెనను చుంబల్మాఱు దూషించుటన్
శిశుపాలుం దులిచెన్ సుదర్శనముసొచ్చెం గృష్ణుఁ దత్తేజమున్। 214

## వరసన్మానము-

సీ॥ దమఘోషనృపతి సాత్వతియందు శిశుపాలుఁ గాంచి చేతులు నాల్గుకనులు మూఁడు
గార్ధభస్వరమును గాంచి బెగ్గిలుచుండ నశరీరభూతమత్యద్భుతముగ
నెతఁడెత్తికొనునప్పు డీవికృతులడంగునతనిచేత నడఁగు నితఁ డనవిని
యొకనాఁడు కృష్ణుచేతికొసంగునంతనే వికృతులన్నియుఁ బాయ వెఱచి కృష్ణ
నూఱుతప్పులుచేసిన నోర్చికొనక। నీకు మేనత్తకొడుకు మన్నింపుమితని
ననుచుఁ బ్రార్థించుటాతంకమయ్యెఁ గాని। వెంటనేద్రుంపఁ డేయనిభీష్ముఁ డనియె॥

## దంతవక్త్రాద్యసుర సంహారము.

సీ॥ సాల్వుండుమాగధచైద్యాది భూపరాగంబున భూపరాగంబుఁదినుచు
హరుఁ గొల్చితద్దత్తమై కామచారమైనడచు సౌంభకవిమానంబునెక్కి
ద్వారకకేగి యుపద్రవంబులొనర్చి ప్రద్యుమ్నముఖులతో రణమొనర్ప
హరియునింద్రప్రస్థపురినుండివచ్చి యామాయావితో విక్రమమునఁబోరి

కృతకవసుదేవహతికుల్కి—కృతమెఱింగి। చక్రమున సౌంభకంబుతో సాల్వుఁ ద్రుంచి
దంతవక్త్రువధించి తత్సహజుఁడగు విదూరుఁ గ్రమముగ నాంచె నద్భుతముగాఁగ॥

## శిశుపాల దంతవక్త్రుల పూర్వ వృత్తాంతము.

సీ॥ మున్ను శ్రీవైకుంఠమున ద్వారపాలకులై సనకసనందనావరోధ
మొనరించి పోనిమి నుగ్రులై ఘోర రాక్షసులు గండని వారు శాపమొసఁగఁ
దాలుఁదొల్త జయవిజయులు హిరణ్యాక్ష హిరణ్యకశిపులై వరాహ నార
సింహసంహతులైరి శ్రీరామ హతులైరి రావణ కుంభకర్ణతజనించి
యిపుడు శిశుపాల దంత వక్త్ర పదవాచ్యులై పొడమి కృష్ణుచేమ్రందిరందు వలన
శాపశాంతియైవారి తేజంబు కృష్ణుఁ। జేరెవారు వైకుంఠంబుఁ జేరిరపుడు॥ 217

## ద్రౌపదీ మానరక్షణము.

మ॥ కపట ద్యూతముఁ బన్ని పాండుసుతులం గారవ్యులోడించి త
ద్ద్రుపదేంద్రాత్మజనీడ్చి తెచ్చి కినుకం దుర్వాక్యముల్ బల్కి—ని
స్త్రపులై వల్వలనొల్వ ద్రౌపది దనుం బ్రార్థింపఁ గృష్ణుం డనే
క పటంబుల్ గృపనూఱఁ జేసి సభలోఁ గాపాడెఁ దన్మానమున్॥ 218

## కుచేల సంరక్షణము.

మ॥ అభిధాసూచిత దుర్దశుండగు కుచేలాఖ్యున్ స్వబాలప్రియున్
శుభుఁ డాకృష్ణుఁడు గారవించి యడుకుల్ శోధించి భక్షించి త
త్సభవారబ్బురమంద వీడ్కొలిపె నాతం డింటికింబోయి స
ద్విభవోపేత గృహంబు గాంచి వెరగొందెం దద్దయాసిద్ధికిన్॥ 219

## నృగశాప విమోచనము.

మ॥ నృగుఁ డిక్ష్వాకుని భ్రాత మందిడినగోవేమందఁ జేరన్ గణిం
పఁగ లే కన్యునకిచ్చి పూర్వుఁడు శపింపన్ దొండయై నూత నుం
డఁగఁ గృష్ణుండు సముద్ధరింపఁ దన చందంబంతయున్ దెల్పి ది
వ్యగతిం జెందె నెఱింగి భూమిసురులన్ వంచించి యేమౌదురో॥ 220

## కామ్యక వనాభిగనము.

సీ॥ పాండవులడవిలోపలనుండఁ బుండరీకాక్షుండు సత్యభామాన్వితముగఁ
గనఁజనియుండ మార్కండేయ మునిరాఁగఁ బూజించి యతనిచే భూసురప్రి

భావాది ధర్మముల్ బావకు దెల్పించి వనవాస దుఃఖశాంతిని ఘటించె
భర్తృవాల్లభ్య సౌభాగ్య సంపద్గర్వ శాంతి యొనట్లు పాంచాలి నగుచుఁ
దనప్రవృత్తి పతివ్రతాధర్మవృత్తి। సత్యభామ కెఱింగించె సత్యఫణితి
నంతపయిఁ గొంతికొడుకులయనుమతిఁ గొని। ద్వారకకుఁ జేరె శౌరి సత్యాన్వితముగ

## సంపద్దిదృక్షుక్షోణీశ్వరాగమనము.

సీ॥ క్రతువొనరిచి కురుపతియు భూపతులు శ్రీపతికల్మిఁ గన ద్వారవతికిఁ బోయి
హరిదరినుండ నిర్జరమౌని వచ్చి ధన్యుండవీవనఁగ వెన్నుండునగుచు
నట్లాడు సత్కృతి నన సీరహాస్యమెట్లని రాజులడుగ నిట్లనియె మునియు
కచ్ఛపమొక కొండగతినుండ మెచ్చితి నది గంగ నదివార్ధి నది ధరిత్రి
నదికులాద్రుల నవి ధాతన తఁడు శ్రుతుల। నవియుఁ గ్రతువుల నవి కృష్ణునధికుఁడనఁగ
నితఁడు సంపూర్ణదక్షిణాన్వితముతైన। క్రతువుతే నేన వానితోధికంబుగలదె॥ 222

చ॥ అనియిటులానతిచ్చి ముని యందఱిపీడ్కొని వేగ నేగఁ గృ
ష్ణుని విభవంబు నేత్రముల శ్రోత్రములన్ మహిమంబు నిండఱుం
గని విని విస్మితాత్ములయి కంజదళాక్షునమజ్ఞ నొంది రొ
య్యనఁ జనిరందుఁ గొందఱు దురాత్ము లసూయవహించి రాత్మలన్॥ 22 3

## కౌరవ పాండవ సమత్వ సూచనాది ప్రశంస.

మ॥ అభిమన్యూపయమోత్సవంబరసి పద్మాక్షుండు బంధూజ్జ్వల
త్సభలోఁ జేరి పృథాసుత ప్రథిత సంచారంబు దుర్యోధన
వ్యభిచారంబును దెల్పి జన్యులకు జన్యంబింతపైఁ దప్పదం
చు భవత్సాహ్యము దప్పదంచు సమతన్ సూచించుచున్ వీడ్కొనెన్॥ 224

## దుర్యోధనార్జున ప్రార్థనాప్రశంస.

సీ॥ పార్థుండు కృష్ణ సంప్రార్థనార్థంబుగా ద్వారకాపురిఁ జేరెఁ గౌరవాధి
పతియు నంతకుమున్నె ప్రార్థింపఁ జేరె వా రిరువురు హరిదరికరిగియతఁడు
శయనించియుండ మస్తకభాగమున నున్న గద్దెపైఁ గూర్చుండెఁ గౌరవపతి
పాదసన్నిధిఁ జేరి పార్థుండు నిలుచుండె హరియు మేల్కొని చూచె నరుని ముందు
పిదప దుర్యోధనునిఁ జూచె నదియు మిషగఁ। బిన్నవు వరింపుమీవ మున్మున్న యనుడు
నరుఁడు దనుఁ గోరఁ బది వేల వరరథికుల। వేఁడె దుర్యోధనుండిచ్చి వీడుకొల్పె॥ 225

## పార్థప్రార్థనాంగీకారము.

పంచచామరము॥ నిరాయుధుండనైన నన్ను నీవు గోరితేల నా
నరుండు మ్రొక్కె దేవ నిన్ను నాకుఁ బోద్పడంగ నే
వరింపలేదు నిన్నెదిర్చువాఁడఁ గాను శత్రునై
యరిచ్ఛిదా యశం బొసంగుమన్న మెచ్చె శౌరియున్॥ 226

## బలరామతీర్థయాత్రాభిగమనము.

ఉ॥ కౌరవపాండవప్రధన కారణకంబుగ బైలుదేరి యా
సీరి మునీంద్రులట్లు దనుఁ జేరి భజింపమి కల్గి చంపి మా
సరితరీతి వీని నవుడే బ్రతికించి మహోగ్రుఁ బల్వలుం
జీవముఖంబుఁ గాచి మునిసేవితుఁడై చనెఁ దీర్థయాత్రకున్॥ 227

## శ్రీకృష్ణరాయభారము.

సీ॥ సంజయు దౌత్యంబు సఫలంబుగామిచేఁ దను పాండవులు గోరఁ దన్మతములు
వినిహరి కరిపురంబునకేగునప్పుడు మునులనచ్చటికి రండనుచుఁ గోరి
కౌరవసభఁ జేరి "పోరు నష్టం"బని "పొందు లాభం"బని పూని తెల్పి
దుర్యోధనుఁ డొనర్చు దుస్తంత్రముల కెల్ల పాండవజయము తప్పదని చెప్పి
విశ్వరూపంబుఁ జూపి సద్వినుతిఁ గాంచి। కోరి విదురునింటఁ బాలారగించి
కుంతిమతమును గర్ణుని పంతమరసి। భండనమునకుఁ బురికొల్పెఁ బాండవులను॥

## యుద్ధాభిగమనము.

శా॥ ధృష్టద్యుమ్ను వరూథినీశునిగ నిర్దేశించి తత్తద్బలా
వష్టంభంబుగ దృష్టకేతుముఖులన్ వర్ణించి ధర్మాత్మజ
స్పష్టప్రార్థిత పార్థసారథిత కిష్టంబౌటచేఁ గృష్ణుఁ డ
క్లిష్టప్రక్రియ విక్రమింప నడపెం గృష్ణుండు దేరాజికిన్॥ 229

## గీతోపదేశప్రశంస.

సీ॥ యుద్ధసన్నద్ధుఁడై యుభయసేనలకు మధ్యంబునఁ దనయరదంబు నిల్పి
వివ్వచ్చుఁ డవ్వచ్చు వివిధగురుప్రియసద్బంధువులఁ గాంచి సదయహృదయుఁ
డై నిరాయుధుఁడయి యరదంబుపై నిల్చుటరసి కృష్ణుఁడు దరహాసమొదవి
తాదాత్త్వికస్థితి దయనుపదేశించి తాదాత్మ్యకస్థితిఁ దనమహిమను

గుప్తపఱచి కిరీటి సంతృప్తికపుడు । విశ్వరూపంబుఁ జూపించి విశ్వసింపఁ
జేసి వైగులఁ బాలియింపఁ జేసెనాఁటి । వారిసంవాదమే గీతవైరటించె॥ 230

## భగవద్గీతాసంగ్రహము.

సీ॥ సాంఖ్యంబుకర్మంబు జ్ఞానంబుకర్మ సన్న్యాసంబు నాత్మసంయమవిధంబు
విజ్ఞానయోగంబు విస్ఫుటాక్షరపర బ్రహ్మయోగంబును రాజవిద్య
యనియెడు రాజగుహ్యంబు విభూతివిస్తర విశ్వరూపసందర్శనములు
ప్రకటభక్తియును క్షేత్రక్షేత్ర విద్విభాగము గుణత్రయ విభాగంబును బురు
షోత్తమప్రాప్తి దైవాసురోరు సంప। ద్విభాగంబు మఱియు శ్రద్ధాత్రయంబు
మోక్షసన్న్యాసమును దెల్పెమునుముకుందుఁ। డర్జునువిషాదయోగంబునపనయించె॥ 231

## గీతాసారసంగ్రహము.

సీ॥ ఆత్మకు లేవు బాధ్యతయు బాధకతయు నని తెల్పుచు విషాదమునకు దయకుఁ
గరణంబులగు నహంకారంబు మమకార మడిగించి సంగరోద్యోగమునకుఁ
గారణంబైన స్వకర్మంబువిడువక ఫలకాంక్ష విడిచి నిచ్చలునార్చి
క్రమముగా సర్వధర్మములను విడిచి నన్నే యాశ్రయింపుము నేనశేష
దోషములఁబాపి యుద్ధరింతు నినువంత। వలదటంచు వచించి విశ్వాసమునకు
విశ్వరూపంబుఁజూపి యవ్విశ్వభర్త। పార్థుఁడునిమిత్తముగ మహీభారముడిపె॥ 232

## అమానుష మహిమానుసంధానము.

ఉ॥ తా రఘురాముఁడైనపుడు తత్త్వరహస్యములన్ గ్రహించె గా
రీ రమణోపదేశమున శ్రీశివగీతలటంద్రు వానిఁ ద
త్సారతరోక్తులొక్క నిమిషంబు మహాదివసంబు జేసి త
చ్ఛౌరి కిరీటికిం దెలిపెఁ దన్మహిమంబు నుతింపశక్యమే॥ 233

## హనుమచ్ఛాప విమోచనము.

మ॥ భగవద్గీతలు బాదరాయణుకృపన్ భక్తిన్ వినెన్ సంజయుం
డు గుణజ్ఞుండగు నాంజనేయుఁ డవతీర్ణుండై కృతార్థుండనై
తిఁ గడుం గీతలచే నటన్న హరిసీతిం దాఁటి తీర్చెఁ బిశా
చ గతిం జెందుమటన్న భాష్యకృతిచే శాపప్రముక్తిం గనెన్॥ 234

## శాపకారణము.

క॥ అనఁగ మునిగణము వెఱఁగై । యనఘ వినఁగలేదు మున్ను హనుమంతుని మం
తనమున శపియించుటయు భా।ష్యనిర్మితియుఁ దెల్పుమనుడు నతఁడిట్లనియెన్ ॥235

మ॥ దినకృద్దీప్తికిఁ గ్రీడికట్లు భగవద్గీతోపదేశంబుఁ జే
సినపై నాతని కేతనాగ్రమున వాసించిన్నైయైయున్న యా
హనుమంతుండు దనంత నే వినుచు ధన్యత్వంబు సూచింప వ
చ్చినవాఁడన్న నెపంబునన్ హరి శపించెన్ భాష్యనిష్పత్తికిన్ ॥ 236

## బ్రహ్మవిద్యోపదేశ సంప్రదాయము.

ఉ॥ పాత్రములంగనుంగొనియుఁ బోవుచుఁ బోవుచు నాలకించియుం
జిత్తము తృప్తమయ్యెననఁ జెల్లదు చెల్ల గురూపదేశ సం
పత్తి వినాకరించి పెఱభంగి నెఱింగిన విద్య విద్యగా
నుత్తమసంప్రదాయవిదులొప్పరు తప్పది బ్రహ్మవిద్యకున్ ॥ 237

## పైశాచభాష్యనిర్మాణము.

మ॥ భగవద్గీతలకింతమీఁద మదభిప్రాయానుసారంబుగాఁ
దగు భాష్యంబొనరింపు మట్లయినచోఁ దప్పుం బిశాచత్వ మం
చుఁ గృపం గృష్ణుఁడు పల్కఁగా నల మరుత్సూనుండు దోడ్తోఁ బిశా
చగతిం జెందియొనర్చె భాష్యమదియే పైశాచంబనన్ భాసిలెన్ ॥ 238

క॥ శపియించితి గపి యించుక । తపియించిన భాష్యరచన తడఁబడుననుచుం
గృప నించువిల్తుతండ్రిం । జపియింపఁగఁ జేసెఁ దద్విజయమంత్రమిటుల్ ॥ 239

## హనుమన్మహిమాభివర్ణనము.

సీ॥ మున్ను దాశరథికై మునులజన్నముఁ గాచి జానకిఁ బెండ్లాడి జనకునాజ్ఞ
వనికేగి ఖరముఖ్యులను గూల్చి రావణువలన సీతను గోలుపడినయపుడు
సుగ్రీవుఁ గూర్చి దశగ్రీవుపురిఁ గాల్చి ధరణిజఁ గని వార్ధి దాఁటివచ్చి
సేతువేర్పఱచి యాజినివాహనంబవై యవలీల ద్రోణాద్రి నటకుఁ దెచ్చి
లక్ష్మణుని బ్రతికించి పౌలస్త్యుఁ దునిమి । సీతఁ గొని కౌతుకమున సాకేతనగరి
కరిగి పట్టాభిషిక్తుండ నగుట కీవ । కాదె కారణమైతివి కపివరేణ్య ॥ 240

ఉ॥ పుష్పక మెక్కి వచ్చునెడఁ బుష్కరవీథిని నిల్వ శాంతికై
పుష్పము నట్లు తెచ్చితివి మున్ను మగొల్చిన శంభులింగముఁ
గోష్పదలీల నంబునిధి గొబ్బున దాఁటిన నీకుఁ గాక వా
స్తోష్పతికైన శక్యమె సుదుస్తర కార్యము నిర్వహింపఁగన్॥ 241

క॥ సీతాసైకతలింగము। సేతుముఖంబునఁ బ్రతిష్ఠఁ జేసి మునులకున్
భూతపతికి మాకు మనః। ప్రీతిగ రామేశ్వరాఖ్యఁ బెట్టిన త్రుటిలోన్॥ 242

శా॥ ఈవున్ లింగముఁ దెచ్చి దానిఁ గని నన్నెంతేని నోనాఁడఁ గా
నే వాత్సల్యము సహించి తొలి దానిం బ్రోయు మీలింగమే
శ్రీవిన్నిల్పుదు నన్నుఁ దాఁగ దలకుండెన్ విన్నవైతీవు నే
నా వెన్కన్ వరమిచ్చి నిల్పితిగదా యీలింగమూ చెంగటన్॥ 243

మ॥ ఉదయంబైఫలమంచు సూర్యుఁ గొనఁగా నుంకించె నేపీఁడ డ
య్యుదయాస్తాచల మస్తకస్థపదుఁడై యుష్ణాంశునిం గొల్చి పెం
పొదవన్ విద్యల నెల్ల నేర్చిన బలాఢ్యుండెవ్వఁడా నీకు నె
య్యదియో దుష్కరమాంజనేయ జనగేయా కౌసలేయాశ్రయా॥ 244

సీ॥ ఉర్వరైకైశ్వర్య యుతయువ ధ్యాయశాశిష్ఠ ద్రఢిష్ఠ బలిష్ఠమాను
షానందమాదిగా యవలమనుష్య గంధర్వులు దేవగంధర్వులు పితృ
దేవతాజానజ దేవక్రియా దేవ దేవశక్ర బృహస్పతి ప్రజాప
తులు నాంధ నానందములు శతగుణితంబులైన బ్రహ్మానందమగునటం బ్రశు
గాన బ్రహ్మశతానందుఁడో నతండ। వగుట కర్తుండవై యంటివ ప్రమేయ
సిద్ధనుత కామరూప ప్రసిద్ధకాయ। న్యాయధౌరేయ జనగేయ యాంజనేయ॥ 245

క॥ ఏతాదృశుండవయ్యును। గీతలు నేఁ దెలుపకుండఁ గృతకృత్యుఁడ నే
నైతినసుట విధివశము। ప్రాతకమా నడంచుఁ జేయు భావ్యమటంచున్॥ 246

క॥ దయ దయివారఁగ నిట్లను। నయనయములుమీఱ శోభినయ నయన కుశే
శయ శయుఁడై పలికె విలే। శయశయనుండాశయమున సంశయమెడలన్॥ 247

క॥ ఇది భగవద్గీతలకున్। మొదటనె పైశాచభాష్యము హనూమంతుం
డొదవించిన కథవినుఁడీ క। హృదయంగమమైనమీది వృత్తాంతంబున్॥ 248

అక్షౌహిణీసంఖ్యానిర్ణయము.

సీ॥ ఇరువదియొక్కవే యొనిమిదినూర్లడెబ్బదియునౌ నరదము లొప్పదలు నెందుఁ
దత్సమసంఖ్యచేఁ దనరారు మత్తమాతంగంబులును బెంపెసఁగునెందు

నలువదియైనవే లార్వాలుఁ బదియున్నై యశ్వంబు లెచ్చోట నలరుచుండు
నలువొందు శతశతనవశత త్రిశతార్ధశతపత్తి సంపత్తిసరవినొందు
నట్టి చతురంగబలములు మట్టుమీఱి। నట్టిసేన యక్షౌహిణియనఁగఁబరఁగు
నదిగదిని రెండులక్షల పదునెనిమిది। వేలపై నేడునూఱులై వెలయునండ్రు॥ 249

## కౌరవ పాండవ యుద్ధప్రశంస.

సీ॥ ఏకాదశాక్షౌహిణీశులై కౌరవుల్ గాంగేయ కలశజ కర్ణమద్ర
పతులు వరూథినీ పతులై క్రమంబునఁ బదియు నైదును రెండు వాసరములు
రెండు యామంబులు భండనం బొనరింపఁ బాండుసూనులు ధర్మపథులెదిర్చి
యరి విజిగీష నేడక్షౌహిణులఁ గూర్చి పేర్చి వైరుల నేర్చి యార్చి యోర్చి
యోధుల జయింపఁ దొలఁగి దుర్యోధనుండు। మడుఁగుఁ జొచ్చిననూటల వెడలఁబుచ్చి
భీముగదచేత నూరువుల్ విఱుగునట్టు। లతనిఁ గొట్టించి హరి కోపమడఁచె హలికి॥

క॥ పదునెనిమిది దివసములే। పదనువఁ బాండవులు దాయభాగంబునకై
కదన మొనరించుతఱి హరి। ముదమునఁ జేసిన చరిత్రములు చిత్రంబుల్॥ 251

సీ॥ భూరిశ్రవుని కయ్యమున సాత్యకికిఁ గల్గు నవమాన మెడసెంచి యదిఘటిల్ల
మికి సైన్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబులఁ జూనిచి గరుడకేత
నము నమర్చిన శతానందాఖ్య మత్స్యందనము పాంచజన్య స్వనంబు వినిన
తోడనే స్వాయుధస్తోమంబుగాఁ దోడితెమ్మల్లి మద్విక్రమమ్మఁ గనుము
తగని ప్రతినఁ బట్టెఁ దప్పింపవలెఁ గిడు। క్రీడితోడిదకద కృష్ణు బ్రతుకు
దారుకా యటంచుఁ దనకాప్తుపైఁ గల్గు। కరుణఁ దెల్పి రాత్రిఁ గడపె శౌరి॥ 252

మ॥ నరుచే నర్చితుఁడై తదీయమగు స్వప్నంబందుఁ దద్వ్యక్తుఁడై
హరు దర్శింపఁగఁ బోయి పాశుపతమున్ బ్రార్థింపఁగాఁ జేసి యీ
శ్వరుఁడుం దానాకభాటకుం గుఱుతుగాఁ బ్రాక్పూజలం జూపి ప్రా
గ్వరదార్ఢ్యం బొనరింపఁ జేసి మనిచెం బజ్ఞాత్ముఁ డప్పార్థునిన్॥ 253

మ॥ అనియందే మఱి సైంధవుండు హతుఁడౌనంచున్ నభోవాణి గు
ల్కినపైఁ దజ్జనకుండు బల్కినది శ్రీకృష్ణుండు మున్నె యెఱుం
గును గానం దల వాని తండ్రితొడపైఁ గూలించి తప్పించె ఫ
ల్గును మున్పుండలఁ బ్రోఁచి తజ్జనకుఁడే కూలెన్ స్వశాపంబునన్॥ 254

క॥ సర్పముఖ శిలీముఖ ము।త్సర్పింపఁగ నరదమనిమి సంరక్షించెన్
స్వర్పతి తనయుం గృష్ణుఁడ।హర్పతి తనయుండు విన్ననై కనుచుండన్॥ 255

శా॥ ఇంద్రుండిచ్చిన శక్తిచే విజయు నేఁడేత్రుంతు నేనంచు ని
స్తంద్రుండై రథమెక్కి వచ్చినను రాధాసూతి కాధారణన్
సాంద్రంబై తగు నాత్మ మాయవలనన్ శాంతింపఁగాఁ జేసి శ్రీ
ఢిం డైత్రిలోక్య విభుండు గాంచె నది చెండెం దోడ హైడింబునిన్ 256

మ॥ దురమందొక్క మరుత్సుతుండె సుతులం దున్మాడెనంచున్మదిన్
దురభిప్రాయము గల్గియుండె నిపుడంధుండంచు లోహాకృతిన్
హరి దెప్పించి తదగ్రమం దునుపఁగా నాలింగనం బాచరిం
చె రుషన్ భీముఁడు గామిఁ దెల్పి నిరసించెం దన్నృపా దుఃఖమున్॥ 257

ధర్మరాజ పట్టాభిషేకాదిప్రశంస.

శా॥ ఈరీతిన్ ధరణీభరంబుడిగి శ్రీకృష్ణుండు ధర్మాత్మజుం
బౌరుల్ వృద్ధులు గాంచుచుండ సభలోఁ బట్టాభిషిక్తుండు గాఁ
గారుణ్యంబునఁ జేసి మెప్పగని గంగాపుత్రి మాహాత్మ్యమెం
తో రూఢంబుగఁ దెల్పి పాండవుల సంతోషింపఁగాఁ జేయుచున్॥ 258

భీష్మసంరక్షణము.

మ॥ స్థవిరుండయ్యు యువోపమానముగ యుద్ధంబుద్ధతిం జేసి రా
జవరుల్ మెచ్చఁగ నంపసెజ్జపయి నిచ్చన్ భీష్ముఁడుండంగ స
ర్వవిధాయాసము లంటకుండ నతనిన్ రక్షించి కృష్ణుండు ధ
ర్మవిధుల్ ధర్మజుఁ డర్మిలిన్ వినునటుల్ మైకొల్పెఁ దత్సన్నిధిన్॥ 259

పరీక్షిద్రక్షణము.

శా॥ అశ్వత్థామ మనశించెనంచు నసృతం బాడించి కుంభోద్భవున్
శశ్వద్ధామునిఁ ద్రుంపఁ బంచె నతిసాక్షాదంతకాకారుఁడై
యశ్వత్థామ కులం బపాండవము సేయంబూని వృద్ధాదిగా
శిశ్వంతంబుగఁ జెండుచుండ హరిరక్షించెం బరీక్షిత్తునిన్॥ 260

విద్యారహస్యోపదేశాది ప్రశంస.

సీ॥ హరిధర్మరాజ పట్టాభిషేకానంతరమ్మునఁ గొన్ని దినమ్ములుండి

తదనుజ్ఞఁ బొంది యింద్రప్రస్థపురమున కింద్రనందనుఁడు దా నేగి యచట
నిష్టవిహార సంతుష్టులు ఖండన హిండన కథన ప్రహృష్టులునయి
మయ వినిర్మిత రత్నమయ సునిర్మల భర్మమయ విచిత్రిత సభామంటమునఁ
గూరుచుండినపుడు ద్వారకాజిగమిష। ననిమిషేంద్ర సుతున కచ్యుతుండు
దెలిపి యతఁడు గోరఁ దెలిపె విద్యారహ। స్యంబువినుఁడు తద్రహస్య మిపుడు॥ 261

సీ॥ జ్ఞాన స్థిరత్వ బీజంబైన శ్లేష్మాది రోగస్వరూప నిరూపణంబుఁ
దత్త్వజ్ఞతా విశేషతోప్వప దేశమంత ర్యాగ మింద్రియాత్మ ప్రసంగ
మోపి జీవాత్మ స్వరూప నిరూపక గురుశిష్య జనక భూసుర కథా యు
గము మనోబుధ్యహంకారాది తత్త్వప్రకార మవ్యక్త ప్రకార మవల
సత్వగుణ మవస్యం బహుస్థాన యోగ్య। మగుటయు సవిస్తరంబుగా నర్జునునకుఁ
దెలిపి శ్రీకృష్ణుఁ డతని హస్తిపురిఁ జేర్చి। మరలివచ్చి యుదంకాశ్రమంబుఁ జొచ్చె। 262

## శ్రీకృష్ణోదంక సంవాదము.

ఉ॥ చొచ్చిన నయ్యుదంకముని సూక్తులు గన్పడ సత్కరించుచున్
మెచ్చినయట్లు భారత సమిత్చరితం బపు డుచ్చరింపగాఁ
దచ్చటురోక్తికిం దగువిధంబున నుత్తరమిచ్చి యచ్యుతుం
డుచ్చతరంబుగా మరల నున్న తెఱంగెఱిఁగించె నిట్లనెన్॥ 263

ఉ॥ ఏను గురుండు భీష్ముఁడు ననేక మునీంద్రులు నొక్కి చెప్పినన్
వీనులఁ జెట్టఁ డయ్యెఁ గురువీరుఁడు వీఱఁడినై సబాంధవుం
డై నశియించె ధర్మపరులై జయమొందిరి ధర్మజాదులౌ
నా నెటువంటి వారలకు నట్లతిలోభము లాభకారియే॥ 264

చ॥ అనవుడు నయ్యుదంకుఁడు క్రుధంకుర రూక్షతరాక్షుఁడై శపిం
తునని తదంకము ల్గనక దోషివి నీవతి పక్షపాతివై
తనుచును సంధిఁగూర్పవయితంచును దానికిఁ బాచితంబిదే
యనుచును నల్కఁ బల్కవిని యచ్యుతుఁ డుల్కక పల్కె నీక్రియన్॥ 265

చ॥ తపమున కంతరాయమును దాపసహేయము నైన తామసం
బిపుడిటు సూపి తేటికిహీహీ కుపితాత్ము లౌనట్ట్రిదు
స్తపముల బీరువోదునె నిజస్థితిఁ దెల్పెద నాలకించి యం
తపము మదిం దలంచిన విధం బొనరింతువుగాక భార్గవా॥ 266

సీ॥ దేవాంశ భీష్మ గాంగేయులఁ గల్యంశభవులు దుర్యోధన ప్రభృతు లహహ
సహజ వైరమునఁ గ్రి శైశవం బాదిగాఁ బడరాని బాధల పాలుఁజేసి
రనధికారికి రాజ్యమర్పించి తనభుజా బలమున బహురాజ్యముల గడించె
నట్టి తమ్మునిపుత్త్రులఁ డసి ధర్మమున ధర్మసూనుని యువరాజుగా నానర్చె
జనకుఁడని వారికల్మికి సైఁపలేక। కైతవ ద్యూతమున వారి కలిమి బలిమి
నొడిసి పాలైన నిడెనె దుర్యోధనుండు। వానికంటెను దులువ లెందైనఁ గలరె॥ 267

మ॥ సభకుఁ ద్రౌపది నీడ్చి తెచ్చి యకటా సభ్యుల్ వినన్ దుర్వచో
విభవం బేర్పడ మానభంగమునకై విప్పించెఁ దద్వస్త్రముల్
శుభవృత్తంబు సతీత్వ మత్తరుణిఁ దచ్ఛోకాబ్ధి దాఁటించె నా
టి భృశాఘాగ్నియె ధార్తరాష్ట్ర వనవాటిం గాల్పఁగాఁ జాలదే॥ 268

మ॥ కపటద్యూతమునం జయింపఁబడి తత్కౌంతేయు లెంతేనియుం
గృపణత్వంబున నున్నవారనుచు వారిన్ నవ్వ రారాజు మి
త్త్ర పరీతుండయి ఘోషయాత్రజని గంధర్వ్వుల్ దనుం గట్టఁగాఁ
గృపచే ముస్విడిపించురైనఁ గననే హీనుల్ గృతఘ్నుల్ గదా॥ 269

శా॥ గాంగేయాదు లెఱింగిచెప్పినను శంకాపంక నిర్మగ్నుఁడై
యంగీకారములేక కౌరవవిభుం డజ్ఞాత వాసంబునన్
భంగం బింతయులేమి ధర్మసుతుఁడే పల్కంగ నాలించియున్
భంగం బాహవ రంగమందెనసియుం బైకొన్నఁ జేటబ్బదే॥ 270

సీ॥ పాండవుల్మున్న బన్నెండు వత్సరములు వనవాస మజ్ఞాత వాసమొక్క
యేఁడునుగా వించు నెడఁ బొడమినవారి యిడుమలు గడువులు నుడువనేల
ధర్మపరుల్ వారు ధర్మంబెచటనుండు నచట జయంబుండు నట్టిధర్మ
మే నేను భూభార మెడలింప నవతరించినవాఁడనని మునువినఁగలేదొ
నేనులేనిది నేనుగానిదియుఁ గలదె। ధర్మపరులు జయించి రధర్మపరులు
చచ్చి స్వర్గస్థులైరిది సత్యమింక। నే మనంగలవదియును మీ వుదంక॥ 271

ఉదంకప్రార్థనము.

ఉ॥ నావుడు వాసుదేవుఁడు వినంగ ననంగ పితా పితామహ
ప్రాగభిదాదికామరపరంపర కైన నెఱుంగరాదు నీ
భావము నీప్రభావముఁ గఁ బామరు లెట్లు లెఱుంగనేర్తురో
దేవ యెఱుంగ కాడితి మదీయ దురుక్తులు సైచి కావవే॥ 272

## ఉదంక ప్రార్థనాంగీకారము, (విశ్వరూప ప్రదర్శనము.)

చ॥ అనుచు నమస్కరించుచుఁ గృతాంజలియై ఖలభంజనా, జనా
ర్దన శరణార్థినై యిపుడు ప్రార్థన సేయుదు నీయుదగ్రతం
దనరిన విశ్వరూపముఁ గనంబడఁ జేసి కృతార్థుఁ జేయవే
యన నటులై కనంబడిన నచ్యుతు నాతఁడు మెచ్చె నీక్రియన్॥ 273

## గోపాలకృష్ణలీలావతార రూపస్తవము.

సీ॥ చిత్తజాతునిఁ గన్న మత్తకాశిని బత్తి జొత్తిలి యొకయెడఁ గొత్తుచుండ
విత్తవతీ యశోదత్తయా విత్తవిపొత్తుమై నాకపదంబొత్తుచుండ
నుత్తుంగ రుచు లిగురొత్తహస్తములు కట్యుత్తమాంగస్థలుల్ హత్తివెలయఁ
దత్తత్పుమర్థసంపత్తికై ప్రజలు ప్రపత్తిమైఁ గేల్గవ లెత్తి మ్రొక్క
మెత్తనగుపాపరామెత్తనొత్తగిలఁగ। నత్తమిలి బత్తులకు నెల్లబుత్తిముత్తు
లిత్తువఁట క్రొత్తయే యిట్టి వృత్తి నీకు। భక్తపాలనతృష్ణ గోపాలకృష్ణ॥ 274

సీ॥ రంగు మెఱుంగు పొరంగుదుఱంగలింపఁ గుఱంగటు మెలఁగి తగఁ జెలంగు
నల యనంగుని తుంగమగు తురంగము తెఱంగు నెఱుంగఁ జేయు భంగులు తరంగ
ములనంగ ముప్పొంగ ముంగటఁ జెంగటఁ జెంగు చెంగున దాఁటుచుం గరంబు
నంతరంగంబునం తంతఁ గరఁగించు మాయా కురంగంబు చాయఁ జూచి
జాయ సూచింపయాచింప సాయకమున। నేయఁ బూనినతొంటి నీచాయఁ గంటి
సూటిగా నిచ్చమిఱ నిచ్చోటనోర। భక్తపాలనతృష్ణ గోపాలకృష్ణ॥ 275

సీ॥ పలువన్నియలతిన్నియలచిన్నియలచెన్నుఁ గన్నతిన్నని పిన్నపొన్నగున్న
కొన నున్న నిన్నున్న కొన్నక్రీడను వేడుచున్న ప్రేయస్సులమిన్నలజిగి
మన్న నున్నని చిన్ని చన్నులు మున్నగు గొన్ని క్రొన్నన విల్తు పెన్నిధాన
ములపొన్నికలు కన్నులలరఁ గన్గొనుచున్న నీయల్లగొల్లకన్నియలవల్వ
లన్నియును గొల్లఁ గొన్న తెన్నున్న యట్లు। మున్ను విన్నది నేఁడిందుఁ గన్నయదియు న
భిన్నగతి నున్నయిట్టి నిన్నెన్నఁదరమె। భక్తపాలన తృష్ణ గోపాలకృష్ణ॥ 276

సీ॥ పట్టి సత్రాజిత్తు పట్టి రట్టున కొడిగట్టి గట్టిగఁ బుట్టినట్టికినట్ల
రెట్టింపఁ దలగట్టి యిట్టిట్టనఁగరాని బిట్టుగ నలపొదిబట్టినట్టి
పట్టున నెట్టనఁ దొట్టినదట్టంపువలరాచవెట్టచూపట్టివలపు

రేపెట్టుఁ జేపట్టి రాపెట్టు వాపెట్టినట్టివేల్పులఁ గొట్టి జెట్టితనము
దిట్టతనముట్టిపడ బిట్టుఁ జెట్టఁబట్టి। చెచ్చెరఁగఁ దెచ్చియిచ్చు నచ్చెల్వకిచ్చి
నట్టినీలీలనేఁడు గన్పట్టినార। భక్తపాలన కృష్ణ గోపాలకృష్ణ॥ 277

మ॥ క్షణమాత్రంబున వత్సలుండగు రమాకాంతుండు వత్సాసుర
క్షణనవ్యాప్తయశస్కుఁడై వెలయు టాశ్చర్యంబె వత్సాసుర
క్షణనవ్యాప్తయశస్కుఁ డస్త్రబకవృత్తుంబైన కాంతారమా
క్షణమాత్మీయ యశంబుచే ననఘపుష్పంబౌనటుల్ సేయఁగాఁ॥ 278

సీ॥ గజరక్షణక్రియాకలితమానసుఁ డయ్యు గజశిక్షణక్రియాకలితుఁ డయ్యె
నర్జునరంజనాయత్తచిత్తుండయ్యు నర్జునభంజనాయత్తుఁ డయ్యెఁ
బూతనామగుణాభిపూజితుండయ్యును బూతనామరణాభిపూజ్యుఁ డయ్యె
ధేనుకాన్వితవస్తుదాన దీక్షుండయ్యు ధేనుకాహితకృత దీక్షుఁ డయ్యె
నఘవిదారణచాతురి నమరువాని। కఘవిదారణచాతురి నమరు టెంత
యజగరగళాధికారిమై యలరువాని। కజగరగళాధికారిత్వమరిదియగునె॥ 279

క॥ అచరంబగు డెందంబునఁ। బ్రచురంబగు చందమున సభక్తిశ్రద్ధో
పచితముగ సుచితచేతో। వచనముల నుతించి మఱియుఁ బ్రార్థించెహరిన్॥ 280

## దండకము.

శ్రీమజ్జగజ్జాల జేగీయమానాగ్రజ గ్రామణిగ్రామ జిహ్వాగ్రజాగ్రత్సమగ్రశ్రుతి శ్రేణికారూప నిశ్రేణికామాల కీలాయమాన క్రియోపాస్తిబోధక్రమ ప్రాప్యదేదీప్యమాన స్వతస్సిద్ధతత్త్వప్రతీకాత్మరాకార లీలాలసచ్చంద్రశాలాసమావిష్టసృష్ట్యాదిబుధ్యంత మాత్రాకలాపాగ్రపర్వాయిత బ్రహ్మతారాంత సంచారధీరా సుధీ రాజిరక్షా మహాత్మన్ కృష్ణా కృపాలంకరిష్ణుండవై విశ్వరూపంబుఁ జూపింపఁ గన్నారఁగగ్గాంచి నే నేకదా ధన్యమూర్ధన్యుఁ డంగాని చోఁ బూని చోద్యంబు హృద్యంబు నిత్యానవద్యంబు వాగీశ యోగీశ భోగీశ ముఖ్యాత్మ తత్త్వజ్ఞ శశ్వద్దురాపంబు నీ విశ్వరూపంబు దాని న్నిదానించి దర్శించు భాగ్యంబు భోగ్యంబుగా నిందునాకబ్బునే ప్రబ్బునే, యిట్టి నేత్రోత్సవం బెవరికిం గోరఁ గెంచిన్నిమిత్తంబుగా నంబకం దంద్రి కాప్తై యశోదామహాదేవికిన్ దేవతామాని కంధావనీజానికిం గ్రీడికిన్ విశ్వరూపంబు వేర్వేఱఁ జూపించితీ విన్నిరూపంబులం జూపినా విష్ణుడీ చూపునన్ నాకిదిట్లుండ గోలోకమందుండి భూలోకముం జెంది బాల్యాదిగా నేటిపర్యంతముం బర్వునీ సర్వ

చర్యల్ మహాశ్చర్యము లెవ్వానినెల్లం దయంజూపినావిత్తఱిఁ మోహవారాశి నేను త్తరింతుం బ్రసాదింపు మీ దివ్యచిద్రూప సందర్శనం బెన్నఁడుఁగా వెన్నుఁ డుండుం బ్రసన్నప్రపన్నాంతరంగంబులం దండ్రు, తండ్రీ తదంకం బుదంకుండు నానుండు నాపట్ల సందీపితంబై సపంచాయుధంబై సపీతాంబరంబై సభూషా విశేషంబునై భవ్యమైనట్టి నీదివ్యరూపంబుఁ జూపట్టఁగా నన్నుఁ జేపట్టి ప్రాపైకటాక్షింపు మీపై సమీపైకదేశంబునం జేర్పుమాపై మహాదేవకృష్ణా నమస్తే నమస్తే నమస్తే నమః॥

## దివ్యరూప ప్రదర్శనము-

సీ॥ మందార కుందారవిందారి సందీప్త సుందరామంద కుజ్మందిరఫణ
మణిగణఘృణ్యాస్తరణ విస్తృతాహిశయ్యాశయానుండు నానాశమీన
సంస్తూయమానుండు శంఖచక్ర గదాంబుజమానుఁ డబ్జవిభాసమానభాస
మానుఁ డబ్జవిరాజమాన కరశ్రేష్ఠమా మానినీసేవ్య మానుఁ డనుప
మానమానాతిగానుకంపా రస లస। మానుఁ డస్వప్న జేగీయమానుఁ డుయజ
మానధాత్రిజ్య మానుండు మానిపూజ్య। మానుఁడును నాచునత్తార్క్ష్యయానుఁ డపుడు॥

సీ॥ పరమహర్షోత్కర్ష పరిఫుల్లనేత్రు లవ్యాహతస్నేహ పూర్ణాంతరంగు
లగుసనకాది మహాసిద్ధజనులచే మాటిమాటికి వీక్ష్యమానుఁ డగుచు
నత్యనురక్తు లనన్యచిత్తులు నిత్యులు ననాథులు దివ్యలోకవాసు
లైనమానులచేత నభివర్ణ్యమానుండు ఘనకనత్కనక శోభనవిభా వి
భాసమానస్వపార్శ్వస్థ పద్మవాసి। నీనిరంతరపరిసేవ్యమానుఁ డగుచు
నీలజీమూతమధ్యస్థ నిభృతవిద్యు। దుపమితద్యుతి హృద్యతరోర్వరాప
రీతుఁడై ప్రీతిసాక్షాత్కరించెనపుడు॥ 283

గీ॥ సరసిజాక్షుఁ డిట్లు సాక్షాత్కరింపఁ। బూనదివినుండి పువ్వులవానగురిసెఁ
బాళ కాహళదోహాలలీలనొంది। దివ్యదుందుభిబృందంబు దివిని మొరసె॥ 284

గీ॥ తత్క్షణ తదీక్షణప్రభూత ప్రభూత। ముద్రసనసముద్రమునబిట్టు మున్గిమాని
భవ్యతరనవ్య కర్తవ్యపదవిలేక। బాఢతరమూఢతాలీఢభావుఁ డౌచు॥ 285

## ఆనందోన్మాదము.

ధాత్రీవృత్తము॥ మరలఁ గూరుచుండు నుండి మానమొందు నొందితత్వరత నాడు నాడి పాడు పాడి వేఁడు వేఁడి వి
స్ఫురణఁ బ్రమోయు బ్రమోసి చూచుఁ జూచి లేచు లేచి యు
స్థిరగతిం బ్రదక్షిణంబుఁ జేయుఁ జేసి మ్రొక్కుఁ దుఁగ॥ 286

ఉ॥ కయ్యెడి నవ్వు నవ్వి మఱి గొబ్బున మారము బాయుఁ బాసి తాఁ
జయ్యన వచ్చు వచ్చి కటిసామిని వేమఱు ముట్టు ముట్టి మే
నొయ్యనఁ బట్టుఁ బట్టి కడునుక్కున నక్కునఁ జేర్చుఁ జేర్చి జల్
నెయ్యము నించు నించి కరుణింపు మటంచు వచించి మూర్కొను నా॥ 289

సీ॥ మూర్కొని పేర్కొనుఁ బేర్కొని వలఁగొను వలగొని తత్పాదములకు మ్రొక్కు।
మ్రొక్కి చెక్కిలి నొక్కు నొక్కి ముద్దాడు ముద్దాడి యాస్వాదించు నాస్వదించి
మురిపెంపు విరిజొంపముల నింపు మెయి నింపు నింపి కంపితవృత్తి నిల్చు నిల్చి
ప్రలపించుఁ బ్రలపించి రహి విహ్వలతఁ బెంపుఁ బెంచి బిట్టురవంబుఁ జేయు నిట్లు
చపలచేష్టలఁ గ్రీడించి సందడించి। పనుల సడ్డించి ముదమొదవ నినుమడించి
తద్గుణము లుగ్గడించి మాంద్యంబుడించి। కరము మదఁ బ్రేముడించి కేల్గవ మొడించి॥

గీ॥ చిత్తమాయత్తముగఁ జేసి చిద్విలాసి। యైన వైకుంఠపురవాసి నపుడు డాసి
తమము నెడఁ బాసి క్లేశపాశములఁ గోసి। నిజముఁ దలపోసి నిజమనోరుజకు రోసి

క॥ అక్షీణంబగు భక్తిని। పేక్షించక నమృత రస మపేక్షించి కృపన్
రక్షింపమన్న జలజా। క్షు నిటుల్బొగడఁ దొడఁగె నతఁడానతుఁడై॥ 290

చ॥ కరముఁ బ్రసన్నచిత్తుఁ డవు గమ్ము జగమ్ముల చిత్తవాగగో
చరుఁడగు నీవ యీ వరుస జాగ్రదనుగ్రహ విగ్రహుండవై
యరుదుగ దృష్టిగోచరుఁడ వైతివి గానఁ బ్రభావితుండనై
పరఁగినవాఁడ నేఁడఖిలభక్తజనార్తిహరా రమేశ్వరా॥ 291

చ॥ అణువునకన్న నత్యణువు ననంతుఁ డచింత్యుఁడు కారణైక కా
రణము మహత్తరుండును బరాత్పరుఁ డక్షరుఁడు న్నిరీశుఁడుం
బ్రణవమయుం డనామయుఁడు భవ్యుఁ డపవ్యయుఁ డీశుఁ డిస్ఫ్రహా
ఘృణుఁడని నీవె నిన్నెదల నెన్నెద రెన్నఁడు నెల్లకోవిదుల్॥ 292

గీ॥ అగ్నిసంతప్తమైన లోహంబువలన। విస్ఫులింగోత్కరం బెట్లు విస్ఫురించు
నట్లు సత్త్వరజస్తమో వ్యాప్తమగుచు। నీవలన జీవవర్గంబు నిర్గమించు॥ 293

గీ॥ కనఁగ వినఁగఁ జనఁగఁ గడువఁగ నుడువఁగఁ। గైకొనంగ మదిని మైకొనంగఁ
దరముగాదు నీదు తత్త్వంబు నీమహ। త్త్వంబు జగదతీత మంబుజాక్ష॥ 294

మ॥ అంబుజనాభ యీ భవదనుగ్రహ విగ్రహ మూర్తులాడఁ జా

డం బరమర్షి బృందము దృఢంబుగ హర్షముఁ గ్రమ్మ బ్రహ్మచ
ర్యంబుఁ గొనర్చు వానినికరంబు కరంబుఁ దపంబొనర్చు జ
న్నంబు లొనర్చు నధ్వరిజనంబు కృతంబుఁ ద్వదర్పితంబుగన్॥ 295

చ॥ అనశనులై మహీశయనులై మునులై వసుధాసుధాశనుల్
నినుఁ గనుఁ గొంట కొంటిమగు నిల్చుచు వేల్చుచు రర్థితీర్థసే
వన మొనరింతు రెంతయు సువాసిత గంధ సుమాదులం బ్రమో
ద నిలయులై భజింత్రు సతతంబు వ్రతంబు లతంద్రితంబుగన్॥ 296

క॥ సతులపయిన్ సుతులపయిన్। హితులపయిన్ రతులువిడి యాడితమనులై
యతులు భజింతురు నిన్నా। నతుల నుతుల నతుల గతుల నయ వినయములన్॥ 297

ఉ॥ నీయష్ఠులై మహాబుధు లనిస్పృహతాది హితాత్మలౌచు గం
భీరు షడూర్మి దూరు షడభిజ్ఞ ముఖాజ్ఞను దన్మనోజ్ఞ సం
చారు షడాననాది సురసన్నుతు నిన్ను మహో మహున్ మహో
పూరుషుఁ గొల్తు రుగ్రతపముల్ జపముల్ మొదలైన చైత్యులన్॥ 298

శా॥ మధ్యేదుగ్ధ మహాబ్ధిశాయి రవిబింబస్థాయి నారాధ్య శు
ద్ధధ్యానప్రతి బోధ్యుని న్గొలుతు రిద్ధశ్రద్ధఁ బృథ్వీసురుల్
స్వాధ్యాయాధ్యగ సాధ్వగారగ సపర్యాధ్యాత్మ చర్యాయథా
విధ్యాలబ్ధ మహాధ్వర ప్రపదనావిర్భావ భావంబులన్॥ 299

క॥ క్షమతను దయామయాత్మ్యయ। సమదయ సముదగ్ర దుఃఖ సముదాయముపాఁ
టి మహావిచక్షణుఁడు మోక్షముఁ జెందును నేను నిన్నె శరణంబొందన్॥ 300

చ॥ బహువిధ పూర్వజన్మ కృతపాప కలాప విలేప వాసనా
మహదవిశేషమత్తము ప్రమత్తము చిత్తము దెన్నఁ డైన స
న్నిహితము గాదు నీదరిన శిష్ట దురిష్ట నికృష్టమున్ మహా
గ్రహ విషయాపకృష్టమును దుష్టము హృష్టమునౌచుఁ గ్రమ్మరున్॥ 301

ఉ॥ సేర్పు దలిర్ప మాన్పు గవి నెమ్మనెదం గుదియించి హృత్సము
త్సర్పితదర్ప కాని రిపువర్గులు యోగ సమర్పితాత్మ సం
తర్పకులైన వారికిఁ గనంబడకుండియు నాపయిం బ్రియం
బేర్పడఁ గాఁ గనంబడితి వీ వతివేగము భక్తవత్సలా॥ 302

ఉ॥ ఫుల్ల సముల్లసత్కమల భూతి విమోచన లోచనా జగ

ద్వల్లభ దుర్లభంబయిన తావకసన్నిధి కన్న నన్య మే
నెల్లపుడొల్ల నుల్లమున నిత్తఱిఁ ద్వత్కరుణా రసాపగం
జల్లఁగఁ జల్ల నా సుకృతసస్య మవశ్యము పండె మెండుగన్॥ 303

ఉ॥ నీవ గురుండ వీవ జననీ జనకాప్త జనంబు గావునం
బావకపాద భక్తియును దావకదివ్యకథానురక్తియుం
దావక దర్శనైక రసతాభృతిఁ దావక నామ కీర్తనో
చ్చావచ వాక్చమత్కృతిఁ బ్రసన్నమతిం గలిగింపు మీశ్వరా॥ 304

మ॥ అతిమాయావృతి మోహితుండనయి కృత్యాకృత్య కప్తిక్ష హితా
హితసంప్రాప్తి నెఱుంగఁ దావక దయాదృష్టి ప్రసారప్రణ
ష్టతమోత్కృష్టతమో విమోహవృతినై సత్యంబుగా నీవ మ
ద్గతివంచున్ మతినెంచి నీశరణ మాత్మం గాంతు నత్యంతమున్॥ 305

చ॥ మును పచరించినాఁడ నఘముల్ బహుళంబుగఁ బూని వానిఁ జే
రొక్కనఁగఁ దరంబు గాదు యుగకోటులనైన విహంగమేంద్ర వా
హన జగదంతరాత్మకుఁ డవౌట నెఱుంగుదు వీవ కావునన్
మనమునఁ దావకీన చరణంబుల నే శరణంబు నొందెదన్॥ 306

చ॥ అని యిటు విన్నవించి వినయంబున నాదలసోఁక సోఁకుమూఁ
క నడఁచుతేని యంఘ్రులకు గ్రక్కున సాఁగిలి మ్రొక్కి తజ్జనా
ర్దను పదపద్మముల్ దనకరంబులఁ బట్టుచు మిన్నకున్న ని
ట్లనె సదసజ్జగత్ప్రభువుఁడైన రమాధవుఁ డాదరంబునన్॥ 307

భగవ ద్వాక్యావళి.

మత్తకోకిలము॥ అంబుపాన మొనర్చుచున్ వినయంబుచే ననయంబుఁ బం
తంబునం జిరకాల మెంతయు నన్నుఁ దన్పితివీవు ధ్యా
నంబులన్ యజనంబులన్ భజనంబులన్ సుజనంబు లె
న్నం బరిక్రమణంబులన్ గమనంబులన్ నమనంబులన్॥ 308

మ॥ పరికింపంబడె నా పయింగలుగు శుంభద్భక్తిఁ గావించితా
చిరకాలంబు మదర్థ ముగ్రతప మీక్షేత్రంబునం దుష్టిచే
కురె నీచేసిన యిష్టి నాకతన నీకున్ దర్శితంబయ్యె న
తురమున్ దుర్లభమౌ మదీయ సగుణాకారంబు ధీరాగ్రణీ॥ 309

గీ॥ జపతపోహోమ దాన యజ్ఞములనైన। జడమతుల కేను దృష్టిగోచరుఁడఁ గాను

బ్రహ్మాదుల జిహ్వయా భక్తిచేత। నన్నుదర్శింపఁ గలరు ప్రపన్నులగుచు 310

క॥ కలుగవు నాకొక్కఁపుడు। స్దలఁచినచోఁ గార్యకారణములు జగములం
గలిగించుట వెలిఁగించుట। గలఁగించుట కౌతుకంబు గాదే యెపుడున్॥ 311

శా॥ ప్రజ్ఞావిగ్రహుఁడం [illegible]యుఁడం బ్రాజ్ఞప్రియుఁడం బ్రపూ
ర్ణ జ్ఞానాత్ముఁడ యజ్ఞ[illegible] సర్వజ్ఞుండ గీర్వాణ ము
ద్విజ్ఞేయుండ నమేయ వైభవుఁడనై వెల్గొంది రామానుజా
భిజ్ఞుంబూనితి నజ్ఞులం దునిమితిం విజ్ఞుల్ మనం బ్రోఁచితిన్॥ 312

క॥ ఘనము రహస్యము విస్మయ। జనకమునగు నస్మదీయ సచ్చరితము వ్రా
సిన వినినఁ గనినఁ జదివిన। జనుఁడు మదీయుండు ధన్యజనమూర్ధన్యా॥ 313

## శ్రీ ద్వారకాపుర ప్రవేశము.

వ॥ అని యిట్లత్యంతాగణ్య కారుణ్య సద్మ స్వాంతుండగు నప్పద్మా కాంతుం డచ్ఛద్మాత్మరంగుండై ముఖపద్మాంతరంబునం జెలువగు వెనంగఁ బ్రసంగవశంబున మృదుమధుర వచనరచనల నానతిచ్చిన నానతోచ్చయావన ప్రవణ భాషణంబులు శ్రవణ భూషణంబులుగా విని వినిర్మల గుణగణాంకుండగు నయ్యుద్ధవుండు హృదంతర దంతుర సంతోష రసాక్రాంతుండై యభివదించి యుదంచిత భక్తిం బ్రయుక్తాంజలి బంధుండై యాదీనబంధుండు విన నవినయానుబంధంబుగ వినుతించుచు నెడసేయరాని ప్రేముడి నుద్ధవశిరోమణి రామణీయక క్షపణధురంధర పురందర శిలాకలాప కలాప లపన నిపుణ లపన వపుః ప్రభాపరంపరా పరాజిత రాజత శరదబ్జ శరదుఁడగు నవ్వరదుని వదనారవిందం బానంద బిందు బృందంబమందంబుగాఁ గనుంగొనలఁ జెనంగొనం గనుఁగొనుచు మనంబునం బునః పునః ప్రదక్షిణంబులఁ గ్రమంబుగా నొనరించుచు నమస్కరించుచున్న యవసరంబునం బ్రభవిష్ణుండగు విష్ణుండు నిష్కళంక నిరాతంక దయాలంకరిష్ణుండై శ్రీకృష్ణుండు తదిష్టవరంబులొసంగి తదనుమతిం బయనంబై సైన్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబులను వాహనంబులం బూన్చి గరుడధ్వజంబమర్చి దారకుండు శతానందరథంబాయితంబుచేసిన నధిరోహించి సపరివారంబుగాఁ జనిచని పశ్చిమ సముద్రంబను దర్పణంబునం బ్రతిబింబించిన పృథ్వీమండలంబునుం బోలె వెలయుచు ద్వాదశయోజన విస్తీర్ణ పుణ్యస్థానంబై సర్వర్తుసమయ పల్లవిత పుష్పిత ఫలిత లలిత కుంద మందార చందన పిచుమంద సాల రసాల తాల తమాల కృతమాల మాలతీ పనస ఘనసార కదళీ నారికేర పూగ పున్నాగ నాగవల్లీ ప్రముఖ నిఖిలతరు కుంజ రంజిత

లతా వితానైక తానంబులగు నుపవన ప్రతానంబులును శుకపికశారికా మయూర పారావతాది ద్విజకుల కలరవ సంకులంబులగు మణిమయ క్రీడాచలంబులును; బక మరాళ కారండవ కైరవ నీరజ కోకనద కహ్లార హల్లక తల్లజ సందోహ సంచయ సంబాధంబులగు కాసారంబులును; శచీప చాప రూప ఉన్నత గోపురంబులగు తోరణంబులును; సప్తసప్తిసంచార నిరోధక శిఖర సుందరంబులగు సప్తభూమికా మందిరంబులును, నిరంతర యాతాయాత గో గోపికా గోపాలబాల సమ్మర్ద నిసర్గంబులగు రాజమార్గంబులును; నిస్తుల ప్రశస్త సమస్త వస్తు సందోహ సంపూర్ణ గౌరవాధికలగు పణ్యవీథికలును; రంగత్తురంగ మాతంగ తురంగ భటపుంగవ నిరంతర సంచార చమత్కార సందర్శన సానంద గతాగత పౌర జానపద సమాకీర్ణంబులగు పురాభ్యర్ణంబులును గలిగి వెలుంగొందుచు నిష్కంప సంపద్వారవతియనం బ్రసిద్ధిగన్న ద్వారవతిం బ్రవేశించి పురజనచకోరానీకంబులకు సాంద్రతర చంద్రికోదయ సదన రాకయగు దనరాక కెదురు చూచుచుండ దనుం బొడగని యుప్పొంగని తలంపున నాగమించుచు బాగడుము; జను లెల్ల మెల్లన దన వెంబడి నడువ నగరనివాసినులగు సువాసినులు గొందఱు సుందరతర చంద్రశాలా సాంద్ర చంద్రశాలా విశాల వాతాయన వ్రాతంబుల ననుసరించి మౌక్తిక కుసుమ లాజ విసరంబులు పరవశమై పరస్పరంబుగ విసరుచున్న రోమాంచసంబున ఘుంఘద్ఘంఘీర ఘూరి పరిఖాంబుధి ప్రతిబింబిత స్వర్గంబగు దుర్గంబు సేరం జని సంజనిత కుతూహలంబునం గాహళ పణవ పటహ దుందుభి ప్రముఖ నిఖిల మంగళ వాద్య ముఖరిత దిగంతంబులగు ననేక కక్ష్యాంతరంబులు గడచి యేనుంగు మొగసాలంగని యరదంబు దిగి జననీజనకపుత్త్రి మిత్ర కళత్రాది జనంబులు ముదంబున నెదుర్కొనినం జేర్కొనుచు వారల నందఱ నత్యుచితంబుల సంభావించుచుం బ్రసన్నమానసులగు స్థల కరంబులుగాని కరంబుం దనరాక కలంకృతంబై గురు బుధ కవి మిత్ర జైవాతృక సూర్యాత్మజాది నానామర్త్య కదంబ సంఘాసమానంబై సుధర్మంబోలియు నిత్యముక్తాలంకృతంబై వైకుంఠపురింబోలియు సర్వమంగళాస్పద రాజశేఖర విరాజమానంబై రాజతాచలంబునుంబోలియు మిగులం జెలువొందుచున్న కొల్వుకూటంబున కుంజని కిరీటకుండల హారకేయూర నిస్తులకౌస్తుభ వనమాలికా వలయాంగుళీయకాది దివ్యాభరణ భూషితుండై పీతాంబరధరుండై తద్దయు నుద్దియుడగాని సింగపుగద్దియపై ముద్దియలు సేయు నూడిగంబు లంగీకరించుచు సొంపుమై నింపొందుచు భక్తపరిపాలనం బాచరించుచుం గృతకృత్యుండై శ్రీకృష్ణుండు సుఖంబున నుండెనని శ్రీకృష్ణాభ్యుదయంబు సవిస్తరంబుగా సంగ్రహించి ప్రశంసించి మఱియును॥ 311

క॥ దక్షిణు లరిశిక్షణులు వి। చక్షణులు సువీక్షణులు రసక్షణులు జగ
ద్రక్షణులు క్షణక్షణశుభ। లక్షణులగు రామకృష్ణులను సేవింతున్॥ 315

సీ॥ జయ జలజాతాక్ష జయ దాసజనరక్ష జయ జగదధ్యక్ష సత్యదక్ష
జయ రాధికానాథ జయ సజ్జన సనాథ జయ రక్షితానాథ సరసగాథ
జయ సకలాధార జయ ధరాధరధీర జయ కారణాకార శాస్త్రసార
జయ చిత్రచారిత్ర జయ జలధరగాత్ర జయ నతాళికనేత్ర సదరిజైత్ర
జయ జనార్దన సదయనశరధిశయన। శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గహస్త
జయనిరీశ గిరీశ కంజాతజాత। కాయజాద్యాదితేయ నికాయ గేయ॥ 316

మ॥ జయలక్ష్మిన్ విజయప్రియుండు నిఖిలైశ్వర్యంబు లయ్యాశ్వర
ప్రియుఁ డత్యాయువు నబ్జభూజనకుఁడుం బ్రేమోగుణోద్యత్కుటుం
బ యశోవృద్ధి జగత్కుటుంబి కరుణన్ మన్నించి మీకిచ్చు న
వ్యయభక్తిన్ భజియించి దివ్యకథ లిట్లాలించి మేలొందుఁడీ॥ 317

ఉ॥ నావిని యా వినిర్మల మనస్కు లనంతు ననంతచర్య లీ
రీవిని సంగ్రహించి ప్రకటించితి వెంతయు వింతయయ్యె భ
వ్యావహ మీదినంబనుచు హర్షమునొందుచు రోమహర్షణిన్
వేవిధులన్ నుతించి ప్రభవిష్ణునిఁ గృష్ణునిఁ గొల్చిరందఱున్॥ 318



## ఆశ్వాసాంతము.

మ॥ వరధీరాధికరాధికారమణ భాస్వత్పాద పద్మద్వయీ
నిరతారాధకరాధకప్రతిమ సందీప్తప్రతాపప్రథా
పరవారాధికరాధికారసమయప్రాంచత్తటాకచ్ఛటా
భరతాగాధక గాధక ప్రణుత శుంభచ్ఛ్రీయశస్సాధకా॥ 319

క॥ జీవనయకృత్తరిపు రా। జీవనయను జీవి జీవ జీవంజీవా
జ్జీవనజైవాతృక రా। జీవనయన బంధుజీవన వనదా॥ 320

భుజంగప్రయాతము॥ ధృతీలాభృదింద్రా కుధీపద్మచంద్రా
ప్రతీపప్రథోపేంద్ర పద్భక్తిసాంద్రా
కృతీడ్యార్థనిస్తంద్ర కీర్త్యర్థిరుంద్రా
కృతీరాజగోపాల కృష్ణావనీంద్రా॥ 321

## ఆశ్వాసాంతగద్యస్థానీయ పద్యము.

ఇది శ్రీవేంకటగిర్యధీశ్వరక శాభృద్రాజ గోపాలకృ। ష్ణదయామండన
మండపాకకుల భాస్వత్పార్వతీశాఖ్యమ।ద్వదనావిష్కృ
తగద్యపద్య విలసత్తత్కథా సంగ్ర
హా।స్పదకృష్ణాభ్యుదయంబు సర్వ
మొక యాశ్వా సంబుగా
భాసిలుఁగా॥

❊❊

❊

త్రికకుత్త్రియం
బక భక్తియుక్చతురశీతి
గ్రంథకృన్మండపా।క కులప్రోద్భ
వపార్వతీశ్వరసమాఖ్యత్స్వసురా గ్రేసరా।ర్భ
కుఁడై భాసిలుచున్న కామకవితత్పాదాబ్జముల్గొల్చి వా।
రక కృష్ణాభ్యుదయంబు న్రానెదదభిప్రాయానుసారంబుగాఁ॥
స్వస్త్యస్తు.
సంపూర్ణము.



# శ్రీ మండపాక పార్వతీశ్వరకవీశ్వరప్రభావవర్ణనము.

క॥ శ్రీమత్పూండ్లకులాంబుధి- సోమా సోమహరిపాదశుభవనజాళీ- నామేయ మనోభృంగల- లామా శ్రీరామకృష్ణ లలితసునామా॥ తే.గీ॥ పండితోత్తమవినుము శ్రీమండపాక - పార్వతీంద్రకవీంద్ర ప్రభావ మెలమి - నెంచి పద్యముల్ రచియించి పంచినాఁడ॥ గానఁ బ్రకటింపుమి పత్రికాముఖమున॥ సీ॥ పంచపాది॥ శ్రీకరేందుమతీపరిణయాదికృతికర్తయగు మండపాక పేరయమనుమఁడు - బలరామసుక్షేత్రవిలసన్మహత్త్వాదికర్తయౌ మాకాసత్కవితనయుఁడు - స్ఫురదవధూతానుభూతిగీతాదికకర్త రామస్వామికవికనుజుఁడు - సత్పంచదేవతాస్తవముఖకృతికర్తయైన పేరయసూరికగ్రజుండు - ఛాయారమణలసచ్ఛతకాది సత్కృతికర్తయైతగు కామకవిజనకుఁడు - ధరణిశ్రీజగధీశ్వరదండకాది - కర్తయగుచినకామసత్కవిపితృవ్యుఁ - డమితసాహితీవైభవ దమితకుకవి - నివహుఁడల పార్వతీశ్వర కవివరుండు॥ క॥ సోఁడిమిఁ బంద్రెండేఁడుల- యీాఁడు మొదల్కొనియనంగ నెంచఁదగిరౌ - వ్వాఁడె ననేకగ్రంథము-లోడక యప్పార్వతీశుఁ డొనరించెనిలన్॥ సీ॥ బ్రహ్మేశశతకము పరమాత్మశతకము బాలకృష్ణశతగోపాలకృష్ణ- శతములు రఘుపతిశతకము సర్వేశ్వరశతకము పార్వతీశ్వరశతకము- హరిశతమువరాహ నరసింహశతకము గణపతిరామరక్షాశతములు - రాధికాకృష్ణసంవాదప్రబంధంబు శ్రీగురుచరిత కాంచిమహత్త్వ - మమరకసుకావ్యమాదిగా నమరుకృతులఁ - బేర్మి నెనుబదినాల్గు(౮౪) గావిరచియించెఁ- బండితోత్తము నెచంగ మండపాక - పార్వతీశ్వరకవిపట్టభద్రుఁడెలమి॥ సీ॥ మనపూర్వకవివరుల్మహితప్రబంధంబులందచ్చుటచ్చుటబంధకవన। మును జెప్పుటయె కాని ఘనబంధకవనలక్షణమిదియని చెప్పఁజాలరైరి। కావునఁగవులకక్కటబంధకవనరచనకష్టతరమని సరిఁదలంచి। సదయుఁడౌచుఁ "ప్రబంధసంబంధబంధనిబంధనగ్రంథముఁ" బార్వతీశ। కవిజనవరేణ్యుఁ డొనరించిభువినివర్త। మానభావికవీంద్రసంతానమునకుఁ। బ్రతిభ మీఱంగ మహదుపకృతియొనర్చెఁ। బండితావళికెల్లను బ్రమదమెసఁగ॥ సీ॥ తనగ్రంథములు పెక్కులనిన శ్రీనాథుండు- బహుసంస్కృతాంధ్ర ప్రబంధములను। రచియించితినటన్న రామభూషణుఁడును- దనకృతులన్ని పేర్కొనినగణన। పరవేంకటాఖ్యుండు - స్వకృతసత్కృతిసంఖ్యవ్రాసిన నెల్లూరి రాఘవుండు। దనగ్రంథనామముల నుచించినకూచి నంచితిమ్మయ్యయు- మండపాక। పార్వతీశ్వర కవిపంచననుఁబోలి। వసుసఁబంద్రెండు మొదలుపదియునేండ్ల। యీాడునఱకెనుబదినాల్గుకృతులొసగి। ఖ్యాతిఁ జెందంగఁ జాలిరే భూతలమున॥

ఇట్లు,

మచ్చ వేంకటకవి.

పర్లాకిమిడి. 1-1-98.

## ఆంధ్రకవులు, తృతీయభాగానుబంధమునందు 14-15- పుటలలో ఇట్లు వ్రాయఁబడి యున్నది.

### మండపాక - పార్వతీశ్వరకవి.

"ఈవిద్వత్కవి శతకములు మొదలైనవి యెనుబది గ్రంథములవఱకును రచియించినను ఈయనచే రచియింపఁబడి ముద్రింపఁబడియున్న గ్రంథములలో శ్రీరాధాకృష్ణసంవాదమను నాలుగాశ్వాసముల ప్రబంధము ప్రధానమైనదిగా నున్నది. ఈయన వైదికబ్రాహ్మణుఁడు; పారాశరగోత్రుఁడు; కామేశ్వర పండితపుత్త్రుఁడు. ఈకవియొక్క తండ్రితాతలుకూడ కవీశ్వరులయినట్టు రాధాకృష్ణసంవాదమునందు కవియీక్రిందిపద్యమునఁ జెప్పియున్నాఁడు—

సీ॥ శ్రీమీఱ నుభయభాషామిశ్రసత్కృతుల్ తజ్ఞులెన్న మదంకితములుచేసి
యశముఁగాంచిన పేరయ మనీషి మణికిఁ బౌత్త్రత్వంబుఁ గార్తికవ్రతమహత్త్వ
శివమహత్త్వాద్యనేకవిధప్రబంధంబు లొనరించి సత్కవి వినుతిఁగనిన
పారాశరగోత్ర పావనుండగు మండపాక కామేశ్వరపండితునకు
మహితపుత్త్రత్వమును గాంచిబహువిచిత్ర। చిత్రశతిముఖ్యసత్కృతుల్ చెప్పి మెప్పు
వడసితివిగద కులకీర్తివర్ధిలంగ। సరసగుణసాంద్ర పార్వతీశ్వర కవీంద్ర.

ఈ కవి విశాఖపట్టణ మండలములోని బొబ్బిలి సంస్థానమం దాస్థానకవీశ్వరులలో నొకఁడుగా నుండినవాఁడు. ఈ పార్వతీశ్వర శాస్త్రిగారు ౧౮౩౩ వ సంవత్సరమునందు జననమొంది ౧౮౯౭ వ సంవత్సరమధ్యమున పరమపదమునొందిరి. ఈకవి సంస్కృతాంధ్రములయందు మంచిపాండిత్యముఁ గలవాఁడయి మృదుమధుర నిరర్గళధారతోఁ జతుర్విధకవిత్వమును జెప్పుచువచ్చుటయే కాక వినయసౌశీల్యాది గుణసంపత్తి గలవాఁడయియుండెను. పూర్వోక్తమయిన రాధాకృష్ణసంవాదము రావువారను నామాంతరముగల వెలుగోటివారనెడి గృహనామముచే వెలయు శ్రీవేంకటగిరిసంస్థానాధిపతులవంశాను క్రమము వర్ణించెడుగ్రంథము. శతకములును దండకములును గాక యీకవి విరచియించిన గ్రంథములలోఁ గాంచీపురమహత్త్వము, అమరుకకావ్యము, ప్రబంధసంబంధబంధ నిబంధన గ్రంథము, శ్రీకృష్ణాభ్యుదయము, కొంతపెద్దవి. ఇప్పుడీయనగ్రంథములలో నొక్క రాధాకృష్ణసంవాదమునుండి మాత్రముకొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను—"

* * * * * * * * * *



శ్రీరస్తు.

---

# మృగావతి.

ఇది

మానవల్లి - రామకృష్ణకవిప్రణీతమైన

పద్యకావ్యము.

---

శ్రీ "వైజయంతి" నుండి

పునర్ముద్రితము.

---


చెన్నపురి:

వైజయంతి ముద్రాశాలన్

ముద్రితము.

1897


---

వెల ౪ అణాలు.

# అంకితము.

క॥ విమలాచారపవిత్రున
కమృతమయస్వాంతునకు సదాగమవిద్యా
ప్రముదునకు సర్వపాలో
త్తమనుతునకుఁ ద్యాగరాజదైవజ్ఞునకున్॥

గీ॥ తల్లిదండ్రులకన్న నుధర్మపత్ని
కన్నవెక్కుడు ప్రేమతో నన్నుఁ గనుచుఁ
జూచుకతమునఁ గీర్తిశేషునకు దీని
నంకితమొనర్తుఁ గన్నీళుల బైజాఁటి॥

M. R.

శ్రీరస్తు.

# మృగావతి.

ఉ॥ శ్రీపచరింపఁదూర్పుగిరిశృంగమునందుదయించితామస।
వ్యాపృతినుచ్చమొందిరజమారజరాప్లుతిసత్వమూదభా।
షాపతియైయనంగజయశాలియునైబరియైనక్రోధమున్।
జోపినలోకబాంధవుఁడుసూచుమమున్గరుణైకదృష్టులన్॥ ౧.

గీ॥ గంధరసరూపసంస్పర్శకంబులైన । నాల్గుగుణములుశబ్దగుణంబునందు।
యడఁగునదియనంతంబశబ్దార్థినగుచు । నమృతమూర్తినిభారతినాశ్రయింతు॥ ౨.

క॥ కవిరత్నత్రయదిగ్గజ । నవసత్కవులన్భజింతుసత్వగుణలస।
త్కవితారచనాచాతు । ర్యవచస్సంసంగహూణరసికులఁదలఁతున్॥ ౩.

గీ॥ చెన్నపురిచూళనివసించుచున్నవాఁడ । వైదికబ్రాహ్మణుఁడమానవల్లికులుఁడ।
రామదైవజ్ఞపుత్రుఁడరాజనుతుని । త్యాగరాజపండితునిప్రియానుజుండ॥ ౪.

వ॥ అనిత్రిమూర్త్యాత్మకస్వరూపుండైన సూర్యనారాయణుని నఖిలకవితావిశారదయగుశార
దనుప్రాక్తనకవిచంద్రులనుబొగడిమద్వృత్తాంతంబునునుడివి సోమదత్తమహాకవిప్రణీత
కథాసరిత్సాగరాంతర్గతమైన యేతత్కథాప్రపంచంబెట్టిదనిన. ౫.

చ॥ అనఘుఁడుకాణభూతిసుగుణాఢ్యుగుణాఢ్యునివింధ్యవాటికన్।
గనికవితాసుధారసముకాశ్యపిజాల్విడుపుష్పదంతుఁడి।
చ్చినసుకథామృతంబిడినఁజేతముశీతముగాఁగశాతవా।
హనునకొసంగెనీకథగుణాఢ్యుఁడుకావ్యమహత్వసంపదన్॥ ౬.

చ॥ తనరుగదా! జగంబులకుఁదల్లియుఁగల్మికిఁబుట్టినిల్లున।
న్మనులకుఁతావుపుణ్యములముఖ్యపుటిక్కనిధానలక్ష్మికిన్।
గొనబుదివాణమున్నరులకొవెలయైపెనుపొందిపొల్చునం।
దనవనశోభితంబమరనాథపురంబుసురాలయంబునన్॥ ౭.

వ॥ అందుల కధినాధుండు శునాసీరుండు. ౮.

చ॥ ఒకతఱిరక్కసుల్పఱపుటుక్కుమెయిన్సురలోకనాథునిన్।
గొకిబికిసేసివంగడముగూల్పదలంచియగణ్యసైనిక।

ప్రకరము వేల్పువీటిపయిఁ బంచిరి దైవతరాజుభూమిపా।
లకులిడుబానటన్విజయలక్ష్మినిదోడ్కొనివచ్చెనిక్కరుక్॥ ౯.

మ॥ అమరేంద్రుండు జయోత్సవప్రకటనోద్యత్కాంక్షజేజేలవే।
గమకై సేయసుపర్వపట్టణమునాజ్ఞాపించె బ్రహ్మాస్వభూ।
ప్రమథాధీశులఁ బిల్వనంపి మునులన్ రావించె సంగీతస।
త్తములే తేరఁగఁ బంచి మాతలిని జెంతం బిల్చి తానిట్లనున్॥ ౧౦.

చ॥ తనరు! హిమాచలేశ్వరుని దక్షిణభాగమునందు సూర్యజా।
ఘననదితత్తటంబునఁ జోకాటపుఁదోటలకాటపట్టునై।
వినయవివేకముల్ దలుగు వెట్టని పాఱుల వేదశాలయై।
గొనకొని యుండు నొక్క పురి గోణిఁగు శాంబపురాఖ్య వెల్గుచున్॥ ౧౧.

క॥ ఆకాశాంబిసహస్రా । నీకమహోగ్రాగ్రొమపశింబుతో।
నైకొని పాలించు శతొ । జీదళాష్టద్యోతకస్థాపితం। ౧౨.

క॥ ఆవింధ్యాచ్ఛస్వర్గసాలభంజికలు వీణాభోగవిభ్రాంతిచేఁ।
గన వెల్గొం దెడినోయనంబరగునాకస్యందనం బత్తఱిన్॥ 3౫.

సీ॥ అపరసంధ్యావిహారపరులై కొమరాంద్రుచికురబంధమ్ములఁ జేర్చువేళ।
బృందారకాంగనాబృందంబుతో వీణవాయింపసుతిచక్కఁ బఱచువేళ।
యన్యోన్యసరసత్వమలయింపముద్దియల్గూడి గీరనగింజలాడువేళ।
యమునాతరంగిణీకమలకేళీమనోహారలమనోవిభులరయువేళ।
శారికాకీరశిష్యసంసదులు వారి । వారిపాఠముల్ శుద్ధాంతపరవఘాటి।
కాగురుస్థలిసరిచెప్పఁగలయువేళ । భూతలేంద్రుండు రథమెక్కఁ బోవువేళ॥ 3౬.

సీ॥ భట్టారకస్తోత్రపాఠముల్ వెలయింపఁ బద్మరాగద్యుతుల్ బయలుపడఁగ।
నఖిలనాకేంద్రకాంతాభోగవీణావిశేషముల్ తెలియింపసిరివహింప।
నింకుసంధ్యావేళహీరాంకమొనరింపనాదిత్యసూతత్వమభినయింప।
ప్రచురలోకాలోకరుచులపెంపాలయింపహరిరథ్యరుచిరత్వమొరసియాడ।
నినుడినుండౌటయచ్చెరువేటికడరు । విమలమౌక్తికహారముల్ వ్రేలియాడ।
పచ్చరాకట్టుతోరణాల్ప్రభలిర్వ । నెగయ జేజేలవీటికి నేగురథము॥ 3౭.

గీ॥ అవనివిడిచినయంతలో యమునపాఁలె । నదటక్రీడావిహారులైనట్టిజనులు।
లోకబాంధవులిరువురు నాకమందుఁ । దనరెదరు ప్రాక్ప్రతీచులననివచింత్రు॥ 3౮.

ఆ, వె॥ మఱియుఁ గొంతలోనె మందాకినీసరి । త్తటము సేరియ చటతపమునలుపు।
చున్న మౌనివరులఁ గన్నారఁ గాంచుచు । వెడలె విభుఁడు గగనవీథియందు॥ 3౯.

శా॥ ఏకాకిత్వము లేటికి సౌఖ్యములు గావే సాంద్ర చంద్రాతప
స్వీకారంబులఁ బ్రాణదాయక వధూస్నేహంబులానందముల్ ?
గాకున్న న్పరమేశ్వరప్రభృతులీ కల్పాగవాటీచర
త్కేకీనృత్తనిచిత్రనృత్తములలోఁ దేలాడఁగా నేటికిన్ ౮౧

ఉ॥ చుట్టములెందరున్న నెఱసోదరులెందఱుఁ గూడియున్నను
దట్టపునెయ్యురంతయును దారతసోదరభావమూననె
ప్పట్టునఁ బట్టియుండి భయభక్తులఁ బోషణసేసి కామరా
డ్పట్టపురీశ్వరత్వమును బన్నెడునన్నులు లేక యేటికిన్ ౮౨.

చ॥ అమితయుగాంతపావకసమావృతుఁడైనను ఘోరకానన
శ్రమజలరాశిలో మునిఁగి సంచలుఁడైనను మంచవాటికా
గమనవమల్లికాకుసుమగంధమరుచ్చలితోరుహారుసం
గముఁడయి నన్సుఖంబొసఁగుఁ గామినిశీతతరోక్తులాడినన్ ౮౩.

ఉ॥ గ్రావగుహాకుటీరములఁ గాపురమున్నను సింధువీథికా
జీవనుఁడైనఁ బట్టణపుసీమలనుండిన ధర్మహర్మ్యపుం
ద్రోవలనున్న సౌధములఁ దూఁగినఁ దొయ్యలితోడఁ గూడినన్
భూవలయంబునందు దివిఁ బోలె వెలుంగుఁ గుటుంబమెంతయున్ ౮౪.

చ॥ మనములుఁ గొల్లవోయిన నమానవదుర్లభమైన వేడుకన్
గనుఁగొన నొండొరుంగదియఁగా దెముదంబు కరంబు వర్ధిలున్
జనపతులెట్టులోకమున జాయలులేక వసింత్రు భార్యస
ద్గుణగణగణ్యయైన సుకృతుల్వెసఁ గూర్చునటంచు నెంచుచో ౮౫.

మ॥ అమరేశుండు వివాహవైభవపరైకాయత్తచిత్తానువ
ర్తిమహీనాథునిఁ జూచి యేలయితఁడీ దివ్యాప్సరోనృత్తగీ
తములన్ జేతము నిల్పకొండు వలనన్ దర్కించుచున్నాఁడు ప
ద్మముఖీసక్తమనోమదాళియయి ఖేదంబొందఁ బోలున్ గదున్ ౮౬.

వ॥ అని యించుక చింతించి యఖండమహీమండలాధినాథునకా ఖండలుండిట్లనియె.

శా॥ ఓ భూచక్రవసంతవంతవిడుమా యుల్లాసముం జెందుమా
నీభావించిన సర్వలక్షణగుణశ్రీమంతి నిన్బ్రిష్మాము
న్నీభూమండలమందు సృష్టిసలిపెన్ని త్యానుమోదంబుతో
నీభద్రవ్రతసూత్రమంగళమునన్నిండారుఁ గంఠస్థలుల్ ౮౭.

మ॥ వినుతత్వాఙ్గంబవివాహమయ్యెఁ దిమహాఖార్వీపాలకాదీనితో।
ననుసంధించుచరిత్రయొండుగలదీవాలింపుచోఁజెప్పెదన్।
మునులోకేశునిలోకమందపుడు నేముంగొంచటానందమై।
ఘనసంసద్భవనాంతరంబుననటుల్గానంబుసాగింపఁగన్॥ ౮౯

గీ॥ వివిధవిద్యావినోదముల్విను చునుండ । సారసాహిత్యసంగీతసరసములను।
సరసనురవారకామినులరుణతరుణ । చరణచారణచాగణల్చెరసినిలుప॥ ౯౦.

శా॥ వీణానిక్వణనైక మోహనచుఱావించెన్విధూమాఖ్యనిన్।
వేణిగ్రంథిచలింపనాడయువతివ్రీడాయుగక్షిప్రభా।
శ్రేణుల్దోపనలంబుపాప్సరసఁగాంచెన్గాంచికాలంకృతన్।
బాణుల్వల్లకిన్నృత్తమాడుతఱిఁబైపైపైఁటమైజారఁగన్॥ ౯౧.

చ॥ వసువువిధూముఁడచ్చెలువవాలికచూపులగెల్వనోయనన్।
ముసిముసినవ్వునవ్వెఁజెలిముంగలిచెంగులుచూచుచుండెనో।
యసమశరాఖ్య! స్రష్టసభయన్నభయంబునునానలేకనె।
క్కసముగఁదోడుపాటులొనఁగన్దొరకొంటివినీవుఁబాడియే?॥ ౯౨

చ॥ కొసరినప్రేముడిన్దగిలికొంకకయచ్చరనిట్టిచూడ్కులన్।
మసలకగన్గొనున్బయిసిమాలినవేశ్యలుద్రవ్యకాంక్షఁజూ।
పొసఁగరె! యెల్లవారికినయోన్నతసభ్యసుధీపవిత్రతా।
విసరజనార్ద్రనాభవనివేశముఖంబులనైనభూవరా॥ ౯౩.

ఉ॥ అక్కమలాసనుండువిషయస్పృహలెల్లనుజిత్తగించినా।
చక్కిమొగంబుద్రిప్పి,నగిచండతరంబున,వక్త్రమూచివే।
పక్కనవారిఁదిట్టిభయభక్తులులేకొనరించుకర్జముల్।
చిక్కిజనింపుఁడీభువినిలీలలదోగుఁడుదుఃఖచిత్తులై॥ ౯౪.

మ॥ అనిశాపాహతిఁగామరాజ్యమునుబాయంజేయవారద్దరున్।
మనముల్ఝల్లనరత్నపుంబ్రతిమలౌమాడ్కింజలత్వంబుమా।
నినిజోత్సాహముదక్కవక్కలయిగానీచూతమంచబ్జజ।
న్మునితోగద్గదశబ్దసంతతులవ్యామోహంబుపెల్లారఁగన్॥ ౯౫.

ఉ॥ వసువనునొకశాధిపయవద్యచరిత్రుఁడనింతమాత్రకే।
కసరఁగనేలనేలఁగలకాలముదుఃఖములెట్టులోర్తుబా।
నిసనయిపాపదేవతకునీరచులిత్తునె? మాయెడన్గృపా।
రసమొలికింపరాదెయనరాజయిభూవలయంబునంతయున్॥ ౯౬.

ఉ॥ ఏలుచుఁ ద్యాగభోగముల నేకటప్రేళ్ళిడ గానలంబుపా।
పాలనసేయుచున్నతుల పౌత్రుల గాంచుచు సత్యవృద్ధిమైఁ।
జాలినయాయువున్బలము సంపదయున్జయమున్వహించి వి।
ద్యాలలనావిభూషణుఁడవై క్షితినుండుము కొన్నినాళ్లకున్॥ ౯౭.

క॥ అనిపునరుద్భూతకృపన్ । వనజదళాసనుఁడు నుడువవడవడవడకుం।
దనువునకొకింతనిలుకడ । యొనరగ నావసువుచని యొయ్యమ్మలమడరన్॥ ౯౮.

చ॥ పవనధరిత్రియందు పరిషద్భవనంబుల వేదమాతృకా।
భువనములందు సంయముల పుణ్యవనంబుల దేవవాటికా।
న్యవనులశాస్త్రచింతనసమన్వితశిష్యకుటీరశాలలన్।
దవిలివిటీభుజంగులకు దర్పకశాస్త్రపరీక్ష గూడునే?॥ ౯౯.

శా॥ ఆగాటంపుఁగిలంకనిచ్చరయమర్త్యాలబ్ధదుఃఖంబుమై।
రాగాలాపనిరూఢమేనికలిపారావార మెబ్భంగి నే।
నాగంజాలుదునంచు నెంచు మతతీమాయామోహాసుప్తాంగియై।
వేగంబుర్విజనించె కోసలమహోర్వీజానికిం గూతురై॥ ౧౦౦.

ఉ॥ ఆపటుశాపబాణనివహంబులు దాకినఁ బొక్కి భూమిభూ।
మీపకులాంబురాశి నెలమిన్జనియించె విభూముఁడీవయో।
ధ్యాపురిపాలకాన్వయసరోంబుజయయ్యెఁ బురందరాదిసం।
ప్రాపితభోగభాగ్యవతి బాలమృగావతినా వెలుంగుచున్॥ ౧౦౧

గీ॥ అనుడు శౌనికి సనురాగమతిశయించి । మోసలెత్తంగ గుణరూపవాసవంశ।
పావనత్వంబులడుగ నద్దేవవిభుని । నడసుసిద్ధితినిపుడు నూరాడకుండె॥ ౧౦౨.

శా॥ ఆలీలన్దదిఁగానెఱింగి యమురోద్యానంబుప్రాగ్భాగమం।
గేలావల్లికలల్లుపందిరులస్వచ్ఛేందుపాలశ్రేణికన్।
బాలాశాపచరిత్రములున్నడువుచుంబద్మాసనాసీనుఁడై।
హాళింగూడిపురందరుండిటులు నెయ్యంబూదఁబల్కుందగన్। ౧౦౩.

ఉ॥ ఆకృతనగ్నభగ్ననిలయంబులనంతిపురంబుగూర్చిచం।
ద్రాకృతిరత్నదీపికలనయ్యెడ వేచిసదానధూటిర।
త్నాకృతినించిపుణ్యరమచాడ్పున బెంచుచునున్నవాఁడు శా।
రీకలకంఠకోకిలపరిస్ఫుటనాదకపోతపాళులన్॥ ౧౦౪.

శా॥ ఆరాజేంద్రుఁడు సత్యవర్ధనుఁడు విద్యానాధరత్నాయశః।
పారావారుఁడు దానకర్ణుఁడు కలాపారంగుఁడుగ్రద్విష।

చ్ఛీరాముండనుసుకాష్టకప్రకటపారీణుండు నాదాఖ్యుఁడా।
శ్రీరంగేశ్వుఁడు పాండనాన్వయముతో వియ్యంబు వీక్షించెదున్॥ ౧౦౫.
శా॥ ఆబాలామణిరూపనవ్యమగుసామాన్యంబులానవ్యలీ।
లాబానంబుననుంచెఁ బద్మజుఁడు లోలచ్చంచలన్యోబలున్వ।
శ్యాబ్రశ్రేణికలాకెసద్గుణములన్సంగీతసాహిత్యవి।
ద్యాబంధంబునఁ గూర్చివీణియలనాదాలింతురే వేళలన్॥ ౧౦౬.
గీ॥ అనుచువర్ణింపఁ జంద్రోదయంబుతజనిఁ । బల్లవాగ్రంబుమునిగోటఁగిల్లుచుండు।
నల్లనెల్లభుఁడల్లనఁ దెల్లవారెయె । సాంద్రచంద్రికాతుహినవర్షములుగురియ॥ ౧౦౭.
చ॥ అలయకయమ్మలంబుకడునాసలుమాసినమోముఁ దోపఁగాఁ।
బొలచువనాంతవీథులకుఁ బోయివిరాళినిగుందనేటికిన్।
వెలువడివీడుసేరిపలవించెదగాకనిపాకశాసనున్।
గలసిపురంబుఁడాసిసురనాయకుకోటకవాటమార్గమున్॥ ౧౦౮.
చ॥ కడచుచుభర్మహర్మ్యతతిగాంచనగోపురసంచయంబుకీ।
లెడపిసజంత్రిగాత్రములునింద్రమణీరమణీయమైనద।
గ్ధడములుగొత్తడంబులుబతాకలబొల్పెసలారునొవరుల్।
పొడగనినాటియామవతిబోనముమెక్కిపరుండెనంతటన్॥ ౧౦౯.
శా॥ ప్రత్యూషంబునవందిమాగధులస్తోత్రగ్రంథభూపాళరా।
గాత్యుత్సాహమువీనులారవినిశయ్యామందిరంబేదితా।
నిత్యప్రోక్తసుకృత్యముల్సలిపివేనీరాడిగాయత్రికై।
సత్యాఘ్యంబిడిదేవతాగృహమునసంధించెజేజేదొరన్॥ ౧౧౦.
శా॥ మందాకిన్యభిరామతోయములహేమస్థాళికంగూర్పఁగా।
మందారద్రుమపుష్పదామములసోమస్కంధమూర్తీశ్వరున్।
ఛందఃప్రక్రియబూజసేయుచుముహుస్సాహస్రనామావళిన్।
మందాలాపితమంత్రపుష్పములఁద్రేమంబెట్టిదైవంబుపై॥ ౧౧౧.
గీ॥ దేవగృహమువెడలిదివ్యాన్నభోజనం । బారగించియిరుగుఁబొరుగెల్ల।
మొనసియుండుభవనమునుజేరనింద్రుండు । తగినకానికలనుదానొసంగె॥ ౧౧౨.
సీ॥ ప్రసరించెనొకవంకఁ బటహభేరీడిండిమాదివాద్యధ్వానమోదనములు।
తలచూపెనొకచక్కిఁ దరుణీమణీవేణికాకుట్మలితకైతకప్రతతులు।
పొడచూపెనొకచాయముద్ధాంగనామనఃపీఠస్థిరాకృతాఖిలపసనములు।
తెలివెంబెనొకచెంతదేవతాబాలికాహల్లీసకాదికేళ్యంగణములు।

వెలసె నొకదెస నైదువుల్వలయ మెనసి । కూడియాడెడు గాటంపుఁగూడికములు।
మదనమోహనదేవతల్మతియొకదెస । నదనఁబదనిచ్చిరంబుజాద్యస్త్రములకు॥ ౧౧౩.
తే॥ అమరకాంతలెల్లనాలోకకౌతుక । మునువహించిలోకమునుతేని।
యరిదివస్తులిచ్చియానందమొందఁగ । వారువారుసదుపహారములిడ॥ ౧౧౪.
చ॥ ఒకయెలనాగమేఘములనుద్భవమొందినమౌక్తికాళిమా।
లికలనమర్చినిగ్గులుచలింప "మృగావతికిందమీకళా।
చిక"నన జేఁడుమైఁయుదరఁజెంగుననద్దెసలోలిఁజూచినె।
మ్మొకమరవాంచెనానటమున్నతఁడేమిదలంచుచుండెనో!॥ ౧౧౫.
ఉ॥ వేలుపులేమయొక్కరుతువీణియమున్నిడి "భూప, సూర్యజా।
వేలఫణీంద్రకన్యకలవీనులమోహమునించిజాయతో।
లీలలఁదేలుమెత్తటినిలింపతతంబౌనగూడు"నన్నభూ।
పాలుఁడువాతెఱన్నగునెపంబునమోముముడించెఁగొంకుచున్॥ ౧౧౬.
వ॥ శిశుక్రీడోపకరణంబులఁ గొన్ని రాజుముందునిచి.
ఉ॥ చేతులఁజేయిఁగూర్చికొనిచిన్నలుచిన్నియనుంగుమాటలన్।
"గూఁతులకిచ్చెదే! పసిడికుండలనీరతనంపుబొమ్మలీ
ప్రొఁతమెఱుంగుదివ్వియలభూవర, యచ్చనగండ్లు"నన్నన్॥ ౧౩౮.
డాతరితీపిపల్కువినియక్కజమందెఁడఁడూహకెంతయున్॥
చ॥ అరదముసిద్ధమయ్యెనమరాధపుఁడెన్నికకెక్కరానికి।
స్నెరులఁబసిండిపేటికలనిర్మలమౌక్తికచిత్రవస్తువుల్।
నరపతికిచ్చెభూవిభుఁడనంతులఁబొల్పెసలారుతేరినె।
క్కరహివహించెజిష్ణునకుఁగందునసూపెనుబోయివత్తునాన్॥ ౧౧౯.
చ॥ తనిమఁగడల్చెమాతలిరథంబువిరుల్పయినుండిరాలెన।
య్యనిమిషకాంతలాన్రుపునయంబెడబాయుసహింపకుప్పరం।
బునకువిహంగిచక్కలముమ్రుచ్చిలిపోయిననిల్చుబోల్చైభం।
గిననిలుమండిరంగజాఁడుకేరఁగభూపతివెంటనంటఁగన్॥ ౧౨౦.
ఆ, వె॥ తేరొకింతదవ్వుతిరుగదేవాంగనల్ । విభునిసోయగంబువేయునోళ్లఁ।
బొగడిమఱలఁదలిరునగవులనోలాడఁ । గలుగుమెక్కయనుచుఁగలఁగిచనిరి॥ ౧౨౧.
గీ॥ ఉమ్మలమువాపుఁబ్రేముడినెమ్మిఁజూపు । సిలుఁగుబెడబాపుమగనికోర్కులనుదీర్చు।
నెడఁదఁగారుణ్యలతఁజేర్చుబెడఁగువడయు।బంధుమిత్రులరక్షించుభార్యచూవె॥ ౧౨౨.
వ॥ అనుచు. ౧౨౩.

క॥ ననునేమనిదలఁచితినీ । కొనియాటకుఁదగినకాశికునిచేవెట్టిం।
బనిగొందుధరణివేశ్యల । యెనికబటాబూరమేమియేర్చితినాలోన్॥ ౧౩౩.

ఉ॥ గర్వితమంప్రచారకలికాలజకిల్బిషచిత్తసత్త్రిస।
రోర్విని భృద్వ్రధావినుతయోన్నపయొన్వతెఁగోరెదాసతిన్।
దుర్వహవిప్రయోగమునఁద్రోచిచరింపుచతుర్దశాబ్దముల్।
నిర్వహణంబొనర్పుమనినిక్కశపించెవివేకహీనతన్॥ ౧౩౪.

శా॥ "ఓసీ! శాంబరి! శాపదేవత! కటా! యోగీంద్రులన్నీదుబా।
హాసంశ్లేషత, మాన్పదే! జపతపోవ్యాహ్లాదమున్, దంపతుల్।
నీసంయోగముచేవియోగగతిగ్లానింజెందిదుఃఖింపఁగా।
నేసంతోషమునిన్నుఁబుట్టుశిలవే? యిందేలజుట్టాడదే?॥ ౧౩౫.

చ॥ అటులశపించియాచెలువయాఱడిపొవునమర్త్యతత్వమే।
మిటికనివాదులాడుచుశమింపనికోపముతోడఁజొచ్చెవే।
ల్పటీరవుశాపవాక్యములుభూపతివీనులకెక్కలేదుముం।
దటఁబడిపోవుమాతలివినంగనలందురెనిట్టిసేఁతకున్॥ ౧౩౬.

క॥ దైవమొకరించుకర్జము । లేవిధిదప్పంగఁదగునహీనతపస్సం।
భావితువకైనమానుష । సేవితతుచ్ఛప్రయత్నచిన్నిధికైనన్॥ ౧౩౭.

చ॥ పదపడివాయువేగమునఁబొఱిమహేంద్రరథంబుసూర్యజా।
నదినికటోర్విభాగములనాటినగ్రిందటఁజూచిమన్మథ।
ప్రదరములందపించునరపాలుఁడువీడుసమీపమయ్యెన।
య్యదివెరవేకిపాటుతగునాయనిధీరతనుండెనత్తతిన్॥ ౧౩౮.

మ॥ యము నాకైతపవేణిదన్నికటభాగారామములెక్కతకే।
సుమపత్రంబులసల్లితోరణపురాసుల్ భూషలైయొప్పసం।
భ్రమహర్షంబులుబాల్గొనన్ విభునికైపాణిద్వయింబెత్తియు।
త్తైములన్ దోయిటనూనివేడుగతిసంధింపన్ బురశ్రీతమిన్॥ ౧౩౯.

శా॥ సాయంవేళబహిస్సరోవరములన్ జన్నీరు తేఁబోయికా।
మాయతైకవిటీభుజంగులనుడాయంబోకవేరొక్కచో।
దోయంబెత్తిమెఱుంగుబిందెయలఁచోడ్తోఁబోవునిల్లాండ్రుపూ।
ర్ణ్రీయంపించుసుమంగలీతతిబలెన్ జెన్నొందిరత్యంబులై॥ ౧౪౦.

ఆ,వె॥ చదలనుండడిగ్గిజనపాలుఁడొండొక । సేపులోనఁబురసమీపమొంద।
నలరుజనులుప్రెగ్గడలుతోడనడువగ । నగరుచొచ్చిప్రీణనంబొనర్చె॥ ౧౪౧.

చ॥ సహచరమంత్రివర్గములుస్వర్గజయోత్సవరీతి వేడఁగా।
మహిపతియంతయున్ నుడివిమన్ననగొన్న తెఱంగుచెప్పిప్ర।
త్యహముడివోనిప్రేముడిసురాంగనలిచ్చినచిత్రవస్తువుల్।
ముహురనుబద్ధవీక్షలవిమోహముదెల్పెసురేంద్రుకుమారముల్॥ ౧౪౨.

క॥ నందనవనమందానిల। బృందారకవిహరణములుపేర్కొనియమరీ।
బృందములవివిధహేలా। నందములెఱిఁగించెమదిపెనంగొననాసల్॥ ౧౪౩.

వ॥ వారల వారివారి గేహములకనిపి తన యథోచితకృత్యంబులసలిపి యారాత్రి సౌధోపరి భాగంబునఁ జంద్రకాంతశిలామయంబైన తనశయ్యాగృహంబుసేరి వాతాయనసమీపంబున నిర్మింపఁబడిన హంసతూలికాతల్పంబున నత్తమిల్లి యనేకవిధమ్ములఁజింతించుచు.

సీ॥ పాఱుటొజ్జలఁబుచ్చిపడతికేలూతకెట్లడిగింతునానాపుడమిఱేని।
బుములోడకేడ్తెఱఁబొలఁతిఁగూర్చుటకిచ్చవడునెలాముసుమున్న పలుకఁడొక్కొ।
వలుకనేమాయెనుమ్మలికంబువోనెయిల్లాలేమివిసమెంచిపాలుపడునో।
నెలఁతయానుడువులవలనువీనులఁబెట్టకంజలిఁజిట్టుముట్టాడునొక్కొ।
కలసియువియున్నిదైవసంఘటనఁజేసి। విధివిపాకంబుదలకొనవెట్టెగాడ।
యనుచుదుఃఖించియాత్మలోనాడునిటులు। దర్పకావేశశాసితధైర్యుఁడగుచు॥ ౧౪౪.

మ॥ భువిలోమానుషజన్మమెత్తుసుఖాంభోరాశిలోఁదేలిధ।
ధరంబుల్చెయివట్టిసద్గుణములంరంజిల్లునిల్లాలితో।
డవివాహంబుఘటించిరాజయినరాష్ట్రంబుల్సుఖంబుంచిని।
త్యవినోదంబులఁబ్రొద్దుపుచ్చిపరమందాసక్తినుండన్ గదా॥ ౧౪౫.

మ॥ శతమన్యుండుమృగావతీగుణములన్ స్వర్బాలికల్వల్లకీ।
శ్రుతిగీతంబులఁగూర్చిపాడుదురనన్ శ్రోత్రప్రియంబయ్యెఁద।
త్పితృవయ్యండభిజాత్యుఁడంచునుడివెన్ బ్రీత్యంబుపానంబుచే।
సితిజాయాసుగుణంబులేసుఖతరశ్రీదోపదేయెయ్యెడన్॥ ౧౪౬.

సీ॥ ముక్కంటికైవడిసెక్కమైఁధరియించితలపూవువెన్నెలల్దరలుచోట।
మిన్కుటొజ్జతెఱంగుమిహిజిహ్వమునికిచ్చివెలఁదిరాయంచలుమెలఁగుచోటఁ।
బక్కిడాల్వేలుపుఁఘక్కినక్కునఁజేర్చిమున్నీటిమీఁగడల్మూగుచోట।
వలరాజుమాడ్కిచెయ్యులఁదోడుపాటిచ్చికొదమచిల్కలగముల్గూయుచోట।
దూఁగుటుయ్యెలలూఁగితోడ్తోనఁబూవు। దేనియలసోనదోఁగిపూఁదెప్పలీది।
తమినివెన్నెలపుల్గులుఁగుమియువేళ। చెలువతోఁగామవేళలఁజెలఁగుటెపుడు॥ ౧౪౭.

వ॥ అనుచు నిట్లంతర్గతంబునఁ జింతించుచుండి. ౧౪౮.

ఉ॥ సోరణగండ్లమార్గమునఁజొచ్చినవెన్నెలమేనిపైఁబడన్।
సైరణఁబూనిమైవికృతిచందముగన్గొననుంచునద్దమం।
దారజనీశ్వరప్రతిమయారసిచూచితెయెంతచొక్కెనా।
సారముచెప్పితీరునెవెసన్ బరికించినగాకనెచ్చెలుల్॥ ౧౫౦.

వ॥ అని. ౧౫౧.

చ॥ అలమటయొంటిపాటొలయునచ్చెనువున్గతనిద్రయున్మన।
స్ఖలనవహించిబాలకులకాలమెకాలమటంచుసెజ్జపై।
ఎలపలిపజ్జసేరినిడువాలికచూపులఁబండువెన్నెలల్।
బాలయువజాండగేహమునభోంగణనిర్మలనీలకాంతులన్॥ ౧౫౨.

చ॥ వెతకుచునక్షికోశములవేడిజలంబిడిహంసతూలికా।
కృతనవతల్పమేదికిటికెన్ బురివీధులఁజూచితృప్తిలే।
కతొడగియుంగివెవ్వలునిగట్టిశిరోగృహమందిమిద్దపై।
నతఁడొకచందనాగరచితాసనమందుపవిష్టుఁడైతగన్॥ ౧౫౩.

వ॥ నల్గడలంబరికించి. ౧౫౪.

సీ॥ సౌధోపరిప్రదేశములఁబిండారఁబోసినచంద్రికలఁజూడసెగలడంగు।
నతిదూరవిగమరాడధ్వమృచ్ఛేణంబుతత్స్థలిస్యూనవార్తాప్రసంగ।
మతివేలకాంతిశుద్ధాంతదీపాంకురచ్ఛాయలుర్వీమహోచ్చప్రచార।
విహగకోకోనాదవిక్రుతులత్యద్భుతాక్రాంతశబ్దబ్రహ్మగరిమకంబు।
తనిమఁబచ్చమెఱుంగుకేదారభూమి । సూర్యజానీరబింబితసోమబింబ।
శోభచూచితెయనుచువసుంధరాధి । నాథుఁడాశాష్టకాలోకనంబొనర్చి॥ ౧౫౫.

వ॥ అతినిర్మలంబైన వ్యోమభాగముపై దృష్టినిగిడ్చి. ౧౫౬.

గీ॥ ధాతసురవర్త్మవలయవితానమమరఁ । గట్టిపొంపిరివోవునక్షత్రపాడ।
రసపుగుండ్లటఁగూర్చిచంద్రమునిదీపి । వెట్టియెవ్వానిపెండ్లిగావించునెఱుఁగ॥ ౧౫౭.

వ॥ అనిమఱియు. ౧౫౮.

మ॥ అజుఁడెబ్బంగిసృజించెనొ తెలియరాదాకాశసీమల్ జగ।
ద్విజముల్ తారలుపగ్రహంబులుగ్రహవ్రాతంబులొక్కండునై।
ద్విజరాజచ్ఛవిజ్యోత్స్నమైవడివడిన్ దేలాడుచున్నాఁడును।
ర్ద్విజనుల్ నిద్రఁజరింపఁగావరులుభార్యల్ గూడియానందులై॥ ౧౫౯.

గీ॥ తనిమవెల్లమొయిళ్లచంద్రునిపయిపయిఁ । బ్రాకుచుండుటదలఁపచంద్రముఁడెవడిని।
గడచుచున్నాఁడుకైవడిగానుపించు । నిట్టిఱేఁజాయతోనున్న నెట్టులుండు॥ ౧౬౦.

గీ॥ అనుమదృష్టులమరలించియచోటువాసి । పొగలిగృహమేఘసుఖతక్తై పోయిగృహము।
చాలసేపుండితనదుమంచమునఁబండె । బండిననునిద్రరాదయ్యెఁబాగ్ధివునకు॥ ౧౬౧.

వ॥ అంతఁగొంతసేపటికి నిద్రించి యొకప్రొద్దువేళమేల్కాని గృహంబువెలువడి బహిఃప్రదేశమునకేతెంచి గగనతలంబున దృష్టినిగిడ్చి యిట్లనునిప్పుడు. ౧౬౨.

క॥ ఉడుదీపకళలుతతిగెఁ । బడలెగళాధిపుఁడునాట్యభంగిజనులాడెల్,
తొడిమఁఅచిరివడిఁబొంచా । లుఁడుపద్మినుచొచ్చువేళలోలాస క్తిఁ॥ ౧౬౩.

వ॥ అని ప్రత్యూషవాయువుల శిశిరత్వసుఖంబునిరూపించి. ౧౬౪.

క॥ ఈగాడ్పుచల్లనయ్యెఁ । వేగుటవెమ్మెదనుదీనవిమలజలంబుఁ।
గ్రాఁగిననూనియతాఁకఁగ । వేఁగుగడప్తమగుమాడ్కిప్రియతమలేమిఁ॥ ౧౬౫.

వ॥ అని యనేకవిధమ్ముల సనుగుణ కన్యాపరిణయోపాయంబు చింతించుచు నరుణోదయ పర్యంతము ప్రొద్దుపుచ్చి సూర్యోదయముకాఁగా కర్మసాక్షికి నమస్కరించి నిత్యకృత్యంబుల సలుపబోయెను. అట్లుసలిపి మంత్రి పురోహిత ప్రముఖుల రావించి కొందఱు బ్రాహ్మణులఁ గన్యనడుగఁబంపె. ౧౬౬.

క॥ అనికాణభూతివల్కిన । వినివిద్యాదయితుఁడడిగెవెనుకటివృత్తాం।
తనిరూఢియానతిమ్మని । వినయమునాదరముప్రోదివెట్టఁగనచటఁ॥ ౧౬౭.

ఇది శ్రీరామకృష్ణకవి ప్రణీతంబైన
మృగావతియందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# మృగావతి.

## ద్వితీయాశ్వాసము.

---

గీ॥ ఆగుణాఢ్యునకఖిలవిద్యావివేక । భూతిఁబనరాఁడు నాకాణభూతియిట్లు।
చెప్పఁదొడఁగె యథోచితశ్రీగడించి । విహితపల్యంకికలను రావించియపుడు॥ ౧.
క॥ గురువపుసంభ్రమ మెడగొన । నరపాలుఁడు గడఁగి పుచ్చి సంబాళువవే।
పురిసేనతోడ హర్షము । బొరయఁగ గౌశాంబి విడచి పోయిరి దారిన్॥ ౨.
వ॥ అట్లు పోవుచు నెండోరులు. ౩.
ఆ, వె॥ మనల నమ్మి పుచ్చె మహిపతి గాన నా । చిత్త్యమరయ వలయు సత్య కాంక్ష।
ప్రల్లదములనాడ బరిగాదు నూఱెండ్ల । పంటయిదియె వేఱు పలుకఁ బగునె॥ ౪.
వ॥ కావున. ౫.
క॥ కలరూపు తెలుఁగు చెప్పాట । కలయిక కొప్పిదము పెండ్లి కర్జములెరటన్।
లలనావరుల న్యోన్యము । కలకాలము సుఖము సెందఁగావింపఁదగున్। ౬.
వ॥ అనుచు. ౭.
ఉ॥ పాలకిసాగఁగోల్కొనిన భంగి లసత్సరయూతరంగిణీ।
కూలము సేరి సైనికుల కూటువతోడ నయోధ్యఁ జొచ్చి యా।
ప్రోలి విచిత్రముల్ గనుచుఁ బోవఁగఁ బోవఁగ మేడలొండెముం।
గ్రాలెడు తోటలొండెఁ బొడగానఁగ నక్కజమందిరెంతయున్॥ ౮
సీ॥ అపరిమితామోదులైతత్పురీవిలాసములు కాంక్షించు మజన్నిగట్లు।
బహుళోపశోభితోపాయనంబులుగొని కోటసింహద్వారగోపురంబు।
గడచి వప్రస్థలీకనక కేతనరాజి వీక్షించి హర్మ్యాగ్రవీధికోప।
నటదయోధ్యారాజనారీగళోద్గళద్రావముల్వీనుల ద్రవము నింప।
రాజభవనంబుదాఁటి విభ్రాజితుండు । హదనకృతవర్మ గొలువుండు సదను చేరి।
యచట వెలుగొందు సభికుల నరసియరసి । యచ్చెరువుతోఁ బడాయంగనంతలోన॥ ౯
వ॥ రాజన్యచూడామణిచేఁ దత్కాలోచిత సత్కారంబులు వడసి ధర్మమయాసనోపవిష్టు
లైనకృతవర్మ. ౧౦.

మ॥ భవదీయాంఘ్రిరజోవిభూతినిల నేప్రాంత్యంబువర్తించునె।
య్యవినామాక్షరముల్ప్రపన్నహితవిఖ్యాలంకృతగ్రామభా।
గ్గవులెవ్వారలుపావనంబికనువాక్సంసిద్ధిమై నేపురం।
బవనీనిర్జరులారచెప్పినసుధన్యాత్మున్ వెసన్ జేయరే॥ ౧౧.

వ॥ అన బాడబులు. ౧౨.

సీ॥ ఎవనిప్రతాపాగ్ని శివుజటాటవియంటిగళముశిరోబ్జుఁడంకమువహించె।
నేవానిశస్త్రాధిదేవతాపూజకై నైవేద్యమయ్యె సైంధవునిశిరము।
ఏవానివీరలక్ష్మీవివాహంబునకమరేంద్రుఁడిచ్చెసింహాసనార్ధ।
మేవాని గాండీవమిహపరావజ్ఞాతకౌరవాన్వయ నాశకారియయ్యె।
నధికతరభుజాశౌర్యవీరాశనావ । మానితారిప్రతాపుండుమహితయశుఁడు।
నరుఁడుజగదేకవీరుననప్పుఁడమల । కీర్తిజనమేజయుండుండె క్షితితలేశ॥ ౧౩.

గీ॥ అతనిపౌత్రుండువత్సదేశాధిపుండు । యశావనోదయసుభగస్వభావరూప।
సహితుఁడమరాధినాధవిశ్వస్తుఁడనుప । వచ్చినారముకన్యావివరణమునకు॥ ౧౪.

వ॥ అనువిని మహీపాలుఁడు కొండొకసేపుచింతించి తత్తదుచితప్రశ్నంబులఁ దత్సందేశస్థితి సర్వంబునెఱింగి తత్బ్రాహ్మణులతోఁ మఱునాఁడు రమ్మనిచెప్పి పుచ్చి వారలకు వలయుసామగ్రి యొసఁగుమని మంత్రులకాజ్ఞాపించె. అంత నాటిరేయి తనలోదాని ట్లుచింతించె నాసహస్రానీకుఁడు. ౧౫.

చ॥ అనవరతప్రతాపదళితారిభుజాబలుఁడిద్ధతేజుఁడ।
త్యనుపమధట్టికాబలుఁడునన్యసురూపుఁడలభ్యశాస్త్రిన।
ద్ధనుఁడుమహామహీభరణదక్షుఁడు నేరెడుదీవివత్సరా।
జునకెనయేపరుండుబలునూదనునంతటివాఁడుగొల్వఁగన్॥ ౧౬.

సీ॥ అమరావతీరాశనావమానితదానవవ్రాతుఁడే రాజవరునితండ్రి।
కద్రూతనూభవవిద్రావణైకమానసవజ్జుఁడే భూమినాధుతాత।
గాండీవనిర్ముక్తఘనబాణపరితప్తధరణీపుఁడేనిముత్తాతతాత।
దంభోళిధారాహతక్రూరరక్షస్సమూహుఁడే విభుదివ్యమూలపురుషుఁ।
డట్టివీరాన్వయాంబుధిబుట్టినట్టి । బెట్టిదుఁడుచిన్నదనములోఁబెఱదొరలకుఁ।
బెలుచతలవంపుగలుగంగసలిపెనతఁడు । జననఫలమొక్కొయతనినల్లునిగఁగోర॥ ౧౭.

క॥ అనిపెద్దతడవుచింతన । మొనర్చి దేవేరిఁబిలచియొంటిగ నెలదోఁ।
టనుగూర్చుండి విలాసవ । తినిజూచుచుబల్కె నిట్లుధీయుతమతియై॥ ౧౮.

ఉ॥ ప్రేయసి, భావుకంబువిను స్త్రీశిశువై జనియించిబాల్యముం।
ప్రాయమునాటపాటలనుబాలలతోబొమ్మరిండ్లుగట్టిలీ।
లాయుతమైమెగడించిబహుళప్రతిపాదితశోభనాప్తిమైఁ।
బాయఁగజవ్వనంబడరుబాలకుఁదండ్రినిగూఢచిత్తుఁడై॥ ౧౯.

గీ॥ శ్రీయునాయువునుగుణమంచితతపంబు । బలముసౌభాగ్యవృద్ధిసత్కులముబుద్ధి।
నలఘువిద్యావివేకతగలుగువరునిఁ । దెచ్చిజతగూర్పఁదగునంద్రుధీరమతులు॥ ౨౦.

వ॥ కావున. ౨౧.

సీ॥ అప్సరోగీతవిద్యాబంధనుత్యలావణ్యాభిషేచితధన్యమూర్తి।
యహితరాజన్యకన్యామనోబింబితప్రతిమాంకగాత్రవిభ్రాజితుండు।
నిర్మలమందాకినీకర్బురాంభోజవిద్యోతచూడాభవిక్రముండు।
సకలదైవతరాజసద్మసన్నుతపరాక్రమనిర్జితోద్ధతవిమతన్నృపుఁడు।
నందనోద్యానకేళికానందుఁడైన । వత్సదేశాధిపతిమృగావతినిగోరి।
జన్నిగట్టులబుత్తెంచెసమ్మదమున । జెప్పనీకోర్కిమదివేడ్కయుప్పతిల్ల॥ ౨౨

గీ॥ అతఁడుగాంధర్వసత్కళాయత్తచిత్తుఁ । డగుటమనపుత్రికోహళార్యప్రణీత।
భరతగాంధర్వగాయకచరితయగుట । మెత్తుగొండొరులనోన్యస్య మేళనముల॥ ౨౩.

వ॥ మఱియు. ౨౪

క॥ గుణవంతుఁడైనవరునకు । జననీజనకులుతనూజఁజంద్రబలాదుల్‌।
గణియించిశుభదినమ్మున । ననువుగనర్పింపవలయునంద్రువిధిజ్ఞుల్‌॥ ౨౫.

వ॥ కావున నీయిష్టంబు చొప్పెఱింగింపుమనఁ దత్పుత్రి. ౨౬.

ఉ॥ నిన్నటిరేయినొక్కధరణీసురుఁడాఁడటస్వప్నమందుమీ।
కన్నియవత్సభూపతికిగారవమారఁగనిండుసర్వసం।
పన్నయభోగభాగ్యములమందురునన్నిటఁబుచ్చెశక్రుఁడీ।
సన్నయెఱుంగఁజెప్పననిచక్కటిపల్కెనుఱిక్కదలంపఁగన్‌॥ ౨౭.

సీ॥ వత్సేశుపైమృగావతిబిట్టువలపులనిలిపియున్నట్టులదెలియవలసె।
నిన్నసాయంవేళనికటోపవనమునసహకారపాదపచ్ఛాయదోఁగి।
కొఱసిగ్గువోపముంగురులొయ్యఁబయ్యరగదలఁదోసకియలొక్కత్తునిరుగు।
రోలయమంతనమాడునురవైనపలుకులవ్రాక్రుత్తువిని మేలివలనుగాంచి।
బాల కలకాలమానందభరమువొంద । నుచితగృతిసల్పఁడనవుడునుర్విధవుఁడు।
వారిసంభాషణముఁజెప్పవలతెయనఁగ । నాకెయిట్లనుమగనితోననుఁగుఁబగిది॥ ౨౮.

“మృ—క॥ కాఁడతఁడు వత్సభూపతి । ఓఁడేనియు నిజరథమున నెఱివ్వ నమింటన్ ।
బోఁడెఱుఁది వేల్పుటరదము । చేడెలు, గంధర్వుఁడొక్కొ జిష్ణుండొక్కొ॥ ౨౯.

1 సఖి—క॥ అజరాధినాథు తేరది । నిజరథముండిసను బోవ నెఱిపడదే ? యం।
డజయానయతఁడు ఖచరుఁడే? । భుజపచాపల్యనయములు చూఁచియు నున్ ॥౩౦.

2 సఖి — నిన్నటినాఁడతండు తనదేశమునకు బోవకమున్న,
ఉ॥ శారిక సెప్పదే మనకు స్వఃపురమేగిన వత్సభూపుఁడే।
శేరఁగఁబోలు నంచు మఱతే ? యొకయామిని లోన నెచ్చెలీ।

1 సఖి—అవును. మఱచితిమి. అతఁడు వత్సేశుఁడ. సందియము లేదు.

3 సఖి—వారిజమార్గణోపముఁడు వత్సధరేశ్వరుఁ డింద్రలోకమే।
లారహిఁబోయి వచ్చె సఖులార యెఱింగిరయే ని చెప్పఁడా॥ ౩౧.

మృ—క॥ కనుఁగవ నిమ్మాఱును నా । తనిబింబముఁ గన్న మొదలు తాత్పర్యమునన్ ।
వినువీధిఁ దేఱి చూడన్ । మనమోపదు మగువలార మఱు లెట్టివియో॥ ౩౨.

1 సఖి—నీవతనిఁ జూచినచో నతఁడు నిన్ను తనరథము పైకెత్తికొని పోవుననియా?.

మృ—కాదు. ఆ, వె॥ చదలఁ దేఱి చూడ ఝల్లన హృదయంబు। సిగ్గు వోచు నతని చెలువు మంత।
రక్షిఁ బడుటక తననక్క జంబియ్యది। యుచితశాంతి చెపుఁడ యూహచేసి॥

1 సఖి—మనమిక్కడనుండి వెడలి శుద్ధాంతసదనమునకుఁ బోవుటయే దానికి శాంతి.

2 సఖి—అదికాదు. నీవాయనను వివాహమాడుటయే దానికి శాంతి.

1 సఖి—పూర్వమొక మునియు నట్లనుగ్రహించిన నాఁడందువు.

3 సఖి—వారిజమార్గణోపముఁడు వత్సధరేశ్వరుఁ డింద్రలోకమే।
లారహిఁబోయి వచ్చె సఖులార యెఱింగిరయే ని చెప్పఁడా॥

మృ—దేవతా స్త్రీల నెవ్వతెనైనఁ జేపట్టుటకుఁ గాఁబోలు.

1 సఖి—[చిఱునవ్వుతో]

క॥ నరపతులమరాంగనలన్ । బరిణయమగుదురె? సుపర్వభామలయొద్దన్ ।
మురువాఱుదళుకుఁగులుకులు । బెరయనె? జైవాతృకుల పెపృథ్వీజన్మల్॥ ౩౪.

2 సఖి—మనశారిక సర్వలోక వృత్తాంతంబెఱుంగనోపుఁ గావున నంతిపురికేగి యటవిచారింతము.”

వ॥ అని వెడలిరనవుడు నబ్భార్య వీడుకొల్పి తా గతనిద్రుఁడయ్యె. మఱునాఁడు కృతవర్మ.

సీ॥ ఆతులగోష్ఠీపీఠికాసీనులై యున్న యధ్వరామరులతో నవనిధవుఁడు।
మత్పుత్రినోసఁగెదమహీవల్లభునకంచుఁ బ్రేమతో నెఱిఁగించి ప్రియము సలుపుఁ।

డనుచు సదస్యులమనములతమిదీర్చియుచితసత్కారంబులొనరియంతి।
పురికినాకాశ్యపసుతులఁగొంపోయిమృగావతీగాయకగరిమఁజూప।
వారుకృతఫలకార్యులై వసుమతీశు । మదినిబొగడుచునానందమగ్నులగుచు।
నిజమహీపతికెఱిఁగింపనెవ్వడిగను । రాజపల్యంకికలనెక్కి రాజునొద్ద॥ ౩౬.

వ॥ సెలవుపుచ్చుకొని కౌశాంబిఁజేరిరి.

మ॥ ధరణీనిర్జరులాత్మకార్యసఫలోత్సాహంబుమైవచ్చుటన్।
నరనాథుండువినంగనేకతమయానందంబువొందెన్యుగం।
ధరుఁడున్ వత్సధరాతలేశ్వఁడయోధ్యారాజ్ఞనోభీష్టముల్।
పరిశీలించుటకుల్లమాతురత వెంపన్ వేచిరవ్వారికిన్॥ ౩౭.

ఉ॥ అత్తరిజన్నిగట్లువికచాంబుజలోచనులైమనోజవం।
బొత్తినపల్లకీలడిగియుక్తవిధమ్మునరాజునొద్దకున్।
హత్తినియుక్తపీఠికలనందఱుఁదారునుగూరుచుండఁగా।
జిత్తములందుపెంపెసఁగఁజెప్పిరిసర్వమువిస్తరంబుగన్॥ ౩౮.

చ॥ మఱియువచింతురిట్టులుక్షమాధవమాధవునంతవాఁడును।
క్కఱసమయించుశాత్రవులనాజినిదోర్బలలీలలొప్పనె।
త్తఱిఁగరుణాభిరాముఁడయిధర్మువుదప్పనివాఁడునై భువిన్।
గఱకఱియైయయోధ్యపురిఁగాచుచునుండెడినాతఁడెన్నఁడున్॥ ౩౯.

శా॥ సద్వంశంబుననుద్భవిల్లితమితో సర్వంసహారక్షణీ।
యోద్వేగంబుననుండునిచ్చలుగతాంహోభంగగంగాసరిద్।
భృద్వీచీచరదాశుగోల్లసితవాపీకూపకోద్యానగీ।
తద్దివ్యరాజ్యమునందప్రొద్దులిడునద్ధన్యాత్ముఁడే వేళలన్॥ ౪౦.

ఉ॥ ఆతనిపుత్రినృత్తకలనాగణితప్రతిభావిశేషయై।
శీతళవేదికారచితసీమలఁజెల్వలగూడికేకికా।
పోతవిజృంభమాణములఁబొల్పెసలారఁగఁగాంచిపల్లకీ।
ద్యోతితనాదబిందువులనొప్పెసలారుమనోహరంబుగన్॥ ౪౧.

గీ॥ అతఁడుసంగీతభరతనాట్యంబులెల్ల । నచ్చరులతోడనేర్పించెననుఁగుఁగూతుఁ।
జిత్రకలితావిలాసినిఁజేసిజగతి । విదితవిద్యలమాకుఁజూపించెనతఁడు॥ ౪౨.

సీ॥ హస్తవిన్యస్తవీణారవంబునుమించుగళగళద్గాయకగమకలీల।
గళగళద్గాయకగమకలీలనుమించునభినయవ్యాపారమరసిచూడ।

నభినయానందంబునవఘుళింపఁగఁజాలుసంచలన్మధ్యప్రసంగవృత్తి।
సంచలన్మధ్యప్రసంగవృత్తినిమీఱుఁబాదపద్మన్యాసబహుళితలాగి।
ముఖవికాసంబుగాత్రసమ్మోహనంబు । వినయతోక్తులునడవడివ్రీడసంభ్రమ।
తాగుణంబునురూపవిస్తరతచతుర । తయునుమధురిమమించునెద్దానిదైన॥ ౪౩.

వ॥ అనునంతనృపుఁడు. ౪౪.

శా॥ ఏమేమీయికనొక్కమాఱుచెపుఁడాపృథ్వీశసింహుండులీ।
లామోదంబుననుండువాఁడెసుత నేలాసౌకుమార్యంపుఁగే।
లీమోహంబుననింపఁడట్లయినఁదల్లిందండ్రియుంబోలునా।
భామారత్నముమాతునెన్నఁడుబహిఃప్రాణంబుగానెంచెదన్ ॥ ౪౫.

వ॥ అనిమంత్రులంబిలిచి బ్రాహ్మణోత్తములకు మణికనకవస్తువాహనాద్యనేకంబుల నొసంగి వీడుకొల్పెవదియట్లుండెననంతరంబొకనాఁడు కృతవర్మ సకలమంత్రివరపౌరోహిత మహార్త్తికాదిబృందంబును సుకవినికరంబును వేదవేదాంగవిద్యాపారంగులను సభాంతరంబున వివిధవిషయప్రసంగనావేశంబుడిపి శుభముహూర్తంబు నిర్ణయింపుఁడనుటయు వారలట్లుసేయ సకలదేశాధిపతులకు శుభలేఖలంపుఁడని మంత్రులకాజ్ఞాపింప వారలు నట్టొనర్చి పురంబలంకరింపుఁడని రాజసేవకులకానతిచ్చిరి. ౪౬.

ఆ, వె॥ పుష్పకాయమానములుఁగట్టిధవళవి । తానములనమర్చితరళమౌక్తి।
కములగములఁజెలువుగాఁగసింగారింప । మంగళంబులెల్లఁజెంగలించె॥ ౪౭.

సీ॥ వివిధదేశాయాతవిమలసుధాకాచఫలకనిర్మితదీపపాత్రములను।
బందిటసవరించిపాదరపుంగుండ్లఁజుట్టుశృంగారించిమట్టుమీఱు।
ముమ్మాయిముత్తెముల్మొనగూర్చిఖేచరప్రతిమలనెడనెడఁబాదుకొల్పి।
సౌరభాగురుగంధసారరజోయంత్రసమితిఁగంబంబులసడలువఱచి।
వేల్పులకునైనసిద్ధసంవితతికైనఁ । బౌరికాంతులకైననబ్రముఘటింప।
మోహదేవతదెచ్చియావాహనంబు । సేసిరోయననొప్పెఁగైసేఁతలపుడు॥ ౪౮.

వ॥ అదియట్లుండెఁ దత్పురీప్రతిగృహ పురోభాగంబున. ౪౯.

ఉ॥ చిత్తరువుల్లిఖించిజలశీకరయంత్రచయంబమర్చివి।
ల్లెత్తినమన్మథాకృతులనిక్షుశరాసనహస్తచాతురిన్।
హత్తుచునున్నవశ్యముఖినంబుజలోచనతోడిరుక్మిణిన్।
భిత్తికలందువ్రాయుదురుపెంపెసలారఁగఁగస్యకాముణుల్ ॥ ౫౦.

ఉ॥ ఒక్కొకయింటిముందుసిరులుట్టిపడంగపసిండినీటిచేఁ।
జెక్కినసాలభంజికలఁజేర్చిరిగోడలద్వారబంధపుం।

బ్రక్కలవీథిలన్ని యలపార్శ్వములందుసుమంబులీనిసొం।
పెక్కువచెట్లతోట్లరచియించిరిదివ్యవిలాససంపదన్॥ ౫౧.

ఉ॥ రాజగృహంబులన్ జలువరాలవెలుంగుననంగుతోటధా।
త్రీజములెల్లఁగుడ్యములదీర్ణవిలాసములౌటవన్నియల్।
దేజరిలంగఁబెట్టిరవధీరితనందనకల్పపాదప।
వ్యాజముకొల్లలాడశుభవాచకసూచకవిభ్రమంబునన్॥ ౫౨.

సీ॥ అప్సరఃప్రేమాస్పదానీతకల్పపాదపపుష్పఝల్లరుల్ దనరుచోట।
సామంతసీమంతినీమంగళారణ్యమల్లికాహారముల్ మలఁగుచోట।
నన్యరాజన్యకన్యాహస్తనిర్మితరంగవల్ల్యాదులుఁబ్రాలుచోట।
విప్రనితంబినీవిన్యస్తకేతకస్తంభచతుష్కంబుదగులుచోట।
జిగినిజిగురాకుపందిరుల్ నిగుడుచోట । మాలతీదామజాలముల్ ప్రేలుచోట।
జగతినిర్మించిరన్నువల్ సరససరస । దీపకళికావిలాసముల్ దోపుచుండ॥ ౫౩.

గీ॥ జగతిపైపజ్జగొజ్జంగిసరులుగూర్చి । తళుకుఁగ్రొమ్మించునిలువుటద్దములనునిచి।
యెదలవెలదీయుకొదమకోయిలలగూళ్ల । నెత్తమామిడిచివుళులనిడిరిభటులు॥ ౫౪.

క॥ పరిపరిపరుసులవిరచిం । చిరిపరనరనాథులెల్లచెల్వమునరిదిన్।
గరమెదనిడిసంతోషిం । చిరిసిరిదొట్టఁగవివాహసిద్ధిదలఁపఁగన్॥ ౫౫.

గీ॥ జనితమజ్జనభోజనశయనశాల । లెల్లఁజల్లనితోఁటలనెసకమెసఁగఁ।
గట్టిబహువిధసామగ్రిమట్టుపఱచి । రల్లమంత్రులుసంతోషమతిశయిల్ల॥ ౫౬.

వ॥ ఇదియిట్లుండె వివాహదినంబుదటియ. ౫౭.

శా॥ సాకేతుండనువాద్యఘోషములకాజ్ఞాపింపస్వామాత్యయో।
షాకన్యాపురమానవాళియుతవత్సస్వామివాహ్యాళిరా।
రాకాచంద్రుఁడొనర్చుతాండవవిహారంబోయనందోఁచెలో।
కైకశ్రీముఖహాసచంద్రికలుగ్రందైయెల్లడన్ బర్వఁగన్॥ ౫౮.

గీ॥ వరపురోహితుండువైదికలౌకిక । వస్తుసమితినెల్లప్రస్తరించి।
నిఖిలమానిరాజనిర్ణీతలగ్నంబు । గదియఁజూచుచుండెనుదయవేళ॥ ౫౯.

ఉ॥ కాంచనచేలముల్ దళపుఁగమ్మనితావులెసంగుకస్తురిన్।
బంచమణిఘటాఖచితభర్మవిభూషణసంచయంబున।
భ్యంచితమాలతీకుసుమహారములన్ గృతవర్మపుత్రికై।
పంచియలంకరింపుఁడనుబాడబపుణ్యవధూజనంబుతోన్॥ ౬౦.

వ॥ అట్లలంకరింపఁబడినవధువును సకలభూపాలదత్తోపహార మణిభూషణంబులను బురంద
రాదిబృందారకసందోహనిష్యందమాన స్నేహార్ద్రలబ్ధ మేఘజనిత ముక్తాహారాద్యాభర
ణంబులను గైసేఁతనొందినదాని వివాహవేదిపయి తెఱమఱుఁగున నిలిపి కృతవర్మ. ౬౧.

శా॥ మాన్యాశీర్వచనారవంబులమరీమాధుర్యకంఠస్వనం।
బన్యోర్వీపనుతిశ్రుతుల్ సుసురపుణ్యాహధ్వనుల్ దేవతా।
ధన్యస్తవ్యంయతులుద్భవిల్లి కలయందంజాపురీవాద్యముల్।
కన్యాదానముసేసెఁబాణులఁబయఃకాంతుల్ విడంబింపఁగన్॥ ౬౨.

వ॥ అత్తఱివరుండు. ౬౩.

సీ॥ ప్రతిసీరవెలిఁబ్రాఁకఁబసిఁడిబొమ్మనుజూచితొడరుచెప్పఁడటంచుఁదొట్రుపాటు।
గదురబైఁపజ్జనుగ్రాలుఁగ్రొన్నిలువద్దమునజూడనుంకించుముదితమోము।
నువిదయునెలనాగలోలగింపఁగనానఁదలయెత్తఁగోరెడద్దమునుగాంచఁ।
దలవంచిహారరత్నమునబింబముఁగోరుఁదరుణతెయవనికఁదలపడయ్యెఁ।
జిఱుతచెమరునునలసతిచిఱువణుకును । గలయజడిచూపులాలయమంగళతనిలుచుఁ।
గంకణముగట్టుతేళక్ష్మాకాంతుడంత । జనులనేపథ్యమునుజాల్వసప్పుడమున॥ ౬౪.

ఉ॥ రాజునుగాంచనబ్జనిక్రబాజ్ముఖమున్ వికసిల్లెనంతనా।
రాజునుబాలఁజూచుచుఁగరంబులభావముదెల్పనత్తఱిన్।
దేజముచూచినిశ్చలతనిల్చునొకింతమతెంతలోద్విజ।
శ్రీజయనాదముల్ గదురఁజెందునుమంగళపాదసంపదన్॥ ౬౫.

సీ॥ మాంగల్యసూత్రంబుమహిళాగళస్థలిఁగీలించెజనపతిబాలకపుడు।
పులకరించినమేనఁబొడమెఁగించిద్బిందుజాలఘర్మాంబువుల్కొలనమరు।
లక్షతంబులుచల్లనచ్చరల్పసిఁడితామరరేకులునిచిరిశిరసులందు।
ధరణీసుతుల్ మల్లెదళములవైవజూడుక్కొలసుధాధారలుగురిసిరన్య।
పతులకన్యలునూత్నజంపతులుక్రొత్త । మక్కువలఁజిత్తభావసంపత్తిసెల్ల।
నొండొరులెఱుంగఁజెప్పికోనోపకిట్లు । పెనరిరోయనఁదలఁబ్రాలుపోసికొనిరి॥ ౬౬.

గీ॥ జాతవేదునివేలిచిసప్తపదులు । మెట్టిపూర్ణాహుతియొనర్చిమేదినీసు।
రాళిపూజించితక్కుకృత్యంబులెల్ల । సలిపిరంచఱుబందుగుల్ సంతసిల్ల॥ ౬౭.

ఉ॥ అండజయానకవ్విభునకంబరభూషణసర్వవస్తువుల్।
పెండిలిపెద్దలైభువికివేల్పులునైవెలుగొందుదేవతల్।
దండిగనిచ్చిభూవిభులుఁదత్తదుపాయనముల్ పురస్సనన్।
నిండినవేడ్కమైనునుపనెట్టనదీవనలిచ్చిరత్తఱిన్॥ ౬౮.

శా॥ సాయంవేళ సమస్తదిక్ప్రభువులు వీక్షాకౌతుకార్థంబుస్థా।
నీయారామముసేరిగాడ్పుమెయినెంతేవివసంతుష్టులై।
వాయువ్యాహతతంత్రికాచరమదిగ్వల్లక్యవాజ్యంత్రముల్।
గేయస్ఫూర్తి నెసంగఁదోడగుడుభృంగీగీతనాదంబులున్॥ ౭౯.

మ॥ నికటోద్యానతటీనటత్స్రుతులవేణిగ్రంథులల్లాడఁబూ।
మకరందంబులఁగొల్లలాడివిలసన్మందారపూగావళిన్।
సకియుల్ దాఁగుడుమూఁతలాడనొకకొంతన్ వారుఁబింపిళ్లకై।
శుకమా! కోకిల! రావెయున్ మగువపోజుల్ సూచిరవ్వేళలోన్॥ ౮౦.

ఉ॥ భామలుగొందఱచ్చటను బంతులఁదచ్చనవాటులాడనా।
రామముదాటిభూపతులు గ్రాలునుపాంతవనంబుసేరఁగా।
సోమదిరాక్షి తెమ్మనుచునొండొరులాడికొనంగనంగనా।
స్తోమముఁజూచినవ్విరలతోరపుసిబ్బితిఁజేసికొందఱున్॥ ౮౧.

ఉ॥ అందఱుగొంతసేపచటనాడఁగులాడుకడిందిచైదముల్।
విందులొనర్పఁగన్నులకు వేసరయూనదిపొంతఁజేరని।
ష్యందసుధాకణంబులగుచక్కనిబాలురముద్దుపల్కులన్।
జెందిప్రవాహమందిగతిచేతముశీతముసేయనెంతయున్॥ ౮౨.

సీ॥ డీలుబీరపుమాసటీడులుమట్టి కాసెలబిగగట్టి బాహులనుదట్టి।
వెల్లిపైనీదాడివిరియునవ్వలిగట్టుసేరచింతంబులుసేసిడిగ్గి।
కొందఱుసుడిఁబడిగ్రుక్కుమిక్కునలేకమల్లాడిమెల్లనమలసిరేవు।
పట్టినెట్టనఁనొంటిప్రతినలసరిదీర్చిపస్వటాటలనాడుపసులుగని।
వెల్లిదఱిగినయొడ్డులవిధములరసి । కలకలధ్వనిసేయుపక్షులబెడంగు।
రాళ్లనొఱసిపైకెగయునీరంబుగాంచి । వెఱగుపడినిల్చిరన్యపృథ్వీపవరులు॥ ౮౩.

క॥ ఇవ్వడువుననవ్వారిగ । నవ్వారిని గేళిసల్పియలయుచుదమలో।
నవ్వించుపల్కులాడుచు । నవ్వసుధేశ్వరులుమగుడియరిగిరిగుమిడ్డై॥ ౮౪.

శా॥ ఆరేభోజనశాల స్త్రీపురుషులాయాస్థానముల్ పొందనా।
రీరత్నంబులుగీతముల్ తొడగిగారీగేయముల్ కృష్ణసీ।
తారామాభ్యుదయంబువాడిరిమహోత్సాహంబునంహాస్యగీ।
తీరీతుల్ వెలుగొందెబందుగులలోదివ్యాన్నముల్ గుడ్చుచోన్॥ ౮౫.

వ॥ ఈరీతి. ౮౬.

చ॥ వడవడి నేగెనయ్యెయిదువాసరముల్ సుఖగోష్ఠిభూమికాం।
తుఁడితరమేదినీపతులఁదోరపుమన్ననసేయనొక్కఁడ।
ద్దడమునఁబీఠికల్ వఱపిదండడివారలనందుఁబెట్టిప్రే।
ముడినిడికానికల్ పరమమోదము పైకొనవీడుకొల్పఁగన్॥ ౭౭.

వ॥ వారలు కృతోచితసత్కారులై స్వస్వపురంబులకేగిరి తదనంతరం బొకశుభముహూర్తంబున వధూవరుల గర్భగృహంబునకనిపిరి. ౭౮.

సీ॥ ఒఱపు వెన్నెలలు నెత్తెఱలై వెలుంగఁ బూగుత్తులొగిరసంపుగుండ్లుగాఁగఁ।
జెట్లువాయిదకాంద్రచెలువుదోపఁగ నికుంజారామరంగంబులందుఁ గేకి।
శుకపికజనములుచూచుచుండఁగరతీకుసుమమార్గణులుకొక్కొక్కకహూచి।
మారనాటకములవీరశృంగారవసంతమోహనరమల్ సఖులుగాఁగఁ।
జైత్రచంద్రాదులుచితవేషకులుగాఁగ । దంపతులునామృగావతీధరణిపతులు।
నాయికానాయకులుగనిర్ణయముసేసి । తమియథావిధిదత్ప్రయోగములొనర్తు॥ ౭౯.

మ॥ విరహాంభోధిముదంబునాఁదరణిచేఁ బ్రేమాకకుబ్యంత్రము।
ద్ధురతన్ మార్గవిపత్తులన్ లుదెప రాధుండోడ కాఁడైపథిన్।
దరణిన్ దేఁగనుదూడుపుల్ గతికినాద్యస్థానులైయొప్పఁగాఁ।
దరుణీభర్తలుదాటుచుండ్రలసవాతవ్రాతముల్ వీవఁగన్॥ ౮౦.

చ॥ పడఁతియు నేలయేలికయుభావజలీలలఁగొంతకాలమి।
వ్విడువునఁదూఁగుటుయ్యెలలవాఁడనిపూపొదరిండ్లజాళువా।
సిడెమలరామమిద్దియలఁజెల్వపుఁబర్వముఁజూఱవెట్టనె।
వ్విడిఁగమలాస్యకుంగడుపువచ్చెమనోహరమైనధీధితిన్॥ ౮౧.

చ॥ తనువుకృశించుఁగోరికలుదారొక్కనుమానసవీథిశాలికా।
శనపుదిధృక్షమానునడసన్నవడున్ బతివాక్సుధాకణం।
బునకెడలేదవేళలనుబొందునునిద్రశ్రమంబుమైవిలా।
సినులవిహారవాటికలఁజేరఁగఁబోదుమృగాక్షియత్తఱిన్॥ ౮౨.

వ॥ ఇట్లుండ నొక్కనాఁడు దానునుండ. ౮౩.

మ॥ చెలులంతఃపురవాటికన్ జరణమంజీరస్వనంబుల్ శుకీ।
కలనాదంబులుతాళగానములుగాగాంధర్వవిద్యావిశ్రుం।
ఖలసంబద్ధరతీశులై మెలఁగియున్ గ్రాల్గంటియేమేమెచ్చిం।
తిలుచున్ భర్తకుఱంగటంగదియఁబృథ్వీనాథుఁడీక్షింపఁగన్॥ ౮౪.

ఉ॥ ఎన్నఁడులేనియుమ్మలికయెక్కుడిదీమెనుగుందువెట్టెచుం।
ద్రున్నగుమోమునందెటులుదుఃఖకళంకముపుట్టెనంచునా।
య్యన్నరపాలుఁడమ్మదితహస్తముఁజేతఁగ్రహించివల్లికా।
చ్ఛన్నవితర్దికోపరినిశాకరకాంతతలోపవిష్టుఁడై॥ ౧౫.

ఉ॥ వేవిళులన్దపించుచెలివిస్మయమగ్నతఁగాంచిప్రేయసీ।
భావములోననెద్దిగోనిపల్కుఁజెప్పఁగఁగొంకెదీవదే।
లావినిపింపుమీక్షణమెలాలనమైశిరసావహించియెం।
దేవిధినల్పువాఁడగదవేతలపోయుమువేయునేఁటికిన్॥ ౧౬.

చ॥ అనవుడురాజపుత్రివికచాంబుజలోచనయైధరాధినా।
ధునిసదనుగ్రహంబుననెమూకొనుకోర్కిసగంబుసార్థమ।
య్యెనుధరణీకళత్రునకునేమనిపల్కుదునన్నకొంకునుం।
జనియెఁబ్రకాశనైనుడువఁజక్కనికందుపయించునల్లనన్॥ ౧౭.

సీ॥ మిన్నేటినీటిచామీకరాంభోజంబునందనోద్యానమందారకుసుమ।
మంజరీనిచయంబుమలయశైలపటీరతైలంబుశాంకరదైవతాంఘ్రి।
దితిజకన్యాకరార్పితకుంకుమంబుగాంగేయభూభృత్సానుగీతకేళి।
సింధుమధ్యద్వీపసికతావిహారంబువ్యోమయానచరేక్షణోత్సవంబు।
లోనుగాఁగోరవటియుఁగోల్కొనుతలంపు । తెల్లఁదీర్చుమఁదనిపినన్నెడనెడలను।
హృదయశల్యంబువేరితోనెత్తిమీరు । గాచుచున్నను వేధింపఁజూచునొకటి॥ ౧౮.

వ॥ అని యూరకున్న. ౧౯.

శా॥ ఓప్రేమాస్పదురాలశంకమదిలోనుట్టాడఁగానేలభ।
ర్తృప్రేయస్యనురాగజామృతముగాదేభాగ్యదేవ్యర్థయో।
గ్యప్రాయంబుసతీపతుల్దలఁపులన్యోన్యంబుగానాడరే?
యీప్రాయంబునగోర్కులుట్టిపడవేయిల్లాండ్రనోదార్పరే? ౨౦.

ఆ॥ అనుచునోడువవిభుఁడుతనయిచ్ఛనెఱవేరు । ననుచుఁదలఁచియంతరాత్మఁగొంకు।
లౌల్యముద్భవిల్లలలనావతంసంబు । పల్కెనిట్లుప్రీతిబయలుపడఁగ॥ ౨౧.

ఉ॥ ఒప్పగుఁగాకమీనుడువులోన్నుపయొక్కకవేళఁగార్యముల్।
దప్పుటలేదెనాబెగడుదాకొనమీయెడఁబల్కకుంటినా।
తప్పిదిసైపుఁడెట్లయినఁదక్కవినిర్మలరక్తదీర్ఘికన్।
గప్పుడివోవనాకుజలకంబొనరించుటభీష్టమిత్తఱిన్॥ ౨౨.

చ॥ అనవుడునానృపాలుఁడిటులాడఁగఁగూడదునెసత్వవాసనా।
గుణరహితంబశుచ్యమునుగూఢమమంగళమైనదీక్షిమ।
జ్ఞనములుసేయఁజూతురటెశాంబరులైనవపుఃపవిత్రవో।
జనపతికన్యవీవువిరసమ్ములుపుట్టవెయోతలోదరీ॥ ౯౩.

ఉ॥ ఆదటవిన్మతోంటివసుధాధిపకన్యకలిట్టిదుర్భరా।
పాదనిజాభిలాషములఁబాఁడిగఁగోరిరెనీవుసర్వవి।
ద్యాదిరహస్యముల్దెలిసియాఁడివుచ్చిననవ్వరేజనుల్।
మీఁదులెఱుంగకిప్పగిదిమేకొనవెంగలిగోరుఁగాదశే॥ ౯౪.

ఉ॥ నావుడుఁజిన్నవోయివదనంబుననించుకమాత్రబిందువుల్।
వావిరిఁబుట్టనిగ్గగొనివంచెమొగంబటునుంగుటంబునం।
భావపుఁగిన్కపాటుసతిపల్కఁగనోపకవ్రాసిచూపెనో।
నావిలిఖించుబ్రహ్మలిపినాయలకెట్లిఁకఁగార్యలబ్ధముల్॥ ౯౫.

ఉ॥ కొండొకసేపువోఁబ్రసవకోమలితోరపుటల్కదోపసూ।
పండితవర్యరాగిలునబద్ధపుఁబ్రేమడియూరడింపులన్।
నిండునిజానురాగమదినిర్మలశీతతరాంతరాత్మలో।
నుండికఱంగిపారదెప్రియోక్తులవారలుసార్థవంతుతే॥ ౯౬.

వ॥ అనుడు నతండు. ౯౭.

చ॥ అటవులలోనరాశనములై విహరించెడుక్రూరజంతువుల్।
చిటిచిటిమేతమేసితమచేసిననెయ్యముచూపరాట్సుతా।
పటలముతోడనాడుకొనుపక్షులులోనుగఁబ్రాణికోటినె।
త్రుటినెడబావినీకునజరుల్డిగుదీక్షికయయ్యెనక్కటా॥ ౯౮.

ఆ॥ అనిననెలఁతచిత్తమందువెక్కసపాటు । గదురనిట్టులనియెమదిలోలంగి।
దివికిఁబోవలేకతెగడదేకొంగమా । నసరంబుహంసనాథుతోడ॥ ౯౯.

క॥ అనిమూరిబోవుతగులున । గనలియెదవెడగుముగుదమొగమునన్నం।
దనమీనమీననేత్రము । లనుదోఁచఁగనీటిచాలులలిఁదలవంచెన్॥ ౧౦౦.

ఆ॥ ఆమెహృదయశల్యమార్పలేకధరేశుఁ । డిట్లుదలఁచెనాత్మనీమెగర్భ।
వతియుఁజంచలాత్మవెతలాడునోనగూడ । కున్నదానమాయపన్నవలయు॥ ౧౦౧.

ఉ॥ ఒకొక్కవేళముద్దియలకొందగరానిమనోభిలాషముల్।
చిక్కనుదీర్పఁగోరిప్రియుఁజీరరటంచుఁదలంపఁబల్కని।

ఫక్కు మదాళులారగ జఘాలమదంబున వ్రాల నేలకం।
పెక్కునసంపఁగుల్ వెనుకకేయనఘస్త్రుఁ జనోవిశేషముల్॥ ౧౦౨.

ఉ॥ ఎంతయుఁ గుందుబాలచెవికెక్కకపోయెనిజాభిలాషవి।
భ్రాంతివిలంబబింబములవ్రాలుచుకాంగనగీతికిచ్చునే।
స్వాంతము మొండిపట్టుదలవాయనిరాజకుమారితోడఁ భూ।
కాంతుఁడుపొమ్మనీయడుగుకై వడిఁ దూర్ణమెయాచరించెదన్॥ ౧౦౩.

వ॥ అని. ౧౦౪.

శా॥ సాయంవేళ మృగావతీనిజమనస్తాపంబునన్ గృత్రిమో।
పాయాన్వేషణుఁడై యసృగ్విధముగా పంగాజతూళికా స్మిళ।
స్సాయాశోణితదృష్టికన్ పడిరచింపంబంటులన్ బంపెవా।
రాయత్తంబొనరించిపచ్చిరవిభుండబ్జాక్షితోఁ జెప్పఁగన్॥ ౧౦౫.

శా॥ పూరింపందనువామృగావతికి ప్రసగుర్వాపాళిఁ దీయించిస।
స్మేరోల్లాసముఖాబ్జయైవిమలగంభీరస్వనద్వాక్కునై।
నీరాడన్ జెలులారయేగెదనుబన్నీరంబుగస్తూరిబా।
టీరంబున్ జతసేయుఁడంచునొడివెన్ డీల్వడ్డ చెల్లెంద్రతోన్॥ ౧౦౬.

చ॥ ఎఱుఁగుదురేయిహంబుడిపియింద్రియనిగ్రహమాచరించిరో।
త్రైఱవనవాసులైశమనధిక్కరణైకధురంధరాత్ములై।
కఱచినదివ్యదృష్టిఁ గలకాలము చిన్మయమూర్తిఁ గొల్చుచున్।
గఱకరులైనమానులిఁకఁ గామినులేటికిభావిశేముషిన్॥ ౧౦౭.

శా॥ ఆసీమంతినితోట్రుపాటుగమరన్ బ్రాలంబికల్ దీసితా।
వాసోభూషలపేటియందునిచిమవ్వంబైనయేకాంబరం।
బాసించెన్ నగరేదిరాగనపసవ్యాక్షి ప్రకంపంపుటా।
యాసంబుల్లమునేరెఁ జెప్పఁ జనదాయబ్జాక్షి ప్రాణేశుతోన్॥ ౧౦౮.

ఉ॥ భావమెలర్పనంతిపురిఁ బాసిమనోహరదృష్టికాతటిన్।
బోవుచుఁ గన్నులారఁగ సెభూవిభుఁడున్ రలిదేవిబాల్యపుం।
భావముదోఁపనాపడఁతిభారముతోఁ జనుదేరఁ గాంచెసా।
భావికకంఠపార్శ్వగతభాకుక్కులు సెకొన్నముద్దుచిందఁగన్॥ ౧౦౯.

ఉ॥ రొండొకసేపులోననెలకొన్న విమోహతయప్పళింపఁగా।
నిండినడిగ్గడిగ్గరజనీచరసాంధ్యసమాగమంబున।

ట్లుండెమృగావతీతనువనూనరుచింబయిపైనివ్రాలెనా।
చండగభస్తిసాంధ్యకరజాలముబింబితధాతుశైలమున్॥ ౧౧౦.

శా॥ఇచ్ఛాకేళివిలాసదత్తతనువైయేలాలతాసౌమన।
స్స్వచ్ఛత్వంబొనగూడరక్తజలయోగాయత్తయైశోణర।
త్నచ్ఛాయల్ పెనుప్రోదివెట్టఁగమనోనాళీకమావాపిలో।
స్వచ్ఛస్వర్ణలతాంగివిచ్చెనునభోవాటీవిరుల్ చూడఁగన్॥ ౧౧౧.

వ॥ అత్తఱి. ౧౧౨.

శా॥తారామార్గమునుండితార్క్ష్యకులజాతంబైనపుల్గొక్కఁడా।
యారామాంతరవాపికాజలపరివ్యాప్తాంగనన్ మాంసభం।
డారంబంచుభ్రమించిబాణరయచండత్వంబులగ్గింపఁగాం।
తారత్నంబునుగొంచుపోయెనునభోధారాధరశ్రేణికిన్॥ ౧౧౩.

ఉ॥ డగ్గరియున్నకాంతుఁడుకుతారవిలూనశిరస్కభంగియై।
వ్రెగ్గుచుఁగాలుసేతులువిముక్తబలంబులుగాఁగఁబ్రాణముల్।
బెగ్గిలనయ్యయోయనుచుఁబృథ్విఁబడెన్ బ్రియురాలిరోయనా।
నగ్గలమైనధీరతయునాక్షణమేవెలివోయెనక్కటా॥ ౧౧౪.

వ॥ అని కాణభూతి. ౧౧౫.

చ॥ అమలగుణాఢ్యదారుణవనాంతరవాసకిరాతశాబకా।
క్రమితవిహంగముల్ నరునగమ్యపుటుప్పరవీధికేడ్చునే।
భ్రమయునెపక్షిలోకముసుపర్ణకులోద్భవమట్లుసేయునే।
కమలజుఁడోర్చునేమిథునకల్పముపోగ్రహచారమామెకున్॥ ౧౧౬.

చ॥ అనవుడుసద్గుణాఢ్యుఁడుగుణాఢ్యుఁడుతొల్లివిహంగరాజుస।
న్మునులగువాలఖిల్యులువిముక్తశరీరసుఖానుభూతులై।
చనితలక్రిందుగాఁదపముసల్పఁగనొక్కద్రుమంబునందుదా।
నినిగొనిపోఁడెతక్కులవనింజనియించినచిచ్చిదక్కటా॥ ౧౧౭.

వ॥ నావుడుఁ గాణభూతి. ౧౧౮.

చ॥ పొలతినిబక్కితీసికొనిపోవఁగముందటెఱుంగఁడేమియున్।
జలజలబాష్పముల్ దొరఁగసాగినత్రోవనెసూచుచుండెపెం।
గలఁకమహీతలంబుపయిగ్రక్కునమూర్ఛిలెమూర్ఛదేరశీ।
తలజలమిచ్చువారెవరు? ధర్మపరిగ్రహమోర్తుదక్కఁగన్॥ ౧౧౯.

శా॥అంతంగొంత సెమూర్ఛదేఱె సుగుణాఢ్యత్ముండు భూపుండు భూ।
కాంతానేత్రయుగంబువం దొయఁగు నేకన్నీటిచేఁదేఱెనో।
యంతర్వాణితరించెనో యటనయోధ్యాపుత్రితస్నానస।
భ్రాంతిం బుచ్చినచిత్తమాత్తవిభుతేపం జూచెనో యేమొకో॥ ౧౨౦.

ఉ॥లేచిలలాటసీమఁ జెయిలీనతచేర్చిఖగంబుదిట్టుచుం।
బ్రాచినకాంచికాంచిమహివ్రాలుచులేచుచునంతరిక్షముం।
జూచుచుఁబువ్వుదోఁటఁబలుచోట్లఁగనుంగొనుచుమ్మలించియా।
యాచోటులం దలంచిమదినబ్బురముం గడునంతపుట్టఁగం॥ ౧౨౧.

వ॥ ఇట్లు చింతించు. ౧౨౨.

చ॥ పడఁతివిహంగమేమను నెపంబుననంబరవీథికెత్తెనో।
యడరివిరాళిరావణునియట్టిఁడుచేసినజాలమో భయం।
పడిపడిరక్కసుల్ విహగమాయనొనర్చినయైంద్రజాలమో।
తొడిబడెనో నభంబుచొరఁనొయ్యలియేమనువాఁడనావిధిం॥ ౧౨౩.

చ॥ విసిఁగెనొయుమ్మలించెనొ వివేకముజాఱ్చెనె బాష్పధారలం।
వెసఁగసుగందెనో విహగవీథిగనుంగొనిడొల్లవోయెనో।
యసువులువాసెనో కలికియాకసపుంగతలేడు నేర్చునే।
డొసఁగినఱెక్కలానలువయూరకయుందునె హా మృగావతి॥ ౧౨౪.

శా॥ఈదినుం విడనాడిపోవడిమనం బెట్లొప్పెనే ప్రేయసీ।
నీదివ్యంబగుమోముఁ జూతునెటువహ్నింగాల్పనేయియ్యెడల్।
నీదృగ్గోమలులేనిచోశరణమెంతే నాకుసన్యాసమే।
యేదిక్కేగితి చెప్పవే గరుడజం బెందేగుఁ బ్రాణేశ్వరీ॥ ౧౨౫.

మ॥ అమరీనుత్య భవన్ముఖామృతమునెట్లానింతువో నీకటా।
క్షము నాపైప్రసరింతువెన్నఁడు భవత్సంతోషవాక్చాతురీ।
క్రమమేనాఁడుతరించునో నను విచారగ్రస్తుఁగావించియే।
రమణీయాశ్రమమందితో ప్రియసఖీ ప్రాణేశ్వరీ సుందరీ॥ ౧౨౬.

శా॥హాయేదారుణకావనాంతరముడాయంబోయితే ద్వీపినీ।
స్ఫాయత్కాలము సేరితే జలనిధిం జల్లాడు దేద్వీపమా।
సాయంకాలము మెట్టితే గిరిచరుల్ సైరించితే శత్రురా।
డ్గేయంబుల్ చెవిసోఁకె చెప్పవె ప్రియాటీకంబు మోహాంబునం॥ ౧౨౭.

చ॥ కువలయనేత్ర నీ వెటులుఁ గుందుదువో తపనోష్ణశక్తిఁ బ।
ల్లవపద యెట్లు శైలపటలమ్ములు మెట్టుదువో భయంకరా।
టవి నెటులుండ ధీరవిరటత్స్వనోల్లసితాట్టహాసముల్।
చవిగొను దేల తాంగినవసారిణులో గ్రు వెగర్భభారవై॥ ౧౨౮.

చ॥ రవికుల తేజుఁడైన రఘురాము ననుంగు వెలంది నేలపు।
ట్టువయును తోల్లి ప్రేఁకటిబటు స్వసదుజ్జ్వలనిర్ఝరాపగా।
ఘవముల సైకతస్థలుల బాలలతో విహరింపఁ గోరెమా।
నవులకు రాని కాఠియలు నాటఁగఁ గుంద దెకోర్కె దూఱదే॥ ౧౨౯.

ఆ॥ వెలఁదులార! వేవిళులఁ గోరు కోర్కులు । మిగుల నరిదియగుచు నెగడు మండుఁ।
దని విదీర్పకున్న మనమిచ్చి మాటాడ । రిడుమల ననుభవింత్రు నడుపు నెడల॥ ౧౩౦.

ఉ॥ ఇంకిటు లెంత కాలము ప్రియేశ్వరిఁ బాసి సనోంవిచారతన్।
క్రుంకెడువాఁడ రూపమును కోమలమున్ మృదువాగ్విలాసమున్।
గొంకును గూడు నేయితర కోమలులందు సఖీజనంబునా।
వంకను జూచు నేయనుచు వ్రాలుధరాతలమందు వందుచున్॥ ౧౩౧.

శా॥ ఈ సప్తాంగము తేలయీయుపవనంబీ మేడలీ పట్టణం।
బీ సాంద్రద్యుతి వెల్వరించు రమణీయేంద్రాశ్మ భూపాళియీ।
కాసారంబులు గీతి కాలయములీ కల్యాణరూపంబుతే।
లా సంతాపనిమగ్న మాత్రునకు బాలాముక్తవిశ్వాసికిన్॥ ౧౩౨.

చ॥ రుచిరతప్రాయమున్ గుణము రూపము నాయువుఁ గల్గి బంపతుల్।
ప్రచురతనుండవే ధరణిఁ బ్రాయమొ రూపమొ యేదియో యొకం।
డవిరతనొందునన్ని గలయన్ విధియోర్వకయిట్టి కాఠియల్।
రచనయొనర్చు సంతసము రాగము నీమదిఁ బుట్ట దేవిధీ॥ ౧౩౩.

శా॥ కాళిందిన్ జిగురాకుపందిరులగంగా వేదికాసీమలన్।
బాలాతాండవమాడు వేళలమనః పద్మాలయోల్లాపినీ।
కేళీవల్లకు లేడఁ బోయెను గుంగీరంబులన్ వీడియే।
లీలన్ బోయితివంతరిక్షమునకున్ లీలావతీ చెప్పవమా॥ ౧౩౪.

ఆ॥ అతివ! లోననున్న యర్భకుఁ డెబ్బంగిఁ । దలఁకుఁ దల్ల డిల్లును లుకుఁ బత్రి।
త్రోటి నీదు కేశకూటంబు దగులగ । వింటి కేగ మిగుల వెగడువడునొ॥ ౧౩౫.

ఆ॥ పురుడువోసి నిన్నుఁ గరుణింతు రెవ్వార । లోగిరంబులు నిచియూడి గంబు।
లౌసగఁ జూతు రర్భకుని బెంచి మూనాళ్లు । గర్భగండదినము గడచు నెటులు॥ ౧౩౬.

వ॥ అని. ౧౩౭.

క॥ పరిపరిపరుసులవందురి । పొరలును జెయిజేర్చి మాళిఁ బొరిపొరిఁ గన్నీ।
రరలిం మదిరుగునటు నిటు । లురమున శిరమానియిట్టులొాదుగన్ బలుకున్॥ ౧౩౮.

చ॥ మనుజున కెప్పుడుత్తలమమాయచుపో! పసినాఁడెయుత్తమం।
బనఁదగుజవ్వనంబున మహాగుణభూషణఁ బెండ్లియాఁడద।
ఘ్ననసుఖభోగభాగ్యములు కాలముపట్టున నుండ వెంతియుఁన్।
వనజభవుండొ నన్నునరవాయికి నేమనువాఁడనక్కటా॥ ౧౩౯.

ఉ॥ ఓపికవాణిచాతక మయూరములున్నతపాదపంబులన్।
జూపనివృష్టిమైబుషభషడ్జములొాయ్యనఁ బాడు వేళలన్।
జూపఋతులైనచిల్కలొాకసోదివహింపఁ గదాఁగుటుయ్యాలల్।
యేపుననూఁగునాదినములెయ్యవియోభువనైకమోహినీ॥ ౧౪౦.

శా॥ ఏణీలోచననిన్నుఁ బాసియుమనం బెట్లాఁగెనో ప్రాదినీ।
మానంబయ్యెనొకొక్కరాత్రిమృదువాఙ్మాధుర్యలీలన్ స్వన।
ద్వీణాయంత్రతతమోహనిద్రగదురన్ దీక్షాంశుఁడీప్రాచితో।
వాణీనాథుఁడుగాఁగ లేచుదివసవ్రాతంబు లేమయ్యెనో॥ ౧౪౧.

వ॥ అని. ౧౪౨.

ఉ॥ కానలఁ బుచ్చియిచ్చమెయిఁ గర్ణకఠోరములైనశారికా।
ధ్వానములేలనాకువిషవహ్నిజలాశయమాలకంబుగాఁ।
బ్రాణముకోలువుచ్చెదఁ బ్రియావిరహాగ్నిఁ దపింప నేలకో!।
హా! నళినాక్షియంచువసుధాధిపుఁడొయ్యన వ్రాలె భూమిపై॥ ౧౪౩.

చ॥ పడిఁ బొగగూడుదీసికొని వాఙుఁగఁ బోయెడిపాల్టికైవడిన్।
బడఁతినభోంతరంబున శ్రమంజనుటాడియొఱింగి దేవసూ।
తుఁడుతనదివ్యచక్షువునఁ దొందరపాటునవచ్చిమూర్ఛ చెం।
దెమునరపాలుచేరునకుఁ దెప్పిఅకుండిన నెంతమాత్రకున్॥ ౧౪౪.

ఉ॥ నొచ్చియతండువాడినతనూలతకోపినచల్లనూడిగం।
బిచ్చినఁ దెప్పితెల్లిధరణీశుఁడువందనమాచరించినా।
యిచ్చలుదూలెఁ బ్రోడగొనియేగవిహంగముభానువీధికిన్।
జచ్చిననేమినాకుసురసారధిచెప్పుమయేటిచైదముల్॥ ౧౪౫.

మ॥ అనువంతిల్ గిలకొట్టుపల్కులకునాహోమాల ముంగోపిచే।
సినచెయ్యెంతటిపాట్లుదెచ్చెనని జేజేవందికారుణ్యవా।

కుఱ్ఱవమున్న చ్చరయిడ్డశాపగతి వాక్రువ్వన్ విహంగంబువై।
యిన తెన్నాతఁడుచూచుచో గణిక! నీకెగ్గేమిగావించితిన్॥ ౧౪౬.

చ॥ పిలువఁగఁబల్కకుండుటకుబిట్టుకనారిలిశాపమీయఁగాఁ।
బొలతికిను ర్వేదంపతులఁబోకడ పెట్టినఁబుణ్యమానెకా।
వలపుఁబనంబుదానిసహవాసము వేల్పులకిచ్చగొల్పె! మ।
త్తిలివిధికుండలించినయదృష్టముదాటఁగనే ర్తురేనరుల్॥ ౧౪౭.

క॥ వెలవెలఁదికొలముచెడుదన । ములఁజూపకయున్నె యోర్వములుసవతింబో।
రులుపుట్టినిండ్లువారికిఁ । గలకాలముధనముఁజూఱగఱతురుమాయన్॥ ౧౪౮.

వ॥ అనిదుఃఖావేశంబున. ౧౪౯.

తే॥ అకటపదునాల్గేండ్లువాయంగ నెన్ని । యుగములగునొయందాఁక నే నోర్వఁగలనె।
తనువువిడుచుటధర్మము త్తలముకంటె । ననుడుమాతలినవ్వుచిట్లనియెఁగొసరి॥ ౧౫౦.

చ॥ ఇడుములురా వెమానవులకెల్లెడలన్ ధృతిఁదూలఁబాడియే।
యడలుజనుండుసైతమునిరామయుఁడై ధృతితోననున్నఁబె।
న్దడవునకైనబాయఁడె వెతల్ సుఖమెచ్చటనుండుదుఃఖము।
క్కడవసియించుదీర్ఘమతిఁగాఱియలెంచకుధైర్యమూనుమా॥ ౧౫౧.

శా॥ ఏయేవేళలనేదియేదినరులం దెబ్బంగివర్తించునో।
యాయావేళలనన్నిటంబొరసిమాయాలోకదుఃఖంబులన్।
బాయంజూతురుదూరదర్శులుమనోభారంబువేడింపుమా।
కాయుత్యాగముమానుమాతరుణిమాంగల్యంబుచింతింపుమా॥ ౧౫౨.

వ॥ అని కొంతయూఱటవల్కి యదృశ్యుఁడైన నరేంద్రుండు. ౧౫౩.

ఉ॥ ఏమనిచెప్పవాఁడసఖులెల్లరుఁదల్లడమందియేదియే।
దీమహిళాలలామయనితేఱఁగనుంగొనజైత్రలక్ష్మియా।
లేమపిఱుందఁబోయినలలింగనుపట్టెడిఁగందువారియా।
రామమురత్నహారములురాజిలకుండెడినేమిచెప్పదున్॥ ౧౫౪.

క॥ అనిచింతిల్లుచునగరికి । జనమంత్రిప్రముఖులెల్లజననాయకునిన్।
గనియచ్చరశాపంబును । వినియూఱటవల్కిరపుడు వెతలుగుడువఁగన్॥ ౧౫౫.

తే॥ సుగముసాలించియెన్నఁడుసుదతిగుఱిఁచి । వార్తలే తెంచుననియార్తివందుదేవ।
వారకామినిదూఱుచువ్యర్థమైన । తనువురోయుచునుండునాధరణివిభుఁడు॥ ౧౫౬.

క॥ అనికాణభూతివినిచిన । వినివిద్యాదయితుఁడడిగె వెనుకటివృత్తాం।
తనిరూఢియానతిమ్మని । వినయమునాదరముప్రోదివెట్టఁగనచటన్॥ ౧౫౭

గద్య॥ ఇది శ్రీరామకృష్ణకవి ప్రణీతంబైన మృగావతియందు ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# మృ గా వ తీ.

## తృతీయాశ్వాసము.

---

గీ॥ అనగుణాఢ్యుండుసకలవిద్యావివేక । భూతిఁదనరారునాకాంతభూతిధిషణు।
నిభునకిట్లనుదొలిదెసనెగపెనట్టి । తార్క్ష్యభవమట్లుపోవుచుఁదరతరమున॥ ౧.

మ॥ తటినీసంచయముల్ ధరాధరములుద్యత్పారహర్మ్యాగ్రముల్।
నటదుగ్రద్విపసింహసంకలితకాంతారంబులత్యద్భుతా।
స్ఫుటికాగచ్ఛదమందసైనికసమిత్ప్రాంతంబులక్రాంతసం।
ఘటితాష్టక్రమతాపసాశ్రమములేకాయేకిగాదాటుచున్॥ ౨.

తే॥ పెక్కుయోజనములువ్రాయి,బీతుగుడిచి । యొడలుమఱచినయుగ్మలినోరఁజూచి।
పక్షుయిట్లనునాయాసపాటుతెల్లఁ । దెల్లవారెననిమరలఁదేజిచూచి॥ 3.

చ॥ భ్రమయుచుమాంసఖండమనిప్రాణినిదెచ్చితినింతదవ్వటం।
చుమదిఁదలంచియచ్చటనెత్తుద్రమృగాకులమైనమేదినీ।
ధ్రమునమృగావతిన్ విడిచిదంపడినీడపుఁద్రోవపట్టెదె।
వసుపచరించుకృత్యములవారణముల్ గదపండితోత్తమా॥ ౪.

మ॥ కలలోనైనఁదలంచెనేమృగమిళత్కాంతారమధ్యంబునన్।
గలఁగింపన్ మదిదంతిరావములువంకన్ నీటినాదంబుమున్।
డులచెట్లిచ్చెడుకీసనీడలుఖగన్యూనంబు, మైడోల్లవ్రా।
లలనారత్నముశైలసానువులవేల్లత్కంటకశ్రేణులన్॥ ౫.

ఉ॥ కాంచనవేదులన్ గలయఁగత్తియుపిండువిపంచికారవా।
భ్యంచితచిత్తలైచెలులునచ్చరకోటులుకోహాళోక్తమె।
ప్పించఁగదిద్దుముద్దియకుభృద్విషమస్థలిభోగినీవిధుల్।
గాంచఁగనయ్యెనచ్చెరువుగాదెతలంపఁగనేమిచెప్పుదున్॥ ౬.

సీ॥ చలువరామేడలఁదులదూఁగునుయ్యెలల్ సరివ్రానిగట్టుతాఁచటియలయ్యెఁ।
జెలువంపుటిండ్లవైచిత్రిఁజిత్రించినమువ్వన్నెమెకములునివ్వటిల్లె।
శారికాకీరవీణారవంబులుకర్ణకాఠిన్యవేదండగానమయ్యెఁ।
దోనాడునెచ్చెలుల్ కానదౌదవ్వులనిలుచుముండులచెట్లకొలములయ్యెఁ।

జలువమలగాలి వెస్ వీచు జంఝలయ్యెఁ । గాని పచ్చని యొడలిచిక్కంపు కంపు।
టూలవులెబ్బంగి నైననుమఱఁగదయ్యె । నేకవస్త్రయేకాకినియింతియపుడు॥ ౭.

తే॥ ఒంటిమైనున్న యువిదయెట్లులికి పెలుచ । నుమ్మలించునొ గ్రామశూన్యమ్ములైన।
గట్టుచరియలఁబాసుతగడపురేలు । వెఱపువేళల నెవ్వారిమఱుఁగుఁజొచ్చు॥ ౮.

ఉ॥ ఎక్కడికేగెనంచ నెఱయీకలపొన్నులతోడ నాడుపి।
ల్లక్కలపిండు పండుపలనన్నలు వెట్టిన పట్టుపుట్టముల్।
మెక్కడి శాలికాశనమమేయవిభూషలు పల్లకీలుకీ।
లెక్కన సాలభంజికలు నింతికనంతవనాంతరంబులన్॥ ౯.

చ॥ అనినగుణాఢ్యుఁడవ్వలికథాంశము చెప్పమటన్న భూతిరా।
డ్ఘనుఁడిటు పల్కునంత విహగంబొక పర్వతసానువందుపై।
డినయొకకొంతలోన నెకడిందివిచారతవత్సరాడ్వ్యథా।
టినిదురలేచుదానివలె డీల్పడుకన్నులువిచ్చువిచ్చినన్॥ ౧౦.

సీ॥ అల్లనగనువిచ్చియఱసంజకెదురైనపడమటిపజ్జతిప్పలనుగాంచు।
మలఁగికనుల్ద్రమాల్చిమఱికొంతతడవుచింతించిదాపటికనుల్ దెఱచిచూచి।
బయలంటుకొనలనుండియుఁజాఱుచక్రటాలుపైఁబడనుంకించు ఘణితిఁగాంచి।
వలపటఁదలద్రిప్పివఱలుచీఁకటిగలక్రీచక్కఁబోడగనికీలుగొల్వ।
నుత్తలము వెడవెడముండులొత్తిపోఱు । చిఱుతచెట్టులబుసబుసల్ నెఱపుకీట।
కములుగనివినిపేరలల్కరము మొరయు । మొరపములువిన్న గుండియల్ద్రమోగె సతికి॥

వ॥ అంత. ౧౨.

చ॥ ఒడలొకచాపరాయిపయినుండఁగనుప్పరవీధినక్కడ।
క్కడనఱ కెంపుచాఱలిడఁగాఁదొలిదిక్కున, భానుఁడత్తతిన్॥
బడమటివార్థిలోమునుఁగఁబాఱెడినొక్కడభంగసంగతుల్।
వెడలఁగనొక్కపజ్జఁబృథివిన్గబళింపఁగఁబోలురాఁగనున్॥ ౧౩.

చ॥ కనియిదిపాడుస్వప్నమని కన్నరమోడ్చెను గాని శేముషిన్।
వనరుచునుండె నేమియిదిస్వప్నమెయంచునొకింతలో నెరయొ।
య్యనదెఱచెన్ గనుంగవకటా! ప్రియమిత్రమతెచ్చెనిచ్చటన్।
జనరహితాచలావనిక శంకితబుద్ధివిహంగమక్కటా॥ ౧౪.

సీ॥ నిడుదైననల్లని నెఱులుకుత్తుకఁగొంతనక్కునగొంత పైప్రక్కఁగొంత।
గాఁగజిబిజిగాఁగఁగరమొకండవని పైహస్తాంతరముబొమ్ముమస్తరింప।

పలువవీడియువీడికలవడబుత్తడిబచ్చెనబొమ్మనాఁబరఁగనొడలు।
తొలినాఁడుమగనిముద్దులఁదూగునప్పుడు కెంపునించినమోవిపెంపుగదుర।
వారుమోమునవడిబాష్పవారిదొరుగ । ముంగురులదుమ్ములెడగొనమొగిళులంటు।
గట్టుచఱియలఁబొరలాడుకలికికులికి । పఱచెనోయునఁబుల్గులుపాఱెనింగి॥ ౧౫.

వ॥ అంత మృగావతి తటాలునలేచి. ౧౬.

ఉ॥ ఎచ్చటనున్నదానవిదియెక్కడిపర్వతబృందమెట్లుపో।
వచ్చునువత్సభూమికిటవ్రాలెడుభాస్కరుఁడస్తవార్ధిలో।
ముచ్చులుబెట్టిదంపుమృగముల్ ఫణిరాజులుసంచలింపరే।
యిచ్చటనిల్వనేర్తునెప్రియేశ్వర! వాసితిమిమ్ముఁజూతు నే?॥ ౧౭.

ఉ॥ ఆలుమగండుఁగూడిభయదాటవినున్ననుసౌఖ్యవార్ధిలోఁ।
దేలుచునుండ్రుమద్గతులుదివ్యములయ్యెమునీంద్రశాపమో।
వేలుపుటన్నులోర్వమిఁదవిల్చినవారొకొ జన్మపంకజం।
బాలనిమగ్నతాఫలమొబాలతెఱుంగఁగనేర్తుశేయిలన్॥ ౧౮.

సీ॥ సాకేతపురమునజనియించిభారతవంశవర్ధనుఁడైనవత్సరాజు।
చెట్టవట్టినుపర్వసీమంతినీబృందవినుతనైనందనవనవిహార।
ఖేలనాసక్తనైబాలాతపవిదూరనైరూపవిజితాప్సరోంగననయి।
శరభశార్దూలకేసరివరాహోద్దండఫణిరాజులకునాటపట్టునైన।
యిమ్మహాగిరికెటుబలియిచ్చికొందు । నకటవిహగంబులారనన్నాకలించి।
వత్సదేశంబుసేర్పుఁడుపల నెఱుంగఁ । గన్నుగాననియీకానఁగరుణతోడ॥ ౧౯.

వ॥ అని యాకసమువంకజూచి. ౨౦.

సీ॥ మొలినూలిగజ్జెలమొరపంబువినుతల్లి యెవనిఁబెండ్లాడదవేయటన్న।
ముద్దుపల్కులు రాఁగమురిపెంపుఁదండ్రియునెవ్వానివరియించెదేయటన్న।
గ్రచ్చకాయలనాడునెచ్చెలుల్ చిఱునాటనెవనిముద్దాడఁబోయెదవటన్న।
జవ్వనంబునఁజంద్రశాలాతలంబులనడలసఖుల్ తొంటియట్లయడుగ।
వత్సభూపతిఁజేయివట్టవలచుదాన । నతఁడుగొనఁడేనివారివిషాగ్నిమాల।
కముగనసువులువాసెనగరమునమ్ముఁ। డనుచుఁబల్కెడిదాననోవినుతశీల॥ ౨౧.

చ॥ అడలకప్రాణముల్ విడకయున్నవనొక్కతెఁబెండ్లియాడిముం।
దెడపడకుండుమెచ్చటికినేగకతాపసవృత్తిఁబూనకి।
క్కడగిరిసానువందుఁబలుకాకులవాయికిమాంసఖండమై।
పడియెదఁబూర్వజన్మకృతపాపమువాయునెప్రాణనాయకా॥ ౨౨.

తే॥ అనుచుఁ గన్నీరు విడచుచు మనవనిమీఁద । నొక్కమోకాటినూని మఱొక్కదాని।
పయిని మోచేయి యుంచి యప్పడఁతి మాళిఁ । గరము సేర్చుచు నిట్లలందురు గుణాఢ్య॥ ౨౩.

సీ॥ అలనాఁడు జడదారికలలోన విద్యాధరుల నేలు పౌత్రుఁడు గలుగునని యొ।
నిక్కడ గడయూపి రిడిన బుత్రుఁడుగాని పొడము టెట్లొక్కొ యే పుణ్యఫలమొ।
ప్రమదావనంబునఁ బ్రమదలతో నాడ నబ్బుగా నభ్రమందు వేల్పు।
వీటి కేగెడు భూమివిభుని గన్నారఁ గాంచితి మోహవిభ్రాంతి సెందినపుడు।
సకియ లూరడిలంగఁ బల్చుని పలుకుల । శమము నొందించి రట్టి నా సఖు లననుఁగుఁ।
బతి నిదుఃఖ దేవతకు సపత్నన మొనర్చి । దిట్టనై తిని నా కోర్కి యిట్టులో సఁగ॥ ౨౪.

శా॥ స్త్రీబుద్ధిః ప్రళయంకరీయనుచు సూరిశ్రేణి సున్నాడఁగా।
నా బాలాత్వము సూపు దాననిచటం దార్కాణ మయ్యెం విభుం।
డా బావిన్ స్నపనంబు సేయవలదంచల్లాడె నాపోఁకగా।
కా బంధుప్రవరుండు నుమ్మలికపాలై పోయె నేమయ్యెనో॥ ౨౫.

శా॥ ఈ నిర్మానవభూమి యీ వనతలం బీయంబరోల్లేఖిసా।
ధానీకప్రచరత్క్షరప్లవగసింహవ్యాళభేతాళికా।
ధ్వానప్రాప్తవికారమీ కటకసంత్రాసంబు నన్నెంచినన్।
బ్రాణంబుల్విడనాడు నిక్కమిది మోహప్రాప్తి నుంచుర్వపై॥ ౨౬.

ఆ॥ పడి రజోవిభూతి నొడలెల్ల నుడివోవఁ । జిలుతటాల మేను చిండ్లుపడఁగ।
నిరులు నలు గెలంకు లెడగొనుచుండఁ బె । ల్లుగ వెలందివంత లోగుచుండి॥ ౨౭.

చ॥ యుగములలోన నిక్కలిమహోత్తమమిందు గ్రహస్థురాలు భా।
గ్యగతము ధర్మకామములకానినకొమ్మ ముముక్షుమార్గమున్।
దగిలెదునందు రిట్టి సుఖతత్వముఁ బాసి శిలోచ్చయంబులన్।
విగళితజీవనాదునని వేమఱు గంటఁ బఠింతు నీటి చేన్॥ ౨౮.

ఉ॥ భారతవంశవర్ధనుని బాసి వనాంతరఘోరవాటిలో।
ధీరతనున్న దాన నెద ధిక్కృతవజ్రమొ కాక యెట్టిదో।
యోరజనీలలామనను నూరికిఁ దోడ్కొనిపో వెపత్తులా।
రారమణీయమైన నికటావనిఁ జూపరె యాకలించరే॥ ౨౯.

తే॥ విశ్వవిశ్వంభరాదేవి! విగతదయవు । విపినభూవర్తితాహార్యవీథిలోన।
బరితపించుచునున్నఁగా పాపవేమి । సవతిపోరులనూహింపసమయమిదియొ॥ ౩౦.

వ॥ అని మృగావతి పలుదెఱంగుల విలపించుచుండ. ౩౧.

ఆ॥ ఈప్రపంచధర్మమెట్టిదియోకాని । యరయఁగలమెయొక్కపరినసకల।
కష్టములకుమనముకలఁగుచున్నారము । తగిలినట్టికాలెతగులుమఱియు॥ ౩౨.
సీ॥ వాయెఱుంగనిమేకపదుపులవెన్నచాడ్పునమ్రింగుమలమారిమూర్తియనఁగ।
దరితప్పిరేమొదల్ పడమాడుతెరువరిజమునింటికితోరణచాలనంగఁ।
బవలెల్లమూలంబుపగిదినొక్కెడవ్రాలుపులుచట్టుసోమరిపోతనంగ।
దురదృష్టదేవివధూటికైపుచ్చినరుంద్రవాసుకివిశ్వరూపమనఁగ।
బొలిసియాకొనిబిట్టుకొఱలుసెలంగ । నోరుపఱపుచుఁగోనలనురుగులొలయఁ।
గొండచిలువయొక్కటిసతిదండఁజేరి । యెదనుభయవృక్షమునునాటెనింతికకట॥ ౩౩.
చ॥ మలచిలువన్గనుంగొనఁగమానినిమేనువడంకనట్టెని।
శ్చలతవహించితొట్రిలఁగజంఘులుఁబెన్గరుదాల్చియిట్లనున్।
గలఁతకుఁదోడుగానిదియుఁగల్గెనుభీకరవజ్రదంతమం।
డలిద్రవియించుచున్నదకటాతుదిఁబోయెదఁబాపవాయిలో॥ ౩౪.
తే॥ ఇందులకెనన్నుఁగొనివచ్చెనింతదవ్వు । విహగమునకెగ్గులేమిగావించిసిలుగు।
గూర్చితినటంచుఁగుయివెట్టికుదిసితన్ను । దానెదూషించుచుండెనత్తరుణమందు॥ ౩౫.
చ॥ చెలువయుజీవితాశవిడిచెన్విడనాడియుభర్తకోసమై।
జలజలబాష్పబిందువులుజాఱఁగనుంగవనించెనంతఁబె।
రెలుఁగునబీఱువాలమదియిట్టటుగొట్టుచుఁబొట్టపైనిని।
ట్టలపుశరంబుగ్రుచ్చికొనడమ్మనిత్రెళ్లెనస్పృక్కణంబులన్॥ ౩౬.
చ॥ అటుజమునింటికేయతిథియైనకుభృత్ఫణిఁగాంచిదేవతా।
ఘటనమొసిద్ధసాధ్యకృతకార్యమొకొకాకసమీపసంయమి।
స్ఫుటితతపఃఫలంబొవిభుసూచితమాంత్రికమారణక్రియా।
నటనమొయొక్కవ్రేటునసెనాలుకసాచెఁబెనంగియొట్లొకో॥ ౩౭.
మ॥ అనిపెన్నబ్బురపాటుతోడనవలాయాలించియేశబ్దమై।
ననురానోపునెయంచునల్గడలఁగందాదవ్వులీక్షించిపై।
గనమాంజిష్టపటాగ్రమున్బసిఁడిజొక్కాల్ పాదవైషమ్యక।
ల్పనముంగన్గొనిసిద్ధపూరుషునిగాభావించెగంధర్వునిన్॥ ౩౮.
క॥ ముందేమిశుభమువచ్చునొ । నందనమందారచందనద్రుచ్ఛాయన్।
బందాడిప్రొద్దుపుచ్చిన । బృందారకుఁడట్లుచిలువఁబీచంబడువన్॥ ౩౯.
చ॥ హృదయముప్రక్కలించుతదహిస్ఫుటపీవరగాత్రవేదికన్।
జెదరినరక్తబిందువులుచెల్వమనంబునబీతురోఁతయున్।

గదికిన సేవగించి సమకట్టినకర్జ మొనర్చు పూనికన్।
దదగశిఖాగ్రసీమకు వెతన్ జనునంతకు సమ్ముఖంబునన్॥ ౪౦.

సీ॥ ముదురు బ్రమాఁ గొమ్మ నొండదిమి పెంజుట్టురోఁ కటిబండ చాద్పు నగరము మెఱయ।
మానిసి పొడువున మలఁగి వెల్లలఁ దోఁగు కరవాడి రదములగవ సెలంగఁ।
గాటుకమలమాడ్కిఁ గం డెనవన్నియ సెలయెండ పైనను నిలుపఁ జాల।
బలియుఁ క్రిక్కిఱియు కుంభద్వయంబుననుండి విమలంపు సీధువు వెల్లివోడుప।
నతిమదోన్మత్తహేలయై యురుగుచెంచు । నొక్కరెంటఁ ద్రావుడు గనియుడిఁగి జీవ।
నాశఁ దత్పూరః పాదద్వయంబు కొనలఁ । బడియె సెలనాగ ద్రొక్కక పాఱెనదియు॥ ౪౧.

క॥ అబ్బురమడుగుల వ్రాలిన । ద్రొబ్బకయబ్బాలద్రుల్లఁ ద్రొక్కక కరిత।
బ్బిబ్బులఁ బెట్టక చనెఁబె । ల్లుబ్బియు భగవంతు చేష్టలు క్త్యతిశయముల్॥ ౪౨.

చ॥ దుడుకు మెకంబు కంబుగళఁ ద్రొక్కక పోఁగ విషణ్ణచిత్తయై।
కడుపున నర్భకుండదరఁ గాళులుతొట్రిలఁ బేరెలుంగుతో।
జడముడివీడఁ గ్రిందఁ బడి సానువునుండియు సుల్లువాయనా।
పడఁతియు జాండనాదము బందులుగట్టఁగ నేడ్చె వెక్కుచున్॥ ౪౩.

ఉ॥ తొట్టిన నేత్రనీరముల దోఁగఁ బయింట చెఱంగు మోము కె।
మ్మట్టిగ నెజ్జవాఱఁగ టమార్గములన్నులి వెచ్చనీరుగ।
న్పట్టఁగ నేడ్వ నట్టి మొరపంబు సమిత్కుశహోమవస్తువుల్।
పట్టఁగ వచ్చునొక్క ముని బాలుఁడు వీనుల విన్నమాత్రనన్॥ ౪౪.

ఉ॥ ఎక్కడిదీ కృపారసము నీ సెదును గ్మలియేడు పబ్రమే।
ప్రక్కమలంచివచ్చెడిని బక్షివిదూరము పొంధమానవా।
స్పృక్కణపానతత్పరకరిప్లవగోత్కరమధ్వనీనహ్రా।
త్వక్కణవాసమీ యుదయపర్వతమిం చెటు కాంతివచ్చె నూ॥ ౪౫.

ఆ॥ అనుచుఁ గొన్నియడుగులరిగియ చొచ్చినొక్క । పెద్దబండ నెక్కి పిలచి చూచె।
నచట గానకన్నియడుగులు త్తరమున । గడచి పొలఁతిఁ గనియె గట్టుపైన॥ ౪౬.

చ॥ పొడగని డాయుచిట్లు పలపోసె వెలందిని జూడ వేలుపుం।
బడఁతియొ గాక వెన్ను నెద పైదలియో వివిరియం పసింగిణీ।
యొడయని ప్రోడ యో యొఱుఁగ నోడెదఁ గాక మదీయహృత్సిరం।
బెడపక చూడఁ గోరియిటులిక్కడవచ్చిరొ యేమొ మద్గురుల్॥ ౪౭.

ఆ॥ అనుచు సందియంబు పెనగొనఁ బెనుముండ్ల । నవలఁ ద్రోచియతివయంతికంబు।
సేరి సొలసియున్న సీమంతినీమణి । నిట్టులడుగు సంయమీంద్రసుతుఁడు॥ ౪౮.

ఉ॥ ఎవ్వరిదాన వెక్కడకు నేగుచు నిచ్చటి కెట్లు వచ్చితో।
యవ్విభవమ్ము ఖేత్సువసుధాధిపపుత్రిక మాడ్కిఁ దోఁచెడిన్।
జువ్వెకిరాతభామినులు శూలినికీయ దలంచి తెచ్చిరే।
యివ్వనరాశిఁ బుట్టి దెగి యీగిరి సేరితె యేది చెప్పుమా॥ ౪౯.

చ॥ అనియడుగన్ మృగావతియు "నన్న యయోధ్య యనంగ వింటివే।
పను పడఁ నొక్కఁడప్పురము పాలనసేయు రమాసమృద్ధి నా।
తని వరపుత్రి నేను భరతప్రవరాన్వయజాతుఁడైన వ।
త్సనరపు ధర్మపత్ని నిగుశాంబుపురోపవనాళి నుండుదున్॥ ౫౦.

సీ॥ ఎన్నఁడే మడిగిన నెద నెంత విసువక పరిపూర్తి నొందించు ధరణిధవుఁడు।
కులశైలవిహరణస్థలముల నొకమేన గ్రీడించుచుందుము క్రేణి సేయ।
సురదంపతీవిలాసరసత్వమును రతీకందర్పులే వేళఁ గాచుచుండఁ।
జెలికువిందులు పూనిక లకు పూవంపకోలలజగజ్జైత్రులై చలముగలిగి।
యెన్ని వలరాచ సేఁతలు పన్నియుండ। మేలయవియన్ని నొడివితివీవనంగ।
వలవదుమ్మలమాప నెవ్వానితరము। తలఁపనివి యెల్ల స్మరణకుఁ దగిలె నకట॥ ౫౧.

సీ॥ నేత్రుటినూతిలో నీరాడఁ గోరితి నాతఁడు దానికియ్యకొనఁడయ్యె।
వెండియుఁ బలుమాఱు విరసభాషణముల నుల్లసమాడఁ దానొప్పికొనియె।
నలుకచే నప్పుడౌదల యెత్తి చూడనైతి నిబూచెఁ గన్నులు గనుదు నెప్పు"।
డను చబిట్టెలుఁగుతో నతివయేడ్వఁగఁ జొచ్చె మునిసుతుండూరార్చి ముద్దరాల।
యానతిమ్మెట్లు సేరితీయవనిధరము। దివ్యసీమంతవతులిటఁ దెచ్చినారె।
యనుచు నడిగి దంపతుల నెయ్యంబులరసి। బ్రహ్మాకృతిదూఱితదనంతరంబనంగ॥ ౫౨.

వ॥ ఆమెయు దుఃఖాతిరేకంబున మాటాడకున్న మునిబాలకుఁడు. ౫౩.

ఉ॥ చెక్కిళులందు నేత్రజలశీకరముల్ పచరింప దుఃఖియై।
వెక్కుచు నేలయేడ్చెదవు విఘ్యము నాయువు నిత్యమేవృథా।
పొక్కెద నొక్కనాఁడతనిఁ బొంచెద వవ్వలి వృత్తమెట్లనన్।
గ్రుక్కుచు నంతయుం జెలిపెఁ గోమలి నివ్వెఱగందియాతఁడున్॥ ౫౪.

తరల॥ సవిధభూస్థలిసారసేక్షణజామదగ్న్యమహాశ్రమం।
బవిరతంబును సిద్ధసేవితమైతపోధనయక్షరా।
ద్భవనమై వెలుగొందు నచ్చటి పారికాంక్షి నిగొల్చినన్।
వివిధకిల్బిషరోగపాతకవిస్తృతంబులు వోయెడిన్॥ ౫౫.

చ॥ అనిజడదారిపట్టియుడియావచనంబులశాంతిసేసియొ।
య్యనఁదెసవిచ్చికంటకములవ్వలఁద్రోయుచుశర్కరాతలం।
బునగడుమెల్లరమ్మనుచుభూమిధరక్వచిదగ్రపార్శ్వముల్।
మునుకొనిడిగ్గెఁజీఁకటులముస్గెనితంబగుహాప్రదేశముల్॥ ౫౬.

ఎ॥ జగములకర్మసాక్షివయిసాధ్విగిరిస్థలినల్లలాడఁగాఁ।
బాగులకకోపగించుకొనిమోముముడించెడుపద్మినీసతిన్।
దగిలెడువాఁడవంచుజమదగ్నియొసంగునొశాపమంచునె।
వ్వగఁజరమాద్రిభిల్లజనవహ్నులపెల్చెభగుండుదేహమున్॥ ౫౭.

చ॥ ఇరువురుపర్వతస్థలులనేగఁగనుంగొనిభాస్కరక్షపా।
వరవరదూతులోయనినివాళులొసంగిపదంబులాక్రమిం।
చిరిభయచిత్తలైపొదలఁజెల్వములాడియుఁబొంతమిన్నురుం।
బురువనకందుకంబుబుసుపోకకునాడుతమఃకుమారకల్॥ ౫౮.

ద॥ అజగరకుంభకర్ణనకునన్నువపైయడియాసదోఁపఁగాఁ।
నజరుఁడుత్రుళ్లనేసెమనుజాంగనస్పైరదనక్షతంబుల।
క్కజములుగాపటించనుచుగాత్రవిధిక్రియలాచరింపబం।
ధుజనులఁబిల్చిరోయనఁగఁదూలుచుఁగూసిరిపాపరిక్కసుల్॥ ౫౯.

చ॥ తొలిదెసఁగూఁతపద్వరుగఁదోయధిభంగరవంబులప్పడి।
కుక్కలనలమన్వధూటియనుఁ ‹‹ గోవిదపర్వజలస్వనంబులి।
ట్టులముగఁబర్వచున్నయవిడాయఁగడాయఁగఁబెల్లుమ్రోసెడిన్।
దెలియఁగఁజెప్పమీకెలనఁదీర్ఘముతెవ్విప్రహాదంబుతేవనన్॥ ౬౦.

మ॥ మునిసూనుండిదిప్రాజ్యహోజలధియంభోయానమార్గంబునన్।
జనలేరెవ్వరథస్థలంబోరయునిశబ్దంబుతద్భంగపా।
తనజాతంబదిగోకనుంగొనుతపోధన్యాశ్రమంబల్లవి।
ప్పనభూజంబులుమిన్కుమిన్కునదేవాల్గంటితద్దీపముల్॥ ౬౧.

వ॥ అనుచుఁ గొంతదవ్వరిగి యయ్యిరువురు. ౬౨.

మహాస్రగ్ధర॥ నవకవ్యాఘ్రాసనాసీనవిమలచతురామ్నాయసూత్రాత్తహావ్య।
స్తవనీయంబర్కతేజస్తరుణదధికవాచంయమవ్రాతమాది।
త్యవధూట్యానీతపుష్పస్తబకవిహితపాద్యక్షణమ్రమత్సురంబ।
భ్యవితాంతేవాసివాసంబగువరజమదగ్న్యాశ్రమంబొత్తిరంతన్॥ ౬౩.

సీ॥ ప్రభవించునొకచక్కఁ బౌవపాగ్రకలాయకలితపక్షివ్రాతకలకలములు।
పొడచూపునొకచోటఁ బుణ్యాంగనాగీతికోపేతసంధ్యాగ్నిహోత్రఘృణులు।
తనరారునొకవంకవనముక్తశార్దూలమృగగోవృషానందమేళనములు।
పొదలించునొకచాయమునికన్యకావినిర్మితమల్లికామోదరేఖలప్పు।
డాశ్రమంబుసొచ్చియవనీభవంబులఁ। గడచియుటజవితతిఁ గాంచిశిష్య।
పాఠకూటములనుబాటింపకచొచ్చట। నొక్కమందిరంబునొందిరంత॥ ౧౪.
క॥ ఉదయోదయార్కసంధ్యా। గ్నిదయాదృష్యత్తపస్వినిర్మలతేజో।
విదళితభుజిష్యకిల్బిషు। సదమలుజమదగ్నిఁ దటిసి సతియుఁ బ్రభులకన్॥ ౧౫.
తే॥ ఎఱఁగికన్నీటనడుగులనెఱపెఁగనిత। పస్విదీర్ఘసుమంగలీభవయటంచు।
నొడివెదివ్యచక్షుస్సనఁబడినపాట్ల। నెఱిఁగిమునిపతిజమదగ్నియిట్లుపలుకు॥ ౧౬.
చ॥ వగవకుమమ్మనీకుఁ గులవర్ధనుఁ డుద్భవమొందునప్సరో।
విగళితశాపమిట్లొనరెవేగఁ జతుర్దశహాయనంబులన్।
మగిడిసమాగమంబగునుమానుముదుఃఖమువీతిహోత్రునా।
మగువనుతింపుమిచ్చటనెమానిసుతాతతితోడనుండుమా॥ ౧౭.
క॥ అనియూరటవల్కినఁ బెన్। వినయముభక్తియునుభయమువెలువడమ్రొక్కెన్।
గనదుర్వార్చిస్సహితుని। వినిర్మలతనువుఁ గృశానువేఁడందోడఁగెన్॥ ౧౮.
చ॥ విమలతనుప్రభాహృతవివిస్తృతకిల్బిషహేతిసాంద్రసం।
గమనభవేక్షణామునినికాయసమర్పితపూతమంత్రయు।
న్నమితసురాంగనాతతిసనాథనొనర్పుముదాత్తచిత్తజ।
ప్రమదకళాహరాసతముపాలనసేయుముసత్యరక్షణా॥ ౧౯.
చ॥ ఇటులుమృగావతీరమణియిష్టముచొప్పనగర్భకోక్తిమై।
పటుతరభీషణానలునిబాడఁగఁ గన్గొనిసంయమీంద్రుఁడి।
చ్చటవసియింపఁగాపలసెసాంద్రవిధూపలసౌధవీథికా।
నటదళినీకచావితతినానఁ జెలంగులతాంగియక్కటా॥ ౨౦.
శా॥ శాల్యన్నంబుభుజించినెచ్చెలులతోఁ జంద్రాశ్మవేద్యావళిన్।
బాల్యావస్థగడించియౌవనమహాప్రాదుర్భవస్వీకృతిన్।
గల్యారామసరఃప్రదేశసుఖముల్ గొల్లాడితద్భర్తతోఁ।
బల్యావర్తితతాపసాశ్రమములన్ బద్మాక్షివర్తించునే॥ ౨౧.
ఆ॥ అనిమునీంద్రుఁడంతరాత్మవాపోవఁగ। నతనివదనచిహ్నమాశ్రయించి।
తెలిసికొనియొఁబాలఁతితెలసియిట్లనుదివ్య। వాక్కుతోడభక్తినెక్కొనంగ॥ ౨౨.

చ॥ లవణమహాసముద్రమిదిలంఘ్యము రెండవదిక్షువందునై।
దవదెనలేనిదధ్యుదధియందులద్వీపములెందుఁగల్గుసి।
ద్ధవితతియప్సరోబలలదర్పకకేళిమెలంగుచుండున।
య్యవిరమణీయముల్మిగులనందొకదానివచింతురుక్తనా౯॥ ౯-౧

ఉ॥ అందుయమాదియోగనిరతాత్ముఁడుమౌనినమస్కృతుండుమ।
ధ్యందినసూర్యతేజుఁడులయప్రతిపాదితగానశాస్త్రని।
ష్యందసుధాసుధానిధితపోధికుఁడుండులయోశుసంజ్ఞనై।
ష్ఠందపమాచరించునొకపుష్పవనంబునఁగట్టినిష్ఠలో౯॥ ౯-౨

వ॥ అట్లుండ నొక్కనాఁడు. ౯-౩

చ॥ సకలకలాకలాపుఁడగుసంయముఁడట్లుతపోవిభూతిఁజం।
పకకుసుమాకరోపవనిఁబద్మదళాక్షునిఁజిత్తవీధిలోఁ।
బ్రకటముసేసిస్ఫాటికసరంబుకరంబునఁబూనినిర్మలో।
దకరుచులీఁగమండలువుతాలిమినుండనభోంతరంబున౯॥ ౯-౪

చ॥ కలకలరావముల్వొడమెఁగంకణనిక్వణశీకరంబుమి।
న్నలమెవిపంచికారవసుధాపగగెంటసమాడెస్వర్ణది౯।
నెలకొనెవాజ్ఞినాదనవనీతముదధ్యుదధి౯బదాగ్రసం।
గళదురనూపురస్వనముగ్రమ్మెమునీశుతపోవనంబున౯॥ ౯-౫

చ॥ ఇరువురుడిగ్గభూమికినిరేశసుధర్మనటీమతల్లికల్।
తరుణి! తిలోత్తమాంగనయులంబుపయు౯బహుళైకవాసనా।
సురభులఖండపార్శ్వములసొక్కుదలిర్పవనీవిహంగముల్।
తరువులనూఁగులాడవనితల్ మునిఁజూచిప్రహృష్టచిత్తలై॥ ౯-౬

మ॥ సతతధ్యానతపోగ్నిహోత్రకృతుల౯సంధించిసంగీతపా।
హితుల౯దేలెడునీమునీశ్వరునిఁగంటేనాట్యరేఖాక్షమం।
చితగీర్వాణఘణాధరీముఖయువశ్రీపుండరీకాక్షుఁడీ।
యతిదర్శించినటీవినోదములనత్యానందుని౯జేసిన౯॥ ౯-౭

చ॥ మొనకుపహారమిచ్చిసురమానవతీతతిలోనగొప్పఁగా।
మనలఁదలంచునంచుఁబలుమాఱుఁగుఱంగటఁజేరిరొట్టులీ।
మునివిమలోద్యమంబుకుదిముట్టుగఁజేయుదమంచుదవ్వుల౯।
జనినికటోర్వశి౯మగిడిచయ్యనవేగుచువచ్చుచుండఁగ౯॥ ౯-౮

తే॥ తమినలంబుష ,, యోంతిలోత్తమవిపంచి । మనమువాయించినట్లైనఁగనులఁదెఱచి। [గ॥
చూచుమునిమనోరథమబ్బఁజూవెయనుఁడు । నొప్పెనామెయుఁగూర్చుండిరొప్పిదము

మ॥ ఉదయాహార్యమునెక్కిదప్పిగొనసూర్యుండొక్కచక్రంబునన్।
జదురుండైవడినేగియేగిచరమాశాబాధపాథోనిధిన్।
గదిరెన్ గ్రీష్మఋతుప్రచారములునాకంబంటితీక్ష్ణాంశుస।
త్పదవిన్ బట్టెఁగదా! సుపర్వవనితల్ పద్మాననాసీనలై॥ ౧౦౦.

క॥ శ్రుతిగలిపిమేళవించిరి । చతురిమవీణాద్వయంబుజతగాసుదతుల్।
కృతిమాళవరాగంబున । జతురాస్యప్రియవధూటిచారిణులనఁగన్॥ ౧౦౧.

ఆ॥ ముద్దరాండ్రగీతిమూర్తిభవించిన । రాగలక్ష్మిమధురరవముఁబోలి।
ఘనసమాధినిష్ఠుకర్ణరంధ్రమ్ముల । నమృతధారవోలెనభినయించె॥ ౧౦౨.

మ॥ సురగంధర్వఫణాధరీసతులకున్ జొత్తేరఁగాఁగష్టమె।
వ్వరోవిద్యాధరులోతిలోత్తమయొయూర్వశ్యుక్తరేఖాదులో।
నరలోకాంగనలోతపఃఫలరమానందోజ్జ్వలాకారలె।
వ్వరోయేతెంచిరిగాకమత్తపములన్ వారించురక్షస్సులో॥ ౧౦౩.

ఆ॥ అనుచుసందియంబుపెనగొనజడదారి । గనులఁదెఱచిచూచికాంతలార।
యొక్కగీతమిందెచక్కవాయింపుఁడ । నంగసలిపిరట్లునాతులప్డు॥ ౧౦౪.

సీ॥ సహకారపల్లవశయ్యపైఁజెరలాడుపలుకుకోకిలరాగఫణితినిక్క।
వనలక్ష్మిగూడియౌవనలక్ష్మిఁడౌమరుద్రాజపుత్రుండుప్రేరణముసూపెఁ।
బరిణతకుసుమాళిపారవశ్యంబుననానందమకరందమట్టిచిందెఁ।
బద్మాననోల్లసద్భ్రమరపఙ్క్తులపాటకెయిదిగాఁదమతమయెలుఁగులిచ్చె।
రక్తిఁజవుళులబోంపంబురాగచిహ్న । మాశ్రయించెసురీమంజుహస్తఘటిత।
వల్లకీమృదుమధురగానంబునెఱసి । మౌనియవికల్పమనముతోలీనమయ్యె॥ ౧౦౫.

మ॥ వినవింపైరసవంతమైనసుదతీవీణానినాదంబునె।
మ్మనమున్ బ్రామయతీంద్రుఁడానతియిడెన్ మందారకచ్ఛాయలన్।
జనితానందకరంబుగాఁగఁటచులాస్యక్రీడవర్తింపుఁడీ।
యనదివ్యాంగనలాడిరట్లభినయవ్యాపారపారీణలై॥ ౧౦౬.

తే॥ అంతమునిప్రీతచేతస్కుఁడైవధూటు । లారయేమిగోరెదరనలలవలప్ప।
డెడపకపఠించువీణెయుసెన్నఁడేని । వాడనిలతాంతహారంబువలయుమాకు॥ ౧౦౭.

చ॥ అననొకనాగవల్లిలతయంచితఘోషరటద్విపంచినో।
తనసుమహారమిచ్చెమునితావకభావుకదివ్యచిత్తమో।

వనితలఁ బ్రోచుఁగాతయని వ్రాలిరి పాదతలంబులందునం।
గనలని శాంతతాస్తనిదయోఁ గారుణికాత్ములయేసుఁదత్తతిన్॥ ౧౦౮.

వ॥ వారలిద్దఱు లేచి కొంతసేపటికి. ౧౦౯.

చ॥ అనఘయలంబుసాప్సరసహారము నొక్కసమీపశాఖతోఁ।
బెనఁచికచాళినూనెముడిపీడఁగఁ గ్రొమ్ముడి వైచుచుండఁగ।
చ్వననొకకాకిదానిపాదునన్ మునిపైఁబడె నంతనీసు పెం।
పునగికురించి నీకువలపుం బ్రకటించెదు వాఁడు తెప్పెడిన్ ॥ ౧౧౦

చ॥ అనిశపియించె సంయమియు నాదినిరంతరయోగవేద్యులౌ।
ట్లనకచశాపకర్తలు విలాసినియంతఁ బదాంబుజంబులన్।
బెనఁగఁగ కృపామరందమున బేర్చ్వమదాళియపూం గ్రుఁడీవృథా।
మిని జనియించి జన్మగతి మృత్యువు పెందిన శాపముక్తిఁ గాం॥ ౧౧౧.

ఆ॥ అనుడు వారు సెలవుకొని విమానంబుల । స్వస్థలంబు సేరి సౌఖ్యసార।
మహితభోగభాగ్యమండనంబులనుండి । రచట వెలసి తత్త్వమంతరింప॥ ౧౧౨.

చ॥ వెనుక విధాతగోష్ఠి నరవిందశరాసను డంపకోలలన్।
ఘనతపవిఘ్నముం దలఁపను గాత్రము చిల్లులు సేయ నింద్రుఁడున్।
గినుకవహించె బమ్మ పరికించి యలంబుస నావిధంబునన్।
గనలి శపించెఁ గాద టెమ్మగా వతిపూర్వకథాప్రసంగికన్॥ ౧౧౩.

తే॥ అపుడలంబుస వీణెయై యనలరు దండ । వఖిలలోకోత్తమకొనంగి సజ్జనముగు।
వెదకి దయ సేయుమని చెప్పి వెడలి పోయె । నటఁదిలోత్తమ ద్రిదశాలయంబు సేరె॥ ౧౧౪.

ఉ॥ ఒక్కదినంబునందుఁ బురుహూతుఁడు దివ్యసభాంతరంబునన్।
దక్కటి నిర్జరేశ్వరుల దండడిఁ బిల్చి యథోజగంబునన్।
నిక్కవిలాసభద్రుఁడను నీలగళప్రియుఁ డొక్క మానిసి।
ట్లుక్కుమెయిన్ దపఃక్రియల నోలలఁ బాడెడినేమి చెప్పుదున్॥ ౧౧౫.

చ॥ విమలతపోధికత్వమున వ్రేల్మిడి విశ్వచతుర్దశంబులున్।
క్కమొగిన వ్రస్సిపోయెడిని గామవిపద్వముఖుండు నవ్వఃపురీ।
రమ వరియింపఁ గోరెడి నొగ్రక్కున నొక్కయుపాయమెంచుఁడీ।
న్నమగువలెట్టులైన యమినైష్ఠికమంబువుపాలు సేయుదురే॥ ౧౧౬.

ఉ॥ తొల్లి ఋషీంద్రులెందరు వధూటుల తియ్యని తేటమాటలన్।
వెల్లనకంటకస్థలుల వీడ్కొని రమ్యనికుంజవాటులన్।

జల్లని గాడ్పులంగనలసన్నని యూర్పులె కాఁగఁ గ్రొవ్వెదన్।
మల్లెల పెల్లుదేనియల మాటున వేఁడెరు ! దివ్య కేళికిన్॥ ౧౧౭.

చ॥ అనవమయుల్ దివస్పతి ప్రహర్షమనస్కుఁడు కాఁగ నప్సరో।
వనితల నెల్లఁ బిల్చి వనవాపివనంబుననుంగుఁ బద్మమా।
ర్గణముల నెన్ని కల్గలపి రమ్యసరఃపృథులాలయంబులన్।
మునుకొనుఁడన్న నెవ్వతెయు ముందిడదయ్యెఁ బదంబు నెంతయున్॥ ౧౧౮.

వ॥ అంతనతండు తిలోత్తమఁ జేరఁబిలిచి. ౧౧౯.

శా॥ విశ్వామిత్రుని జెర్చె మేనక తపోవీరాసనాసీనుఁడై।
శశ్వత్సంభవదుగ్రకోపుఁడయి కాంతుస్నానియుంకొక్కుమార్।
నిశ్వాసాగ్నిఁ దపింపఁజేయ దివినొంటింరంభఁ బుత్తెంచితిన్।
విశ్వస్తుత్య తిలోత్తమా మదనసేవన్ జేయుమీ సంయమిన్॥ ౧౨౦.

ఉ॥ నావుడు నామెయొప్పికొని నవ్యవిభూషణపట్టవస్త్రముల్।
మైవిరచించి యెన్నఁడును మాయని వాఁడని నాగవల్లియున్।
బూవుల దండ వీణియయుఁ బొందొనరించి విశేషచాతురి।
భావముదోఁపవీడ్కొనియెఁ బాకరిపున్ జనియెన్ బిలక్షితిన్॥ ౧౨౧.

ఉ॥ ఆమెరసాతలంబుచని యచ్చట నొక్కవివిక్తసీమలో।
నేమముతో జపించు మునినిర్మలుఁ గాంచి విలాసభద్రుఁడే।
యీమహితాత్ముఁ డచ్చటిలయేళుఁడు గాఁడె భ్రమించి రాఁగనే।
లామది నియ్యకొంటిదివిజాధిపు మీఱనె మిత్రుఁ గూల్పనే॥ ౧౨౨.

ఉ॥ ఈతఁడు దివ్యదృష్టిఁ బరమేశునిచేఁ దలుపైతమొక్కమా।
శీతలపోయునన్ని పుడె తెంగి శపించినఁ దోడివారినం।
గాతము తప్పనంచుఁ గసుగందుచు నొక్కలతాంతమార్గణా।
ద్యోతత రైత్యవేషమున నొప్పెడి వశ్యముఖిన్ భజించుచోన్॥ ౧౨౩.

సీ॥ వసునేమియనుభోగి వశ్యముఖీదేవతా నివేశంబున దాఁగియుండి।
యచ్చరఁజూడ మోహంబు పెల్లుబ్బి కౌఁగిలిగోరి గ్రక్కున గేశబంధ।
మానిపాణి మలంచి యధరంబు గ్రోలఁ గంపితసంభ్రమాంగియై పెలుచ నఱచె।
జిడిముడిన ఱవనాజడదారిఫక్కున గనువిచ్చి చూచె నల్కఁడలగడఁగి।
యనమృగావతి యిట్లనుయలికుతేశ । యేలవసు నేమి దేవతాగృహమునందు।
డాఁగియుండె తిలోత్తమ డగ్గరించె । నెఱుఁగఁజెప్పు ప్రారబ్ధకంబె వనివిడుచు॥ ౧౨౪.

చ॥ అనవుడుదివ్యచిత్తముననన్నియెఱింగిమునీంద్రుఁడంగనా।
వినుముఫణీంద్రకన్యకలువేడుకమైగనుమూసిగంటెనల్।
మునుకొనియాడుచోనతఁడుమూలగృహంబునడాఁగియుండెఁగ।
న్గొనుచలకన్నియల్మఱుఁగగొబ్బునగాంచెనమర్త్యభామినిన్॥ ౧౨౫.

చ॥ యమికనువిచ్చివల్కెడలనారసియేదియుఁగానకయ్యెడన్।
శమమదిదివ్యదృష్టిమెయిసర్వమెఱింగిబలారిద్రోహకా।
ర్యములునుమిత్రురాలిడుప్రయత్నముతద్గతిశిక్షణంబువే।
గమెశపియించెవీణవిడికందువెఱుంగకయేగుఁగాతనాన్॥ ౧౨౬.

తే॥ అంతసామాన్యదేవతాయతనమందు । విడిచివీణాదివెశ్మోత్తిపీటికేగ।
నతఁడుపాతాళవాసినియండసేరి । యలరినుతియింపఁబ్రత్యక్షమయ్యెదేవి॥ ౧౨౭.

వ॥ అయి ౧౨౮.

ఆ॥ నీయభీష్టసిద్ధినెఱవేఱునొకనాఁడు । మత్సమీపమునకుమఱలరమ్ము।
పొమ్మనంగనతఁడుపూవుదండయువీణ । లతయునెత్తుకొనిస్థలంబుసేరె॥ ౧౨౯.

చ॥ వడివడివేల్పుటింకిచనివాసవుఁగాంచిసమస్తసంగతుల్।
విడకయెఱుంగఁజెప్పెనరవిందదళాక్షి.సురుండుదేవరా।
పడఁతికిశాపమిచ్చెబుషిపైదలికైవనునేమిప్రాగ్భవం।
బెఱపకనిష్ఠతోడజపియించెనువశ్యముఖీశ్వరీక్షితిన్॥ ౧౩౦.

చ॥ అనిసుఖముండెనచ్చరప్రియావచనంబులదీర్ఘచింతనం।
బొనరిభవత్పురంబునకునూర్వశిఁదోకొనివచ్చెఁద్రోవలోఁ।
గనియెజయంతుఁడన్నృపునిగాంచనభూధరధీరునత్తఱిన్।
గనుఁగొనెనూర్వశీరమణికామశరాహతిఁగుందెనంతయున్॥ ౧౩౧.

తే॥ అచటనూర్వశివిడియయోధ్యాపురంబు । దఱిసినినుఁజూచిపోనెవృత్తంబుసెప్ప।
నప్సరోమణియాకాశయానమందు । నడచుచుండెనుసాకేతనగరికపుడు॥ ౧౩౨.

క॥ అనిజమదగ్నివచింపఁగ । వినియుగ్గలియిట్టులడిగెవిపర్థింపుఁడుసే।
రొక్కనినజయంతుండెవఁడన । మునిసాధుఁడువల్కెనిట్లుముదముదలిర్పన్॥ ౧౩౩.

క॥ అనికాణభూతిచెప్పిన । గుణాఢ్యుఁడిట్లనుభగుండుగ్రుంకెడినపరాం।
బునిధికదంబ్భారణమ । య్యెనుబడమటినర్ఘవేళయిదియనివడలెన్॥ ౧౩౪.

గద్యము॥ ఇది శ్రీరామకృష్ణకవిప్రణీతంబైన మృగావతియందుఁ దృతీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# మృ గా వ తి.

## చతుర్థాశ్వాసము.

---

గీ॥ అతులవేదవేదాంగవిద్యావివేక । భూతిఁదనరారునాకాణభూతిసుగుణ।
నిధిగుణాఢ్యునకిట్లనునిర్మలుండు । మునిమృగావతితోఁగథమొదలువెట్టె॥ ౧.

సీ॥ ఏవీటిమగలుపుంభావగీర్దేవులైవాగ్విరికాపురివన్నెకొంద్రు।
ఏవీటిసతులుభాగ్యేందిరాభలుమహాకాళీపదార్చనాకలనగరిమ।
ఏపురీమానినికేపేటమలయజంబిచ్చికోపంబుమాయించుహేళి।
ఏప్రోలివనలక్ష్మియెదిగిమాధవుఁగూడిమకరందఘర్మాంబుమయతనెసఁగు।
నట్టియుజ్జయినీపురినలరునొక్క । బమ్మఁడమలాగ్నిహోత్రతత్పరుఁడుపరుల।
సిరులనాసింపఁడతివలచెలువములను । గొల్లలాడఁడుపరమేశుఁగొలుచునెపుడు॥ ౨.

సీ॥ శాంబరీమహిమచేఁజవలేటనీరాడుఁబ్రతిదినంబియసంజబాడబుండు।
పెనునిష్ఠనొకనాఁడుకనుమూసిజపియించుచుండనలంబుషయొంటివచ్చి।
సాష్టాంగదండంబుసలుపఁగన్విచ్చియాశీర్వచఃపక్కియోచెలువనీకుఁ।
జక్రవర్తిసుతుండుజనియించుననునామెనాకేలభువియేలునందనుండు।
కొలుపుసర్వాంగసుందరిఁగూతునొసగు । మనినబాఱుఁడమర్షతనతివనాడు।
పల్కమోఘంబుమాప్పచ్చఁబాటుగామి । నీకునిట్లాడఁదగునెత్తృణీకరించి॥ ౩.

క॥ మల్లకుఁడుధాతనీకృతి । కొల్లకమున్నిచ్చుశాపముర్విజనింపన్।
మల్లామడియగుశపనము । సెల్లుతటిన్జక్రవర్తిచిన్నఁడువుట్టున్॥ ౪.

క॥ అనివిప్రుఁడునిబ్బరికిం । చినకార్యముతప్పుటెఱిఁగిచెచ్చెరఁద్రోవం।
జనెవేల్పువేశ్యతనత్రో । కున్ననేగెమహీసుతుండుకొన్నాళ్లరుగన్॥ ౫.

క॥ పరమేష్ఠితిట్టుకతమున । సురవేశ్యజనించెభూమిసోంపేపతిపాం।
పిరివ్రాపనాథరాసుర । వరుఁడుకలనువోచితొంటివైనముచెప్పెన్॥ ౬.

సీ॥ అంతనాతఁడుతీర్థయాత్రాభిలాషియైదేశదేశంబులుతిరిగితిరిగి।
కాశికాపురిసేరికాలభైరవువిశ్వనాథుదర్శించిగంగాతరంగి।
ణీతరంగంబులనీరాడియువలఁబ్రయాగఁబోయివిధిక్రియలనొనర్చి।
స్థలపురాణంబునుజదివియచ్చటిగంగశాంతనీవడువునబాసఁగఁబల్కి।

మద్భవాంతరమునమందాకినీతటి । భూవిభుండఁగాఁగఁబుట్టియపుడు।
జవ్వనంబువాల్చిశత్రుభీకరుఁడనై । మనఁగఁజేయుమనుచుమునిమునింగె॥ ౭.

ఉ॥ అంతటఁ బాటలీపురమునందుప యించెజయంతుసంజ్ఞ నా
త్వంతరమైయతండపుడయౌవనముంగరియించెనన్నఁ బెన్
వంతఁద్రిలోత్తమారమణిపందురియొచ్చటికేగెనెట్లునా
చెంతకుఁజేరెనివ్వియు పచింపుఁడు శేషకథానుపూర్విగన్॥ ౮.

గీ॥ అనిన్పగావతిపల్కసంయమిమృగాక్షి । వినుమునీపాంతఁజేరినవెలఁదెలంది।
నీదుకామప్రసంగముల్ నిలిచివినుచు । సమయమునకొడటంచుస్వర్గమునకేగె॥ ౯.

చ॥ అనఁగృతవర్మపుత్రిసమయుంబెఱుఁగన్దయనానతిండుస।
న్మునిజనవర్యయన్నఋషిమోదముజాల్కొనవైశ్యకోత్తని।
ట్లనియెసఖీజనంబునినునత్యతిశీతలపుష్పగుచ్ఛనీ।
జనములఁదేర్చుచుండనొకశారికభర్త్రికథల్వచింపఁగన్॥ ౧౦.

చ॥ ఇవికలయోయటన్నఁజెలులెక్కడిదిగ్రహమనిక్కపుష్టులి।
య్యనితలపోయుమన్నఁదమిహస్తతలాగ్రనిష్టకీరమున్।
దపులమిముద్దువెట్టనదిపట్టునబింబమనాఁగనాతఱున్।
జవిగననీవుస్వప్నగతిసంగతికాదనినవ్వునత్తఱిన్॥ ౧౧.

గీ॥ వినుమువెనుకఁదిలోత్తమవేల్పుప్రోలి । కేగుచుండంగవత్సరాజేంద్రుఁగాంచి।
వీనివృత్తాంతమతనితోవిన్నవింప । నపుడుగొండొకటివిలువ్వమనిరెయున్నపుని॥ ౧౨.

చ॥ అనినన్పగావతీరమణియయ్యతిదివ్యపదారవిందముల్।
వినుతియొనర్చియాతనినివీడ్కొనితాపసబాలికామణుల్।
గ్రనుకనిపచ్చుచున్నపుడుకన్గొనివారలతోసమస్తమున్।
జనవునఁజెప్పియచ్చటనెసమ్మతినుండెనుగొన్నినాళ్లకున్॥ ౧౩.

సీ॥ తెలతెలవేగువేళలవేల్పుటెలనాగలలరులఁజిదుమఁదాఁగలసితోనును।
శిఖివేల్పుతదవులఁజెలులతోఁబావనాగ్నినిగొల్చుచుండును నెమ్మనమున।
నాగిరంబులుమెక్కిదొయిమమైగౌరవంకసకియులనవ్వించిసరసమాడుఁ।
జరమసంధ్యలసరస్వతీకూలములనులిపేడిరొండలఁగూడియాటుచుండు।
వలఁతనొక్కొకవేళయాటాడఁబోదు । నికటకల్లోలినీఝరినిర్మలాంబు।
కేళికామోదమకరందమోలలాడ । గర్భిణాగర్భకచలనంబుకలుగకుండు॥ ౧౪.

సీ॥ జడదాలికన్నియల్సబ్యంబుపెంపుననులిపూచుమల్లియల్వలచితెచ్చి।
జనగుత్తరాదటఁబడతికినొకనాఁడుచిరుపచ్చసంపెఁగల్సారివిసరులఁ।

గొప్పవెట్టుదురొకోలిఁగొండొకతడవునసుదగొన్న గేదఁగుల్పుట్టుజడల।
పఱలింతురొకతెఱఁబరిమళించెడుగుల్లాబీవియల్ రాకిడిబిళ్ల వ్రాలెఁ।
గొసరిక్తై సేతురొకతతిగుసుసుకొనిన । తావిసేమంతివిసలఁగాంతొకచాఁగ।
సీమనిల్పెదురొక వేళఁజెలువమలర । సూరకుంద్రుసహజపురూపాలయునటుల॥ ౧౫.

క॥ సహకారతరులనీడల । మహిళాతతిచరమసంధ్య మంపిలికేళీ।
స్పృహగందుకంబులాడఁగ । విహరించుమనోనురాగవిభ్రమమవరన్॥ ౧౬.

శా॥ మల్లీచంపకమాధవీమధురసామందారభూమీజముల్।
పిల్లల్వెట్టఁగనీరవోయుతఱిగర్భిణ్యానన్నాబ్జస్థలిన్।
గొల్లాడన్ దరఘర్మజామృతకణాంకూరంబుదివ్యాంగనల్।
తల్లీమానుమటంచుఁబై వెఱఁగుచేతన్ ద్రోతురీవాసలన్॥ ౧౭.

చ॥ కరతలమందుఁజెందిరవుఁగావినియోషకుఁబద్మకర్ణికల్।
విరచనసేయుచుంద్రుప్రభవించెడిపుత్రునిపాణినుంటకై।
పరిమళవాసనాదిపరిపాకకలాపసుఖానుభూతిలో।
గరఁగఁగఁజేసిరాచెలులుగర్భిణి నెవ్వగలోసరిల్లఁగన్॥ ౧౮.

చ॥ ఎనిమిదిమాసముల్గడవ నేడ్తెఱమామిడిమ్రానికిందఁగ్రొ।
న్ననలతుఱంగలిన్ జగిలెనాతులుగర్భిణిభవ్యకోకిల।
స్వనములఁదేల్చుచుండిరిరసాలకిసంబులమానసంబుపెం।
దనిపిరికొంతకాలమిటుదాటఁగనొక్కనిదాఘువేళలోన్॥ ౧౯.

చ॥ రవివృషభంబునన్ మిథునరాశిబుధుండుమృగేంద్రరాశిలోఁ।
గవిగురుచంద్రులోజఁగటకంబుననుండఁగఁగర్కిలగ్నమం।
దునిదకుఁబుత్రుడుద్భవిలుయు క్తవిలక్షణపద్మచామరా।
దివివిధరేఖులంఘ్రికరదివ్యతలంబులముద్దువారఁగన్॥ ౨౦.

వ॥ అట్లొండు రెండుదినంబులుగడచి యొకనాఁడు మృగావతి పరిబోధపరిచితివిహీనుం డగు సూనుంగాంచి. ౨౧.

గీ॥ పేయుచెలికత్తియలునిన్ను వెలసిచుట్టు । రత్నభూషణజాలంబురహిజనింప।
నెత్తెశిరోగృహసాలభంజికలుగొలువ । పేడ్కవిడనాడియిట్లుంటవిధివశంబె॥ ౨౨.

సీ॥ రతనంపుఁబ్రబలివలవితతికానుకఁబూని దైవకన్యకలునిన్ దారసింప।
ముదలింపఁబడకయముదమునరంభాదినలిననేత్రలుంగూడినాట్యమాడ।
మధురగీతములతోమణిఁబోలెనఱకేలభూమీశసతులునిన్ ముద్దులాడ।
మాతల్లిసంద్రులమనములుపొంగినీచిఱునవ్వుమొలపులోమునఁగియుండ।

జగములకు నెల్లనొక్కయుత్సవమువోలెఁ । దనరునీదివ్యపుణ్యాహదినములకట।
యిట్లుగాదైవములుసేయునేకుమార । ఏమునోచిననోములింతింతలేమొ॥ ౨౩.

వ॥ అని దుఃఖావేశంబున బొందియుండెనంత. ౨౪.

గీ॥ జాతకర్మాదిసంస్క్రియల్సలిపిమునియ । పమునొకొండవదినమునను దయనుఁడను।
నామమర్భకునకిడెనామ్నా యమంత్ర । విధులనుదయాద్రినావిర్భవించుకతన॥ ౨౫.

గీ॥ అప్పుడశరీరవాణియీయర్భకునకుఁ । గలుగుపుత్రుండువిద్యాధరులకుసార్వ।
భౌముఁడైయుండుననియెఁగల్పప్రసూన । వృష్టిగురిసిరిసురలుసంతుష్టిసెంది॥ ౨౬.

చ॥ ఉదయనుహస్తభాగములనొప్పెసలారెసరోజకర్ణికల్।
మదనుపునర్భవంబొవరమంజులరాశినికేతనంబొపు।
ర్వదురితచేష్టలన్నలుపువన్నెయుఁద్రోచిజనించుకృష్ణుఁడో।
కొదకొనునైషధుండొనలకూబరుఁడోయననొప్పెనత్తఱిన్॥ ౨౭.

మ॥ లలితామ్రద్రుమశాఖఁగట్టిడినతొట్లంబెట్టియాలింపురో।
కిలనాదంబులుమాతపల్లవమిదోకేల్చిల్కలీతొట్లనిన్।
గలయంజూచుసుపర్వనాగమహిభృత్కన్యాళియీయాశ్రమం।
బులకేతెంతురుదాపమన్మథసితాంభోజాక్షులాలాగుమీ॥ ౨౮.

క॥ అనుచున్జిలిబిలిపాటల । ననుఁగుఁగుమారునకుఁబాడుచర్థిన్దేఱవల్।
మనమునబెనఁగొనుహర్షం । బునగడునలయించిరిద్రపుత్తురుబిడ్డన్॥ ౨౯.

శా॥ సైరంధ్రుల్వదినెల్శ్వసల్గురువధూసంఘంబుమేనత్తలున్।
ధీరోదాత్తలుమానియొప్పలెతదంతేవాసులున్మానియున్।
జేరంజుట్టలుఁదండ్రిబావమఱఁదుల్సేదోడులన్నల్గదా।
గారామొప్పఁగఁబెంచుచుందురచటంగావున్నపుణ్యాంగనల్॥ ౩౦.

మ॥ జిలుపైయుబ్బినబుగ్గలున్నిగనిగన్జిన్నారిమైవన్నెరా।
సులుఁజొప్పారఘృతంపుజొల్లువొడువన్జోగాడమొల్నాలిగ।
జ్జెలుఘల్ఘల్లనఁదల్లిక్రేవలశిశుశ్రీల్వల్కరాచిల్కము।
ద్దులపల్కుల్వలెనమ్మయత్తయనిచేతుల్తట్టురాపట్టివో॥ ౩౧.

చ॥ జిలిబిలిమాటలేనగవుచిన్నరిపొన్నరిముద్దుచైదముల్।
నులినులిసిగ్గులున్దలిరునున్ననిమేనునులేఁతమోవియున్।
జిలుఁగుగులాబివోలునైటిచెక్కులుఁపిక్కటిలంగఁదల్లిచెం।
తలఁదిరుగాడుబిడ్డఁగనిదండడిడాయుఁడెవండుముద్దిడన్॥ ౩౨.

సీ॥ పురివిచ్చి నెమ్మి నెమ్మునకు మైఁదలయెత్తి క్రొవ్వియాడంగ గ్రక్కున నెయెక్క।
సాహూతమైయునవష్టంభత నెగ్గెత్తికూయ వబ్రమున గ్రక్కున నెనవ్వ।
నొయ్యనలు దిక్కులాలగించి యుబ్బు పెనఁచి పైచూడ గ్రక్కున నెతాఁకుఁ।
గనులకుఁ రత్న సంఘటితమైదోఁచునో మేచకంబులలీక మేళనంబు।
సేయు జగదేక మోహన శ్రీదలిర్ప । నక్కుమారుండు మున్నాశ్రమాంతరముల।
శిఖికుమారునిరీతి నా శిశువుఁదలఁచు । నిట్టి సేఁతలు కరఁగింప దెట్టి వాని॥ ౩౩.

చ॥ మొగిళులు వేగ మైపఱవఁ బూర్ణనిశాకరుఁ జూచి తల్లితోఁ।
నిగనిగ మెండిపండు దివి నిర్మలకాంతుల దోఁగి పాఱెడిన్।
బిగినఁ గంఠహారమును బిడ్డగళస్థలి వైచుఁ దల్లియున్।
దొగరుచినున్న నీలమణిఁదోఁచిన చంద్రునిగాంచు బ్రీతితోన్॥ ౩౪.

శా॥ ఈచైవంబులు గాంచి తల్లి మదిలో నేజన్మపాపంబొరా।
జీచిన్నారియనుం గుఁబల్కులకునై యెన్నాళ్లు మూర్ఛిల్లునో।
యేచందంబున జూతు మేమిసువురీ హేలావిశేషంబులన్।
వైచెన్ బో విధి మమ్ము కొంపొరుల గ్రావప్రాంతదూరంబులన్॥ ౩౫.

శా॥ కౌశాంబీపురి కేళికావనమునన్ గంభీరలీలాసర।
స్యాకాశుంజగృహాంతరస్ఫటికకాంతారచ్య వేవ్యాళిను।
ర్వ్యాసుంగూడి సమీపభూమిను తుఁడర్చిష్మంతుఁడాత్మవ్యథా।
శాఖాఖండనమండలుండు విహరింపన్ గాంతుమో గాంచమో॥ ౩౬.

ఉ॥ దారుణశైలసానుపరితాపవిభుగ్నమనస్కుఁడైనహృ।
ద్ఘోరవనాంతరశ్రమవికుంఠితపాదసరోజుఁడైనసం।
ద్యారమణీయతాండవకళాధిగతప్రమదాత్ముఁడైనసం।
సారవియోగియైనసుతుజల్పవచంబులఁ బాసి గానఁడే॥ ౩౭.

ఉ॥ ఇట్టివియోగవేదనలకెన్ని భవంబుల నోఁచికొంటినో।
పట్టపురాణినైపరనృపప్రమదామణులోలగింపనె।
ప్పట్టునన్నృత్తగీతపరిపాకముదావహనైననన్నుని।
క్కట్టున బెట్టె దైవగతి గ్రాఁచఁగ నెవ్వతె నేర్చునక్కటా॥ ౩౮.

ఆ॥ కన్నకూతుఁబోలె గారాముమైజమ । దగ్ని పెంచునాయతనము విడువ।
నీయఁడైనభర్త యెదుటలేకుండిన । బ్రతుకదేలమొనరు వ్రతము లేల॥ ౩౯.

క॥ పతియే దైవాగ్రణియని । సతులకు నియమింపవిన మె సర్వజ్ఞులఁగ।
ప్రతరసమయములనెవ్వా । నితావుగొందురు వియోగనిగళితధీరల్॥ ౪౦.

క॥ అనివంచు నవరవర్ణిని । యనిశము(బతి(బల(చి యిట్టులను దినముమహీ।
పునిపుత్రుడు చూపఱకొద । వినహర్షము సూపు మధుర విస్మయ శోష్టన్॥ ౮౧.

ఉ॥ ఆదరమొప్ప నమ్మునికులాగ్రణి పావనమంత్రయుక్తమై।
గైదవ యేడు రానిసువు కక్షరపఙ్క్తుల నేర్పె సర్వశా।
స్త్రాదితనీతులంగ అపుచొండొక కాలము పుచ్చి బాలునిన్।
వేదచతుష్టయంబుల(బ్రవీణుని జేసె జగద్ధితంబుగన్॥ ౮౨.

వ॥ ఇట్లు కొంతకాలంబున కనన్యసామాన్యప్రతిభావిశేషంబునం . సి యక్కుమారుండు.

చ॥ అఱువదినాల్గువిద్యలమహాత్త్వము లెల్ల రెుఱింగి లోకసుం।
దరతధనుష్కళాపటిమ దారుణసింహమృగాదిలోకభీ।
కరు(డయి ఖేచరుల్ వొగడ గ్రాలె భవాంతరమందు భీమలన్।
బారిగొను టెక్కుడే యనుచు(బుట్టిన వీ(డు మాగు(డో యనన్॥ ౮౩.

సీ॥ అల(తివిల్వాని వర్ప్రలకేగు జడదారి దిఱుతపాయసము వారె(ననుపెగ।
మునితనూజలతోడ మొగడల(జిదిమి పెక్ లీల నేయంబ పెండ్లింద్లు సేయు।
సర్వశాస్త్రాభ్యాస సౌభాగ్యమహిమ చేశార దా పెరికర్పనలు వెట్టు।
పులినసీమల గంతెనలు నై చిగిర్లాడి పడవల మున్నీట(గడ దిపోవు।
జలధిరింఖణాభంగ సంజన్యమాన । ఫేనముక్తాపుటంబుల(బేడ(గు(జూచు।
వీణియలనాదు కెనదైన వెల(దిగీత । ఘణితి నొక్కొక వేళ నాబాలు(డాను॥ ౮౪.

ఉ॥ కొండొక నా(డు మౌనికడకుంజని భక్తిదలిర్ప "నయ్య యీ।
ఖండము నేలు భూపతిశిఖామణి యే(డతం(డెందునుండును।
ద్దండు(డె? సాత్త్వికుండె?" యన(దాపసపుంగవు(డు విస్మయాస్యు(డై।
"చండకరాభ! త్వత్పితను చక్కనెఱుంగను బ్రాహ్మ్యు" నావుడున్॥ ౮౫.

మ॥ ధనురస్త్రంబులు కేల(బూని మునిపుత్రవ్రాతముల్ తోడరా।
జననింగాంచి "యెఱుంగ(జెప్పుమి పుడీ ప్రాగ్వాటవర్తి వి।
శ్వనవద్వీపము లేలు నెవ్వ(డ"న నాశ్చర్యంబు ఖేదంబు నై।
మ్మనముం బ్రామవచించు నిట్లు నతిరమ్యస్నిగ్ధవాక్పాతుర్కిన్॥ ౮౬.

క॥ ఈయూర్మిక(గొను మిందే । నాయకతిలకంబు భద్రనాముము ఘచితం।
బై యొప్పు నత(డు భంస । క్ష్మాయుతు(డఖిలారివర్గ సంహారు(డిలన్॥ ౮౭.

చ॥ అనితనయుంగరంబిడ(గ నయ్యతిలోకపరాక్రమక్రమా।
గ్ధనవినిబద్ధనూనసు(డు సంగరరంగవినోదమోదమానసం।

జనితకళాభిరాముఁడగుపుత్త్రకుమారుఁడుదారబుద్ధియై।
జననికిమ్రొక్కియిట్లనువిచారముమోమునఁదోఁగలింపఁగన్॥ ౪౯.

క॥ దీనఁబగుపేరిటిసహా । స్రానీకుండెవ్వఁడుంగరమునీకెవఁడె।
ట్లీనొఱఁజెపుమకడునవ । ధానముతోనున్నవాఁడఁబమిమెయిఁదల్లీ॥ ౫౦.

ఉ॥ నావుడుఁజెల్వదుఃఖవదనంబున నెవ్వనినామపఙ్క్తినీ।
భావముచెందనో యెవనిబాహుబలంబునకగ్గలించియా।
దైవవిభుండునుంగొలుచుఁదత్పతియేనినుఁగన్నతండ్రిసం।
భావనసేయుమీపరమపావననామమునైనపుత్త్రకా। ౫౧.

వ॥ అని తనపడిన యెల్లయిడుమలం గొడుకునకుం దేటతెల్లంబుగా నుడివిన నక్కుమారుం
డును బాల్యలౌల్యంబునుజేసిన యయ్యాదికథయుంబోలె గ్రహించియుండెనంతఁ బెద్ద
కాలంబుచనిన. ౫౨.

సీ॥ ఉదయపర్వతవిహారోల్లాససముచితజ్యోతిస్ఫురద్బాలసూర్యుఁడనఁగ।
నసమాస్త్రికలనయశోంగనాసీమంతలలితసింధూరవత్తిలకమనఁగ।
త్రైలోక్యజైత్త్రయాత్రాపేంఖదస్త్రాధిదేవతాహాసచంద్రికయనంగ।
కుసుమనారాచయుక్కోదండధారిణీవశ్యముఖీపురోధ్వజమనంగ।
నొప్పునాబాలుఁడొక్కనాఁడుదయశిఖరి । పరిసరారణ్యభూములభవ్యమృగయ।
కతనవిహరింపఁబోడఁగినెక్కుడుసొచ్చి । యరుగుచుండఁగనొకటఁదామరలువఱల॥

గీ॥ కొలనుపొడగాంచియందలిజలముగ్రోలి । యవులఁబోవుదమనిడప్పియారనీరు।
ద్రావియచ్చోటనొక్కచట్రాతిపైని । విల్లునమ్ములపాదివెట్టివిశ్రమించి॥ ౫౪.

ఆ॥ బ్రహ్మసృష్టియెల్లబ్రాకృతరూపంబు । పొలుపునెఱపుఁగనులఁజెలువునింపు।
నగుటజటిలులిట్టియాహ్లాదమునజేసి । యమలహృదయులగుచునడవినుంద్రు॥ ౫౫.

గీ॥ రమ్యమగుదూరనారికేరప్రకాండ । వితతిచెలికత్తెలొండొరువేడ్కఁజేర్చి।
మంతనములాడెఁబయ్యెదలామలపినట్లు । పచ్చకీతులనల్లార్చుబంధురముగ॥ ౫౬.

గీ॥ దూరముననుండుకొండలబారుచూడఁ । దివిరియొండొంటవెనుబడుదిగ్గజముల।
భంగిఁబోచునహో! చిత్రపటమునందు । నన్నిచిత్రించినట్లున్నదరసిచూడ॥ ౫౭.

వ॥ అని తలంచుచు శ్రమాపనోదనార్థంబు కించిత్కాలంబటు విశ్రమించి. ౫౮.

ఆ॥ తడవుసెల్లెనిల్లువిడిచిమాతల్లియే । దిగులువడునొయనుచుమగుడిజలము।
గ్రోలఁబోయియొక్కగుక్కఁదావఁగఁజేదు । గాఁగనుండనొమ్మెఁగలుఁగుచపుడు॥ ౫౯.

ఉ॥ ఉమ్మకముస్నెవేలితెలియుంగరవుంగులిశంబుపచ్చనై।
కమ్మనికేతకీదళముక్రైపడిఁబోఁచెసవిస్మయాత్ముఁడై।

యమ్మహిపాత్రజుండుపసపాడుదురిచ్చుటసాగ్యులెవ్వరో।
యిమ్మగనాఁడలంచిపథమెక్కి కెలంకులఁజూచియిట్లనున్॥ ౬౦.

సీ॥ నలుగడల్పరికింపనగుఁడుమూరఁగరానికంటకారణ్యమీకటకమెల్ల।
విరియుపెబ్బులులైనజొరరానిదట్టపుటంఘ్రిపంబులుగాపెయల్లవెల్ల।
భల్లూకవేదండబహుకురంగాదిమృచ్ఛరశరక్రూరాతలసంకులంబు।
నైనయీపథములనడుగులుకన్పట్టుచున్నలెవ్వారలీయుదకముగొన।
వత్తురోయీకెలంకులవలరనుండ । తెరలిగేదంగితావియేతెంచెడినిటఁ।
బసపుపొడిరాల్చియున్నదీపట్టులందు । సతమునీరాడిపోదురిందతిపలెవరొ॥ ౬౧.

చ॥ అనుమహాకింతదవ్వరిగియచ్చటఁగౌశికుఁడొక్కఁడొక్కభో।
గినిగరమూనిపట్టివిషకీలితదంతములెత్తుచుండసె।
మ్మనముక్పపారసంబుననిమగ్నముగానకటాఘణీంద్రకం।
సరమొనరింపనేలయనిసంభ్రమమొప్పఁగడాసియాతనిన్॥ ౬౨.

ఉ॥ ఎవ్వరికేమియుంజెడుగులెంచకయిష్టవిహారలీలలన్।
మవ్వపుఁదెల్లరిక్కలకుమాఅటలైనఫణాగ్రరత్నపుం।
దివ్వెలతోసుఖాంబునిధిఁదెప్పలఁదేలెడుచిల్వపిండుతోఁ।
జివ్వలుసేసెదేలయహిసేసినదేమికిరాతనందనా॥ ౬౩.

క॥ నావుడుఁగౌశికుఁడిట్లను । భూవల్లభనైజప్పుత్రిపొలివుత్తురెయీ।
జీవనముదక్కనాకిఁక । సేవస్నెయువాసిలేదహీనవిచారా॥ ౬౪.

క॥ అనవుడునాయహితుండిక । మనమునసంతాపమెడలిమనుమీయుంగ్రం॥
బునుఁగైకొనిఫణిరత్నం । బునువిడిచియథేచ్ఛఁజనుముపూఁచునిపల్కన్॥ ౬౫.

తే॥ అక్కుమారకునకుమ్రొక్కివేల్పులునిద్ర । సేఁచదెలిసిరనుచుఁబాడుకొనుచు।
నేగెనంతనాఫణీంద్రంబురాజపు । త్రునకునిట్లుచెప్పఁదొడఁగెనపుడు॥ ౬౬.

ఉ॥ రాజకులాగ్రగణ్యరతిరాజసమానవిమానచారిణీ।
పూజితదివ్యరూపమునిముఖ్యవివర్ధితయుస్త్రశస్త్రవి।
ద్యాజయగాండివిప్రవరధైర్యరమాధికమత్తరాజితే।
జోజయశీలిశీలితవిశుద్ధనయార్జనసత్యవర్ధనా॥ ౬౭.

సీ॥ అవధారుపసునేమియనునాగుఁడొక్కఁడుపాతాళముననిలాభద్రుఁడనఁగ।
బరఁగువానికుమారిభద్రావతినిగోరివశ్యముఖీశ్వరీవసుధలోన।
దపమొనర్చెఁగడిందిధార్మికురాలుప్రత్యక్షమైకొన్నినాళ్ళగుమనిరెయె।
నంతటనొకనాఁటనటఁదిలోత్తమవచ్చివాఁడనిపూదండవల్లకియును।

మఱచె దేవియతనిమాటుననుంచెవి । పంచికాదులతేఁడుపడఁతిఁగోరి।
మన్మథోగ్రనిశితమార్గణములగుంది । వెలఁపువిడిచియామె వెంటనంటు॥ ౬౮.

సీ॥ బలిసద్మముననొక్కపారికాంక్షివిలాసభద్రాఖ్య వెలయుఁగృపామయుండు।
వసునేమియతనిఁగ్రేవలనుండుసచ్ఛాత్రుఁడై యొక్కనాఁడు హేత్వంతరమున।
మలినుఁజేసితినన్ను మదనుదర్పముచేతఁగానభద్రావతిగలుగకుండు।
ననిశపింపఁగభోగియడుగులఁబ్రాలెబ్రాలదయాపరుండయిలలితఫణితి।
నుదయమొనోర్వఁపుఁదలచూడనొడసిపోవు । శాపమునిపల్కవిధిమాఱిసంయమీంద్రు।
వీడుకొనివసునేమియవ్వేలఁడికతన । బెలుచనుస్మర్తుఁడైయుండుభీలువాసి॥ ౬౯.

మ॥ చరణాగ్రంబులనిక్కిమాడుమదిగోచత్రాతిచెంతన్ మనో।
హరమన్ పేరసరోవరంబొకటియుంహాశ్చ్యాన్యమైయొప్పభూ।
భరభద్రావతియందుసాయమునసంభఃకేళిసల్పన్ మనో।
హరశుద్ధాంతనితంబినీమణులకేలావేఱయాహ్లాదముల్॥ ౭౦

ఉ॥ ఆవసునేమిక్రొవ్విరులహారములేర్చియొసంగుచిచ్ఛభ।
ద్రావతితోడనాకొలఁకుదగ్గఱనిచ్చలునానెలంతయున్।
బ్రావిరులొచ్చియచ్ఛటనపాఱఁగవైచుటఁజేసియాస్థలిన్।
దావులెసంగితుమ్మెదలఁదార్చుఁదిరస్కరిణీమహత్త్వమై॥ ౭౧.

ఉ॥ నేఁడునువచ్చియక్కరణినీరదకల్పవిశుద్ధదేవతా।
రాడుపలావనద్ధరుచిరాజితయష్టిఫణీంద్రకన్యనీ।
రాడిభరించుకోమఱచియాత్మగృహంబునకేగెనంతగో।
వాఁడుభరించిదానిఁజొఱవన్ బిలమార్గముదూఱుచుండఁగన్॥ ౭౨.

ఉ॥ శాశికుచేతఁజిక్కినఱుకంబడువేళమహాత్ముఁడార్తివా।
రాశిపరిస్ఫురత్తరణిరాజసుతుండుకరాంగుళీయకం।
బాశనొసంగిపోవిడిచెనావసునేమియునేనుశాపమున్।
నీశరణార్తిఁపోయెఁగదనిల్వుమొకించుకసేపువచ్చెదన్॥ ౭౩.

క॥ అనివీడ్కొనిబిలమార్గం । బునబాతాళంబుఁజొరాయిమునుచెప్పినవి।
శౌనుబూవ్వుదండలొనుగఁ । గొనివచ్చియొసంగివీడుకొనిమగుడిచనెన్॥ ౭౪.

చ॥ ఉదయనుఁడవ్వనాంతరమహాగ్రముఖంబులనెల్లఁజొచ్చిదు।
ర్మదకరిభల్లుకద్వీపివరాహములాదిగఁబెట్టలంచిదా।
సదనముసేరిసర్వమునుసాంతముగావినిపించెఁదల్లియున్।
ముదమునుఖేదముంబొరసిపుత్రుఁడుదెచ్చినవిశౌఁజూచుచున్॥ ౭౫.

చ॥ మనుజుఁబలెంజడంబుగను మాఱుపుఁగట్టివిలాసభద్రుఁడన్।
మునిచరణాబ్జముల్ గొలిచి ముగ్ధలఁ జేర్చిరసాతలంబునన్।
దినములువాపిభూమికరుదెంచెనహోవిధియీవిపంచినా।
జననముసైతమీలతలవంద్యములయ్యెఁదలంపనేటికిన్॥ ౯౬.

వ॥ అనిచెప్పి శోకసంకులరై శాపావసానంబున కెదురుచూచుచు నాయాశ్రమంబున దిన దినప్రవర్ధమానుండగు సూనుండు పల్కు నుపశమనవాక్యంబులచేతను బ్రాణంబుకంటెఁ బ్రాణంబుగాఁ జూచు మునీంద్రుని యుచితాదరంబునను సుఖంబుండ నదియట్లుండె నిందు. ౯౭.

శా॥ వ్యాళగ్రాహికళిందజాపరిసరోద్యానంబునందొక్కనాఁ।
వ్యాళంబొక్కటిఁబట్టెనుక్కువపుగేయంబూఁదిసంగీతరా।
గాలాపంబుననిద్రవోవశిశువుల్ హాసింపవేగోవులున్।
లీలావిభ్రమమానసంబులయిహాళింమేఁతవర్జింపుచున్॥ ౯౮.

గీ॥ చిలువనాడించిబ్రదుకనంగళులకేగి । తిరుపమెత్తుచుఁగౌశాంబిపురమునందు।
దొరువుతెరువునకేగుచుమఱువుమాపి । ఫణినటీతాండవమునరోస్యంబుగలుము॥ ౯౯.

ఉ॥ అంతటనొక్కకంసలిగృహంబుననాగమునాక్వసంతతిన్।
బెంతయుఁగ్రందువారఁదనహారపుటుంగరమెత్తిచూపిరో।
యెంతయొసంగుదీవనిచనిప్పుగఁగంసలిదానిఁగాంచిభూ।
కాంతునిపేరనున్నదనిగన్గొనిరాజభటాళికీయఁగన్॥ ౧౦౦.

గీ॥ ప్రోలితలవస్త్రచచ్చినపురువునీడ్చు । చీమలునుబోలెవానినిజేరిగొట్టి।
నెమ్మినిచ్చెనేనీదుపాండిత్యమునకు । జనపమండనిసెలుసాలనునిచిరస్త్రము॥ ౧౦౧.

ఉ॥ ఆమణినాఁడువానివసుధాధిపుచెంతనుఁదెచ్చిపేఁడుగో।
మీమహితాంగుళీయకముమిన్నకనొంగిలెనన్నరాజునో।
పాములనాఁడనీకిదికృపామతినిచ్చినవాఁడెవండుగా।
కేమహీనబ్బెనీకులభియించినచోప్పెటిఁగింపునావుడున్॥ ౧౦౨.

గీ॥ వాయిదడబడలెంకలువట్టిచఱవ । బెగడుగుడుచుదునొడలుకంపింపవాఁడు।
గలతెఱంగెల్లనెఱిఁగింపఁగాశ్యపీంద్రుఁ । డమితధనమిచ్చిపుత్తెంచుఁడనియెనంత॥ ౧౦౩.

వ॥ జననాధుండు తనయభ్యంతరమందిరంబుసొచ్చి యొక్కవివిక్తస్థలంబున నాయంగుళీయకముం జూచుచు. ౧౦౪.

ఆ॥ ఉంగరంబయెట్టులున్నదినీమూర్తి । చెలియయేమినీకుఁజెప్పిపుచ్చె।
మున్నుమమ్ముఁగూర్చిపుణ్యంబువొందితి । విప్రుడునూతనైతివిడుమఁబాప॥ ౧౦౫.

ఆ॥ నిన్నుఁబంపినట్టి నెపముఁజూడఁగనా । కటికెమనసువజ్రకఠినమనుచుఁ।
దెల్పఁబూనినట్టిదివ్యరత్నంబనా । కెఱుఁగవలసెనోరుదెఱచినుడువు॥ ౧౬.
గీ॥ నీవుతలపించునాపేరునిలిపియెడఁద । నిలువునీరుగఁబత్తులుఁగలఁగనేడ్చు।
దానికన్నీళ్లనెన్నాళ్లుడడిసితీవు । నీదురూపంబుమాఱుమన్నించిచెపుమ॥ ౧౭.
ఆ॥ తెగినగాలిపడగతెఱఁగునవింద్రోవ । నేగియెచటనెట్టియెడలఁబడెనొ।
యొడలెఱుంగకకటపడరానిపాటుల । వడెనొలేకసురలుపట్టుకొనిరొ॥ ౧౮.
క॥ ఏవనలక్ష్మియొయేజల । దేవతయొయేపురీసతీమణియొయే।
గ్రావరమాధన్యయొమా । ర్చావిలయగునీదుచెలికినమృతంబిడెనో॥ ౧౯.
క॥ అనిపలుపరుసులవందురు । జననాథుఁడువనటకోల్మసంగఁగశశ్వ।
జ్జనిదుఃఖముచూపోపక । మునుకొనియశరీరవాణిమొగినిట్లనియెన్॥ ౨౦.
గీ॥ పొడుపుగుబ్బలిపొంతఁబ్రాకడలిచెంత । మగుపజమదగ్నిజడదారిమనికిపజలుఁ:
బదియునాళ్లేండ్లనెల్లనీపట్టిధర్మ । పత్నిఁదోడ్తెమ్ముచెచ్చెఱఁబార్థివేంద్ర॥ ౨౧.
చ॥ అనుడుధరామహేంద్రుఁడురయంబుననద్దెసలోలిఁజూచిని।
స్వనమునకేటిహేతువనిసందియమూఁదఁగదివ్యవాణియి।
ట్లనియెఁగృపామనస్క్రియనటంచుఁదలంచికపోతపాళిఁబ।
ర్వినపురిగల్గునెమ్మిఁగనివెంగలిచూడ్కులతోడనిట్లనున్॥ ౨౨.
గీ॥ నెమ్మి! తహతహపడెదేలనిలువవొక్క । కెలనవేలుపుటెలనాగలోలయువేడ్క।
మేఘరంజనివీణెలమేళవింప । జతనమొనరించుచున్నారుచాగుచాగు॥ ౨౩.
మ॥ పొడుపుంగుబ్బలిపొంతఁబ్రాకడలివాఃపూరంబుడిండీరముల్।
పడవన్ద్రోపుడువెట్టఁదుంపురలుపైపైగ్రమ్మఁబాటీరపుం।
జడపుంగాడుపుఃగొయ్యనొయ్యనపయిన్జల్లాడఁబల్లాఱుఁబెం।
దడవోలాడెడుభాగ్యమెన్నఁడొయయోధ్యాపాలకాపత్యమా॥ ౨౪.
వ॥ అనుచు నాదినంబుగడిపి మఱునాఁడు శుభముహూర్తంబున దానును సంగతకుఁడను చెలికానితోడం హయంబులెక్కి పురంబువెడలి యనేకకాననంబులుగడచి చనుచుండె రంత. ౨౫.
ఆ॥ రాజురాగలక్ష్మిప్రాచిమూర్తిభవిం । చెనొయసంగరక్తచిత్రభాను।
ఘృణులునింగిఁబొరలిగిలకొట్టుచుండెను । జరమపూర్వదిశలబొరసిబొరసి॥ ౨౬.
క॥ భూవరుసమ్మోహనవి । ద్యావల్లిహరింపదేవిఁదలఁచుచుఁగాల।
శ్రీవిద్యోపాసకుఁడిడు । పావనతిలకంబనంగభానుఁడుదోఁచెన్॥ ౨౭.
వ॥ అపుడిరువును. ౨౮.

క॥ నలుదెసలనిట్టలపుటిరు । లలమునొక్కొయనెడిఫేలిహయముల బెలువం।
బలువిడివిడి చిరిపమటి । మలవిడితతి సెరనితరగమాలికలొయ్యన్॥ ౯౯.
క॥ అలలని మొకుమలచిలువలఁ । జెలువయొకతె వాయి దెఱచి జీర్ణించె రవిన్।
జలమున్నను బలమున్నను । బొలుచు నె పెనుబల్లి చెంతఁ బొడిచీమయిలన్॥ ౧౦౦.
చ॥ దెసలను గ్రమ్మఁ జీకటులు ధేనుల గొంతుకలందు ఘంటికల్।
పసయతిక్రోమసెఁబుల్గుగమిపాతెమహీజకులాయపాళికిన్।
బ్రసనశయందు కామినులరాయిడి బంచమబాణమెత్తెను।
ల్లసనములాడె భృంగమహిళాజనముల్ పికకీరసంతతిన్॥ ౧౦౧.
ఆ॥ అపరవార్ధిమునుగ నాలోకబాంధవుం । డపరితపము లోకమాక్రమించు।
టను దెమయ్యిరు వురుహయముల నప్పళిం । పుచు జవంబు మీఱఁ బోయి వ్రాయి॥ ౧౦౨.
వ॥ ఒక శివాలయ సమీపంబు సేరి యచ్చోట నొక పటకుటీరంబు నిర్మించుకొని. ౧౦౩.
చ॥ ఎలసి పథశ్రమం బపనయించుచుఁ గొండొక సేపులోనను।
జ్ఞిలిడుచు నిద్రపోయిరి యొఱుంగరొకో యుదయాచలాటవీ।
స్థలములటంచుఁ గానియెడఁ దాల్చునెయిట్టి విరామమాప్రియా।
జలజముఖావలోకనవిచారమహీధవచిత్తమెంతయున్॥ ౧౦౪.
గీ॥ గడియలిర్వది కాఁగనాకాశ్యపేంద్రుఁ । డల్లనల్లన శయ్యామతల్లి విడిచి।
పటకుటీరబహిర్భూమిభాగమంది । నింగి వీక్షించి నల్లదల్ నెఱయఁ జూచి॥ ౧౦౫.
గీ॥ విష్ణునక్షత్రముచ్చంబు విడెఘనిష్ఠఁ । జేరెఁ జంద్రుండు ద్వ్యోమమధ్యసీమ భములు।
మంచిముత్తెపు రాసులమాడ్కి వెలయు । నచ్చటచ్చట దొడ్డల నాకసమున॥ ౧౦౬.
ఉ॥ వెన్నెలనద్దెసల్ పొరిసె వేకువయాయని కాకికోకిలల్।
కన్నులు విచ్చి కూసియఱకంటఁ బరుండెడిగుంటనక్కలు।
భిన్నరుఁ జేయ్చుచందమున బేరెలుఁగెత్తి సరిత్భూమిఁగూ।
సెన్నలు వంకలం దెలుగుచీరఁగ భేకగణంబు ద్రోసెడున్॥ ౧౦౭.
గీ॥ వింటిపూఁబోటరిక్కలవిరులు పఱల । నడుమ నెలవెండియంత్రపుగడ సుధాంబు।
కణములాశాప్తకంబులఁగలయఁ జల్లు । నెవనిభోగైకశిలతాసృష్టి యొక్కొ॥ ౧౦౮.
క॥ ఈయరుణమ్మత్యుపేతం । బైయొప్పెడి వాలుఁ ద్రోవ యరొక్కదయున్నై।
లే ముని డుద్దైయున్నది । భూయువతీశోణరత్నభూషణమనఁగన్॥ ౧౦౯.
వ॥ అని కొండొక సేపు చింతించి వాసఃకుటీరంబు సొత్తెంచి. ౧౧౦.
క॥ ఒడలెఱుఁగక నట్టడవిని । దొడిబడి నిద్రించు ప్రియవిదూషకు మొగముం।
బొడగని లెమ్మా భాస్కరు । కడిఁదిమరీచులకుమున్నె గడవంగఁ దగున్॥ ౧౧౧.

ఉ॥ ముత్తెపుటారతుల్ భువనమోహినులై పెనుపొందుపోగవో।
పిత్తితియుత్తఁబాలుఁబూగి సేసలు చల్లజనంబుచిత్తముం।
నోత్తుప్రహర్షముంగనులనూగెడుబాష్పముచేత దెల్పవా।
గత్తతి రాజమందిరమునందిరిభావుకమైన వేళలోఁ॥ ౧౫౩.

వ॥ అపుడు మృగావతి. ౧౫౪.

క॥ చిలుకలు పైఁబ్రాలఁగనెవు । బిటుసేరఁగ రాఁగరాగలోలాసక్తా।
విలచిత్తయగుదుఁబోరిబోరి । నలంగుదుఁబ్రవాసహేతువరయుదు మనిలోఁ॥ ౧౫౫

సీ॥ యమునాతరంగిణీవిమలసైకతవేణి నసమానజలకేళియాడియాడి।
వ్యోమకల్లోలినీహేమకల్హారచంచత్కాంచుకక్రీడసలిపిసలిపి।
గంధమాదనసానుకలితకేళీవిటంకములనంచలకాటగఁజపిగఁజపి।
కైలాసపరిసరగ్రావవీధీవేదివల్లకీరావముల్ చల్లిచల్లి।
నిష్ఫలాంశోరుతెలపబాయకిచ్చ మెచ్చి । యభవుసామేననిల్చినయంబ బ్రాలె।
నెరపు నెమ్మనముమగనిహృదయుపేరి । వరలునారాజపుత్రికవయనిగూడి॥ ౧౫౬.

కె॥ అనికాంతభూతివినిచిన । గుణాఢ్యుఁడాలుమగలనిక్కిగోడవలుఁగలుగం।
జనునెయని తెలిసితలోకులు । మునుకొనివర్ధిల్లసుఖముపొందుదురనియెన్॥ ౧౫౭.

ఉ॥ మునుగవితాపయోనిధిగి ముత్యముతేర్చినసత్కవీశులన్।
గనుటపవేమామనీషులను గాలములూనకముద్దియేనునుం।
గనుఁడి దలెచ్చితిన్ శిలయొగప్వయొక్కప్రతిమరత్నమోయొబుం।
గనుగవులారయొద్దునను గాఁచెదరోకవణాగ్రచిత్తులై॥ ౧౫౮.

గద్యము॥ ఇది శ్రీరామకృష్ణకవిప్రణీతంబైన మృగావతియందు సర్వంబును జతుర్థాశ్వాసము.

## వైజయంతిముద్రాక్షరశాలలో వెలకుదొరకు గ్రంథములు.

1. ఖేచరోల్లాసము. శ్రీమాన్. ప. శ్రీనివాసాచార్య రచితము. వచనము. 0 2 0
2. మంజువాణీవిజయము. శ్రీమాన్. ప. అనంతాచార్య రచితము. వచనము. 0 4 0
3. రుక్మిణీపరిణయము కూచిమంచి తిమ్మకవి ప్రణీతము. ... 0 8 0
4. (1) శ్రీనివాసతారావళి (2) రామపంచాశత్కందములు (3) [illegible] భూమణి శతకము జాలూరి అప్పయ్య పంతులుగారిచే రచితములు. 0 4 0
5. శకుంతలాపరిణయము. కృష్ణకవి ప్రణీతము. . ... 1 0 0
6. భరతాభ్యుదయము. విద్వాన్ మాడభూషి వేంకటాచార్య రచితములు. 1 0 0
7. పారిజాతాపహరణము. నంది తిమ్మనార్యవిరచితము. వచనవ్యాఖ్యానము శ్రీనివాసాచార్యులు (బి.ఏ.) గారిచేఁ బరిష్కరింపఁబడి సవ్యాఖ్యానముతో మంచికాగితములపైఁ బునర్ముద్రితమైనది. ... .. 0 6 0
8. ఆంధ్రభారతమునందలి శంతనుపౌత్రప్రభుత్వమునుగూర్చిన ఉపన్యాసము. వైజయంతి పత్రికాధిపతులగు ప. అనంతాచార్య విరచితము. 0 1 0
9. వల్లవీపల్లవోల్లాసము. విద్వాన్ మాడభూషి నరసింహాచార్యవిరచితము. 0 10 0
10. ధనంజయవిజయవ్యాయోగము. బ్రహ్మశ్రీ, కొక్కొండ వేంకటరత్నము పంతులుగారిచే రచితము. ... ... ... ... 0 4 0
11. మదనమోహనచరిత్ర. విద్వాన్ మాడభూషి వేంకటాచార్యులచే రచితమైన వచనకావ్యము. .. ... .. ... 0 4 0
12. సోమశర్మాభ్యుదయము. శ్రీమాన్, కోమాండూరు అనంతాచార్యులచే రచితమైన వచనకావ్యము. ... ... ... .. 0 6 0
13. అనిరుద్ధచరిత్రము. కనుపర్తి అబ్బయామాత్య ప్రణీతము. ... 0 12 0
14. చాటుసారి. బ్రహ్మశ్రీ ఆదిభట్ల నారాయణదాసు గారిచే రచితము. 0 4 0
15. హంససందేశము (పూర్వభాగము) విద్వాన్ మాడభూషి వేంకటాచార్యాంధ్రీకృతము. ... ... ... ... .. 0 2 0
16. గంగాలహరి. బ్రహ్మశ్రీ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులుగారిచే నాంధ్రీకృతము. సంస్కృతమూలసహితము. ... ... ... 0 3 0
17. కళావతీవిజయము. మ-రా-రా-శ్రీ, బయ్యపునేడి వేంకటనాగశర్మగారిచే రచింపఁబడిన వచనకావ్యము. ... ... ... . 0 6 0
18. సుమనోమనోజ్ఞము. బ్రహ్మశ్రీ వడ్డాది సుబ్బారాయ కవివర్య రచితంబగు భారత వచనకావ్యంబున మూఁడవభాగము. ... ... 0 8 0
19. శ్రుతిస్వరూపనిర్ణయవిచారము. బ్రహ్మశ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి కృతము. ... ... ... ... ... .. 0 2 0
20. సతీమణి. ప. శ్రీనివాసాచార్య రచితము. పద్యకావ్యము. ... 0 3 0
21. ఆంధ్రభాషనుగూర్చిన ఉపన్యాసము. బ్రహ్మశ్రీ, మానవల్లి రామకృష్ణకవి ప్రణీతము. ... ... ... ... ... 0 2 0
22. కాళిందీపరిణయము. బ్రహ్మశ్రీ, శొంఠి భద్రాద్రిరామశాస్త్రి రచితమైన పద్యకావ్యము. ... ... ... ... ... 0 4 0

శ్రీ

# సుమిత్రచరిత్రము.

ఆంగ్లేయ నాటకకవులలో నగ్రగణ్యుఁడగు

"షేక్స్పియరు"

మహాకవివరునిచే రచియింపఁబడిన

"వింటర్సుటేల్" అను నాటకకథ ననుసరించి వ్రాయఁబడిన

పద్యకావ్యము.

ఇది

కాకినాడ-జగన్నాథపురము మ్యూనిసిపల్ లోవరు సెకండరీ

పాఠశాలయం దాంధ్రోపాధ్యాయుఁడగు

## జయంతి-భావనారాయణచే

రచియింపఁబడియె.

శ్రీవైజయంతియందుఁ బ్రకటితము.

—:0:—

చెన్నపురి:

శ్రీ "వైజయంతీ" ముద్రాశాలఁ

ముద్రితము.

———

౧౮౯౯.

## ఈ నాటకకథయందువచ్చు పాత్రములు.

సుమిత్రుఁడు—సింహళద్వీపపురాజు.

చంద్రవర్మ—మలయాలయదేశపురాజు.

మంజువాణి—సుమిత్రునిరాణి.

బహుమానుఁడు—సుమిత్రుని సభికులలో నొకఁడు.

కృష్ణుఁడు—సుమిత్రునికుమారుఁడు.

సత్యసారుఁడు—సుమిత్రుని సేవకులలో నొకఁడు.

చతురాస్యుఁడు—సుమిత్రుని సేవకులలో నొకఁడు.

వక్రచిత్తుఁడు—సుమిత్రుని సభయందలి ప్రభువు.

మిత్రవింద—వక్రచిత్తునిభార్య—మంజువాణిసఖి.

మాలిని—మంజువాణిదాసి.

రామవర్మ—చంద్రవర్మకుమారుఁడు.

ప్రమతి—సుమిత్రునికుమార్తె.

భద్రుఁడు—ప్రమతిని గామించుటకై రామవర్మ గోపవేషమును ధరించినప్పుడు పెట్టుకొనిన మాఱుపేరు.

వీరుగాక ప్రమతిని పెంచిన గొల్లవాఁడు మొదలగు మఱికొందఱు వత్తురు.



శ్రీరస్తు.

శ్రీభీమలింగాయనమః.

# సు మి త్ర చ రి త్ర ము.

## ప్రథమాశ్వాసము.

క. శ్రీశైలజేశ! దక్షిణ, కాశీపురవాస! ఘోరకలుషనిరాసా!
కాశశరదభ్రశశిసం, కాశోజ్జ్వలదివ్యమూర్తి! ఖలసమవర్తీ! ౧.

వ. దేవా! దివ్యచిత్తంబునఁ జిత్తగింపుము. భవదీయనిర్హేతుక జాయమాన పరిపూర్ణ కృపారస వీక్షణాతిశయంబున నా యొనర్పంబూనిన సుమిత్రచరిత్రంబునకుం గథా విధానం బెట్టిదనిన. ౨.

శా. మారాకారుఁ, డరాతిభూధవచమూమత్తేభసింహుండు, స
ద్వీరాగ్రేసరుఁ, డార్యసన్నుతుఁడు, పృథ్వీలోకవృత్రారి, భూ
పారాధ్యుండు, మహానుభావుఁడు, సుమిత్రాఖ్యుం డెసంగున్ జనుల్
ధీరోదాత్తుఁడనంగసింహళమహాద్వీపంబుఁ బాలించుచున్. ౩.

సీ. కాలకాలశిరోధిగాఢహుంకారంబుమదినినాఁటనినాఁటిమన్మథుండు
రఘురామఘోరనారాచవహ్నిజ్వాలయొడలనంటనినాఁటియుదధివిభుఁడు
కుంభసంభవతీవ్రకోపపావకకీలతగిలిక్రుంగనినాఁటినగవిభుండు
వీరభద్రేశ్వరక్రూరాంఘ్రిహతినివక్షంబుకందనినాఁటిచందమామ
విపులసౌందర్యమునను; గాంభీర్యమునను, ధైర్యసంపత్సమృద్ధి; నుదాత్తసత్క
ళాకలాపంబులందు; భూలోకమఘవుఁ, డనఁదగినసింహళద్వీపజనవరుండు. ౪.

ఆ. వానిముద్దురాణి, వరసైకతశ్రోణి, నేత్రనిర్జితైణి, నీలవేణి,
నవకిసాలపాణి, నవ్యగుణశ్రేణి, మహికిడిగినవాణి, మంజువాణి. ౫.

సీ. శృంగారరసముమూర్తీభవించినలీలవిద్యుల్లతికనేలవిడిసినట్లు
కాయంబుఁబూనినకల్పవల్లికరీతిఘనపావనతరూపుఁగనినసరవి
సత్యంబుమేనూనిసంచరించినమాడ్కిఁదనువుఁదాల్చినశాంతంబుపగిది
శీలంబుదేహంబుఁజేకొన్నచందాననీలువేయవతారమెత్తినగతి

విమలసద్గుణములు శరీరముగ ధరించి, కాశ్యపీస్థలి నడయాడు కైవడిగను
వఱలు నా రాజచంద్రుని వారిజాక్షి, పరమ సౌజన్యమున కాటపట్టనంగ. ౬.

గీ. పుణ్యవనితామణీశిరోభూషణంబు, దీనజనములపాలింటి దేవసురభి
యతిథిజనములఁ బోషింపనన్నపూర్ణ, చెలిగుణము లెన్న శక్యమే శేషునకును. ౭.

శా. వారన్యోన్యమహానురాగ మెదలన్ వ్యాపింపను ద్యానసం
చారప్రక్రియలన్, వినోదకథలన్, సద్గానగోష్ఠిన్, గవి
త్వారూఢిన్, విలసిల్లుచుండిరతి సౌఖ్యాబ్ధిన్, విస్మితస్వాతై
క్షీరాంభోధిశయానుఁడున్ సిరియు మాడ్కిన్ లోకులగ్గింపఁగన్. ౮.

క. పతియును సతియును నైరవ, హితుఁడున్ గామునియుఁ బోలె నెనసి యిటు సుఖో
న్నతి నొందుచుఁ దమరాజ్య, స్థితులరయుచుఁ గాపురంబు సేయుచు నుండన్. ౯.

క. అంతట కాననకమలా, కాంతము; శ్రీరాష్ట్రపుత్రికాతనయజయో
దంతము; నిర్జితయువతీ, స్వాంతము చను దెంచె నల వసంతము హాళిన్. ౧౦.

క. పొలిచెన్ జలజాకరములు, జలజంబులచే; లతాంతసమితిం గుజముల్,
వలపున వారిజనేత్రలు, చలువలఁ గరువలియు నవ్వసంతమునందున్. ౧౧.

గీ. విడిచె వాకట్టు; వాయసవితతి పొందు, పరభృతంబులకును; శుకోత్కరమునకును
దేనెలొలికెడు పలుకులు జానుమీఱె, గాలికెనలేని తాలిమి గీలుకొనియె. ౧౨.

గీ. విరహఖిన్నలఁ జిక్కఁగ; వెల్లఁబాఱ, పడపడవడంక; విడువకెప్పుడును నావు
లించునట్లుగఁ దానొనరించుచుండె, నతనుఁడుద్ధుర! యవ్వసంతాగమమున. ౧౩.

గీ. అంగములసుప్తిమదవిలాసాతిశయము, పల్కులమదాభిరతియును; భ్రూవిభంగకలన
వక్రదృష్టులు సతులకు వఱలఁ జేసె, కుసుమసమయోదయంబునన సమశరుఁడు. ౧౪.

సీ. గందంపుమలనోలిఁ గాణయాచిగ నేలి జలజాతసౌరభంబులను గ్రోలి
సరసిజాకరపాళి శ్రమదీఱఁ గాఁ దేలి ఘననికుంజాలిఁ జక్కఁగను సోలి
విరులనింపగు మేలితరువులపై వ్రాలి పువ్వులయందలి ధూళి బోవఁ ద్రోలి
మల్లెనాజవరాలి మాటికి క్రబతిమాలి జాతీవధూటి పై జాలిమాలి
గాలి; పోషితసమదాలి; కాద్రవేయ దుఃఖనిర్మూలి; పరమమృదుత్వశీలి
విరహిణీలోకమానసవిపినకీలి; చలువలొసఁగుచు వీఁచె వైశాఖమునను. ౧౫.

వ. ఇట్లు సమస్తధరారుహసందోహంబునకు మహానందంబు నొసంగు వసంతంబున నొక్క
దివసావసానసమయంబున సుమిత్రుండు కళత్రద్వితీయుండై గృహారామంబున వినోద
విహారంబు సలుపుచుఁ దనవారిజాక్షిం గాంచి యిట్లనియె. ౧౬.

గీ. " మందమారుతబాలకస్పందమునను, గందళితమాచుమకరందబిందుసమితి
చిందుకురవిందభ్రోవ్విరిపందిరులను, గాంచితేమన్మథునియోలగమును గేరు. ౧౭.

ఉ. సంపెఁగపూవుమొగ్గలి వెసారసపత్రవిశాలలోచనా!
సొంపునునింపుమన్నయవిచూచితి వేవనలక్ష్మిభక్తిమైఁ
జంపకబాణుపాదజలజాతములన్ భజియించుచున్ నివా
ళింపఁగనిడ్డదీపములలీలఁజెలంగెడు నేత్రపర్వమై. ౧౮.

గీ. అతనుచాపవిముక్తములగుమఁదోలుతఁ, బొందినగిరీశదేహవిభూతివిపుడు
కడుఁబరాగమిషంబునవెడలఁగ్రాయు, చున్నటులనొప్పునురపాన్నగున్నపువులు. ౧౯.

చ. కరమనురక్తిబాలసహకారధరాజముపైఁగిసాలయో
త్కరరసమద్యమానితమకాంతలముద్దిడుగండుఁగోయిలల్
గరితకుఁదీయపల్కులనుగౌతుకమబ్బఁగఁజేయుచున్నదీ
సరసిజపుష్పమధ్యగతిషట్పదరాజముచూచితేసఖీ. ౨౦.

గీ. మధుపనికరంబులకుఁబానమందిరములు, నిండువలపులగమికిఁబాణింధనములు
చలువకరువలికుఱ్ఱకునిలుచుచోట్లు, కంటెయరవిందపుష్పముల్ కమలవదన. ౨౧.

క. కలకంఠకంఠనాదం, బులనొప్పురసాలభూజముంబొడగంటే
చెలువలఁబాసికలఁగుబోఁజుఁ, గులకిదిపెట్టనివిసంబుకువలయనేత్రా. ౨౨.

చ. వెలిఁగెడునింగలంపుజిగిపీసరపుచ్చెడిపూలవంగి; శా
ఖలఁజిఱుగాలియూఁపఁగనుగ్రాలెడిమోదుగుచెట్లచేధరా
జలజదళాక్షియప్పుడెవసంతునిగూడఁగఁగెంపురంగులన్
వెలయుమడుంగుగట్టిననవీనవిలాసినిరీతిభాసిలున్. ౨౩.

సీ. కలహంసరాజముల్ కైవారమొనరింపఁజిగురాకుటెక్కెముల్ చెన్నుమీఱఁ
గలకంఠచయముమంగళనాదమొనరింపఁగడలఁబుప్పొడిదుమ్ముగ్రమ్ముకొనఁగఁ
బరిమళమిళితపుష్పములుతూపులుగాఁగవలిగాలినాదుబేరులుగఁదనర
శారికాకీరముల్ సైన్యనాథులుగాఁగషట్పదంబులుసైన్యసమితిగాఁగ
సన్నిహితబాంధవుండగుస్మరుఁడుతనకు, సలుపసాచివ్యమునుబాంధసమితినేఁచ
సంపెఁగలతేరినెక్కినసంతుఁడిపుడు, దండయాత్రనొనర్చునుత్పలదళాక్షి. ౨౪.

చ. ములుకులుచూతపుష్పములు; మోదుగుపూవిలు; నారితుమ్మెదల్;
నలుపఱుచంద్రుఁడెల్లి; మదనాగముచందనమారుతంబు; కో

యిలుగుమిబట్టువారలుగ నింపెసలారెడు పుష్పబాణునిం
గలసిచరించు నీయలరు కారుపజీరు సుఖంబు నీకిడున్.” ౨౫.

వ. ఇట్లయ్యుద్యానవనింగల వినోదంబులు తనమనోనాయికకుం జూపి తెలుపుచుఁ బ్రస్తావ వశంబున నిట్లనియె. ౨౬.

సీ. “రాజ్యంబు చక్కఁగా రాజిల్లుచున్న దిశాత్రపబాధలేశమును లేక
మహనీయగుణియైన మంత్రీంద్రుఁడబ్బెను బాకవైరికి బృహస్పతియుఁబోలె
విశ్వాసపాత్రులౌ భృత్యులు దొరకిరి రాఘవునకుఁ గపిప్రతతి పగిది
దైవభక్తి నిజనుల్ దనరారిరల్ల రుక్మాంగదు రాజ్యంబు ననుకరించి
సతివి గుణవంతురాలవద్భుతచరిత్ర, వీవు కడుఁ గూర్చు రాణివై యునికి నావు
అరయ నన్నియు దిష్టమేయైన నిపుడు, లోలలోచన! నాకొక్కలోప మొదవె. ౨౭.

వ. అది యెద్దియందు వేని. ౨౮.

క. మలయాలయాధినాథుఁడు, విలసద్గుణుఁ డాశ్రితార్తివిదళనుఁడు కృపా
కలితుఁడు రవికులశశి ప్రో, జ్జ్వలుఁ డొక్కఁడు దనరు చంద్రవర్మయను నృపున్. ౨౯.

ఉ. ఆతఁడు నాకుఁ బ్రాణసఖుఁడౌటను జీవము పోల్కిఁ జూతు; న
న్నాతఁడునట్టులే కను నహర్నిశలొక్కెడఁ జిన్ననాఁడు సం
ప్రీతి భుజించుచున్ శయనవేళల హాయిగ నిద్రవోవుచున్
జేతము లొక్కచందముగఁ జేసి మెలంగిన కారణంబునన్. ౩౦.

క. ఇరువుర మొకగురునికడన్, గురుతరవిద్యలను నేర్చుకొంటిమి; తండ్రుల్
పరలోకగతులుగాఁగనె, యరిగితి మవనీంద్రపదవి నందుటకొక్కై. ౩౧.

గీ. సఖుఁడు మలయాలయమునకు స్వామి యయ్యె, సింహళద్వీపరాజ్యంబు చెందె నన్ను
నాఁటఁగోలెను దవ్వయ్యె నాతిమిన్న! యొకరినొక్కరు కనుఁగొనుచుండు కలిమి. ౩౨.

ఆ. కనులఁ జెలిమి కానఁగనకుండినను బహూ, కృతుల వలనఁ బత్రితతులవలన
నరసికొనుచునుంటి మన్యోన్యసుక్షేమ, మబ్జపత్రనేత్ర! యనవరతము. ౩౩.

ఉ. ఆతని నొక్కసారి యిటకాదరమొప్పఁగఁ బిల్వనంపి; సం
ప్రీతి బహూకరించి, మనప్రేముడినంతయు నుగ్గడించి; వి
స్ఫీతభవద్గుణోత్కరము చేఁ జెలికానికిఁ దృప్తి చేసి; సం
జాతకుతూహలంబునను జానరో! ప్రొద్దులు పుచ్చ నెంచెదన్. ౩౪.

ఉ. ఈయభిలాషమంతయు నిఁకెన్నఁడు తీఱునొ; చెల్మికాని నా
యాయతబాహుయుగ్మమున నక్కునఁ జేరిచి కౌఁగిలించుచున్

హాయిగమాటలాడుకొనునట్టియదృష్టమదెన్నఁడబ్బునో
తోయజనేత్ర! మిత్రునకుఁదుల్యుఁడుమిత్రుఁడెసుమ్ముభూస్థలిన్. ౩౫.

సీ. ఇడుమలబ్బినవేళహితబోధమొనరించియోలమినిగలిగించుఁజెలిమికాఁడు
చిత్తంబుచెడుపనుల్చేయంగఁబాల్పడ్డఁజెప్పిమాన్పించునుజెలిమికాఁడు
కడలేనిశోకసాగరమునఁబడినప్డుచేయిచ్చిరక్షించుఁజెలిమికాఁడు
ప్రాణహానియొకండుప్రాప్తించుతఱిఁదనజీవమైననొసంగుఁజెలిమికాఁడు
ఆలితోడనుబంధుజనాలితోడఁ, దెలుపఁగూడనికందువపలుకులెల్లఁ
దెలుపుఁజెవిచెంతలనుజేరిచెలిమికాఁడు, భువినిజెలికానిఁబోలుబంధువులుగలరె. ౩౬.

క. తలిదండ్రులుమిత్రుండును, దలఁపఁగనీమువురెహితులుతక్కినవారల్
చెలులగుదురుతమలాభం, బులకైలోకంబునందుఁబూర్ణేందుముఖీ. ౩౭.

క. గడియింపవచ్చుఁగనకము, గడియింపఁగవచ్చుమంచిక్రాల్గంటితెగన్
గడియించుటరుదుతనకుం, గడుఁగూరిచిప్రోచుచెలిమికానినిజెలియా. ౩౮.

గీ. మంచిగంధంబుఁబన్నీరుమహితసౌర, భంబుగలిగినపువ్వుచయంబుఁగూడ
శ్రమముడంపఁగఁజాలవుసాహచర్య, సరససల్లాపములఁబోలితరళనయన." ౩౯.

గీ. అనిప్రసంగించుచుండనయ్యవసరమున, వచ్చెనుసుమిత్రుఁగనఁజంద్రవర్మయటకు
రమ్మటంచునువినయపూర్వముగనతఁడు, కమ్మలెన్నియొవ్రాసినకారణమున. ౪౦.

వ. ఇట్లువచ్చిన భూభృచ్చంద్రునిరాక యచ్చటిప్రతీహారులవలననెఱింగి సుమిత్రుండు తన మచ్చెకంటి వెంటరా నెదురువచ్చి యచ్చంపుమచ్చికయచ్చుపడ నెచ్చెలికానిం గ్రుచ్చి కౌఁగిటంజేర్చి యంతిపురికిందోకొని చని వాసుదేవుండు కుచేలునికింబోలె నాతిథ్యంబుఁగావించె. చంద్రవర్మయును విశ్రాంతిపొందిన యనంతరంబ సుమిత్రున్విలోకించి యిట్లనియె. ౪౧.

ఉ. "సేమమెనీదుమట్టలకు? సేమమెనీయనుఁగుంబడంతికిన్
సేమమెనీదుపుత్రునకు? సేమమెనీపరివారకోటికిన్
సేమమెనీదుపాదయుగసేవనొనర్చెడుభృత్యపాళికిన్
సేమమెనీదురాష్ట్రమునఁజేరివసించెడుమానవాళికిన్. ౪౨.

గీ. అరిభయంబులోకించుకపొరయకుండఁ, బ్రజలనందఱబిడ్డలపగిదిఁగనుచు
రాజ్యమేలుచునుంటివెరాజచంద్ర, ధర్మమావంతయేనియుఁదప్పకుండ. ౪౩.

క. హితతంత్రులగుచుమంత్రులు, సతతంబునురాజకార్యసరణిఁదెలిసినీ
మతిననుసరించియుందురె? శ్రితజనసురలోకభూజ! రిపుసంఘాజా! ౪౪.

గీ. వారిధరములువృష్టిసంపాతమునను, భూతసంఘాతమును బ్రోచుపోలికిఁగుజము
లమలఫలములనండజాతౌఘములను, మనుచుక్కైవడిఁజుట్టాలమనుపుచుంటె? ౪౫.

గీ. అలసకారుననెలిఁగెడుకలువదాయ, వలెను వేఁడిమిగలవాఁడిపాలయఁజేసి
జనులవందఱను చితవర్తనమునందు, మెలఁగఁగట్టొనరించితే? మేదినీశ! ౪౬.

క. గర్భంబునరాజిల్లెడు, నర్భకునకుఁదగినసగిదినాహారంబుల్
నిర్భరమతిఁగైకొనియెడి, గర్భిణిగతిఁబ్రజలహితముఁగనుఁగొనుచుంటే? ౪౭.

క. నిరవద్యపద్యగద్యో, త్కరరచనాప్రౌఢులైనకవిసింహంబుల్
నిరతమునీపురవరమునఁ, బరమసుఖోపేతులగుచుఁబరఁగుదురుగదా? ౪౮.

గీ. భూరిధనరాసులున్నయగారములకుఁ, గానసాంతరపర్వతాకరసమస్త
శస్తగోకులమునకురక్షణముజరుగ, బంటెఁదగువారినిల్పితే? భూమిపాల! ౪౯.

ఉ. దారులబాటసారులకుదప్పికఁదీర్పఁగఁజాలినట్టివా
పూరతటాకదీర్ఘికలఁబొల్పుగనిల్పితెయచ్చటచ్చటన్
జోరులుచేరకుండఁగనుశూరులురేలుపురంబులందుసం
చారముసేయుచుండుటకుశాసనముందగఁజేసినాఁడవే? ౫౦.

వ. మఱియు స్వామ్యమాత్యజనపదకోశసైన్య మిత్రదుర్గంబులను రాజ్యాంగసప్తకంబును, సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయంబులను షడ్గుణంబులును, ధర్మార్థకామంబులను త్రివర్గంబును, ప్రభుమంత్రోత్సాహంబులను శక్తిత్రయంబును, నెఱిఁగివర్తింతువే? సత్వరజస్తమోగుణవిశేషంబులు శేషంబులేకుండవిమర్శింతువుగదా? త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులను జ్ఞానేంద్రియపంచకంబును, వాక్పాదపాణిపాయూపస్థలను కర్మేంద్రియపంచకంబును, మనంబునను నేకాదశేంద్రియంబుల వశపఱిచికొని కామోద్రేకకారణంబులగుద్యూతమృగయానారీసురాపానార్థదూషణంబులును, క్రోధోద్రేకకారణంబులగు వాక్పారుష్యదండపారుష్యంబులను సప్తవ్యసనంబులహృదయంబుఁ దగుల నీయక కపటసచివకటుకుటిలవాక్పటలంబులకు లోనుగాక వినయావక్రపరాక్రమక్రమజ్ఞానతంత్రులగుమంత్రులసదుపదేశంబున దైవికమానుషికచింతలనెంతయు సతంతసంబునఁగాలంబుఁబుచ్చుచు నిత్యంబాస్తికచింతనంబునవిస్తులుండవై యశుభనిరాసశుభవిలాసంబులఁగాలంబు సుఖలీలంబుచ్చుచుందువే? ఆవేశవివశుండవు నాత్మస్తుతిపరాయణుండవును గాక నేరములనివారింతువే!" యనవుడు నతని కుశలప్రశ్నముల కన్నింటికిఁ దగునుత్తరంబు లొసంగి సుమిత్రుం డిట్లనియె. ౫౧.

క. “ వెదుకం బోయినతీవియ, పదములకుం జుట్టుకొన్నపగిదిని నిన్నీ
యదను నఁదలఁచుచునుండఁగ, నెదుటం బ్రత్యక్షమైతివీప్సితమడర౯. ౫౨.

గీ. మిత్రరత్నమ! నీవు నామీఁదికరుణ, వఱలవిచ్చేయుటం జేసి పండె నేఁడు
మామకీయపురాకృతమహితసుకృత, మరయ నాభాగ్యమే భాగ్యమవనియందు. ౫౩.

గీ. ప్రాణతుల్యుఁడవగు నీవు పజ్జనిలిచి, కాంచుచుంటను నాదు సౌఖ్యంబు లిపుడు
పూర్ణతవహించె; నానందమున ననుదేలి, యాడుచుండెను నాహృదయంబు సఖుఁడ! ౫౪.

గీ. నిన్నుఁ గన్గొనకున్కి నాకిన్ని నాళ్లుఁ, గన్నుఁగవ వాచెఁ జుమ్మి సంగాతకాఁడ
నాదు సఖి మంజువాణి యీ నాతి మిన్న, నీదు రాకయె తలపోయు నెమ్మనమున. ౫౫.

క. ఈవనిత నన్నుఁ దనకుల, దైవతముగఁ దలఁచి మిగులఁ దాత్పర్యమున౯
సేవించుచుండు, నేనును, జీవము వలెఁ గాంచుచుందుఁ జెలి నెల్లపుడు౯. ౫౬.

సీ. నెక కంటి తలమీఁదఁ జేయి పెట్టఁగవచ్చుఁ గల నేని బొంకెఱుంగ నిదియనుచు
గుడికేగి దీపంబుఁ గొట్టి చెప్పఁగవచ్చు జీవహింస యొకింత చేయదనుచు
నగ్గిగుండైనఁ జేనంటఁగా వచ్చు సోదరులరీతిని గాంచుఁ బరులననుచుఁ
జలువకోఱలనైనఁ జేలుపఁగా వచ్చుఁ గసవు గాఁ బైఁడిసొత్తు గాంచుననుచు
ఘనులుగల దివ్యతరసభాగ్రములనిలిచి, జడువుడిగ నాడికతపత్రమిడఁగవచ్చుఁ
జుట్టములపోల్కి నందఱఁ జూచుననుచుఁ, గ్రమగుణరాశి యీయింతి కైసఖుండ!” ౫౭.

చ. అనితనజాయసద్గుణములాప్తునకున్ వివరించి; యామెవం
కనుదిలకించి యిట్టులనుఁ “ క్రమకురంగవిశాలలోలలో
చన! వినుమీతని౯ గురువు చందమున౯ గృహదైవతంబురీ
తిని బొడగాంచి పూజలనతిప్రమదంబునఁ జల్పఁగావలె౯. ౫౮.

గీ. అడవియు సిరికకాయయుఁ గడలియుప్పు, వలెను మలయాలయమునుండి చెలిమికాఁడు
సింహళమునుండి నేనును జేరినాము, కాశికాపురిఁ జిననాఁడు కమలవదన! ౫౯.

వ. అప్పుణ్యనగరంబున. ౬౦.

సీ. వేదవేదాంగప్రవీణత్వమునఁ జతుర్ముఖులక్ష్యపెట్టని పుణ్యమూర్తి
ఆధ్యాత్మతత్వవిద్యారహస్యంబున శుకమహర్షి నిగేరు శుభ్రయశుఁడు
సకలశస్త్రాస్త్రవిశారదత్వంబున రఘురాము మెచ్చని రమ్యగుణుఁడు
ప్రవిమలనీతిశాస్త్రజ్ఞానమునఁ బుణివిబుధదేశికు మీఱు విబుధవరుఁడు
అఖిలపండితమానసాహ్లాదకరుఁడు, దివ్యవిజ్ఞానపరిహృతాత్మీయశిష్య
హారహృద్గతఘోరాంధకారుఁడలరు, గాలవుండను ఘనుసురాగ్రణియొకండు. ౬౧.

గీ. అత్తఱిని దేశదేశంబులందుఁ దనరు, రాజపుత్రకులెల్లఁ దెంపిరహీని గొల్చి
విద్యలను నేర్చుచుండిరా విప్రుతోడఁ, గఱపుచుండెను ద్రోణులకరణి నతఁడు. ౬౨.

క. ఏమను భక్తినిజనిత, ద్భూమీశ్వరసుతులఁ గూడి పాలుపుగ విద్యల్
నేమమునఁ గఱచితిమి గురుఁ, డామోదము నొంది నేర్ప నజ్ఞాతముఖీ. ౬౩.

సీ. రాచపాఱుండు పూర్వము పఙ్క్తిరథభూమిపాలబాలకులఁ గాపాడినట్లు
వామలూరుభవుండు భూమిజాతనయులఁ బోషగ నికడు వేడ్కఁ బ్రోచినట్లు
సాందీపనామభూభృంవారకుఁడు నందనందనులను గన్నచందమునను
గుంభసంభవుఁడా ప్రజ్ఞడింభకార్జునుల విస్రంభవృష్టిని గాంచి సాఁకినట్లు
మాగురుఁడు మమ్ముఁ బుత్రులమాదిరిగను, గాంచి యామూలచూడంబుగా సమస్త
విద్యలను నేర్పి పరమప్రవీణులుగను, జేసె యని పెనుజుమ్మి రాజీవనయన. ౬౪.

గీ. మా యుపాధ్యాయిని యుఁగూడ మమ్ము మిగులఁ, గనికరంబునఁ గాంచుచుఁ గాలమెఱిఁగి
యోరెమిడు దనుగన్న కుమారులట్లు, పోషణంబొనరించెను బువ్వుఁబోణి. ౬౫.

క. కరుణామృత సంపూరిత, బరిపూర్ణమనస్కుఁడై యుపాధ్యాయులు తా
మిరవుల కనిపెడుతఱిమా, యిరువుర దీవించెనిట్టులిందునిభాస్యా. ౬౬.

క. మురదానవహరవిజయుల, సరవిని మీరనవరతము సఖులై ధరణిన్
జిరముగ నేలుఁడు సౌఖ్యో, త్కరులై జివింత్రు గాక తఱుఁగని మైత్రిన్. ౬౭.

గీ. అనుచు దీవించి యనుపలేకని పెమమ్ము, నాఁటికిని నేఁడు గనఁగల్గె నాదు మిత్రు
సకలబంధుసమాజమీ సమయమునను, వచ్చినట్లు బ్బె నా మది మచ్చెకంటి." ౬౮.

వ. అని యిట్లు తమ విద్యాభ్యాసక్రమం బవ్విద్యుల్లతాంగికిఁ గర్ణరసాయనంబుగ వినిపించి పూర్వాపర కాలవృత్తాంతంబును, బాల్యావస్థయందుపాధ్యాయసన్నిధానంబున నభ్యసించిన యపూర్వవిషయంబులును, శైశవక్రీడావిలాసంబులును, సహపాఠకులతో వినోదవిహారంబు సలుపుతఱిం బ్రవర్తించిన చర్యలును, దలంచుకొని నిరుపమానానందమం దాకినినోలలాడుచుఁ, దదీయసల్లాపములయందెల్లప్పుడు నుల్లాసంబుఁ జూపుచుఁ, బొంతనున్న మంజువాణితోడం గూడ నుడువుచు హాయిగా దినంబులు పుచ్చుచుండి రంత. ౬౯.

గీ. కాలమిట్లు సౌఖ్యకరముగా నొకకొన్ని, నాళ్లు గడవ నొక్కనాఁడు మిత్ర
వంశజుండు చంద్రవర్మ సుమిత్రుని, గాంచి పలికెఁ గూర్మి గడలుకొనఁగ. ౭౦.

క. "అనఘా! మిక్కిలి నాళ్లు, య్యెను నే నిట కేగుదెంచి యేమయ్యెనో నా
ఘనతర రాజ్యము వేగమ, చనవలె సెలవొసఁగఁగదె వైశికకులభూషా! ౭౧.

క. ఎవఁడు యశోభాస్సుఖంబులఁ, దవులునో చెడు నతఁడు కీర్తి తప్పక మాయున్
బ్రవిమలమానస! కలఁబం, ధువులందఱు కేలి సేయుదురు గడవానిన్. ౭౨.

క. తనకుం దనదేశీయులు, తను పగుటను వారిఁ బాసి తడవు గడూరం
బున నిల్వఁదగునె నృపునకు, మనమునఁ దలపోసి చూడుము మిత్రవరా. ౭౩.

గీ. నరులకష్టసుఖములరయక దవ్వుల, నిలిచి స్వేచ్ఛనుండు నృపమహేంద్రు
డుండెనేమి యింటఁ? బండెనేమి చితాగ్ని? ననుచు దూఱుచుందురవనిజనులు." ౭౪.

వ. అనుడు సుమిత్రుండు మిత్రముం బాయంజాలక తత్ప్రయాణంబుడుపనెంచి యిట్లనియె.

ఆ. "నీవు వచ్చి కొన్ని నెలలైనఁగాలేదు, పయనమునకుఁ జమకపడెద వేల?
సచివులున్నవారు సకలంబు నెఱవేర్పఁ, గొన్ని నాళ్లు నిలువు మన్నయిచట. ౭౫.

క. ఈనిలయము నీనిలయం, బీనా సేవకనికాయమెంతయు బత్తిన్
మానక నిను సేవింతురు, భూనాయక! యేమి కొఱంత పొసఁగెను బోవన్?" ౭౭.

గీ. అనుడు మలయాలయాధిపుఁడనియె నిట్లు, "ప్రాణతుల్యుండవగు నీవు పజ్జనిలిచి
యాదరించుచునుండఁగ వబ్బుటెట్లు, లోపమును వదిసింహళద్వీపనాథ. ౭౮.

గీ. అభిజనము దుస్త్యజము గాదెయరసి చూడఁ, గానవద్దంబు చెప్ప కీక్షణమునంద
యనుమతింపఁగదయ్య ప్రయాణమునకుఁ, దడసినను రాచకర్జముల్ చెడును గాదె. ౭౯.

గీ. నెమ్ములకు నీరదములకు నీరజాప్తు, నకును బద్ధంబులకుఁ గల్వలకును నెలకు
నెంతదూరంబొ నెమ్మది నెంచి చూడఁ, జెడియె నే నెయ్యమింతేని! జెలిమికాఁడ! ౮౦.

క. అమడలు దూరమైనను, భూమీశ్వర! హృదయకమలములు దవ్వగునే?
నామదియెచ్చటనున్నను, నీమీఁద నతవిలియుండు నిర్మలచరితా." ౮౧.

వ. అనిపలికి యాతండెంత బతిమాలినను వినక ప్రయాణంబునకుఁ దర్వరపడుచుండ నాచంద్ర వర్ణం గాంచి సుమిత్రుని కళత్రంబగు మంజువాణి మంజులతరవాక్సుధారసంబు చిలుక నల్లన నిట్లనియె. ౮౨.

సీ. ఏవాఁడు నిన్నాదదైవంబుగా నెంచి సేవించుచుండును జిత్తశుద్ధి
నేవాఁడు నీరూపమే ప్రొద్దు దర్శింపవాంఛించుచుండును బరమభక్తి
నేవాఁడు బంధుజనావళిలో నిన్నుఁ బ్రథమగణ్యునిగాఁగఁ బరిగణించు
నేవాఁడు తనబహిర్జీవంబు చందానఁ గాంచుచుండును నిన్ను గారవమున
నెవఁడు సర్వంబు నీవని యెంచుచుండు, నెవఁడు నీసాయమాసించు నెపుడు పోరి
నట్టి చెలికాని మాటఁద్రోయంగఁదగునె, సర్వమెఱిఁగిన నినుబోఁటి సజ్జనునకు. ౮౩.

క. కావునమాగేహంబున, దేవరకొన్నాళులాతిథేయంబును స
ద్భావంబునఁగొనిపిదపం, బోవందగుఁదావకీయపురవరమునకున్. ౧౪.

ఆ. వీడలేకనిన్ను వేవితంబులు వేఁడు, చెలిమికానిమోముచిన్నవోవఁ
బయనమగుటనీకుఁబాడియేజలజాప్త, కులసుధాబ్ధిపూర్ణకువలయాప్త." ౧౫.

గీ. అనుచుఁదనభర్తకోరికననుసరించి, పలుతెఱంగులవేఁడనప్పార్థివుండు
లేమపలుకులకెదురాడలేకనిలువ, నిశ్చయించెనుగొన్నాళ్లునెమ్మినచట. ౧౬.

చ. హరహర! నాఁటఁగోలెవిపదంబుధిముగ్గికలంగుఘోరవా
సరములువచ్చెనాపరమసాధ్వికిఁ, దాఁగడువేడుకొన్నఁద
ద్ధరణిపుఁడిమ్ముకోకతనితన్విమృషాక్తులనిల్చుటన్మనం
బెరిసెసుమిత్రభూపతికినేమనవచ్చునుగాలవక్రతన్. ౧౭.

చ. తనచెలికానియోగ్యతయుఁ, దామరసాననసత్స్వభావమున్
ఘనుఁడుసుమిత్రకుండుచిరకాలమునుండియెఱింగియున్ గటా!
మనుజుఁడుపూనరానియసమానతరోగ్రతఁబాల్పెవారిపై
మనమతితుచ్ఛసంశయనిమగ్నమునొందుటఁజేసియొక్కటన్. ౧౮.

సీ. చంద్రబింబముఁబోనిచెలియముద్దుమొగంబుప్రతిపదిందుండయ్యెఁబ్రభువునకును
బండువెన్నెలఁబోనిపడఁతిచిర్నవ్వువహ్నికీలయయ్యెనుమహీపాలకునకుఁ
దేనియల్ చిలికెడుతెఱవనున్బలుకులుములుకులయ్యెసుమిత్రభూమిపతికి
నతిమనోహరమైనసతిచేష్టలత్యంతతాపహేతువులయ్యెధరణిపునకుఁ
గలికియెడమున్నుకనుపడ్డగరితతనవుఁ, జిన్నెలన్నియునారాజసింహునకును
గటకటా! లంజెజాతిలక్షణములయ్యెఁ, గడనశక్యమెప్రారబ్ధకర్మచయము. ౧౯.

క. పెనిమిటియనుమతిఁదప్పి, తినిబడయుటకొఱకెయామెదినదినమునునా
ఘననియోగఁజూపువినయము, జనపతిహృద్వేదనాతిశయతకునయ్యెన్. ౨౦.

గీ. మునుసుమిత్రకుఁడెంతప్రేమడివఘూటి, మీఁదఁజూపెను, చెలికానిమీఁదనెంత
కరుణవఱపెనొ, యిపుడంతకఠినతయును, నుగ్రతయుఁజూపుఘోరదైత్యుఁడుగమారె

వ. ఇట్లు సుమిత్రుండు మిత్రకళత్రంబులయెడఁ గుమిత్రుండైదురాగ్రహదహనంబు హృదయ గహనంబును దహియింప సహింపంజాలక సహవాసియగు బహుమానుని రహస్యంబుగఁ బిలిపించి యిట్లనియె. ౨౧.

ఉ. "వింటివెచంద్రవర్మ బహువిశ్వసనీయుఁడుమిత్రుఁడంచునా
యింటనుజేర్చినందులకునించుకమంచిఁదలంపకక్కటా!

తుంటరియౌగాదు నాకధికద్రోహ మొనర్పఁగ నెంచినాఁడు వా
ల్గంటి మనంబులోఁ గొనెనిలన్ మఱియిట్టి దురాత్ముఁ డుండునే. ౯౩

క. మిత్రద్రోహం బేయప, విత్రుఁడు గావించువాని విడువక కత్తిన్
గాత్రం బింతింతలుగా, క్షత్రియవర! సలుపవలె దత్క్షణకాలమునన్. ౯౪

వ. కావున నీవు దురితంబని యెంచక యొక్కట యుపకృతి సలుపవలయునది యొద్ది యనిన.

మ. అనఘా! నాదుపరాభవానలము చల్లాఱంగ నీవేళ నీ
వనుమానింపక కాలకూటము తదీయాహారమం దుంచియు
చ్చైనఁటిన్ గాలునిమందిరాంగణమునన్ జేర్పంగదే, నామనం
బున నుత్సాహము సంఘటింపఁగదవే, పూతాత్మ! శీఘ్రంబుగన్." ౯౬

మ. అనిపల్కన్ బహుమానుఁ డెంతయును దూరాలోచనాతత్పరుం
డును, లోకానుభవంబు గల్గినఘనుండున్, యోగ్యుఁడున్ గావనా
తనిసాన్నిధ్యమునందు "వల్లె" యని యుత్సాహంబునం బల్కె నె
మ్మనమం దా చెడుసందియంపునుడి నమ్మం డయ్యె నావంతయున్. ౯౭

వ. ఇట్లు నమ్మక యప్పుడు తానేమి చెప్పినను జారత్వశంకాపంకసంకలితహృత్పంకజుం
డగు నాలంకేశ్వరున కింకను గింక హెచ్చునని యెఱింగినవాఁడు కావున మాఱువలు
కక తత్క్షణంబ మలయాలయక్షితిపతికడకుం జని యిట్లనియె. ౯౮

క. "తనసతి నీయెడఁ జూపిన, వినయమునకు సంశయించి విషమాహారం
బున నిడి నినుఁ బొలియింపఁగ, నను నేమించెను సుమిత్రనరపతి ఖలుఁడై. ౯౯

క. చిరకాలానుభవంబున, ధరణీశ! భవద్గుణాళిఁ దానెఱిఁగియు నీ
కరణి నిదుష్కార్యమునకు, దొరకొనియెను భార్యయెడల దుశ్చింతనుఁడై. ౧౦౦

క. అతిమైత్రి వైరమునకుం, గతమను నానుడిని జంబుకము నీయగుణా
న్విత! చండక్రోధనుఁడగు, నితనికడన్ నిలువనీకు నెగ్గొదవుసుమీ. ౧౦౧

క. లేలెమ్ము కలము నెక్కుము, జాలము సేయంగఁ బోకు జననాయక! నే
మాలిమినైనను నీమల, యాలయమునఁ జేర్తుఁ జెట్టయులవడకుండన్. ౧౦౨

క. ఇటువంటిఘాతుకునిచెం, గట నిల్చుటకన్న ఘోరకలుషము గలదే
తటుకున నఁజను డెంచెదనీ, కొటికకు నను గూడఁ దోడుకొనిచను మనఘా! ౧౦౩

క. ఈపాపాత్ముఁడు పశ్చా, త్తాపంబును బొందుదనుకఁ దాలిమిమై నే
నీపాదచ్ఛాయల నే, లోపము లేకుండ మనెద లుంఠితకలుషా!" ౧౦౪

ఆ. అనుడుఁ జంద్రవర్మ హర్షించి బహుమాను, గుణమునకును మెచ్చుకొని విజానఁ
గలము నెక్కించని యొమలయాలయమునకు, నన్యులెఱుఁగకుండ నర్ధరాత్రి. ౧౦౬.

వ. ఇట్లమ్మహారాజు బహుమానుని సహాయంబున స్వదేశంబుఁ బ్రవేశించి యతనికిఁ దన ప్రధానసచివపదంబొసంగి ప్రాణసఖునిగాఁ దిలకించుచు సుఖంబుగ దినంబులు గడపుచుండె నంత. ౧౦౭.

సీ. అట సింహళద్వీపమందు సుమిత్రుండు బహుమానుఁ డూడనిబాను పెఱిఁగి
కాలఁదాఁచిన భుజంగము భంగి మండుచు సరగున రాణివాసమునకరిగి
తనయుండు కృష్ణుఁడెంతయు వింతకథ యేదొ వినిపించుచుండఁగ వీను లొగ్గి
వినుచున్న మంజువాణిని గాంచి ప్రియపుత్రు నీవలకీడ్చి రాజీవనయిన
యెడల మోపిన నిందను నుడివి తిట్టి, బందిగంబునఁ బెట్టంగఁ బనిచెఁ గొమరుఁ
డావురని యేడు చ్చుచుండ దయావిహీన, హృదయుఁడైతు న్న సంశయ మొదవు కతన.
గీ. చిన్నవాఁడయ్యుఁ గృష్ణుండు కన్నతల్లి, యెడల మిక్కుటమైన ప్రేముడిని గల్గి
యున్న కతమున నా మెకట్లొదవినట్టి, సడికిగుండెలు వగుల విచారమందె. ౧౦౮.

క. జననిం బందిగమునకుఁ, గొనిపోవుడుఁ గృష్ణుఁ డెద దిగులూవడి యో రెం
బును నిదురను డిగి క్రమముగఁ, దను వేదిగ విడువఁదగిన దశకున్వచ్చెన్. ౧౦౯.

తే. అట్లు రాణిని జెఱసాలయందునునిచి, పిలిచి చతురాస్యసత్యసారులను "సూగు
తిరువనంతపురంబునకరిగి యచటి, సత్తిగుడి నున్న యోగిని సరసఁజేరి. ౧౧౦.

క. కలదో! లేదో? ప్రేముడి, కలికికి నామీఁదనరసి కడురయమున రా
వలయు" ననిపనిచి తద్భా, తలపతి తననగరుఁ జేరెఁ దలఁగని చింతన్. ౧౧౧.

వ. ఇట్లుచేరి నిజాంతర్గతంబున. ౧౧౨.

సీ. "గురువులకడ నేర్చుకొని నక్రొత్తడిసుద్దులిం దుకయును మది నెంచవైతి
చిరకాలమునను డివరకీర్తిఁగనిన నాకులగౌరవంబేనిఁ దలఁపవైతి
నరనాథసభల సౌన్నత్యంబుఁగన్న నీగురునిగొప్పని యునరయవైతి
మహితపతివ్రతామణియైన నీతల్లి ఘనతయైనను సుంతగాంచవైతి
వినుపసీలకు నాశించి కనకసౌధ
మునకుఁ జిచ్చిడికొనినట్లు మొనసి తెడ్డు, నాకిశుష్కోపవాసంబు నాశనంబు
చేసినటు తుచ్ఛసుఖమునకాసనొంది, చెఱచుకొంటి వెయిలు వడి చెడిపకాన ౧౧౩.

చ. కరము పవిత్రమైన కులగౌరవముల్ నశియించెఁ బూర్తిగాఁ
బరువును గీర్తియుం జెడిరయుఁ, బాసెవివేకము నాదు నెమ్మదిన్,

దురితమునన్ను నింగితిని, దుఃఖములొక్కటఁ జుట్టుముట్టె, మై
బరువుగఁ దోఁచె నీయదనఁ బాపపులంజెరో! నీకతంబునన్." ౧౧౪.

వ. అని యనేకప్రకారంబులఁ దనమనోహారిణిం దూఱుచుఁ బరితాపభరంబునం గడుం
గ్రాఁగుచుండెనట. ౧౧౫.

ఉ. అంతకుమున్నె గర్భవతియౌటను జేసి సుమిత్రధారుణీ
కాంతుని కాంత కష్టముల గాసిలుచాఁడు నిసుంగు నోర్తున
త్యంతమనోహరాకృతికి నాలయమైతగుదాని శ్రీరమా
కాంతను బోలుదానిఁగనెఁ గక్కసపుం జెఱసాలయందొగిన్. ౧౧౬.

మ. కని గాటంబగు వేఁడినీరుకనులం గ్రమ్మంగ నాబిడ్డ మో
మున నెమ్మోమును జేర్చి "హాతనయరో! మూర్ధాభిషిక్తుల్ మహా
ఘనులౌ రాజుల రాణులుండఁగను నాగర్భంబునం దయ్యయో!
జననంబందితివేల! భావిసుఖముల్ సర్వంబు నాశిల్లఁగన్. ౧౧౭.

గీ. కన్నతల్లిరో! నీవెంత కలుషహీను, రాలవో నేను నైతము నంతకలుష
హీనురాలనె సుమ్మి హా యిట్టినింద, కలిగె నేమందు మత్పూర్వకర్మమునను." ౧౧౮.

క. అని యిట్లు తలమందుచుఁ, దనతనయం జూచికొనుచుఁ దామరసవిలో
చన యూఱటఁగని యెట్టెటో, దినములఁ దా నెట్టుచుండెఁ దేఁకువమీఱన్. ౧౧౯.

ఆ. అంత రాజబంధువగు వక్రచిత్తుని, మందగమన మిత్రవింద; రాణి
కనుఁగఁ జెలిమిబోటి యగుట చేఁ జెఱసాల, కడకుఁ జనియె నామె కన్నెఁ జూడ. ౧౨౦.

వ. చని యామృగమధ్య యయ్యణుమధ్యసాన్నిధ్యంబునకరుగుట యసాధ్యంబని గ్రహించి ద్వారంబుకడ నిలిచి యామెకుపచారంబుసేయ నేరుపఱచిన పరిచారికయగు మాలిని యను లోలలోచనం గాంచి యిట్లనియె. ౧౨౧.

గీ. "కలికిరో! నీవు మనరాణిగారికడకుఁ, జని వినయభయభక్తులాత్మను జెలంగ
నాకు మాఱుగఁ జలిపి వందనశతంబు, పలుకవలయును మద్వాక్యములుగ నిట్లు. ౧౨౨.

గీ. అమ్మరో! నీవు నాయెడ నమ్మకంబు, నిలిపి యొకసారి నీముద్దునిసుఁగు నాదు
వశము చేసితివేని భూవరునికడకు, సులభముగఁ దోడుకొనిపోయి చూపుదాన. ౧౨౩.

క. ఆపాపమొగముఁ గాంచిన, భూపాలుని మనసు కరఁగిపోలఁదిరో! పశ్చా
త్తాపంబునొంది నీయెడఁ, జూపినఁ జూపంగవచ్చు సుంతేని దయన్." ౧౨౪.

సీ. అనవుడు "మీరు చెప్పినపల్కులన్నియు దేవి చెంగటికేగి తెలియఁబఱుతుఁ
దల్లిరో! నేఁటి ప్రాతఃకాలమున నామె తవ చిన్నిబిడ్డపై నెనరుపూని

కొనిపోయి జనపాలకుని పాదములమీఁదఁ బడవైవసాహసించెడుమహాత్ము
రాలెవ్వ తెయు నైననలవడునా? యని చింతను బొందఁజొచ్చినది” యనుడు
సంతసమునొంది “మాలినీ! క్ష్మాతలేంద్రు, పజ్జలవసించి నేఁదనపక్షమునను
ధైర్యమువహించివాదింపఁదలఁచుకొంటి, ననివచింపుము గాణికిహర్ష మెసఁగ.” ౧౨౫.

గీ. అనుడుమాలినివల్కు “నోయలరుబోణి!, యనసరాధినియగు రాణికనవరతము
నుపకృతినొనర్పఁగోరుచునున్న నీకు, నీశ్వరుఁడుశాశ్వతసుఖంబులిచ్చుఁగాత.” ౧౨౬.

గీ. అనుచుదీవనలొనరించి యాక్షణంబ, దేవిగారికిసర్వంబుఁ దెలియఁబలిచి
యామెకైసేసియొసఁగినయనుఁగునిసుఁగు, పెసనుమాలినియుస్మిత్రవింనకిచ్చె. ౧౨౭.

వ. ఆమెయు నా నెత్తురుకందువును బొత్తులలోనిడికొని రాజసభాభవనంబునకువచ్చు చుండ మధ్యమార్గంబునఁ దద్భృత్యయగు వక్రచిత్తుం డెడుసపఢి కలతెఱంగారసి భూపాలుని కోపంబునకు వెఱచి తనతరుణితో నిట్లనియె. ౧౨౮.

సీ. “గగనస్థనక్షత్రగణము రాల్చెడులీలదివిభువిదిర్ద్రిరఁద్రిప్పుకరణి
బ్రహ్మాండనికరంబుఁబగులఁగొట్టెడుభంగిఁబ్రళయకాలానలజ్వాలపగిదిఁ
దిగకొట్టికలఁగాల్చుసెగకంటిపోలికఁదోఁకద్రొక్కినదందశూకమట్లు
కోలఁగొట్టినలేచుకొదమబెబ్బులివలెనంగదనడరుహర్యక్షమటుల
దేహమెఱుఁగక యత్యంతతీవ్రకోప, పరవశుండయియున్నాఁడుధరణివిభుఁడు
భార్యపట్టునవీవామెపట్టినటకుఁ, దోడుకొనిపోవుటెంతయుఁగీడుసుమ్ము. ౧౨౯.

క. కనలునశరీర మెఱుఁగని, మనుజునకుహితంబుఁదెల్పమాను నెతనపూ
నినదుష్టకార్యమును; గా, వునవచ్చటికేగుటుడుగుపూర్ణేందుముఖీ.” ౧౩౦.

క. అని పెక్కువగలఁదెలిపిన, పెనిమిటిబోధంబుసకియ పెడచెవినిడితాఁ
జనియెనురాజసభాంతర, మునకుఙ్ దేవికినిబంధము క్రింజేయుఙ్. ౧౩౧.

వ. ఇట్లు చని క్రమ్ముకొనియున్న జనమ్ములమధ్యమ్మునుండి మార్గమ్ము చేసికొని భూనాథుని పాదసన్నిధానంబునకుం జని యా కందువును దదీయపదారవిందంబులపైఁ బడవైచి యిట్లనియె. ౧౩౨.

క. “క్షితినాయక! చూడుమునీ, ప్రతిబింబంబైన నెత్తుటిపాప మొగంబుఙ్
పతియానను వ్రతయనుగుణ, పతియానునగుభార్య మీఁదపదలుముకినుకఙ్. ౧౩౩.

గీ. జన్మములు వేయుసలిపినజనునికన్న, నలుకదిగఁద్రావువలఁతె రోషాధికుఁడనుచు
వేదములువల్కు లెన్నఁడువినఁగలేదె, రాజవంశప్రదీప! సూర్యప్రతాప! ౧౩౪.

క. చిరకాలవర్ధితంబగు, పరమస్నేహంబువలనఁబడఁతి గొనంబుల్
పరిపూర్ణంబుగ నెఱిఁగియు, ధరణీశ్వర! తుచ్ఛశంకతగు నేనీకుఁ. ౧౩౫.

సీ. ఇంతి నీయానతికి సుమంతవాఁటదుతలపోయుఁగుల దైవతముగనిన్నె
నెఱుఁగదునీకంటెనితరమింకెద్దియునీ మేలె వాంఛించు నిత్యమెదను
మగువనీతోడిదే జగము నియుప్పొంగు నినుఁబాసి నిముసంబు నిలువలేదు
తనవారు నీవారలను భేద మెంచదు కలనైన నీ పేరె తలఁచుచుండు
నట్టిభువనైకపావనినమలమతిని, లేనిజారత్వశంకనుబూనిఘోర
బాధలను బెట్టుటింతయుఁబాడియగునె, యెంతదానను నీకు నే నెఱుకపఱుప. ౧౩౬.

క. కులకాంతమీఁద రిత్తగ, నలుకను వహియింపఁగూడదాయమకన్నీ
రొలికిన సిరి గేహంబున, నిలువదు త్రుటికాలమైన నృపకులతిలకా! ౧౩౭.

ఉ. పండును బోలు కాపురము పాడఱ చేసికొనంగఁ బోకు; భూ
మండలిలోన నీకులము మైలయొనర్పఁగఁ బోకు; పూర్వమం
దుండినకీర్తి పోనిడకు; మోరిమి వవ్వగఁ జోఁపఁ బోకు; నీ
యండజయానఁ పై జలము నందఁగఁ బోకు నృపాలశేఖరా. ౧౩౮.

సీ. తలిరుటాకులఁ బోలుకలికి కేల్దోయి కాకర్కశంబైన శృంఖలయుగంబు
రాజభోజనములు రహి మెక్కు జిహ్వకా యుగ్రకర్మలు మెక్కునోగిరంబు
పద్మంబులను బోలు పాదయుగ్మమున కా పడుకులు దాపిన యొద్దలనడక
సుమకోమలంబైన సుందరాంగముల కా కటకటా గాటంపుఁ గటిక నేల
నీకులవమైన దయ లేదొ నీతిలేదొ, నానయే లేవొ లేకమనం బెచె డెనొ
కాకయుండిననిటువంటి కఠినదండ, నంబునకు నిచ్చగింతు రే నరవరేణ్య. ౧౩౯.

చ. వినువిను మాను మీ తెగువ; వీనులఁ జేర్పుము నాదు పల్కు; ముం
దవయు తీవ్రవేదనలనం దెడు దుర్గతి సంభవించు; నా
మనవిని జిత్తగించి మఱుమాటల నాడక దేవినిఁ బ్రభవ
త్తనయను సత్కృపం గనుమి; తామసముం దిగనాడు మీ ప్రభో." ౧౪౦.

గీ. సుదతి యీరీతి న్యాయనిష్ఠురములాడి, హితముననుడివిన కోలఁది మహీశ్వరునకు
నంతకంతకు నాగ్రహంబతిశయించి, "నిసుఁగుఁదోడ్కొని పొ"మ్మని కసరఁ జాగె. ౧౪౧.

గీ. మిత్రవిందయు సుంతసుమిత్రుఁ నలుక, కులుకకనిసుంగు నెంటిగా నుంచి చనిన
మనసు కరగక పోవునా? యనితదీయ, పదములందిడి శిశువునప్పుడఁతి యేగె. ౧౪౨.

వ. ఇట్లామిత్రవిందసభాభవనంబును బాసి వెడలినతోడన కృపాశూన్యుండగు నానృపా లుండు వక్రచిత్తునిబిలిచి యిట్లనియె. ౧౪౩.

క. "వననిధినిదాఁటియుటని, ర్జనవనమునశిశువువిడిచిసరగునరాదె"
మ్మనవుడువాఁడును "వల్లే", యనెనప్పుడుమంత్రి శేనికనువినయమునన్. ౧౪౪.

చ. "కటకట! నోరులేనిచిఱుకందువుదీనియెడన్ గృపన్ దొలం
గుటతగునయ్య; నాదుపలుకుల్ చెవిఁజేరిచికావుమయ్య; యు
త్కటగహనంబునందిడినఁగ ల్మషమబ్బునుమానుమయ్య; హృ
త్పుటమును గాల్చుకోపమునుబోవఁగఁజేయఁగదయ్యభూవరా! ౧౪౫.

చ. తలఁపకమంచిచెడ్డలుప్రభావముక్రోధముగాఁగఁజూచి; తాఁ
జలుపుడుగర్జమెవ్వఁడువిషాదమునొందును వాఁడుపిమ్మటన్
గలతెఱఁగింపుకారణుకగారవుముంగినిగొట్టిచంపిక
ట్టెలజడిమీఁదఁగన్నవసుధామరు చందమునన్ ధరావరా! ౧౪౬.

వ. ఏలిక కక్కథ వాక్రుచ్చెద దత్తావధానులరై చిత్తగింపుఁడు. ౧౪౭.

గీ. గౌడదేశంబునందొక్క గ్రామమునను, దేవశర్మాభిధానభూదేవుఁడొకఁడు
నిగమజడుఁడుండునతనికిసుగతి నొసఁగు, నందనులులేమికెంతయుఁగుందుచుండె.

చ. అతనివధూలలామసుగుణాన్వితయొప్పను యాజ్ఞసేని; యూ
సతియపత్యకాంక్షనసాటిసెలంతుకలెల్లఁబుత్రసం
తతిఁగనిపెంచుచుండఁగనుదానునుముచ్చటనొందుచున్ సుత
ప్రణతికినైయనారతముపంగుచుచుండెహృదంతరంబునన్. ౧౪౯.

సీ. కనుఁగొన్నయోగిసంఘముపాంతలకుఁబోయి కాళ్లకుడ్డులుపట్టికరమువేఁడి
వేళ్లువెల్లంకులువేమారుకట్టించుకొనుచును జూచినకోవెలలకుఁ
జనిదేవతలకెల్లఁజాగిలిమ్రొక్కుచుఁబోడగన్నదులందుమున్కలిడుచు
భువిలోనలేనినోములనెల్లనోముచుఁగడపుచుండెను గొంతకాలమిట్లు
కలికిపిమ్మటనీశ్వరుకరుణవలన, గర్భవతియయియొకనాఁడుకనియెమదనుఁ
బోనిసౌందర్యశాలినిబుత్రునొకని, దేవశర్మముదబ్ధినిదేలియాడ. ౧౫౦.

ఆ. కనకకనకకన్నకాన్పుగావునవారు, కాలుఱొమ్మునుండిసేలమీఁద
బోవనీకప్రాణములభంగిఁగాంచుచుఁ, బెంచుచుండిరనుఁగుబిడ్డఁజేగి ౧౫౧.

సీ. ఒకనాఁడుబ్రాహ్మణికవాబ్జదళనేత్రబిడ్డను బాలిచ్చిప్రీతితోడఁ
దొట్టిలోనునిచినిద్రబుచ్చియాచ్చోటజీవితేశ్వరునిల్వఁగావలిగను

బొరుగువీథినియున్న పుట్టింటివారిని, గనుఁగొనఁగాఁ గోరిచనియె; నాఁడు
పర్వదినం బౌటఁ బార్థివుకడనుండి, దానమిచ్చుటకు నాహ్వానమొకటి
వచ్చె విప్రునకాతండు బహుదరిద్రుఁ, డగుటనయ్యది గొనఁగఁ గట్టాసపొడమి
యంతదనుకను గాచినయనుఁగుఁగూనఁ, బాసిపోఁజాలకెడఁదనిష్పగిదిఁదలఁచె. ౧౫౨.

గీ. “నేఁటికాలంబునవసుధరానేతవదయ, కలిగె నామీఁదఁ; బండితుల్ పలువురుండ
వారి నెవ్వరిఁ గాదని భక్తితోడ, నాకె యిడ నెంచి వర్తమానంబు పంపె. ౧౫౩.

గీ. జనవిభుఁడు నన్ను భాగ్యవంతునిగఁ జేయ, వలయునని యెడితలఁపునఁ బిలువనంపి
నపుడె నా పాలి దౌర్భాగ్యమవసరమున, కీయసందర్భమును గూర్చె నేమిబుద్ధి. ౧౫౪.

ఆ. ఇంతివచ్చు టెప్పుడేఁ; బోయి దానంబు, పుచ్చికొనుట యెపుడు; పొలఁతి రాక
యున్న నేమి! పోదునన్న నీబొట్టియఁ, గాచువారలెవరుఁ గానరారు. ౧౫౫.

గీ. పోకమానెదనన్నఁ దద్భూవిభుండు, దానమన్యులకిచ్చును దక్షిణంబ
యొకయుపాయంబు దోఁచుచున్నదిపుడు, దాని నొనరించి పోవుటుత్తమము నాకు.

చ. తడవులనుండి పుత్రుని విధంబునఁ బెంచుచునున్న బభ్రువున్
బుడుతకుఁ గాపుగా నునిచి పోయెద”నంచెదనిశ్చయించి యు
వ్వడువున నాచరించి చనెఁ బార్థివచంద్రనిశాంతసీమకున్
వడివడి దానముం గొనెడివాంఛ మహీసురసత్తముండొగిన్. ౧౫౭.

ఆ. మనవువిన్నమీఁద; మైరాజమందిర, మందునిల్వ నాధరామునుండు
అచటఁ గృష్ణసర్పమాతొట్టిచేరుల, గుండఁ బ్రాఁకివచ్చుచుండెఁ దమిని. ౧౫౮.

వ. ఇట్లు తలిమంబున నిదురించు బాలుని పైకివచ్చు కాలసర్పంబును విలోకించి నకులంబు సుకరంబుగా నెగిరి మెడపట్టుకొని తుత్తునియలుగాఁ గొఱికివైచె. ఇట భూసురుండును రాజగృహంబునఁ గాసు వీసంబులం గ్రహించి పుత్రప్రేమ తన్ను త్వరపెట్టఁ బుడమిని మడిమలు మోపక డోలాయమాన మానసుండై మహావేగంబున వచ్చుచుండె నంత. ౧౫౯.

సీ. తనస్వామియైనవిప్రునిపాదశబ్దంబు, బభ్రురాజము చెవిఁబడినయంత
కాలసర్పంబు రక్తంబంటికొన్నట్టి, నోటితోఁ దావచ్చుబాటపొడుగు
నను రక్తబిందువుల్ పెనుకాల్వగా జాఱఁ, దలదువారంబుపొంతలకు నెదురు
వోయి సంతోషంబు పొదల నాతని కాళ్ల, వ్రేళ్లను బడి చాలఁ బెనఁగఁ జొచ్చె
న్నాసురుఁడు రక్తలిప్తముఖంబుగలుగు, నకులమును గాంచి వికలమానసముతోడఁ
దనకుమారునిఁ జంపివచ్చెనని తలఁచి, యిట్టులని యెను దుఃఖంబు పట్టలేక. ౧౬౦.

క. “ పెంచినవిశ్వాసంబా, క్రుంచుకయుఁదలంపకకట ! యీసోయగపుం
జుంచుకొమారునిఁగనికర, మెంచకయోవోసకారి ! యేటుచంపితి వే.” ౧౬౧.

క. అనిదురహంకారంబునఁ, దనచేయువఁదనరు మన్నదండముహస్తం
బునసంకించినకులమును, బెనునిద్దురపొమ్మటంచుబిట్టుగమోదెన్. ౧౬౨.

గీ. మోఁదుశిరమునఁదగులంగముంగిగ్రుడ్లు, వెడలనిడిసేలఁబడివిలవిలనుదన్ను
కొనుచునొకయఱపఱచిగ్రక్కునను జేరె, నసువులుపరిత్యజించియమాలయంబు.

గీ. అట్లుముంగినిజంపిబ్రాహ్మణుఁడుముద్దు, కొమరునిదలంచిగుండియల్ గ్రుద్దుకొనుచు
లోనికినిజనియూయెలలోనఁజెక్కు, చెదరపండఁగనిదురించుశిశువుఁగాంచి. ౧౬౪.

క. ఎలమినిబడిపదపడిఁబొం, తలఁదెగిపడియున్న నల్లత్రాఁచునుగని వి
శ్చలుఁడై యద్భుతమందుచుఁ, గలరూపుగ్రహించిదుఃఖకంధిమునింగెన్. ౧౬౫.

వ. ఇట్లు మునింగి శోకోద్రేకమ్మున నురమ్ము శిరమ్ముఁ గరమ్ము గోరమ్ముగాఁ గరతలమ్మునం గ్రుమ్ముకొనుచు నక్కటకటా! యెక్కడ నెవ్వనికిం గలుగని కలుషంబు తనకు సంప్రాప్తమయ్యెగా యని పెద్దతడవొక్క పెట్టున వెక్కివెక్కి యేడువం జాగె. కావున నేపనియును సావకాశంబుగ విమర్శింపక తమక పడి యొనరింపం జనదు. నా మనవిని విని యీనీయనుఁగు నిసుఁగును నిర్జనవనమున కనుపక కనికరమునఁ గనుఁగొని మనుపుటుచితం” బనవుడు కోపపిశాచావేశపరవశుఁడగు ధరణీశ్వరుం డప్పలుకులు పెడచెవి నిడియె. ౧౬౬.

గీ. వక్రచిత్తుండుదయలేనివాఁడుగానఁ, గటకటా ! కందువనుఘోరకాననమున
విడువఁదలపోసియొకచిన్నపడవనెక్కి, తఱలెధరణీశ్వరునియాజ్ఞఁదలనుదాల్చి.

చ. దురితలతాలవిత్ర! భవదుఃఖమహార్ణవయానపాత్ర! ము
ప్పురపురదైత్యజైత్ర! సురసంయమినిష్కుటచైత్ర! భూమిభృ
ద్వరతనయాకళత్ర! హరిపద్మజవాసవముఖ్యదేవతా
వరనుతిపాత్ర! వైరికులవార్ధిలసద్బడబాగ్నిహోత్రమా! ౧౬౭.

క. కరుణావరుణాలయ! భా, స్కరశశిశిఖినేత్ర! ముక్తికాంతాప్రాణే
శ్వర! చిన్మయవిగ్రహ! దు, ర్భరమృత్యుప్రాణభంగ! వార్ధినిషంగా! ౧౬౯.

క. శాపాయుధపుత్రకహృ, త్తాపహరా! భుజగహార! ధననాథసఖా!
పాపాటవీదవానల! తాపత్రయహరణ! పండితస్తుతచరణా! ౧౭౦.

గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర కౌశికసగోత్రపవిత్ర జయంతికులకలశార్ణవరాకాకైరవమిత్ర భావనారాయణపౌత్ర రామనార్యపుత్ర వేంకమాంబాగర్భశుక్తిముక్తాఫల శ్రీమదాకుండివ్యాసమూర్తిదేశిక పదసేవాపరాయణ భావనారాయణప్రణీతంబయిన సుమిత్రచరిత్రంబునం బ్రథమాశ్వాసము.

శ్రీ శివార్పణమస్తు.

---

శ్రీరస్తు.

శ్రీభీమలింగాయనమః.

# సుమిత్రచరిత్రము

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీమజ్జయంతిరామఘ, రామరహృత్కమలకర్ణికాంతరభృంగా!
కామమదభంగ! దాక్షా, రామపురీభీమలింగ! రమ్యశుభాంగా! ౧.

వ. దేవా! యనంతర కథావిధానంబును సావధానంబుగ నవధరింపుము. ౨.

ఆ. వక్రచిత్తుఁడట్లు వనసీమ కేగను, మిత్రభూధవుండు మెలఁతయుసలఁ
గరుణమాలికులటగా నిశ్చయము చేసి, కొన్నినాఁడు గాసఁ గ్రుంగుచుండెను. ౩.

ఉ. దైవతవాక్యరత్నసముదాయముఁ దేఁకఁగ నేగి సత్ప్రియా
సేవకులైనఁ బట్టణముఁ జేరక పూర్వమె యోర్మిమాలి రా
జీవదళాక్షి సాధ్వి నసుశీలవిమర్శ మొనర్పరచ్చకుల్
భూవరుఁ డీడిపింపఁ దనబుద్ధిఁ దలంచెదు రాగ్రహంబునన్. ౪.

ఆ. తలఁచి చెంతనున్న తనసేవకులఁ జూచి, "చెఱను బెట్టఁబడిన చెలియ నిటకుఁ
దెండ" నంగవారు "దేవ! హసా" దని, కదలి యుపవబందిగము సకరిగి. ౫.

సీ. పెనుమల్లి పంజరంబునఁ జిక్కి తపియించు, రమణీయ రాజకీరంబు పగిదిఁ
గాకకులాయసంగతమౌచు వెతలొందు, సలువంపు బాలకోకిలము లీల
నెఱని పాదుండు పన్నిన వాగుసలఁ దగు, లొక్కని సోక్కు కలరవాంగనవితాన
మొగిలి పూఁదుష్కృగ్రమ్ముకొనంగ నే తెన్ను, తెలియక యల్లాడు తేఁటి పోఁత
బందిగంబున నున్నట్టి పరమసాధ్వి, మంజువాణిని దుఃఖసముద్రగ్నహృదయ
నిరపరాధినిఁ గనుఁగొని నెమ్మనముల, నలజడిని బొందు చిట్లని తలఁచి రపుడు. ౬.

చ. "కటకట! కన్నకూఁతునకుఁ గల్గినదుర్గతి నాలకించి; హృ
త్స్ఫుటమును గాల్పశోకశిఖి; మూర్ఛ మునింగి యొకింత సేపు; ప
న్మ్మటఁ దెలివొంది మాటికి నిమాటికి హా! సుతయంచు నేడ్చు నీ
కుటిలశిరోజ నెట్లు సభకుం గొని పోవుదమం" చు నాస్తులై. ౭.

గీ. చిత్తముత్రూఁతలూఁగని శ్చేష్టులగుచు, "ధారుణీశ్వరునాజ్ఞనుదాఁటెనేని
ప్రాణహాని" యటంచునుభయమునొంది, కమలపత్రాయతాక్షిచెంగటికినేగి. ౮.

క. కనుఁగవనీరొలుకఁగవం, దనములనతిభక్తిఁజలిపి "తల్లీ! నిన్నున్
జనవిభుఁడుత్రోడిచెన్మనె, ఘనదోషంబెదియొయోలగంబుననరయన్. ౯.

క. అమ్మాటలీపెపోల్లవి, తప్పునసెమ్మదికినాఁటఁదరుణియు "హా దై
వమ్మా!" యనియాక్షణమున, సొమ్మసిలెన్ దుర్భరాతిశోకముకతనన్. ౧౦.

ఆ. ఇట్లుసొమ్మసిల్లియెలనాగతనయంత సేదతేఱిరాజసేవకులను
గాంచి "యన్నలార! కమలోద్భవునిగీఁత, దాఁటవశమె" యనుచుఁదరలేనబల. ౧౧.

ఆ. ఇట్లువెడలితనదుపట్టికిసంప్రాప్త, మైనచెడుగుతనదుమానసమున
కప్పుడుజ్ఞప్తివచ్చియాయమ్మకడుపుడు, కునకుఁదాళవేకకుందెనిట్లు. ౧౨.

గీ. "భవ్యసంపదలకునాలవాలమైన, యొకమహారాజగృహమునసుద్భవించి
మిగులగోముగఁబెరుగంగఁదగిననిన్ను, నడవినడలంగలిఖియించెనావిధాత. ౧౩.

చ. తనయరో! తావకీయముఖతామరసంబునుగాంచినంతనే
మనమునఁగోపతీవ్రమణుమాత్రమయేనియుఁదగ్గునే మొనిన్
గనినయనుంగుతండ్రికని; క్రన్ననఁబంచితిఁగానియిట్లుహా
వనములపాలుసేయుననిభావమునందలపోయనైతినే. ౧౪.

సీ. దరిలేనిదుఃఖసాగరమధ్యమందున్నఁ, జెఱసాలలోఁబడిచివుకుచున్న
ఘోరాపదలుచుట్టుకొనివేపుచున్నను, వ్యాఘ్రములాక్రొటవచ్చిపట్టుకొన్నఁ
గడుపారఁదినఁగూడుగలుగకయున్నను, జూడఁజుట్టములేకసొలయుచున్న
భర్తనాపైనెంతపగఁబూనియున్నను, నిందలెన్నియొవచ్చినెత్తిఁబడిన
వేమహావస్తువునుజూచియేనుశోక, మపఁచుకొనుచుంటినావస్తువక్కటకట!
యడవిపాల్సేసితివెదైవమా! యిఁకెట్లు, మేనజీవంబులనుదాల్చిమెలఁగుదాన." ౧౫.

వ. ఇట్లు సాకారయగు శోకదేవతయుంబోలె రాజసభాభవన ముఖద్వారంబు సమీపం
బునకువచ్చి నిలువంబడియె. ౧౬.

ఆ. అపుడుతనదుదేశమందలిపెద్దలు, సచివచయముబంధుసముదయంబు
నిండియున్నసభనునీరేజదళనేత్ర, నిలువఁగట్టుచేసినృపవరుండు. ౧౭.

చ. కొలువుననున్నవారిఁగనికోమలితప్పును దెల్పియారయన్
వలెననికోరె; నత్తఱినివారిజపత్రవిశాలనేత్రయా

దలఁదగవాంచి నేరమె పోతానొనరించినదానికై పడిన్
నిలిచెను వారిఁదీర్పు వినినిర్భరదీనముఖాంబుజాతయై. ౧౮.

వ. తదవసరంబున. ౧౯.

ఆ. తిరువనంతపురికి దేవతావాక్యంబు, తేఁబనిచిన భటులు తీవరముగ
వచ్చి తత్సభాగ్రభాగంబునను నిల్చి, మానవేంద్రునకు నమస్కరించి. ౨౦.

ఆ. ముద్రవైచి మిగుల భద్రంబుగాఁ దెచ్చి, నట్టి జాబు తత్పురాధిపతికి
గౌరవముగ నొసఁగి కరములు జోడించి, యొక్కమూల నిలిచి యొదిగి వారు. ౨౧.

గీ. అప్పుడు సుమిత్రధరణీశు నాజ్ఞఁ బొంది, సభికుఁ డొక్కఁడు విడఁగొట్టి జాబుముద్రఁ
గొలువువారలు వినునట్టు లెలుఁగు నెత్తి, చదువఁదొడఁగెను దద్వాక్యసరణి నిట్లు. ౨౨.

సీ. "నిరపరాధిని సాధ్వి నిర్మలచారిత్ర, మహితగుణశ్రేణి మంజువాణి
నిష్కళంకుండతి నిశ్చలచిత్తుండు, సత్యసంధాఢ్యుండు చంద్రశర్మ
యాలోచనాపరుండగు బహుమానుఁడే, నికఁ గంపు భృత్యుండు నృపవరునకు
జారత్వశంక నిష్కారణంబుగఁ బెట్టు, కొనినకూళ సుమిత్రజనవిభుండు
అడవి విడువఁబంపఁబడిన ముగ్ధలబిడ్డ, దొరకకున్న యెడలదుఃఖమునను
గడుఁగృశించి తుదకుఁ గడతేఱు సింహళ, క్ష్మాతలేశ్వరుండు సంతులేక." ౨౩.

చ. అని చదువన్ సుమిత్రవసుధాధిపుఁ డానుడులించుకేని యున్
మనమున విశ్వసింపక సుమానము నొందెను మంజువాణికిన్
ఘనముగఁ గూర్చు నెచ్చెలులు గాటపు లంచము భృత్యకోటికిన్
య్యనని డియీకుతంత్రమహాహా! కలిగించిరటంచు నెంతయున్. ౨౪.

క. తన సందియమెల్ల సభా, జనములకుం గూడ వినిచి జననాయకుఁడ
వ్వనితామణి నిఖిమర్శన, మొనరింపఁగఁ దక్షిణంబ యుత్తరువొసఁగెన్. ౨౫.

ఆ. అపుడు చూచువారలందఱు నిర్విణ్ణ, చిత్తులగుచు రాచచెలియఁ గాంచి
"పరమసాధ్వికెంత దురవస్థ కలిగెహా!", తరమె కాలగతి నిదాఁటుటకును. ౨౬.

క. తొలిబాముల నొనరించిన, బలుకీలలం గలుగుఫలము పడయక యుండన్
దలమే నొసటన్ గన్గల, బలియునకేన్ విధికి నేనిఁ బద్మాత్మునికేన్." ౨౭.

వ. అని యనేకవిధంబుల విచారించి. ౨౮

సీ. "దగ్ధదైవమ! నీకుదయరాదె యిసుమంత, కోమలిపై" నని గోలుగువారు
"నిర్దోషురాలిపై నేరంబు మోపెనీ, దుర్మార్గుఁడ" నుచును దూఱువారు

“ వెఱఁగుసందియ మొందువిభునకుజనియించె, నకట! యేమనవచ్చు” ననెడువారు
“ న్యాయాధిపతులైనన్యాయంబుపరికింపఁ, గలరొ? లేరో?” యనికలఁగువారు
“ ముందువెనుకలుచూడకతొందరపడి, దండనముచేసితేనియుఁదప్పకుండఁ
బాతకముసిద్ధమ” నుచునుబలుకువారు, నగుచుఁజూపఱుగుసగుసలాడిరంత. ౨౯.

మ. ఒకభృత్యుండరుదెంచికన్నుఁగవనీరొల్కంగదౌవారిక
ప్రకరంబున్వడిఁద్రోసికొంచుధరణీపాలోత్తమాంఘ్రిద్వయిన్
వికలాత్ముండయిమూర్ఛనొందెజనముల్నిశ్చేష్టులైచూడ: నా
యకులుందత్తఱపాటుతోడనిదియేమంచుంబ్రశంసింపఁగాన్. 30.

వ. ఇట్లు మూర్ఛిల్లి కొంతవడికిం దెలివొంది నోటనొకపట్టున మాటరాకయెట్టకేల కెలుం
గుదెచ్చుకొని యిట్లనియె. 3౧.

శా. “ భూపాలాగ్రణి! కృష్ణుఁడాత్మజననిన్మోమోటలేకీవుదు
ష్కోపావేశమునన్విమర్శసలుపంగొంపోయి నావన్నియా
పాపంపుంబలుకాలకించి; యెడఁదన్బల్మాఱులజ్జించి; సం
తాపంబాత్మదహింపనైమఱచి; ప్రాణంబుల్త్యజించెన్వడిన్.” 3౨.

చ. అనవుడుమంజువాణిమదినారటమందుచుగర్భశోకమా
త్మనువివశంబుచేయఁగనెధైర్యముసర్వముదూలి “ హాసుతా!
ననువిడనాడిపోయితివె, నాయవమానముచూడలేక, యే
మనివిధిదూఱుదాననికహాసుకుమార! కుమారరత్నమా! 33.

గీ. పూర్ణచంద్రునిబోలునీముద్దుమోము, కలువలనుమేలమాడునీకన్నుదోయి
కనకకాంతులహసియించుతనువిలాస, మకట! నేఁజూడకెట్లోర్తురాకుమార! 3౪.

ఆ. నిన్నుఁగనకయున్ననిముసంబునాకొక్క, యుగమువలెనెతోఁచుచుండునయ్యయొ!
మేనువాసినీవుమీఁదిలోకంబున, కరుగనెట్టులోర్తురాకుమార! 3౫.

సీ. తల్లి! యటంచుఁజెంతకునల్లఁజనుదెంచి, కూరిమిమైఁబల్కువారలెవరు?
వీనులుసోఁగియుంగవింతవింతలకతల్, గారాబమునఁజెప్పువారలెవరు?
సంగాతకాండ్రతోడంగూడిమాడియొ, య్యారంబుగానాడువారలెవరు?
నీతండ్రియొడిలోననెమ్మిమైఁగూర్చుండి, పద్యముల్చదివెడువారలెవరు?
నేత్రములశోకజాశ్రువుల్నిండుకొనఁగ, మాటిమాటికినిన్నెంచిమఱుగుచుండు
ధాత్రినెవరూఱడింతురుతండ్రి! నీవు. భవ్యదేవేంద్రలోకనివాసివైన. 3౬.

క. అల్లారుముద్దుపలుకుల, నుల్లంబునకుత్సవంబునొదవింపఁగదే
చల్లంబలుపవెకనుఁగవఁ, నల్లనఁజెంగటికిసరగనరుదెంచిసుతా ! ౩౭.

క. పోలునుబోం దెలుఁగకభూ, సాలుఁడునను బందిగమునఁబడ వైచిననో
బాలక ! నిన్నుంగనుఁగొని, తాలిమి మైదుఃఖమునకుఁదాళితితండ్రీ ! ౩౮.

సీ. కిసలయమ్రదిమంబుహసియించునీమేని, సోయగంబిఁక నేఁడెఁజూతుతనయ !
అమృతంబుగురియునీయందంపుఁబలుకుల, వీనులనిఁక నెందువిందుఁబుత్త్ర !
చింతాంబునిధిలోనఁజిక్కి పొక్కెడువేళ, నేర్పుఁబోకను వారలెవరుకొడుక !
నిద్దంపుఁబండువెన్నెలఁబోలు నవ్వునఁ, దాపమెవ్వరడంత్రుతనఁగుమార !
హారఘనసారతారకర్పూరములను, జల్లఁదనమునిరసించుసరవి నెవరు
కౌఁగిలింతురు రానుఁగన్నతండ్రి ! యీవవిచ్ఛిన్నపదవికి నేగితేని. ౩౯.

ఉ. ఎవ్వరివేఁడుకొందు, పరులెవ్వరునన్నిఁక నాదరింతు, రిం
కెవ్వరునాకు దిక్కు, మఱియేగతి జీవములన్ భరింతు, హా !
యెవ్వరుతాపమాఱుపుదు, రీశ్వరుఁడిట్లు దయావిహీనుఁడై
నెవ్వగపాలు సేయుటకు నిన్నుదివంబునఁజేర్చెఁబుత్త్రకా ! ౪౦.

గీ. వీఁడులంజియకుదయించినాఁడటంచు, నూఁడుతెల్లఱు వ్రేలెత్తి చూపకుండఁ
దనువుదిగనాడి సుఖివైతె యనుఁగుఁగుఱ్ఱ, నే నెయీఱడికోరిచి నిలిచియుంటి." ౪౧.

చ. అనిపలవించి "హాతనయ ! హాతనయా ! తనయా ! " యటంచు రో
దనమొనరించుచున్ వగకుఁదాళఁగఁజాలక మూర్ఛవోయెన
జ్జనవిభుభార్య, దుఃఖమున సభ్యులు నిల్చిరిబొమ్మలట్లు, క
న్గొనలనుశోకజాశ్రువులనూనముగాఁ బ్రవహింపసత్త్రతిన్. ౪౨.

చ. తనసుతుఁడిట్టులీల్గెనను దారుణవార్తను మిత్త్రుమానసం
బునశోకవాఁడి నారసపుఁబోటు వలెన్ దగులంగ భార్యపైఁ
గనికరమించుకంతగలుగంగను దత్పరిచారికావళిం
గనుఁగొని పల్కెఁ గన్నులను గ్రమ్మెడునశ్రులఁ గ్రుడ్డిఁగ్రుక్కుచున్. ౪౩.

క. "చెలులార ! మీరలిప్పుడు, చెలిఁదోడ్కొనిపోయి వెలికిశీఘ్రంబుగనీ
తలకృత్యములొనరింపఁగ, వలె" ననవుడు వారలెల్ల "వల్లే" యనుచున్. ౪౪.

క. కొనిచనిరిరాజచంద్రుని, వనితామణి నవ్వలికి నివసుధావరుఁడున్
దనయుని గొనములెంచుచుఁ, దనభృత్యునిఁ జూచిపలుకుఁదరుగనివగతోన్. ౪౫.

గీ. “తనువుదిగనాడి స్వర్లోకమునకుఁ జనుచుఁ, దనయుఁడేమనె నూతనతండ్రి నెంచి
తెలుపుమ” నవాఁడు కనులనీరొలుకుచుండఁ, బార్థివేంద్రునిఁ గనుఁగొని పలికె నిట్లు.

ఆ. “దేవ! నీసుతుండు దివికేగునదనునఁ, గనులనీరుఁ దెచ్చికొనుచు నీకుఁ
దెలుపుమనుచుఁ గొన్ని పలుకులానతియిచ్చెఁ, జిత్తగింపుమయ్య చింతమాని.” ౪౭.

ఆ. “నీదురాగ్రహంబు నీదుసందేహంబు, వదలి యింక నైనఁ బరమసాధ్వి
యైన నాదుతల్లి నవమానపఱుపక, కరుణఁ జూడుమయ్య కన్నతండ్రి! ౪౮.

ఆ. నీదుకోపమునకు నేబలియగుచుంటి, నిక్కమింక నాకు నీళ్లువదలి
శాంతినూని తేని చాల మేలగుఁగాక, యున్న వంశనాశ మొదవునయ్య.” ౪౯.

వ. మఱియుం దల్లితోడం గూడ నిట్లు తెలుపుమనియె. ౫౦.

క. “ననుమఱచిపొమ్ము నాకై, వనటంబడి క్రుంగఁబోకు పార్థివుమదిలో
ననుమాన మేదుదనుకను, దనువున జీవములు నిల్పు తాలిమిఁ దల్లీ!” ౫౧.

వ. అని పలికి మిమ్ముందలంచి పలు తెఱంగుల పలవించి పలవించి శరీరంబు విడిచె నని తెలుపు
చున్న సమయంబున. ౫౨.

ఆ. మిత్రవింద వచ్చి నేత్రగోళకముల, నశ్రుజలము కాల్వలగుచుఁ బాఱ
క్ష్మాతలేంద్రు పాదజలజాతముల మీఁద, వ్రాలి యిట్టులని యొవంతమిగుల. ౫౩.

క. “ధరణీశోత్తమ! తావక, సరసీజదళాయతాక్షి సంతాపంబున్
భరియింపఁజాలక క్కట!, సురలోకముఁ జేరెఁగనఁగ సూనుని” ననుచున్. ౫౪.

క. ఆపలుకులెల్ల విని ధర, ణీపాలాగ్రణి మనంబు నీరై పశ్చా
త్తాపంబు నొందఁజొచ్చెను, “గోపంబున నింత తెచ్చుకొంటి” నటంచున్. ౫౫.

ఆ. మంజువాణి; సాధ్వి; మహితగుణాన్విత; నిరుపమానచరిత; నిర్మలాత్మ;
దోషరహిత యనుచుఁ దోఁచె సుమిత్రుని, నెమ్మనమునకిపుడు నిశ్చయముగ. ౫౬.

ఉ. కానక కన్నగారవపుఁ గందువొకండును నీగ్గెఁ, బుత్రియున్
గానకుఁ బంపఁగాఁబడియెఁ, గావున సామె లభింపకుండినన్
దానన పత్త్యుఁడై కెడయు దారి నిజంబుగఁ దోఁచఁబట్టి భూ
జానికి నమ్మకంబొదవె వెస్వాంతమునందల వేల్పుపల్కులన్. ౫౭.

ఆ. తాను బెట్టు వెతకుఁ దాళంగఁజాలక, మానసంబు కలఁగి మగువ మిన్న
తనువు విడిచె ననుచుఁ దలఁచి సుమిత్రుఁడు, క్రొమ్మనెంచి యిట్లు కుందఁ జాగె. ౫౮.

క. “నినుఁబోలు పరమసాధ్వికి, ననుపమచరితకును నిర్మలాత్మకుఁ గీడుల్
పొనరింప సాహసించిన, చెనఁటికి నాకేల తనువు? ఛీ కాలుప నే. ౫౯.

గీ. ఉవిదరో! నీపురవ్వకునోర్వలేక, పాపకర్మునిజడునినన్బాసియయ్యయో !
కలుషభూయిష్ఠమైనభూతలముఁవిడిచి, భూరిసుఖదంబుస్వర్గంబుచేరినావె. ౯౦.

సీ. కలనైననొకయీఁగకాలంతనామాటజవదాటియెఱుఁగవుచంద్రవదన !
యొకసారియైనవేడుకకునునాతోడఁగలహింపనొల్లవుకమలనయన !
మిన్నొక్కపెట్టునమీఁదనుబడినను ధైర్యంబువిడువవుతలిరుబోణి !
మెడలమీఁదనుగత్తియిడినప్పుడైనను గల్లలుపలుకవుకంబుకంఠి !
బధిరపంగ్వంధభిక్షుకవ్రాతములను, రక్షణమొనర్తువరసికార్తస్వరాంగి
నన్నుఁబోలిననిర్భాగ్యునకునునిన్నుఁ, బోలినపొలంతినిలుచునా ? పూవుబోణి. ౯౧.

గీ. చిరతరంబుగనీగుణోత్కరమునెఱిఁగి, యుండియును గాలవశమున నొదవిశంక
కటకటా ! రిత్తయాఁడికట్టితినని, నన్నువిడనాడిపోతివేనాతిమిన్న." ౯౨.

క. అనితనయాలిగుణోత్కర, మును మాటికిఁదలఁచిపొగిలిభూపతియంతన్
దనయునిమరణముహృద్వే, దనమొనరింపంగనిట్లుతల్లడపడియెన్. ౯౩.

గీ. "హాశరత్కాలపూర్ణహిమాంశువదన !, హాయనర్ఘ్యావతంసమా ! హాకుమార !
హాయనుఁగుపట్టి ! నిన్ననన్యాయముగను, జంపికొంటిని నావంటిజడుఁడుగలఁడె. ౯౪.

ఆ. హాకుమార ! తల్లికబ్బిన నువమాన, మునకుఁదాళలేకపొగిలిపొగిలి
జీవములనువిడిచిచేరితే ! స్వర్గంబు, పరమనీ మనన్నువదలివైచి. ౯౫.

సీ. ఏకడఁగాంతురాయిందుబింబముఁబోనిమురిపెంపునీముద్దుమొగముఁదనయ !
యేవంకవిందురాయెదతేనెచక్కెరపలుకుమించిననీదుపలుకుఁగుఱ్ఱ !
యెన్నఁడుచేర్తురాయెలమినాహృదయసంపుటమెల్లనిండఁగౌఁగిటనుదండ్రి !
యెప్పుడుగలుగురాముప్పిరిగొన్నమోహముననీచెక్కుముద్దాడఁబట్టి !
పల్లవంబులఁబోనినీపాదయుగళి, బంగరుపుఁజిఱుగజ్జియల్ పరిఢవిల్ల
దండనల్లననడయాడుచుండఁగన్నుఁ, గవతనియ నేఁడుఁజూతురాకన్నతండ్రి !" ౯౬.

గీ. అనుచునందనుఁదలపోసివనటనొంది, మాటిమాటికిఁదలదోర్చిమనుజవిభుఁడు
శోకశిఖిచిత్తమునుజుఱచుఱనుగాల్పఁ, దాళఁజాలకమూర్ఛిల్లెఁదత్క్షణంబ. ౯౭.

ఆ. అపుడుమిత్రవిందయవనీశునకుశీత, లోపచారవిధులనొయ్యఁజలిపి
తెలివిగలుగఁజేసిపలికెనాతనిహృదం, తరమునకునుతెస్సఁదాఁకునట్లు. ౯౮.

సీ. "సతిననువ్రతనట్లువెతలపాల్సేయుటకానికర్జముసుమ్మిమానుమంటి
నీప్రతిబింబమైనెగడుచున్ననిసుఁగుముద్దుమోమైనఁజూడుమంటి

నిక్కంబునీమదికెక్కుడువఱకైనఁదాలిమివహియించితాళుమంటి
ననుపమగుణహారమునకు మేరువువోనిపెనఁగుకొంచెమెడందనిలువుమంటి
దురితమొదవునంటిఁ, బరువుపాడగునంటిఁ, గీర్తిపూర్ణముగను గెడయునంటి;
వంగసంపుఁబెంపువఱదపాలగునంటి, వెడఁగుకినుకనడఁచి వేయుమంటి. ౧౯.

ఉ. కొంచియమైననాదుపలుకుల్ చెవిఁజొన్పకతామసంబునన్
జంచలనేత్రనాగతినిసభ్యులమ్రోలకుఁదప్పనాకయీ
డ్పించిదురంతకష్టములఁబెట్టితి, పుత్రునిజంపికొంటి, శో
కించుటచేఁబ్రయోజనమొకించుకగల్గునె ధారుణీధవా! ౨౦.

క. నేరెఱుఁగనిపసికందువు, నేరము నీకేమిచేసె నిష్కారుణుఁడవై
ఘోరవనంబునకనిపితి, క్రూరా! యిక్కొలనుబాపికొననేరుదువే. ౨౧.

క. కన్నకుమారునిఁగెడపితి, చిన్నినిసుఁగునడవిపాలుచేసితివకటా!
యన్నులమిన్ననుమ్రింగితి, మన్నదొరా! వగవనేల? మనుమిఁకసుఖివై. ౨౨.

ఉ. ముద్దులమూటగట్టుచిఱుబొట్టియబొత్తులలోననిల్పి, నీ
యొద్దకుఁదెచ్చి, కాళ్లపయినుంచి, కృపారసదృష్టిఁజూడుమం
చొద్దికవేఁడ నాపలుకునొక్కటియుంజెవిఁజొన్పకక్కటా!
పెద్దపులుల్ చరించువనిఁబెట్టఁగఁబంచితి నిర్దయుండవై. ౨౩.

ఉ. బందిగమందుఁదల్లినిడి, బాధలుపెట్టుచునున్నవార్తనీ
నందనుఁడాలకించినయనంబులనశ్రువులోడ, నెంతయుఁ
గొందలమంది, నిద్దురయుఁగూడునుఁవీడెనటంచుఁదెల్పనీ
డెందముహా! కరంగన, కడిందివిచారమదిప్పుడేటికే. ౨౪.

క. కడచినపనులకువగచుట, కడువడినీరఱినపిదపఁగట్టిడుటయునో
యొడయఁడ! యొఱపులతెఱఁగడ, జడికింపానెప్పఁగకెడఁదసైరణఁగనుమీ." ౨౫.

వ. అని యిట్లు ప్రభువనిచూడక తెగనాడు నమ్మగువం బొడగని సుమిత్రధరిత్రీ కళత్రుం
డు నేత్రంబులం జాఱు కన్నీరు చీరచెఱంగునం దుడిచికొనుచు నిట్లనియె. ౨౬.

క. "జారత్వశంకయనియెడు, క్రూరగ్రహమొకఁడుపట్టుకొనివేపఁగనీ
ఘోరంబుసంభవించెను, నారీమణి! నన్నుదూఱినను ఫలమేమీ! ౨౭.

ఆ. నాదుదుష్కృతంబునన్నట్లుబాధింప, నీవునొవ్వనాడనేల వెలఁది!
పూర్వజన్మకృతముపొందకతీఱునే, హరునకైనఁజక్రధరునకైన. ౨౮.

శా. క్రూరున్ రావణుఁ జంపి తెచ్చినసతిన్ గుంభింప్రియానంగటా !
పౌరుం డెవ్వఁడొ పల్కుపల్కువలనన్ బాపంబునా కొక్కటన్
ఘోరారణ్యమునం గుడించుమనెఁగా కృత్స్నాబ్ధిపుత్రేందుఁడౌ
శ్రీరామక్షితినాయకుండు వెడఁగే సీమంతినీరత్నమా ! ౭౯.

చ. పరమపతివ్రతామణిని భార్యను నిద్దురఁ జొక్కియున్న సుం
దరిని మహావనాంతరమునన్ విడనాడి తదీయవస్త్రము
ద్ధురగతిఁ జించి, తాల్చి బహుదుఃఖమునం జనియెన్ నలక్ష్మమా
వరుఁడు వివేకశూన్యుఁ డెటువాలయుశత్రవిశాలలోచనా ! ౮౦.

క. తొలిబాముల నొనరించిన, కొలలన్నియు నొక్కపెట్టుగను మిగూడి వెతన్
గలిగింపఁ జివరకిట్టులె, పొలఁతిరో ! వేళావిశేషమునవచ్చుఁ జూమీ. ౮౧.

ఉ. అట్టివిపత్తు వచ్చుసమయంబునఁ దెల్వి వనప్రదేశముం
బట్టును, మిత్రులాడు హితవాక్యము లించుకయేని నీనులం
బట్టవు, తుచ్ఛశంకలను భావమున శారదమేఘతుల్యమా
బిట్టుగ నింద పాలగును బిమ్మట మానవుఁ డంబుజాననా ! ౮౨.

గీ. ఇది మదీయ పురాకృత మేల నన్ను, నిందచేసెడ” వని పల్కి నృపవరుండు
సతికి సుతునకు దహనసంస్కారవిధులు, జరుపనుత్తరు వొనరించి సభను విడిచి. ౮౩.

ఆ. అంతిపురికి నేగి యడవిని విడువంగఁ, బడినతనయుకొఱకు పుడమిపైన
విడువ నెంచి మిగుల వెతలను గుందుచు, నెట్టుచుండె దినము లెట్టులెట్టొ. ౮౪.

ఆ. అచట వక్రచిత్తుఁ డా నావపై రాజ, పుత్రితోఁ బ్రయాణమును బొనర్చి
కొంతదూరమరుగ ఘోరసమీరణా, సార మొకటఁ బట్టఁ జాగెనపుడు. ౮౫.

సీ. గగనంబునంటు వృక్షగణాగ్రనికరంబు లవనీవధూటి ముద్దాడుచుండె
నొండొంటితోఁ బ్రమాఁకు లూరయుచుండుటను ఘూమమ్ము నల్దిక్కులఁ గ్రమ్ముకొనియెఁ
బలుతెఱంగుల వాయువులు పెనుధూళి దండాకారమున మింట నలముకొనియె
శరనిధి వీచికోత్కరశీకరంబులు మేఘోదకముతోడ మేళమాడెఁ
గురిసె వడగండ్లు చినుకులఁ గూడి, పిడుగు, లడరియున్నతవస్తుల హతము చేసె
వక్రచిత్తుండు వడవడ వడఁక నావ, యిచ్ఛ వచ్చిన చందాన నేగుచుండె. ౮౬.

వ. అంతకొంతవడికా సమీరాసారంబు తగ్గుటం జేసి యక్కలంబు చంద్రవర్మరాజ్యంబు
చేయు మలయాలయ ప్రాంతంబున నొక్క కాంతారంబు చేరువ తీరంబుఁ జేరె
నప్పుడు వక్రచిత్తుండు. ౮౭.

గీ. ఆపురనియేడ్చుచున్ననయ్యనుఁగనిసుఁగుఁ, గనికరముమాలితద్ఘోరకాననమున
విడిచితానెక్కివచ్చినపడవమీఁది, కతిరయంబునఁజనుచున్నయవసరమున. ౭౮.

గీ. పొంతఁబోదఁబొంచియున్నట్టిపులియొకండు, వచ్చిపైఁబడియాదుష్టుమచ్చమాపె
ధారుణీశునికడుబెట్టిదంపుటాజ్ఞ, తానుచేసినకతమునదండనముగ. ౭౯.

సీ. రాజేంద్రుచెంతకురమణిశిరోమణితనయనుంగుకొమార్తెనుపుతతెని
నవరత్నమయభూషణంబులఁగైసేసితులలేనిపట్టుదుస్తులనుదొడిగి
యనిపెననంతరంబునవక్రచిత్తుండువిపినాంతరంబునవిడుమవేళ
నొకయాకుపసరుననొకకాగితముమీఁదఁబ్రస్ఫుటంబుగవ్రాసిప్రమతియనుచుఁ
జీరకతికించిచనియెనాచీటియందె, ఘనతరాన్వయసంజాత, కాలవశత
వచ్చెదుర్దశయనికూడవ్రాసెఁ, గాని, యక్షరంబులఁబోల్పవీలబ్బదయ్యె. ౮౦.

వ. తదవసరంబున. ౮౧.

ఉ. గొల్లఁడొకండుదవ్వులనుగోవులమేపుచువక్రచిత్తుఁడా
పిల్లనుడించిపోవుటయు, బెబ్బులివానినిరూపుమాపుటల్
తెల్లముగాఁగనుంగొని, యతిత్వరితంబుగనేగి, [illegible]సం
ధిల్లఁగఁగౌఁగిటంబొదివితెచ్చెనునైజకుటీరసీమకున్. ౮౨.

గీ. తెచ్చితనముద్దుటిల్లాలికిచ్చిసుఁగుఁ, దనకుదొరకినచందంబువినిచిపలుకుఁ
“గలికిరో! దీనిఁగడుపునఁగన్నబిడ్డ, కన్నమిన్నగఁబొడగనికావవలయు. ౮౩.

సీ. పరిపూర్ణచంద్రబింబముఁబోలునెమ్మోముకలువపూవులనేలుకన్నుదోయి
పగడాలఁదెగనాడుజిగిమీఱువాతెఱతిలపుష్పమునుబోలుకలికిముక్కు
శరదిందుకౌముదినిరసించుచిఱునవ్వుబిందంబునందంబుచెందుగళము
నిద్దంపుటద్దంపునిగ్గునవ్వెడుచెక్కులపరంజిహసియించునట్టిమేను
కనఁగనొకభాగ్యశాలినిగర్భమందుఁ, బొడమినదనుంగుగాఁగనఁబడుచునున్న
దతివ! దీనినిబ్రాణంబుప్రాణమట్టు, లారులకంటనుబడకుండనోముమీవు.” ౮౪.

క. అనవుడు “వల్లే” యనియు, వ్వనజాయతపత్రనేత్రప్రమతినిప్రేమం
బునఁజూచిపెంచుచుండెను, దనకడుపునఁబుట్టినట్టితనయతెఱఁగునన్. ౮౫.

ఉ. వల్లవవల్లభుండధికభాగ్యముతోడలభించినట్టియా
పిల్లనుదాఁచఁగావలసెఁబేదటికంబొకఘోరశత్రువై
పెల్లుగఁదన్నుఁగష్టములఁబెట్టుటచే, నదికారణంబుగాఁ
బల్లియపీడియొండెడనివాసముసేయఁదలంచెనెమ్మదిన్. ౮౬.

వ. ఇట్లు తలంచి యొక్కనాఁడు తనహృదయేశ్వరిం బిలిచి రహస్యంబుగ నిట్లనియె. ౯౭.

చ. "మనకు ననేకరత్నమయమండనసంఘము తోలభించెనీ
యనుఁగునిసుంగు, దీని నెరులారసి చేనియుఁగీడుమూఁడుఁగా
వునమతియొక్కపల్లియకుఁబోయి సుఖించుట మేల" టన్న న
వ్వనితయు భర్తయానతికి "వల్లె" యనెన్ గడుభక్తి పెంపునన్. ౯౮.

వ. ఆకాలంబున. ౯౯.

క. మలయాలయరాజ్యమునకుఁ, దలమానికమనఁగఁ దనరితఱుఁగనిసికులన్
జెలువైయనంత సేనము, పొలుచున్ భూరమణినుదుటిబొట్టోయనఁగన్. ౧౦౦

క. ఆపురముచెంతలక్ష్మికిఁ, గాపురమైతనరుకొట్టికకుఁజనియటనా
గోపకుఁడొకగృహముంగొని, కాపురముసుజలుపుచుండెఁగౌతూహలినై. ౧౦౧.

గీ. ఇట్లు కాపురముండి వ్రజేశ్వరుండు, ప్రమతి భూషలఁగొన్ని విక్రయమొనర్చి
పశువులను గొనితనసాటివారిలోనఁ, గలిమిబలుములమిక్కిలిఘనతకెక్కె. ౧౦౨.

గీ. పార్థివతనూజఁ దనముద్దుపట్టివలెనె, కాంచి పెంచుచునుండెను గాని సుంత
తెలిసికొనఁజాలఁడయ్యెను దెలివమిన్న, సింహళద్వీపనాయకశిశువటంచు. ౧౦౩.

వ. ఇట్లత్యంతానురాగంబునఁ బెంచుచుండ నా రాజపుత్రి శుక్లపక్షక్షపాకర బింబంబు
డంబున దినదినప్రవర్ధమానయయ్యె నంత. ౧౦౪.

సీ. కొదమతుమ్మెదదిమ్మునదలించు నెఱికురుల్ కనుబొమ్మగవతోడఁగునిసియాడెఁ
దెలితామరలకు నెచ్చెలికత్తియలఁబోనికనుదోయి నునుసిగ్గుగడలుకొనియెఁ
జక్కెరపలుకుల నెక్కసక్కియమాడుపలుకులఁ బ్రౌఢత్వమలమికొనియెఁ
జివురుసోయగమెన్ను చెలువంపుఁగెమ్మోవి పగడంపుజిగులను బరిహసించె
నారుచీమలబారు నేరఁజాగెఁ, దళతళత్కాంతి చెక్కులదలముమీఱె
నడలు రాయంచ బెడఁగును నవ్వఁదొడఁగెఁ, వనజనయనకు నూత్నయౌవనమునందు ౧౦౫.

క. సింగారము రూపూనిన, భంగిని, దొలుకరిమెఱుంగుపరతెంచిధరి
త్రిం గొఱలిన తెఱఁగున, న, య్యంగన వఱలెన్న వీనయౌవనమందున్. ౧౦౬.

ఉ. ఆరమణీలలామము వ్రజాలయమం దభివృద్ధి నొందియున్;
వారలకన్న విద్యలనవారిగ నేర్వకయుండియున్, ధరి
త్రీరమణాబ్జలోచనలతీరున రూపవివేకవైభవో
దారత నొప్పె నైజగుణతత్త్వము మాఱునె యేడనుండినన్. ౧౦౭.

క. ఆమెనుజూచినమనుజులు, భూమీశ్వరదివ్యసౌధములనిలఁదగుక
న్యామణియేలాకొ గొల్లల, సీమలవసియించెననుచుఁజింతింతు రెవనన్. ౧౦౮.

వ. అట్లు జవ్వనంబుననివ్వటిల్లు నాపల్లవపాణిని గొల్లండిల్లు కదలనీయక యెల్లతెఱంగులనరయుచుఁ, దగినవల్లభు వెదకి విక్రయింపశేషించిన యాభరణంబు లరణంబుగా నొసంగి పరిణయంబుసేయ నిశ్చయించుకొని యుండెనప్పుడు. ౧౦౯.

చ. చెలువునమీనకేతనుఁడు, శిష్టజనస్తుతిపాత్రుఁ, డంచితో
జ్జ్వలగుణరత్నభూషణుఁడు, పాపవిదూరుఁడు, ధైర్యసారసం
చలితసువర్ణభూధరుఁడు, సత్యవచోనిధి, రామవర్మనా
నలరుసుతుండొకండుమలయాలయభర్తకుఁజంద్రవర్మకున్. ౧౧౦.

శా. ఆతండొక్కదినంబునందుమృగయావ్యాసక్తిమై నేగుచున్
బ్రాతఃకాలమునన్ వ్రజాలయముఖద్వారప్రదేశంబునన్
బ్రీతిన్గాంచెనుబూర్ణచంద్రవదనన్, బింబాధరోష్ఠిన్, గుణ
స్ఫీతన్, గోకిలవాణి, సింహళమహాద్వీపాధిరాట్పుత్రికన్. ౧౧౧.

మ. కనియాశ్చర్యమునొంది "యిట్టికలికిన్, గార్తస్వరాంగిన్, లస
ద్వనజాతాయతపత్రలోచన, శరత్పర్వేందుబింబాననన్,
వనితాలోకశిరోమణిన్, గుణవతిన్, బంధూకబింబాధరన్,
ఘనవేణిన్, గరిణీమనోజ్ఞగమనన్, గన్గొంటిమే యెవ్వడున్. ౧౧౨.

క. నెలఁబోలుమోము, క్రొందే, నెలఁబోలుసువాక్యగరిమ, నెలఱాబలుతి
న్నెనఁబోలుంబిఱుఁదులు, చి, న్నెలగనియగునీమెఁబొగడనేర్చునెవిధియున్. ౧౧౩.

ఆ. గుణమణీరజంబుఁగూర్చిశృంగారంపు, రసమునందు, వలపులెసఁగుమలయ
పవనుఁగూడఁజేర్చిపలుమాఱుమర్దించి, స్రష్టయీమెసృష్టిసలుపఁబోలు. ౧౧౪.

ఆ. మోముచందమామ మొగిగెల్వవెనుదన్ను, నిరులనంగసోఁగకురులుదనరు
నధరబింబమనకునాసించివచ్చిన, చిలుకలనఁగముద్దుపలుకులలరు. ౧౧౫.

ఆ. వనితసోయగంబువర్ణింపఁదిలకింప, జిహ్వలొక్కవేయిశేషునకును
గనులువేయిదివిజకాంతునకొసఁగంగఁ, బోలుపలుకుపూవుబోణిమగఁడు. ౧౧౬.

సీ. అమృతాంధసులకైననలవిగానిఫలంబుగోపకుల్ వసియించుకోటికఁబొడమె
రతియైననతిభక్తినుతిచేసిపూజింపఁదగినవేలుపుగొల్లతెగలమెలఁగెఁ
జక్రవర్తులమనస్స్పర్శకైననుజాలురత్నంబువ్రజమందిరముననలరె
రాజేశ్వరులకందరానిపదార్థంబువెడఁగుగొల్లలమందవెలసెనేఁడు

ఏమహాత్మునకబ్బు నోయీ మెఁగలసి, యీ జవంజవసుఖములననుభవింప
వాఁడె సుకృతాత్ముఁడరయంగ వానిగృహమె, భూతలస్వర్గమని చెప్పఁబోలునహహ.

ఉ. ఔరవిధాత! నీమహిమ మద్భుత మేమనవచ్చు, నిట్టియో
య్యారిఁ ద్రిలోకసుందరి ధరాధిపదివ్యనిశాంతసీమలం
జేరుపకేల చేర్చితివి సీ! యొకగోనగృహాంగణంబునన్
భూరిరుచిం జెలంగు మణిబూదిని దాఁచినయట్టులక్కటా!" ౧౧౮.

ఆ. ఇట్లుమగునసొగసు నెంతయుఁగొనియాడి, మరుఁడుగురియుకుసుమశరములకును
నిలువలేక మోహజలధినిమగ్నుఁడై, తనయెడంపనిట్లు తలపఁదొడఁగె. ౧౧౯.

ఉ. "ఏల సమస్తసంపద? లిఁకేటికి రాజ్యము గీజ్యముల్, క్షమా
పాలనముల్, సువర్ణమయభవ్యగృహంబులు, నిష్కుటంబులున్?
వేలుపువాలుగంటులను వేమఱు సోయగమం గుమించు నీ
బాలిక కౌఁగిటం దనుపు భాగ్యము దైనముకల్గఁ జేసినన్. ౧౨౦.

ఉ. నేఁడిమి మాపితండ్రినను వేమఱుఁదిట్టి పరిత్యజించినన్
వాడలవాడలం గలుగు వారుదిసంతులు గొట్టినవ్విన్
జాడ లెఱింగి బంధుజన సంతతి మాటికి రవ్వ చేసినన్
వీడఁగఁజాల మోహమును వీసమయే నియునీ వెలందిపై." ౧౨౧.

చ. అనితలపోసి తానొకధరాధిపపుత్త్రుఁడ నిట్టినీచపుం
బనికెటుచొత్తునంచు నులవంబును సంశయమందకాఁ బ్రజాం
గనను బరిగ్రహింపఁగడకట్టొనరించి బితానగొల్లమా
డ్కి నిజనసెంచె, నీచమును గీచము దేటికిఁగామికారయన్. ౧౨౨.

వ. ఇట్లు చన నిశ్చయించి, వేఁటతమి న్వెనుకఁబడి యప్పుడు తన్నుంగదిసిన పరివారం
బున కుచిత సత్కారంబులొనరించి యధ్యై మిషలంగల్పించి వారివారియగారంబుల
కనిపి యనంతరంబ. ౧౨౩.

సీ. చెలువంపు సరిగంచు జిలుఁగు దుప్పటి చుట్టి కేలఁ బిల్లంగ్రోలు గీలుకొలిపి
నెమ్మిపించెము భూషణమ్ముగాఁ దలఁదాల్చి చెవిదమ్మిలకి సొలనివహమునిచి
మొగమునసొగసు గామృగనాభి సవరించి సుమహారవితతి వక్షమునఁ జేర్చి
భుజములఁ గురువింద పూసపేరులు గట్టి గడితంపుఁ గోలకక్షమున నిఱికి
రాచచిన్నియ తెడలించి రామవర్మ, గొల్లఁడై వచ్చెఁ బ్రమతిఁ గన్గొనెడు వేడ్కఁ
దన్నుఁ జూచెడు పాయంపుఁ దలిరుబోండ్లు, విరివిలుతుఁడొక్కొ యనికడు వింతపడఁగ.

వ. ఇట్లువచ్చిన కుమారాగోపాలుని రూపంబునకా వృద్ధగోపకుం డాశ్చర్యంబునొందుచు నిట్లనియె. ౧౨౫.

ఆ. "ఎవరివాఁడవయ్య! యెచ్చోటికేగెదు? నామమెద్ది? నీవునళినబాణుఁ
డేమియగుదురయ్య! యెఱిఁగింపు"మనవృద్ధ, గోపకునకురాచకొమరుఁడనియె ౧౨౬.

సీ. "వల్లవబాలుండ; భద్రుండునాపేరు; మలయాలయేశ్వరుమందిరమున
నాలగాపరులపైనధికారినైయుండునాతండుప్రాణంబురీతినన్ను
గారాబమునఁజూచికన్నకుమారునికరణినెల్లప్పుడుకాచుచుండు
రాజసూనుండగురామవర్మకునాకునాతఁడేనేననునంతమైత్రి
యిప్పుడారాజనందనుఁడిచటివనికి, వేఁటకుదేరనలసినేవిశ్రమింప
వచ్చితి"నటన్నవృద్ధగోపప్రభుండు, వేడ్కనొందెఁదదీయసద్వచనమునకు. ౧౨౭.

గీ. ఇట్లువేడుకనొందివ్రజేశ్వరుండు, ప్రియకుమారికఁబ్రమతినిబిలిచిపలుకుఁ
"దల్లిరో! భక్తినతిథిసత్కారమిపుడు, సలిపికృతకృత్యురాలవైవెలయు"మనుడు.

సీ. అడుగుదామరలకెంపందందుఁబొలసికుంకుమువన్నెపూసినకొమరుదాల్ప
నొడలిచక్కనిబాజులడరిగోడలుతిన్నియలుపొన్నలందినయట్టులలరఁ
గనుచూపుమించులక్కజముగాఁబర్వముఁగలవిరుల్ చల్లినపోలుపుదెలుపఁ
గ్రొవ్వెదజిగిమీఁదకునురేఁగినీలిదువ్వలువమేల్కట్టుచెల్వమునుబడయఁ
గలికిముసిముసినగవువెన్నెలలుగాయఁ, బ్రమతిచనుదెంచెనారాచకొమరుకడకుఁ
జక్కఁదనమిట్టులేనీదుసదనమునకుఁ, గలుగఁజేసెదమందనితెలుపుపగిది. ౧౨౯.

వ. ఇట్లు పితృశాసనంబునం జనుదెంచి భూలోకమన్మథునిలీలం గ్రాలున్నపాలబాలకుం గాంచి యత్యద్భుతరసాక్రాంత హృదయారవిందయై తనలోఁ దానిట్లని వితర్కింపం దొడంగె. ౧౩౦.

క. "కందర్పుఁడో త్రిదశేంద్రుని, నందనుఁడో చంద్రుఁడో నలకూబరుఁడో
డెందములరించునీతని, యందంబువిలాసవతులకందఱకుబళే. ౧౩౧.

ఆ. ఇతనిఁగలసిమెలసియెల్లప్డుసంసార, రాజ్యభోగములనురహినిదేలు
వారిజాక్షిపుణ్యవైభవంబేపుణ్య, వైభవంబువేయుపలుకులేల" ౧౩౨.

గీ. ఇట్లుతలపోసియాశరదిందువదన, తనదుకులదైవతంబుచందమునఁగాంచి
నతిథిపూజలొనర్చెనత్యధికభక్తి, రాజపుత్రుండుకుతుకవారాశిఁదేల. ౧౩౩.

వ. ఇట్టులా కాముకీకాముకులకుఁ బ్రథమదర్శనసమయంబున నె బద్ధానురాగంబు సిద్ధించు టం జేసి పృథ్వీవరకుమారుండు భద్రనామకుండై ప్రచ్ఛన్నవేషంబునఁ దదీయఘోషాంగనానిలయంబునకుం జని దినదినంబును బంధుత్వగౌరవంబు నెఱపుచు. ౧౩౪.

సీ. ప్రాచీనరాజన్యబలశౌర్యగాథల నొగిఁ జెప్పి యలరించు నొక్కనాఁడు
పిల్లనగ్రోవి మోవిని బూని పాడి యుత్సాహ మొదవించు నొక్కనాఁడు
అత్యంతనీతిదాయకపు సుద్దులు వల్కి సాక్కించుమక్కువ నొక్కనాఁడు
మందపైఁ గవియు దుర్మార్గజంతులఁ జంపి యక్కజం బొదవించు నొక్కనాఁడు
పెద్దపులిజున్ను తెమ్మన్న వెఱపు లేక, తెచ్చి ప్రియపూర్వకంబుగ నిచ్చి వేడ్క
యొదవఁ జేయును నెమ్మది కొక్కనాఁడు, ప్రమతిపై మోహమున నధరావరసుతుండు.

గీ. భద్రుఁ డించుక సేపు కన్పడక యున్న, విరహవేదనఁ దపియించు వెలఁది మిన్న
ప్రమతి యించుక సేపు కన్పడక యున్న, విరహవేదనఁ దపియించు విభుసుతుండు. ౧౩౬.

క. వారలయనురాగము నక, పారము దంబుధిని జేలివల్లవుఁ డాసిం
గారంపుంగనిఁ దనికిఁ, గూరిమి నొసఁగంగఁ దలఁచుకొ నెనుల్లమునన్. ౧౩౭.

వ. ఇట్లు తలంచి "యింద్రోత్సవానంతరంబున పరిణయప్రయత్నంబులు గావింతు"మని తనదేవేరికి తెలింగించె. ప్రతిమయుఁ దల్లి వలన నీసమాచారంబు విని డెందంబున నానందింపు మండెనంతనట.
౧౩౯.

గీ. ఇల్లు పట్టక తనపుత్రుఁ డిచ్చ వచ్చి, నట్లు తిరుగుచు నుంటయు నవిశ; యొక్క
దివసమున నిద్దురను "ప్రమతీ" యటంచుఁ, గలువరించుటయును గనికలఁగి నృపుఁడు.

గీ. బంటులను బిల్చి తనపుత్రువర్తనంబు, నరసిరండనవారును నపుడు కదలి
సర్వము విమర్శ గావించి చంద్రవర్మ, పాలికేతెంచి యిట్లని పల్కఁ దొగిని. ౧౪౦.

గీ. "ధరణినాయక! నీయాజ్ఞ తలను దాల్చి, మాఱువేసాలతో డఁగుమారు వెంటఁ
జనితిమాతండు గోపవేషము ధరించి, క్రోశదూరంబునందున్న ఘోషమునకు. ౧౪౧.

క. చని యొక జంగిలి పొంతం, దనరారెడు నొకరసాలతరురాజముక్రిం
ద్దను గూరుమండి యారెలుఁ, గనఁ దనలోఁ దా నెయిట్లు గొణఁగం దొడఁగెన్. ౧౪౨.

సీ. "నీమొగంబను నిండు నెలను గన్గొనకున్న నతివరో! పరితాపహరులెట్లు
నీనవ్వుచిగురు వెన్నెలలు సోఁకక యున్న మదనాంధకారంబు మాయు టెట్లు
నీముక్తామోవి తేనియలఁ గ్రోలక యున్న విరహవిదాహంబు విడు టెట్లు
నీనిండుకౌఁగిట నెమ్మిఁ జేర్చక యున్న వలకాఁకబలుధాకవదలు టెట్లు

నీదువచనామృతంబును నాదుచెవులఁ, జిలుకకున్న నుదేహంబునిలుపు టెట్లు
పసగునను వచ్చి కడుపునఁబాలువోసి, రక్షణము సేయు వేళర ద్రాజవదన. ౧౪౩.

ఆ. లేమ! చెంతనీవులేనిక్షణంబొక్క, యుగము వలె నెతోఁచు చుండు నాకు
నీవు చెంతనున్న నెలలెల్ల క్షణముల, పగిదిఁదోఁచు చుండు మగువ నాకు. ౧౪౪.

క. నినునమ్మితినీదాసుఁడ, నను వేఱుగఁజూడఁబోకు నళినదళాక్షీ!
నను డెంచిసరగ నిచటికిఁ, గనుఁగవకుత్సవ మొనర్పఁగద వేయబలా! ౧౪౫.

వ. ఇట్లు పలవించి పలవించి కన్నకన్నట్టివారి నడుగుచున్న యవసరంబున. ౧౪౬.

ఆ. తనశరీరకాంతిధరణీరుహములకుఁ, బసిఁడిపూఁతపూయఁబడఁతియొకతె
వచ్చిరాచకొమరుఁగ్రుచ్చికౌఁగిటఁజేర్చి, కుస్తరించిత్రోడుకొనుచుఁజనియె. ౧౪౭.

క. రమణియునీకొమరుఁడుప్రియ, తమముగమాటాడువాక్యతతి నెటెఁగితిమా
విమలాబ్జనేత్రనామము, ప్రమతియనందనహనర్థవంతంబగుచున్. ౧౪౮.

వ. అట్లయ్యుత్తమనాయికానాయక రత్నంబు లరిగిన యనంతరంబ తత్ప్రదేశ సంచారు లగు గోపకుమారులం బిలిచి యడుగ నీ "ప్రమతి" యొకవల్లవపల్లవపాణి యని యును; నీభద్రుండు భూపాలుని కీలారుల కేలికయనియును నుడివి"రన. భూరమ ణుండు వారలనగారంబుల కనిచి బహుమానునిం బిలిపించి తనసూను నివృత్తాంతం బాద్యంతంబును వినిపింప నతండును "మధువ్రతోత్సవంబు సమీపించుచున్నయది గావున నచ్చటికి గొల్లలు తమయిల్లాండ్రతోడను; బిల్లలతోడను; నరుదెంతురు. అప్పుడు నిగూఢవేషంబున మనము నుబోయి కర్తవ్యమరయుద"మన నమ్మహీశ్వరుండు సమ్మతించె. ౧౪౯.

ఉ. శ్రీకర! సుప్రసాద! సరసీజభవార్చితదివ్యపాద! సు
శ్లోకశివావినోద! శ్రితలోకసదావనమోద! భక్తహృ
ద్వ్యాకులభంగ! ఘోరతరదానవలోకతమఃపతంగ! ద
ర్వీకరరాజహార! సువివేకిమనోంబుజబాలభాస్కరా! ౧౫౦.

క. విషధరనికరవిభూషణ!, విషమశరప్రాణహరణ! వృజినవిదళనా!
విషరుహరవిశశిలోచన!, విషరుహదళనేత్రబాణ! విద్విడ్దహనా! ౧౫౧.

క. శాపాయుధబాలకహృ, త్తాపహరా! సవనభంగ! ధరణిశతాంగా!
తాపసహృదబ్జభృంగా!, కాపురుషోన్మదవిభంగ! కంధినిషంగా! ౧౫౨.

గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర కౌశికసగోత్రపవిత్ర జయంతికులకలశార్ణవరాకాకైరవమిత్ర భావనారాయణపౌత్ర రామనార్యపుత్ర వేంకమాంబాగర్భశుక్తిముక్తాఫల సకలబుధజనసేవాపరాయణ భావనారాయణప్రణీతంబయిన సుమిత్రచరిత్రంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీభీమలింగార్పణమస్తు.

---

శ్రీరస్తు.

శ్రీభీమలింగాయనమః.

# సుమిత్రచరిత్రము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీవేంకమాంబికాకృత, సేవాపరితృప్తహృదయ! శ్రితసుమనస్సం
భావితపదకమల! మహో, దేవా! భీమేశలింగ! దివ్యతరాంగా! ౧.

వ. దేవా! యనంతరకథావిధానంబు సావధానంబుగ నవధరింపు మట్లు బహుమానుండు పలికిన పలుకులకియ్యకొని మలయాలయేశ్వరుండు శక్రోత్సవసమయంబు ప్రతీక్షించుచుండె. ౨.

గీ. అంతనొకనాఁడు వల్లవులమరనాథు, నుత్సవము సేయ సమకట్టి యూరిబయలఁ
బొదలు భూధరరాజంబు పొంతకరిగి, సలుపుచుండిరి పూజలాసమయమునను. ౩.

సీ. ఆనందరసపూరితాంతరంగములతో సారెకుఁ ద్రుళ్లుచుఁ గేరువారు
కులము వారలతోడఁ గూడి బంతులు సాగి కూర్చుండి విందులు గుడుచువారు
తమభార్యలకుఁ బ్రియతమమైన వస్తువులెలమిని గొని తెచ్చి యిచ్చువారు
ఔమ్ముతప్పెట్లనాదమ్ము పిక్కటిలంగ వ్రజిపై గీతముల్ పాడువారు
కొమ్ముబూరలు గొని యాకసమ్ము వగులు, నట్లు గానూఁది సంతోసమందువారు
పద్మదళనేత్రు సుద్దులు పలుకువారు, నగుచు వల్లవులుత్సాహమందుచుండ్రి. ౪.

సీ. దధిదుగ్ధముఖపదార్థముల చే బృందారకాధీశు జలకంబులార్చువారు
గ్రావజాచరణరాజీవద్వయంబు హృజ్జలజంబులను నిల్పి కొలుచువారు
ఘనఫలాహారముల్ గొని వచ్చి గాలిగంగలకిచ్చి ప్రస్తుతుల్ సలుపువారు
భూసురాశీర్వాదములకు నానందించి భూరిదక్షిణలిచ్చి మ్రొక్కువారు
దర్శనాగతవిబుధసంతతికి నగ్గ, విధిని గౌరవమొనరింపవేచువారు
హితజనాళికి బహుమతులిచ్చువారు, నగుచు సంతోషపరవశులైరి వ్రజులు. ౫.

గీ. పటకుటీరసమీపభూభాగమునను, వఱలు శాడ్వలతలమున వ్రజకుమారు
లాడుచుండిరి తలిదండ్రులధికకాంతు, కమున విస్తారితాత్ములై కనుచునుండ. ౬.

వ. ఇట్లు వల్లవులెల్లను మహోల్లాసంబున సురవల్లభునుత్సవంబు జరుపుచున్న సమయంబున. ౭.

సీ. కొప్పుననలరారు కుసుమమాలికలతోఁ గురులసంపెఁగతావి సరసమాడఁ
గంఠసంగతమౌక్తికప్రకరములతో మాణిక్యరోచులు మాఱుమలయ
వరకపోలచ్ఛవుల్ దరహాసచంద్రికల్ గలసియొంటొంటితోఁ జెలిమిసలుప
ముక్కుముంగరకెంపు మోవిరంగులసొంపు మొగమునకొకవింతసొగసుగూర్పఁ
గలికిపదియాఱువన్నెబంగారునగలు, జిగులు దేహప్రభలతోడఁ జేరి వెలుఁగ
క్షితినిఁ జరియించు చంచలాలతిక వోలెఁ, దరలివచ్చెను భ్రమతి సంతసమెలర్ప. ౮.

ఆ. ఇట్లు తేగుదెంచి యిలువేల్పులకు మ్రొక్కి, తల్లిదండ్రులకు ముదంబుగదుర
వందనములొనర్చి పార్వతీదేవ్యాల, యంబుఁ జొచ్చి వినయమతిశయింప. ౯.

పంచచామరము.

కరద్వయంబు మోముఁ జేర్చి; కన్నుఁగోయిమూయుచున్;
శిరంబువంచి; తద్భవానిచేష్టలెంచి "శాంకరీ!
నిరంతరంబునీదుపాదనీరజంబులన్మదీ
గరంబుభక్తిఁగొల్చునట్లుగాననుగ్రహింపవే. ౧౦.

సీ. ఆద్యంతశూన్యమై యలరుతత్త్వము నీవ నిఖిలవస్తువులందు నెగడెదీవ
మూఁడుమూర్తులకును మూలకందము నీవ పంచభూతములందుఁ బ్రబలుదీవ
అందఱిశక్తులకాధారమే నీవ సచరాచరంబైన జగము నీవ
దుష్టులపాలింటి తోఁకచుక్కవు నీవ శిష్టులకును బెట్టుచెట్టువీవ
బహుళపాపౌఘముల నెల్ల భస్మముగను, బొనరుచు మభక్తులనుబ్రోచుజననివీవ
పరమశివునర్ధదేహమై పరఁగెదీవ, తల్లి! నిన్నెన్న నేనెంతదాననమ్మ. ౧౧.

ఆ. ఏనుగోరికొనినయెమ్మెకానిని నాకు, జీవితేశ్వరునిగఁ జేయుమమ్మ
తొంటిసతులతోడఁ దులఁదూఁగఁజాలుక్రొ, త్తడితనమ్ము నిమ్ము దయఁదలిర్ప." ౧౨.

గీ. అనిపలు తెఱంగులను వేఁడియలరుబోఁడి, దేవళంబును వెలువడి జీవితేశుఁ
డైనభద్రుని వెనుకంగనభిలషించి, మెలఁగఁదొడఁగెఁ దదుత్సవస్థలమునందు. ౧౩.

సీ. పురుహూతవిగ్రహంబును నిల్పి వల్లవుల్ వేడ్కమైఁ బూజగావించుచోటుఁ
గర్పూరహారతుల్ కాళీమహాదేవికలరు బోండ్లర్పించునట్టిచోటు
సురసాలపల్లవోత్కరతోరణములచేఁ జెలువారు పందిళ్లుగలుగుచోటు
బల్యన్నములఁ దెచ్చి భక్తిమైఁ గాలిగంగలకిచ్చునలతలపాలుపుఁజోటు

బర్హిబర్హంబుఁ గైకొని పద్మనేత్రు, సుద్దులను గానమొనరించుచోటుఁ జూచి
ప్రాణనాయకుఁ గానక పడఁతిమిన్న, విరహమును బొందికన్నీరు విడువఁ జొచ్చె. ౧౪.

క. ఆడుగఁ దలంపను గంటం, బడిన సఖీమణుల; సిగ్గుపైకొన నుడుగున్;
బడఁతుల నేఁచకుమనుచున్, వెడవిలు వోరఁ గేలుసాచి వేఁడును వెడఁగై. ౧౫.

ఇ. ఇట్లు లాపికవాణి యోపికమాలి మారమరాపతాపంబున కోపంజాలక తదుత్సవంబున నిలువనొల్లక దవ్వులం జెలంగు నొకమాకందంబు క్రిందం గూరుచుండి ప్రాణేశ్వరు శృంగారప్రసంగంబుం దలంచుకొనుచు దుఃఖంబు నపనయించుచుండె నంత. ౧౬.

ప. కమలిని క్రుంగ; జక్కవలు కారియ నొందఁ గలంగఁ; దస్కరుల్
ప్రమహితకౌతుకంబున నుబల్లముఁ బొంగ; సుమాయుధుండు నే
ర్పమరఁగఁ బాంథపాళిపయి నస్త్రములాగించి లుకంగ; నల్లప
శ్చిమమునఁ గెర్లఁగొంగ కమశీఘ్రమునం జనిక్రుంకె నత్తఱిన్. ౧౭.

సీ. ఆభీరబాలకులాలజంగిలితోడఁ జేరిరి నైజకుటీరసీమఁ
బశ్చిమాధిపదివ్యభవనస్థగితరత్నరక్తిమంబన సాంధ్యరాగమడరెఁ
గర్షకుల్ తమ సేద్యకర్మముల్ ముగియించి చనిరి గేములకు విశ్రాంతి నొందఁ
దతతమోదైత్యనేత్రప్రసవద్విస్ఫులింగములనజ్యోతిరింగణములలరె
గూండ్లఁ దూఱెను విహగముల్; గుజ్జుగూబ, లెల్ల దెసలకు వెలువడె నెరసు సెమకఁ;
దమ్ములను గూర్కెమదషట్పదమ్ములెలమి, నంధకారంబు పాంథులనలఁచఁ దొడఁగె. ౧౮.

గీ. అంతరిక్షాబ్ధికన్యాముఖాంబుజాత, కలితప్రస్వేదజలబిందుగణమనంగ
స్వచ్ఛరుచిఁ బొల్చె నక్షత్రసముదయంబు, మల్లికాపుష్పనికరంబు మాడ్కి మింట. ౧౯.

చ. కుసుమగిని హృత్పుటాంతరమకుంతము దబ్ధిని నోలలాడఁ, జ
క్రములు వియోగతాపమునఁ గ్రాఁగి కలంగుచు జోడువీడఁ; ద
త్కమలినికిన్ముఖాబ్జమున గాటపు విన్నఁదనంబు గూడఁ; జం
ద్రముఁ డుదయించెఁ దూర్పునఁ గరంబుఁ జకోరములుత్సహింపఁగన్. ౨౦.

చ. “వసుఁడొకకాంతదవ్వు మెడఁబాసి చనంగ నెతమ్మికొమ్మయున్
బరమసతీత్వగౌరవముఁ బాడఱఁ జేసి మిళిందభర్తమం
దిరమునఁ జేర్చికూడె”నని దెప్పుచు నవ్వనఁ గల్వపూ
విరిసెనొ; బద్మినీరమణి విన్నఁదనంబున వాంచె నొదలన్. ౨౧.

గీ. పాలమున్నీరుబడబాగ్నివల్లనఁ బొంగి, వెల్లివిరిసెననంగను; వెండికొండ
మెరగలిఁ గరంగి లోకంబులెల్ల నిండె, ననఁగ వెల్లెఁడ వెన్నెలలలమికొనియె. ౨౨.

క. గగనసతితన్నువలరా, వగముంచినచంద్రుఁగాంచివనటనుమాటా
డఁగలేకకనులనశ్రులు, మొగినించెననంగమంచుబొట్టులుగురిసెన్. ౨౩.

ఉ. అత్తఱిఁజిత్తజల్లుగననంగుఁడుతీవ్రతరాశుగంబులన్
బుత్తడిబొమ్మపైఁగురియభూమిపయింబడిసొమ్మసిల్లి; లే
కత్తినతెల్విమైఁదలిసి; కీరతురంగునిబారికోర్వక
ట్లుత్తలమందఁజాగెఁదనయుల్లమునన్బ్రియమిత్రునెంచుచున్. ౨౪.

చ. "మొనయుపిసాళితేంట్లబలుమూకలకున్; వలిగాలిదాఁకకున్;
మనసిజుఁడేయుగాఢతరమార్గణపంక్తులఁబుట్టుకాఁకకున్;
వనజవిరోధిరాకకును; బల్మొఱుఁగూయుపికాళిపేఁకకున్;
దనువునునిల్పియేక్రియనుదాల్మివహింతును! జీవితేశ్వరా! ౨౫.

ఉ. నీముఖచంద్రమండలమునెమ్మిమెయింగనకున్ననెట్టులో
కామమహాతమంబడఁగుఁ! గ్రన్ననినీయధరామృతంబునే
నేమఱుఁగ్రోలకున్ననెటువీడునునీవిరహజ్వరార్తి? భా
మాముఖపుండరీకనవభాస్కరసన్నిభ! సద్యశస్కరా! ౨౬.

ఉ. సౌరవిలాసినీహృదయసంపదలైనహరింపఁజాలునీ
భూరితరాతిరూపమునుబొల్పుగఁజూచినయంతమాత్రనే
మారకఠోరసాయకసమాజకృశానునిపాలుగాకనే
సారసపత్రనేత్రకువశంబుదృఢత్వమునూనినిల్వఁగన్. ౨౭.

చ. "ఇదెమును వత్తునంచుఁజనియిప్పటికైననురాకయుంటివౌ
సదయుఁడ! నిన్నునేమనఁగఁజాలుదు; ధర్మమెయేఁచముగ్ధలన్:
మదనమహాగ్నిమధ్యఁబడిమ్రగ్గెడునాదురవస్థకొంతనీ
మదికినినాఁటెనేనిలవమాత్రముజంపొనరింపనెంతువా? ౨౮.

క. ఆలింపుమునామనవిని; దేలింపుముదబ్ధినీదుతీయనినుడులన్;
బాలింపుమమన్మథుఁడను, పాలసుపెనుబారిఁజిక్కఁబడలకయుండన్. ౨౯.

ఆ. కూర్మికాఁడవైనఁ; గూర్చుచుట్టమవైన, నీవసుమ్మునమ్మునిక్కువమ్ము
మున్నెనాదుహృదయమునునీకునొసఁగితిఁ, దనువుగూడనిదిగోగొనుముసఖుఁడ!"

చ. అనిపలవించుఁ; గన్నుఁగవనశ్రులునించు; వహించుగంపమున్;
దనువికనేలఁజుంచుఁగడుఁదత్తఱపాటుననేవగించు; దాఁ

పువవగ కాని సంచుఁగనిపొంచుఁ; గలంచుఁదలంచుఁ; దన్నుఁదాఁ
ననిశముఁగుస్తరించుఁ; గుసుమాయుధుమర్ణను మెంచుఖిన్నయై. ౩౧.

ఆ. కైరవాప్తుఁదిట్టుఁగలహంసములఁగొట్టు, జిలుకగములఁబట్టి చెఱను బెట్టుఁ
గెంపుకంట్లనట్టువంపుఁబిట్టలరట్టు, గలుగునట్టుబిట్టుకసరికొట్టు. ౩౨.

ఉ. చీమదిటుకుక్కమన్నఁదనజీవవిభుండనిభ్రాంతిపొందితా
వేమఱుఁదొంగితొంగికను; విన్నఁదనంబును బొందుఁగానిచోఁ;
దామరసాక్షి మోహపరితాపము దేమనవచ్చునద్దిరా!
కామునిఁబోలు మేటివిలుకాఁడలకాముఁడెయెంచిచూచినన్. ౩౩.

ఉ. మానవనాథుఁడంత బహుమానుని తోడను మాఱువేసముం
బూని పురందరోత్సవము పొంతకు వచ్చెను వృద్ధగోపస
మ్మానము పొంద; దీక్షను గుమారుని చర్య పరీక్ష సేయ; నా
మానిని తల్లిదండ్రులను మాటల తోడ నెమందలింపఁగన్. ౩౪.

ఉ. వచ్చినవాఁడు కేఁడనుచు వల్లవవృద్ధుఁడెఱుంగకుండియున్
బొచ్చెములేక యాదరణముం బొనరించెను గూర్మిమైఁ; బరుల్
వచ్చిననైననుత్సవపుఁబట్టులగౌరవమాచరించుటల్
హెచ్చినధర్మమై వ్రజాలయింప్లను బూర్వమునుండిచెల్లుటన్. ౩౫.

ఆ. ఇట్టులాదరించి యెంతయు నతిథిస, త్కారవిధులు జరిపి తమ్ముఁగలిసి
యుత్సవమునఁజొచ్చి యుల్లాసమందంగ, వేఁడికొని యొమిగులవినయమునను. ౩౬.

క. జననాథుఁడందులకునీ, కొనియాసందడినిదనదు కొమరునిపోకల్
కనిపెట్టఁదిరుగుచుండెను, గనలెదమాటికిని రేఁపఁగా సచివునితోన్. ౩౭.

వే. ఇట్లు తిరుగుచు నయ్యుత్సవంబున కెడగలుగంజని యొకానొకతావున. ౩౮.

సీ. కళలెల్ల నిండి చక్కఁగ వెలింగెడిచంద్రమామఁగేరెడు ముద్దుమోముదాని
శతపత్రనికరసంగత సౌకుమార్యంబు హసియించు నేత్రద్వయంబుదాని
గున్నమామిడిపంటి గుజ్జానికూయు చిల్కల మేనతికమాడు పలుకుదానిఁ
బదియాఱువన్నెక్రొంబసిఁడి చాయల నిగ్గునగఁజాలు నెమ్మేనిజిగులదానిఁ
జిన్నివాతెఱనమృతంబు చిలుకుదాని, విమలసద్గుణపుంజమై వెలయుదాని
నడఁకువకు నాటపట్టయి యలరుదానిఁ, బ్రమతిఁగన్గొనెనాశ్చర్యభరితుఁడగుచు. ౩౯.

క. కనుఁగొని యామచక్కం, దనమును వేనోళ్లఁ బొగడి తనసుతుఁడావరిం
చినవల్లవకన్యయొకో, యని మనమున సందియంబునందుచునుండెన్. ౪౦.

సీ. రతిఁ గేరు సతి సౌకుమతి మెచ్చి సుతనుండు మేనూని ప్రత్యక్ష మైనయట్లు
కామినీ మోహాంధకారంబు వోరింప బాలభానుఁడు నేల వాలినట్లు
తరుణీమణీ మనస్తాపంబు వాపంగ నింగి జాబిలి భూమి నిలిచినట్లు
సురసుందరుల నవ్వు సుదతి సొంపును జూడ జగతి క్రిందకు తుందుడిగినయట్లు
రంభ పైనల్గిన నలకూబర ప్రభుండు, తెఱవ దాస్యంబుఁ గోరి యే తెంచినట్లు
భద్ర వేషంబునను రామవర్మ ప్రముతి, సరసకరు డెంచె నెంతయు సంతసమున. ౪౧.

వ. ఇట్లు వచ్చిన నిజసూనుని మానవనాథుం డానవాలుపట్టి బహుమానునికిం జెప్పి “యి క్కాముకీ కాముకులకుం జరుగు శృంగార ప్రసంగంబు నాలింతువు గాని నా వెను వెంట రమ్మ”ని తోడ్కొని చని యొక రహస్యస్థలంబున డాఁగియుండె నక్కడ ప్రమతి రాకొమరుం జూచి యిట్లనియె. ౪౨.

ఉ. “జాలము జేసి ; పుష్పశర జాలము పాలొనరించి పోవ నే
తీల సహించె నీ మనసు ; లేశమ యేని యు నీకు సక్కటా !
జాలి జనింపలేదొ ; పెఱచానయొకర్తుక నాపయిందమిన్
డీలువడంగఁ జేసెనొ ; వడిన్ వినిపింపుమనుంగు చుట్టమా ! ౪౩.

ఆ. అన్నిటికిని నీవె యని నమ్మి కొనిమహా, కాననముల నైనఁ గౌతుకమున
నిన్నుఁ గూడి యుండ నే నెంచుకొని యుంటి, నకట ! వేఱు సేయ నగునె నీకు. ౪౪.

గీ. నామనము నిట్లు నవనీత కోమలముగఁ, జేసి నీ హృది పదును గాఁ జేసినట్టి
కమలసంభవు నవపలెఁ గాక నిన్ను, వ్యర్థముగ ననఫల మేమి ! వన్నెకాఁడ ! ౪౫.

గీ. అలిగి విడనాడ విడ నీ యుదతి వమనసు, పురుషుని యెడం దమాత్రమ పొల్పొల్కఁ గాదు
మగలమగువల మధులొక్క పగిది యగుచు, వాక్కునర్థంబు చందాన వఱలుటరుదు. ౪౬.

చ. గురువిరహంబునం ధను వ్రక్రుయ్యఁగ ; వెన్నెల నెండి ; మారుతీ
వరమగు పూలకోర్ల బలు వానను నాని ; సుగంధ శైలదు
ర్భర పవనంపుఁ బెన్వడను బాధలనొంది ; తపంబు నీకునై
జరుపుచునున్న దాననుఁ బ్రసన్నుఁడ వేటికిఁ గావు ! చెప్పుమా. ౪౭.

క. విరహ దవానలమునఁ బడి, పరితాపము నొందుచుండు వారలకు క్షణం
బర యుగ యుగమని యెఱిఁగిన, సరసుఁడవై తే నిజంపు సలుపవు గాదే ౪౮.

క. కనుఁగొను ముకంఠసంగతి, ఘనమౌక్తిక హారవితతి కామజ్వరపీ
డనమునను గాఁగి హారినీ యని కాయాకృతి ధరించె లలితగుణాఢ్యా ! ౪౯.

క. కాలాగురులేపనముం, బోలెందలిర్చెడు సుమేనం బూసినగందం
బాలరిపైమదనుండుశర, జాలముతను వునసుజిత్తజల్లుగం గురియన్." ౫౦.

క. అనిపలికిపొంగివచ్చెడు, వనటనడంపంగలేక వనితామణియొ
య్యన నేడ్చెంబరపుష్ప, స్వనమునసిజజీవితేశుస్వాంతముకరుంగన్. ౫౧.

ఆ. భర్తుఁడంతగోపభామినీరత్నంబు, నూరుతలముఁ జేర్చి గారవించి
కురులుచిక్కుదీసిగురుతరప్రేమని, ట్లనియెఁదనదునుడులనమృతమొలుక. ౫౨.

చ. "మనముభవన్మనంబువనుమాటికిలగ్నముచేసిపోవనే
వనితకుసాధ్యమౌను: మగువా! తగవాయిటులాడఁబేలవై!
తను వెటసంచరించినసుదప్పకప్రాణములెప్డునీదుప
ద్వనజయుగంబుచెంగటనెదాస్యమొనర్చెడునంచెఱుంగవే. ౫౩.

చ. సరసిజనేత్ర! నీకనుల సన్నమెలంగెడువాఁడఁగాక ; నేఁ
బరుఁడనె! బేలనై యిటులపల్కెదవేటికి! రాజకార్యత
త్పరతను నింతసేపుసెకతావుననిల్వకతప్పదయ్యె; హృ
త్సరసిజమందునాయొడలసందియమందకుమెంతమాత్రమున్. ౫౪.

ఆ. చక్రవర్తిపదముసంప్రాప్తమైనను, వదలివైతుగడ్డిపరకవోలె
నీదు చెలిమివిడువనేరననిద్దియె నాదు, నిశ్చయమ్మునమ్ము నీరజాక్షి! ౫౫.

గీ. జాగుచేసిననేరంబుసైపుమింక, నెన్నఁడిట్టులనొనరింపనింతిమిన్న!
ఆతనుఁడేసెడితీవ్రసాయకములకును, డాలుఁజాలనుసాఁకుముదయదలిర్ప. ౫౬.

చ. అలుకదొఱంగినాపయిఁగృపామృతవృష్టినిజిమ్మికౌఁగిటన్
నిలుపుము ; మోవితేనియల నెమ్మినొసంగుము ; లాఁతివానిగాఁ
దలంపక వైరమంపడఁగఁదన్వి! రో! పీవఁగనిమ్ము ; నీదుప
జ్జలరుహసన్నిధానపరిచారకుఁ జేయుము కేలుమోడ్చెదన్." ౫౭.

వ. అని మోహాతిరేకంబునం బలికినపలుకుల కచ్చెలుకలకొలికి యలరి తన చెలువునాకా
లింగన సుఖంబొసంగి ; చుంబనదానంబుం గటాక్షించి ; సల్లాపసుఖ కల్లోలిని నోల
లలాడించుచుండెనంత. ౫౮.

ఉ. వెన్నెల జొంపితోఁ బడవు వేడ్కమెలంగియనంతరంబరే
యున్నులమిన్నలై జగృహమల్లనఁ జేరెడు నేళఁ గ్రొవ్విదన్
జెన్నులుగుల్కమల్లెపువు చెండొగిజాఱెననంగ సత్ప్రభా
ఖ్యన్నతి వేగుఁజుక్కనయనోత్సవముంబొనరించెఁ దూర్పునన్ ౫౯.

ఆ. పగలుసేయుఱేఁడు వచ్చునన్బెగడునఁ, బోవుచున్న చంద్రువలను గాంచి
చుక్కలెల్లమిగుల స్రుక్కెను వానితో, దివ్వియలును గూడఁ దెలివితప్పె. ౬౦.
గీ. అలజగద్బాంధవుని రాకకరుపమందు, మేదినీనిర్జరాశీర్ని నాదమునఁగఁ
గర్ణపర్వంబు సేయుచుఁ గడుఁ జెలంగె, ద్విజనికరము స్వరంబులు దిక్కులందు. ౬౧.
సీ. పద్మినీనికరంబు ప్రాగ్భవంబునఁ జేసికొన్న పున్నియములకుప్ప యనఁగఁ
బ్రాక్సతీమణిఫాలభాగంబునందొప్పు దీర్చినసిందూరతిలకమనఁగ
వరచక్రవాకదంపతులనొక్కటి గాఁగఁ గలుపవచ్చిన నేస్తగాఁడనంగఁ
బ్రజలొనర్చెడు పుణ్యపాపములు పరికింపసర్వేశుఁ డంపిన చారుఁడనఁగ
నంధకారాంబునిధిశ్రమమందు దేహ, ధాగులమయూఖరజ్జుసంతతులచేత
మీఁదికెత్తంగవచ్చిన మిత్రుఁడనఁగ, బాలభాస్కరుఁ డుదయాద్రిఁ బరిఢవిల్లె. ౬౨.
వ. ఆ సమయంబున. ౬౩.
గీ. అటనిగూఢంబుగానున్న యవనిపతికిఁ, బహుఁతినుడివినుడువుల ప్రౌఢమయ్యు
వీనులకుఁ జాలమధురమైవిందుసేయ, నచ్చెరువునొంది నిజమంత్రికనియె నిట్లు. ౬౪.
ఉ. "హీనతరాన్వవాయములనింతటిచక్కఁదనంబుగల్గి కొం
దే నెలఁజిల్కుపల్కులమదింగరఁగించెడు ముద్దుగుమ్మలం
గానము పూర్వమెయ్యెడలఁ ; గౌతుకముం గలిగించెడుం బరే !
దీనిమనోహరాకృతియు ; దీనిచొకాటపు ముద్దుపల్కులున్. ౬౫.
గీ. వనితసంభాషణమునఁ బ్రవర్తనమున, హీనకులజాతియనుటకు నించుకైన
నొరకదాధారమేమి యద్భుతము నేను, గనుఁగొనినయంతదనుక నోయనఘచరిత!"
చ. అనబహుమానుఁ డిట్లనియె "నామతిసందియ మేల ! నీపాపా
వనమొనరించె గోపకులవారిధి ; నీ మెసురూపసత్ప్రవ
ర్తనములఁ గన్న మన్మథశరంబులఁ జిక్కరె యోగులైన ; నీ
యనుఁగు నిసుంగు మ్మేలుపడు టబ్బుర మే నరపాలశేఖరా!" ౬౬.
వ. అనవుడు గొల్లవానికడ కా నృపచంద్రముఁ డేగి "యోయి నీ
తనయకుఁ బ్రేమగల్గ నొకదాసునిపోలికనుండి ; మోహసం
జనకమ్ము దూక్తులన్వినయసంపదయుచ్చ్వపడంగఁ బల్కునా
జనుఁ డెవఁడ" న్న గోప్రుఁ డురసాధ్వనపాళిని గాంచి యిట్లనున్. ౬౭.
ఆ. అతఁడు భద్రుఁడనెడునాభీరబాలుండు, మనసునందు నాకొ మ్మాన్తెమీఁద
వలపుమిక్కుటముగ నలరారుచున్నట్లు, తెలుపుచున్నవాఁడు దినదినంబు. ౬౮.

చ. అతనికి నాకుమారికను హాళిని బెండ్లియాడు యోగమా
శతధృతిబ్రాసె నేనియును స్వప్నమునందును జూడఁబోనియ
ద్భుతమగులాభ మున్గెను మఁబోల్తుకరాఁగలదం" చుఁబల్కి తా
మతినిదలంచె భూషణసమాజమునమ్మఁగనున్న వంచకుండికన్. ౨౦.

ఆ. గొల్లవానినపుడు కుపలయాధీశుండు, వదలి సుతుఁడు రామవర్మయున్న
తానకమునకేగి తనయెలుంగునుమార్చి, పలికెఁ బరుఁడెవండొ పలికినట్లు. ౨౧.

గీ. "ఓకుమారక! వేడ్కగానుత్సవంబు, జరుగుచుండఁగ దానినసట్ట చేసి
మఱియొకపదార్థమున నీదుమనసులగ్న, మయినటులఁ దోఁచుచున్న దీయవసరమున. ౨౨.

ఆ. నాదుజవ్వనంబునను డెందము వకును, దగిలినట్టి మంచిచిగురుబోండ్ల
కెన్నొ సూడిదలను నెలమి మైఁబంపించి, వశముచేసికొనెడివాఁడ మున్ను. ౨౩.

చ. అఱుతవినోదవస్తువులనమ్మెడివాఁడొగిఁబోవుచుండ; నీ
తెఱవకువొక్కటైనఁగొని తెచ్చితియో సంగకయుంటఁ జూడనీ
తెఱఁగు విచిత్రమయ్యెడుత్వదీయమనోగతమేమొ తెల్పవె
చ్చెరను శ్రుతిద్వయంబునకుఁ జేయవె పండువు గోపబాలకా!" ౨౪.

వ. అనవుడు రాజతనయుండు తన జనకుని కంఠస్వరంబు గుఱుతిడఁజాలక పరుండను
తలంపున నిట్లనియె. ౨౫.

క. "వినుమట్టి స్వల్పవస్తువు, లను నీయమలెక్కగొనదులవమైనను; నా
మనమున నెదాఁచఁబడెనీ, వనితామణికిష్టమైనవస్తువు మసలీ!" ౨౬.

వ. అని పలికి తన కలికివంకఁ దిరిగి యిట్లనియె. ౨౭.

ఆ. "పూర్వమెపుడొ నిన్నుఁ బోలిన నవనీత, కోమలాంగి నొర్తుఁ గోరివలచి
మెలఁగియున్న యీ యుసత్యమాలకింపనా, మనసు తెలుపువాఁడ వినుము ప్రమతి!" ౨౮.

వ. అని యంతతోనైన విరమింపక మరల ధరణీశ్వరువంకఁ దిరిగి "మా పరిణయనిర్ణయంబుఁ
గనుము. ఈ నెలఁతకు నా పలికిన వాగ్దానంబునకీవు సాక్షిభావంబు వహింపు" మని
యడుగ నప్పుడమి ఱేఁడప్పుడె తన ప్రచ్ఛన్న వేషంబుం బరిత్యజించి నిజస్వరూపంబుతోఁ
బ్రత్యక్షుండై కుమారుని గద్దించుచు నిట్లనియె. ౨౯.

క. "కనుఁగొని తొడఁబరిణయ మోచనమోక్షలు పాత్ర! పూతపవిత్రకులమ్మున
జనియించి గోపకన్యను, గొనియాఁ వడినడఁగఁజేయఁగోరితె! చెడుగా. ౩౦.

ఆ. సాటిరేని యశముసంపాదనము చేసి, వంశమునకు మిగులవన్నె తెత్తు
వనుచు నమ్మియుంటి నకటా! నీ విట్లు, పలువవగుదువనుచుఁ దలఁపనైతి. ౩౧.

చ. గరిమమహాకులీనయగుకన్యను దోకొనివచ్చి ; నీకునేఁ,
బరమకుతూహలంబునను బట్టపుదేవిని జేయ నెంచ ! సా
దరమతి వెఱ్ఱిగొల్లముగుదం గొనినిర్మలమైనకీర్తియుక్
బరువుమ బాసుచేయుటకుఁ బాల్పడితే ? దురితాత్మ ! యియ్యెడక్." ౮౨.

వ. అని బహుప్రకారంబులఁ గుమారునిదూఱి యనంతరమా నారీమణివంకఁ దిరిగి యి
ట్లనియె. ౮౩.

గీ. "ఇంకముందెప్పుడైనను నిటకుమరల, నితఁడువచ్చుట కంగీకరించితేని
నీకునీతండ్రికినిగూడ నెనరువిడిచి, మరణదండనవిధియింతుమగువ మిన్న" ౮౪.

క. అని బెదరించి యమాత్యునిఁ, గని "నీవీ దుండగీనిఁ గడురయమునఁ దో
కొనిరమ్మ"ని నుడువుచుఁ జనె, జనపాలుఁడు కినుక నాత్మసదనంబునకుక్. ౮౫.

గీ. పార్థివకుమారి కా స్వభావంబు దాఁగి, యుండ నేరదు గానసట్లు గ్రుఁడగుచుఁ
బ్రభువు వెడలంగ నతనిక్రూరప్రసంగ, మునకుఁ గోపించి ప్రమతి యిట్లనుచుఁ బలికె. ౮౬.

సీ. "మకరందఱుకును జేటొనగూడనున్న మనపుడించుక యొభయమందలేదు
ఇరుమూఁడుసాలలాధరణీశుఁబలికించి "మీరాజభవనంబుమీఁద వెలుఁగు
భాస్కరుండే శంకపడకుండ మా గొల్లగూడెంబుమీఁదను గూడ మొగిని
వెలుఁగుచు మిమ్ము మమ్ముల నొక్కరీతి నేకనుచున్న వాఁడు వేగనులతోడ"
ననుచు మొకమోటవిడిచి నేనతనిమదికిఁ, దాఁకునట్టుగ మొగముమీఁద నెవచింప
వలయునను కొంటి" ననుచు బలికి పిదపఁ, గొందలము గ్రమ్మ నిట్లనుఁ గుందరదన. ౮౭.

-. "ఇంతదనుక నేనదేమే మొకలఁ గాంచఁ, బోలు ; నింకనిపుడు మేలుకొంటి
నిట్టివిషయములను నిసుమంతయేనినా, హృదయమునకుఁ గష్ట మొదవనీను. ౮౮.

గీ. నను విడిచి మీరు మిత్రోవఁ జనుఁడు నాదు, మేఁకలను జుట్టుపట్టుల మేపికొనుచుఁ
బిలికికొనుచును బాల ; నా వెతలు నేను, పడెద"ననుచును నిస్పృహఁ బలికెఁ గలికి. ౮౯.

వ. అనిపలికి కొంతవడికిం దెలివి తెచ్చుకొని తనపజ్జల నిర్విణ్ణాంగియైయున్న రాజపుత్రుం
గాంచి కన్నులనీరు వెట్టుకొనుచు నిట్లనియె. ౯౦.

సీ. "పార్థివత్వము తృణప్రాయంబుగా నెంచితగ గోపవేషంబుఁ దాల్చినావు
కమనీయ రాజసౌధములను ద్యజియించి నీ చమూగృహములనిలిచినావు
ఘనులుండు పేరోలగములు కాదని రోసి మా మందకొలువుగా మార్చినావు
సచివసామంతపరిచయంబు నెడఁబాసి వెడగు గొల్లలచెల్మి వేఁడినావు

కాంతిమద్రత్నపటలసంఘటితభూష, ణములువలదనిబర్హిపింఛముధరించి
మాకులమువారితోఁడనుమసలినావు, నానిమిత్తంబుననునరనాథతనయ! ౯౧.

ఉ. దైవము నేఁడు సర్వము వృథాయొనరించెనిఁకెట్లు ప్రాణముల్
పోవకయుండనిల్పుదును! బొందినివీడిననిల్వనేర్చునే
జీవములెన్నఁడైనను! ప్రసిద్ధగుణాకర! మేనువాసియా
దైవతలోకముంగనెదఁదావకపత్కమలంబులెంచుచున్. ౯౨.

ఆ. చెలిమికాఁడ! నిన్నుఁగలసిసుఖించెదు, భాగ్యమిపుడునాకువ్యర్థమయ్యెఁ
గనుకముందుజన్మముననైనభగవంతుఁ, గొలిచినీదుముద్దుచెలియనగుదు. ౯౩.

వ. ఇప్పటికెంతయే యదృష్టంబనుకొని నిశ్చింతస్వాంతుండవై నిశాంతంబున కరుగుము. భవజ్జనకుని కోపానలంబుపాలుగాక తదాజ్ఞానువర్తివై ప్రవర్తింపుము. నాయెడంగలుగు మోహలతాజాలంబును వివేకకరవాలంబున మూలచ్ఛేదంబుగావించి మరణంబున కనుజ్ఞ నొసంగుము. నీపడిన ప్రయాసంబునకుఁ దగిన ప్రత్యుపకారంబు సేయఁజాలని నా నేరంబు సైరింపుమిదె జోహారువు లొనరించెద" నని వియోగదుఃఖాతిరేకంబునం బలుక నా రాకొమరుం డతివ్యాకులహృదయుండై కన్నీరుమున్నీరుగాఁగాఱ నయ్యన్నులతలమిన్నం గాంచి గద్గదస్వరంబున నిట్లనియె. ౯౪.

ఆ. "రమణి! నీవులేనిరాజ్యంబునాకేల!, రత్నరాసులేల; రామలేల?
కోటలేల! పూలతోఁటలేల! పసిండి, మేడలేల! కడిఁదివాడలేల? ౯౫.

ఆ. నీవులేకయున్ననిఖిలంబుశూన్యంబు, నీవునాదుచెంతనిలిచియున్న
నిరయమైననాకుసురలోకతుల్యంబు, చారుశారదేందుసదృశవదన! ౯౬.

సీ. పార్వణచంద్రబింబముఁగేరునీముఖకమలంబుఁగన్నారఁగానకున్న
నమృతప్రవాహంబుననుకరించెడునీదుచిన్నారినుడిచెవిఁజేర్పకున్నఁ
బల్లవప్రదిమంబుఁబరిహసింపఁగఁజాలునీకేలనెమ్మేనునిమురకున్నఁ
గటికరాలైననుగరఁగెడుచందానవీణియమీటిమెప్పింపకున్న
నతనుఁడుగ్రతనిక్షుశరాసనమున, మార్గణావళిసంధించిమర్మమరసి
యేసియసువులుగొనకున్నెయింతలోన! నింతి! నీతోడిదేలోకమింకనాకు. ౯౭.

క. ననుఁబాసినిగవీక్షింపకు, వెనువెంటనెవత్తుమరుని వెతకోర్వనఁజా
లను; మరణోత్సవమిపుడు, మనుగలసియెయనుభవింతముపిలాసవతీ. ౯౮.

ఆ. ఇట్టులొకరినొక్కరెడఁబాయఁజాలక, పొగులుచుండెమంత్రిపుంగవుండు
వారివలపుమెచ్చి కారుణ్యముదయించి, తనమనంబునందుఁదలఁచెనిట్లు. ౯౯.

ఉ. "జీవసమానయైనతనజీవనజాయతనేత్రమీవఁ ని
భూవరపుత్త్రిచిత్తమునఁ బుట్టినగాఢతరానురాగమా
భూవిభుఁడల్గినంతట నెపోవఁగ నేరదొకించుకేనియుం ?
గావున వీరి నొక్కటిగఁ గల్పుటకన్న నుపాయ మున్న దే." ౧౦౦.

క. అనితలఁచి వారి నేకం, బొనరించి చిరకాలమును దయపల్లంబున నె
క్కొనియున్న యోగ్యతరవాం, ఛ నొకండీ డేర్చుకొనఁగ సమకట్టె నొగిన్. ౧౦౧.

వ. ఇట్లు సమకట్టి బహుమానుండు తనపూర్వప్రభుండగు సుమిత్రుండు కళత్రపుత్త్రికావి
యోగంబునం గరంబు పరితపించి పశ్చాత్తప్తుండగుట యెఱింగియున్నవాఁడు గావున
మలయాలయేశ్వరుం డెంతమనసు గలిసిన సఖుండైనను రాజసౌందర్యనాభిలాషం
బును; నభిజనాభిమానంబును; మానసంబున విడకుండుటం జేసి మరల నొకపరి నిజదే
శంబున కరుగనిశ్చయించి యానాయికానాయక చిత్తంబులం గూడఁ దనతో వచ్చిం
డొక్కనిపోవం దలంచి యిట్లనియె. ౧౦౨.

క. "లంకాపురమును బోలిన, సాంకేతస్థలము లేదు ; చను దెంచుమదిన్
జంకక నావెంటను మీ, రంకిలి లేకుండ శుభములలవడునటుల్. ౧౦౩.

సీ. మనుజాలె వ్వారుఁ ద్రవ్వనియగడ్తయునంగనలు వెలంకుల మహోజలధి దనరు
రేయింబగళ్లొక్కరీతి మహావీరభటులు లుగాచు మనుం ద్రుమపట్టణంబుఁ
బోతుటీఁ గను నైనేఁ బురమునఁ జేరదుస్తరము రాజేంద్రశాసనము లేక
శరణాగతత్రాణబిరుదైకచిహ్నుఁ డత్యంతసద్గుణి సుమిత్రాఖ్యవిభుఁడు
కాపురంబుండ మీకు యోగ్యస్థలంబు, వలసినపదార్థనికరము వారిగాఁగఁ
దెచ్చియిచ్చెద మదిని సందియము విడిచి, పోవుద మురండు నావెంటపోత మెక్కి. ౧౦౪.

గీ. చంద్రవర్మను సింహళక్ష్మావిభునకుఁ, బూర్వమత్యంతమగు మైత్రి పొదలుచుండెఁ
గాని యిప్పుడు పగగల్గెఁ గాలవశతఁ, గావునను నాతఁడచటికిఁ గదలిరాఁడు. ౧౦౫.

క. చిరకాలము మును నేనా, పురవరమునఁ గాపురంబుఁ బొనరిచితదుర్భా
వరునికడ వ్యాసచివ్యము, జరిపి గడించితి నిజాండీ దను నెక్కుడుగన్. ౧౦౬.

వ. అని పలికి రాజకుమారునివంక దృష్టి నిగిడించి యిట్లనియె. ౧౦౭.

గీ. "ప్రభువు ప్రతిమాలినీ తంత్రి పరిణయమున, కుత్తరువు నిచ్చునందాక నొక్కకీడు
గలుగకుండఁగ మిమ్ములఁ గాచునట్లు, చేసెదను జింత పడఁ బోకు శ్రీతి పతిసయ!" ౧౦౮.

చ. అనవుడు వారు సంతసము నందుచు నందులకీకొసంగనా
యయ్యనఁ బయనంబు సేయుటకు నర్థ్మపదార్థములయ్యెమాత్యుఁడే

ఘనమును వెచ్చపెట్టికొని తత్పరతం దమ వెంటఁ గొంపవ్ర
ఘ్నునిసహితంబుగమ్మనియెఁ గొయ్యలితోడను గూడిచెచ్చెరన్. ౧౦౯.

గీ. "ఇల్లె" యనివల్లపుఁడుతనవనితఁ గూడి, యమ్మమిగిలినతనకూఁతుసొమ్ములెల్ల
ముల్లెగాఁగట్టిశైశవమునను నామె, తొల్చవలువలఁ గైకొనితరలెనపుడె. ౧౧౦.

గీ. నాఁట నే యుండ లును గూడి నౌక నెక్కి, జలధిమధ్యమునసుఖయాత్ర జరిపికొన్ని
దివసములకును సింహళద్వీపరాజ, ధానిఁ జేరిరి కరము సంతసముతోడ. ౧౧౧.

క. వచ్చినబహుమానధరా, ధృచ్చంద్రకుమారకులను బ్రేమసుమిత్రుం
డచ్చపుపడనాదరించెను, హెచ్చుగ నాతిథ్యమిచ్చి యెలమిద్దలిర్పన్. ౧౧౨.

వ. ఇట్లాదరించిన యనంతరంబ కన్నుల నీరు వెట్టుకొనుచు బహుమానునివంక వీక్షించి యిట్లనియె. ౧౧౩.

చ. "పలువతినంబువన్నెషము ప్రాణసఖుండగుచంద్రవర్మకి
మ్ములనిడుమంచు నీకుఁ జెడుబోధ మొనర్చినతప్పునైపుమా
చెలువను బుత్త్రిరత్నమును జిన్నికొమార్తెను మ్రింగికొన్నన న్
మలినమనస్కుఁ డంచు బలుమాఱును దూఱక యూఱడింపుమా." ౧౧౪.

వ. అని చింతించు భూకాంతుని సాంత్వనవచనంబుల శాంతచిత్తుం జేసి పిదప బహుమానుండు రామవర్మ వృత్తాంతం బాద్యంతము వినిచి యతని కాఁబోవు దేవియని కానిపించిన ప్రమతిమీఁద శేషమ్మేదినీశ్వరుండు దృష్టి నిగిడించి చూచి తన తనూభవమొగమునను న్న చిన్నియలవ్యన్నలమిన్న మొగంబునం బోడగని శ్రోత్రగ్రాఁ బొంగి వచ్చెడు కొండలంబును డెందుపటుపంజాలక కన్నుల నీరు వెట్టుకొనుచు నిట్లనియె.

సీ. "నిందితారవికచారవిందసుందరవదనంబుఁ గైరవంబులఁ గేరు కన్నుఁగవయుఁ
దిలపుష్పమును నవ్వు తీరైన నాసయు బింబంబు హసియించు పెదవిసంచు
నింద్రనీలచ్ఛాయ నెగ్గాడు కురులును విదియచందురు నేలు నుదుటిసొంపుఁ
జిందంబు చందమ్ముఁ జిన్నపుచ్చుగళంబుఁ జిలుకలగేలిచునున్నబలుకుసొరుఁ
గిసలయంబుల హసించు కేలుదోయి, నలసయానంబుఁ గనఁగనయ్యారె! నాదు
జామనునగల్గుదివ్యలక్షణములెల్లఁ, గానిపించుచునున్నవీకన్నెయందు." ౧౧౫.

చ. కనికరమేది నామనుఁగుఁగందువుపుట్టిలఘోరకాననం
బునకును బంపకున్న యెడఁ బొల్తుకనైశయునిట్టిసోయగం
బునవలరారుచుండుఁ జూఁడిపూర్ణవయస్సును బొందియుండుటా!
చినఁటికి నాకునీశ్వరుఁడు చేకుఱఁజేయునె యట్టిభాగ్యమున్. ౧౧౬.

చ. అనివగనొందిరాజసుతునల్లనఁగన్గొనిపల్కె "నక్కటా!
ఘనుఁడగునీదుతండ్రి చెలికారమకారణ మొక్కసందియం
బునుమనమందుఁబెట్టుకొనియాఘుఁడనై చెడఁగొట్టుకొంటి; నా
యననొకపారిచూడవలెనన్న ముదంబుదయించెనిత్తఱిన్." ౧౧౭.

చ. అనివచియించుచుండఁగ బ్రజాధిపుఁడాధరణీశుఁగాంచి "యో
యనుపమదివ్యతేజ! భవదాత్మజఘోరవనాంతరంబునం
దునుపఁగఁబంచివత్సరములొక్కటనెన్నియతిక్రమించెనో"
యననరనాయకుండు "పదియాఱు" నెఁగన్నులనీరునించుచున్. ౧౧౯.

క. తనకుందొరకినవత్సర, మునువిడువఁగఁబడెనటంచుభూమీశుఁడుప
ల్కినవత్సరమొక్కటియగా, టనుగొల్లఁడుసందియంబెడందంబొందెన్. ౧౨౦.

గీ. ఘనతరాన్వయసంజాతయనుటకామె, విలువవలువలుభూషణంబులునుదగిన
సాక్ష్యముగనుంటఁజింతింపఁజాగెనతఁడు, ప్రభుకుమారికయొకొయనిబహువిధముల.

గీ. ఇట్లుచింతించితుదకుమహీశ్వరుండు, విపినసీమనుబూర్వంబువిడువఁబడిన
దనుకొనుచునున్నకూఁతురేయరసిచూడఁ, బ్రమతియనినిశ్చయముచేసెవల్లవుండు.

వ. అనంతరంబ నాఁటికిఁ గొలువుచాలించి ధరణీపురందరుండు నిజమందిరంబున కరిగె. తక్కినవారలును దమతమ విడుదలకుం జనిరి. మఱునాఁడరుణోదయంబునన లేచి కాల్యకృత్యంబులందీర్చి మహారాజును; రామవర్మయుఁ; బ్రమతియు; బహుమానుండును; మిత్రవిందయు; దక్కంగల పెద్దలును సభనలంకరించియున్న సమయంబున గోపవృద్ధుం డరుదెంచి తనకుఁ బ్రమతి లభించిన విధంబును; నాయమం గొనివచ్చిన మనుజుండు పులివాతంబడఁటఁ బొడగనుటయుఁ; జెప్పి నాఁడా శిశువున కలంకరింపఁబడిన యమూల్యాంబరంబులును; గంఠాభరణాద్యలంకారంబులును; దదీయవస్త్రంబునకుం గట్టియున్న కాగితంబును గొనివచ్చి మేదినీశ్వరుపాదసన్నిధానంబునం దిడుటయు; మిత్రవింద వానినిం బరిశీలించి చూచి శోకజాశ్రువులు దృగ్గోళకంబులనుండి జొటజొటంజాఱ ధారుణీశ్వరున కిట్లనియె. ౧౨౩.

ఉ. "పండెనునీయదృష్టమునృపాలకచంద్ర! భవత్కుమారియీ
యండజయాన; కాగితమునందలియక్కరముల్ మదీయనా
థుండెలిఖించెనిశ్చయము; దుర్విచలంబునఁగొన్నయమ్మను
ష్యుండతఁడేసుమీయిఁకవిశుద్ధిగనమ్ముముకావుమీయమున్. ౧౨౪.

చ. స్మరణకుఁదెచ్చుకొమ్ము చెడు సందియముల్ త్యజియించి ; నాఁడునీ
తరుణినిసుంగునీదుపదతామరసంబులచెంతకంపునో
సరిగపసిండిదువ్వలువఁజక్కఁగఁదాఁగయిసేసె ; దానినే
గురుతరభక్తిఁగొల్లఁడిదిగోఁగొనివచ్చెనుజూడుమీనృపా ! ౧౨౫.

క. ఇదెకంఠాభరణమునా, టిదెసుమి ; యీయమ్మమొగముతేవంగనసీ
మదవతినిబోలియున్నది, పదిలుఁడవైయొక్కసారిపరికింపఁగదే.'' ౧౨౬.

ఆ. అనుచుమిత్రవిందయంగమచ్చంబులు, గానిపింపనోలగంపువార
లద్భుతంబునొందియవనీశుపుత్త్రిగా, విశ్వసించిరెదలవిడిచిశంక. ౧౨౭.

గీ. పోయెననుకొన్నయారాజపుత్త్రిమరలఁ, జిక్కెఁగావునవేలుపుచెప్పినట్లు
నిలిచెరాట్కులమనుమాళి ; చెలువుఁడీగ్గె, నసెడువగమిత్రవిందనునలమికొనిరి.

వ. అప్పుడు సుమిత్రుండత్యానంద పారవశ్యంబున నించుకతడవు నోటమాటరాక యూ
రకుండి పిమ్మట కూఁతుంజూచి యత్యాతురతతో నిట్లనియె. ౧౨౯.

సీ. ‘‘ రాఁగదేనాపాలిరతనంబులకొటార ! రాఁగదేనాదుసురద్రుమంబ !
రాఁగదేనాదుపురాకృతపుణ్యంబ ! రాఁగదేమత్కృతవ్రతఫలంబ !
రాఁగదేమత్సౌధరాజదివ్యపతాక ! రాఁగదేజితతామరసనయన !
రాఁగదేసుగుణవిరాజితహృత్పద్మ ! రాఁగదేనిందితరాజవదన !
రాఁగదేనాదువంశవర్ధని ! బిడాన, రాఁగదేనాదుసౌభాగ్యరాశి ! నిన్ను
నడవివిడువఁగఁబంచినయట్టిఖలుఁడఁ, గ్రూరుఁడనునన్నుదయఁగనుంగొనుముతల్లి!''

ఆ. అనుచుఁగూఁతుఁగౌఁగిటనుజేర్చిముద్దాడి, ‘‘ తనయఁజూచికొనఁగజనకకటా !
ఋణములేకపోయెనే'' యనిపలుమాఱు, వ్యసనపడెనొడంగెఁబ్రభువరుండు. ౧౩౧.

వ. ఇట్లు కొంతతడవు దుఃఖించి మఱియు నేమో చెప్పం దలంపుగొని ‘‘ నీతల్లి ; నీ
తల్లి—'' అను పలుకులుదక్క మఱేమియుఁ బలుకనేరక సంతోషమ్మొకవంక్కను ;
దుఃఖమ్మొకవంకను దన్నుం గ్రమ్మ నిశ్చేష్టుండైయుండె. ౧౩౨.

ఆ. అపుడుమిత్రవిందయవనీశ్వరునిచెంత, కరుగుదెంచియిట్టులనియె ‘‘ దేవ !
దేవిగారిఁబోలుదివ్యసుందరవిగ్రహంబుగలదుమాగృహంబునందు. ౧౩౩.

క. మననగరమునకుఁగ్రొత్తగఁ, జనుదెంచినశిల్పియొకఁడుజాణతనమునఁబొ
బొనరించెఁ ; గనినరాణియె, యనిభ్రాంతింబొందవలయునవనీశమణీ ! ౧౩౪.

గీ. వచ్చిమానిలయమునుబావనముచేసి, చిత్తగింపవెబహుసుప్రసిద్ధుఁడైన
చిత్రకారునిప్రౌఢత ! చిత్తమునను, గలుగునీవంతలెల్లనుదొలఁగునంత.'' ౧౩౫.

క. అనినృపుఁడు "మిత్రవిందా!, వినుమేండ్లిరువదియునైనవిగ్రహమును న
ట్లనె నేనుదలఁచునట్లుగఁ, బొనరించుమఁగన్నులారఁ బొడఁగననిమ్మా. ౧౪౯.

గీ. ఆమనోహరమగువిగ్రహంబునుండి, యూరుపిప్పటికినివచ్చుచున్నయట్లె
కానఁబడియెడు నెంతచక్కనియొలియును, జెక్కుఁగలుగు నెశ్వాసంబు చెందునట్లు.

ఆ. దానినొక్కసారితటిసిముద్దాడంగ, వాంఛగలదు ; నవ్వఁగలదుమీర"
లనుమనధికమోహమునఁబల్కనమ్మిత్ర, విందయిట్టులనియెవిభునిఁజూచి ౧౫౦.

గీ. "దేవరా! తొఱుఁడామెవాతెఱనుఱడిన, యెఱ్ఱరంగదెపచ్చిగా నెసఁగుచుండె
ముద్దిడిననంటుకొనుచు మీమోవికింక, జవనికను గింతునా?" యనజనవిభుండు. ౧౫౧.

క. వలదట్లెయుండనిమ్మా, యెలనాగరో! వత్సరంబులిరువదియైనం
దిలకింతునిట్లె" యనుచుఁ, బలుతెఱఁగుల వేఁడికొనియెం బడఁతుకమిన్నన్. ౧౫౨.

వ. ఇట్లువారు సంభాషించుచున్నంతఁదనుకను బ్రమతి నిశ్చలచిత్తుఁడై నిలువంబడి సావధానంబుగ నా నిరుపమాన విగ్రహంబుపై దృష్టినిలిపి "మత్ప్రియజననీముఖారవిందం బత్యానందంబుచం గనుంగొనుచు నెంతకాలంబైన నీలీల నిలువంగల" ననిపలికె. నంతట మిత్రవింద మరల ధాత్రీశ్వరునివంక దృష్టినిగిడించి యిట్లనియె. ౧౫౩.

సీ. "ఆలోకనాతిసౌఖ్యముకొంతమఱవంగఁ జిరజీరయైనను దించునిందు
తమకట్లు సేయఁజిత్తముగొల్పకున్నను నింతకంటెను గొప్పవింతయొకటి
కలదు దానిని నేను సలుపుటకైనను సెలవునొసఁగ సేయవలయు మీర
లదియెద్దియనిన నీయందంపుబొమ్మను గదలునట్లుగఁ జేయఁగలను జూండి
యంతయేకాదుతమయాజ్ఞయయ్యెనేని, పీఠముననుండిదిగివచ్చిప్రియము మెఱయ
నంబుజంబులఁబోలుమీహస్తయుగముఁ, బట్టుకొనునట్లుగ హితవేర్పఱచఁగలను.

ఉ. ఏనటులాచరించినను నెల్లఱు నెద్దియొక్షుద్రదేవతం
బూనికఁబంపు చేసికొనిపోకలుపోవుచునున్నదందురో
మానవనాథ! కాదని ప్రమాణము చేసిపచింతు" నన్న నా
చానను జూచి యిట్టులను క్ష్మావిభుఁడద్భుతమగ్నచిత్తుఁడై. ౧౫౪.

గీ. "ఇంతి! నీవామె చేతఁజేయింపఁగలుగు, దాని నెల్లను జేయింపు తక్షణంబ
కవెదఁగన్నారఁ జిత్రంటుఁగదలునట్లు, చేయుదానికిమాటాడఁజేయు టెంత. ౧౫౫.

గీ. కనుకనీవేమిపలికించిననుగరంబుఁ, దమినివినియెద" నవపుడుతలిరుబోణి
యంతకునుమున్నె పిలిపించినట్టిపాట, కులుగడంగిరిశుభగీతములనుబాడ. ౧౫౬.

ఉ. అప్పుడు మాపటిఅద్భుతమునందఁగవిగ్రహమల్లపీఠమున్
గుప్పునడిగ్గి తేని యడుగుంగవచెంతకు వేగిచేతులన్
గొప్పగఁజాచికూర్మి మెయిఁగుత్తికఁగౌఁగిటఁజేర్చె ; దైవమున్
దప్పులుసైచి భర్తను సుతంగ గణింపుమటంచు వేఁడఁ గన్. ౧౫౮.

వ. ఇట్లు కౌఁగిలించుకొనిన యనంతరంబ యవ్విగ్రహంబందఱువిన నృపపురందరున కిట్లనియె. ౧౫౯.

ఉ. మానవనాథ! నీవిటులమాటికినన్దిలకించి యబ్బురం
బూనఁగనేల? నే బ్రతికియున్న భవత్ప్రియమంజువాణినే
మానముఁగాచికోలునకు మార్గముఁగానక డాఁగియుంటినీ
మానవతీలలామననుమన్నన సేయుటనీ మొగీమునన్. ౧౬౦.

క. నాఁడటుల నేను బ్రాణము, వీడితినని తెలిపిమిత్రవిందయె నాకే
కీడొదవకుండఁగను గా, పాడెను దనప్రాణమట్లపార్థివచంద్రా! ౧౬౧.

గీ. అక్కృతంబుననీకు కోపాగ్నిహోత్ర, మునకు బలిగాక బ్రతికితి భూమినాథ!
పట్టికనఁబడునంనాకబయలుపడఁగ, మనసుగొలుపమినుంటినిమ్మగువకడనె. ౧౬౨.

వ. నేఁడు కుమారిక లభియించిన కతంబున భవద్దర్శనంబు సేయుం గలిగితి" నని పలికి యత్త్యాదరంబునం గూఁతుం గౌఁగిలించుకొని ముద్దాడి శిరంబు మూర్కొని మరల ప్రాణేశ్వరుం జూచి యిట్లనియె. ౧౬౩.

గీ. "ఈవుచేసినయొగ్గులనెల్ల నాఁడె, మఱచితి నిగానిహా! నోరుమాలినట్టి
నిసుఁగునడవికిఁబంచిన సెగులొకండె, మఱపురాద" నికన్నీరు నమగువనించె. ౧౬౪.

గీ. అప్పుడు విభుండు కన్నులనశ్రులురుల, మెలఁతపదములఁ బ్రాలిక్షమింప వేఁడ
"ననుచితంబ" నిప్రాణేశునల్ల నెత్తి, యక్కువను జేర్చి యోదార్చె నబ్జవదన. ౧౬౫.

సీ. పోయినదనుకొన్న పూబోణి బ్రతుకుటఁ జిననాఁడె యడవిని జేర్పఁబడిన
పుత్త్రికనిజగృహంబునఁ బ్రవేశించుటఁగనిదీర్ఘకాలంబు వనటమునిఁగి
యున్నవిభుండిప్పుడొందినయానందమింతంతయనుటకు నెడము లేదు
ఏవంకఁగనుఁగొన్న నెవలేనియుత్సాహవాక్యంబులేచాలవన్నెమీఱె
మంగళధ్వనులెల్లెడమలయుచుండె, నప్సరసలను బోలినయబ్జముఖులు
గానమొనరించిరత్యంతకౌతుకమునఁ, బౌరులందఱు సంతోషభరితులైరి. ౧౬౬.

ఆ. హీనజాతి నాతిగా నెన్నఁబడినప్డు, కూడఁదమదు ముద్దుకూఁతు మెచ్చి
మేలుపడినయా నృపాలాత్మజునిగొని, యూడిరెలమిమిగులనాలుమగలు. ౧౬౭.

గీ. పిదప భూవల్లభుఁడు గోపవిభునిఁ గాంచి, పరమవాత్సల్యమునఁ దనపట్టిఁ బెంచి
పెద్దఁ జేసినకతమునఁ బెక్కువగల, మెచ్చు లతనికి బహుమతులిచ్చె మిగుల. ౧౧౮.

గీ. తాము చేసిన యత్నమంతయును దుదకు, మంచిగ ఫలించుటను బహుమానవిభుఁడు
మిత్రవిందయు మదులను మిక్కుటముగ, సంతసము నొందఁగఁ డగిరా సమయమునను.

వ. అటఁ జంద్రవర్మయుఁ దొలుదొల్తఁ దన సూనుండును బహుమానుండును గానఁ బడ మికిఁ గలఁతనొంది యంతకుమున్నె బహుమానుండు స్వదేశంబునకు జనినున్న సంగతి నెఱింగినవాఁడగుటం జేసి సింహళంబున కొరకుదురని యూహించి సత్వరంబుగ బయలువెడలి తరణి నెక్కి సుమిత్రుని జీవితకాలంబునం దెల్ల మిగుల సుదినమైన యమహానందసమయంబున నెద్దియుం గొఱంత యొదవకుండ సలుపుటకో యన నచ్చట నుట్టిపడి రాజమందిరంబుఁ బ్రవేశించి వారలం గలిసి సంతోష మనుభవించుటయె కాక తనమీఁద నిష్కారణంబుగ జారత్వశంక నిరూపించినవాఁడగుటం జేసి తన మొగంబు చూచుటకు లజ్జించుచున్న సుమిత్రుని యపరాధంబు మన్నించి పూర్వస్నేహంబుం జూపుచు ననిర్వాచ్యమైన సల్లాపసుఖం బనుభవించె. ౧౨౦.

గీ. చంద్రవర్మక్షమావరచంద్రముండు, ప్రమతి నిష్ఠుతనముద్దుకొమరునకును
జేసికొనఁడే మొయనుశంక చెదరిపోయె, నా సుమిత్రాధిపుని హృదయంబునుండి. ౧౨౧.

ఆ. మున్ను తలఁచినట్లు ముదితతా నొకగొల్ల, పడుచుగాక సార్వభౌమపుత్త్రి
యగుచు సింహళమునకతి భాగ్యరాలైన, రాణియయ్యెఁ బ్రజలు రహిని మెచ్చ. ౧౨౨.

గీ. అంతనొకమంచిమూరుతమందు రామ, వర్మకును బ్రమతికి మహావైభవముగఁ
బరిణయము చేసె సింహళప్రభువరుండు, భూసురాశీర్వినాదమింపుగఁ జెలంగ. ౧౨౩.

వ. అట్లు చిరకాలం బాపత్పరంపరలం బడి కృశించిన యప్పరమపతివ్రతాశిరోమణియగు మంజువాణి శ్రమలెల్లను నాఁటితో నివారణమైన కతంబునం దనయతోడం బెనిమిటితోడం గలిసి సకలసంపదలం దులఁదూగుచు బహుకాలం బాజవం జవసుఖంబుల ననుభవించుచుండె. ౧౨౪.

గీ. ఏరుచదువుదురీకథ వారు సతుల, యెడలను నిరాపనిందల నిడక ; యుసుఱు
కరణిఁగనుఁగొంచు సర్వేశు కరుణవడసి, సౌఖ్యములనొందుదురు గాత సంతతంబు. ౧౨౫.

చ. పరమదయాలవాల ! నిరపాయసుఖప్రద ! నిత్యనిర్మలా !
నిరుపమసత్ప్రభావ ! నవనీతసమానమృదుస్వభావ ! భా
స్కరశశివహ్నిలోచన ! వికారవిమోచన ! లోకపీడనా
కరదివిజారిదుర్మదవిఖండన ! కైరవమిత్రమండనా ! ౧౨౬.

శ్రీరస్తు.

# కావ్యాలంకార సంగ్రహమునందు

# రసప్రకరణ నాయికా నాయక ప్రకరణములు.

శ్రీ శ్రీ రాజా వెలుగోటి వేంకటకృష్ణయాచేంద్ర బహాదుర్

వారి యాజ్ఞచొప్పున

నైజాము రాజ్యమునకుఁ జేరిన శ్రీ జటప్రోలు సంస్థానము పండితులగు

వెల్లాల సదాశివ శాస్త్రుల వారిచే

తత్సంస్థానపండితులగు

అవధానము శేషశాస్త్రులవారి సహకారమున

వ్రాయఁబడిన సవిమర్శమగు

వ్యాఖ్యానముతోఁ గూడినవి.



చదలువాడ సుందరరామశాస్త్రులవారిచే

పరిష్కరింపఁబడి

చెన్నపురి :

శారదాంబావిలాసముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1902.

శ్రీరస్తు.

## విజ్ఞాపనము.

ప్రాజ్ఞులారా! ప్రపంచంబునం దెల్లం దేజరిల్లు విద్యలలోఁ గొన్ని ప్రభుసమ్మితంబులు గొన్ని సుహృత్సమ్మితంబులు గొన్ని కాంతాసమ్మితంబు లనియు, నందుఁ బ్రభుసమ్మితంబు లయి శబ్దప్రధానంబు లగు వేదాదులకన్నను సుహృత్సమ్మితంబు లయి యర్థప్రధానంబు లగుపురాణాదులకన్నను గాంతాసమ్మితం బగుకావ్యంబు శబ్దార్థవ్యతిరిక్తమై లోకోత్తరానందకందం బైనకొండొకయర్థంబును బోధించుటం జేసి సకలసహృదయసముదయంబున కవశ్యసేవ్యం బనియు, నట్టిసత్కావ్యంబునకు "క. తను వగు శబ్దార్థంబులు, ధ్వని జీవ మలంక్రియా♦వితానము సొమ్ముల్। తనరు గుణంబులు గుణములు, ఘనవృత్తులు వృత్తులౌర♦కావ్యేందిరకున్." అనుటచేత ధ్వని యనునది ప్రాణరూప మనియు, నట్టిధ్వని రసధ్వని వస్తుధ్వని యలంకారధ్వని యని ముత్తెఱంగులై విలసిల్లుచుండిన నందు రసధ్వనియే నిర్భరానందరూప మగుట నాదరణీయ మ్మనియు, నయ్యది రస భావ రసాభాస భావాభాస భావశాంతి భావోదయ భావసంధి భావశబలత్వ రూపముగాఁ గావ్యప్రకాశాదుల విశదీకరింపఁబడిన దనియుం, దమయంతరంగంబులకు విదితంబె కదా! ఇట్లుండినను మనయాంధ్రదేశమున నానాటికి సంస్కృ భాషాప్రచారము తగ్గి యాంధ్రభాషయే ప్రబలినందునఁ దద్గ్రంథపఠనపాఠనాదులే యెంతయు విస్తరిల్లెను.

శ్రీశ్రీ రాజా వెలుగోటి వేంకటకృష్ణయాచేంద్రబహాదుర్ వారు దీని నంతయుఁ బర్యాలోచించి మనయాంధ్రభాషలో రసస్వరూపనిరూపకంబులు గా నుండునలంకారగ్రంథముల యన్నింటిలో నీకాలమునఁ గావ్యాలంకారసంగ్రహ మనునరసభూపాలీయ ముత్తమముగా భావింపఁబడుచున్న దని, పై మావ్రాసినరీతి నానరసభూపాలీయమున రుచ్యంబు లగురసప్రకరణనాయికాప్రకరణంబులు యథాసంద

శ్యముగాఁ బరిశీలించి లఘుటీకతోఁ జేర్చి ప్రకటీకరించినచో రసికజన మనంబుల కత్యంతప్రమోదావహం బగు నని భావించి యట్లొనరిం పుఁ డని సాంతఃకరణకరుణాబహుమానంబుగ నానతి యొసంగుటం జేసి యీ ప్రకరణంబుల మతికోలఁదిఁ బరిశీలించి యీలఘువ్యాఖ్యానము వ్రాయఁబడెను.

ఈనరసభూపాలీయ మనునది యించుమించుగాఁ బ్రతాపరుద్రీయము ననుసరించి యున్న దని యెల్లరకు విదితంబే కదా! అయిన నిందుఁ గొన్ని లక్ష్యలక్షణంబులు ప్రతాపరుద్రీయమునకు సరియైన యర్థమును బోధించునవి గాక స్వకపోలకల్పితములుగా నున్నవి. స్వయంకల్పితము లైన నిర్దోషములుగా నున్నచో గ్రహించుట కాటంకంబు లేదు. అట్లు లేక యిందుఁ గొన్నిచోట్ల లక్ష్యలక్షణసమన్వయము లేమియుఁ, గొన్నిప్రదేశములఁ బ్రతాపరుద్రీయవిరోధంబును గనిపించుచున్నవి. కావున, సంస్కృతభాషాపరిచయము లేక యాంధ్రభాష మాత్రము తెలిసినవారీనరసభూపాలీయమే రసాలంకారాదిగ్రంథముగా నమ్మి మార్గము దప్పుచుందురు. పాఠశాలలయందుఁ బరీక్షార్థంబుగా (సెనట్ వారు) దీనిం జదివించెదరు. అందు బాలురు దీనియథాశ్రుతార్థమునే యభ్యసింతురు కాఁబట్టి సంస్కృతము తెలియనిలోకము క్రమక్రమంబుగఁ దప్పుత్రోవం బోవుటకు సందియంబే లేదు. అందువలనఁ దన్నివారణార్థము గావింపఁబడిన యీపరిశీలనకు వ్యర్థము గాదు.

మఱియుఁ బ్రతాపరుద్రీయము ననుసరించిననరసభూపాలీయంపుఁజోటులయందును, వానికి సంబంధించినకొన్ని ప్రతాపరుద్రీయభాగములయందునుం గలయుద్గ్రంథవిరోధంబు విశదీకరింపవలసిన దని శ్రీశ్రీవేంకటగిరిసంస్థానప్రస్తుతప్రభుపుంగవులవారు సెల వొసంగిరి గావున నట్టిదోషంబులును యథామతి నిందు వివరింపఁబడెను.

రసగంగాధరకారుం డగుజగన్నాథపండితరాజేంద్రుం డత్యంత

ప్రౌఢమార్గము నవలంబించి పెక్కుతర్కంబుల సూక్ష్మతరదోషంబు ల నుద్ఘాటించె. ఆమార్గమునకుఁ గొన్ని కొన్ని చోటులఁ గావ్యప్రకాశాదిప్రామాణికగ్రంథములే మిక్కిలిదూరంబు లగుచున్నవి గావునఁ బ్రసిద్ధంబులుగా నున్నదోషంబులే తెలుచుగ నిందు విశదీకరింపఁబడెను.

ఈనరసభూపాలీయమునం దీరసప్రకరణనాయికాప్రకరణముల యందే గాక యితరము లగుధ్వన్యలంకారాదిప్రకరణంబులయందునం గొన్నిదోషంబు లచ్చటచ్చటఁ జూపట్టుచున్నవి. అవి సాకల్యంబుగ వ్రాయుట యప్రస్తుతంబు గావున, దిఙ్మాత్రప్రదర్శనంబుగ నొకటి రెండుదోషంబు లిచ్చట నుదాహరింపఁబడు. ఎట్లన్న.—

కావ్యప్రకరణంబున వ్యంజనాలక్షణపద్యము. ౬౬ "క. సంగతము లగుపదార్థము, లం గలవాక్యార్థమున క♦లంకారంబై। రం గగు నర్థాంతర మర,యం గావ్యములందు వ్యంజ♦నాఖ్యఁ జెలంగున్." దీనిచే నర్థవిశేషరూపమే వ్యంజనయని వచింపఁబడినది. ౫౫, "క. శబ్దవృత్తులు నభిధ ల♦క్షణ యనంగ, వ్యంజన యనంగ," ననుపద్యమున శబ్దవ్యాపారవిశేషరూపముగాఁ జెప్పఁబడినవ్యంజన కీలక్షణము సంభవింపదు గావున నసంభవదోషగ్రస్తముగా దీని నెఱుంగునది. ప్రతాపరుద్రీయమున "అన్వితేషు పదార్థేషు వాక్యార్థోపస్కారార్థ మర్థాంతరవిషయ శ్శబ్దవ్యాపారో వ్యంజనా"అని వ్యంజన శబ్దవ్యాపారరూపముగఁ జెప్పఁబడినది. ఇట్లు దోషాంతరంబు లూహ్యంబులు.

ఇఁక నలంకారప్రకరణమున వ్యతిరేకాలంకారలక్షణము. ౧౫౯ "క. ధర నుపమానముకన్నను, నరు దగునుపమేయ మధిక♦మా నన సామ్యం। బురుభేదకారణంబై, యిరవుగ వ్యతిరేక మయ్యె♦నది యెట్లన్నన్." ఇది యుపమేయాధిక్యపర్యవసాయి యగువ్యతిరేకమందు మాత్ర మన్వయించును గాని యుపమేయన్యూనతాపర్యవసాయ్యనుభయపర్యవసాయివ్యతిరేకములయం దన్వయింపదు గావున నవ్యాప్తిదోషగ్రస్తము. ప్రతాపరుద్రీయమునందు, "శ్లో॥ భేదప్ర

ధానసాధర్మ్య ముపమానోపమేయయోః । అల్పత్వాధిక్యకథనా ద్వ్యతిరేక స్స ఉచ్యతే॥'' అని యుపమానోపమేయములకుఁ బరస్పరముగ నాధిక్యాల్పత్వములు వర్ణించినపుడు వ్యతిరేకాలంకారముగఁ జెప్పఁబడినది. ఈభేదములలో మొదటిభేదమున కిందుఁ జెప్పిన 'బహుతరాశాభ్రాంతి'' యను సీస ముదాహరణం బగును. ద్వితీయభేదమునకు "శ్లో॥ రక్త స్త్వం నవపల్లవై రహమపి శ్లాఘ్యైః ప్రియాయా గుణై స్త్వామాయాన్తి శిలీముఖాః స్మరధనుర్ముక్తా స్తథా మా మపి। కాన్తాపాదతలాహతి స్తవ ముదే తద్వ న్మమాప్యావయో స్సర్వం తుల్య మశోక కేవల మహం ధాత్రా సశోకః కృతః॥'' అనునది యుదాహరణము. ఇందు వర్ణనీయరాజునందుఁ జెప్పినసశోకత్వము అశోకత్వము గలవృక్షమున కన్న న్యూనత్వమును దోఁపించుచున్నది. ఇఁకఁ దృతీయభేదమున కుదాహరణము. "శ్లో॥ దృఢతరనిబద్ధముష్టేః కోశనిషణ్ణస్య సహజమలినస్య । కృపణస్య కృపాణస్యచ కేవల మాకారతో భేదః॥'' అనునది ఇందుపమేయకృపణునియం దుపమానకృపాణమునకన్న న్యూనాధిక్యములు దోఁపమి ననుభయపర్యవసాయి యగు నని కువలయానందమునం దున్నది. ఇట్టిదోషంబుల నెల్ల నెవ్వారైన మహాశయులు సవరించినచో నతిశ్లాఘ్య మగు నని తోఁచెడు.

నేను వ్రాయుటీకయందుఁ దప్పులుగాని పొరపాటులు గాని యుండినచో నవి యెల్లఁ బరమానుగ్రహముతో మన్నించి గుణాంశములు మాత్రము గ్రహింపుఁ డని ప్రార్థించుట "శ్లో॥ శూన్యేపిచ గుణవత్తా మాతన్వాన స్స్వకీయగుణజాలైః। వివరాణి ముద్రయన్ ద్రాగూర్ణాయు రివేహ సజ్జనో జయతి॥'' అనున్యాయమును బట్టి గుణోద్ఘాటనదోషాచ్ఛాదనంబులు సజ్జనసహజధర్మములై నందునఁ బునరుక్తంబగునని కేవలముగ సత్పురుషులంగూర్చి వందనంబు లొనరించుచున్నాఁడను.

ఇట్లు:

వె - సదాశివశాస్త్రులు.

శ్రీరస్తు.

శ్రీవిశ్వేశ్వరాయనమః.

# కావ్యాలంకారసంగ్రహము - తృతీయాశ్వాసము.

## ఆంధ్రవ్యాఖ్యానసహితము.



శ్లో॥ అనధిగతమానసవ్యథ,మపరిచితాసూయ మశ్రుతోత్కలికమ్
అపరిజ్ఞాతవియోగం, కలయామి కయోరపి ద్వన్ద్వమ్.

ఉ. పంకజజన్మ యొప్పులను♦బాసి సృజింప హసించుమాడ్కి నే
వంకను దప్పు లేక వర♦వల్గుకవీంద్రముఖాబ్జవాసయై
పొంకము లౌనటుల్ భువన♦పుంజములన్ గనిపించువాణి యీ
వేంకటకృష్ణయాచనృపు ♦ వేడుక మీఱఁ గృతీంద్రుఁ బ్రోవుతన్.

### గ్రంథారంభము.

క. శ్రీరమణచరణసేవా, పారాయణ యుభయవంశ ♦ పావన లక్కాం
బారచితభాగధేయ య,పారకృపాసరస యోబ♦పార్థివనరసా. 1

టీ॥ శ్రీరమణ...పారాయణ=నారాయణునిపాదములు సేవించుటయం దాసక్తుఁడా! ఉభయవంశపావన = మాతాపితృవంశములపరిశుద్ధముచేయువాఁడా! లక్కాంబా...భాగధేయ! అనఁగా లక్కమాంబాపుత్త్రుఁడాయనుట. అపార...సరస = అధికమైనకరుణచే నార్ద్రుఁడైనవాఁడా! ఓబపార్థివనరసా=ఓబయరాజనందనుఁడైన నరసభూపాలుఁడా! దీనికి నవధరింపుమను ముందటిక్రియతో నన్వయము.

గీ. అవధరింపుము లక్ష్మల♦క్ష్యముల నెల్ల
వనఘ భవదీయనామధే♦యాంకితముగ

బహువిభక్తుల నొసరింతుఁ ♦ బద్యవితతి
నిచ్చటఁ బ్రబంధజీవితంబె ♦ ట్లటన్న. 2

టీ॥ అవధరింపుము = చిత్తగింపుము; అనఘ = పవిత్రుఁడా! కృతిపతిసంబోధనము ; ప్రబంధజీవితంబు=ప్రబంధమునకుఁ బ్రాణప్రాయమగురసము; ఎట్లుఅటుఅన్నన్ ; ఇచ్చటన్ = ఈయాశ్వాసమునందు; బహువిభక్తులన్ = అనేకవిభాగములచేత ; లక్ష్మలక్ష్యములన్ఎల్లన్=లక్షణములను లక్ష్యములనుఅన్నింటిని; భవదీయనామధేయాంకితముగన్= నీనామముచేత అంకితమగునట్లు; పద్యవితతిన్= పద్యములసమూహముచేత ; ఒసరింతున్ = నిరూపింతును. ఇచట రసవస్త్వలంకారరూప మగుధ్వనియంతయు జీవితంబయిన నం ... రసధ్వనియే లోకోత్తరానందరూప మగుట ముఖ్యజీవిత మని భావము.

ప్రతాపరుద్రీయమునందును, "అథస ర్వేషాం ప్రబంధానాం జీవితభూతస్యరసస్య" అనియున్నది. ఇందువలన, "ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్" అనుదానికి విరోధము లేదని తెలియునది.

గీ. మహితకవితావిలాసినీ ♦ మధురతరవి
లాసవిన్యాసములలీల ♦ వాసి కెక్క
నవరసంబుల నెఱిఁగింతు ♦ నవరసార్థ
గుంభగంభీరతరవచో ♦ జృంభణముల. 3

టీ॥ మహిత...లీల, మహిత=పూజ్యయగు, కవితావిలాసినీ= కవితయనెడుస్త్రీయొక్క, మధురతరవిలాస=మిక్కిలి మనోజ్ఞములగు విలాసములయొక్క, విన్యాసలీల= విన్యాసభంగి; వాసికెక్కన్=వన్నెకెక్కునట్లు; నవ...జృంభణములన్= నవరసయుక్తములగు నర్థముల యొక్క గుంభనముచేత నతిగంభీరమైనమాటల యతిశయములచేత;నవరసంబులన్=శృంగారాదినవరసములను;ఎఱిఁగింతున్= తెలుపుదును

రసలక్షణముఁ జెప్పుచున్నాఁడు.

క. పులకండంబులు గలిపిన
నలు వగుసలిలము రసాయ♦నం బగుపగిదిన్
లలితవిభావాదులచే
నలఘుతరస్థాయిభావ ♦ మమరున్ రసమై. 4

టీ॥ పులకండంబులు...సలిలము= కండచక్కెరగలిపిన యొప్పిదమగునుదకము; రసాయనంబగుపగిదిన్ = పానకమగురీతి; లలితవిభావాదులచేన్ = మనోహరములైన విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావములచేత; అలఘు...భావము=అధికమగురత్యాదిస్థాయిభావము; రసమై=రసస్వరూపమై; అమరున్=ఒప్పును. శర్కరాకర్పూరాదియోగ్యవస్తువులవలన మధురతరం బగునుదకము పానకమగురీతి సముచితవిభావాదులవలన నతిశయించి ప్రకాశించురతిహాసశోకక్రోధోత్సాహభయజుగుప్సావిస్మయశమంబు లనుస్థాయిభావములు వరుసగ శృంగారహాస్యకరుణరౌద్రవీరభయానకబీభత్సాద్భుతశాంతంబు లనునవరసంబు లగు నని తాత్పర్యము.

ఈపద్యమునం దలఘుతరస్థాయిభావ మనుచోట "అలఘువయిన స్థాయిభావ" మని యుండినచో నేకదేశాన్వయాదిదోషంబు లెవ్వియుఁ బ్రసరింపవు. "శ్లో॥ విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః। ఆనీయమానస్స్వాదుత్వం స్థాయీ భావో రసః స్మృతః॥" అనులక్షణముతో నేకవాక్యతయు నతివ్యక్తంబుగ భాసిల్లును.

స్థాయిభావలక్షణముఁ జెప్పుచున్నాఁడు.

గీ. గరిమ నదు లెన్ని గలిసినఁ ♦ గప్పుకొనుచు
జలధి గనుపట్టురీతి సం♦చారిభావ
సంచయము లెన్ని గలిసిన ♦ నించ నీక

తాన కనుపట్టుభావంబు ♦ స్థాయి దలఁప. 5

టీ॥ జలధి= సముద్రము; గరిమన్ = ఆధిక్యముచేత ; నదులెన్ని గలిసినన్ = తనలోనెన్ని నదులుచేరినను; కప్పికొనుచున్ = ఆవరించుచు; కనుపట్టురీతిన్ = అగపడునట్లు; సంచారిభావసంచయములు= వ్యభిచారి భావములయొక్క-గుంపులు; ఎన్నిగలిసినన్ = ఎన్నిచేరినను ; మించనీక = అతిశయింపనీయక; తాన= తానే; కనుపట్టుభావంబు= చూపట్టుభావము;తలఁపన్ = విచారింపఁగా;స్థాయి, స్థాయిభావమనఁబడునని యర్థము.

లవణసముద్రము తనలో మంచినీటినదు లెన్ని గలిసినను వాని మంచిగుణమును మించనీక తనక్షారగుణమునే ప్రకాశింపఁజేయునట్లు విరుద్ధావిరుద్ధభావంబు లెన్ని గలిసినను వాని సణఁచి తా నొకటియే వెలయుభావంబు స్థాయి యనంబడు నని తాత్పర్యము.

ఈలక్షణము "శ్లో॥ విరుద్ధై రవిరుద్ధై ర్వా భావై ర్విచ్ఛిద్యతే న యః। ఆత్మభావం నయ త్యన్యాన్ స స్థాయీ లవణాకరః॥" అను ప్రాచీనలక్షణము ననుసరించియున్నది. ఎక్కైన నిందు సంచారిసంచయములనుదానికి నిర్వేదగ్లానిశంకాదివ్యభిచారిభావములగుంపు లని యర్థము. "విరుద్ధైరవిరుద్ధైర్వాభావైః" అనుదానికి విరుద్ధస్థాయిభావములచేతఁగాని యవిరుద్ధస్థాయిభావములచేతఁ గాని యని యర్థముగానున్నది. "సజాతీయవిజాతీయైరతిరస్కృతమూర్తిమాన్" అనులక్షణమునకునింతియేయర్థము. వీనివ్యాఖ్యలయందును, రత్యాదిభావము సజాతీయములు లేక అవిరుద్ధము లగునాయికాంతరరత్యాదులచేతఁ గాని విజాతీయములు లేక విరుద్ధము లగుజుగుప్సాదులచేతఁగాని తిరస్కృతము గాక వెలయు నపుడు స్థాయిభావ మనఁబడును. తిరస్కృతమై యంగభావముగ భాసించునపుడు "శ్లో॥ రత్యాదయః స్థాయిభావా

స్సృత్యర్థ్యాయిష్ఠవిభావజాః । స్థోకై ర్విభావై రుత్పన్నా _స్త ఏవ వ్యభిచారిణః॥'' అనుదానింబట్టి వ్యభిచారి యగును అనియున్నది. విరోధమైత్రులు రత్యాదిస్థాయిభావములలోఁ బరస్పరమునకుఁ జెప్పఁబడినవిగాని స్థాయిసంచారులకుఁ జెప్పఁబడలేదు. "శ్లో॥ విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః । ఆనీయమానస్స్వాద్యత్వ'' మనురసలక్షణపద్యమునను సంచార్యాదులచేత నుచ్ఛస్థితి నొందింపఁబడినస్థాయి రసమగు నని యున్నది "లలితవిభావాదులచే, నలఘుతరస్థాయిభావము మరల్ రసమై'' అనునదియు నీయర్థమునే చెప్పుచున్నది. ఇఁక సంచారిలక్షణములలో "శ్లో॥ ఉన్మజ్జన్తి నిమజ్జన్తి స్థాయి న్యంబునిధా వివ'' అనుదానియందును "యథా వారిధౌ సత్యేవ కల్లోలా ఆవిర్భవన్తి విలీయన్తేచ-తద్వ దేతే రత్యాదౌ స్థాయిని సత్యే వావిర్భావతిరోభావాభ్యా మాభిముఖ్యేన చరన్తో వ్యభిచారిణః'' అనుతద్వ్యాఖ్యయైనదశరూపకమందును, "రమణీయోల్బణతాసమేత మగునీరత్యాదిభావాబ్ధిలోI నమరన్ బుట్టుచు మున్గుచున్ దగుఁ దరంగారూఢి సంచారిసంఘము'' లనునేతదాశ్వాసాంతిమపద్యమునందును, సంచారులు స్థాయిభావాబ్ధిలోఁ బుట్టుచు మునుఁగుచు నుండు నవియేకాని ప్రతిస్పర్థులు కావని తెల్లమగుచున్నది. ఇట్లు స్థాయ్యాశ్రితములై క్షణావస్థాయు లగు సంచారులు స్థాయిభావముల నుపమర్దము సేయఁ జాలవు గావున "సంచారిసంచయము లెన్ని గలిసిన మించనీక'' యనుచో సంచారిశబ్దము స్థాయిభావాభిప్రాయముతోఁ బొరపాటుగాఁ జెప్పినయట్లు వ్యక్తం బగుచున్నది. సంచారిశబ్దము వ్యభిచారిబోధకమే కాని స్థాయిభావబోధకము గాదు. భావసంచయము లనిమాత్రమున్నచో నదూష్యంబు.

క. ధర శృంగారము హాస్యము
   కరుణయు వీరము భయానకము బీభత్సం

బురరౌద్ర మద్భుతము శాం
తరసంబులు రసము లనఁగఁ దనరుం గృతులన్. 11

టీ॥ శృంగారము హాస్యము కరుణము వీరము భయానకము బీభత్సము రౌద్రము అద్భుతము శాంతము అను తొమ్మిది రసములు కృతులయందుఁ బ్రయోగింపఁబడునని యర్థము.

రసంబులు లౌకికాలౌకికభేదంబున ద్వివిధంబు లనియు, నం దలౌకికము స్వాప్నికమానోరథికజౌపనాయికభేదంబులఁ ద్రివిధం బనియు, నం దౌపనాయికము కావ్యనాట్యగత మనియు సిద్ధాంతము. ఇట్లు "మ. రమణీయోల్బణతాసమేత మగు నీ రత్యాదిభావాళితో । ననారం బుట్టుచు మున్గుచుం దగుఁ దరంగాయంధి సంచారిసం। ఘము తో తత్ప్రతిపన్న మారసము దత్కాలంబునం దైన స। త్యము రామాదులయందు నాట్యమున సభ్యావాసమై భాసిలున్." అనునీపద్యము నందును లౌకికాలౌకికభేదంబు లీయాశ్వాసాంతమునఁ జెప్పఁబడి యున్నవి. ఇందుఁ గృతుల నన్నందున నౌపనాయికరస మొక్కటియే శృంగారాదిభేదములు గల దనియభిప్రాయము తోఁచును.

మఱియు నిందుఁ గరుణయు ననుట, శ్లో॥ శృంగారాచ్చ భవేద్ధాస్యో రౌద్రాచ్చ కరుణో భవేత్ । శృంగారహాస్యకరుణరౌద్రవీరభయానకాః । పుటపాకప్రతీకాశో రామస్య కరుణో రసః । కరుణస్య మూర్తిరథవా శరీరిణీ విరహవ్యథేవ వన మేతి జానకీ॥ ఇత్యాదిప్రయోగములయందు రసబోధక మగుకరుణశబ్దము పుంలింగముగను, శ్లో॥ కరుణాశాలికపాలిభాగధేయమ్। కరుణావతి కంపతే మమ స్వాన్తమ్। కారుణ్యంకరుణాఘృణా ॥ ఇత్యాదులయందు దయాబోధక మగునది స్త్రీలింగముగను, సర్వసంప్రతిపన్నమై యుండఁగా రసవిషయమందు స్త్రీలింగప్రయోగ మయుక్తముగఁ దోఁచుచున్నది. కరుణయు ననుచో న

ముచ్ఛ్రయమునకు మాధ్యభాగమున సందర్భము లేదు గావునఁ గరుణ మనియే గ్రంథకర్త ప్రయోగించి యుండు ననవచ్చు. అయినను, "౧౫౫ క. కరుణాభయబీభత్సము, ఖరసంబులు శోకభీతి♦గాఢజుగుప్సాకరములు" అనుపద్యమునను "కరుణ విద్రుమవర్ణ గౌరవచ్ఛలమున" యనునాపద్యముపైపద్యమునను "కరుణ" యని స్త్రీలింగమును బ్రయోగించుటంజేసి యిందును గరుణయు ననియే ప్రయోగించి యుండు నని తోఁచుచున్నది.

ఈరీతి లింగభేదమే కాదు. కరుణ నిరుపాధికపరదుఃఖప్రహాణేచ్ఛారూపము, కరుణరసము శోకపరిపోషరూప, మని యర్థభేదమునుం గలిగి యుండఁగా రసాధిదేవతలఁ జెప్పుసీసములో "యమునియందు దయామ♦యత్వంబు ఘటియించు జగతి మహాకాలు♦సభయుఁజేయు" నని కరుణరసాధిపతి యగుయమునియందు శోకహేతుత్వ మనుటకు మాఱుగ దయామయత్వ మనుటయు, నవరససంకరపద్యములో "జయలక్ష్మీరతమై ప్రతాపయుతమై♦శత్రుచ్ఛిదాధుర్యమై। ప్రయతార్తావనమై" యనుపద్యమునందుఁ గరుణరసమునకు "శ్లో॥ లక్ష్మీ మాలోక్య లుభ్యన్నిగమ ముపహసన్ శోచయన్ యజ్ఞజన్మాన్" అనురసతరంగిణీశ్లోకమున "శోచయన్యజ్ఞజన్మాన్" అని యుదాహరించిన ట్లుదాహరింపక "ప్రయతార్తావనమై" యని దయావీరోదాహరణముగఁ జెప్పుటయు నాదరణీయము గాదు. రసచంద్రికలోఁ గరుణరసస్థానమునందు "ఆర్తరక్షాంకుర్వన్" అనుట, శ్లో॥ గ్రాహగ్రహగ్రస్త మతీవ దీనం పుత్త్రైః కళత్త్రై రపి మిత్త్రవర్గైః। త్యక్తం గజేన్ద్రం త్వరయాభ్యుపేత్య రరక్ష యోఽసౌ సహి మే శరణ్యః॥ అని యందు ముందు వ్రాయఁబడిన దయావీరోదాహరణములోఁ జేరుఁగాని పార్థక్యము నా

పాదించుట కర్తవ్యంబు కాదు. ఇట్లు "ఆర్తత్రాణపరాయణః స్స భగవాన్నారాయణో మే గతిః" ఇత్యాదు లన్నియు దయావీరములోఁ జేరునే కాని కరుణరసములోఁ జేర వని నాయభిప్రాయము. ఇఁక "శ్లో॥ శృఙ్గారం క్షితినన్దినీవిహరణే వీరం ధనుర్భఞ్జనే కారుణ్యం బలిభోజనే" ఇత్యాద్యనేకప్రయోగములు సేయువారి కేమి యాశయ మన్నచో దుఃఖప్రహాణేచ్ఛారూపము దయ గావున నది నియతముగ దుఃఖజ్ఞానము లేక యుదయింపదు. అట్టి దయ దుఃఖరూప మగుకరుణరసములోఁ జేరు నని యాశయ ముండు నని తోఁచుచున్నది. అట్లైనారిమతమంతను ఇష్టజనవియోగాదిజన్యవైక్లబ్యాఖ్యచిత్తవృత్తిరూప మగు శోకము దయాఘటితము గాదు గావునఁ గరుణమునకు మాఱుగ దయ కరుణ యని ప్రయోగించుటకుఁ బ్రమాణంబు చింత్యంబే, "నను దయావీరః కరుణరసఏవ కథ న్నాన్తర్భవతి - నిరుపాధికపరదుఃఖప్రహాణేచ్ఛా దయా-సాచ కరుణేనవినా నసంభవతీతి చేన్న - కరుణస్య స్థాయిభావ శ్శోకః దయావీరస్య స్థాయిభావ ఉత్సాహ ఇతి స్థాయిభావభేదేన భేదాత్" ఇత్యాదిరసతరంగిణీతద్వ్యాఖ్యాననౌకాదులవలన నేతద్విస్తరంబు దెలియు.

స్థాయిభావములు.

క. రతిహాసశోకయత్నము
లతిభీతి జుగుప్స రోష◆మచ్చెరువు శమం
బతులక్రమమున నివి సాం
ద్రతము రసస్థాయిభావ◆భావనఁ జెందున్. 7

టీ॥ రతి హాసము శోకము యత్నము భీతి జుగుప్స రోషము ఆశ్చర్యము శమము ఇవి తొమ్మిది క్రమముగ శృంగారాదినవరసములకు స్థాయిభావంబు లనంబడు నని యర్థము.

శ్లో॥ రతి ర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా।
జుగుప్సా విస్మయ శ్చైవ స్థాయిభావాః ప్రకీర్తితాః॥ అని భరతముని మొదలుగ నలంకారశాస్త్రగ్రంథకర్త లందఱు వీరరసస్థాయిభావ ముత్సాహ మనియే చెప్పియున్నారు. ఆయుత్సాహమునకు మాఱుగా నిందు యత్న మని వచింపఁబడినది. ఆయత్నము స్నానభోజనగమనాదు లగుసర్వకార్యములయందు సాధారణముగాఁ గలుగునాత్మధర్మము. అది రతిహాసాదులయందును గల్గును గానఁ గొందఱు ఉత్సాహము యత్నవిశేషరూపముగఁ జెప్పి యుండినను యత్న మని చెప్పఁ గూడదు. "శ్లో॥ వికారో మానసో భావః" అని యనుటచే భావము లన్నియు మనోవృత్తిరూపములే యని రతిహాసశోకమనోవృత్తు లనవచ్చునా? అట్లు యత్నమనుటయుఁ బొసఁగదు. "రతిహాసశుగుత్సాహము" లనుట యుక్తముగాఁ దోఁచెడిని.

క. రసములకుఁ దొమ్మిదింటికిఁ
బొసఁగినయాస్థాయిభావ◆ములకు నొనర్తున్
రసికత లక్షణలక్ష్యము
లసదృశరసశాస్త్రవేత్త◆లౌ నౌ ననఁగన్. 8

టీ॥ రసములకున్...భావములకున్=శృంగారాదినవరసములకు నొప్పిన స్థాయిభావములకు; అసదృశ...అనఁగన్=సాటిలేనిరసశాస్త్రజ్ఞులు మెచ్చు నట్లుగా; రసికతన్=రసికత్వముచేత; లక్షణలక్ష్యములు=లక్షణములను లక్ష్యములను; ఒనర్తున్=రచియింతును. ఇందు లక్షణలక్ష్యము లనుచోట, "అల్పాచ్తరమ్" అనుపాణినివ్యాకరణసూత్రముచేత లక్ష్యలక్షణము లని యుండ వలయుఁ గాని లక్షణశబ్దము ముందుండఁ గూడదు. శివకేశవు లని యుండుఁ గాని కేశవశివు లని యుం

డము గదా! అందువలన "రసికత లక్ష్యము లక్షణ మనవ్వశ" యన వచ్చునని తోఁచుచున్నది.

### రతిలక్షణము.

క. తరుణీమణులకుఁ బురుషుల
కరయఁగ సంభోగవిషయమగునభిలాష
స్ఫురణము మనములఁ బొడమిన
ధరలో నది రతి యనంగఁ దగు నెట్లన్నన్. 9

టీ॥ తరుణీమణులకున్ = యౌవనస్త్రీరత్నములకు; పురుషులకున్-యౌవనపురుషులకనుట, "శ్లో॥ యూనోరన్యోన్యవిషయాస్థాయినీచ్ఛారతిర్భవేత్" అనుటవలన యౌవనస్త్రీపుంసానురాగమె రతి యనఁబడుఁగావున "తరుణీమణులకుఁదరుణుల" కనుటయుక్తంబు. అరయఁగన్ = విచారింపఁగా; సంభోగ...స్ఫురణము—సంభోగవాంఛ యనుట; మనములఁబొడమినన్ = మనస్సులయందుఁగలిగినయెడ; ధరలోన్ = భూమియందు; అది = ఆయభిలాషము; రతియనంగన్; తగున్ = ఒప్పును. ఎట్లన్నన్. తరుణీతరుణుల కితరేతరాలంబన మగు ప్రేమ యనెడుచిత్తవృత్తి రతి యని తాత్పర్యముఁ జెప్పుట యుక్తతమంబు. ఏలయన, రతియనునది ప్రేమ ప్రీతి యనునొకచిత్తవృత్తియే, అది గురుదేవతాపుత్రమిత్రకళత్రాదివిషయకమైయుండును. దానిం బెద్దలు స్త్రీపుంసుల కన్యోన్యవిషయకమైనపుడు శృంగారస్థాయిగను గురుదేవతాపుత్రాదివిషయకమైనపుడు వ్యభిచారిగను జెప్పుదురు. అట్టి రతి స్థాయిభావం బగునపుడు సంభోగవిషయకేచ్ఛారూప మనియు; పుత్రాదివిషయకమైనపుడు ప్రేమరూప మనియు నొక రతికి రెండు లక్షణములు చెప్పుటకన్న రతి యంతయుఁ బ్రేమాఖ్యచిత్తవృత్తిరూపమే యనుట యుక్తం బని నవీనాలంకారికసిద్ధాంతము. సంభోగేచ్ఛా

రూపము శృంగారస్థాయి రతి యని చెప్పి సంభోగపదమునకు, శ్లో॥ అనుకూలౌ నిషేవేతే య త్రాన్యోన్యం విలాసినౌ । దర్శనస్పర్శనాదీని స సంభోగ ఇతీరితః॥ అని లక్షణాంతరము సేయుట్రప్రయాసకన్న నిదియే యుక్తతమంబు, ఇట్లు రసగంగాధరమున "తత్ర స్త్రీపుంసయో రన్యోన్యాలమ్బనః ప్రేమాఖ్య శ్చిత్తవృత్తివిశేషో రతిః స్థాయిభావః- గురుదేవతాపుత్రాద్యాలంబనస్తు వ్యభిచారీ" యని వ్రాయంబడినది. కావ్యప్రకాశతాత్పర్యము నింతె. ఈరతి యంకురపల్లవాద్యవస్థలు ౭గ. ల దయి యుల్లసిల్లు. అందు అంకురావస్థయందుఁ బ్రేమ మనునామమును, పల్లవావస్థయందు మాన మను పేరును, కలికావస్థయందు ప్రణయ మనునాఖ్యను, పుష్పావస్థయందు స్నేహ మనునభిఖ్యను, ఫలావస్థయందు రాగ మనునభిధానమును, భోగావస్థయందు అనురాగాహ్వయమును జెంది తేజరిల్లు. ఈఫలాంతపంచావస్థలు పూర్వానురాగరూప మగునభిలాషజన్యవిప్రలంభమునందును, భోగావస్థ యనునది సంభోగశృంగారమునందుం జేరి యుండును, శ్లో॥ అఙ్కురపల్లవకలికాప్రసూనఫలభోగభాగియం క్రమశః । ప్రేమా మానః ప్రణయస్స్నేహో రాగోఽనురాగశ్చ॥ ఇయ మఙ్కురితా ప్రేమ్ణా మానాత్పల్లవితా భవేత్ । సకోరకా ప్రణయత స్స్నేహాత్కుసుమితా భవేత్॥ రాగా త్ఫలవతీ సేయ మనురాగేణ భుజ్యతే॥ ఇత్యాదిప్రమాణము లనుసంధించునది. ఈయంకురితత్వాద్యవస్థలవలనఁ బూర్వానురాగరూపవిప్రలంభమునందు దశావస్థలు,కొందఱిమతమునందు ద్వాదశావస్థలు నుదయించుచున్నవి. ఈయవస్థలు విరహప్రవాసాదిజన్యవిప్రలంభాంతరములం దుదయించుచున్నను బ్రాచీనులు పూర్వానురాగమందే యుదయించునట్లు వ్రాసిరి. ప్రతాపరుద్రీయమున, "తత్ర శృఙ్గార స్యాఙ్కురితత్వ పల్లవితత్వ కోరకితత్వ పుష్పితత్వ ఫలితత్వ స్యా

తథో దశావస్థా భవన్తి" అనియున్నది. ఆయవస్థలు, శ్లో॥ చక్షుః ప్రీతిః ప్రథమం చిన్తా సఙ్గ స్తతోఽథ సంకల్పః। నిద్రాచ్ఛేద స్తనుతా విషయనివృత్తి స్త్రపానాశః। ఉన్మాదో మూర్ఛామృతి రిత్యేతే స్మర దశా దశైవ స్యుః॥ అని తెలియఁదగినవి. శ్లో॥ అవస్థా ద్వాదశ మతాః కామశాస్త్రానుసారతః॥ అని ప్రతాపరుద్రీయమున కామశాస్త్రానుసారమున ద్వాదశావస్థ లనియనుటవలన నలంకారశాస్త్రసమ్మతములు దశావస్థలే యని యెఱుంగునది. ఈప్రతాపరుద్రీయమున "శృఙ్గారస్య" యనుదానికి "అర్థాత్ అయోగశృంగారస్యేత్యర్థః" అని వ్యాఖ్య యున్నది గానఁ బూర్వానురాగమునకు స్థాయి యగుగతి కని భావము. మఱియు నిందు "కోరకితత్వ" యనునది యిపుడు ముద్రితపుస్తకములలోఁ గాన్పించకుండిన నముద్రితములఁ గొన్నింటిలో నుండుటవలనను, శ్లో॥ ఈషదఙ్కురితవిభ్రమచారౌ దేహపల్లవితశాన్తిని తన్వ్యాః। యౌవనే ముకుళితస్తనమాత్రే పుష్పిలి శ్చ ఫలితశ్చ మనోభూః॥ అని కోరకావస్థ ప్రతాపరుద్రీయముననే పూర్వము వ్రాయఁబడినందునను, నిచటఁ దత్పరిత్యాగము నందుఁ గారణము లేనందునను వ్రాసితిమి.

రతి కుదాహరణము.

ఉ. చల్లఁదనంబె చంద్రునకుఁ ♦ జక్కఁదనంబె ప్రసూనధన్వికిన్
సల్లలితోరుసౌరభమె ♦ చైత్రున కొక్కని కొక్క మేలిమే
తెల్లము గాక నాపతి యు ♦ దీర్ణగుణాఢ్యుఁడు నారసింహభూ
వల్లభుఁ డట్లు సర్వగుణ♦వైభవ మెవ్వరి కైనఁ గల్గునే. 10

టీ॥ చంద్రునకున్=సుధాంశునకు; చల్లఁదనంబె=చల్లనివాఁడై యుండుటయె. ప్రసూనధన్వికిన్=మన్మథునకు; చక్కఁదనంబె=సౌందర్యమే; చైత్రునకున్ = వసంతునకు; సత్...సౌరభమె, సత్=శ్రేష్ఠ

ష్మైనట్టి, లలిత=మనోజ్ఞమైనట్టి, ఉప=గొప్పదగు, సౌరభమె=పరిమళ
మే. ఒక్కనికిన్ ఒక్కమేలిమే=ఒకనికొకయతిశయంబే; తెల్లముగాక=
ప్రసిద్ధముకాని. నాపతి=నాభర్తయగు;నారసింహభూవల్లభుఁడు=నరస
భూపాలుఁడు ; ఉదీర్ణగుణాఢ్యుఁడు=ఉత్కటగుణాభిరాముఁడు. అట్లు=
అవిధముగ;సర్వగుణవైభవము=సకలగుణసంపద; ఎవ్వరికైనన్; కల్గు
నే=సంభవించునా? కల్గదనుట. ఇచట నాయిక సేయునరసభూపాలగుణ
నుతిచేత నామె కాభూపాలునియందు రతి వ్యజ్యమాన మగుచున్నది
గనుక నిది రతి కుదాహరణము.

## హాస లక్షణము.

క. చేకొని యక్రూరము లగు
నాకారవికారచేష్ట • లాలోకింపన్
గైకొనుమనోవికాస
స్వీకారము హాస మయ్యె • విను మెట్లన్నన్. 11

టీ॥ చేకొని—ఆదరించియనుట; అక్రూర...చేష్టలు= భయంక
రములుగాకున్న అకృతులను వికృతచేష్టలను; ఆలోకింపన్ = చూడఁ
గా ; గైకొనుమనోవికాసస్వీకారము = పొందునట్టి వికాసరూపమగు
మనోవృత్తినిస్వీకరించుట; హాసమయ్యెన్ = హాసమనుస్థాయిభావమా
యెను. ఎట్లన్నన్. వినుము = ఆకర్ణింపుము. అక్రూరము లగునాకా
రవికారచేష్టలు చూచుటచేఁ గలిగెడుమనోవికాసము హాసమని తా
త్పర్యము.

ఇట నక్రూరము లనుటచే. "సౌమ్యంబు లగునాకారములను
జూచినం గలిగెడుహర్షరూపమనోవికాసాదులును హాసములోఁ జే
ర్చునా?" యని యాశంక దోఁచును. మఱియు వికృతాభాషణముచే
తను హాసము చెప్పఁబడియున్నది. అది లేమి న్యూనతయుఁ దోఁచును.

కావ్యాలంకారచూడామణియందు, "క. అతివికృతదర్శనాఖ్యా, సితచే ష్టాగతులచేతఁ ♦ జేపడుహాస ప్రతిపాదన మెయిఁ గంగిఁదగు" నని యున్నది. ఆరీతి నిందు, "క. చేకొని అతివికృతములగు. నాకారాలాప చేష్టి ♦ తాదులు చూడక" అనియుండినచో నిర్దోషంబులు దూరంబులగు నని తోఁచెడిని.

హాసోదాహరణము.

చ. అదె యిదె వచ్చె వచ్చె నర ♦ సాధిపుఁడాడి యటంచుఁ బాళెము
ల్బెదరి బరీదుఁ డేగునెడఁ ♦ బెంపఱి ఖానులు వెన్కముందుగాఁ
గదిసి హయాళి నెక్కి హయ ♦ కంధరముల్ పొడగానక ప్పుడే
చదిపిరి వాజిమస్తముల ♦ శత్రు లటంచు భ్రమింతు రెంతయున్.

టీ॥ నరసాధిపుఁడాడి = నరసభూపాలుని దండయాత్ర; అదె యిదె వచ్చెన్ వచ్చెన్ అటంచున్ = అదిగో యిదిగో వచ్చె వచ్చె ననుచు, పాళెముల్ = సేనలు; బెదరి = భయపడి; బరీదుఁడు = బరీదుఁడను నొక శత్రురాజు; ఏగునెడన్ = పోవుసమయమున; ఖానులు = తురుష్కులు; పెంపఱి = గర్వము డిగి; హయాళిన్ = గుఱ్ఱముల సమూహమును; వెన్కముందుగాఁ గదిసి = వెనుకటిభాగము ముందగునట్లుగాఁ జేరి; ఎక్కి = ఆరోహించి; హయకంధరముల్ = అశ్వముల కంఠములను; పొడగానక = చూడక; శత్రులు = ప్రతిపక్షులు; వాజిమస్తములన్ = గుఱ్ఱముల తలలను; అప్పుడే చదిపిరటంచున్ = అప్పుడే త్రుంచిరని; ఎంతయున్ = మిక్కిలి; భ్రమింతురు = భ్రమనొందుదురు. ఇచట ఖానులయు క్రూరచేష్టలఁ జూచువారికి హాసము గలుగు నని తాత్పర్యము.

ఈయుదాహరణము, "శ్లో॥ దూరాదాకర్ణ్య విశ్వప్రసృమరమహసో వీరరుద్రస్య జైత్రప్రస్థానారమ్భభేరీనినద మరినృపాః పూర్ణకర్ణజ్వరార్తాః । ఆరుహ్యాద్రీన్ విశన్తో గహన మతిమహా తరుకణ్టకాకృష్టకేశా స్త్రాయధ్వ మ్ముఞ్చతేతి ప్రతినృపతిధియా పాదపాన్ ప్రార్థయ

స్తే॥" అనుప్రతాపరుద్రీయ భయోదాహరణమునకు, "చ. అనఘ నృసింహ నీయరి వనావళి కేగి గుహాగ్రసుప్తుఁడై । యని మరలం గ లం గని భయంపడి పాఱుచు నాజి కాదు కా। దని సతి దెల్పినం దె లియఁ డౌర నిషాదులఁ జాపహస్తులం। గని విపినేభపంక్తి గని క్రమ్మఱ నాజియ కాఁ దలంచుచుర్." అనునేతద్గ్రంథస్థభయోదాహరణమునకు, భిన్నముగఁదోఁచదు. హాస మాంత్రస్థపరసంస్థాదిభేదములు గలది గా నుండినను "శ్లో॥ బిభ్రాణాః కబరీ ర్ధృతాఞ్జనదృశః కృత్వా కుచౌ కృత్రిమౌ స్త్రీవేషా స్సిశి కాకతీన్ద్రనగరే ప్రచ్ఛన్నరూపాన్నృపాః । దృష్ట్వా శ్యామ మపాస్య వక్షసి కుచా వాకృష్య నీవీన్పృశో హీహీ కష్ట మితి త్యజన్తి విపణిశ్రేణీషు ధూర్తా విటాః॥" అనుప్రతాపరుద్రీయమునందలిహాసోదాహరణమువలె భయోదాహరణమును బోలని హాసోదాహరణ మూహింప వలయు.

శోకలక్షణము.

క. హితజనవిరహవ్యథచే
నతిశయమై జనులమాన సాంభోజమునన్
బ్రతిదినము పొడముదుఃఖం
బతిభూమి వహింప శోక మగు నెట్లన్నన్. 13

టీ॥ హితజనవిరహవ్యథచేన్ = ఇష్టజనవియోగదుఃఖముచేత; అతిశయమై = అధికమై; జనులమానసాంభోజమునన్ = జనులకమలమువంటిమనస్సునందు; ప్రతిదినముపొడముదుఃఖంబు = ప్రతిదినముదయించెడు దుఃఖము; అతిభూమివహింపన్ = అతిశయముపొందఁగా; శోకమగున్ = శోకమనుస్థాయిభావమగును. అదియెట్లన్నన్. ఇష్టజనవిరహాదులవలన నుదయించుదుఃఖము శోక మని తాత్పర్యము.

ఇందు "వ్యథచేఁ గలుగుదుఃఖము శోక" మనుట. "పీడాబా

ఖాద్వ్యథాదుఃఖ” మ్మనుకోశముచే, వ్యథాదుఃఖశబ్దములు సమానార్థకము
లు గావున ననన్వితంబు. మఱియు. “శ్లో॥ ఇష్టజనస్య వినాశా చ్చాపా
క్లేశాచ్చ బన్ధనా ద్వ్యసనాత్ । ఏతై ర్ర్థవిశేషైః కరుణాఖ్యోరస స్స
ముత్పవతి” అనుభరతవచనమునుబట్టి యిష్టజనవిరహాదు లనేకములు
శోకహేతువులుగాఁ దెలియఁబడుచున్నవి గావున నిందు “హితజనవి
రహాదులచే” ననుట యుక్తతమము. రెండవయుఁ “ప్రతిదినము నతి
శయమై యతిభూమి వహింప” ననుటవలన శోకముయొక్క పరమో
త్కృష్టదశ బోధింపఁబడుచున్నది. “శోకస్యపరిపోషఃకరుణః” ఇత్యా
దిగ్రంథములవలన నట్టిపరమోత్కృష్టదశ నొందిన శోకమే కరుణరస
మనంబడును, కావున నీశోకలక్షణము కరుణలక్షణమును బోలకుండు
నట్లు సవరింపఁదగినది. ఇట్లు “పతుల నృసింహశౌర్యశిఖిపాలుగఁ
జేసిన,” యనుపై శోకోదాహరణమును. “శ్లో॥ అపహాయ సకలబా
న్ధవచిన్తా ముద్వాస్య గురుజనప్రణయమ్ । హాతనయ వినయశాలిన్ క
థమివ పరలోకపథికో భూః ॥ హా మాత స్త్వరితాసి కుత్ర కిమిదం
హా దేవతాః క్వాఽఽశిషో ధిక్ప్రాణాన్ పతితోఽశని ర్హుతవహ స్తేఽఙ్గే
షు దగ్ధే దృశౌ । ఇత్థం గద్గదమధ్యరుద్ధకరుణాః పౌరాఙ్గనానాం గిరః
కుడ్యస్థానపి రోదయన్తి శతధా కుర్వన్తి భిత్తీ రపి॥” అనురసగంగా
ధరకావ్యప్రకాశోదాహృతకరుణరసోదాహరణములకన్న భిన్నముగఁ
దోఁచదు. ప్రతాపరుద్రీయమునందును, “ఇష్టజనవిరహాదినా ఆత్మని
దుఃఖాతిభూమి శ్శోకః” అనులక్షణమును, “శ్లో॥ నాథ త్వన్నిష్కరుణో
ఽసి శిశుయసి కిం వన్యాం శరీరస్థితిం తత్రాద్యప్యభవా గృహాః క్వను
గతాః స్థాన మ్మరుః కల్పితం । హా నాథాః పతితాః ప్రతాపనృపతేః
క్రోధార్చిషీతి ద్విషద్యోషాణాం త దనూప మశ్రుభి రహో జాతం
స్థలీ క్ష్మారవం” అనులక్ష్యమును, కరుణలక్షణతదుదాహరణములకన్న

భిన్నములుగాఁ దోఁచవు. ఇట్లు మఱికొన్ని స్థాయిభావముల లక్షణములు లక్ష్యములు వ్యాకీర్ణములుగా నున్నవి, స్వయ మూహింపఁ దగినయవి.

కావ్యప్రకాశరసగంగాధరములందు రసలక్ష్యములు చెప్పఁబడినవి కాని స్థాయిలక్ష్యములు వేఱుగఁజెప్పఁబడలేదు. రసగంగాధరమున స్థాయులకు లక్షణములు మాత్రము వేఱుగ వ్రాయఁబడినవి గాని లక్ష్యములు వ్రాయఁబడలేదు. రసతరంగిణీసచంద్రికాదులందు రసములకు స్థాయులకు లక్ష్యలక్షణములు వేర్వేఱుగ వ్రాయఁబడియున్నవి. కావ్యాలంకారచూడామణి యనునాంధ్రగ్రంథమునను వేర్వేఱుగ వ్రాయఁబడి యున్నవి. ప్రతాపరుద్రీయమందును, నరసభూపాలీయమునందును, రతికి శృంగారమునకు మాత్రము, "శ్లో॥ శృంగారైకరసః స్మరోఽస్తు జగదానన్దైకనిష్యన్దభూ రిన్దుస్త్వస్తు విభర్తి మైకవసతి ర్జాగర్తు పుష్పాకరః। సన్త్వన్యేపి గుణప్రసాదితధృశః కింత్వై రశేషోన్నతో జాతః కాకతివల్లభో మమపతిః కామస్య కామోత్సవః॥" "శ్లో॥ రహః ప్రత్యాసన్నే హృదయదయితే రుద్రనృపతౌ నివృత్తా మానాజ్ఞా విరళ మపి లజ్జావిలసితమ్। కి మన్య త్తే గోప్యం బహిర బహి రానన్దమసృణః స్మరావేశః కోపి ప్రియసఖి నృపే నైకయతి మామ్॥" అనియు, "చ. చల్లఁదనంబె చంద్రునకుఁ ♦ జక్కఁదనంబె ప్రసూనధన్వికిన్। నల్లలితోరుసౌరభమె ♦ చైత్రున కొక్కని కొక్కమేలిమే। తెల్లముగాక నాపతి యు ♦ దీర్ణగుణాఢ్యుఁడు నారసింహభూవల్లభుఁ డట్లు సర్వగుణ ♦ వైభవ మెవ్వరికైనఁ గల్గునే." "మ. మరుఁడాచార్యుఁడు గా విశీర్ణకబరీ ♦ మాల్యాళి పుష్పాంజలి। స్ఫురణల్ గాఁ దదుపేతభృంగనినద ♦ స్తోమంబు గానంబు గా। వరమం

జీరరవంబు తాళగతి గా ♦ వర్ధిల్లుశాతోదరీ ! సురతవ్యత్యయవేగతాం డవ మొన♦ర్చం జింతితాభీష్టముల్." అనియు వేర్వేఱుగ వ్రాసిరి గాని యట్లితరరసస్థాయులకు వ్రాయరైరి. వ్రాసినస్థాయ్యుదాహరణముల నైన రసోదాహరణవ్యామిశ్రములుగా నుండునటులు వ్రాసిన వారు కారు. కావ్యప్రకాశకారాదులవలె ప్రధాన మగురసధ్వనులకే యుదాహరణంబు లిచ్చినవారును గారు. రసతరంగిణ్యాదులవలన లక్ష్య లక్షణభేదంబులు వ్యక్తంబు లగుఁ గావునఁ దారతమ్యమాలోచింప వచ్చు నని, విస్తరభీతిచేతను, నిందలిలక్ష్యలక్షణసంకీర్ణత్వదోషము నవరింప నలవి గానిహేతువుచేతను, విరమించితి.

శోకోదాహరణము.

చ. పతుల నృసింహశౌర్యశిఖి♦పాలుగఁ జేసినయట్టిపాపపు
శ్శతధృతి కంతటఁ జలము ♦ జాలదు మమ్మును దావపావక
ప్రతతులపాలు చేసె నని ♦ పల్మఱు రోదన మందువిద్విష
త్సతులకు బాష్పపూరములె ♦ చాలు వనానలముఁ హరింపఁగన్.

టీ॥ పతులన్=భర్తలను; నృసింహ...పాలుగన్, నృసింహ=నరసభూపాలునియొక్క, శౌర్యశిఖి=ప్రతాపమనునగ్నికి, పాలుగన్=అధీనమగునట్లు; చేసిన...శతధృతికిన్=కావించినపాపాత్ముండగుబ్రహ్మకు; అంతటన్ = అంతమాత్రమున ; చలముజాలదు = వైరముడుగదు. మమ్మును;దావ...పాలున్=దావాగ్నిసమూహములకధీనము; చేసెన్= ఒనరించెను. అని; పల్మఱున్= మాటిమాటికి; రోదన...సతులకున్= రోదనముచేయుశత్రుభార్యలకు ; బాష్పపూరములె = కన్నీటివఱదలె; వనానలమున్=దావాగ్నిని; హరింపఁగన్= ఆర్పుటకు; చాలున్= పర్యాప్తము. ఇందు శత్రువనితలకుఁ బ్రియవియోగముచేత దుఃఖోదయమాయినట్లు చెప్పినందున నిది శోకోదాహరణ మగును.

ఉత్సాహలక్షణము.

క. అత్యున్నతలోకోత్తర
కృత్యంబులు సేయ వేఁడి ♦ కృతకృత్యు లిలన్
నిత్యము దలఁచుప్రయత్నం
బత్యంతోత్సాహ మయ్యె ♦ నది యెట్లన్నన్. 15

టీ॥ ఇలన్=భూమియందు; కృతకృత్యులు=కృతార్థులు; అత్యున్నత...కృత్యంబులు=మిక్కిలిగొప్పలగులోకోత్తరకార్యములను; చేయన్=చేయుటకు; వేఁడి = కోరి; నిత్యము = ఎల్లప్పుడు; తలఁచుప్రయత్నంబు=చింతించుయత్నము; అత్యంతోత్సాహము= మిక్కిలియుత్సాహమనునది; అయ్యెన్. అదియెట్లన్నన్. లోకోత్తరకార్యములనుద్దేశించి చేయుస్థిరతరప్రయత్న ముత్సాహ మని తాత్పర్యము.

ఇందు లోకోత్తరకార్యము లనఁగ దానదయాయుద్ధము లనియు, వానింబట్టి వీరరసము దానవీరము, దయావీరము, యుద్ధవీరము, అని ముత్తెఱంగు లనియు, ప్రాచీనాలంకారికులు వ్రాసిరి. నవీనాలంకారికులగు రసగంగాధరకారాదులు దానదయాయుద్ధములవలె సత్యము క్షమ బలము పాండిత్యము మొదలగునవియు ననేకలోకోత్తరకార్యములు సంభవించుచున్నవి గాన శృంగారరసమునకువలె వీరరసమునకు ననేకభేదములు గలుగుచున్నవి యని వ్రాసిరి. శృంగారమున కనేకభేదములైనందున గణింప శక్యము గామి నేకభేద మే చెప్పినయట్లు వీరమును నొకవిధమే యనుట యుక్త మని తద్గ్రంథాశయము. నాకు నిదియే యుక్తముగఁ దోఁచుచున్నది.

ఉత్సాహోదాహరణము.

మ. అసిఁ జెండాడి విపక్షవృక్షముల శౌ ♦ ర్యాగ్నిచ్ఛటం బేల్చి శ
స్త్రాసరత్సిరములన్ రణోర్వీతలమున్ ♦ సంక్షుణ్ణముం జేసి వై

ర్యసృగార్ద్రం బొనరించి ప్రోది గొన కుద్యత్కీర్తి సస్యౌఘము
ల్వెస సిద్ధించునె యంచుఁ బల్కి నరసక్ష్మానాథు యోధావళుల్.

టీ॥ నరస...ఆవళుల్=నరసభూపాలునిభటులసమూహములు; విపక్షవృక్షములన్ = శత్రువులనువృక్షములను; అసిన్=ఖడ్గముచేత; చెండాడి=ఖండించి; శౌర్యాగ్నిచ్ఛటన్= ప్రతాపమనునగ్నిసమూహముచేత; పెల్చి=కాల్చి; శస్త్రసరత్సీరములన్, శస్త్ర=బాణములనెడు, సరత్=ప్రసరించుచున్న సీరములన్= నాగేళ్ళచేత. రణోర్వీతలమున్=యుద్ధభూమిప్రదేశమును; సంక్షుణ్ణమున్=మెదిగినదానిఁగాఁ; చేసి=ఒనరించి; వైర్యసృగార్ద్రంబున్=శత్రువులయొక్క రక్తముచేఁ దడిసినదానిఁగా; ఒనరించి = చేసి; ప్రోదిగొనన్—పెంపుఁబొందనున్నయెడ; ఉద్యత్కీర్తిసస్యౌఘముల్ = ప్రకాశించుచున్నకీర్తియనెడు పైరుపంటసమూహములు; వెసన్ సిద్ధించునె = వేగముగసిద్ధించునా? అంచున్=ఇటనుచు; పల్కన్. ఇచటనరసభూపాలభటులకు యుద్ధమను లోకోత్తరకార్యమునందు స్థిరప్రయత్నము చెప్పఁబడినదిగాన నుత్సాహమునకుదాహరణమగునని తాత్పర్యము. దానవీరుఁడు దధీచి, దయావీరుఁడు శిబిచక్రవర్తి, సత్యవీరుఁడు హరిశ్చంద్రుఁడు, ఇత్యాదులూహించునది, "శ్లో॥ దధీచి ర్దానవీరోఽభూ ద్దయావీర శ్శిబి ర్నృపః। హన్మాగో యుద్ధవీరోఽభూ న్నిదర్శన మమీ త్రయః॥" అని ప్రబోధచంద్రికయందుఁ గలదు.

భయమునకు లక్షణము.

క. క్రూరాకారము చూచిన
నారయ నేజనునిహృదయమందు ననర్థాం
కూరాశంకన మగు నది
ధారుణిలో భయ మనంగఁ దగు నెట్లన్నన్. 17

టీ॥ క్రూరాకారము = భయంకరాకృతిని; చూచినన్ = చూచుటవలన; ఆరయన్ = విచారింపఁగా; ఏజనునిహృదయమందున్ = ఏనరునిమనస్సునందు ; అనర్థాంకూరాశంకనము — మరణాద్యనర్థకార్యములయొక్క శంకయనుట; అగున్ = అగునో; అది — ఆయనర్థాశంకనమనుట; ధారుణిలోన్ = భూమియందు; భయమనంగఁదగున్ = భయమనుస్థాయిభావమనఁ జెల్లును. ఎట్లన్నన్.

సంచారిభావములలో నుండుత్రాసమునకు, స్థాయిభావములలో నుండుభయమునకు, "దరత్రాసౌభీతిర్భీస్సాధ్వసంభయ" మ్మనుకోశమునందుఁ బర్యాయత చూపట్టిన నిందింతియె భేదము. వ్యాఘ్రాదిదర్శనమువలన నుదయించుమరణాదిపరమానర్థాశంక భయము. తదితరభయహేతువులవలన నుదయించుమరణాదివ్యతిరిక్త సాధారణానర్థాశంక త్రాసమని తెలియునది. ఇట్లు రసగంగాధరము. "శ్లో॥ దూరాదాకర్ణ్య విశ్వప్రసృమరమహసః" అనుపూర్వోదాహృత ప్రతాపరుద్రీయభయోదాహరణపద్యమునందుఁ గ్రూరశబ్దశ్రవణముచేత భయము చెప్పఁబడినది గాన నిందు "క్రూరాకారాదికమున నారయ" ననుట యుక్తమనితోఁచెడి.

వెండియుఁ బ్రాణిమాత్రసాధారణం బగుభయ మిందు "నేజనుని" యని జనునియందు మాత్రము వ్రాయఁబడినది. కావ్యాలంకారచూడామణియందు "అది, నియతంబగుచుండుఁబ్రాణి ♦ నికరంబులకున్" అని ప్రాణిమాత్రమునకుఁ జెప్పఁబడినదె కాని యిట్లులేదు. మఱియు నేజనుని యనుచోటి యచ్ఛబ్దమునకు నుత్తరవాక్యమునందుఁ దచ్ఛబ్దప్రయోగము లేమి "శ్లో॥ మీలితం యదభిరామతాముఖే సాధు చన్ద్రిమసి పుష్కరైః కృత" మ్మనుపద్యమునఁ గావ్యప్రకాశమునందుఁ జెప్పఁబడినసాకాంక్షత్వదోషము దుర్నివారము. అది యనునది యనర్థాశంకను బోధింపవలెను గావునఁ బూర్వోక్తాకాంక్షను బూరింపఁజాల

ము. క్రూరదర్శనాదిజన్య మగు సనర్థాశంక భయ మనియే లక్షణ ముం డఁగ నేజనునియనుట యవ్యావర్తకవిశేషణ మనియుఁ దెలియవలయు.

ఈభయము స్వనిష్ఠము పరనిష్ఠ మని రెండుతెఱంగులు, అందు స్వనిష్ఠము లగునపరాధాదులవలన నుదయించునది స్వనిష్ఠము. పరనిష్ఠము లగుక్రూరధ్వనులూ క్రూరాకారములు మొద లగువానివలనఁ గలుగునది పరనిష్ఠ మని తెలియునది.

భయోదాహరణము.

చ. అనఘ నృసింహ నీయరి వనావళి కేఁగి గుహాగ్రసుప్తుఁడై
యని మరలం గలం గని భయంపడి పాఱుచు నాజి కాదు కా
దని సతి దెల్పినం దెలియఁ డౌర నిషాదులఁ జాపహస్తులం
గని విపినేభపంక్తిఁ గని క్రమ్మఱ నాజియ కాఁ దలంచుచున్. 18

టీ॥ అనఘ = అకలంకుఁడా! నృసింహ = నరసభూపాలుఁడా! నీయరి = నీశత్రువు; వనావళికిన్ = అరణ్యసమూహమునకు; ఏఁగి = పోయి; గుహాగ్రసుప్తుఁడై = గుహయొక్క ముందటిభాగమున నిద్రించినవాఁడయి; కలన్ = స్వప్నమందు; మరలన్; అనిన్ = యుద్ధమును; కని = చూచి; భయంపడి = భీతుఁడయి; పాఱుచున్ = పరుగిడుచు; సతి = భార్య; ఆజి కాదుకాదని తెల్పినన్ = యుద్ధముకాదుకాదుపరుగెత్తకుమని తెలియఁజేసినను; చాపహస్తులన్ = ధనుస్సుచేతులంగల; నిషాదులన్ = బోయలను; కని = చూచి; విపినేభపంక్తిన్ = అడివియేనుఁగుసమూహములను; కని = చూచి; క్రమ్మఱన్ = మరలను; ఆజియ కాఁదలంచుచున్ = యుద్ధమనియే తలఁచుచు; తెలియఁడు = నిజము తెలిసికొనఁజాలఁడు. ఔర = ఆశ్చర్యము! ఇందు, క్రూరాకారము లగుయుద్ధాదులను జూచి శత్రువుహృదయమందు మరణరూపానర్థశంక జనియించినది కావున భయమున కుదాహరణమని తాత్పర్యము.

జుగుప్సాలక్షణము.

క. పలలాస్థిశోణితాదులఁ
బలుమాఱును జూడ నరుచి ♦ భావములోనం
దళుకొత్తు నిగర్హణ మది
తలపోయ జుగుప్స యనఁగఁ ♦ దగు నెట్లన్నన్. 19

టీ॥ పలలాస్థిశోణితాదులన్=మాంసము ఎముక రక్తము మొదలగువానిని; పలుమాఱును = మాటిమాటికిని; చూడన్ = అవలోకింపఁగా; అరుచిన్ = అసహ్యతచేత; భావములోనన్= హృదయమందు; తళుకొత్తునిగర్హణము=ఉదయించునిందయేదికలదో; అది=ఆనింద; తలపోయన్=విచారింపఁగ; జుగుప్సయనఁగఁదగున్=జుగుప్సయను స్థాయిభావమగును. ఎట్లన్నన్. మాంసశోణితాదిదర్శనాదులచే నుదయించునేవగింత జుగుప్స యని తాత్పర్యము. మాంసాదులు చూచిన నరుచి కొందఱికిఁ దోఁచదు గానఁ బురీషాద్యసహ్యవస్తుదర్శనముచేత నుదయించుగర్హణమే జుగుప్స యనఁ దగు నంద్రు. ఇందుఁ బ్రతాపరుద్రీయలక్షణము, "అర్థానాం దోషదర్శనాదిభి ర్గర్హణా జుగుప్సా" అనునది, "శ్లో॥ ఉత్కృత్యోత్కృత్య కృత్తిం ప్రథమ మథ పృథూత్సేధ భూయాంసి మాంసా న్యంసస్ఫిక్ పిండపృష్ఠాద్యవయవసులభా న్యుగ్రపూతీని జగ్ధ్వా। ఆర్తః పర్యస్తనేత్రః ప్రకటితదశనః ప్రేతరఙ్కః కరఙ్కాదఙ్కస్థా దస్థిసంస్థం స్థపుటగతమపి క్రవ్య మవ్యగ్ర మత్తి" యను కావ్యప్రకాశోదాహరణము మొదలగునవి సర్వసాధారణములుగఁ దోఁచుచున్నవి. భయమువలె నిదియు స్వనిష్ఠము పరనిష్ఠము అని రెండు భేదములు గలదిగాఁ దెలియునది.

జుగుప్సోదాహరణము.

చ. తలలు సరోజము ల్మెదడు ♦ తండము క్రొన్నురు వంత్రజాలముల్

జలఫణు లస్థిఖండములు ♦ శంఖములై తగు నెత్రు టేర్లలోఁ
గలభకపాలసంచయము ♦ గ్రక్కున నెక్కి చరించు సంగర
స్థలుల నృసింహనిర్దళిత ♦ శత్రువసారసమత్తభూతముల్. 20

టీ॥ నృసింహ...భూతముల్, నృసింహనిర్దలితశత్రు= నరసభూపాలునిచే ఖండింపఁబడినశత్రువులయొక్క, వసా= క్రొవ్వుయొక్క, రస=రసముచేత, మత్త=మదించినట్టి, భూతముల్=పిశాచములు; సంగరస్థలులన్=యుద్ధభూములయందు; తలలు= శత్రుశిరస్సులు: సరోజముల్=పద్మములును; మెదడుతండము= క్రొవ్వుయొక్కసమూహము; క్రొన్నురువు=క్రొత్తనురుఁగును; అంత్రజాలముల్ = ప్రేగులగుంపులు; జలఫణులు=నీరుపాములును; అస్థిఖండములు=ఎముకలతునుకలు; శంఖములు=శంఖములును; ఐ; తగునెత్రుటేర్లలోన్; ఒప్పునట్టిరక్తనదులలో; కలభ...చయము=ఏనుఁగుతలలనెడుపడవలగుంపులను; గ్రక్కున్=శీఘ్రముగా; ఎక్కి; చరించున్=తిరుగును. ఇందు వర్ణింపఁ బడిన మాంసాస్థిమజ్జాదులు గర్హాస్పదములు గాన నిది జుగుప్సోదాహరణము.

క్రోధలక్షణము.

క. అపకారకారు లగునరు
లపరాధ మొనర్ప నేమ♦హామహునిమనం
బు పరిజ్వలితం బగు నది
యపరిమితక్రోధ మయ్యె ♦ నది యెట్లన్నన్. 21

టీ॥ అపకార...నరులు=అపకారముచేయునట్టి మనుష్యులు, శత్రులు; అపరాధ మొనర్పన్=అపరాధముసేయఁగా ; ఏమహామహునిమనంబు=ఏమహాత్ముని మనస్సు; పరిజ్వలితంబగున్=జ్వలించునో; అది=ఆజ్వలనమని యాశయము; “సర్వనామ్నా ముత్సర్గతః ప్రధానపరామర్శకత్వ” మ్మనున్యాయముచేత అది యనుతచ్ఛబ్దము పరిజ్వలిత మగుమ

నన్నునె పరామర్శించుఁ గాని మనోగతజ్వలనమును బరామర్శింపదు గాన నిది దోషము. ఏమహామహునియనుచోటి యచ్ఛబ్దమున కుత్తర వాక్యమున నామహామహుని యని తచ్ఛబ్దప్రయోగము లేనందున భయ లక్షణములోఁ జెప్పినసాకాంక్షత్వదోషము దుర్నివారము. అపరిమిత క్రోధము=అపరిమితమైన క్రోధమనుస్థాయిభావము; ఇందపరిమితపద మనర్థకము; అయ్యేన్. అదియెట్లన్నన్. శత్రువు లపచారము చేసిన చో నుదయించు మనఃప్రజ్వలనము క్రోధ మని తాత్పర్యము. ‘‘శత్రు కృతాపచారేణ మనఃప్రజ్వలనం క్రోధః ’’ అని ప్రతాపరుద్రీయము.

క్రోధోదాహరణము.

చ. స్థిరభుజవిక్రమక్రమనృ♦సింహ నృసింహ భవత్కరాగ్రభీ
కరకరవాలసిద్ధుఁ డతి♦గాఢయశోరససిద్ధిఁ గోరి బం
ధురహయసింధురావళుల♦తో రణదుర్గ కనర్గళోన్నతి
న్నరబలి వెట్టు దుర్మదస♦నాథరిపుక్షితినాథయూథమున్. 22

టీ॥ స్థిర...సింహ = స్థిరమగు భుజపరాక్రమక్రమమందు నృసింహస్వామితుల్యుఁడవగు; నృసింహ= నరసభూపాలుఁడా! భవత్...సిద్ధుఁడు=నీయొక్కకరాగ్రమునందుండు భయంకరమగుఖడ్గమను సిద్ధపురుషుఁడు; అతి...సిద్ధిన్ = మిక్కిలిగాఢమగు యశస్సనురససిద్ధిని; కోరి; రణదుర్గకున్=రణశక్తికి; బంధుర...ఆవళులతోన్ = దట్టములగు అశ్వములయొక్కయు గజములయొక్కయుసంఘములతో; దుర్మద...యూథమున్= చెడుకావరముతోఁగూడిన శత్రురాజులగుంపును; అనర్గళోన్నతిన్=అడ్డములేనియౌన్నత్యముచేత; నరబలిన్=నరబలినిగా; వెట్టున్=ఇచ్చును. ఇందు మదించినశత్రురాజులను బలి వెట్టు ననుట వలన వారు చేసినయపరాధమునకు మనస్సు జ్వలించినట్లు తోఁచును గానఁ గ్రోధోదాహరణ మగు నని తాత్పర్యము. ఈక్రోధలక్షణమున

కు నీయుదాహరణము సరిగాఁ దోఁచదు. ఏలయన, ఇందు "యశోర్జనసిద్ధిఁ గోరి" యనుటవలన "యశసేవిజిగీషూణా" మ్మనులక్ష్యమందువలెె వీరస్థాయి యగు నుత్సాహమే ప్రధానముగ నున్నది గాని శత్రుకృతాపచారముచేతఁ గలుగుమనఃప్రజ్వలనరూపక్రోధము ప్రధానముకాదు. "శ్లో॥ రేరేసేవణ క_స్తవాయ మనిదంపూ ర్వోఽద్య గర్వోమహా నుత్తీర్ణా కిల యేన గౌతమనదీ ప్రాప్తోఽసి మృత్యోర్ముఖమ్। ఏషా కాకతివీరరుద్ర ఇతి కిన్నాద్రావి సప్తాత్మరీ ప్రత్యుభ్యత్ప్రతిపక్షపార్థివమహాభూతగ్రహోచ్చాటనీ॥" అనుప్రతాపరుద్రీయోదాహరణము, "శ్లో॥ కృత మనుమతం దృష్టం వా యై రిదం గురుపాతకం మనుజపశుభి ర్నిర్మర్యాదై ర్భవద్భి రుదాయుధైః। నరకరిపుణా సార్ధం తేషాం సభీమకిరీటినా మయ మహ మసృఙ్మేదోమాంసైః కరోమి దిశాం బలిమ్॥" అనుకావ్యప్రకాశోదాహరణము యుక్తరూపముగ నున్నవి.

## విస్మయలక్షణము.

క. వివిధాపూర్వము లగువ
  స్తువులు గనుంగొనినయెడల ♦ సుజనునిమదిలోఁ
  దవిలినప్రమోదవిస్తర
  మవిరళవిస్మయ మనంగఁ ♦ దగు నెట్లన్నన్. 23

టీ॥ వివిధ... యెడలన్ = నానావిధలోకోత్తరవస్తువులఁజూచినచో; సుజనునిమదిలోన్ = సహృదయుని చిత్తమునందు; తవిలినప్రమోదవిస్తరము = ఉదయించినసంతోషాతిశయము; అరవిళవిస్మయమనంగన్ = చట్టమైనవిస్మయమనుస్థాయిభావమనఁగ; తగున్ = ఒప్పును. ఎట్లన్నన్. "అపూర్వదర్శనాచ్చిత్తవిస్తారోవిస్మయోమతః" అనుప్రతాపరుద్రీయముచొప్పున నపూర్వవస్తుదర్శనాదులవలనఁ గలుగుచిత్తవిస్తా

రము విస్మయ మని తాత్పర్యము.

చిత్తవిస్తార మనుదానికిఁ బ్రమోదవిస్తర మనుట సమార్థకము గాదు. మనస్సులోఁ గలుగుప్రమోదవిస్తరము హర్షరూపసంచారియగును గాని యాశ్చర్యరూపవిస్మయములోఁ జేరదు. ఆశ్చర్యము చిత్తవిస్తారరూపము గావున దానికి హర్షమునకుఁగల భేదము స్పష్ట మగుటచే వేఱువ్రాయ నక్కఱ లేదు. మఱియు "విస్తారో విగ్రహో వ్యాస స్సతు శబ్దస్య విస్తరః" అనుకోశముచేత శబ్దప్రపంచమునందు విస్తర మనియు, తదితరవిషయమందు విస్తార మనియుఁ బ్రయోగింప వలసినదిగా నుండఁగా, నిందు శబ్దేతరప్రపంచమునందు విస్తార మని ప్రయోగింపక విస్తర మని ప్రయోగించుట చింత్యము. ప్రతాపరుద్రీయమున "చిత్త విస్తారో విస్మయో మతః" అనియున్నదే యుక్త మని తెలియునది. ఈ విస్మయమును స్వనిష్ఠవిభావజన్య మగునపుడు స్వనిష్ఠ మనియు, పర నిష్ఠవిభావజన్య మయినపుడు పరనిష్ఠ మనియు రెండు తెఱంగులు.

విస్మయోదాహరణము.

చ. ధరణి నృసింహభూవరుప్ర♦తాపమహాతప మబ్జజాండక
ర్పరములు నిండి తీవ్రగతిఁ♦ బర్వ నఖర్వసగర్వవైరిభూ
వరులు వడంక సాగుదు ర♦వార్యనవవ్యజనాతపత్రవై
ఖరులు దొలంగఁ జేయుదురు♦ కన్నులఁ జీకటి గప్పుచుండఁగన్.

టీ॥ ధరణిన్ = భూమియందు; నృసింహ... ఆతపము = నరసభూపాలునియొక్క ప్రతాపమనెడు గొప్పయెండ; అబ్జజాండకర్పరములు = బ్రహ్మాండములనెడుచిప్పలు; నిండి; తీవ్రగతిన్ = తీక్ష్ణవిధముచేత; పర్వన్ = వ్యాపించుచుండ; అఖర్వ... వరులు = అధికులై గర్వముతోఁ గూడుకొన్నశత్రుభూపాలురు; వడంకసాగుదురు. అవార్య... వైఖరులు, అవార్య = నివారింపశక్యముగానట్టి, నవ = నూతనమయినట్టి, వ్యజన = సురటీలయొక్కయు, ఆతపత్ర = గొడుగులయొక్కయు, వైఖరులు =

రీతులను; కన్నులన్ = నేత్రములయందు; చీఁకటిగప్పుచుండఁగన్ = అంధకారమావరించుచుండఁగా; తొలఁగన్ = తొలఁగునట్లు; చేయుదురు. ఇందు నరసభూపాలప్రతాపాతపకృతలోకోత్తరచర్యవలన శత్రులకు నాశ్చర్యమనుచిత్తవిస్తార ముదయించినట్లు చెప్పినందున విస్మయోదాహరణ మని తాత్పర్యము.

శమలక్షణము.

క. నిరుపమవైరాగ్యాదుల
కిరవై నిశ్చలత పూని ♦ హృదయము దిరమై
నరులకుఁ బరిణతిఁ జెందిన
ధరలో నది శమ మనంగఁ ♦ దగు నెట్లన్నన్. 25

టీ॥ నరులకున్ = మనుష్యులకు; నిరుపమవైరాగాద్యులకున్ = అసదృశములైనవైరాగ్యము మొదలగువానికి; ఇరవై = ఆశ్రయమై; నిశ్చలత = చాంచల్యరహితత్వమును; పూని = వహించి; మనము = మనస్సు; తిరమై = ఏకాగ్రమై; పరిణతిన్ = పరిపాకమును; చెందినన్ = పొందినయెడ; ధరలోన్ = భూమియందు; అది = ఆపరిణామము; శమమనంగన్ = శమమనుస్థాయిభావమనఁగా; తగున్ = ఒప్పును. ఎట్లన్నన్. వైరాగ్యాదులచే విషయాభిలాష యుడిగియుంట శమ మని తాత్పర్యము. "వైరాగ్యాదినా నిర్వికారచిత్తత్వంశమః" అనిప్రతాపరుద్రీయలక్షణము.

శమోదాహరణము.

ఉ. ఘోరభవాదిదుఃఖములఁ ♦ గుందఁగ నీక నృసింహుఁ డౌర దు
ర్వారఫలప్రదం బగువి ♦ రక్తిసుఖం బొనరించె నంచు నీ
వైరులు మానులై విపిన ♦ వాటిని నీవ గురుండ వంచు నీ
పేరిటి యక్షరంబులె జ ♦ పింతురు శ్రీనరసింహభూవరా. 26

టీ॥ శ్రీనరసింహభూవరా = సంపదతోఁగూడిన నరసభూపాలుడా! నీవైరులు=నీశత్రులు, ఘోరభవాదిదుఃఖములన్ = భయంకరములగు సంసారాదిదుఃఖములచేత; కుందఁగనీక=దుఃఖపడనీయక; నృసింహుఁడు=నరసభూపాలుఁడు; ఔర=ఆశ్చర్యము! దుర్వార...సుఖంబు=అనివార్యమగు మోక్షసుఖమునిచ్చు వైరాగ్యసుఖమును; ఒనరించెనంచున్=చేసెననుచు; మౌనులై=తాపసులై; విపినవాటిన్=అరణ్యప్రదేశమునందు; నీవగురుండవంచున్ = నీవేగురువనుచు; నీపేరిటియక్షరంబులె=నీనామాక్షరములనె; జపింతురు=జపముసేయుదురు. ఇచట నరసభూపాలుని శత్రులు దారపుత్త్రాదులను వదలి యరణ్యముఁ జెందిరని విరక్తిని వర్ణించినందున శమమున కుదాహరణము.

శత్రురాజులు సంసారపరిత్యాగముఁ జేసి వనవాసముఁ జేయుట వాస్తవవిరాగమునఁ గాక నరసభూపాలునివలనఁ బ్రాణాపాయము లేకుండుటకై యని స్పష్ట మగుచున్నది గావున వాస్తవవిరాగమునకుఁ దగినట్టి "శ్లో॥ అహౌవా హారేవా కుసుమశయనేవా దృషదివా మణౌవా లోష్టేవా బలవతి రిపౌవా సుహృదివా। తృణేవా స్త్రైణేవా మమ సమదృశో యాన్తు దివసాః క్వచి త్పుణ్యే ఽరణ్యే శివశివ శివేతి ప్రలపతః॥" ఇత్యాదు లుదాహార్యములు.

### స్థాయిభావకారణనిరూపణము.

క. ఈరసముల కుత్పాదన
కారణము విభావ మనఁగఁ ♦ గల దది ద్వివిధం
బై రంజిలు నాలంబన
మారయ నుద్దీపనంబు ♦ ననఁగ ధరిత్రిన్. 27

టీ॥ ఈరసములకున్ — ఈస్థాయిభావములకనుట; "రసములకుఁ దొమ్మిదింటికిఁ, బొసఁగిన యీస్థాయిభావ♦ములకు నొనర్తు" నని

స్థాయిలక్ష్యలక్షణముల నుపక్రమించినందునను, రసము నిత్యము గావు నఁ దత్కారణనిరూపణము సంభవింపమివలనను, నిట్లు తాత్పర్య మూహించునది. ఉత్పాదనకారణము = ఉత్పత్తిహేతువగుకారణము; విభావమనఁగన్; కలదు. అది = ఆకారణము; ఆరయన్ = విచారింపఁ గా; ఆలంబనంబు = ఆలంబనకారణము; ఉద్దీపనంబు= ఉద్దీపనకారణ ము; అనఁగన్; ద్వివిధంబై = రెండుతెఱంగులై; ధరిత్రిన్ = భూమి యందు; రంజిలున్=ప్రకాశించును. రత్యాదిస్థాయిభావముల కుత్పా దనకారణము విభావమనఁబడు నది యాలంబన మనియు నుద్దీపన మ నియు రెండువిధము లగు నని తాత్పర్యము.

ఆంధ్రగ్రంథములందు స్వర్గపాతాళలోకవ్యావృత్తికో, లేక ప ద్యకుక్షిపూర్తికో, లేక కవితాసామగ్రీదారిద్ర్యమునసో, ధరణి ధారుణి యిల ధరిత్రి మొద లగుశబ్దములు ప్రయోగించుట వాడుకగ నున్నను, "శ్లో॥ కారణా న్యథ కార్యాణి సహకారీణి యాని వై। రత్యాదేః స్థా యినో లోకే తాని చే న్నాట్యకావ్యయోః॥ విభావా అనుభావాశ్చ కథ్య న్తే వ్యభిచారిణః॥" అనుకావ్యప్రకాశమువలనను, "విగలితదుష్యన్త రమణీత్వాదిభి రలౌకికవిభావాదిశబ్దవ్యపదేశ్యై శ్శకున్తలాదిభి రాల మ్బనకారణై శ్చన్ద్రికాదిభి రుద్దీపనకారణై రశ్రుపాతాదిభిః కార్యై శ్చి న్తాదిభి స్సహకారిభిశ్చ" అనురసగంగాధరమువలనను, రత్యాదిస్థాయి కారణములకుఁ గావ్యనాట్యములయందె విభావానుభావవ్యభిచారినామ ము లగుఁ గాని లోకసాధారణముగఁ గలుగ వని యేర్పడుచున్నందున నీపద్యమునందు "ధరిత్రిన్" అనిప్రయోగించుట యుక్తంబు గా దని తోఁచుచున్నది.

విభావస్వరూపనిరూపణము.

క. వనితయుఁ బతియును నాలం

బన మగు నుద్దీపనంబు ♦ ప్రాయంబును సొ
మ్మును జేష్టయు మదనాదులు
ననఁ దగు నేర్పఱతు వీని ♦ కగులక్ష్యంబుల్. 28

టీ॥ వనితయుఁబతియును—స్త్రీపురుషులుభయులును; ఆలంబన మగుక్—శృంగారస్థాయి యగురతి కాలంబన మగు నని తాత్పర్యము. ఏతదనుసారముగఁ బూర్వపద్యములో "ఆరయ నుద్దీపనంబు ♦ నందును రతికిన్" అని యున్నచో యుక్తముగ నుండును. యథాశ్రుతపాఠము, "వనితాపతులు రత్యాదులకుఁ దొమ్మిదింటికి నాలంబనము" లని స్పష్టముగ బోధించును గాన నయుక్తంబుగాఁ దోఁచెడిని.

రెండియు నిందుఁ బతిశబ్దము పురుషబోధకముగాఁ బ్రయోగింపఁబడినది. ఇది కోశాదిప్రమాణములచే భర్తృబోధక మగుఁ గాని పురుషబోధకము గాదు. అట్లు, భర్తృబోధక మయినపుడు నిరూపకాంశమునందు నిత్యసాకాంక్ష మగు; వనితాశబ్దము తదాకాంక్షాశామకంబు గాదు. మఱియేమన్న, పిత్రాదిశబ్దంబులు పుత్త్రాదిశబ్దంబులతోఁబోలెఁ బత్యాదిశబ్దమ్ములు పత్న్యాదిశబ్దంబులతోనే నిరాకాంక్షంబు లగుఁ, గావున, "వనితయుఁ బురుషుఁడు నాలం బన" మనుట యుక్తము.

ప్రాయంబును=ఆయాలంబనముయొక్క—యౌవనమును; సొమ్మును=ఆభరణమును; చేష్టయుక్ = వ్యాపారమును; మదనాదులును=కామాదులును;అనక్=అనఁగా; ఉద్దీపనంబు=ఉద్దీపనవిభావము; తగుక్= ఒప్పును. వీనికగులక్ష్యంబుల్ = ఈవిభావములకు యుక్తంబులగు నుదాహరణంబులను; ఏర్పఱతుక్=వివరింతును. స్త్రీపురుషులు, రత్యాలంబనములు, ఆయాలంబనములయౌవనాభరణవ్యాపారములును మదనాదులు నుద్దీపనవిభావంబు లగు నని తాత్పర్యము.

ఇందునకుఁ బ్రమాణము, "శ్లో॥ విభావః కథ్యతే తత్ర రసోత్పాదనకారణమ్। ఆలమ్బనోద్దీపనాత్మా స ద్వేధా పరికీర్తితః। ఆలమ్బనగుణ శ్చైవ తచ్చేష్టా తదలంకృతిః। తటస్థ శ్చేతి విజ్ఞేయ శ్చతుర్ధోద్దీపనక్రమః। ఆలమ్బనగుణో రూపయౌవనాది రుదాహృతః। తచ్చేష్టా యౌవనోద్భూతహావభావాదికా మతాః। నూపురాఙ్గదహారాది తదలంకరణ మ్మతమ్। మలయానిలచన్ద్రాద్యా స్తటస్థాః పరికీర్తితాః॥" అని ప్రతాపరుద్రీయము దెలియవలయు. ఇందు మలయానిలచంద్రాదు లుద్దీపనకారణములని చెప్పఁబడియుండఁగామదనాదు లని యీగ్రంథమునందు వ్రాయఁబడినది. శృంగారస్థాయి యగురతికిఁ గామాదు లుద్దీపకము లని దీనియర్థ మగుచున్నది. రత్యుద్దీపకము లగుమలయానిలచంద్రాదులు కామోద్దీపకములుగా సకలకవివరులు వర్ణించియున్నారు. ఎట్లన, "శ్లో॥ అఙ్కురితః పల్లవితః కోరకితః పుష్పితశ్చ సహకారః। అఙ్కురితః పల్లవితః కోరకితః పుష్పితశ్చ సహమదనః॥" అనిధ్వన్యాలోకము, "శ్లో॥ ఈషదఙ్కురితవిభ్రమచారౌ దేహపల్లవితకాన్తిని తన్వ్యాః। యౌవనే ముకులితస్తనమాత్రే పుష్పితశ్చ ఫలితశ్చ మనోభూః॥" అనిప్రతాపరుద్రీయము, "శ్లో॥ రమ్యం హర్మ్యతలం నవా స్సునయనా గుఞ్జద్ద్విరేఫా లతాః ప్రోన్మీలన్నవమల్లికాసురభయో వాతా స్సచన్ద్రాః క్షపాః। య ద్యేతాని జయన్తి హన్త పరితశ్శస్త్రా ణ్యమోఘాని మే త ద్భోః కీదృగసౌ వివేకవిభవః కీదృ క్ప్రబోధోదయః॥" అని ప్రబోధచంద్రోదయము, "శ్లో॥ ఇద మసులభవస్తుప్రార్థనాదుర్నివారం ప్రథమ మపి మనో మే పఞ్చబాణః క్షిణోతి। కిముత మలయవాతోన్మూలితాపాండుపత్త్రై రుపవనసహకారై ర్దర్శితే ష్వఙ్కురేషు॥" అనివిక్రమోర్వశీయనాటకము, "శ్లో॥పాణిపల్లవవిధూననమన్తస్సీత్కృతాని నయనార్ధనిమేషాః। మోషితాం రహసి గ

ద్గదవాచా మ స్త్రీతా ముపయయు ర్మదనస్య॥" అని కిరాతార్జునీయ ము. ఇవి మొద లగువానిలో నాలంబనగుణతచ్చేష్టాతదలంకృతిమల యానిలచంద్రాదులు రత్యుద్దీపకములుగాఁ జెప్పఁబడిన వన్నియుఁ గా మోద్దీపకములుగా వర్ణింపఁబడినవి. కావున మదనాదు లని చెప్పిన చోఁ గామంబునకే కామం బుద్దీపకం బనినయట్లు పర్యవసితంబై య సంగతం బగును.

వెండియు రతికామములకు నామభేదంబు దప్ప స్వరూపభేదం బు గాన్పించదు. ఎట్లన, "తత్ర సంభోగవిషయక ఇచ్ఛావిశేషో రతిః" అనురసమంజర్యాదులవలనను, "శ్లో॥ యూనో రన్యోన్యవిషయా స్థా యి నీచ్ఛా రతి ర్భవేత్" అనుతదితరగ్రంథములవలనను, "క. అర యఁగ సంభోగవిషయ ♦ మగునభిలాష, స్ఫురణము రతి" యనునీగ్రం థమువలనను, రతియనునది ఇచ్ఛాభిలాషాదిరూపమైనట్లు వ్యక్తం బ గుచున్నది. "ఇచ్ఛాకాఙ్క్షా స్పృహేహా తృ ట్వాఞ్ఛా లిప్సా మనో రథః। కామోఽభిలాషః" అనుకోశమునుబట్టి ఇచ్ఛాభిలాషకామ శబ్దముల కర్థభేదంబులేమి సిద్ధ మగుచున్నది. ఇట్లు రతికామములకు స్వరూపముచేతను గార్యముచేతను పై చెప్పినప్రకారము భేదము సిద్ధింప నపుడు రతికిఁ గామ ముద్దీపక మనుట చెల్లదు.

"శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంస స్సఙ్గ స్తేషూప జా యతే। సఙ్గా త్సంజాయతే కామః కామా త్క్రోధోఽభిజాయ తే॥" అనుగీతవలనను, తద్భాష్యమువలనను, తద్వ్యాఖ్యలవలనను, ర తివలనఁ గామ ముదయించు ననియు, నానక్తిరూపము రతి యుత్కటా సక్తిరూపము కామ మనియు, వ్యక్తం బగుచున్నది. ఎటులన, "ధ్యా యత శ్చిన్తయతో విషయాన్ శబ్దాదివిషయవిశేషా నాలోచయతః పుంసః పురుషస్య సఙ్గ ఆసక్తిః ప్రీతి స్తేషు విషయే షూపజాయతే

ఉత్పద్యతే ప్రీతే స్సంజాయతే సముత్పద్యతే కామ స్తృష్ణా" అనిభా
ష్యము, "ప్రీతిరాసక్తి రితి సాధారణాసక్తిమాత్రరూగృహ్యతే తృష్ణే
త్యతిక్తాసక్తి రుక్తా" అనియానందగిరిటీక, "తేషు సఙ్గ స్సక్తి ర్భవతి
ఆసక్త్యాచ తే ష్వధికః కామో జాయతే" అనిస్వామిటీక. ఇట్లు శా
స్త్రాంతరములందును "జానాతి ఇచ్ఛతి యతతే" యని చెప్పుటవలన.
"ఇద మ్మదిష్టసాధన" మ్మనుజ్ఞానరూప మగుప్రీతి దొలుత నుదయించిన
వెనుక "ఇదమ్మేభూయాత్" అను నిచ్ఛాత్మక మగుకామ ముదయిం
చు ననియు, నావల దానికై యత్నించు ననియు నేర్పడుచున్నది. వీని
వలన రతికామములకు భేదంబు సిద్ధమైన దని కొందఱియభిప్రాయము
గావచ్చును. ఆపక్షమునందును రతిజన్యము కామ మైనపుడు కామపరి
పోషకము రతి యగును గాని రతిపరిపోషకము కామముగాఁ దగదు.
కావున మదనాదు లనుట యుక్త మని తోఁచదు. మహాకవులు రతి
పోషకములు గాఁదగిన మలయమారుతాదులు కామపరిపోషకములు
గా వర్ణించుట, రతికామములు రెండును గీతాతద్వ్యాఖ్యాదులనుబట్టి
యు నాసక్తిరూపములే గావున నుత్కటత్వానుత్కటత్వములు గణి
యింపక యభేదములుగా నెంచి యని యెఱుంగునది.

ఆలంబనవిభావోదాహరణము.

చ. అలరురతిక్ రతీశు దమయంతి నలు న్నలువొంద ముందుగా
నలువ సృజించి యందుకతనం దనచేయళు క్లెల్లఁ దీటి నే
ర్పలవడ నీలతాంగి నరసాధిప నిన్నును గూర్చి ప్రేమసం
కలితముగాఁగ దంపతులుగా నొసరింపఁగఁ బోలు నెంతయుక్.

టీ॥ నరసాధిప = నరసభూపాలుఁడా! నలువ = బ్రహ్మ; అలరు
రతిక్ = ఒప్పుచుండెడిరతీదేవిని; రతీశుక్ = కాముని; దమయంతిక్ = దమ

యంతీదేవిని; నలుఁ = నలచక్రవర్తిని; నలువొందఁ = సౌందర్యమొప్పు నట్లుగా; ముందుగాఁ = మొదల; సృజించి = సృష్టిఁజేసి; అందుకతనఁ = ఆహేతువుచేత; తన...ఎల్లఁ = తనచేతిజంకంతయు; తీఱి = మాని; నేర్పలవడఁ = చాతుర్యముకలుగఁగా; ఈలతాంగిఁ = ఈసుందరిని; నిన్నును; కూర్చి = సంఘటించి; ప్రేమసంకలితముగాఁగఁ = ప్రేమతోఁగూడునట్లుగా; దంపతులుగాఁ = జాయాపతులుగా; ఎంతయుఁ = మిక్కిలి; ఒనరింపఁగఁబోలుఁ = ఒనరించినవాఁడుగాఁబోలు. ఇందు నరసభూపాలునకు రత్యాలంబనవిభావము లతాంగియు, లతాంగికి రత్యాలంబనవిభావము నరసభూపాలుండును గా వర్ణించుటంజేసి, ఇది శృంగారాలంబనవిభావోదాహరణము.

ముద్రితపుస్తకములలో నోలతాంగి యనుపాఠమున్నది. అప్రస్తుతనాయికాసంబోధన మసంబద్ధమైనందున దాని మాని యీలతాంగి ననుద్వితీయాంతపాఠము స్వీకరింపఁబడినది.

ఇఁక శృంగారాలంబనవిశేషభూతులైననాయికానాయకుల యొక్క భేదనిరూపణంబు ప్రస్తుతంబు. అది ద్వితీయాశ్వాసము నాయకప్రకరణమునఁ జెప్పఁబడినదైనను నిందె సందర్భశుద్ధినిబట్టి యుదాహరింపఁబడుచున్నది. ఎట్లన్నః—

## నాయకభేదనిరూపణము.

తే-గీ. మఱియు శృంగారలీలాస♦మగ్రయోగ్య
తానిశవిచక్షణులు దక్షి♦ణానుకూల
ధృష్టశఠు లనఁ గాంతు ల♦భీష్టమతులు
గలరు తల్లక్షణంబులు ♦ తెలియఁబఱతు. 30

టీ॥ మఱియుఁ = వెండియు; శృంగార...విచక్షణులు, శృంగారలీలా = శృంగారక్రియయందు, సమగ్ర = సంపూర్ణమగు, యోగ్యతా = యో

గ్యతయందు, అనిశ = ఎల్లప్పుడు, విచక్షణులు = విద్వాంసులయినట్టి; అభీష్టమతులు = సమీచీనబుద్ధిగలయట్టి; కాంతులు=నాయకులు; దక్షిణ...శఠులు = దక్షిణుఁడు, అనుకూలుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు; అనన్=అనఁగా; కలరు=ఉన్నారు. తల్లక్షణంబులు= వారిలక్షణములను; తెలియఁబఱతున్ = తెలియఁజేయుదును. శృంగారాలంబనము లగు నాయకులు దక్షిణానుకూలధృష్టశఠభేదముచేత నలువురు గల రని తాత్పర్యము. తక్కినవిశేషణము లుపయుక్తములు గావు. మఱియు నిందుఁ గాంతు లనుశబ్దము, పురుషు లనునర్థమును గాని నాయకు లనునర్థమును గాని, బోధించుతాత్పర్యముతోఁ బ్రయోగింపఁబడినది. అది తదర్థబోధకము గాదు, మఱియేమన్న, ప్రియు లనునర్థమును బోధించును. ఆయర్థ మిం దుపయోగింపక యెవరిప్రియు లనిసాకాంక్షమై యుండును.

దక్షిణాదినాయకలక్షణములు.

చ. చెలఁగుబహుప్రియాసదృశ♦శీలుఁడు దక్షిణుఁ డొక్కకాంతనే
వలచి గుణాభిరాముఁడగు ♦ వాఁ డనుకూలుఁ డు సాపరాధుఁడై
యలుకనివాఁడు ధృష్టుఁడు ప్రి♦యాశయమాత్రనివేద్యవిప్రియుం
డల శఠుఁ డంద్రు వీరల కు♦దాహరణంబులు నిర్ణయించెదన్. 31

టీ॥ చెలఁగు...శీలుఁడు = ఒప్పుచున్నవాఁడును బహునాయికలయందుఁ దుల్యవృత్తిగలవాఁడునగునాయకుఁడు; దక్షిణుఁడు = దక్షిణనాయకుఁడు. ఒక్కకాంతనే=ఒకనాయికనే; వలచి=మోహించి; గుణాభిరాముఁడగువాఁడు = సౌశీల్యాదిగుణములచేనొప్పినవాఁడు; అనుకూలుఁడు=అనుకూలనాయకుఁడు. సాపరాధుఁడై = నాయికాంతరగమనాది రూపాపరాధముతోఁగూడినవాఁడై; అలుకనివాఁడు=జంకనివాఁడు; ధృష్టుఁడు=ధృష్టుఁడను నాయకుఁడు. ప్రియా...విప్రియుండు = ప్రియు

రాలియొక్క హృదయమునకుమాత్రమె తెలియఁదగిన యపరాధము గలవాఁడు ; అలశఠుఁడు = ప్రసిద్ధుఁడగు శఠుఁడనునాయకుఁడు. అంద్రు = అని చెప్పుదురు. వీరలకుఁ = ఈనాయకులకు; ఉదాహరణంబులు = లక్ష్యములను; నిర్ణయించెదన్ = నిరూపించెదను.

దక్షిణనాయకున కుదాహరణము.

ఉ. సాగరమేఖలాసతికిఁ ♦ జారుభుజాపరిరంభ మిచ్చె వా
ణీగగనావలగ్నకును ♦ నేర్పుమెయి న్మొగ మిచ్చె వీరల
క్ష్మీగజరాజగామిని క♦మేయభుజాంతర మిచ్చె సంతత
త్యాగి నృసింహభూవిభుఁడె ♦ దక్షిణనాయకుఁ డెన్ని భంగులన్. 32

టీ॥ సాగరమేఖలాసతికిన్ = భూమియను స్త్రీకి ; చారు...పరిరంభము = మనోజ్ఞమగు చేతికౌఁగిలిని; ఇచ్చెన్. వాణీగగనావలగ్నకున్ = సరస్వతీదేవికి; నేర్పుమెయిన్ = చాతుర్యముచేత; మొగము = ముఖమును; ఇచ్చెన్. వీరలక్ష్మీగజరాజగామినికిన్ = వీరలక్ష్మియను స్త్రీకి; అమేయభుజాంతరము = విశాలమగువక్షఃస్థలమును; ఇచ్చెన్. ఎన్నిభంగులన్ = ఎన్నివిధములచేతనైనను; సంతతత్యాగి = నిరంతరదాతయగు; నృసింహభూవిభుఁడె = నరసభూపాలుఁడె; దక్షిణనాయకుఁడు = దక్షిణుఁడనునాయకుండగును. ఇందు భూమివాణీవీరలక్ష్ములయందు నరసభూపాలునకు సమానమైనవృత్తి వర్ణింపఁబడెను గాన నిది దక్షిణనాయకోదాహరణ మగును.

కొన్నిగ్రంథములలో స్త్రీకి బహునాయకాసక్తియందువలెఁ బురుషునకు బహునాయికాసక్తియందును దుల్యయుక్తిచేత రసాభాసత గావచ్చు నని చెప్పి దక్షిణనాయకునివిషయమై "శ్లో॥ వ్యాఘ్రమాంశ్చ లితాశ్చైవ స్ఫారితాః పరమాకులాః। పాణ్డుపుత్త్రేషు పాఞ్చాల్యాః పతన్తి ప్రథమా దృశః॥" అనుశ్లోకస్థలమునందుఁ బ్రసక్తించినరసా

భాసత వారించుటకై అపరిణేతృబహుపురుషాసక్తియే రసాభాస మని నిర్ణయించినట్లు, అపరిణీతబహునాయికాసక్తియే పురుషునకు రసాభాసతాన్వియామక మని పరిష్కరించిరి. వేశ్యావైశికులయొక్క రతి రసాభాసమే యని వీరియభిప్రాయము. ఇందలి విశేషంబులు రసాభాసప్రస్తావములో వ్రాయంబడు.

అనుకూలనాయకోదాహరణము.

చ. కనకము లంబరంబులును ♦ గ్రామము లుజ్జ్వలదివ్యరత్నమం
డనములు వాజివారణఘ♦టల్ ఘనసారసుగంధసారము
ల్దనివి దలిర్ప వేఁడినకొ♦లంది నొసంగుచు నోబభూపనం
దనుఁ డగునారసింహుఁ డిల♦దానరమాప్రియుఁ డయ్యె నెంతయుౕ.

టీ॥ ఓబభూప...సింహుఁడు = ఓబరాజపుత్త్రుండగు నరసభూపాలుండు; కనకములు = సువర్ణములను; అంబరంబులును=వస్త్రంబులను; గ్రామములు= అగ్రహారంబులను; ఉజ్జ్వల...మండనములు= ప్రకాశించుచున్నదివ్యరత్నాభరణంబులను; వాజివారణఘటల్ =తురంగములయొక్కయు గజములయొక్కయు సమూహములను ; ఘన...సారముల్ =పచ్చకర్పూరమును శ్రీచందనమును; తనివిదలిర్పన్=తృప్తి అతిశయించునట్లు; వేఁడినకొలందిన్=యాచించినంతయు; ఒసంగుచున్= ఇచ్చుచు; ఎంతయున్ = మిక్కిలి ; దానరమాప్రియుండు=దానలక్ష్మికిం బ్రియుండు; అయ్యెన్. ఇందు నరసభూపాలుండు దానలక్ష్మి కొక్కదానికే ప్రియుఁ డయినట్లు చెప్పినందున ననుకూలనాయకున కిది యుదాహరణము,

ధృష్టనాయకోదాహరణము.

చ. ఉరమున నున్న కుంకుమ మ♦దుజ్జ్వలరోషకషాయవీక్షణ
స్ఫురదరుణాంశుపుంజ మని ♦ బొంకితి కన్గవ కెంపు భాగ్యబం

ధురసహజారుణత్వ మని ♦ నూల్కొన నాడితి వెట్లు దాఁచె దీ
పరిమళవాసనాలహరి ♦ పర్వెడు మేన నృసింహభూవరా. 34

టీ॥ నృసింహభూవరా = నరసభూపాలుఁడా! ఉరమునమన్నకుం
కుమ = ఎదనంటినకుంకుమ; మదుజ్జ్వల...పుంజము, మత్ = నాయొక్క,
ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, దీనికి వీక్షణమందన్వయము, రోష = కో
పముచేత, కషాయ = ఎఱ్ఱనైన, వీక్షణ = దృష్టియొక్క, స్ఫురత్ = ప్రకా
శించుచున్న, అరుణాంశుపుంజము = ఎఱ్ఱనికాంతులసమూహము. అని
బొంకితి = అనిదబ్బఱలాడితివి. కన్గవకెంపు = రెండుకన్నుల యెఱ్ఱఁదన
ము; భాగ్య...అరుణత్వము = భాగ్యమును దట్టమును స్వభావసిద్ధ
మునైనయెఱ్ఱఁదనము. అని; నూల్కొనన్ = ఒప్పునట్లుగా; ఆడితి
వి = పలికితివి. మేనన్ = శరీరమునందు; ఈపరిమళవాసనాలహరి = ఈప
రిమళగంధప్రవాహము; పర్వెడున్ = వ్యాపించెడు. ఎట్లు = ఏరీతిగ; దాఁ
చెదు? ఇందు నరసభూపాలుండు సాపరాధుం డయ్యు జంక కుండుటవ
లన ధృష్టుం డగును. “శ్లో॥ నవనఖపద మఙ్గం గోపయ స్యంశుకేన స్థ
గయసి పున రోష్ఠం పాణినా దన్తదష్టమ్। ప్రతిదిశ మపర స్త్రీసఙ్గశంసీ
విసర్ప న్నవపరిమళగన్ధః కేన శక్యో వరీతుమ్॥” అనుమాఘప్రయో
గము నిందు సంవాదంబుగాఁ దెలియునది.

శఠున కుదాహరణము.

చ. కనుఁగవఁ బాఱఁ జూచెదవు ♦ గాని మనంబునఁ జూడ వుత్తలం
దని పెదు గాని భావమునఁ ♦ దన్ప వొకప్పుడు నీప్రవీణత
ల్వనుపడ వింక నీసటలు ♦ బచ్చెనచేఁతలు చాలుఁ జాలు నన్
జెనకకు కీర్తికాంతయొ నృ♦సింహ ప్రియాంగన నీ కెఱుంగుదున్,

టీ॥ నృసింహ = నరసభూపాలుఁడా! కనుఁగవన్ = నేత్రయుగ్మ
ముచే; పాఱఁజూచెదవుగాని = బాగుగఁజూచెదవుగాని; మనంబునన్ =

మనస్సుచే; చూడవు — స్మరింపవనుట. ఉక్తులన్ = మాటలచేత, తని పెదుగాని= తృప్తినొందించెదుగాని; భావమునన్ = హృదయముచే; ఒకప్పుడున్ = ఒకసారైనను; తన్పవు=తృప్తినొందింపవు. ఇంకన్=ఇఁక మీఁద; నీప్రవీణతల్ = నీచాతుర్యములు; పనుపడవు=ఉపయోగింపవు. నీపటలు = నీనడకలు; బచ్చెనచేఁతలు = మాయాచేష్టలు. చాలుఁజాలున్. నన్ = నన్ను; చెనకకు=ముట్టకు. కీర్తికాంతయో=కీర్తియనువనితయో; నీకున్; ప్రియాంగన=ప్రియురాలు. ఎఱుంగుదున్=తెలియుదును. ఇందు నాయికాంతరంగమాత్రవేద్య మగుభావవైషమ్యరూపవిప్రియమును నరసభూపాలుఁడు చేసినట్లు చెప్పినందున శఠనాయకోదాహరణము.

నాయకసహాయనిరూపణము.

క. ప్రకటీకృతు లగునీనా
యకులకు విటపీఠమర్దు ♦ లనఁ జేటవిదూ
షకు లనఁ గలరు ప్రియాకే
ళికలాసంఘటనపటిమ ♦ లీలాచార్యుల్. 36

టీ॥ ప్రకటీకృతులగునీనాయకులకున్ = ప్రకటింపఁబడిన యీ దక్షిణాదినాయకులకు; ప్రియా...ఆచార్యుల్, ప్రియా=ప్రియురాండ్రయొక్క, కేళికలా = క్రీడానైపుణ్యముయొక్క, సంఘటన = కూర్చుటయందు, పటిమ=సామర్థ్యమునకు, లీలాచార్యుల్ = విలాసగురువులు; విటపీఠమర్దులనన్ = విటుండుపీఠమర్దుండు అనియు; చేటవిదూషకులనన్ = చేటుండువిదూషకుండుఅనియు; కలరు. దక్షిణానుకూలధృష్టశఠనాయకులకు విటుఁడు పీఠమర్దుఁడు చేటుఁడు విదూషకుఁడు అని నలుగురు శృంగారక్రియాసహాయులు గల రని తాత్పర్యము.

విటాది విశేష లక్షణములు.

చ. వసుమతి నేకవిద్య గల♦వాఁడు విటుం డనఁ బొల్చు నాయకో
ల్లసనముకన్నఁ గొంత గుణ♦లక్షణహీనుఁడు పీఠమర్దకుం
డసదృశబాలికాసుఘట♦నాదిరహస్యవిదుండు చేటకుం
డెనఁగ నజస్రహాస్యరస♦హేతువు వాఁడు విదూషకుం డిలన్. 37

టీ॥ వసుమతిన్ = భూమియందు; ఏకవిద్యగలవాఁడు=శృంగారోపయుక్తములగుగాంధర్వాదులలో నొకవిద్యగలవాఁడు, "శ్లో॥ ఋతుమాల్యాలంకారైః ప్రియజనగాంధర్వకావ్యసేవాభిః। ఉపవనగమనవిహారై శ్శృంగారరస స్సముద్భవతి॥" అని భరతవచనము; విటుండనఁబొల్చున్ = విటుఁడననొప్పును. నాయకోల్లసనముకన్నన్—నాయకునకన్నననుట; కొంత...హీనుఁడు = గుణములచేతను లక్షణముచేతను గొంచెముతక్కువయైనవాఁడు; పీఠమర్దకుండు = పీఠమర్దకుఁడనువాఁడగు. అసదృశ...విదుండు=సాటిలేనట్టుగా స్త్రీసంఘటనము మొదలగువాని రహస్యమును దెలిసినవాఁడు; చేటకుండు=చేటుఁడనువాఁడగును. ఎనఁగన్=ఒప్పునట్లు; అజస్ర...వాఁడు=మిక్కిలిహాస్యరసమునకు హేతువైనవాఁడు; ఇలన్=భూమియందు; విదూషకుండు= విదూషకుఁడనువాఁడగును. ఇందు వసుమతీశబ్దమునకన్న వేఱుగ నిలాశబ్ద మనుపయుక్తముగాన "విదూషకుండగున్" అనుపాఠము ముచితముగాఁ దోఁచుచున్నది.

ఇఁక నాయికానిరూపణమున స్వీయాలక్షణము.

క. ఈమతమున స్వీయాఽన్యా
సామాన్య లనంగఁ గలరు♦సతులందుఁ ద్రపా
సామగ్రీశీలార్జవ
కోమల కమనీయ స్వీయ♦గుణములఁ జెలఁగున్. 38

టీ॥ ఈమతమునన్ = ఈశృంగారమతమునందు; సతులు=నాయికలు; స్వీయాఽన్యాసామాన్యలనంగన్ = స్వీయ పరకీయ సామాన్య అనఁగ; కలరు=ఉన్నారు. అందున్=వారలయందు; స్వీయ=స్వీయ యనునది; త్రపా...కోమల, త్రపాసామగ్రీ=లజ్జాసంపూర్ణతచేతను, శీల=సత్స్వభావముచేతను, ఆర్జవ = అకుటిలతచేతను, కోమల = మృదులస్వభావయై; కమనీయ=మనోజ్ఞయై; గుణములన్ = ఉత్తమగుణములచేత; చెలఁగున్= ఒప్పును. లజ్జాశీలసంరక్షణార్జవత్వమాదులు స్వీయకు గుణము లని తాత్పర్యము. స్వామియందే యనురాగము గలది స్వీయ యని రసమంజరిలక్షణము.

పరకీయాసామాన్యలలక్షణములు.

క. అన్య యనఁగ నన్యోఢయుఁ
గన్యయు సామాన్య యనఁగ ♦ గణికామణి యీ
మాన్యల కుదాహరణము ల
నన్యాదృశవిశదభణితి ♦ నాపాదింతున్. 39

టీ॥ అన్యయనఁగన్=పరకీయయనఁగా; అన్యోఢయున్ = అన్యునిచే వివాహితయు; కన్యయున్=అవివాహితయు; ఇట్లన్యయొక్క భేదములుచెప్పఁబడినవి, లక్షణము గాని గుణములు గాని చెప్పఁబడలేదు. ఇంతియె లక్షణ మన్నచోఁ బతివ్రతయు నన్యోఢయే యని యతివ్యాప్తి వచ్చుఁ గాన "అప్రకటపరపురుషానురాగ పరకీయ" యని దీని లక్షణము దెలియునది. సామాన్యయనఁగన్ = సామాన్యనాయికయనఁగా; గణికామణి = వేశ్యారత్నము. ఈలక్షణము పరిణీతయయి పతివ్రతయయిన గణికయందును గణికాజాత్యంతరస్వైరిణియందు నతివ్యాప్త్యవ్యాప్తిదోషగ్రస్తముగాన విత్తమాత్రోపాధిక పురుషానురాగ సామాన్యయని లక్షణముదెలియునది. ఈమాన్యలకున్ = ఈనాయికల

ను; ఉదాహరణములు=లక్ష్యములను; అనన్యాదృశ...ఘణితిన్=అసదృశమువిశదమునగువాక్కు-చేత ; ఆపాదింతున్ = నిరూపింతును.

స్వీయ కుదాహరణము.

చ. అమృతమువంటిసద్గుణము ♦ నంచితచంద్రకలావిలాసభా
వము శివగోత్రభూతియు న♦వారణఁ దాల్చి యశఃపురంధ్రి దాఁ
గమలవనీహితాన్వయశి♦ఖామణి యైననృసింహమేదినీ
రమణున కేకపత్నియన ♦ రంజిలు లోకము లెల్లఁ మెచ్చఁగన్. 40

టీ॥ యశఃపురంధ్రి = యశస్సనుపతివ్రత; అమృతమువంటిసద్గుణము=అమృతతుల్యమగును_త్తమగుణమును, తెల్లఁదనమనుట; అంచిత...భావము=ఒప్పుచున్న చంద్రకలలతో సమానమగు శృంగారచేష్టావిశేషమును, తెల్లఁదనమును; శివగోత్రభూతియున్=మంగళకరమైన వంశసంపదను, కైలాససంపదను, తెల్లఁదనమును; అవారణన్=నిరర్గళముగ; తాల్చి=ధరించి; తాన్; కమల...రమణునకున్=సూర్యవంశశ్రేష్ఠుఁడగునరసభూపాలునకు; ఏకపత్నియనన్ = పతివ్రతయనునట్లు ; లోకము లెల్లమెచ్చఁగన్ = సమస్తలోకములు మెచ్చునట్లుగా; రంజిలున్=ప్రకాశించును. ఇందు నమృతమువంటిలజ్జాశీలార్జవాదిసద్గుణములు, చంద్రకలలవలె నాహ్లాదకర మగువిలాసము, సత్కులప్రసూతియు, యశఃపురంధ్రియందుఁ జెప్పినందున స్వీయోదాహరణము.

పరకీయోదాహరణము.

సీ. పారసీకక్షమా♦పతులచొ ప్పడఁగించి
నేర్పు మీఱఁగ మోహ ♦ నిద్ర వుచ్చి
యవనసేనాధినా♦యకులదోస్తంభసం
భరితప్రతాపదీ♦పంబు లడఁచి
యభిభూతఖానమ♦ల్కా-విమ్కృతాయశో

ధ్వాంతసంతతి కాత్మ ♦ సంతసిల్లి
సమరముష్కరతురు♦ష్కప్రాప్తసీమల
నడుగు మోవఁగ నీక ♦ యరుగుదెంచి

తే. ప్రాజ్యసామ్రాజ్య యగువారి ♦ రాజ్యలక్ష్మి
కదనసంకేతమున జార ♦ కాంత యగుచు
నంచితస్ఫూర్తి నిన్ను వరి♦యించె నౌర
వైరిగజసింహ యోబయ ♦ నారసింహ. 41

టీ॥ వైరిగజసింహ=శత్రువులనునేనుఁగులకుసింహమా! ఓబయ నారసింహ = ఓబయకుమారుఁడైన నరసభూపాలుఁడా! పారసీక... చొప్పు= పార్సీదేశపురాజులయొక్క భంగిని; అడఁగించి=తగ్గించి; నేర్పు మీఱన్ = చాతుర్యమతిశయించునట్టుగా; మోహనిద్ర = మూర్ఛ యనునిద్రను; పుచ్చి= పొందించి; యవన...దీపంబులు, యవనసేనాధినాయకుల = యవనసైన్యాధిపతులయొక్క, దోస్తంభ = స్తంభములవలెనుండుబాహువులయందు, సంభరిత= నిండిన, ప్రతాపదీపంబులు= ప్రతాపమను దీపములను; అడఁచి= ఆర్చి; అభిభూత...సంతతికిన్, అభిభూత=పరాభవమునుజెందిన, ఖానమల్క = ఖానమల్కయనునామముగలశత్రువుయొక్క, ఆవిష్కృత = ప్రకటితమైన, అయశోధ్వాంతసంతతికిన్ = అపకీర్తియను నంధకారసమూహమునకు; ఆత్మన్=హృదయమందు; సంతసించి = సంతోషించి; సమర...సీమలన్, సమర= యుద్ధమునందు, ముష్కర = మూర్ఖులగు, తురుష్క= తురకలచేత, ప్రాప్త = పొందఁబడిన, సీమలన్= ప్రదేశములయందు; అడుగు=పాదమును; మోవఁగనీక=ఆననీయక; అరుగుదెంచి = వచ్చి; ప్రాజ్య... లక్ష్మి= బహుళమైన సామ్రాజ్యముగల శత్రురాజ్యలక్ష్మి; కదనసంకేతమునన్ = యుద్ధమనుసంకేతస్థానమందు; జారకాంతయగుచున్=

జారస్త్రీయగుచు ; అంచితస్ఫూర్తిక్ = శ్రేష్ఠమైనప్రకాశముచేత; ని నుక్; వరియించెక్. ఇందు శత్రురాజ్యలక్ష్మి పారసీకరాజు లనుపతుల నిద్రవుచ్చి ప్రతాపదీపముల నార్చి యపకీర్తి యనునంధకారమునకు హర్షించి జనభూయిష్ఠప్రదేశముల నడుగిడక నరసభూపాలునిఁ జేరె నని చెప్పినందున గూఢవ్యాపారములు గలిగినపరకీయకు దాహరణ మని తెలియునది. గుప్తా విదగ్ధా ముదితా లక్షితా కులటా ప్రభృతుల కిందె యంతర్భావమని రసమంజరియం దున్నది.

కన్యోదాహరణము.

శా. ఆజానేయము నెక్కి యోబయనృసింహస్వామి వాహ్యాళి రా
నోజం గాంచనసౌధవీధికఁ దదీయోల్లాసముం జూచి మా
తేజోవిభ్రమధన్య కన్య మదనార్తిం జెంది ప్రాసాదపా
ళీజాగ్రన్మణిపుత్త్రికానియతిఁ దాల్చెక్ దద్గతస్వాంతయై. 42

టీ॥ ఓబయనృసింహస్వామి = ఓబయకుమారుఁడైన నరస భూపాలుఁడు ; ఆజానేయముక్ = ఉత్తమాశ్వమును; ఎక్కి = అధిష్ఠించి; వాహ్యాళిరాక్ = విహారార్థమైరాఁగా; ఓజక్ = ఉత్సాహముచే; కాంచన సౌధవీధికక్ = బంగరుమేడయొక్క ప్రదేశమందు; తదీయోల్లాసముక్ = ఆరాజుదైనవిలాసమును ; చూచి; మా...ధన్య=లక్ష్మీదేవియొక్క తే జోవిలాసమువంటితేజోవిలాసముచేత ధన్యయగు; కన్య = అవివాహిత స్త్రీ; మదనార్తిక్ = కామబాధను; చెంది= పొంది; తద్గతస్వాంతయై= ఆనృసింహునిబొందినమనస్సుగలదై; ప్రాసాద...నియతిక్, ప్రసాదపా ళీ= మేడలపఙ్క్తియందు, జాగ్రత్ = ఉండునట్టి, మణిపుత్త్రికా=మణి మయమైనబొమ్మయొక్క, నియతిక్ = నియమమువంటి నియమము ను; తాల్చెక్ = ధరించెను. కవి నరసభూపాలునిగూర్చి యువధరింపు మని యుపక్రమించి సంబోధ్యుఁ డగునరసభూపాలుని “తదీయోల్లాస

ము, తద్గతస్వాంతమై" అని తటస్థునిబోలెఁ జెప్పుట యసంగతము గాఁ దోఁచుచున్నది. ఇట్లన్యంబులు పెక్కులు గలిగి యున్నవి.

సామాన్యోదాహరణము.

క. ఏరీతివారు చెందిన
నారీతిఁ దదీయరాగ ♦ మందెడి నౌరా
వారాంగన యది సాక్షా
త్కారపుఁ బటికంపుబొమ్మ ♦ గాఁబోలుఁ జుమీ. 43

టీ॥ వారాంగన = వేశ్యాంగన; ఏరీతినివారు చెందినన్ = ఏవిధమువారుపొందినను; ఆరీతిన్ = ఆప్రకారముగ; తదీయరాగమున్ = నారిసంబంధమైనయనురాగమును; అందెడిన్ = పొందును. ఔరా = ఆశ్చర్యము! అది = ఆవారాంగన; సాక్షాత్కారపుఁబటికంపుబొమ్మ = ప్రత్యక్షమైనస్ఫటికపుప్రతిమ; కాఁబోలుఁజుమీ = కావచ్చునుజుమీ. స్ఫటికపుప్రతిమ తనయొద్ద నుంచిన పదార్థములరాగము పొందునట్లు వారాంగనయు ఘటిల్లినపురుషులయనురాగము పొందు ననుట. ఇదివిత్తమాత్రోపాధికసకలపురుషానురాగ సామాన్య యనులక్షణమునకే సరి యైనలక్ష్యం బగుఁ గాని యేతద్గ్రంథోక్తలక్షణమునకు సరియైనది గాదు.

ముగ్ధాదిభేదంబులు.

క. ఈమగువల కాద్యయ ము
గ్ధామధ్యాప్రౌఢ లనఁగఁ ♦ దగు నవ్యవయో
వ్యామిశ్రితయోగ్యము లగు
నామములు తదీయలక్ష♦ణము లేర్పఱతున్. 44

టీ॥ ఈమగువలకున్ = ఈనాయికలకు; ఆద్యయ = మొదటిదగు స్వీయయె; ఇందు "ఆద్యయు" ననుపాఠమున సముచ్చయార్థకయుశబ్ద

ము, పరకీయాసామాన్యలకు ధీరాదిభేదమ్ములు లేనందున నన్వయింపదు, కాన "నాద్యయ" యనుపాఠమే యుక్తముగాఁ దెలియునది, ముగ్ధామధ్యాప్రౌఢలనన్ = ముగ్ధమధ్యప్రౌఢయనిమూఁడుప్రకారములుగ; తగున్ = ఒప్పును. నామములు = పేరులు, ముగ్ధాదులనుట; నవ్య... యోగ్యములు, నవ్య = నూతనమగు, వయః = యౌవనముచేత, వ్యామిశ్రిత = మిశ్రితములుకావున. యోగ్యములు = ప్రశస్తములు; అగున్. తదీయలక్షణములు = ఆముగ్ధాదులయొక్క లక్షణములను; ఏర్పఱతున్ = నిరూపింతును. ఇందు, "స్వీయ, ముగ్ధ మధ్య ప్రౌఢ యనుభేదములు గలది యగు, వాని లక్షణము లేర్పఱతు" నని యుండుట మాత్రము యుక్తంబు. అతిరిక్తం బగునవ్యవయోవ్యామిశ్రితయోగ్యములనువిశేషణము నిరర్థకము అనన్వితంబు నని తోఁచుచున్నది. ఎట్లన, నామములు శబ్దాత్మకములు గాన నందు నవ్య వయోవ్యామిశ్రితములనువిశేషణ మన్వయింపదు. వయస్సు, పదార్థధర్మము గాని శబ్దధర్మము కా దనుట స్పష్టము. వయఃపదము లక్షణచేత నవ్యవయఆదిబోధకపదపర మని తాదృశపదఘటితనామము లని యర్థ మన్నచో నట్టి నామములు, నవనవకామయౌవనేత్యాదిలక్షణముల కన్న వేఱుగఁ జెప్పనందునను, లక్షణము లన్నమాత్రముననే చరితార్థమై సందునను, నిది యుక్తముగాఁ దోఁచలేదు.

మఱియు, ప్రథమద్వితీయతృతీయభేదములచే ముగ్ధాంగులగ యౌవనము పూర్వులచే నిరూపింపఁబడినను ప్రథమద్వితీయములే రసోపయుక్తలగుఁ గాని తృతీయము గాఁజాల దని రసార్ణవసుధాకరాదులయందు స్పష్టముగా నిరూపింపఁబడినది. ఇఁక నవ్యవయస్సే మధ్యాప్రౌఢలందుండు నని చెప్పుట కలవి కాదు. మఱియు ప్రథమద్వితీయ యౌవనములు మాత్రము కవ్యభిప్రాయమగునేని, యట్లుబోధించుటకు

నప్యవయఃపదము నమర్థమును గాదు, యుక్తాయుక్తములు సూరివర్యు లూహించునది.

ముగ్ధాదిలక్షణములు.

చ. నవనవకామయౌవనస♦నాథయు నల్పరతంబు గల్గు న
య్యువిదయె ముగ్ధ మధ్య సదృ♦శోదితయౌవనకామయై రతాం
తవివశ యౌ లతాంగి సత♦తప్రథితోల్బణకామయౌవనో
త్సవయు రతాది మోహమున ♦ దాల్చుతలోదరి ప్రౌఢ దా నగున్.

టీ॥ నవ...సనాథయున్ = అతినూతనమగుకామమును యౌవనమునుగలదియు; అల్ప...ఉవిదయె = స్వల్పరతము గలుగునట్టియౌవనితయె; ముగ్ధ = ముగ్ధయగును. సదృశ...కామయై = తుల్యమగునట్టుగా నుదయించిన యౌవనముకామములు గలదై; రత...లతాంగి= రతాంతసమయమందుఁ బరవశయగునట్టిస్త్రీ; మధ్య=మధ్యమగును. సతత...ఉత్సవయున్ = నిరంతరము నుప్పొంగుకామము యౌవనము గలదియు; రత...తలోదరి = సురతాదియందుఁ బరవశతనుఁ జెందునట్టివనిత; తాన్=తాను; ప్రౌఢ = ప్రౌఢయనునది; అగున్=అవును; తాత్పర్యముస్పష్టము.

ముగ్ధకుదాహరణము.

శా. ఆలాపంబున కుత్తరం బొసఁగ దా♦యాసంబునం గాని తా
నాలోకింపదు పాటలాధరమరం♦దాస్వాదసమ్మర్దముం
దాళం జాలదు కౌఁగి లియ్యదు తనూ♦తాపంబు చల్లాఱఁగాఁ
నేలజ్జావతి తద్రతంబు దయితా♦భీష్టంబుగా నుండునే. 46

టీ॥ ఏలజ్జావతి = లజ్జగలయేస్త్రీ; ఆలాపంబునకున్ = పలుకునకు; ఉత్తరంబు=బదులుపలుకును; ఒసఁగదు=ఇయ్యదో; తాన్; ఆయాసంబునన్గాని = శ్రమవలననేగాని; ఆలోకింపదు=చూడదో; పాటల...

సమ్మర్దముక్, పాటలాధర = ఎఱ్ఱనిపెదవియొక్క, మరంద=రసముయొక్క, ఆస్వాద= పానముయొక్క, సమ్మర్దముక్ = సంబాధమును; తాళంజాలదు=ఓర్వఁజాలదో; తనూతాపంబు=శరీరసంతాపము; చల్లాఱంగాక్=శమించునట్లుగా. కౌఁగిలియ్యదు= ఆలింగనముచేయదో; తద్రతంబు=ఆ స్త్రీసురతము ; దయితాభీష్టంబు=ప్రియునకిష్టమయినది; కాకుండునే? అగుననుట. ఇందు నాయికకు లజ్జానత్త్వము అల్పరతము, చెప్పినందున ఇది ముగ్ధ కుదాహరణము.

మధ్య కుదాహరణము.

ఉ. మానినివైఖరి న్మణిత♦మంత్రములం గబరీవినిర్గళ
త్సూనములం బ్రసూనశరి♦శూరునిపూజ లొనర్చి తా రతి
న్మానిని యొప్పె నప్పు డస♦మానమనోంబుజవీథి నాతనిన్
ధ్యానము సేయునట్లు వడి ర♦తాంతనితాంతనిమీలితాక్షియై. 47

టీ॥ మానిని=స్త్రీ; రతిన్ = సురతమందు; మానితవైఖరిన్= మంచిరీతిచేత; మణితమంత్రములన్ = రతికూజితములను మంత్రములచేతను; కబరీ...సూనములన్= తలవెండ్రుకలనుండి జాఱుచున్న పువ్వులచేతను, ప్రసూన...పూజలు= మన్మథునియొక్కపూజలను; ఒనర్చి=చేసి; తాన్; అప్పుడు= ఆసమయమందు; రతాంత...అక్షియై= సురతాంతమందు మిక్కిలిమూయఁబడిన కన్నులుగలదై; అసమాన...వీథిన్ = సాటిలేనిమానసపద్మముయొక్క ప్రదేశమునందు; ఆతనిన్ = ఆమన్మథుని; ధ్యానముసేయునట్లు వడిన్ = ధ్యానముచేయునట్లు; ఒప్పెన్=ప్రకాశించెను. ఇందు రతాంతమునందు మోహమును జెప్పినందున నిది మధ్య కుదాహరణము.

ప్రౌఢ కుదాహరణము.

మ. పటుదుత్తుంగపయోధరంబు జితమం♦దాక్షక్రియోదార మ

స్ఫుటవాగంకుర మక్షికోణనివస♦త్పుష్పేషుదర్పంబు సం
ఘటితాలింగనవామనీకృతకుచా♦గ్రప్రౌఢరోమాంచమై
విటుఁ జొక్కించెఁ బ్రఫుల్లపద్మనయనా♦వీరాయితం బెంతయుక్.

టీ॥ ప్రఫుల్లపద్మ...యనావీరాయితంబు = వికసించినపద్మములవంటినేత్రములుగల స్త్రీయొక్క ఉపరిరతము; నటత్...ధరంబు = చలించుచున్నట్టి యున్నతమైన స్తనములుగలది; జిత...ఉదారము = జయింపఁబడిన లజ్జావ్యాపారము గలదగుటచే నధికమైనది; అస్ఫుటవాగంకురము = అవ్యక్తమగు వాక్కులయొక్క యావిర్భావముగలది; అక్షి...దర్పంబు, అక్షికోణ = కడకంటియందు, నివసత్ = వసించునట్టి, పుష్పేషు = మన్మథునియొక్క, దర్పంబు = గర్వముగలది; కటాక్షము మిక్కిలి మదనోద్దీపకమయిన దనుట; సంఘటిత...రోమాంచమై, సంఘటితాలింగన = బాగుగఁగూర్పఁబడిన యాలింగనముచేత, గాఢాలింగనముచేతననుట, "శ్లో॥ గాఢాలిఙ్గనవామనీకృతకుచప్రోద్భిన్నరోమోద్గమా" అని యమరుకము, వామనీకృత = కుఱుచలుగాఁజేయఁబడిన, కుచాగ్ర = స్తనాగ్రములయందు, ప్రౌఢ = అతిశయించిన, రోమాంచమై = పులకలుగలదై; విటుక్ = ప్రియుని; చొక్కించెక్ = ఆనందపెట్టెను. ఇది జితమందాక్షక్రియోదారత్వాదులు వచించుటచేత "శ్లో॥ స్మరమన్దీకృతవ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనా" యను ప్రాచీనలక్షణము ననుసరించిన ప్రౌఢోదాహరణము.

లజ్జాప్రధానము లగుముగ్ధామధ్యాప్రౌఢాభేదములు స్వీయకే గాని పరకీయాసామాన్యలకు లేనందువలనను "కావున స్వీయ త్రయోదశ, భావంబు వహించు" ననియేతద్గ్రంథముననే నిర్ణయింపఁబడుటవలనను, నిందు "విటుఁ జొక్కించె" నని వ్రాయుట విరుద్ధము. విటశబ్దము సాధారణముగఁ బురుషునిగాని పతినిగాని బోధించునది గా

దు. స్వీయాలక్షణవిరుద్ధమగుటవలనను, ఇది యుక్తముగాఁ దోఁచదు.

ధీ రా ది భే ద ము లు.

క. ధీర యధీరయు ధీరా
ధీరయు నగు నందు మధ్య ♦ ధీరాఽధీరా
ధీరాధీరాహ్వయముల
ధారుణిఁ బ్రౌఢయుఁ జెలంగుఁ ♦ దల్లక్షణముల్. 49

టీ॥ అందున్ = అముగ్ధామధ్యాప్రౌఢలయందు ; మధ్య = మధ్య యనునది; ధీర అధీరయున్ ధీరాధీరయున్ = ధీర అధీర ధీరాధీర అనునది; అగున్. ప్రౌఢయున్ = ప్రౌఢనాయికయు ; ధీరా...ఆహ్వయములన్ = ధీర అధీర ధీరాధీర యనునామములచేత; ధారుణిన్ = భూమియందు; చెలంగున్ = ప్రకాశించును. తల్లక్షణముల్ = ఆధీరాదిలక్షణములు; చెప్పఁబడున్, అనుక్రియ యధ్యాహార్యము.

మధ్యధీరాదిలక్షణములు.

తే. తప్పు గలభర్తమ్రోల సో♦త్ప్రాసభణితిఁ
గేరడము లాడుసతి మధ్య ♦ ధీర సాశ్రు
పరుషవచన యధీర స♦బాష్పకుటిల
హారివచన ధీరాధీర ♦ యనఁగఁ జెలఁగు. 50

టీ॥ తప్పుగలభర్తమ్రోలన్ = అపరాధియగునాథుని యెదుట; సోత్ప్రాసభణితిన్ = పరిహాసముతోఁగూడినపలుకులచేత; కేరడములాడుసతి = వంకరమాటలాడు స్త్రీ; మధ్యధీర = మధ్యధీరయగును. సాశ్రు...వచన = కన్నీటితోఁగూడిన కఠినవాక్కులుగలది; అధీర = మధ్యాధీరయగును. సబాష్ప...వచన = కన్నీటితోఁగూడినట్టియు, వంకరలయినట్టియు, మనోహరములైనట్టివాక్కులుగలది; ధీరాధీరయనఁగన్ = మధ్యధీరాధీరయనఁగా; చెలఁగున్ = ఒప్పును.

## ప్రౌఢధీరాదిలక్షణములు.

తే. కాంతుఁ డపరాధి యైన నా♦కారగుప్తిఁ
బరఁగి రతివేళ నలయించుఁ ♦ బ్రౌఢధీర
తాడనోగ్ర యధీర యు♦దగ్రకుటిల
భణితి యుభయాఖ్య వీరి నే♦ర్పఱతు వరుస. 51

టీ॥ ప్రౌఢధీర = ప్రౌఢధీరయనునది; కాంతుఁడు = ప్రియుఁడు; అపరాధియైనన్ = పరస్త్రీసంభోగాద్యపరాధవంతుఁడుగాఁగా ; ఆకార గుప్తిన్ = అభిప్రాయవిశేషాదుల మఱుఁగుపఱచుటచేత; పరఁగి = ఒప్పి; రతివేళన్ = సురతసమయమందు ; అలయించున్ = ఆయాసపెట్టును. అధీర = ప్రౌఢాధీర; తాడనోగ్ర = తాడనముచేత భయంకర యగును. ప్రియుఁడు చేసినవిప్రియమునకుఁ బ్రతిక్రియావధి మనసు నిలుపుకొనలేక యధైర్యముచేఁ దాడనము సేయు ననుట. ఉభయాఖ్య = ప్రౌఢధీరాధీరయనునది; ఉదగ్రకుటిలభణితి = అధికమైకౌటిల్యముగలవాక్కులుగలది. వీరిన్ = ఈనాయికలను; వరుసన్ = క్రమముగా ; ఏర్పఱతున్ = నిరూపింతును. తాత్పర్యముస్పష్టము.

## మధ్యధీర కుదాహరణము.

ఉ. మోమున ఘర్మశీకరస♦మూహము గానఁగ నయ్యె నిప్పు డా
రామవిహారకేళిని భ♦రంపడినాఁడవొ నన్నుఁ బాసి యీ
రే మదనాస్త్రఘాతముల ♦ వ్రేఁగితొ నీయుర మెల్లఁ దద్వ్రణ
స్తోమము సోఁకియున్నయది♦చొప్పడఁగాంత యెఱుంగఁ జెప్పుమా.

టీ॥ కాంత = ప్రియుఁడా! మోమునన్ = ముఖమందు ; ఘర్మశీకరసమూహము=చెమటబొట్టులసమూహము; కానఁగనయ్యెన్= కనఁబడెను. ఇప్పుడు= ఈసమయమందు; ఆరామవిహారకేళిన్=ఉద్యానవనవిహారక్రీడచేత ; భరంపడినాఁడవో = శ్రమపడితివో, నన్నున్;

పాసి=వదలి ; ఈరే = ఈరాత్రియందు ; మదనాస్త్రఘాతములన్ = మన్మథబాణప్రహారములచేత; వేఁగితో = తపించితివో. నీయురమెల్లన్ = నీఱొమ్మంతయు; గాద్వ్రణస్తోమముసోఁకియున్నది = ఆమదనాస్త్రఘాతములచేఁ గలుగుగాయములసమూహముతగిలియున్నది. చొప్పడన్ = సరిపడునట్లు; ఎఱుంగన్; చెప్పుమా. ఇందుఁ బ్రియుం డపరాధినై రాఁ జూచి కేరడము లాడినట్టు చెప్పినందున నాయిక మధ్యాధీర.

మధ్యాధీర కుదాహరణము.

శా. చాలుం జాలుఁ బిసాళిసేఁతలు పదా♦బ్జాతంబుపై మాటికిన్
వ్రాలం బోకు భవత్ప్రియానఖవిమ♦ర్శం బైననీవక్షు మీ
నీలస్థాపితకుట్టిమం బొరసి న♦న్వేధించు లేలెమ్ము నీ
బాలాసంగమసౌఖ్యవైభవము సూ♦ప న్వచ్చితే యిచ్చటన్. 53

టీ॥ పిసాళిసేఁతలు=దొంగయెత్తుగలచేష్టలు ; చాలుంజాలున్. పదాబ్జాతంబుపైన్= పాదపద్మమీఁద; మాటికిన్=పలుమాఱు ; వ్రాలంబోకు=పడవలదు. భవత్...వక్షము = నీప్రియురాలినఖక్షతములతోఁగూడిననీఱొమ్ము ; ఈనీలస్థాపితకుట్టిమంబు= ఈయింద్రనీలమణి చితభూమిని; ఒరసి=కలిసి, అందు ప్రతిఫలించియనుట;నన్వేధింపన్= నన్నుబాధించును. లేక; ఒరసినన్ = తాఁకినయెడ ; వేధించున్= బాధించును. నీఱొమ్మున నఖక్షతములున్నవి కావున నీరాతినేల తాఁకినయెడ బాధగలుగునని యీపక్షమునఁ దాత్పర్యము. లేలెమ్ము= లెమ్ములెమ్ము. నీబాలా...వైభవము= నీయొక్కతరుణస్త్రీసంగమముచేఁగలిగిన సౌఖ్యాతిశయమును; చూపన్= కనఁబఱచుటకు; ఇచ్చటన్ = ఇందు; వచ్చితే? ఇం దధైర్యప్రయుక్తము లగుకఠినోక్తులు పలుకుటచేత నాయిక మధ్యాధీర యగు. లక్షణమున "సాశ్రుపరుషవచన" యని చెప్పి

లక్ష్యములోఁ బరుషవాక్యములుమాత్రము చెప్పఁబడినవి, ఐనను వ
శ్రువుల నాక్షేపించి సమన్వయంబు చేయునది.

మధ్యధీరాధీర కుదాహరణము.

చ. పలుక వటంచు నేమిటికి ♦ బాములఁ బెట్టెదు కాంత నీపయిం
దెలియఁగఁ దప్పు లేమికిని ♦ ని న్ననఁ జాలక యూరకుండినం
బలుమఱు సాపరాధుగతిఁ ♦ బల్కెద వెన్నఁడుఁ దప్పు నీయెడం
గలుగునె యంచు నించెఁ దెలి ♦ గన్నుల నీరు లతాంగి యంతటన్.

టీ॥ కాంత=ప్రియుఁడా! పలుకవటంచున్ = మాటాడవనుచు; ఏమిటికిన్ = ఏల; బాములఁబెట్టెదు = దుఃఖపఱచెదవు? నీపయిన్ = నీయందు; తెలియఁగన్ = విచారింపఁగా; తప్పులేమికిని = అపరాధములేకుంటనుబట్టి; నిన్ననఁజాలక = నిన్నుఁజెప్పఁజాలక; ఊరకుండినన్ = మిన్నకుండినను; పలుమఱున్ = సారెకు; సాపరాధుగతిన్ = అపరాధముచేసినవానిభంగి; పల్కెదు = వచించెదవు. నీయెడన్ = నీయందు; ఎన్నఁడున్ = ఎప్పటికిని; తప్పుగలుగునె = అపరాధముండునా? అంచున్; లతాంగి = స్త్రీ; తెలిగన్నులన్ = తెల్లనినేత్రములయందు; అంతటన్ = పూర్ణముగ; నీరునించెన్ = బాష్పమునిండించెను. ఇందు నాయిక ధీరత్వమువలనఁ దనయభిప్రాయము బయలుపడకుండఁ గొంతవఱకు కుటిలోక్తు లాడి పిమ్మట యధీరత్వమువలన నశ్రువులు నించుటంజేసి మధ్యధీరాధీర యగు.

ప్రౌఢధీర కుదాహరణము.

చ. హితమతి ధూర్తభర్త కెదు ♦ రేగెడునేర్పున నేకపీఠసం
గతి హరియించి పల్కుటయు ♦ గ్రక్కున నెచ్చెలి కూడిగంబులం
జతురత నేర్పుచందమున ♦ జాఱఁగఁ ద్రోచి యతిప్రగల్భ యా
సతి యుపచారగౌరవము ♦ సల్పెడునట్లు వహించెఁ గోపమున్. 55

టీ॥ హితమతిన్ = అనుకూలబుద్ధిచేత; ధూర్తభర్తకున్ = మోసకాండగు ప్రియునకు; ఎదురేగెడు నేర్పునన్ = ఎదురుగాఁబోవు చాతుర్యము చేత; ఏకపీఠసంగతిన్ = ఏకాసనోపవేశసంబంధమును; హరియించి = పరిహరించి; గ్రక్కునన్ = శీఘ్రముగా; నెచ్చెలికిన్ = స్నేహితురాలికి, ఊడిగంబులన్ = పనులను; చతురతన్ = చాతుర్యము చేత; నేర్పుచందమునన్ = చెప్పువిధమున; పల్కుటయున్ = మాటలాడుటనుగూడ; జాఱఁగఁద్రోచి = తప్పించి; అతిప్రగల్భయానసతి = మిక్కిలి ప్రౌఢయగునాయిక; ఉపచారగౌరవముసల్పెడునట్లు = ఉపచారాతిశయము సేయురీతిగ; కోపమున్; వహించెన్ = తాల్చెను, నిర్వహించెననుట. సంభాషణసహాసనాదికార్యములను జాతుర్యముచేతఁ దప్పించి కోపమును జెల్లించుకొన్నందునఁ బ్రౌఢధీర, "శ్లో॥ ఏకత్రాసనసంగతిః పరిహృతా ప్రత్యుద్గమా ద్దూరత స్తామ్బూలాహరణచ్ఛలేన రభసాశ్లేషో ఽపి సంవిఘ్నితః। ఆలాపోఽపి న మిశ్రితః పరిజనం వ్యాపారయ న్త్యన్తికే కాన్తం ప్రత్యుపచారత శ్చతురయా కోపః కృతార్థీకృతః॥" అనుసమరుకపద్యమున నేకాసనసంగతిపరిహారాదులవలనఁ గోపము కృతకృత్యముగఁ జేయఁబడె నని యర్థ మగుచున్నది. కోపమువలనఁ జేయవలసినకృత్యము లుపచారముచేయుభంగి నొనరించె నని తాత్పర్యము. ఇందు "వహించెఁగోపమున్" అనుటవలనఁ గోపకృత్యములను జేసె నని యర్థముగాక కోపవహనము మాత్రము చేసిన ట్లభిప్రాయ మగుచున్నది. కావున వహించె ననుదానికి నిర్వహించె ననునర్థ ముచితము.

## ప్రౌఢాధీర కుదాహరణము.

చ. వరునిఁ గృతాపరాధుని నవారణ వారణయాన యానునం
గెదలి భుజాగుణంబున బిగించి వతంసితసారసంబునం

గరము దమింపఁగాఁ దొడఁగెఁ ♦ గాంతుని సాంత్వనశీతలోక్తు లాం
తరనిజకోపతప్తఘృత ♦ ధార కకారణవారిధారగాన్. 56

టీ॥ వారణయాన = ఏనుఁగునడకవంటినడకగల స్త్రీ; కృతాపరాధునిన్=సాపరాధుఁడైన; వరునిన్ = ప్రియుని ; కని = చూచి; అవారణ=అడ్డములేనిదై; ఈసునన్ = కోపముచేత ; కెరలి= విజృంభించి; కాంతుని...ఉక్తులు= ప్రియునియూఱడింపుచల్లనిమాటలు; అంతర...ధారకున్ = హృదయమందుండు తనకోపమనెడువేఁడినేతిధారకు; అకారణ... ధారగాన్ = నిష్కారణజలధారయగుచుండఁగా; భుజాగుణంబునన్=బాహువనెడుపగ్గముచేత; బిగించి= దృఢముగబంధించి; వతంసితసారసంబునన్ = శిరోభూషణముగఁజేయఁబడిన పద్మముచేత; కరము=మిక్కిలి; దమింపఁగాన్=కొట్టుటకు; తొడఁగెన్ = ప్రవర్తించెను. ఇందు నాయికయం దధీరత స్పష్టము.

ప్రౌఢధీరాధీర కుదాహరణము.

చ. బొమముడిపాటుజంకె నటు ♦ పూని పురంధ్రులు సాపరాధు లౌ
రమణులు వేఁడుకొన్న ననురాగము దాల్పుదు రట్లు గాదు మ
త్కృతిమ మపరాధలేశమును ♦ దాల్పని నీ విపు డెంత మ్రొక్కినం
దెమలదు శాంతిఁ బొందదు మదీయమనం బికఁ జాలుఁ బ్రార్థనల్.

టీ॥ బొమముడిపాటుజంకెన్ = భ్రూభంగమనుబెదిరింపును; అటు ; పూని = వహించి ; పురంధ్రులు = సచ్చరిత్రలౌనాయికలు; సాపరాధులౌరమణులు = తప్పిదముఁజేసినప్రియులు ; వేఁడుకొన్నన్=ప్రార్థనచేసినచో; అనురాగము=ప్రీతిని; తాల్పుదురు= పొందుదురు. మత్కృతిమము=నారీతి; అట్లుగాదు=ఆవిధముగాదు. అపరాధ... నీవు=కొంచెమైనఅపరాధముచేయనినీవు ; ఇపుడు; ఎంతమ్రొక్కినన్= ఎంతనమస్కరించినను; మదీయమనంబు = నామనస్సు; తెమలదు=చ

లింపదు. శాంతిఁబొందదు= కోపమాఱుటనుజెందదు. ఇఁకన్; ప్రార్థన ల్ =వేఁడుటలు; చాలున్. ఇం దపరాధిని నిరపరాధి యనుకుటిలోక్తి యు, నామనము శాంతిఁ బొంద దను పరుషోక్తియుఁ, గలుగుటవలన నాయిక ప్రౌఢధీరాధీర యగు.

## జ్యేష్ఠా కనిష్ఠా భేదములు.

క. ధారుణి మధ్యయుఁ బ్రౌఢయు
ధీరాధీరాదిభేద ♦ దీపితలై వే
ర్వేరను జ్యేష్ఠ కనిష్ఠయు
నై రంజిలి ద్వాదశాఖ్య ♦ లగుదురు వరుసన్. 58

టీ॥ ధారుణిన్ = భూమియందు ; మధ్యయున్ = మధ్యనాయికయు; ప్రౌఢయున్=ప్రౌఢనాయికయు; ధీరా...దీపితలై =ధీరఅధీరధీరాధీరఅనుభేదములచేతఁ బ్రకాశింపఁజేయఁబడినవారై; వేర్వేరన్= వేరువేరుగా; జ్యేష్ఠకనిష్ఠయునై = జ్యేష్ఠయనియు కనిష్ఠయనియు భేదములుగలవారై; రంజిలి=ప్రకాశించి; వరుసన్=క్రమముగా; ద్వాదశాఖ్యలగుదురు=మధ్యధీరజ్యేష్ఠ మధ్యధీరకనిష్ఠ, మధ్యాధీరజ్యేష్ఠ మధ్యాధీరకనిష్ఠ, మధ్యధీరాధీరజ్యేష్ఠ మధ్యధీరాధీరకనిష్ఠ, ప్రౌఢధీరజ్యేష్ఠ ప్రౌఢధీరకనిష్ఠ, ప్రౌఢాధీరజ్యేష్ఠ ప్రౌఢాధీరకనిష్ఠ, ప్రౌఢధీరాధీరజ్యేష్ఠ ప్రౌఢధీరాధీరకనిష్ఠ, యని ద్వాదశనామములు గలవా రగుదురు.

## స్వీయాదిభేదనిరూపణము.

క. కావున స్వీయ త్రయోదశ
భావంబు వహించు నన్య ♦ పరఁగు ద్వివిధమై
యావారాంగన యేకవి
భావమ యుల్లెన్నఁగాఁ బ♦దార్వురు సుదతుల్. 59

టీ॥ కావునన్ = మధ్యాప్రౌఢలుపండ్రెండు భేదములుగలవారగు టవలన; స్వీయ=స్వీయయనునాయిక; త్రయోదశభావంబునఁ హించున్ = పదుమూఁడుభేదములుగలదగును, ముగ్ధ యొక్కటి, మధ్యాప్రౌఢలు పండ్రెండు, చేరి స్వీయ పదుమూఁడుభేదములు గల దగు ననుట. అన్య=పరకీయ; ద్వివిధయై=అన్యోఢ కన్యయను రెండు భేదములుగలదై; పరఁగున్ = ఒప్పును. ఆవారాంగన= ప్రసిద్ధయగుసామాన్యనాయిక; ఏకవిధావహ=ఒక టే భేదము గలది. ఇట్లెన్నఁగాన్ = ఈరీతిగణింపఁగా; సుదతుల్ = నాయికలు; పదార్వుగు=పదునాఱుగురు. "శ్లో॥ స్వీయా త్రయోదశవిధా ద్వి ధా తు పరాఙ్గనా । వేశ్యై కైవం షోడశధా నాయికాః పరికీర్తితాః॥" అని ప్రాచీనులు విభ్లే పిభ జించిరి.

ఇఁక నష్టవిధనాయికానిరూపణము.

తే. మఱియు శృంగారశంభుసంభావితాష్ట
తనువు లన నీమృగాక్షులు విసుతిఁ గాంతు
రష్టవిధ భేదముల వీరి యాహ్వయములు
లక్షణము లేర్పరించెద లలితఫణితి. 60

టీ॥ మఱియున్ = వెండియు; ఈమృగాక్షులు = ఈనాయికలు; శృంగార...అనన్ = శృంగారరస మనెడుశివునకు సంభావితము లగు నెనిమిదిశరీరము లనునట్లు, ఈశ్వరుండు పృథివ్యాదిశరీరాష్టకము గలవాఁడు గాన ఈయెనమండ్రు శృంగార మనునీశ్వరునిశరీరములుగా భావింపఁ దగినవా రనుట; అష్టవిధభేదములన్=ఎనిమిదివిధములయిన భేదములచే; వినుతిఁగాంతురు = ఖ్యాతినొందుదురు. వీరియాహ్వయములు=వీరినామములను; లక్షణములు = స్వరూపములను; లలితఫణితిన్= మృదువాక్కుచేత; ఏర్పరించెదన్ =నిరూపింతును.

స్వాధీనపతికాదిలక్షణములు.

సీ. వరుఁడు కైవస మైన ♦ వనిత స్వాధీనభ
ర్తృక ప్రియాగమవేళ ♦ గృహముఁ దనువు
నవరించునింతి వా♦సకసజ్జ పతిరాక
తడ వుండ నుత్కంఠఁ ♦ దాల్చు నింతి
విరహోత్క సంకేత ♦ మరసి నాథుఁడు లేమి
వెస నార్త యగుకాంత ♦ విప్రలబ్ధ
విభుఁ డన్యసతిఁ జెంది ♦ వేకువ రాఁ గుందు
నబల ఖండిత యల్క ♦ నధిపుఁ దెగడి
తే. యనుశయముఁ జెందు సతి కల♦హాంతరిత ని
జేశుఁడు విదేశగతుఁ డైనఁ ♦ గృశతఁ దాల్చు
నతివ ప్రోషితపతిక కాం♦తాభిసరణ
శీల యభిసారికాఖ్యయై ♦ చెలువు మెఱయు. 61

టీ॥ వరుఁడు = ప్రియుఁడు; కైవసమైనవనిత = స్వాధీనుఁడు గాఁగల స్త్రీ; స్వాధీనభర్తృక = స్వాధీనపతికయనఁబడు. ప్రియాగమ వేళన్ = ప్రియుఁడువచ్చుసమయమందు; గృహమున్ = కేళీగృహమును; తనువున్ = శరీరమును; నవరించునింతి = అలంకరించునాయిక; వాసకస జ్జ = వాసకసజ్జయనఁబడును. పతి...ఉండన్ = ప్రియుఁడు రాకవిలంబి పడఁగా; ఉత్కంఠన్ = ఔత్సుక్యమును; తాల్చునింతి = వహించు నాయిక; విరహోత్క = విరహోత్కంఠితయనఁబడు. సంకేతమరసి = సంకేతస్థానమును వెదకి; నాథుఁడు లేమిన్ = ప్రియుఁడు లేకుండుటవలన; వెసనార్తయగుకాంత = శీఘ్రముగాదుఃఖితయగునాయిక; విప్రలబ్ధ = విప్ర లబ్ధయనునదియగును. విభుఁడు = ప్రియుఁడు; అన్యసతిన్ = అన్యకాంత ను; చెంది = పొంది; వేకువన్ = ప్రాతఃకాలమందు; రాన్ = రాఁగా; కుం

దునబల=దుఃఖించుకాంత; ఖండిత=ఖండితయనఁబడు. అలుక౯=కోపముచేత; అధిపు౯=భర్తను; తెగడి=నిందించి; అనుశయముఁజెందుసతి=పశ్చాత్తాపమునొందునాయిక; కలహాంతరిత=కలహాంతరితయనఁబడు. నిజేశుఁడు= తనప్రియుఁడు; విదేశగతుఁడైన౯ = దేశాంతరముఁబొందినవాఁడైనప్పుడు; కృశత౯ = కృశత్వమును; తాల్చుసతివ = వహించు స్త్రీ; ప్రోషితపతిక = ప్రోషితపతికయనఁబడు. కాంత...శీల= ప్రియునిగూర్చి సంకేతస్థలమునకుఁబోవుట స్వభావముగాఁగలది; అభిసారికాఖ్యయై = అభిసారికయనునామముగలదయి; చెలువుమెఱయు౯ = అందమైప్రకాశించును.

కవిప్రతిజ్ఞావాక్యము.

క. ఈరీతిఁ జెలఁగునతిశృం
గారకలాకలితనాయి♦కామణులకు వే
ర్వేర నుదాహరణంబులు
భూరిమధురవచనరచన♦ముల నేర్పఱతు౯. 62

టీ॥ ఈరీతి౯ = ఈవిధమున; చెలఁగు...మణులకు౯=ఒప్పుచున్నశృంగారవిద్యాప్రవీణలగునాయికారత్నములకు ; వేర్వేర౯ = వేరువేరుగ; భూరి...రచనముల౯ = అధికమైనతీయనిపలుకులయొక్క కూర్పులచేత; ఉదాహరణంబులు=లక్ష్యంబులను; ఏర్పఱతు౯=నిరూపింతును. ఈయష్టవిధనాయికలకు నుదాహరణములు చెప్పెద ననుట.

స్వాధీనభర్తృకోదాహరణము.

ఉ. శ్రీనిధి యోబభూవరునృ♦సింహుఁడు కైవసమై చెలంగఁగా
భూనుతవైభవస్ఫురణఁ♦బొల్చుయశోజలజాక్షి నిత్యస
న్మానితశీలయై ధవుని♦మన్నన నౌదల యెక్కవట్టి వై
మానికవాహిని న్నగు న♦మందనిజాతిశయంబుపేర్మికి౯. 63

టీ॥ శ్రీనిధి...నృసింహుఁడు = సంపన్నిధియగు నోబయరాజుకు మారుఁడైన నరసభూపాలుఁడు ; కైవసమై చెలంగఁగాన్ = స్వాధీనుఁడై యొప్పఁగా; భూనుతవైభవస్ఫురణన్ = భూమియందుఁ గొనియాడఁబడిన విభవాతిశయముచేత; పొల్చు యశోజలజాక్షి = ఒప్పుచున్న కీర్తి యనెడు స్త్రీ; నిత్యసమ్మానితశీలయై = నిరంతరమును పూజింపఁబడిన స్వభావముగలదియై; ధవుని మన్ననన్ = ప్రియుని లాలనముచేత ; ఔదల...వాహినిన్ = శిరముపై నెక్కిన గంగను; అమంద...పేర్మికిన్ = తక్కువ కాని తన ఆధిక్యముయొక్క గౌరవముచేత; నగున్ = పరిహసించును. ఇందు యశోజలజాక్షికి వరుఁడగు నరసభూపాలుఁడు కైవసమైనందున యశోజలజాక్షి స్వాధీనభర్తృక యగును.

వాసకసజ్జోదాహరణము.

చ. యవనచమూసమూహముల ♦ నాజి జయించి యుదగ్రదిగ్జయో
త్సవవిభవాభిరాముఁ డయి ♦ సారెకు నోబయనారసింహభూ
ధవుఁ డరుదెంచు లగ్నమునఁ ♦ దత్పురలక్ష్మి విభూషితోల్లస
ద్భవనవిశేషయై మృగమ♦దద్రవవాసనఁ దాల్చు నిచ్చలున్. 64

టీ॥ ఓబయనారసింహభూధవుఁడు= నరసభూపాలుండను ప్రియుండు; ఆజిన్ =యుద్ధమందు; యవనచమూసమూహములన్ =యవన సైన్యచక్రములను; జయించి=గెలిచి; ఉదగ్ర...అభిరాముఁడయి=అధికమగు దిగ్విజయోత్సవవైభవముచేతఁ బ్రకాశించువాఁడయి; అరుదెంచు లగ్నమునన్ =వచ్చెడు ముహూర్తమునందు; తత్పురలక్ష్మి =ఆరాజు నగర సంపద యను నాయిక; సారెకున్ =మాటికి ; విభూషిత...విశేషయై=అలంకరింపఁబడినవిగనుకనే ప్రకాశించుచున్న మేడలు మొదలగు గృహవిశేషములుగలదై, అలంకరింపఁబడిన కేళీగృహములుగలదై యనుట; మృ

గ...వాసనన్ = కస్తూరినీటివాసనను; నిచ్చలున్ = నిత్యమును; తాల్చున్=ధరించును. ఇందుఁ బురలక్ష్మి యనునాయిక తనభ ర్త యగునరసభూపాలుండు దిగ్విజయశాలియై వచ్చుసమయమందు గృహమును తనువును నలంకరించికొనినట్లు వర్ణించినందునఁ బురలక్ష్మి వాసకసజ్జయగు.

విరహోత్కంఠిత కుదాహరణము.

ఉ. నెచ్చెలు లీనృసింహధర♦ణీవరుఁ దెచ్చెద మంచుఁ బోయి రా
రిచ్చట నీవునుం గరుణ ♦ యించుక లే కలరంపగుంపులన్
గ్రుచ్చెద వేల మత్ప్రియునిఁ ♦ గూర్పుము మన్మథ నీకుఁ దద్విభుం
దెచ్చుటకై యొసంగెద మ♦దీయకటాక్షము లన్జయాస్త్రముల్.

టీ॥ మన్మథ=ఓమదనుఁడా ! నెచ్చెలులు=సఖులు; ఈనృసింహధరణీవరున్=ఈనరసభూపాలుని; తెచ్చెదమంచుఁబోయి=తీసికొనివచ్చెదమనిచని; రారు=రారైరి. ఇచ్చటన్ = ఈస్థలమందు ; నీవునున్; కరుణయించుకలేక = దయకొంచెమైనను లేక; అలరంపగుంపులన్ = పుష్పబాణసమూహములచేత; గ్రుచ్చెద వేల= బాధించెదవేటికి ? మత్ప్రియునిన్= నావల్లభుని; కూర్పుము = కూడఁజేయుము. తద్విభున్=ఆవల్లభుని ; తెచ్చుటకై ; మదీయ...అస్త్రముల్ =నాక్రేగంటిచూపులను జయసాధనములగునస్త్రములను ; ఒసంగెదన్=ఇచ్చెదను. ఇందు నాయిక పతిరాక తడవుండ మదనార్త యైనట్లు చెప్పినందున నిది విరహోత్కంఠిత యగును.

విప్రలబ్ధ కుదాహరణము.

చ. ఎనయఁగ నీనివాసమున ♦ కే నరుదెంచెద నంచు నాపయిం
గనుఁగొన నిక్కపుంబ్రియము♦ గల్గినవాఁడును బోలెఁ బల్కి యా

మనికికి రాక తక్కినను ♦ మానెడుఁ గాక మదీయదృష్టికిం
బనుపడి మ్రోల నున్న గతి ♦ మాయలు సేయఁగ నేల భర్తకున్.

టీ॥ ఎనయఁగన్ = పొందుటకు ; ఈనివాసమునకున్=ఈసంకే తస్థానమునకు; ఏనరుదెంచెదనంచున్ = నేనువచ్చెదనంచు; నాపయిన్ = నామీఁద; కనుఁగొనన్= చూచుటకు; నిక్కపుం. . .బోలెన్ =యథార్థ ప్రేమగలవాఁడువలె ; పల్కి = వచించి ; ఈమనికికిన్ = ఈనివాస మునకు; రాకతక్కినను మానెడుఁగాక = రాకున్ననుండుఁగాక. మదీయ దృష్టికిన్=నాచూపునకు; పనుపడి = నాటి ; మ్రోలనున్న గతిన్=ఎదు టనున్నయట్లు; భర్తకున్=ప్రియునికి ; మాయలుసేయఁగనేల=మాయ లుసేయుటకేమిప్రయోజనము ? అట్లుసేయుటతగదనుట. ఇందు నాయిక సంకేతస్థాన మరసి ప్రియుఁడు లేనందున మన్మథార్త యయి ప్రియు నంతట నవలోకించునట్లు వర్ణించినందున నిది విప్రలబ్ధ యగును.

ఖండితోదాహరణము.

చ. నృపులకు నెల్లవారల భ♦రించుట యోగ్యము గాన నేఁటిరే
యపరిమితోత్సవంబునఁ బ్రి♦యాసదనంబుల కేగి యేగి యా
నెపమున మద్గృహంబునకు ♦ నీ వరుదేరఁ బ్రభాత మయ్యెఁ గా
కిపుడు నృసింహ నీపయి నొ♦కించుక వంచన లే దెఱుంగుదున్.68

టీ॥ నృపులకున్=రాజులకు; ఎల్లవారలభరించుట=సర్వజనులఁ బోషించుట; యోగ్యముగానన్= ఉచితముగాన; నేఁటిరేయి= ఈదిన పురాత్రి; అపరిమితోత్సవంబునన్=అత్యంతోత్సవముచేత; ప్రియాసద నంబులకేగియేగి = ప్రియురాండ్రయిండ్లకుఁబోయిపోయి ; ఆనెపము నన్ = ఆవ్యాజముచేత ; మద్గృహంబునకున్ = నాయింటికి ; నీవరు

చేరక్ =నీవువచ్చుటకు ; ప్రభాతమయ్యెక్ = నిశావసానసమయమాయెను. కాక=కాని ; నృసింహ=నరసభూపాలుఁడా! ఇపుడు = ఈసమయమందు; నీపయిక్ = నీయందు ; ఒకించుకవంచనలేదు = కొంచెమైన వంచనలేదు; ఎఱుంగుదుక్ = తెలియుదును. ఇందు నాయిక తనవిభుఁడగునరసభూపాలుఁ డన్యసతులఁ జెంది వేకువ రాఁ గుందుటం జేసి ఖండిత.

కలహాంతరిత కుదాహరణము.

ఉ. ఆనఁగ రానికోపమున ♦ నప్పుడు కాంతుని ధిక్కరించుచో
మానదురాగ్రహగ్రహము ♦ మానుప లేకపు డెందుఁ బోయెనో
యీనసవింటిదంట యిపు ♦ డేఁపఁ దొడంగె భవిష్యదర్థము
ల్గానని నామనంబునకుఁ ♦ గావలె నిట్టి విషాదవేదనల్. 69

టీ॥ ఆనఁగరానికోపమునక్ = అడంపరానియాగ్రహముచేత; కాంతునిక్=ప్రియుని; ధిక్కరించుచోక్ = తిరస్కరించునెడ ; మానదురాగ్రహగ్రహముక్ = మానమనెడుదురాగ్రహముగలపిశాచమును; మానుపలేక = మానుపఁజాలక ; ఈనసవింటిదంట = ఈకుసుమాయుధుఁడు; అపుడెందుఁబోయెనో = ఆకాలమందెచటికిఁబోయెనో; ఇపుడేఁపఁదొడంగెక్ = ఇపుడుబాధింపసాగెను. భవిష్యదర్థముల్ = కాఁబోవుకార్యములను ; కానని నామనంబునకుక్ = తెలియనినామనస్సునకు; ఇట్టివిషాదవేదనల్ =ఈపశ్చాత్తాపబాధలు; కావలెక్ = కాఁదగినవి. ఇందు నాయిక ప్రియుఁడు సమీపమునకు వచ్చినపుడాగ్రహముచే నాతని ధిక్కరించి వెనుకఁ బరితపించుచున్నది గాన కలహాంతరితయగు.

"అప్పుడు కాంతుని" ననుపాఠముపక్షమున, "నపు డెందుఁబోయెనో" యనుచోట "అపు" డనుదానికిఁ బునరుక్తి గలుగుచున్న

యది గాన "నప్పుడుకాంతుని" ననిపాఠము గల్పించి, యావిధంబుగఁ బాదములమీఁద బడునట్టికాంతు నని యర్థము సేయుట యుక్తమని దోఁచుచున్నది.

ప్రోషితభర్తృక కుదాహరణము.

చ. స్థిరయశ రామజభూవరునృసింహ భవద్రిపుభామ కాననాం
తరమున కేగి యందు నిజనాథునిఁ గానక మన్మథార్తయై
వరుని సరోజపత్త్రమున వ్రాయునెడం గరము ల్చెమర్పఁగా
నరయ నిజాంగకంబె పగ యయ్యె నటంచుఁ దలంచు దైవముఁన్.

టీ॥ స్థిరయశ = శాశ్వతకీర్తిగలవాఁడా! ఓబ...సింహ = ఓబభూపునిపుత్త్రుఁడవగునరసభూపాలుఁడా! భవద్రిపుభామ = నీశత్రుభార్య; కాననాంతరమున కేగి = వనమధ్యమునకుఁబోయి; అందునిజనాథునిఁగానక = అచటఁదనప్రియుఁగానక; మన్మథార్తయై = కామపీడితయై; వరునిన్ = ప్రియుని; సరోజపత్త్రమునన్ = కమలదళమందు; వ్రాయునెడన్ = లిఖించునప్పుడు; కరముల్ = హస్తములు; చెమర్పఁగాన్ = చెమటపట్టఁగా; అరయన్ = విచారింపఁగా; నిజాంగకంబె = తనశరీరమే; పగయయ్యెన్ = శత్రువాయెను. అనుచుఁదలంచుదైవమున్ = అనిచెప్పుచు దైవమునుదలంచును. ఇందు నాయిక తనవిభుఁడు దేశాంతరగతుఁ డైనందున మదనార్తయయి కృశించినట్లు వర్ణించినందున నిది ప్రోషితభర్తృక యగును.

ఇది విప్రలబ్ధనాయికోదాహరణముగఁ గానఁబడుచున్నది. రిపువు వనావళి కేగినఁ దత్కాంత మదనార్త యైనట్లు వర్ణించినచో యుక్తముగ నుండును. ప్రోషితపతికయనునది, "శ్లో॥ దేశాంతరగతే కాన్తే ఖిన్నా ప్రోషితభర్తృకా" యని, ప్రియుండు దేశాంతరగతుండు కాఁగా ఖేదము నొందునది యని చెప్పఁబడినది గాని తాను దేశాంత

రమునకుఁ బోయి దుఃఖించునది యని కాదు. ప్రకృతస్థలమందు, నాయిక ప్రియునివదలి తా నడవికిఁ బోవుట సంభావితమునుం గాదు.

అభిసారికోదాహరణము.

ఉ. నాతి మదిం బ్రియాభిసరణం బొనరింపఁ దలంచె దీవు చం
ద్రాతపసాంద్రదీధితు లజాండకటాహము నిండఁ బర్వఁగా
నీతలఁ పెట్లు గూడు రమణీ వలెనే నొకవన్నెగాఁగ ము
క్తాతతులుం బ్రసూనములుఁ దాల్పు మలందుము గంధసారముగా.

టీ॥ నాతి= ఓచిన్నదానా! ఈవు=నీవు! మదిక్= బుద్ధియందు; ప్రియాభిసరణంబు = ప్రియునిగూర్చి సంకేతస్థలమునకుపోవుటను; ఒన రింపక్ = చేయుటకు; తలంచెదు= తలఁచుచున్నావు. చంద్రా. . . దీధితులు= వెన్నెలయొక్కదట్టమైనకాంతులు, అజాండకటాహము = బ్రహ్మాండభాండము ; నిండక్ = నిండునట్లు; పర్వఁగాక్= వ్యాపింపఁగా; నీతలఁపు=నీకోరిక; ఎట్లుగూడుక్= ఏరీతిఘటిల్లును? రమణీ=ఓవనితా! వలెనేని=కావలసివచ్చినయెడ; ఒకవన్నెగాఁగక్ = ఒక టేరంగగునట్లు; ముక్తాతతులుక్= ముక్తాహారములను ; ప్రసూనములుక్=పుష్పములను, తెల్లనిపువ్వులననుట; తాల్పుము=ధరింపుము. గంధసారముక్=శ్రీగంధమును; అలందుము=పూసికొనుము. ఇందు నాయిక యభిసారిక యనుట స్పష్టము.

ఈయుదాహరణములయందు నరసభూపాలునినామము కొన్నింటిలో లేకున్నను, యథాసంభవముగఁ దత్తద్విభక్తులతో నధ్యాహారము చేసికొని యన్వయ మూహించునది.

నాయికల సంఖ్య.

క. ఈయెనిమిదిభేదంబులఁ
ప్రేయసులు పదార్వురుం బ్రభిన్నాత్మికలై

యాయతగతి నిల నూటిరు
వై యెనిమిది భేదములను ♦ వఱలుదు రెలమిన్. 72

టీ॥ ప్రేయసులు=నాయికలు ; పదార్వ్వరన్=పైఁజెప్పినరీతి స్వీయ పదుమూఁడు తెఱంగులు పరకీయ రెండువిధములు సామాన్య యొక విధమునగుటచే పదునాఱుగురును, ఈయెనిమిదిభేదంబులన్=ఈస్వాధీన పతిక మొదలగు నెనిమిది భేదముల చేత; ప్రభిన్నాత్మికలై= భిన్నస్వరూప ముగలవారై ; ఆయతగతిన్=విస్తృతవిధము చే, గుణకారము చేననుట; నూటి. . . భేదములను=నూటయిరువది యెనిమిదిభేదముల చే; ఎలమిన్= అతిశయము చే; వఱలుదురు=ఒప్పుదురు.

ఇందుఁ బ్రేయసీశబ్దము శృంగారాలంబననాయికాపరముగఁ బ్రయోగింపఁబడినది. ప్రియురాండ్రనునర్థమును బోధించును గాని యీ యర్థమును బోధింపదు. ప్రియురాండ్రనునది, “ఎవరిప్రియురాం” డ్రని నిత్యసాకాంక్షము గావున నిటప్రేయసీశబ్ద ప్రయోగ మయుక్త మని తోఁచుచున్నది.

## ఉ త్త మా ది భే ద ము లు.

క. ఇల నీసంఖ్యలఁ దగుసతు
లలయుత్తమమధ్యమాధ ♦ మాభిఖ్యలఁ జె
న్నలరఁగ మున్నాెనుబది
నలువురు నాయిక ల టంద్రు ♦ నవరసరసికుల్. 73

టీ॥ ఇలన్=భూమియందు; ఈసంఖ్యలన్—ఈభేదముల చేతనను ట; తగుసతులు=ఒప్పుచున్న నాయికలు; అల. . . అభిఖ్యలన్ =ప్రసిద్ధము లగుఉత్తమమధ్యమఅధమయను భేదముల చేత ; చెన్నలరఁగన్= ఒప్పఁ గా; మున్నాెనుబదినలువురు = పూర్వము చెప్పినరీతి గుణింపఁగా

మున్నూటయేనుబదినలువురు నాయికలగుదురు. అటంౘు నవరససంసికుల్ = అటని నవరసజ్ఞులగునాలంకారికులు వచింతురు. ఇది నాయికానాయకప్రకరణము.

ఈప్రకరణమందుఁ గొన్నివిశేషములు దెలియఁదగినవి. ఏవన.— స్వీయ పదుమూఁడు భేదములు గలది, పరకీయ రెండుభేదములు గలది, సామాన్య యొకభేదము గలది, ఇట్లు పదునాఱుభేదములు గలనాయికలు స్వాధీనపతికాదు లగునష్టభేదములచేత నష్టావింశత్యుత్తరశత భేదములు గలవారై యుత్తమాదిభేదములచేతఁ జతురశీత్యుత్తరత్రిశతభేదములు గలవా రగుదు రని యేతద్గ్రంథకారాభిప్రాయసారము. రసమంజర్యాదులు నీయభిప్రాయమునే యిచ్చుచున్నయవి. అయినను, "ఏతే ధీరాదిభేదా స్వీయాయా ఏవ న పరకీయాసామాన్యయోః ఇతి ప్రాచీనలేఖన మాజ్ఞామాత్రమ్, యతో ధీరత్వ మధీరత్వం వా మాననియతమ్. మానశ్చేత్పరకీయాసామాన్యయో ర్ధీరాదిభేదానాం తయో రప్యావశ్యకత్వాత్" అని రసమంజరీకారుఁడు వ్రాసినందున ధైర్యాధైర్యములను బట్టి కలుగుధీరాదిభేదములు స్వీయకే యనుట నిర్యుక్తికముగా నున్న దనియు, పరకీయాసామాన్యల కట్టి ధైర్యాధైర్యము లున్నపు డాభేదములు కలుగ వనుట సాహసమాత్రము గాన వారికిని గలుగ వచ్చు ననియు, తాను స్వీయకే యని వ్రాయుట ప్రాచీనులయభిప్రాయముననే కాని స్వాభిప్రాయమునఁ గా దనియు, వ్యక్తమగుచున్నది. అట్లు పరకీయాసామాన్యలకును ధీరాదిభేదముల నంగీకరించినచో స్వీయ త్రయోదశ భేదములు కలది, పరకీయ యాఱుభేదములు గలది, సామాన్య మూఁడు భేదములు కలది, గాన ద్వావింశతి భేదములు గలిగిననాయికలు స్వాధీనపతికాదిభేదము లెనిమిదింటిచే నూటడెబ్బదియాఱు భేదములుగలవారై యుత్తమమధ్యమాధమభే

దంబుల నష్టావింశత్యుత్తరపంచశత భేదమ్ములు గలవా రగుదురు. ఇట్లు ప్రాచీనమతమునందు ధీరాదిభేదములతోఁ బదునాఱుభేదంబులు గలవారికిఁగాని, రసమంజరీకారాదుల ముఖ్యమతమునందు ఇరువది రెండుభేదంబులు గలవారికిఁగాని, నాయికలకు, స్వాధీనపతికాదిభేదాష్టకముచేతను నుత్తమాదిభేదత్రయముచేతను ఇవ్విధమున భేదములు గలుగుచున్నవి.

ఇందొకయాక్షేపము గలదు, ధీరాదులకు స్వాధీనపతికాదిభేదములు చెప్పినపుడు స్వాధీనపతికధీర వాసకసజ్జధీర విరహోత్కంఠధీర విప్రలబ్ధధీర కలహాంతరితధీర ప్రోషితపతికధీర అభిసారిధీర ఇత్యాదులు చెప్పవలసి వచ్చును. ప్రియుఁ డపరాధి యైనపుడు గలుగుకోపము "శ్లో॥ స్త్రీణా మీర్ష్యాకృతః కోపో మానో ఽన్యాసంగిని ప్రియే" అనుటవలన మాన మనియు, అట్టిమానావస్థయందు ధైర్యము వహించి తత్కాలోచితోత్తరోపచారాదులచేఁ బ్రియునియెడ వర్తించునది ధీర యనియు, కోపము నిలుపఁ జాలక యధీరతవలనఁ బరుషోక్తు లాడునది యధీర యనియు, నుభయప్రకార ధీరాధీర యనియు, సిద్ధాంతముండఁగా, స్వాధీనపతికాదులకు ధీరాదిభేదంబు లెట్లు గలుగు? ప్రోషితపతికావిప్రలబ్ధాదులకుఁ బ్రియసాన్నిధ్యమే లేకుండఁగా వారు ధైర్యాధైర్యములవలన వక్రోక్తిపరుషోక్తుల నేరింగూర్చి ప్రయోగింతురు? తాడనతర్జనాదు లెచటఁ జేయుదురు? కాన నిది చింత్యమే. వెండియుఁ, బై చెప్పినమానము లఘువు, మధ్యము, గురువు, అని ముత్తెఱంగులనియు, అం దన్యస్త్రీదర్శనాదులచే లఘుమాన మనియు, అన్యస్త్రీనామోచ్చారణాదులచే మధ్యమాన మనియు, అన్యస్త్రీసంభోగాదులచే గురుమాన మనియు, వ్రాసి దానిచే మానవతి యనునొక నాయికను, ప్రియుఁడు దూతీసంభోగముఁ జేసినపు డన్యసంభోగదుఃఖిత యని మఱి

యొక నాయికను, రసమంజరీకారుండు వ్రాసె. ఆనాయికలును ఖండి తావాంతరభేదములుగానే దెలియునది.

ఈసిద్ధాంతమునందు, విభుఁ డన్యసతిఁ జెంది పేకువ రాఁ గుందునతివ ఖండిత యనులక్షణము చాలదు. మఱియేమన్న, అన్యస్త్రీసంబంధాదిజ్ఞానజన్యప్రియవిషయకకోపవతి యని గాని ప్రియాపరాధజ్ఞానజన్యకోపవతి యని గాని ఖండితాలక్షణముఁ జేయవలయు. ఇందపరాధజన్య యనక అపరాధజ్ఞానజన్యయనుటవలన సాక్షాద్దృష్టాపరాధమందువలె భోగచిహ్నగోత్రస్ఖలనోత్స్వప్నానుమితాపరాధమందును సఖీముఖశ్రుతాపరాధమందును గలుగుకోపమును బట్టియు, ఖండిత యేర్పడుచున్నది. అపరాధము వాస్తవము గాని యవాస్తవముగాని ఖండితాత్వసిద్ధి యగుచున్నది. కొందఱు దృష్టశ్రుతానుమితాపరాధములలో దృష్టాపరాధము సాక్షాద్దృష్టరూపమె యని వ్రాసిరి గాని విక్రమోర్వశీయములో "చిత్రదృష్టము," "స్వప్నేనిరీక్ష్యదయితమ్" ఇత్యాదులయందు స్వప్నదృష్టము, నగపడుచున్నందున దృష్టాపరాధము సాక్షాద్దృష్టము చిత్రదృష్టము స్వప్నదృష్ట మని మూఁడు విధములుగాఁ దోఁచుచున్నది. ఇట్టియశేషాపరాధములకు జ్ఞానపదముచే సంగ్రహ మగుచున్నది. జ్ఞానజన్యకోపవతి యనుటవలన లఘుమధ్యగురుమానములకును, వైమనస్యవ్యళీకవిప్రియమన్యుభేదముచే నాలుగువిధము లైనగురుమానమునకును సంగ్రహ మగుచున్నది. ఈవైమనస్యాదిలక్షణములు నాట్యశాస్త్రమునందు, "శ్లో॥ నిద్రాఖేదాలసగతిం సచిహ్నం సరసవ్రణమ్। ఏవంవిధం ప్రియం దృష్ట్వా వైమనస్యం విధీతే। బహుశో వార్యమాణోఽపి యస్తు తత్రైవ దృశ్యతే। సంఘర్షాత్తత్ర మాత్సర్యా ద్వ్యళీక ముపజాయతే। జీవన్త్యాం త్వయి జీవామి దాసోఽహం త్వంచ మే ప్రియా। ఉక్త్వైవం యోఽన్యథా కుర్యా త్త

ద్ధి వై విప్రియం భవేత్ । ప్రతిపక్షసకాశా ద్య సౌభాగ్యైకవికత్థనః।
ఉపసర్పే త్సచిహ్నాస్తు మన్యు స్తత్రోపదిశ్యతే॥" అని చెప్పఁబడి
యున్నవి. ఈఖండితయొక్క కోపశాంత్యుపాయములు షడ్విధములు
గా గ్రంథములయందు వ్రాయంబడినవి. ఎట్లన్న, "శ్లో॥ హేతుజస్తు
శమం యాతి యథాయోగ్యప్రకల్పితైః । సామ్నా దానేన భేదేన న
త్యుపేక్షారసాన్తరైః॥" అనుటచే, అవి సామము, దానము, భేదము,
నమస్కారము, ఉపేక్ష, రసాంతరము, అని తెలియునది. ఇందుఁ బ్రి
యవాక్యకథనము సామము. సఖ్యాదులచేత నుపాలంభవాక్యములు
ప్రయోగింపఁ జేయుట భేదము. నెపముతో భూషణాదుల నిచ్చుట
దానము. పాదములపై వ్రాలుట నమస్కారము. ఊరకుండుట యుపే
క్ష, ఆకస్మికము లైనభయాదుల నుత్పాదించుట రసాంతరము. వీని
యందు "యథాయోగ్యప్రకల్పితైః" అనుటవలనఁ గ్రమనియమము
లేదు. "శ్లో॥ మయి క్షీణోపాయే ప్రణిపతనమాత్రైకశరణే" అనున
మరుకపద్యమునుబట్టి ప్రణామము చరమోపాయ మని యెంచ రాదు.
యథాయోగ్యముగఁ గల్పితము లైనయితరోపాయములు ప్రక్షీణము
లై ప్రణిపతనము మాత్రము శేషించిన దని యచటియభిప్రాయము
గావున యథోచితముగా నుపాయప్రయోగముఁ జేయఁదగు నని తె
లియునది.

ఇట్లు ఖండితలక్షణమువలె విప్రలబ్ధాప్రోషితపతికాదిలక్షణము
లును వరుఁడు కైవసమైన యనుపద్యముచొప్పునఁ జెప్పినచో ననేక
దోషములుసంభవించుచున్నవి. అవి యెల్ల విస్తరభీతిచే నిందు వి
వరింప నైతి.

ఇఁక నుద్దీపనవిభావములలోఁ బ్రాయంబు.

మ. వరవక్త్రేందువిలాసకృన్నవవయో ♦ వర్షావసానంబునం

దరుణీశైశవసింధు లింకునెడఁ దత్తత్కాలలక్ష్యంబు లౌ
సరసాంతస్థితగండశైలము లనం జందోయి యంతంతకుం
బరఁగుం దత్క్రమశోష రేఖ లనఁ గన్పట్టు న్వళీపుంజముల్. 74

టీ॥ వర...అవసానంబునన్, వర = శ్రేష్ఠమగు, వక్త్రేందు= ముఖచంద్రునకు, విలాసకృత్ = ప్రకాశమునుజేయునట్టి, నవవయోవ న్లావసానంబునన్ = నూతనయౌవనమనెడు శరత్కాలమునందు; తరు ణీ...సింధులు, తరుణీ= స్త్రీయొక్క, శైశవ=శిశుత్వమనెడు, సింధు లు=నదులు; ఇంకునెడన్ = శోషించునపుడు ; తత్తత్కాలలక్ష్యంబు లు = ఆయాసమయములయందుఁ గనఁబడుచుండునవి; ఔసరస...అ నన్, ఔసరస = అయినఆర్ద్రములనట్టియు, అంతస్థిత = లోపలనుండు నట్టి, గండశైలములనన్ =స్థూలోపలములనునట్లుగా; చందోయి= స్త నయుగము ; అంతంతకున్ =క్రమక్రమముగా; పరఁగున్ = ఒప్పును. వ ళీపుంజముల్ =త్రివళీసమూహములు;తత్క్రమశోష రేఖలనన్ = ఆక్రమ క్రమముగనగునట్టి ఎండుటయొక్క రేఖలనునట్లు; కన్పట్టున్ =చూపట్టు ను. ఇందు రత్యాలంబన మగునాయికయొక్క ప్రాయము చెప్పఁబడినది.

సామ్యమునకుదాహరణము.

క. వెలఁదికి మణితాటంకము
లలరెన్ దిగ్విజయకాంక్షనతనుఁడు చూపుం
జిలుకులు నిశాతములుగా
నలవడ వడిఁ దీడు శాణయంత్రము లనఁగన్. 75

టీ॥ వెలఁదికిన్ = స్త్రీకి; మణితాటంకములు=రవలకమ్మలు; అత నుఁడు=మదనుఁడు ; దిగ్విజయకాంక్షన్=దిగ్విజయాభిలాషచేత; చూ పుంజిలుకులు= చూపులనెడుబాణాగ్రములు; నిశాతములుగాన్=తీక్ష్ణ ములగుటకు; అలవడన్=తగునట్లు; వడిన్ = వేగముచేత; తీడు...అ

నఁగన్ = నూఁటెడుసానలనునట్లు; అలరెన్=ప్రకాశించెను. ఇందు నాయికసొమ్ము వర్ణింపఁబడినది.

చేష్ట కుదాహరణము.

చ. సుదతి నృసింహుని న్మరలి ♦ చూచె విలాసవివర్తితాస్యయై
వదలనిప్రేమ వెన్తగిలి ♦ వచ్చె ముఖేందుఁ డటంచు భీతిచేఁ
జెదరి గిరీంద్రదుర్గములు ♦ సేరినచీఁకటి పోలె వాసనా
స్పద మగువాలు కొప్పు వలి♦చన్నులపై నసియాడుచుండఁగన్.

టీ॥ సుదతి=స్త్రీ; వదలనిప్రేమన్ = వీడనియభిలాషచేత; వెన్తవిలి...అంచున్ = ముఖచంద్రుఁడు వెంబడించివచ్చెననుచు; భీతిచేన్=భయముచేత; చెదరి = చలించి; గిరీంద్ర...పోలెన్=పర్వతదుర్గములనుచేరిన యంధకారముపోలె; వాసనా...కొప్పు=పరిమళయుక్తమగుజాఱుకొప్పు; వలిచన్నులపైన్ = చల్లనిగుబ్బలమీఁద; అసియాడుచుండఁగన్=చలించుచుండఁగా; విలాసవివర్తితాస్యయై=విలాసముచేత మరల్పఁబడిన ముఖముగలదై; నృసింహునిన్= నరసభూపాలుని; మరలిచూచెన్=తిరిగిచూచెను. ఇందు నాయికచేష్ట చెప్పఁబడినది.

తటస్థోద్దీపనోదాహరణము.

చ. చిగురుఁగటారితోఁ జెఱకు ♦ సింగిణితో నలరంపగుంపుతో
నిగనిగ మించుచెంగలువ ♦ నేజముతో వడిఁ జిల్కతేజిపై
మగఁటిమి నెక్కి శూరుఁడయి ♦ మారుఁడు కోకిలకంఠకాహళుల్
నెగడ లతాంగిపై వెడలె ♦ నేఁడు నృసింహ యెఱుంగఁ జెప్పితిన్.

టీ॥ మారుఁడు=మదనుఁడు; చిగురుకటారితోన్ = చిగురాకనెడుకత్తితోను; చెఱకుసింగిణితోన్ = చెఱకనెడుధనుస్సుతోను; అలరంపగుంపుతోన్ = పుష్పబాణ పరంపరలతోను; నిగ...నేజము

తోన్ = నిగనిగయనిప్రకాశించునెఱ్ఱకలువయను చిల్లకోలతోను; వడిన్ = వేగముగ; చిల్క తేజీపైన్ = చిల్కయనెడుగుఱ్ఱముమీఁద; మగఁటిమిన్ = పౌరుషముచేత; ఎక్కి = అధిష్ఠించి; శూరుఁడయి; కోకిలకంఠకాహళుల్ = కోయిలలగొంతులనెడుతుతారలు; నెగడన్ = అతిశయింపఁగా, కోయిలలుకూయుచుండఁగాననుట; లతాంగిపైన్ = స్త్రీమీఁదికి; నేఁడు = ఈదినము; వెడలెన్ = బయలుదేఱెను. కోకిలాలాపాదులచే లతాంగికిఁ గామ మతిశయించె ననుట. నృసింహ = ఓనరసభూపాలుఁడా! ఎఱుంగన్ = తెలియునట్లు; చెప్పితిన్. ఇందుఁ గోకిలాలాపాదులు తటస్థోద్దీపనములు చెప్పఁబడినవి.

## అనుభావనిరూపణము.

క. కారణ మైనవిభావము
చే రస ముత్పన్న మైనఁ జెలఁగెడి దానం
బ్రారూఢకటాక్షాదిక
మారయ ననుభావ మయ్యె నది యెట్లన్నన్. 78

టీ॥ రసము—రసస్థాయియగురత్యాదికమనుట; కారణమైనవిభావముచేన్ = హేతువగునాయికానాయకాదిరూపమగు విభావముచేత; ఉత్పన్నమైనన్ = ఉదయించినపిమ్మట; చెలఁగెడిదానన్ = ఒప్పుచున్నదానిచేత; ప్రారూఢకటాక్షాదికము = ఉదయించినకటాక్షభ్రూవిక్షేపాదికము; ఆరయన్ = విచారింపఁగా; అనుభావమయ్యెన్ = అనుభావమనునదియాయెను. అనుభావ మనఁగ రసము ననుభవగోచరముగఁ జేయునది. అది యెట్లన్నన్.

## అనుభావోదాహరణము.

శా. అలసాలోలములై యచంచలములై యాకేకరాగ్రంబులై

యలఘువ్రీడములై యనిందితములై ♦ యానందపూర్ణంబులై
సులభాసూయములై సుతీక్ష్ణరుచులై ♦ సువ్యక్తరాగంబులై
చెలువం బొందెడు చూపు లింతి నెరపెన్ ♦ శ్రీనారసింహేంద్రుపైన్.

టీ॥ అలసాలోలములై = మందములుగాం జెముచలించునవియు నై; అచంచలములై = తోలంగనివై; ఆకేకరాగ్రంబులై = ఆకేకరయను దృష్టివిశేషము ముఖ్యముగం గలవై; అలఘువ్రీడములై = అధికమైనలజ్జ గలవయి; అనిందితములై = ప్రశస్తములై; ఆనందపూర్ణంబులై = హర్ష పూరితములయి; సులభాసూయములై = సులభమగు నీర్ష్యగ లవయి; సుతీక్ష్ణరుచులై = మిక్కిలితీక్ష్ణములగు కాంతులుగలవై; సువ్య క్తరాగంబులై = మిక్కిలివ్యక్తమగునను రాగముగలవై; చెలువంబొం దెడుచూపులు = సొగసునొందినచూపులను; ఇంతి = స్త్రీ; శ్రీనారసింహే ద్రుపైన్ = సంపదతోంగూడిన నరసభూపాలునియందు; నెరపెన్ = వ్యా పింపంజేసెను. ఇందు నరసభూపాలునియందు,నాయికానురాగము చూ పులవలన వ్యక్తం బగుచున్నది గానం, జూపు లనుభావములు వర్ణింపం బడినయవి.

వెండియు "అలసాలోలములై సులభాసూయములై సుతీక్ష్ణరు చులై" యనువిశేషణములవలన నలసత అసూయ ఉగ్రత యనువ్య భిచారిభావములు వ్యక్తంబు లగుచున్నవి. అవి విప్రలంభములో నుం డం దగును గాని సంభోగములోనుండందగవు. ఆనందపూర్ణంబులై యనుటంజేసి విప్రలంభము కాదని తోంచుచున్నది. కావున నిది విచా రణీయము.

## సాత్త్వికభావసామాన్యలక్షణము.

క. పరగతసుఖదుఃఖాదుల
నరయంగ భావించి యట్లు ♦ యలరుట సత్త్వ

స్ఫురణము తద్భవభావము
లరయఁగ సాత్త్వికము లయ్యె • నవి యెట్లన్నన్. 80

టీ॥ పర...ఆదులన్=అన్యులనొందిన సుఖముదుఃఖము మొదలగువానిని;భావించి=ధ్యానించి; అట్లయులరుట = వారివలెనొప్పుట;అరయఁగన్=విచారింపఁగా; సత్త్వస్ఫురణము—సత్త్వమనుట. తద్భవభావములు=ఆసత్త్వమువలన నుదయించినభావములు ; అరయఁగన్= విచారింపఁగా;సాత్త్వికములయ్యెన్=సాత్త్వికభావములాయెను. అవి= ఆసాత్త్వికభావములు; ఎట్లన్నన్.

ఈలక్షణపద్యమునకును "స్తంభ మంచచలత్వ" మనువిశేషలక్షణపద్యమునకును మధ్యభాగమున, "స్తంభప్రళయాశ్రుస్వేదవిస్వరత్వరోమహర్షణకంపవివర్ణత్వము లని యీసాత్త్వికంబు లెనిమిదివిధమ్ములు" అని విభాగవాక్య ముండవలయు. లేనియెడ "స్తంభ మచంచలత్వ" మనునది సమీచీనముగాఁ బూర్వపద్యముతో సాంగత్యము నొందదు.

## సాత్త్వికవిశేషలక్షణములు.

ఉ. స్తంభ మచంచలత్వ మవ • శత్వ మగున్ బ్రళయంబు దృగ్జలో
జ్జృంభణ మశ్రు వౌఁ జెమట • స్వేదము గద్గదవాక్యవైఖరీ
గుంభము విస్వరత్వము త•గుం బులకం బన రోమహర్షణా
రంభము కంప మా వడఁకు • రాముకుఁ బాండురుచుల్ వివర్ణతల్.

టీ॥ అచంచలత్వము=అవయవచాంచల్యములేమి ; స్తంభము= స్తంభమగును. అవశత్వము = ఇంద్రియపరవశత ; ప్రళయంబగున్= ప్రళయభావమగును. దృగ్జలోజ్జృంభణము = కన్నీరుకాఱుట; అశ్రువౌన్=అశ్రువనుభావమగును. చెమట=స్వేదోదకము ; స్వేదము= స్వేదభావమగును. గద్గద...గుంభము= డగ్గుత్తికతోడిమాటలకూర్పు, డ

గ్గుత్తికతోఁడినమాటలనుట; విస్వరత్వము = వైస్వర్యమగును. రోమహర్షణారంభము = గగుర్పాటుగలుగుట; పులకంబునఁ దగుఁ = పులకమనవొప్పును. వడఁకు = వడఁకుట; కంపమూఁ = కంపమనుపదియగును. రామకుఁ బాండురుచుల్ = స్త్రీకిఁ దెల్లనికాంతులు, వివర్ణతల్ = వైవర్ణ్యము లనంబడును.

ఇందుఁ గవియాశయము రామ కనుసది అచంచలత్వాదుల యన్నింటితో నన్వయించు నని యున్నను, వివర్ణత లనుదానితోన యన్వయించు ననియున్నను, తత్ప్రయోగ మిచట సమంజసంబు గాదు. సాత్త్వికభావములు స్త్రీలకే కాక పురుషులకు నుదయించు నట్లు పెక్కు ప్రసిద్ధలక్ష్యము లున్నవి, "శ్లో॥ ఏత త్స్ఫురతి పద్మదృశాం సహస్ర మక్షిద్వయం కథయ కుత్ర నివేశయామి। ఇ త్యాకులస్య సము నామ్నురహో నిమీల్య రోమాఞ్చితేన వపుషా స్థిత మచ్యుతేన॥" అనురసమంజరీపద్యములోఁ గృష్ణునకు రోమాంచము వర్ణింపఁబడినది. ఇట్టిలక్ష్యంబులు నూహించుకొనునది.

వెండియు "శ్లో॥ రూపాన్యత్వం వివర్ణతా" యని యొకరూపము మాఱి మఱి యొకటి కలుగుటయే వివర్ణతగాఁ బ్రాచీనులు చెప్పినలక్షణమునకును, "శ్లో॥ కుకూలే కుర్వతి శ్యామ మాననం శ్లిష్టయో స్తయోః। దివాకరకరాక్రాన్తశశికాన్తిభి వాదధౌ॥" అనురసతరఙ్గిణీలక్ష్యమునకును, "శ్లో॥ సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ యంయం వ్యతీయాయ పతింవరా సా। నరేన్ద్రమార్గాట్ట ఇవ ప్రపేదే వివర్ణభావం స స భూమిపాలః॥" అనురఘువంశపద్యమునకును, నిందుఁ "బాండురుచుల్ వివర్ణతల్" అనుట విరుద్ధము. ఈయుదాహరణములలో మాలిన్యరూపముగ వైవర్ణ్యము చెప్పఁబడినది. విరహాదులయందుఁ బాండురుచియుఁ గా వచ్చుఁ గాని, చౌర్యాదులచే నవమానము గల్గు నపు

డట్లుండదు గానఁ, బాండురుచు లనులక్షణము సర్వసాధారణముగఁ జెప్పఁ దగ దని తోఁచుచున్నది.

కవి ప్రతిజ్ఞా వాక్యము.

క. తలఁపఁగ రసకార్యములై
జలజాక్షులయందుఁ బొడము ♦ సాత్త్వికభావం
బుల కెనిమిదింటి కేర్పడ
నలరింతుం గడఁకతో ♦ నుదాహరణంబుల్. 82

టీ॥ తలఁపఁగన్ = విచారింపఁగా; రసకార్యములై = రసజన్యములై; జలజ...ఎనిమిదింటికిన్ = స్త్రీలయందుదయించు సాత్త్వికభావముల కెనిమిదింటకిని; ఏర్పడన్ = స్పష్టపడునట్లుగా; కడఁకతోన్ = ప్రానికతో; ఉదాహరణంబుల్ = లక్ష్యములను; అలరింతున్ = ఒనర్తును. ఈపద్యమందు జలజాక్షులయం దనుటయు నిరర్థకము నపార్థకంబును గాన నీవిశేషణంబు మార్చుట యుక్తము.

స్తంభమున కుదాహరణము.

చ. కలికి నృసింహభూవరునిఁ ♦ గన్గొని నిశ్చలగాత్రవల్లియై
యలరె విలాసచేష్ట లొలయం ♦ గలయంగ నటింపఁ జేయు నా
వలపులసూత్రధారుఁ డన ♦ వద్యనృపాకృతిఁ జూచి తాను ని
శ్చలత వహింపఁగాఁ గదలఁ ♦ జాలనిజంత్రపుబొమ్మ యో యనన్.

టీ॥ కలికి=సుందరి; నృసింహభూవరునిన్=నరసభూపాలుని; కన్గొని=చూచి; నిశ్చలగాత్రవల్లియై= చలింపనితీఁగవంటి యంగముగలదై; విలాసచేష్టలు=విలాసవ్యాపారములు; ఒలయన్=వ్యాపించునట్లు; కలయంగన్=కూడునట్లుగా; నటింపన్...ధారుఁడు= నాట్యముఁ జేయించు నామదనుఁడనుసూత్రధారుండు ; అనవద్య...చూచి = లోకోత్తరమ

గు నరసభూపాలునియాకారమును జూచి; తాను; నిశ్చలతన్ = కదల కుండుటను; వహింపఁగాన్ = పొందఁగా; కదలన్...అనన్ = కదలలేని కీలుబొమ్మోయనునట్లు; అలరెన్ = ఒప్పెను. ఇందు నాయిక కదలకుండి నట్లు వర్ణించినందున స్తంభము చెప్పఁబడెను.

ప్రళయమున కుదాహరణము.

ఉ. ఇత్తఱి నీతలోదరి వహించె నచేతనవృత్తి శారదా
చిత్తముఁ జూఱగొన్న నరసింహుఁడు నేఁడు వియోగపాండువో
గుత్తపుగుబ్బలాఁడి పలుకుంజవరాలివలెం జెలంగఁగా
నిత్తరలాక్షిచిత్తము నహీనరసోన్నతిఁ జూఱవెట్టెనో. 84

టీ॥ ఇత్తఱిన్ = ఇపుడు; ఈతలోదరి = ఈమగువ; అచేతనవృత్తిన్ = చైతన్యములేనిపాషాణాదుల యునికివంటియునికిని; వహించెన్ = ధరించెను. శారదా...సింహుఁడు = సరస్వతీహృదయమునుహరించిన నరసభూపాలుండు; నేఁడు...గుబ్బలాఁడి = ఇప్పుడువిరహముచేతఁ బాండువర్ణముగలకఠినస్తని ; పలుకుం...చెలంగఁగాన్ = సరస్వతివలెఁ బ్రకాశింపఁగా; ఇత్తరలాక్షిచిత్తమును = ఈస్త్రీహృదయమును ; అహీనరసోన్నతిన్ = తక్కువకానిరాగాతిశయముచేత; చూఱవెట్టెనో = కొల్లపెట్టెనాయేమి. అందువలననే యచేతనవృత్తి వహించె నని భావము. నరసింహునియందు నాయికహృదయము దృఢలగ్నమగుట నది యచేతనవృత్తి వహించె నని వర్ణించినందునఁ బ్రళయము చెప్పఁబడెను. ఇందుత్ప్రేక్ష తద్ధేతున్యాయాయితంబుగ నున్నది.

అశ్రువున కుదాహరణము.

చ. మగువకు నంగజానలసమగ్రము లౌనులివేఁడియూరుపుం
బొగ లెగయ న్ఘనించు గతి ముత్తెపుఁజిప్పలఁ బోలుఱెప్పల

న్నెగడునుదశ్రుపూరములు ♦ నేత్రసరోరుహానాళచాతురిం
డిగియె నృసింహ యింకఁ దరు♦ణీమణిఁ గౌఁగిట నాదరింపుమీ.

టీ॥ మగువకుఁ = కాంతకు; అంగజ...పొగలు=కామాగ్ని పూరితములగుచులివెచ్చనైన యూర్పులనెడుపొగలు; ఎగయన్ = అతిశయిల్లుటచే; జనించుగతిన్ = పుట్టినట్లు; ముక్తాపు...పూరములు= ముత్యపుచిప్పలతో సరియగు రెప్పలయందుదయించు నెరుకన్నీటిప్రవాహములు; నేత్ర...చాతురిన్ = నయనాంబురుహములకాడలవలె; డిగియెన్ = జాఱెను నృసింహ=ఓనరసభూపాలుఁడా! ఇంకన్= ఇఁకమీఁద; తరుణీమణిన్ = అన్నుమిన్నను; కౌఁగిటనాదరింపుమీ= ఆలింగనముచేత సంతోషింపఁజేయుమా. ఇందు నాయికకుఁ గన్నీరు గలిగినట్లు వర్ణించుటచే నశ్రువు చెప్పఁబడెను.

స్వరభంగమున కుదాహరణము.

చ. సతికిఁ జెమర్చె మేను జల♦జాతదళాక్షి చతుస్సముద్రము
ద్రితవసుధాధురంధరుని ♦ శ్రీనరసింహుని భావవీథిలోఁ
బ్రతిదినము న్వహించు నతి ♦ భారము వంకనొ కాక సంతతా
పతదసమాస్త్రశస్త్రభవ ♦ పావకకీలలవేఁడివంకనో. 86

టీ॥ జలజాతదళాక్షి = తమ్మికంటి; చతుః...ధురునిన్ = నాలుగుసముద్రములచే గుఱుతుగలదైన భూమియొక్కభారమును వహించునట్టి; శ్రీనరసింహునిన్=సుందరుఁడైననరసభూపాలుని; భావవీథిలోన్= మనఃప్రదేశమందు; ప్రతిదినమున్=ఎల్లప్పుడును; వహించునతిభారము వంకనో = మోయుచున్న యధికమగుబరువుచేతనో; కాక = అట్లుగాక; సంతత...వంకనో, సంతతాపతత్ = ఎల్లప్పుడుపడుచున్న, అసమాస్త్రశస్త్ర= మదనబాణములచేత, భవ=పుట్టినట్టి, పావకకీలల

వేఁడివంకనో=అగ్నిజ్వాలలయొక్క వేఁడిచేతనో; పతికిన్=మగువకు; మేను=శరీరము; చెమర్చెన్=చెమ్మగిల్లెను. ఇందు స్వేదము వచింపఁబడెను.

వైస్వర్యమున కుదాహరణము.

చ. అమరఁ బరాంగనానఖము ♦ ఖాంకితుఁ డైననృసింహభూవరుం
గమలదళాక్షి చూచి తమ♦కమ్మున దూఱెద నన్న గద్గద
త్వమునఁ బొసంగ వయ్యె సతి♦వాక్యము లాంతరమై చెలంగునె
య్యము హృదయేశు దూఱ వల♦దంచు నిరోధ మొనర్చెనో యనన్.

టీ॥ అమరన్= ఒప్పునట్లుగా; పరాంగనా...భూవరున్, పరాంగనా= ఇతరవనితయొక్క, నఖముఖ= నఖాగ్రములచే, అంకితుఁడైన నృసింహభూవరున్= చిహ్నితుఁడైననరసభూపాలుని; కమలదళాక్షి=తమ్మికంటి; చూచి; తమకమ్మునన్=వేగమున; దూఱెదనన్నన్=దూషించెదననఁగా; ఆంతరమైచెలంగునెయ్యము=లోపలనున్నదైయొప్పుప్రీతి; హృదయేశున్ = ప్రాణనాథుని ; దూఱవలదంచునిరోధమొనర్చెనోయనన్=దూషింపఁదగదనియడ్డగించెనాయనునట్లు; గద్గదత్వమునన్=డగ్గుత్తికచే ; సతివాక్యములు = నాయికయొక్క వచనములు ; పొసంగవయ్యెన్=ఒప్పవయ్యెను. ప్రియుని దూఱుటకు గద్గదత్వ మడ్డమాయెననుట. ఇందు విస్వరత్వము చెప్పఁబడెను.

రోమాంచమున కుదాహరణము.

చ. కలికి నృసింహునిం దలఁపఁ♦గా నెలమిం బులకప్రకాండము
ల్మొలచె మనోజహాలికుఁడు ♦ మోద మెసంగఁ గురంగనాభపం
కిల మగునింతిగాత్ర మను ♦ క్షేత్రమున న్వలయంగఁ జేయున
స్ఖలితమనోమనోరథని ♦ కాయము లీరిక లెత్తెనో యనన్. 88

టీ॥ కలికి=కాంత;నృసింహునిన్=నరసభూపాలుని;తలఁపఁగాన్=

స్మరింపఁగా; ఎలమిన్ = మిక్కిలి; పులకప్రకాండముల్ = పులకల గుంపులు; మనోజహాలికుఁడు=మదనుఁడనుకర్షకుఁడు; మోదముఎసంగన్=సంతోషమతిశయిల్లునట్లుగా;కురంగ... క్షేత్రమునన్=కస్తూరిచేత అడుసైననాయిక శరీరమనుపొలమునందు; వెలయంగన్...నికాయములు= వెలయఁగఁజేయునట్టి దృఢములయినకోరికలగుంపులు; ఊరికలెత్తెనో యనన్= మోసులెత్తెనాయనునట్లు; మొలచెన్=ఉదయించెను. ఇందు రోమాంచ ముదాహృతము.

కంపమున కుదాహరణము.

ఉ. చెన్నగుశ్రీనృసింహవిభుఁ♦జిత్రపటంబున వ్రాసి బింకపుం
జన్నులమీఁదఁ జేర్చుకొని♦చాల వడంకఁ దొడంగె బాల దాఁ
గన్నులవింటివాఁడు త్రిజ♦గంబు జయించెద నంచుఁ గోరి చే
నున్నకృపాణవల్లిక మ♦హోజ్జ్వలత న్జళిపించెనో యనన్. 89

టీ॥ బాల=చిన్నది;చెన్నగు...విభున్=సుందరుఁడగుశ్రీనరసభూపాలుని; చిత్రపటంబునన్=చిత్తరువుపటమందు;వ్రాసి=లిఖించి; బింకపుం...కొని= బిగువైనగుబ్బలపైనుంచుకొని; కన్నులవింటివాఁడు=మరుఁడు; తాన్ = తాను; త్రిజగంబు...కోరి= ముజ్జగములుగెలిచెదనంచుఁదలంచి; చేనున్నకృపాణవల్లికన్=చేతనున్నతీఁగవంటిఖడ్గమును; మహోజ్జ్వలతన్=మిక్కిలిప్రకాశతచేత; జళిపించెనో యనన్=కంపింపఁజేసెనాయనునట్లు; చాలన్=మిక్కిలి; వడంకఁదొడంగెన్ = వడఁకసాగెను. ఇందుఁ గంపము వ్యక్తము.

వివర్ణత కుదాహరణము.

ఉ. మానవతీలలామ యస♦మానసముజ్జ్వలగాత్రవల్లిపైఁ
గానఁగ నయ్యెఁ బాండుతర♦కాంతి నిరంతరమై మనంబునన్

శ్రీనరసింహభూవరు ధరింపఁగఁ దద్వదనేందుమండలీ
మానితచంద్రికారససమాజము పైపయిఁ బర్వెనో యనన్. 90

టీ॥ మానవతీ...పైన్, మానవతీలలామ = ఒకయుత్తమస్త్రీ యొక్క, అసమాన=సాటిలేనట్టి, యుజ్జ్వల = ప్రకాశించుచున్నయట్టి, గాత్రవల్లిపైన్ = తీఁగవంటిశరీరమందు; పాండుతరకాంతి = మిక్కిలి తెల్లనికాంతి; నిరంతరమై=దట్టమయి; మనంబునన్ = మనస్సునందు; శ్రీనరసింహభూవరున్ = శ్రీనరసభూపాలుని; ధరింపఁగన్ = తాల్పఁగా; తద్వదన...సమాజము, తద్వదనేందుమడలీ = ఆరాజుముఖమనెడు చంద్రమండలముయొక్క, మానిత = శ్రేష్ఠమయిన, చంద్రికారససమాజము=జ్యోత్స్నాద్రవపుంజము; పైపయిన్= మీఁదుమీఁదుగా; పర్వెనోయనన్= వ్యాపించెనాయనునట్లు; కానఁగనయ్యెన్ = చూపట్టెను. ఇందుఁ బాండిమ వర్ణిత మైనది గాన నిది వైవర్ణ్యోదాహరణమగు. ఇట్లు సాత్త్వికభావంబులుముగిసెను.

ఇఁక సంచారిభావలక్షణము.

క. అహరహము రసోత్పత్తికి
సహాయభావంబు లెలమి సంచారు లగున్
మహి నవి ముప్పదిమూఁడై
మహితము లగు వీనికిం గ్రమం బేర్పఱతున్. 91

టీ॥ అహరహమున్= ఎల్లప్పుడును; రసోత్పత్తికిన్=రసోదయము నకు; ఎలమిన్= మిక్కిలి; సహాయభావంబులు=సహకారులగుభావములు; సంచారులగున్=సంచారిభావములగును. అవి= ఆభావములు; మహిన్=భూమియందు; ముప్పదిమూఁడై =ముప్పదిమూఁడుభావములై; మహితములగున్=పూజితములగును. వీనికిన్= ఈసంచారులకు; క్రమంబు=వరుసను; ఏర్పఱతున్=నిరూపించెద.

## సంచారిక్రమనిరూపణము.

శా. నిర్వేదశ్రమదైన్యజాడ్యములు గ్లాని♦త్రాసశంకార్తిరు
డ్గర్వావేగధృతిస్మృతుల్ చపలతో♦గ్రత్వావహిత్థాత్రపాం
తర్వైక్లబ్యమదోత్సుకత్వమతిని♦ద్రామోహబోధాంతము
త్సర్వాలస్యవితర్కసుప్త్యసహతా♦ధ్యానభ్రమాపస్మృతుల్. 92

టీ॥ నిర్వేదము, శ్రమము, దైన్యము, జాడ్యము, గ్లాని, త్రాసము, శంక, ఆర్తి. రోషము, గర్వము, ఆవేగము, ధృతి, స్మృతి, చపలత, ఉగ్రత్వము, అవహిత్థ, త్రప. వైక్లబ్యము, మదము, ఉత్సుకత్వము, మతి, నిద్ర, మోహము, బోధము, అంతము. హర్షము, ఆలస్యము, వితర్కము, సుప్తి, అసహత, ఆధ్యానము, భ్రమము, అపస్మృతి, ఇవి ముప్పదిమూఁడు సంచారులుగాఁ దెలియునది.

## కవిప్రతిజ్ఞావాక్యము.

క. ఈవరుసఁ ద్రయస్త్రింశ
ద్భావములకు లక్షణము లు♦దాహరణంబుల్
వావిరి నొనర్తు నీయెడఁ
గేవలశృంగారసూత్ర♦కీలితఫణితిన్. 93

టీ॥ ఈవరుసన్=ఈక్రమముగా; త్రయస్త్రింశద్భావములకున్=ముప్పదిమూఁడుభావంబులకు; లక్షణములు ఉదాహరణంబుల్=లక్షణంబులను లక్ష్యములను; వావిరిన్=వెంబడిగనె; ఈయెడన్=ఇపుడు; కేవల...ఫణితిన్=ఒక్కటైనశృంగారరసమనెడుసూత్రముచేతఁ గూర్పఁబడినవాక్కుచేత; ఒనర్తున్=రచియింతును. ఈవ్యభిచారులు సర్వరసములయం దున్న నొకశృంగారమునకుఁ జేరినవానికే యుదాహరణంబులు రచియించెద నని తాత్పర్యము.

నిర్వేదశ్రమముల లక్షణములు.

క. నిరుపమదుఃఖేర్ష్యాదుల
నిరతము జనియించు నరతి ♦ నిర్వేద మగున్
సురతగమనాదిసంభవ
సరసస్వేదాంబులహరి ♦ శ్రమ మెట్లన్నన్. 94

టీ॥ నిరుపమ...ఆదులన్ = సాటిలేనివగుదుఃఖము ఈర్ష్య మొదలగువానిచేత; నిరతము=ఎల్లప్పుడు ; జనియించునరతి=పుట్టునట్టియప్రీతి; నిర్వేదమగున్ = నిర్వేదభావమగును. సురత...లహరి = సురతము గమనము బరువుమోయుట మొదలగువానివలన నుదయించుసుందరమగు చెమటనీటిప్రవాహము; శ్రమము= శ్రమమనుభావమగును. ఎట్లన్నన్=వీనియుదాహరణము లెట్లనఁగా,

నిర్వేదమున కుదాహరణము.

క. శిలలు మణిభూషణంబులు
చెలువగుహారములు జలధిఁ ♦ జిందినచినుకుల్
తలిరాకుఁబోఁడి నా కగు
సులభదయానిధి నృసింహుఁ ♦ జూడక యున్నన్. 95

టీ॥ తలిరాకుఁబోఁడి=ఓసఖీ ! నాకున్; సులభదయానిధిన్ నృసింహున్ = సుకరమైనదయకునివాసమగు నరసభూపాలుని ; చూడకయున్నన్=చూడనప్పుడు ; మణిభూషణంబులు=మణిమయములైన యాభరణములు; శిలలు= రాళ్ళే; చెలువగుహారములు= అందమైనముత్తెపుసరములు; "హారోముక్తావళీ" యనియమరుఁడు; జలధిఁజిందినచినుకుల్=సముద్రమునందుఁబడిన యుదకబిందువులే ; అగున్=అగుచున్నవి. ఇందు నరసభూపాలునిఁ జూడనిదుఃఖముచే భూషణాదులయం దప్రీతిరూప మగు నిర్వేదము నాయికకుఁ జెప్పఁబడినది.

శ్రమమున కుదాహరణము.

క. నరసేంద్రుఁ జూడ రయమున
  నరుదెంచి లతాంగి శ్రమజలాపూరితయై
  సరసేందుకిరణపరిణతిఁ
  గరఁగిన నెలచట్టుబొమ్మకైవడి నమరెన్. 96

టీ॥ లతాంగి = స్త్రీ; నరసేంద్రున్ = నరసభూపాలుని; చూడన్ = చూచుటకు; రయమునన్ = వేగముచేత; అరుదెంచి=వచ్చి; శ్రమజలాపూరితయై = శ్రమచేనుదయించిన యుదకముచేవ్యాప్తయై; సరస...పరిణతిన్, సరస = మనోజ్ఞములగు, ఇందుకిరణ = చంద్రకిరణములయొక్క, పరిణతిన్ = వ్యాప్తిచేత; కరఁగిన...కైవడిన్ = ద్రవించినచంద్రకాంతమణిప్రతిమవలె; అమరెన్=ఒప్పెను. ఇందు నరసభూపాలునిఁ జూచుటకు వచ్చిననాయికకు గమనజన్యశ్రమము వర్ణింపఁబడినది.

లక్షణపద్యమున సరసస్వేదాంబులహారి శ్రమ మని శ్రమము స్వేదరూపముగఁ జెప్పియుండఁగా నీలక్ష్యపద్యములో శ్రమజలాపూరితయై యను చోట శ్రమరూపమైనజలముచేత నని యర్థము వ్రాయక శ్రమజన్యమగు నుదకముచేత నని వ్రాయుట “స్వేదాభిన్నము శ్రమ” మను లక్షణము తప్పునభిప్రాయమునఁ గాని వేఱు గాదు. అదియెట్లన్న, శ్రమము స్వేదరూపమైనపుడు సాత్త్వికభావములలో, “శ్లో॥ స్తమ్భప్రళయరోమాఞ్చాః స్వేదో వైవర్ణ్యవేపథూ। అశ్రువైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః॥” అని యీశ్రమమునకు వేఱుగ స్వేదమును జెప్పుట కేమికతంబు. వ్యభిచారియైనశ్రమమునకు సాత్త్వికమైనస్వేదమునకు లక్షణములు గాని లక్ష్యములు గాని యెట్లు భేదిల్లును? “చెమట స్వేదము, సరసస్వేదాంబులహారి శ్రమము,” అనులక్ష

ణములకు, "సతికిఁజెమర్చె మేను, లతాంగిశ్రమజలాపూరితయై," అనులక్ష్యములకు, నేమి భేదముఁ గల్పింపవచ్చును ? ఒకవేళ, "సూక్ష్మరూప మైనస్వేదము సాత్త్వికము, ప్రవాహరూపముగ భూయిష్ఠ మగుస్వేదము వ్యభిచారి యని భేదము చెప్ప వచ్చును. దానంజేసియే సాత్త్వికలక్షణము చెమట స్వేదమనియు, వ్యభిచారిలక్షణము స్వేదాంబులహారి శ్రమ మనియుఁ జెప్పఁబడినది. ఇట్లు స్థాయి యగుభయమునకును వ్యభిచారి యగుత్రాసమునకునుం బోలె భేదము నిరూపింప వచ్చు" నందు రేమోకాని యదియు ఘటిల్లదు. ఎందువలననఁగా, రసార్ణవసుధాకరమునందు, "శ్లో॥ నిదాఘహర్ష వ్యాయామశ్రమక్రోధభయాదిభిః। స్వేద స్సంజాయతే" అనుస్వేదలక్షణవాక్యముక్రిందఁ బుష్పాపచయరూపవ్యాయామజన్యస్వేదమునకు, "శ్లో॥ గత్వోద్రేకం జఘనపులినే రుద్ధమధ్యప్రదేశః క్రామన్నూరుద్రుమభుజలతాః పూర్ణనాభిహ్రదాన్తః। ఉల్లఙ్ఘ్యోచ్చైః కుచతటభువం ప్లావయ న్రోమకూపాన్ స్వేదాపూరో యువతిసరితాం ప్రాప గణ్డస్థలాని॥" అనియు, గీతశ్రమజన్యస్వేదమునకు, "శ్లో॥ గీతాన్తరేషు శ్రమవారి లేశైః కించి త్సముచ్ఛ్వసితపత్త్రలేఖమ్। పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి ప్రియాముఖం కిమ్పురుష శ్చుచుమ్బ॥" అనియు నుదాహరణములు వ్రాయఁబడినవి. ఇందు శ్రమవ్యతిరిక్తస్థలమునందు "స్వేదాపూరో యువతిసరితాం ప్రాపగణ్డస్థలాని" అనిభూయిష్ఠస్వేదరూపముగను, శ్రమస్థలమునందు, "శ్రమవారి లేశైః" అని స్వేదలేశరూపముగను, నుదాహరింపఁబడినది. ఇది పైచెప్పినశ్రమస్వేదలక్షణములకు వైపరీత్యముగ నున్నది. కావున శ్రమము స్వేదరూప మని గాని యధికస్వేదరూప మని గాని చెప్పుట పొసఁగదు.

మఱియు, సాత్త్వికములు శారీరభావము లనియు, వ్యభిచారు

లు మానసభావము లనియు సిద్ధాంతము. ఇట్లు లక్షణము, "శ్లో॥ శ్రమో మానసఖేద స్స్యా దధ్వన్యుత్తరతాదిభిః" అని చెప్పఁబడియున్నది. రోమాంచస్వేదవైవర్ణ్యాదిసాత్త్వికములు శారీరము లనుటయు స్పష్టము. శ్రమము స్వేదరూపబాహ్యభావ మైనయెడ, "శ్రమో మానసఖేద స్స్యాత్," అని యాంతరభావత్వము దాని కెట్లు ఘటిల్లు? "శ్లో॥ సద్యః పురీపరిసరేషు శిరీషమృద్వీ గత్వా జవా త్త్రిచతురాణి పదాని సీతా। గన్తవ్య మస్తి కియ దిత్యసకృ ద్బ్రువాణా రామాశ్రుణః కృతవతీ ప్రథమావతారమ్॥" అని సింగభూలీయమందును, "శ్లో॥ అలసలులితముగ్ధా న్యధ్వసంజాతఖేదా దశిథిలపరిరమ్భై ర్దత్తసంవాహనాని। పరిమృదితమృణాలీదుర్బలా న్యఙ్గకాని త్వ మురసి మమ కృత్వా యత్ర నిద్రా మవాప్తా॥" అని దశరూపకమునందును, అధ్వశ్రమోదాహరణములయందు స్వేదప్రవాహము గాని స్వేదలేశముగాని కనఁబడదు గావున నివి స్వేదాంబులహరీరూపశ్రమమున కుదాహరణము లెట్లగును? మఱియు, ఆంధ్రనామసంగ్రహమునందును, "అలయిక బడలిక ♦ యలపు సేద యనంగ, శ్రమమున కాఖ్యలౌ ♦ శమనదమన" అని, శ్రమము, స్వేదరూపముగాఁ జెప్పక, బడలికగాఁ జెప్పుట యెట్లుపపన్న మగును? కావున, "సరసస్వేదాంబులహరి శ్రమము" అనుట, "నహి కస్య చి ద్గ్రంథకృతో విపరీతలేఖనం యుక్తిబలా ద్వస్తుసిద్ధౌ బాధక" మ్మని వ్యుత్పత్తివాదమందు గదాధరభట్టాచార్యుఁడు వక్కాణించిన న్యాయమున, నజ్ఞానవిలసితంబె యని తెలియునది. ఇట్లు శృంగారచేష్టలలో లలితమున కుదాహరణముగా, "శ్లో॥ స్వేదక్లేదితకఙ్కణాం భుజలతాం కృత్వా మృదఙ్గాశ్రయాం చేటీహస్తసమర్పితైకచరణాం మఞ్జీరసంధిత్సయా। సా భూయః స్తనకమ్పసూచితరయం నిశ్శ్వాస మాముఞ్చతీ రఙ్గస్థాన మనఙ్గసా త్కృతవతీ తాళావధౌ తస్థుషీ॥"యనుశింగభూపాలీయశ్లోకమునకుఁ బ్రతిగాఁ జేసిన, "చ. వడియు శ్ర

పంబు తోడిభుజవల్లి మృదంగమునిూఁదఁ జేర్చి" యనుదానియం దు స్వేదపదమునకు మాఱుగా శ్రమపదము పెట్టుటయు నయుక్తంబె. కావున స్వేద మేయేకారణమున నెచ్చెచటఁ జెప్పియుండిన నది యంత యు సాత్త్వికభావములోఁ జేరునదియే. అది "శ్లో॥ నిదాఘహర్షవ్యా యామశ్రమక్రోధభయాదిభిః" అని పూర్వము వ్రాసినరీతిగా, నిదా ఘముచేతను హర్షముచేతను వ్యాయామముచేతను శ్రమముచేతను క్రోధముచేతను భయము మొదలగువానిచేతను జనియించును. అందు శ్రమము మానసభేదరూప మైనవ్యభిచారిభావంబే కాని వేఱుగా దని తెలియునది.

## దైన్యజాడ్యంబులకు లక్షణములు.

క. బల మఱి యరికిన్ దయ రాఁ
బలుకుట దైన్యం బనంగఁ ♦ బరఁగు న్మదిలోఁ
గల కోరిక చేకూఱిన
నల వెఱఁగిక యునికి జాడ్య ♦ మగు నెట్లన్నన్. 97

టీ॥ బలమఱి=సామర్థ్యముడిగి ; అరికిన్=శత్రువునకును; దయ రాన్=దయవచ్చునట్లు; పలుకుట = వచించుట ; దైన్యంబనంగఁబరఁ గున్=దైన్యమనుభావమైయొప్పును. మదిలోన్కలకోరికచేకూఱినన్ = మనోరథంబీడేఱినప్పుడు; అల వెఱఁగకయునికి= మైమఱచియుండుట ; జాడ్యమగున్=జాడ్యమనునదియగును. ఎట్లన్నన్.

"శ్లో॥ సత్త్వత్యాగా దనౌద్ధత్యం దైన్యంకార్పణ్యసంభవమ్" అని ప్రతాపరుద్రీయలక్షణ ముండఁగా, నిందు దయరాఁబలుకుట దైన్య మని చెప్పఁబడినది. ఈవ్యభిచారులు "వికారోమానసోభావః" అను టచే మనోభావములు గాన మనస్సునందు దైన్య మనుభావ ముద యించినవెనుక దయరాఁబలుకును గాని యట్లు పలుకుటయే దైన్యము

కాదు. కొన్నిచోటుల ముఖమాలిన్యాదులవలనను దైన్యంబు దెలియ వచ్చుచున్నది. ఇట్లు కావ్యప్రకాశమున "వ్యానమ్రమాదయితానసే" యనుపద్యమునందు "మ్లానాకపాలోదరే" యని దైన్యమున కుదాహరణ మీఁబడినది. దయరాఁబలుకుటే దైన్య మన్నపు డీప్రయోగములు విరోధించును. కాన దైన్యకార్య మగుదయరాఁబలుకుట దైన్యముగాఁ జెప్పుట యుక్త మని తోఁచెదు.

వెండియు "మదిలోఁ గలకోరిక చేకూఱిన నల వెఱుఁగక యునికి జాడ్య" మని చెప్పినయీలక్షణము. "శ్లో॥ జాడ్య మప్రతిపత్తి స్స్యా దిష్టానిష్టార్థసంభవాత్।" అనుప్రతాపరుద్రీయలక్షణమునందు నిష్టసిద్ధివలన నేరీతి జడత యుదయించునో యనిష్టప్రాప్తివలనను నారీతి జడత గలుగునట్లు చెప్పినందునను, అట్లనేకలక్ష్యానుభవమువలనను, నవ్యాప్తంబు.

దైన్యమున కుదాహరణము.

క. మదన మదిరాక్షి లక్ష్యమె
మొదలఁ బురాంతకుని నీళ్ళ మోయించిన నీ
కిది మొదలు కరుణఁ జూడుము
సుదతి న్నరసింహుఁ గూర్పు సుకృతము గల్గున్. 98

టీ॥ మదన=ఓమన్మథుఁడా! మొదలన్=తొలుత; పురాంతకునిన్=త్రిపురభేదియగునీశ్వరుని; నీళ్ళమోయించిననీకున్= నీళ్ళమోయునట్లుచేసిననీకు, అనఁగా, శివుఁడుగంగనుదలమీఁదనుంచుకున్నాఁడనుట; మదిరాక్షిలక్ష్యమె=ఆఁడుదివిషయమా? లక్ష్యముకాదనుట. ఇది...చూడుము= ఇదిమొదలుకొనిదయచేనాలోకింపుము. సుదతిన్= మంచివయస్సుగలనాచెలిని; నరసింహున్ = నరసభూపాలుని; కూర్పు= చేర్పుము. సుకృతముగల్గున్= పుణ్యముగలుగును. ఇందు మరునిఁగూ

ర్చి చెలికత్తె దయ రాఁ బలికినందునఁ దత్కారణం బగుదైన్యము వ్య క్తమగుచున్నది.

జాడ్యమున కుదాహరణము.

క. అదన నృసింహుఁడు వచ్చిన
సుదతి కనుంగొనదు చెలులఁ ♦ జూడదు భాషిం
పదు మిగులఁ జలింపదు త
ద్వదనామృతపారణావ♦ధానయుఁ బోలెన్. 99

టీ॥ సుదతి=ఒకనాయిక; నృసింహుఁడు = నరసభూపాలుఁడు; అదనన్=సుసమయమందు;వచ్చినన్=రాఁగా; తద్వదన...పోలెన్=ఆరాజుముఖామృతముయొక్క యనుభవమందే కాగ్రతగలదోయనునట్లు; కనుంగొనదు= చూడదు. చెలులఁజూడదు = చెలికత్తెలనవలోకింపదు. భాషింపదు=మాటాడదు. మిగులన్=మిక్కిలి; చలింపదు=కలదు. ఇందుఁ బ్రియాగమన మనునిష్టసిద్ధివలన నాయికకు జడత చెప్పఁబడినది.

ప్రతాపరుద్రీయమున, "శ్లో॥ సమాయాతే నాథే ప్రమనసి గృహాన్ రుద్రనృపతౌ వపు స్సౌన్దర్యశ్రీవిజితమదనోదారయశసి। వధూ ర స్తస్తోషవ్యతికరవశా న్నోపచరితుం పురస్తా దాళీనాం నచలతి తథా నోపిరమతి॥" యనుదానిలోఁ బ్రియుఁడు వచ్చినంజూచి కలిగిన హర్షాతిశయమున జడత చెప్పఁబడినది. ఇందు వానిం జూడ దనువ్యతిరేకోక్తులు మూర్ఛాదుల కుదాహరణముగా దీనిం జేయుచున్నవి.

గ్లానిత్రాసములకు లక్షణములు.

క. కడు శక్తి యొడలి బడలిక
నడలుట యది గ్లాని యయ్యె♦నాకస్మికమై
వొడముభయంబునఁ జిత్తము
తడఁబడు టది త్రాస మనఁగఁ ♦ దగు నెట్లన్నన్. 100

టీ॥ కడుశక్తిమొదలి = మిక్కిలిసామర్థ్యముడిగి; బడలికనడలుట = బడలికచేనాయాసపడుటయేదిగలదో; అది = ఆయాయాసపడుట; గ్లానియయ్యెన్ = గ్లానియనునదియాయెను. ఆకస్మికమైపొడముభయంబునన్ = అకారణముగనుదయించినభయముచేత; చిత్తముతడఁబడుట = మనస్సుతడఁబాడుటనొందుట యేదికలదో; అది = ఆతడఁబడుట; త్రాసమనఁగఁదగున్ = త్రాసమననొప్పును. ఎట్లన్నన్.

గ్లాని కుదాహరణము.

క. నిండదె బడలిక మును చను
కుండలబరు వాఁగ లేని ♦ కోమలిమేనం
గొండంత వలపు పుట్టిన
గండరగండాంక యోబ ♦ ఘనసరసింహా. 101

టీ॥ గండర...సింహా = గండరగండయనుబిరుదుచేనంకితుఁడవగు నోబయనరసభూపాలుఁడా! మును...మేనన్ = తొలుతఁగుచకుంభభారమువహింపఁజాలని కోమలియంగమునందు; కొండంతవలపుపుట్టినన్ = కొండవలెనధికమైనమోహముదయించినచో; నిండదెబడలిక = బడలికనిండదా? అవశ్యమునిండుననుట.

త్రాసమున కుదాహరణము.

క. మరుఁ జిత్రలిఖితుఁ గని బి
త్తరి వెఱవఁ బరాగభూతిఁ ♦ దగ నిడి చిగురా
కరయఁ దిగఁ దుడిచి యలులకు
విరిబోనము వోయఁ దెలిసె ♦ వెఱపు నృసింహా. 102

టీ॥ నృసింహా = ఓనరసభూపాలుఁడా! బిత్తరి = స్త్రీ; చిత్రలిఖితున్ = చిత్తరువునందువ్రాయఁబడిన; మరున్ = మదనుని; కని = చూచి;

వెఱవఁగా=భయంపడఁగా; పరాగభూతిఁ= పుప్పొడియనుభస్మను; తగనిడి=తగునట్లుంచి; చిగురాకు...తుడిచి=చిగురుటాకునుబాగుగఁదిగఁదుడిచి; అళులకుఁ=తుమ్మెదలకు; విరిబోనముపోయఁ=పువ్వులను అన్నముపోయఁగా; వెఱపు=భయము; తెలిసెఁ.

ఇం దాకస్మిక మగుచిత్రలిఖిత మదదర్శనమున నాయికచిత్తము తడఁబడినట్లు వర్ణించినందునఁ ద్రాస మగు నని తాత్పర్యము.

"శ్లో॥ ఆకస్మికభయా చ్చిత్తవిక్షోభ స్త్రాస ఈరితః" అను ప్రతాపరుద్రీయలక్షణము నింతియె. రసగంగాధరకారాదు లాకస్మికముగ వ్యాఘ్రాదిభయహేతువులదర్శనమువలనఁ జిత్తవిక్షోభము గలుగునపుడు త్రాసము గా వలసివచ్చు నని యూహించి, "వ్యాఘ్రాది దర్శనమునఁ బ్రాణాపాయమగునో యని క్షోభపడుట భయమను స్థాయిభావము, తదితర మైనసాధారణవిక్షోభము త్రాస మనుసంచారి యగు" నని భయత్రాసములకు భేదము వక్కాణించిరి.

శంకార్తులకు లక్షణములు.

క. తనకు ననిష్టం బగునో
యని కొదుకుట శంక హృదయ ♦ మందలి తాపం
బినుమడియై వెలిఁ బర్విన
ననయముఁ దనుపీడ యార్తి ♦ యగు నెట్లన్నఁ. 103

టీ॥ తనకుఁ...కొదుకుట= తనకుఁగీడగునోయని సంశయించుట; శంక=శంకయనుభావంబగును. హృదయమందలి...పర్వినఁ=హృదయసంతాపమురెండింతలై బయలుపడఁగా; అనయముఁ=ఎల్లపుడు; తనుపీడ=శరీరబాధ; ఆర్తియగుఁ=ఆర్తియనునదియగును. ఎట్లన్నఁ.

ఇం దార్తిలక్షణము "హృదయమందలితాపం" బనుట మాత్ర

మే యుక్తము, తక్కినది శరీరధర్మమును బోధించుఁ గాని మానస ధర్మమును బోధింపదు గాన "వెలిఁబర్వెన ననయముఁ దనుపీడ" యనునది యుక్తముగా దని తోఁచుచున్నది.

శంక కుదాహరణము.

క. చిలుకలపలుకో యని విన
నలుకుం జెలిపలుకుఁ దలఁకు నద్దము చూడం
గలువల చెలికాఁడో యని
చెలువ వియోగంబుకతన శ్రీనరసింహా. 104

టీ॥ శ్రీనరసింహా=సంపన్నుఁడవగునరసభూపాలుఁడా! చెలువ=నాయిక; వియోగంబుకతనన్=విరహమువలన; చెలిపలుకున్=చెలికత్తె మాటను; చిలుకలపలుకోయనివిననలుకున్=చిలుకలయొక్కపలుకోయని యూహించివినుటకు వెఱచును. అద్దముచూడన్= అద్దముచూచుటకు; కలువలచెలికాఁడోయని = చందురుఁడోయని; తలఁకున్ = భయపడును.

ఇందు నాయిక విరహార్త గానఁ జిలుకలపలుకులు వినుటవలనను జంద్రునిఁ జూచుట వలనను దన కనిష్టం బగునో యని కొదికి నట్లు వర్ణించినందున శంక యని తెలియునది.

ఆర్తి కుదాహరణము.

క. బెడిదపుమదనజ్వరమున
మిడిసి పడున్ హారలతలు మృగలోచనకున్
వెడవిలుతు వింటి కోలల
వడువున సతి నింక నేఁచ వలదు నృసింహా. 105

టీ॥ బెడిదపుమదనజ్వరమునన్ = ఉగ్రమైనకామజ్వరముచేత;

మృగలోచనకుఁ = నాయికకు; హారలతలు = లతలవలెనుండుముక్తా హారములు; మిడిసిపడుఁ = మిట్టిపడును. ఇంకఁ =ఇఁకమీఁద; సతిఁ = స్త్రీని; వెడ...వడువునఁ=మదనధనుర్బాణములవిధమున; నృసింహా= నరసభూపాలుఁడా ! ఏఁచవలదు=బాధించఁదగదు.

ఇందు బెడిదపుమదనజ్వరమున మిడిసిపడు సనుటచేత హృద తాపం బినుమడియై వెలిఁ బర్వినట్లు స్పష్ట మగుచున్నది కావున నార్తి యని తెలియవలయును.

రోషగర్వములకు లక్షణములు.

క. ఎందును గృతాపరాధుల
యందు మనం బెరియ రోష ♦ మగు నది యొడల
న్నిందించి తన్నుఁ బొగడున
మందోన్నతి గర్వ మయ్యె ♦ మహిఁ నెట్లన్నన్. 106

టీ॥ కృతాపరాధులయందుఁ = అపరాధముచేసినవారియందు; ఎందును=ఎచటనైనను; మనంబు=మనస్సు; ఎరియఁ = జ్వలింపఁగా; అది = ఆమనస్సుజ్వలించుట; రోషము=అమర్షమనుసంచారి; అగుఁ.

ఈరోషమునకు "అపకారకారు లగునరు, లపరాధ మొనర్ప నేమ♦హామహానిమనం। బు పరిజ్వలితంబగు" నని పూర్వము చెప్పిన క్రోధమునకు, "శ్లో॥ అమర్షస్సాపరాధేషు చేతఃప్రజ్వలనం మతమ్, శత్రుకృతాపచారేణ మనఃప్రజ్వలనం క్రోధః" అనుప్రతాపరుద్రీయ లక్షణములందును, వాని ననుసరించినయీగ్రంథలక్షణములందును భేద మేర్పడదు. రసగంగాధరాదులలోఁ బరులయొక్క పరమాపరాధముచే జన్యమై వధపర్యవసాయి యగుమనఃప్రజ్వలనము క్రోధ మనియు, అల్పాపరాధజన్యమై యసంభాషణపరుషభాషణాదిపర్యవసాయి యగు నది యమర్షమనియుఁ, గ్రోధామర్షములకు భేదము వ్రాయఁబడియున్నది.

ఒరులకా...ఉన్నతి = ఇతరులనిందించితన్నుఁబొగడుకొనునధికోన్నతి; మహిన్=భూమియందు; గర్వమయ్యెన్ = గర్వమనుసదియాయెను. అదియెట్లన్నన్.

రోషమున కుదాహరణము.

క. నిలునిలు మనంగ నేచటికిఁ
దొలఁగెదు నరసింహుఁ డింతితోఁ గూడిన జా
లలరు భవదీయచాపము
కలుగానుగఁ ద్రిప్పి పిప్పిగాఁ గావింతున్. 107

టీ॥ అనంగ = ఓమదనుఁడా! నిలునిలుము = తాళుతాళుము. త్వరపడకనుట. ఎచటికిఁదొలఁగెదు = ఎందుఁబోయెదవు? నృసింహుఁడు = నరసభూపాలుండు; ఇంతితోఁగూడినన్ = నాయికతోఁగూడిన వెనుక; చాలుఅలరుభవదీయచాపము = సమృద్ధిచేఁబ్రకాశించుచున్న నీవింటిని; కలుగానుగన్ = రాతిగానుగయందు; త్రిప్పిపిప్పిగాఁగావింతున్=తిరుగఁజేసిపిప్పిఁజేయింతును. ఇందుఁ గృతాపరాధుఁడగుమదనునియందు మనఃప్రజ్వాలనము చెప్పినందున రోష మగును.

గర్వమున కుదాహరణము.

క. ప్రతియె కళంకాంకితునకు
సతి యగురోహిణియు నతను సతి యగురతియుం
జతురు నృసింహునిఁ జెందిన
యతిధన్యకు నాకు ననుచు నంగన నవ్వెన్. 108

టీ॥ కళంకాంకితునకున్=కళంకముగలచంద్రునకు; సతియగురోహిణియున్= భార్యయగురోహిణీదేవియు; అతనుసతియగురతియున్= అనంగునిభార్యయగురతీదేవియు; చతురున్=చాతుర్యశాలియగు; నృ

సింహునిన్ = నరసభూపాలుని; చెందినయతిధన్యకునాకున్ = పొందినయతిధన్యురాలనైననాకు; ప్రతియె = సరియా? అనుచునంగనవ్వేన్ = ఇట్లనుచు మగువ నవ్వెను.

ఇందు నాయిక రతిరోహిణుల నిందించి తన్నుఁ బొగడుకొనుటవలన గర్వ మగును.

ఆవేగధృతులకు లక్షణములు.

క. క్రమమున నిష్టానిష్టా
 గమజమనస్సంభ్రమంబు ♦ గన నావేగం
 బమరంగ మనము కృతార్థ
 త్వముఁ జెందిన ధృతి యనంగఁ ♦ దగు నెట్లన్నన్. 109

టీ॥ క్రమమునన్ = వరుసగా; ఇష్ట...సంభ్రమంబు = ప్రియాప్రియములవలనఁబుట్టిన మనస్సుయొక్క తొట్రుపాటు; కనన్ = చూడఁగా; ఆవేగంబు = ఆవేగమనునదియగును. అమరంగన్ = లెస్సఁగా; మనము = మనస్సు; కృతార్థత్వముఁజెందినన్ = కృతకృత్యతనొందఁగా; ధృతి యనంగఁదగున్ = ధృతియనుభావమగును. ఎట్లన్నన్.

ఆవేగమున కుదాహరణము.

క. సతి హారము నిడ నెడ లే
 కతనునితనుసిద్ధిఁ గోరి ♦ యల రతి వ్రతసం
 గతి నక్షసరము గైకొను
 గతిఁ గేలను దాల్చి నృపతిఁ ♦ గనుఁగొన నరిగెన్. 110

టీ॥ సతి = స్త్రీ; హారమున్ = ముత్తెపుసరమును; ఇడ నెడ లేక = ధరింపనవకాశము లేక; అలరతి = ప్రసిద్ధయగురతీదేవి; అతనునితనుసిద్ధిఁ గోరి = అనంగుఁడగుతనభర్తకు శరీరసిద్ధినభిలషించి; వ్రతసంగతిన్ =

వ్రతమునవలంబించుటచేత; అక్షసరముగైకొనుగతిన్ = జపమాలధరించినభంగి; కేలన=చేతనే; తాల్చి=ధరించి; నృపతిఁగనుఁగొననరిగెన్ = నరసభూపాలునిఁజూడఁజనెను. ఇట నావేగము స్పష్టము.

ధృతి కుదాహరణము.

క. నరసేంద్రుఁడు రా కుండినఁ
బరువడి భావింపఁ గలుగు ♦ భాగ్యమె చాలుం
జరితార్థ నైతి మరునకు
గిరునకుఁ బ్రియ మేల పల్కఁ ♦ గీడ్పడి నాకున్. 111

టీ॥ నరసేంద్రుఁడు = నరసభూపాలుఁడు ; రాకుండినన్ = రాకయేయుండినను; పరువడి. . .చాలున్ = వరుసగాస్మరింపఁగలిగెడుభాగ్యమేచాలును, విరహమునం దితరములఁ బరిత్యజించి ప్రియస్మరణమె యెల్లప్పుడు గలుగు ననుట. చరితార్థనైతిన్ =కృతార్థనైతిని. మరునకు గిరునకున్ = నీచుఁడైనమన్మథునకు ; ఇటనిందార్థమునంమగియనునాగమము; కీడ్పడి=లోఁబడి; నాకున్ =నాకు; ప్రియము = ప్రియవాక్యమును; పల్కనేల=పల్కుటకేమిప్రయోజనము ? ఏమియుఁ బ్రయోజనము లే దనుట.

ఇందు నాయికమనంబు కృతకృత్యం బైనట్లు చెప్ప నందున ధృతి యని తెలియునది.

స్మృతిచాపలోగ్రతలకు లక్షణములు.

క. స్మృతి యగుఁ బూర్వానుభవ
స్మృతి రాగద్వేషజనిత ♦ చేష్టాద్యనవ
స్థితి చాపల మెగ్గొదవిన
నతిచండత యుగ్రభావ ♦ మగు నెట్లన్నన్. 112

టీ॥ పూర్వానుభవస్మృతి = పూర్వమనుభవించినదానిఁ దలఁచుట; స్మృతి=స్మృతియనుసంచారి; అగుఁ. రాగ...అనవస్థితి=రాగమునఁగాని ద్వేషమునఁగాని పుట్టినచేష్ట మొదలగువానియొక్క యనవస్థ; చాపలము=చపలతయనునదియగును. ఎగ్గొదపినఁ నతిచండత= అపరాధము చేసినచో మిక్కిలికోపించుట; ఉగ్రభావమగుఁ = ఉగ్రతయగును. ఎట్లన్నఁ.

ఇట స్మృతిపదార్థము తెలియుటకుఁ జెప్పినస్మృతిలక్షణములోఁ బూర్వానుభవస్మృతి యని స్మృతిపదమును జేర్చుట యాత్మాశ్రయ మనుదోషమునకు హేతు వగుచున్నది.

స్మృతి కుదాహరణము.

క. నాఁటిపరిరంభసౌఖ్యము
నేఁటిబలెం బాయ దాత్మ ♦ నిండితొలఁకుచుఁ
బోటి నృసింహునిఁ బాయని
పాటలసుమగంధు లెంత ♦ భాగ్యాధికలో. 113

టీ॥ బోటి = ఓసఖి! నాఁటిపరిరంభసౌఖ్యము= నాఁడనుభవించినయాలింగనసౌఖ్యము ; నేఁటిబలెఁ = నేఁడనుభవించినదానివలె; ఆత్మఁ=చిత్తమునందు; నిండితొలఁకుచుఁ=నిండివెలిఁబర్వుచు; పాయదు=చనదు. నృసింహునిఁ=నరసభూపాలుని; పాయనిపాటలసుమగంధులు = ఎపుడు నెడఁబాయని స్త్రీలు, పాటలసుమమనఁగలిగొట్టుపువ్వు, దానివాసనవంటిదేహవాసనగలవారనుట;ఎంతభాగ్యాధికలో= ఎంతభాగ్యాతిశయముగలవారో.

ఇందు నాయిక తాఁ బూర్వము నరసభూపాలునితో ననుభవించినయాలింగనసౌఖ్యమును దలఁచుచున్నందున స్మరణము.

చాపలమున కుదాహరణము.

క. వనిత నృసింహునిఁ గనుఁగొని
చనుగుబ్బలమీఁదివలువ ♦ చక్కఁగ దిద్దున్
జనఁ జూచు మరలుఁ జెలితోఁ
బని లేమియుఁ బలుకు నురము ♦ పయిఁ జెయి సేర్చున్. 114

టీ॥ వనిత= స్త్రీ; నృసింహునిన్ = నరసభూపాలుని; కనుఁగొని= చూచి; చను...వలువ = జాఱునట్టిపైఁటచెఱఁగు; చక్కఁగదిద్దున్ = బాగుగసవరించుకొనును. చనఁజూచున్ = అతనిచెంతకుఁజన నాలోచించును. మరలున్ = వెనుకకుఁదిరుగును. చెలితోన్...పలుకున్= సఖితోఁగార్యములేకయేమాటాడును. ఉరముపయిన్ చెయిచేర్చున్ = ఎదపైహస్తముంచుకొనును. ఇందు నాయికకు నరసభూపాలునిఁ గనుటచే రాగాతిశయమునఁ గ్రియానవస్థ గలిగినందునఁ జపలత యగును.

ఉగ్రత కుదాహరణము.

క. వలదు వల దేఁచఁ గలువల
చెలికాఁడ నృసింహుఁ గూర్పు ♦ చెలిఁ గాకున్నన్
బొలఁతుకనిట్టూర్పుఁబొగ
ల్వెలువడి నీబింబ మెల్ల ♦ వెస మాయించున్. 115

టీ॥ కలువలచెలికాఁడ = ఓచందురుఁడా! ఏఁచన్ = బాధింపఁగా; వలదువలదు = కూడదుకూడదు. చెలిన్= స్త్రీని; నృసింహున్= నరసభూపాలుని ; కూర్పు=చేర్పుము. కాకున్నన్ = అటుగాకున్నచో; పొలఁతుకనిట్టూర్పుఁబొగల్ =దానిగొప్పయూర్పులనుధూమములు; వెలువడి = బయలుదేఱి; నీబింబమెల్లన్ = నీయొక్కబింబమంతయు; వెసన్ వేగముగా; మాయించున్ = నశింపఁజేయును.

ఇందుఁ జంద్రుఁ డపరాధముఁ జేసినచో వాని రూపుమాపుట చెప్పినందున నుగ్రత యగును.

అవహిత్థాత్రపావిషాదములకు లక్షణములు.

క. భువిలో నాకృతిగోపన
మవహిత్థ మనంబు ముడుఁగు • టది త్రప మతికిన్
వివిధోపాయాభావా
ద్యవిరతభంగము విషాద • మగు నెట్లన్నన్. 116

టీ॥ భువిలోన్ = భూమియందు; ఆకృతిగోపనము = అభిప్రాయమునుదాఁచుట; ఆకారస్త్వఙ్గఇఙ్గితమ్మనియమరము; అవహిత్థ = అవహిత్థయనుసంచారియగును. మనంబుముడుఁగుట = చిత్తసంకోచమేది కలదో; అది = ఆచిత్తసంకోచము; త్రప = త్రపయనునదియగును. మతికిన్=బుద్ధికి; వివిధ...భంగము= ఉపాయాభావమువలననైన నానావిధమైనఎడతెగనిభంగము; విషాదమగున్ = విషాదమనునదియగును. ఎట్లన్నన్.

అవహిత్థ కుదాహరణము.

క. హారములు గరఁగ నరస
త్స్మారమణునిఁ బాడి యొక్క • సతి పులకలు మై
నీరిక లెత్తిన దాఁచును
సారెకు హారాంబుజనిత • శైత్యం బనుచున్. 117

టీ॥ ఒక్కసతి=ఒకనాయిక; హారములుగరఁగన్ = మణిహారములుద్రవించునట్టుగా; నరసత్స్మారమణునిఁబాడి = నరసభూపాలునిగీతములుపాడి; పులకలు...ఎత్తినన్ = రోమాంచములుశరీరమందంకురింపఁగా; సారెకున్ = మాటికి; హార...అనుచున్=హారోదకమువలనఁబుట్టినచల్లఁదనమనుచు; దాఁచున్ = దాఁగఁజేయును.

ఇందు నాయిక నరసభూపాలునియం దనురాగమువలనఁ బుట్టిన పులకలు శైత్యమునఁ బుట్టినట్లు చెప్పి యనురాగమును దాఁచినందున నవహిత్థ యగు.

త్రప కుదాహరణము.

క. వనిత నృసింహేంద్రుఁ బరా
కునఁ బేర్కొని శిరము వంచు ♦ కొనుఁ జెలి యెదుటన్
గనిపించె భావ మని మో
మనయముఁ గుచదుర్గవసతి ♦ నాఁగినభంగిన్. 118

టీ॥ వనిత = ఒక స్త్రీ; నృసింహేంద్రున్=నరసభూపాలుని; పరాకునన్=పొరపాటుచేత; చెలియెదుటన్ = సఖిముందర ; పేర్కొని= పేరు పెట్టిపిలిచి; భావము=హృదయాభిప్రాయమును; కనిపించెన్ = తెలిసెను. అని=అనుకారణముచే; మోము= ముఖమును; అనయమున్= మిక్కిలి; కుచదుర్గవసతిన్=కుచములనెడు దుష్ప్రవేశమైనస్థలమందలి యునికిచేత; ఆఁగినభంగిన్=అడ్డగించెనో అనునట్లు; శిరమువంచున్ = తల వంచుకొనును. ఇందు నాయిక తలవంచుకొనుటవలనఁ ద్రప యగును.

విషాదమున కుదాహరణము.

క. అలరులు మరునమ్ములు హిమ
జల మిందుకరోదితంబు ♦ శత్రువు దలఁపం
జలిగాడ్పు శ్రీనృసింహుం
డలిగినవాఁ డెట్లు మాను ♦ నబలకుఁ గాఁకల్. 119

టీ॥ అలరులు=పువ్వులు; మరునమ్ములు = మదనునిబాణములు. హిమజలము=పన్నీరు; ఇందుకరోదితంబు = చంద్రకిరణములవలననుదయించునది. చలిగాడ్పు = చల్లనివాయువు; తలఁపన్= స్మరింపఁగ; శ

త్రువు=విరోధి. శ్రీనృసింహుఁడు=శ్రీమంతుఁడగునరసభూపాలుఁడు; అలిగినవాఁడు = కోపించినవాఁడు. సుదతికిఁగాఁకల్ = చెలికిసంతాపములు; ఎట్లుమానుక్=ఏవిధముగశమించును?

ఇందు సుదతికిఁగాఁకలు మానుట కుపాయములు తోఁచక మనస్సునకు భంగము గలిగినట్లు చెప్పుటవలన విషాదము.

మదౌత్సుక్యమతులకు లక్షణములు.

క. మదము మదిరాదికృతస
మ్మదమోహవ్యతికరంబు ♦ మఱి యౌత్సుక్యం
బదన సమయాక్షమత్వము
మది నర్థవినిర్ణయంబు ♦ మతి యెట్లన్నన్. 120

టీ॥ మదిరా...వ్యతికరంబు = మద్యపానము మొదలగువానిచేఁ గలిగినహర్ష మోహముల చేరిక; మదము = మదమను సంచారియగును. మఱి=మఱియు; అదనన్ = సమయమునందు; సమయాక్షమత్వము=విలంబమునహింపఁజాలమి; ఔత్సుక్యంబు=ఔత్సుక్యమగును. మదిన్=చిత్తమందు; అర్థవినిర్ణయంబు = అర్థనిశ్చయము; మతి = మతియనుభావంబగును. ఎట్లన్నన్.

"శ్లో॥ మతి రర్థవినిర్ణయః" అని ప్రతాపరుద్రీయలక్షణములో నర్థనిర్ధారణమె మతి యని యుండఁగా నిందు "మదిలో నర్థవినిర్ణయము మతి" యని యున్నది. మతిపదార్థజ్ఞానమునకుఁ జెప్పినలక్షణములో మదిని బ్రవేశింపఁజేయుట యాత్మాశ్రయదోష హేతు వగునని తోఁచుచున్నయది.

మదమున కుదాహరణము.

క. అమరునృసింహునివనమున

సమితాసవరసము లాని యలి ♦ యూవతముల్
భ్రమియించు నాడుఁ బాడును
రమణులతోఁ గూడి సాంద్ర ♦ రాగప్రౌఢిన్. 121

టీ॥ అలియూవతముల్ = ఆఁడుతుమ్మెదలగుంపులు; అమరసన్నృసింహునివనమునన్ = ఒప్పుచున్న నగనభూపాలునియుద్యానమునందు ; అమితాసవరసములు = అమితములౌపుష్పరసములను; ఆని = పానముఁజేసి; రమణులతోడన్ = ప్రియులతోఁగూడి; సాంద్రరాగప్రౌఢిన్ = గాఢానురాగముయొక్క అతిశయముచేత; భ్రమియించున్ = తిరుగును. ఆడున్ = క్రీడించును. పాడున్ = గానముచేయును. ఇందు భృంగయువతులు మకరందము ద్రావి మోహమును, ప్రియులతోఁ జేరి హర్షమును, జెందినందున మద మనుసంచారి యగును.

ఔత్సుక్యమున కుదాహరణము.

క. వరుఁ బిలువఁ బనిచి యెప్పు డెపు
డేరుదెంచునో యనుచుఁ దలఁచి ♦ యభిముఖి యగు బి
త్తరి యింత పరాకైనను
నరయఁ దదాలోకవిఘ్న ♦ మగు ననుభీతిన్. 122

టీ॥ బిత్తరి = స్త్రీ ; వరునిన్ = ప్రియుఁడగునరసింహుని ; పిలువఁబనిచి = పిలువఁబంపి; ఎపుడు...అనుచున్ = ఎప్పుడెప్పుడువచ్చునోయనుచు; తలఁచి = భావించి; ఇంతపరాకైనను = ఇసుమంతపరాకుగలిగినను; అరయన్ = విచారింపఁగా; తత్...భీతిన్ = ప్రియునిఁజూచుటకువిఘ్నమగునోయనుభయముచేత; అభిముఖియగున్ = ప్రియుఁడు వచ్చుదారి కభిముఖి యగును. ఇందు నాయిక దూతికను బంపి ప్రియుఁడు వచ్చువఱకుఁ దడవుసహింపక యెదురు చూచుటవలన నౌత్సుక్యంబు.

మతి కుదాహరణము.

క. చెలువరో శ్రీనరసింహుం
డలనాఁటి నృసింహమూర్తి ♦ యగుఁ గాకున్నన్
దలఁచిన తావుల నెల్లను
నెలకొని సాన్నిధ్య మొందు ♦ నిపుణత గలదే. 123

టీ॥ చెలువరో = ఓసఖీ! నృసింహుండు = నరసభూపాలుండు; అల...అగున్=ఆనాఁటినృసింహస్వామియగును. కాకున్నన్=అటు గాకయుండినచో; తలఁచినతావులనెల్లను=స్మరించినచోటులనంతటను; నెలకొని...గలదే = నిలుచుండినసన్నిధానమునొందునిపుణతయుండునా? ఉండదు గాన నృసింహమూర్తియే యగు నని యర్థనిర్ణయముఁ జేసినందున మతి యనుసంచారి యగును.

నిద్రామోహబోధాంతములకు లక్షణములు.

క. జగతిం జిత్తనిమీలన
మగు నిద్ర యనంగ మూర్ఛ ♦ నందుట మోహం
బగు బోధ మెఱుకఁ జెందుట
యగణితమృతియత్న మంత ♦ మగు నెట్లన్నన్. 124

టీ॥ జగతిన్=భూమియందు; చిత్తనిమీలనము=మనోముకుళనము; నిద్రయనంగన్ = నిద్రయనుసంచారియనఁగ ; అగున్. మూర్ఛనందుట=మూర్ఛిల్లుట; మోహంబు = మోహమనునది; అగున్. ఎఱుకఁజెందుట=తెలివినొందుట; బోధము = బోధమనుసంచారియగును. అగణితమృతియత్నము = అధికముగ మరణముకొఱకుప్రయత్నించుట. అంతము=అంతమనునది; అగున్. ఎట్లన్నన్.

### నిద్ర కుదాహరణము.

క. కలనైన శ్రీనృసింహునిఁ
గలయం గల నంచుఁ గలికి ♦ కన్నులు మొగిచెం
జెలి బాహ్యేంద్రియపథమున
నలరుమనం బరుగకుండ ♦ నాఁగినభంగిన్. 125

టీ॥ చెలి=స్త్రీ; కలనైనన్ = స్వప్నమందైనను ; శ్రీనృసింహునిన్=శ్రీమంతుఁడగు నరసభూపాలుని ; కలయంగలనంచున్ = పొందఁగలననుచు; అలరుమనంబు= ఒప్పుచుండెడిమనస్సును; బాహ్యేంద్రియపథమునన్= చక్షురాదిబహిరింద్రియమార్గమున ; అరుగకుండన్=చనకుండునట్లు; ఆఁగినభంగిన్= అడ్డగించినరీతిగ; కలికికన్నులమొగిచెన్= అందమైనకన్నులమోడ్చెను. ఇందు నాయిక కన్నులు మూసినందునఁ జిత్తనిమీలనము స్పష్టము గనుక నిద్ర యగును.

### మోహమున కుదాహరణము.

క. అతనుశరహతుల సొరిగెను
సతి విరహాతపస్సమాధి ♦ జనితవ్రతయై
ధృతి శ్రీనృసింహుఁ దలఁపఁగ
మతి దన్మయ మగుచు మేను ♦ మఱచినభంగిన్. 126

టీ॥ సతి=స్త్రీ; విరహ...వ్రతయై = వియోగమనెడుతపోనిష్ఠయందుఁగలిగిననియమముగలదై ; ధృతిన్ = ధైర్యముచేత ; శ్రీనృసింహుఁదలఁపఁగన్ = నరసభూపాలుండనునృసింహమూర్తినిస్మరింపఁగా; మతి=చిత్తము; తన్మయమగుచున్=తద్రూపమగుచు ; మేనుమఱచినభంగిన్=శరీరమునుమఱచినదోఅన్నట్లు; అతనుశరహతులన్=మన్మథబాణప్రహారములచేత; సొరిగెన్=మూర్ఛిల్లెను. ఇందు నాయిక మద

న బాణహతి చేత మూర్ఛిల్లి నట్లు చెప్పఁబడెను గాన మోహ మగును.

బోధమున కుదాహరణము.

క. తరణికులాధీశయశ
స్తరుణి జడత్వంబు మాని ♦ సంఫుల్లసితాం
బురుహాక్షియు జృంభితయై
చిరగతి మేల్కనియె శ్రీనృ♦సింహుఁడు గలుగన్. 172

టీ॥ తరణి...తరుణి = సూర్యవంశపురాజులకీర్తికాంత; శ్రీనృసింహుఁడుగలుగన్ = నరసభూపాలుండుగలుగఁగా ; జడత్వంబుమాని = జడవృత్తినివదలి; సంఫుల్లసితాంబురుహాక్షియున్ = వికసించినతెల్లదామరలవంటికన్నులుగలదియు; జృంభితయై = ఆవలించినదియునై, ప్రకాశించినదియునై; చిరగతిన్ - బహుకాలమునకు ; మేల్కనియెన్ = జాగరూకయాయెను. సూర్యవంశపురాజులకీర్తినిద్రించినట్లుండెను. అది నరసభూపాలుఁడుదయింపఁగా, బహుకాలమునకుఁ బ్రకాశించెనని తాత్పర్యము. ఇందుఁ గీర్తికాంతయావలించి మెలుకఁ జెందినట్లుచెప్పి నందున బోధ మగును.

అంతమున కుదాహరణము.

క. వల పెఱిఁగి రాఁడు కౌఁగిట
నలమఁడు నరసావనీంద్రుఁ ♦ డని వగవఁ జుమీ
చెలులును జిలుకయు నెవ్వతి
వలనగునో యనుచుఁ గొంత ♦ వగచెద నాత్మన్. 128

టీ॥ నరసావనీంద్రుఁడు = నరసభూపాలుఁడు; వల పెఱిఁగిరాఁడు = మోహమునుదెలిసియేతేరఁడు. కౌఁగిటనలమఁడు = కౌఁగిలీయఁడు. అనివగవఁజుమీ = ఇటనివ్యసనముఁజెందనుసుమీ. చెలులును = సఖు

రాంద్రుని ; చిలుకయుఁ = క్రీడాశుకమును ; ఎవ్వతివలనగునో యను చుఁ=ఎవ్వతెయధీనమగునోయనుచు; ఆత్మఁ=చిత్తమందు; కొంతవ గచెదఁ=కొంచెమువ్యసనపడెదను. ఇందు నాయిక యెన్నియత్నము లు చేసి యెంతకాలము నిరీక్షించినను బ్రియుండు రా లేదని యాస వదలి మృతి కుద్యమించినట్లు "చెలులనుజిలుకయునెవ్వతివలనగునో" యనుటవలన వ్యక్త మగుచున్నది గాన అంత మనుసంచారి యగును.

మదాలస్యవితర్కములకు లక్షణములు.

క. ముద మిష్టలాభభవస
మ్మద మగుఁ గర్తవ్యకార్య ♦ మందోద్యోగం
బది యలసత సందేహా
భ్యుదయబహుత్వము వితర్క ♦ మొగి నెట్లన్నన్. 129

టీ॥ ఇష్టలాభభవసమ్మదము = ఇష్టసిద్ధివలననగుహర్షము; ముదము=ముదమనునది; అగుఁ. కర్తవ్య...ఉద్యోగంబు= చేయవలసిన కార్యమందుమందప్రయత్నంబేదికలదో ; అది = ఆమందోద్యోగము; అలసత=అలసతయనునదియగును. సందేహాభ్యుదయబహుత్వము=సందేహోదయనానాత్వము, అనేకసందేహములుదయించుట యనుట; వితర్కము = వితర్కమగును. ఒగిఁ=వరుసగా; ఎట్లన్నన్=ఉదాహరణమెట్లనఁగా.

ఈవితర్కలక్షణము, "శ్లో॥ సందేహాత్కల్పనానస్త్యాంవితర్కః పరికీర్తితః" అనుప్రతాపరుద్రీయలక్షణమునకును, "సంశయాదులవల నఁగలుగువిచారమువితర్క" మనురసతరంగిణ్యాదిలక్షణమునకును, విరుద్ధమై యనేకసంశయరూపమే వితర్క మనునర్థమును జెప్పుచున్నది.

ముదమున కుదాహరణము.

శా. అల్లత్రాక్షింశుకశిఖలా॰

జెలఁగుచు మున్నెంత తపముఁ ♦ జేసెనొ చెలివే
నలి నరసింహునియురమునఁ
జెలు వగుచెంగల్వదండ ♦ చేరువ గలిగెన్. 130

టీ॥ చెలివేనలి=స్త్రీయొక్క కొప్పు; అలులై = తుమ్మెదలై; కింశుకశిఖలోన్ = మోదుగపువ్వులనునగ్నియందు; చెలఁగుచున్ = ఒప్పుచు; మున్నెంతతపముచేసెనో = పూర్వమెంతతపమునాచరించెనో; నరసింహునియురమునన్=నరసభూపాలునివక్షమునందు; చెలువగుచెంగల్వదండచేరువగలిగెన్ = అందమగునెఱ్ఱకలువలదండయొక్క సాన్నిధ్యము గలిగెను. ఇందుఁ జెలివేనలికి నరసభూపాలునియురంబునందలి రక్తోత్పలహారసాన్నిధ్యము గలిగిన దని యిష్టలాభంబున హర్షముఁ జెప్పినందున ముద మగును.

"శ్లో॥ య త్పూర్వం సరసీషు పద్మముకుళవ్యాజా త్తప స్సంచితం వక్షోజౌ యువయో స్త దద్య ఫలితం జాతౌ కృతార్థౌ యువామ్। దత్తా కాకతివల్లభేన భవతో రేషా స్వవక్షస్స్థలీ కస్తూరీద్విగుణీభవత్పరిమళా కల్హారమాలా యతః॥" అని ప్రతాపరుద్రీయోదాహరణము.

ఆలస్యమున కుదాహరణము.

క. చెలు లాహారాదులకుం
బిలిచిన నరగంటఁ జూచుఁ ♦ బ్రియుఁడు నృసింహుం
డలఘున్నృపకుంజరుం డని
యలికుంతల కుంభినీత్వ ♦ మందెనొ తానున్. 131

టీ॥ అలికుంతల = అలినీలవేణియగునొకకర్త్రి; చెలులు=సఖులు; ఆహారాదులకుంబిలిచినన్ = భోజనాదులకుఁబిలిచినను; అరగంటఁజూచున్ = సగముమూసినకంటితోఁజూచును. ప్రియుఁడునృసింహుండు =

ప్రియుఁడైననరసభూపాలుండు; అలఘునృకుంజరుండని = గొప్పరాజశ్రేష్ఠుఁడని, గొప్పరాచయేనుఁగని; తానుక్ = తానును ; కుంభినీత్వమందెనో = ఆఁడేనుఁగుతనమునొందెనాయేమి? లేనియెడ నరగంటుఁజూచుట సంభవింపదనుట. ఇందు నాయిక సఖులాహారాదులకుఁ బిలిచిన నరగంటుఁ జూచుటవలన నలసత యగును.

“శ్లో॥ ఆస్తా మ్మృగాక్ష్యా గృహకృత్యవార్తా స్వాఙ్గోపచారే ష్వపి యత్నమాస్థ్యమ్ । కర్తవ్య మగ్రే దయితస్య యత్నా స్నాసం బలాత్కారయతి స్మర స్తత్॥” అనుప్రతాపరుద్రీయోదాహరణ మింతకన్న రమణీయతరంబు.

వితర్కోదాహరణము.

క. చెలు లెఱుఁగ రాదు భావము
చెలు లెఱుఁగక యున్న మరుని♦చే రాయిడి యౌఁ
జెలులును మన సొక్కటైనను
వల పెఱిఁగి నృసింహవిభుఁడు ♦ వచ్చునొ రాఁడో. 132

టీ॥ భావము = హృదయాభిప్రాయము; చెలులెఱుఁగరాదు=సఖులు తెలియఁగూడదు. చెలులెఱుఁగకయున్నన్ = చెలులుదెలియక యున్నచో; మరునిచేన్=మన్మథునిచేత; రాయిడియౌన్ = బాధగలుగును. చెలులునుమనసొక్కటైనను — చెలులకుఁ దెలిసినయెడననుట; వలపు...రాఁడో = నరసభూపాలుండు మోహంమెఱిఁగివచ్చునోరాఁడో! ఇందు సందేహముగఁ జెప్పినందున వితర్కం బగును.

సుప్తిస్వప్నంబులకు లక్షణంబులు.

క. అతినిద్ర సుప్తి యుతయగు
[illegible] ♦ అది [illegible] యగుఁగ్

హితవస్తువు చేకూడమి
నతులాధ్యానంబు చింత • యగు నెట్లన్నన్. 133

టీ॥ అతినిద్ర=అధికమైననిద్ర ; సుప్తి=సుప్తియనునదియగును. ఇతరులయతిశయమునసహింపకుండుట = పరులయాధిక్యంబోర్వకుండుట యేదిగలదో; అది=ఆయోర్పులేమి; ఈర్ష్యయగున్= ఈర్ష్యయనునది యగును. హితవస్తువుచేకూడమిన్=ఇష్టవస్తువుఘటిల్లనందున; చింత= చింతయనునది,అనఁగా, హితవస్తువుచేకూడమిచేఁగలుగుచింతయేదిగలదోయది; అతులాధ్యానంబు = అతులమైనఆధ్యానమనునదియగునని యన్వయము. "నిర్వేదశ్రమదైన్యజాడ్యము" లనుపద్యములో "ఆధ్యానధృతిమాపస్మృతుల్" అని యాధ్యానముపేర్కొనఁబడుటవలన నిట్లన్వయముచేయఁబడెను. ఈయన్వయమునందు అతులశబ్దము, "అతిభీతి జుగుప్స, అత్యంతోత్సాహమయ్యె, అపరిమితక్రోధమయ్యె," ఇత్యాదులయందుంబోలెఁ బ్రాసజిత్తని తెలియునది.

సుప్తి కుదాహరణము.

క. లలన నృసింహునికౌఁగిట
నలసియొ పవలెల్ల నిద్ర • నందెడి నెలమిన్
నెలపొందున రే ముద్దులు
గులికి పగల్నిద్రవోవు • కుముదినిపోలెన్. 134

టీ॥ లలన- ఒకనాయిక; నృసింహునికౌఁగిటన్ = నరసభూపాలునికౌఁగిలిచేత ; అలసియొ = బడలియొ; పవలెల్లన్ = పగలంతయు; నెల...పోలెన్= చందురునిసాంగత్యమునరాత్రిముద్దులుగులికిపగలునిద్రించుకలువతీఁగవలె ; ఎలమిన్ = మిక్కిలి ; నిద్రనందెడిన్ - అతినిద్రనొందెడిననుట. ఇందు నాయికకు గాఢనిద్ర చెప్పినందున సుప్తియగును.

ఈర్ష్యకుదాహరణము.

క. ఈవికొలందంతె తనమే
లే వేళను బాండుశోభ • యెనయే నాకున్
వావిరిఁ గీర్త్యంగన యని
శ్రీ వెలయు నృసింహు నొద్దఁ • జిరతరలీలన్. 135

టీ॥ తనమేలు=తనవిభవము; ఈవికొలందంతె= ఈవి ప్రమాణ మెంతో అంతమాత్రమేయనుట. ఏవేళను బాండుశోభ=ఎల్లపుడుపాం శోభయనురోగముగలదు, తెల్లనిదనుట. కీర్త్యంగన=కీర్తికాంత; వావిరిన్ = ఉత్కర్షమునందు; ఎనయేనాకున్=నాకుసరియౌనా? అని=ఇట్లని; శ్రీ=లక్ష్మి; నృసింహునొద్దన్=నరసభూపాలునిసన్నిధియందు; చిరతరలీలన్ = బహుకాలపువిలాసముతో; వెలయున్=ప్రకాశించును.

ఇందు శ్రీదేవి కీర్తికాంతమేలు సహింపఁజాలక "దానిమేలు ఈవియంతె దాని శరీర మెపుడును బాండుశోభ యనుజాడ్యము గలది." యనునట్లు చెప్పుటవలన నసూయ యగును.

ఆధ్యానమునకు నుదాహరణము.

క. సతి చెక్కుటఁ జెయి సేర్పఁగ
నతులకరాంగుళులు సాంజ • నాశ్రుయుతములై
రతిపతి బాసట మించిన
శితపంచశరమ్ము లనఁగఁ • జెలఁగు నృసింహా. 136

టీ॥ నృసింహా=నరసభూపాలుఁడా! సతి... చేర్పఁగన్=నాయిక చెక్కుటఁజెయియుంచఁగా; అతులకరాంగుళులు= సాటిలేనివగుచేతివేళ్ళు; సాంజనాశ్రుయుతములై =కాటుకతోఁగూడినకన్నీరుతోఁగూడినవై; రతి...అనఁగన్=మన్మథుని సహాయములై యతిశయించినతీక్ష్ణము

లగుపంచబాణములో యనునట్లు; చెలఁగుక్ = ప్రకాశించును. ఇందు నాయిక చెక్కిటఁ జెయినేర్చి చింతించునట్లు చెప్పినందున నాధ్యానం బగును.

ఉన్మాదాపస్మృతులకు లక్షణములు.

క. అనయంబుఁ జేతనాచే
తనసదృశమనోభ్రమంబు ధర నున్మాదం
బనఁ బొల్చు ధాతుచలనము
దనర నపస్మార మనఁగఁ దగు నెట్లన్నన్. 137

టీ॥ అనయంబుక్ = ఎల్లప్పుడును; చేతన...భ్రమంబు = ప్రాణులయందును అప్రాణులయందును సమానమైనచిత్తభ్రాంతి; ధరక్ = భూమియందు; ఉన్మాదంబనఁబొల్చుక్ = ఉన్మాదమనఁదగును. ధాతుచలనము = వాతపిత్తశ్లేష్మధాతువులయొక్క చాంచల్యము; తనరక్ = ఒప్పునట్లుగా; అపస్మారమనఁగఁదగుక్ = అపస్మారమనుసంచారియగును. ఎట్లన్నన్.

ప్రతాపరుద్రీయమునందు “శ్లో॥ ఆవేశో మోహదుఃఖాద్యైరపస్మారోఙ్గతాపకృత్” అనియు, తద్వ్యాఖ్యయందు “అశుచిత్వధాతువైషమ్య భూతావేశాదిజన్యో భూపాతభ్రమణభుజాస్ఫోటవికటోక్తిలాలాఫేనాద్యనుభావఆవేశోపస్మారఇత్యర్థః” అనియు, రసతరంగిణియందు “గ్రహాద్యావేశోఽపస్మారః, తత్రవిభావాః అపవిత్ర్యశూన్యస్థితిధాతువైషమ్యోత్కటదుఃఖభయాదయః, అనుభావాః కమ్పఫేననిశ్వాసభూపాతవిపర్యాసజిహ్వాలోలనాదయః” అనియు, నపస్మారమునకు ధాతువైషమ్యము హేతువుగాఁ జెప్పఁబడినది గాని యాధాతువైషమ్యమే యపస్మార మని చెప్పఁబడలేదు. ఇట్లుండ నిందు ధాతుచలనమే యపస్మారముగఁ జెప్పుట తప్పుగాఁ దోఁచుచున్నయది.

ఉన్మాదమున కుదాహరణము.

క. నినుఁ బ్రార్థించెద భ్రమరమ
చని నరసింహేంద్రుఁ దెమ్ము ♦ చన వల దోహో
చనిన నృపాలుముఖాంబుజ
ఘనవాసనఁ దగిలి నీవు ♦ గ్రమ్మవు గదా. 138

టీ॥ భ్రమరమ = ఓభృంగమా! నినున్ = నిన్ను; ప్రార్థించెదన్ = వేఁడెద. చని = పోయి; నరసింహేంద్రున్ = నరసభూపాలుని; తెమ్ము = తీసికొనిరమ్ము. ఓహో చనవలదు = తెలిసెను! పోవలదు. చనినన్ = పోయినయెడ; నృపాలు...తగిలి = ఆరాజుముఖపద్మవాసన యందాసక్తమవై; నీవుగ్రమ్మవుగదా = నీవుమరలిరావుగదా!

ఇందుఁ జేతనాచేతనసదృశచిత్తభ్రమ మున్మాద మనులక్షణము నకును, జేతన మగుభృంగమందు సంభాషణాదివ్యవహారము జరిగించి నట్లు చెప్పినలక్ష్యమునకును, సమన్వయంబు దూరంబై యున్నది. ప్రతాపరుద్రీయములో, "శ్లో॥ ఉన్మాద స్తుల్యవృత్తిత్వం చేతనాచేతనేష్వపి" అనులక్షణమునకు సరియగునట్లు, "శ్లో॥ ప్రతాపరుద్రస్య జయప్రయాణభేరీధ్వనౌ మూర్ఛతి దిఙ్ముఖేషు। త్రాసాకులా భ్రాన్తి ముపేత్య వృక్షాన్ పృచ్ఛన్తి మార్గం ప్రతిభూమిపాలాః॥" అని యచేతనము లగు వృక్షములను మార్గ మడిగినట్లు వ్రాయఁబడినది. అదియే యుక్తము.

అపస్మారమున కుదాహరణము.

క. మదనగ్రహంబు సోఁకెను
ముదితవలె దీర్ఘదృష్టిఁ ♦ జూచెదుఁ జెలులన్
[illegible] రక్షఁ గట్టుఁడు
మదవతికి నృసింహసాహసు ♦ మంత్రమునకతనన్ 139

టీ॥ మదనగ్రహంబు=మన్మథుఁడను గ్రహము; సోఁకెను=ఆవేశించెను. సుదతీమణి= స్త్రీరత్నము ; చెలులన్ = సఖులను ; దీర్ఘదృష్టిన్=నిడివిచూపులచేత; చూచెడున్ = చూచుచున్నది. ముదమొదవన్=సంతోషమగునట్లు; నరసింహనామమంత్రముకతనన్= నరసభూపాలునినామాక్షరమంత్రముచేత; రక్షఁగట్టుఁడు = రక్షరేకుబంధింపుఁడు. ఇందు దీర్ఘదృష్టిఁ జూచుటచే నపస్మార మగును.

క. ఇరవుగ నీభావంబులు
పరఁగెడు ననుభావములు విభావములు న
న్యరసంబులకుం గల వవి
విరచింపఁగ నొల్ల నిందు విస్తరభీతిన్. 140

టీ॥ ఈభావంబులు= ఈముప్పదిమూఁడుసంచారిభావములు; పరఁగెడుననుభావములువిభావములున్=ఒప్పుచున్నయనుభావములునువిభావములును; అన్యరసంబులకున్=శృంగారేతరములగుహాస్యకరుణరౌద్రవీరభయానకబీభత్సాద్భుతశాంతరసములకును; ఇరవుగన్= స్థిరముగ; కలవు=కలిగియున్నవి. అవి= ఇతరరసములకుఁ గలసంచారిభావతదనుభావాదులు. విస్తరభీతిన్ = గ్రంథమువిస్తరిల్లుననుభీతిచే; ఇందున్=ఈగ్రంథమునందు; విరచింపఁగన్=నిరూపించుటకు ; ఒల్లన్=ఇచ్ఛయింపను. శృంగారాదినవరసములకును దత్తద్రసానుగుణములగు సంచారిభావములు గలవు, ఆసంచారులకు వేఱువేఱుగ విభావములు అనఁగాఁ గారణములు అనుభావములు అనఁగా గార్యములు గలిగియున్నవి. వానిలో శృంగారమునకు మాత్రము సంబంధించునవి చెప్పుటకే యింత గ్రంథ మాయెను. నిఁక నన్నిటికిఁ జెప్పునెడ గ్రంథము మిక్కిలి విస్తరిల్లు నని విరమించితి నని తాత్పర్యము.

కవిప్రతిజ్ఞావాక్యము.

తే. ఇంక శృంగారచేష్టల ♦ నేర్పరింతు
నవియు నష్టాదశాఖ్యలై ♦ యలరుచుండు
లలితగతి వీనినామము ♦ ల్లక్షణములు
క్రమముతోఁ దెల్పి వీనిల ♦ క్ష్యము లొనర్తు. 141

టీ॥ ఇంకన్=ఇఁకమీఁద; శృంగారచేష్టల నేర్పరింతున్= శృంగారచేష్టలను జెప్పెదను. అవియున్=ఆచేష్టలును; అష్టాదశాఖ్యలై యలరుచుండున్=పదునెన్మిది పేళ్లుగలవియై యొప్పుచుండును. వీనినామముల్= వీనియొక్క పేరులను; లక్షణములు = లక్షణములను; క్రమముతోన్= వరుసతో; లలితగతిన్=సుందరమైనవిధముచేత; తెల్పి = తెలియఁజెప్పి; వీనిలక్ష్యములొనర్తున్=వీనియుదాహరణముల రచియింతును.

వీనినామక్రమంబును భావలక్షణంబును.

క. ఇల భావహావహేలా
విలాసమాధుర్యధైర్య ♦ విభ్రమలీలా
కిలికించితమోట్టాయిత
లలితాదులు చేష్ట లగుఁ ద♦లంపఁగ మఱియున్. 142

తే. వెలయు బిబ్బోకవిచ్ఛిత్తి ♦ విహృతచకిత
హసితకుట్టమితకుతూహ ♦ లాదు లనఁగఁ
గలవు మఱి యందు భావంబు ♦ వెలయుచుండు
మహి రసజ్ఞానయోగ్యతా ♦ మాత్ర మగుచు. 143

టీ॥ ఇలన్=భూమియందు; భావ...ఆదులు=భావము హావము హేల విలాసము మాధుర్యము ధైర్యము విభ్రమము లీల కిలికించితము మోట్టాయితము లలితము మొదలయినవి; తలంపఁగన్=విచారిం

పఁగా; చేష్టలగుక్=శృంగారచేష్టలగును. మఱియుక్ = వెండియును; వె యుబిబ్బోక...ఆసులు= వెలయుచున్నబిబ్బోకము విచ్ఛిత్తి విహృతము చకితము హసితము కుట్టమితము కుతూహలము మొదలగునవి; అనఁగక్=అనంగా; కలవు=ఉన్నవి. మఱి=మఱియును; అందుక్=ఆ చేష్టలయందు; భావంబు=భావమనునది; రస...అగుచుక్= రసముదెలియుటకు యోగ్యమగుటమాత్రమగుచు; మహిక్ = భూమియందు; వెలయుక్=ప్రకాశించును.

హావహేలలకు లక్షణములు.

క. అది యీషదవ్యక్తము గా
సుదతులయెడ హావ మయ్యె ♦ సువ్యక్తంబై
పొదలిన ననవరతంబును
నది మిక్కిలి హేల యయ్యె ♦ నది యెట్లన్నక్. 144

టీ॥ అది=ఆభావము; ఈషదవ్యక్తముగాక్= అంగవికారాదులచేఁ గొంచెముబయల్పడినదికాఁగా; సుదతులయెడక్ = స్త్రీలయందు; హావమయ్యెక్=హావమనునదియాయెను. అది=ఆహావము; అనవరతంబును = ఎల్లప్పుడును; సువ్యక్తంబై పొదలినక్=అతిస్పష్టవికారమైనొప్పఁగా; హేలయయ్యెక్=హేలయనునదియాయెను. అదియెట్లన్నక్.

భావమున కుదాహరణము.

చ. వరుఁ డని పేర్కొన న్నిరము ♦ వాంచుఁ దలోదరి సాలభంజికా
పరిణయవేళ నెచ్చెలులఁ ♦ బాయక యెప్పటియట్ల కేళికాం
తర మొనరింపఁ బోదు చనెనా యెదఁ బయ్యెదఁ జేర్చి సిగ్గునం
బరఁగుఁ బ్రియాంగనానుకృతి ♦ భావన కేలికిఁ గాఁగ నిచ్చలుక్.

టీ॥ తలోదరి=వనిత; వరుఁడనిపేర్కొనక్=మగండని పేరుచెప్పఁ

గా; శిరమువాంచుక్ = తలవంచుకొనును. సాలభంజికాపరిణయవేళన్ = బొమ్మల పెండ్లిసమయమునందు; నెచ్చెలులఁబాయక = ప్రియసఖులనువదలక, వారితోఁగూడననుట; ఎప్పటి...పోదు = పూర్వమట్లుమఱిగొంక క్రీడసల్పంజనదు. చనెనా = చనినయెడ;ఎదఁబయ్యెదఁజేర్చి=అమ్మిమీఁదఁబైఁటఁజేర్చి;నిచ్చలుక్=ఎల్లప్పుడు; ప్రియాంగనా...గాఁగన్=ప్రియురాండ్రగుస్త్రీల ననుకరించుటను భావించుట క్రీడకుఁగాఁగా; సిగ్గునంబరఁగుక్=లజ్జతోనొప్పును.

ఇందు "శిరమువాంచు, ఎదఁబయ్యెదఁజేర్చు" నిత్యాదులు "అదియీషద్వ్యక్తముగా" ననులక్షణముతో సమన్వయంబున కనువై హావోదాహరణముగ దీనిం జేయుచున్నవి. "శ్లో॥ కురఙ్గీవాఙ్గాని స్తిమితయతి గీతిధ్వనిషు య త్సఖీం కాన్తోదన్తం శ్రుత మపి పునః పృచ్ఛతి యత్ । అనిద్రం యచ్చాన్త స్స్వపితి త దహో వే ద్మ్యభినవాం ప్రవృత్తోఽ స్యా స్సేక్తుం హృది మనసిజః ప్రేమలతికామ్॥" అనునది యుక్తోదాహరణంబుగాఁ దోఁచెడిని.

మఱియు, ఇందు "ఒనరింపఁబోదు చనెనా" యనుచోటఁ గ్రమభంగ మనుకావ్యదోషము దోఁచుచున్నది. "శ్లో॥ నాథే నిశాయా నియతే ర్నియోగా ద స్తంగతే హన్త నిశాపి యాతా" అను శ్లోకమునందుఁ గావ్యప్రకాశమునఁ గ్రమభంగము భావించి "అ స్తంగతే హన్త గతా నిశాపి" అనుపాఠము కల్పించుట యుక్త మని వ్రాయఁబడినది. ఇచట "పోదుపోయెనా" యనుట యనుకూలింపక పోయినను యథోచితముగ సుధీమణు లాలోచింపఁ దగును.

హావోదాహరణము.

చ. పడఁతి నృసింహుగీతములు ♦ పాడెడువేళ నృసింహునామము
న్నుడువదు సిగ్గుతో గుహజ♦ను ల్నగనాథు గుణప్రశంస లే

ర్పడ నొనరించుచో నుచిత ♦ భక్తిమెయి న్గురుసేవ సేయుకై
వడి వడి నాలకించుఁ దల♦వాంచుఁ బరాకగుఁ గొంత వింతగన్.

టీ॥ పడఁతి=ఒకస్త్రీ; నృసింహు...వేళన్=నరసభూపాలునిగీతములు పాడునపుడు; సిగ్గుతోన్ = లజ్జతో; నృసింహునామమున్నుడువదు=నరసభూపాలునిపేరుచెప్పదు. గురుజనుల్=పెద్దవారలు; నర...చోన్= నరసభూపాలునిగుణప్రశంసలనువివరించిచేయునపుడు; ఉచితభక్తిమెయిన్ = ఉచితమగుభక్తిచేత; గురుసేవసేయుకైవడిన్=గురుసేవసేయుభంగి; వడిన్= వేగముగ; ఆలకించున్ = వినును. తలవాంచున్=శిరమువంచును. వింతగాన్ = చోద్యమగునట్లుగా; కొంతపరాకగున్=కొంచెముపరాకుపడును.

ఇందు, వికారంబులు సువ్యక్తంబులుగాఁ జెప్పఁబడుటవలన, నిది హేలకుదాహరణం బనఁదగియున్నది. "శ్లో॥ అనాకూతై రేవ ప్రియసహచరీణాం శిశుతయా వచోభిః పాఞ్చాలీమిథున మధునా సంఘటయితుమ్। ఉపాదత్తే నోవా విరమతి నవా కేవల మియం కపోలౌ కల్యాణీ పులకముకుళై ర్దన్తురయతి॥" అని మురారినాటకమందు సీతావిషయమై చెప్పినపద్యము యుక్తమైనయుదాహరణముగా నున్నది. ప్రతాపరుద్రీయములో "శ్లో॥ రసాభిజ్ఞానయోగ్యత్వంభావఇత్యభిధీయతే। ఈషద్దృష్టవికారస్తుభావోహావఃప్రకీర్తితః" అనిలక్షణములుచెప్పి "శ్లో॥ పద్రసనశేషస్య గుణాన్ గాయతి బాలత్వే విస్రబ్ధమ్। లజ్జతే వరపులకితో యువతిజనో యౌవనే గాతుమ్॥" అనుభావలక్ష్యములో "వరపులకితః" అనిపులకలువర్ణింపఁబడెను. పులకలు వికారరూపములు గనుక వాని భావలక్ష్యములో వర్ణించుటయె యుక్తము గాదని తోఁచుటంజేసి, దీనివదలి పై యుదాహరణములు వ్రాయఁబడెను.

హేల కుదాహరణము.

ఉ. మేలము లాడుచుం గడు స♦మేలములై చెలు లెల్లఁ గూడి యో
బాలిక శ్రీనృసింహనర♦పాలు వరించెదవే య టన్న నీ
లాలక యంగవల్లిఁ బుల♦కాంకురము ల్నన లొత్తె నే మనం
జాలక యూరకుండె నని♦శంబు త్రపావృత యైన కైవడిన్. 147

టీ॥ మేలములాడుచున్=పరిహాసములాడుచు; కడున్సమేలము లై=మిక్కిలియొద్దికగలవారై; చెలులెల్లఁగూడి=సఖులందఱుచేరి; ఓ బాలిక=ఓచిన్నదానా! శ్రీనృసింహనరపాలున్ = శ్రీమంతుఁడైన నసరిస భూపాలుని; వరించెదవే = వలచెదవా? అటన్నన్ = అనియడుగఁగా; నీలాలక=నల్లనికురులుగల స్త్రీ; అంగవల్లిన్ = తీఁగవంటిమేనియందు; పులకాంకురముల్ననలొత్తెన్ = పులకలమొలకలుమొలవఁగా; అనిశంబు=ఎల్లపుడు; త్రపావృతయైనకైవడిన్ = సిగ్గుచేనావృతయైనదానివలె; ఏమనంజాలకయూరకుండెన్= ఏమియుననఁజాలకమిన్నకుండెను. ఇందు భావము మిక్కిలి వ్యక్తము లైనవికారములు గలదిగా వర్ణింపఁబడినందున హేలయగును. ఇచటఁ ద్రపావృతయై యూరకుండఁగాఁ "ద్రపావృతయైనకైవడిన్" అనుట యుక్తముగాఁ దోఁచదు.

విలాసమాధుర్యములకు లక్షణములు.

క. పతిఁ గనఁ దాత్కాలిక మగు
నతులవికారము విలాస♦ మగు సౌమ్యులు లే
కతిరమ్యత్వము దలఁపఁగ
నతివలకు న్మధురభావ♦ మగు నెట్లన్నన్. 148

టీ॥ పతిన్=భర్తను; కనన్=చూడఁగా; తాత్కాలికమగునతులవికారము=తత్కాలమందుదయించిన ఘనోజ్జ్వలమైనవికారము; విలా

సనుగుఁ=విలాసమనునదియగును. అతివలకుఁ= స్త్రీలకు; సొమ్ములులేక అతిరిచిత్వము=ఆభరణములులేకున్నను అతిమనోహరత్వము; తలఁపఁగ=భావింపఁగా; మధురభావముగుఁ=మాధుర్యమగును. ఎట్లన్నన్.

విలాసమున కుదాహరణము.

క. ఇరుగడల వెడలి సుడిగొని
తరళములై వెలికి బెళికి ♦ తళతళ మనుచున్
బరఁగురువారపుఁజూపుల
హరిణాక్షి నృసింహవిభుని ♦ కారతి సేసెన్. 149

టీ॥ ఇరుగడలన్=ఇరుప్రక్కలను; వెడలి = బయలుదేఱి; సుడిగొని = సుడివడి ; తరళములై = చంచలములై ; వెలికిన్...చూపులన్= బయటికిప్రకాశించి తళతళమనిమెఱుపుచున్నవిలాసవిశేషముగల దృష్టులచే; హరిణాక్షి = హరిణనేత్ర ; నృసింహవిభునికిన్=నరసభూపాలునికి; ఆరతిసేసెన్=ఆరతిచ్చెను. ఇందు రువారపుఁజూపు లనుచో నుదారపుఁజూపు లని పాఠాంతరము గలదు. తత్పక్షమునం దుదారము లైనచూపులచేత నని యర్థము. ఇందు నాయిక నృసింహవిభునిఁ జూచునపు డనేకము లైనప్రకారములు దృష్టులయందుఁగల్గినట్లు వర్ణించినందున విలాస మనుశృంగారచేష్ట యగును.

మాధుర్యమున కుదాహరణము.

చ. కనుఁగవ కెంపు సాంద్రనఖ ♦ గౌరతయుం జెలువొందు నొక్కయుం
గన రతివేగశీర్ణమణి ♦ కంకణనూపురహారవల్లియై
మునుపటికన్నఁ బొల్పుగను♦ముజ్జ్వలతం దగెఁ బొందుపత్త్రియై
కొనల నిగిడ్చి యున్నయతి ♦ కోమలవల్లి మతల్లి యో యనన్. 150

టీ॥ కనుఁగవకెంపు=నేత్రయుగ్మముయొక్క యెఱ్ఱఁదనము; సార్ద్రనఖశారతయున్= ఆర్ద్రములైనగోళ్ళపచ్చఁదనమును; చెలువొందు నొక్కయంగన= ఒప్పుచున్నయొకస్త్రీ; రతి...నై=సురతవేగముచేత జాఱినమణికంకణములును గజ్జెలునులతలవంటిముక్తాహారములునుకలదై; పాండుపత్త్రినై=పచ్చనియాకులుగలదై; కొనలన్...అనన్=కొనలయందుఁజిగిర్చినట్టికోమలమైన మంచిలతయోయనునట్లు; మునుపటి...తగెన్=ముందున్నదానికిన్ననధికమైన ప్రకాశముచేత నొప్పెను. ఇంపు నాయిక సొమ్ములులేకపోయినను నతిరమ్యయై నట్లు చెప్పినందున మాధుర్య మగును,

ధైర్యవిభ్రమలీలలకు లక్షణములు.

క. కులశీలాద్యవిలంఘన
మిల ధైర్యం బొడలఁ దొడవు ♦ లిడఁ దడఁబడినన్
వెలయఁగ విభ్రమ మధిపుని
యలఘుగుణానుకృతి లీల ♦ యగు నెట్లన్నన్. 151

టీ॥ ఇలన్=భూమియందు; కులశీలాద్యవిలంఘనము = కులము నుంచినడవడి మొదలగువానివదలకునికి ; ధైర్యంబు=ధైర్యమనఁబడును. ఒడలన్=శరీరమందు; తొడవులిడఁదడఁబడినన్=సొమ్ములుంచునపుడు దొట్రుపాటునొందినయెడ ; వెలయఁగన్=ప్రకాశించునట్లు ; విభ్రమము= విభ్రమమనఁదగును. అధిపునియలఘుగుణానుకృతి = ప్రియుని యుత్కృష్టగుణములయనుకరణము; లీలఅగున్=లీలయనునదియగును. ఎట్లన్నన్.

ధైర్యమున కుదాహరణము.

మ. అతులైశ్వర్యసమగ్రుఁ డైననరసిం♦హాధీశ్వరుం డేడ నీ

పితృవాచాపరతంత్రతన్ బ్రవతతతిం ♦ జెంపొందు నేనేడ నా
క్షితిపాలాగ్రణిపైఁ బ్రసక్తముగ నా♦చిత్తంబు సంధించినాఁ
డతనుం డక్కరొ నేఁటనుండి విషమా♦స్త్రాభిఖ్యుఁ డౌ నెంతయున్.

టీ॥ అతులైశ్వర్యసమగ్రుఁడు = సాటిలేనివిభవముచేత సంపూర్ణుఁడు; ఐననరసింహాధీశ్వరుండు = ఐనరసభూపాలుండు; ఏడన్ = ఎక్కడ? ఈపితృ...ఏడన్ = ఈతండ్రిమాటకువశపడి వ్రతసమూహముచే తఁజెలంగునేనెక్కడ? అక్కరో = ఓయక్కా! అతనుండు = మదనుఁడు; నాచిత్తంబు = నామనస్సును; ఆక్షితిపాలాగ్రణిపైఁబ్రసక్తముగన్ = ఆ రాజశ్రేష్ఠునిపైఁబ్రవర్తించునట్లుగా; సంధించినాఁడు = కూర్చినాఁడు. నేఁటనుండి=నేఁడు మొదలుకొని; ఎంతయున్=మిక్కిలి; విషమాస్త్రాభిఖ్యుఁడౌన్=విషమాస్త్రుఁడనునామముగలవాఁడగును. ఇందు, నాయిక "నరసభూపాలునికి నాకు నింత తారతమ్యముండఁగా నతనుండు వానియందు నామనంబు సంధించినాఁడు కావున నేఁటనుండి విషమాస్త్రాభిఖ్యుఁడౌ" నని చెప్పినందునఁ, దన కెన్ని బాధలు గలిగినను వానిఁ జేరుతలంపు లేన ట్లభిప్రాయ మగుటచేఁ గులశీలాదితత్పరత వ్యక్త మగుచున్నది గాన నిది ధైర్య మగును.

విభ్రమమున కుదాహరణము.

చ. అదన నృసింహభూమిరమ♦ణాగ్రణి వచ్చినసంభ్రమంబుతో
సుదతి నభోవలగ్నమునఁ ♦ జుక్కలపేరిటికంఠమాలయుం
బొదలుకుచాచలంబుల స♦ముజ్జ్వలమేఖలయున్ ధరింపఁగా
నది క్రమ మయ్యెఁ దొయ్యలికి ♦ నక్రమ మయ్యె విలాసవైఖరిన్.

టీ॥ అదనన్ = ఉచితసమయమందు; నృసింహ...సంభ్రమంబుతోన్=నరసభూపాలుండువచ్చినసంబ్రమముతో; సుదతి = స్త్రీ; నభోవ

లగ్నమునకా = ఆకాశతుల్యనగుమధ్యమందు; [illegible] లయుకా = నక్షత్రమాలయనుసంఖ్యమాలయును; "సైవ [illegible] స్తసంఖ్యతిమూర్తికా" అని యమరము, గాన [illegible] ముక్తము లు గలదండ నక్షత్రమాల యనఁబడును. [illegible]లు...మేఖలయుకా = ఒప్పుచుండెడుకుచగిరులయందుఁ బ్రకాశించుచున్న గొడ్డాణమును ; ధరింపఁగాఁ = ఉంచుకొనఁగా, అది= ఆయుంచుకొనుట; త్రోయ్యాలికిక్ = స్త్రీకి; క్రమము వ్యేకా = యుక్తమా యెను. విలాసవైఖరిక్ = విలాస రీతిచేత; అక్రమమ య్యెకా=అయుక్తమా యెను. అనఁగా, ఆకాశమం దు నక్షత్రమాలయు గిరులయందు మేఖలయునఁగా నితంబభూమియు నుంచుట యుక్తము, విలాసరీతిచేత స్థానోచితభూషణములుగానింజేసి యయుక్త మయ్యెననుట. ఇందు విభ్రమము స్పష్టము.

లీల కుదాహరణము.

చ. ధర నకలంకభావమునఁ ♦ దామరసాహితునిక్ జయించు నా
హరిపదసక్తమై వెలుఁగు ♦ నారయఁ బ్రాజ్ఞులకు న్వసుంధరా
సురతరునూతనాభ్యుదయ ♦ శోభ యొనర్చు యశఃపురంధ్రి యా
వరుఁ డగుశ్రీనృసింహుగుణ ♦ వాసనఁ దానుఁ జెలంగుకై వడిక్.

టీ॥ యశఃపురంధ్రి=కీర్తికాంత; వరుఁడగు...కైవడిక్=భర్త యగునరసభూపాలునిగుణభావనచేతఁ దానున ట్లేయొప్పుచున్నదో అను నట్లు; ధరక్ = భూమియందు ; అకలంకభావమునక్ = నిష్కలంక వృత్తిచేత; తామరసాహితునిక్ జయించుక్ =చంద్రునిగెలుచును. ఆ= ఆ శ్చర్యము ! హరిపదసక్తమై= ఆకాశముతో సంబంధించినదై , రాజపక్ష మందు, విష్ణుమూర్తిపాదాసక్తమై; వెలుఁగుక్ = ప్రకాశించును. ఆర యక్ =విచారింపఁగా; ప్రాజ్ఞులకుక్ =విబుధులకు ; సుర...ఒనర్చుక్ =క ల్పవృక్షముయొక్కనవీనోదయశోభను జేయును, కోరినకోర్కులొసంగు

నని రాజపక్షమందు, సురతరువువలెఁ దెల్లనైన దని యశఃపక్షమునం దుఁ దెలియవలయును. ఇందు యశఃకాంత తనప్రియుఁ డగునరసభూపాలునియొక్క గొప్పనైనగుణముల ననుకరించినట్లు చెప్పినందున లీల యగును.

ప్రతాపరుద్రీయములో "శ్లో॥ ప్రియానుకరణం లీలా వాగ్భిర్గత్యాఽథ చేష్టితైః" అనియు, రసతరంగిణ్యాదులలో "ప్రియభూషణవచనాద్యనుకృతి ర్లీలా" అనియు, నున్నందున దేనిచేతనైనను బ్రియానుకరణము లీల యని వ్యక్తమగుఁ గాన, గుణానుకృతి మాత్రమె లీల యని భావింప రాదు.

కిలికించితమోట్టాయితంబుల లక్షణంబులు.

క. అళు కలుక ముదము నశ్రువు
గలిసినఁ గిలికించితంబు ♦ గడు నిష్టకథా
దుల నింగిత మెఱిఁగించుట
దలఁపఁగ మోట్టాయితంబు ♦ దగు నెట్లన్నన్. 155

టీ॥ అళుకు...కలిసినన్ = భయమును కోపమును సంతోషమును కన్నీరును జేరఁగా; కిలికించితంబు = కిలికించితంబనుచేష్టయగును. "శ్లో॥ రోషాశ్రుహర్షభీత్యాదే స్సంకరః కిలికిఞ్చితమ్" అని ప్రతాపరుద్రీయము. కడున్ = మిక్కిలి; ఇష్టకథాదులన్ = ప్రియవస్తుప్రసంగాదులయందు; ఇంగితమెఱిఁగించుట = తనయభిప్రాయమును దెలుపుట ; తలఁపఁగన్ = విచారింపఁగా; మోట్టాయితంబుదగున్ = మోట్టాయితంబననొప్పును. ఎట్లన్నన్.

కిలికించితంబున కుదాహరణము.

చ. పతి రచితాగసుం డటరి ♦ పాటున వచ్చి దృఢోపగూహనా

స్థితి నధరప్రవాళము గ్ర♦సింప ససంభ్రమలోలహస్తయై
మతకరి చాలుఁ జాలు నిఁక ♦ మాదెస రాకు మటంచు నల్కతోఁ
నతివ బొమ ల్ముడించె నయ♦నాంబువు ఱెప్పల నప్పళించుచున్.

టీ॥ రచితాగసుండు=అపరాధియైన; పతి=ప్రియుండు; అదిరిపాటునవచ్చి=అకస్మాత్తుగావచ్చి; దృఢోపగూహనస్థితిన్=గాఢాలింగనస్థితిచేత; అధరప్రవాళముగ్రసింపన్= పవడమువంటివాతెరనానఁగా; అతివ=స్త్రీ; ససంభ్రమలోలహస్తయై=సంబరముతోఁగూడుకొన్నట్టుగాఁజలించుచున్న చేతులుగలదై, మతకరి=వంచకుఁడా! చాలుఁజాలును. ఇఁకన్= ఇఁకమీఁద; మాదెసరాకుమటంచున్ = మాయొద్దకు రాకు మని పలుకుచు; అల్కతోన్ = కోపముతో; నయన...అప్పళించుచున్=కన్నీరుఱెప్పలచేఁదుడుచుచు; బొమల్ముడించెన్=కనుబొమ్మలుముడిపెట్టెను. ఇందు నతివకు నశ్రువు నలుకయు మొదలగునవి చెప్పినందునఁ గిలికించితం బనఁ దగును.

మోట్టాయితంబున కుదాహరణము.

చ. చెలులు నృసింహుగీతములు ♦ చేరికగా నపరంజిపీటలో
పలఁ బలికింప నూర్చుచును ♦ బాలిక యూర్పులచేత దీపికా
కలిక చలింప నెచ్చెలులు ♦ గంటిరె మీ మృదుగానలక్ష్మికిం
దెలియఁగ మెచ్చుచున్నయది ♦ దీపమ యంచు హసించు నంతయున్.

టీ॥ చెలులు=సఖులు; చేరికగాన్=కూడికగా; అపరంజిపీటలోపలన్ = బంగరుపీటలోపల; నృసింహుగీతములు = నరసభూపాలునిపైపాటలను; పలికింపన్=వాయింపఁగా; బాలిక=చిన్నది; ఊర్చుచును= ఊర్పులువిడుచుచు; ఊర్పులచేన్; దీపికాకలిక= మొగ్గవంటిదీపము; చలింపన్=కదలఁగా; నెచ్చెలులు=ప్రియసఖులారా! తెలియఁగన్= పరి

శీలింపఁగా ; మీమృదుగానలక్ష్మికిన్ = మీకోమలమైన గానసంపదకు; దీవిచు = దీపము; మెచ్చుచున్నయది = శ్లాఘించుచున్నయది. అంచున్=ఇటనుచు; ఎంతయున్=మిక్కిలి; హసించున్=నవ్వును.

ఇందు నాయిక యిష్టుఁడైన నరసభూపాలునియొక్క గీతాలాపప్రస్తావమునందు హర్షాదులచేతఁ దనయభిప్రాయము సూచించుటవలన మోట్టాయితం బగును.

లలితవిచ్ఛిత్తులకు లక్షణములు.

క. భాసురతనువల్లీవి
న్యాసము లలితమ్ము సొమ్ము ♦ లల్పము లయ్యున్
భాసిల్లెడుశృంగారవి
కాసము విచ్ఛిత్తి యయ్యెఁ ♦ గన నెట్లన్నన్. 158

టీ॥ భాసురతనువల్లీవిన్యాసము= మనోహరమగునట్లవయవములయొక్కయుంచుట; లలితమ్ము = లలితమనఁబడును. సొమ్ములల్పములయ్యున్ = భూషణములుకొంచెములయ్యును; భాసిల్లెడుశృంగారవికాసము=ప్రకాశించుసౌందర్యాతిశయము; కనన్= చూడఁగా; విచ్ఛిత్తియయ్యెన్ = విచ్ఛిత్తియనునదియాయెను. అదియెట్లన్నన్. ఇచట "తనువల్లీవిన్యాస" మనుచోఁ దనుశబ్దమువయవబోధకమైనను, "శ్లో॥ సుకుమారాఙ్గవిన్యాసో లలితం పరికీర్తితమ్" అని ప్రతాపరుద్రీయములో నవయవవిన్యాసము లలిత మని చెప్పఁబడుటవలన నవయవములయొక్కయుంచుట యని యర్థము వ్రాయఁబడెను.

లలితమున కుదాహరణము.

చ. వడియుఁ గ్రమంబుతోడిభుజ♦వల్లి మృదంగముమీఁదఁ జేర్చి కీ
లెడలిననూపురంబు ఘటి♦యింపఁగ దూలికరారవిందమం

డగు గిడి కంపిత స్తనరయంబున నూర్పర దోఁప నింతి యు
ద్వ్యేశ నటియించి నిల్చె సభ యెల్ల ననంగునిపాలు సేయుచుఁన్.

టీ॥ ఇంతి = స్త్రీ; వడియుశ్రమంబుతోడిభుజవల్లి = స్రవించుచున్నట్టి స్వేదముతోఁ గూడిన బాహువులతను; మృదంగముమీఁదఁజేర్చి = మద్దెలపై నుంచి; కీలెడలిననూపురంబు = కీలువదిలినగజ్జెను; ఘటియింపఁగన్ = కూర్చుటకు; దూతి... ఇడి = దూతి యొక్క కరకమలమందుఁబాదమునుంచి; ఇటఁ గరారవిందమునం దనుచోఁ గరంబునం దనియు, అదు గనుచోఁ బాదారవిందము ననియుఁ బ్రయోగించునెడ రమణీయంబు గుండు నని దోఁచెడి. కంపితస్తనరయంబునన్ = కదలుచున్న చన్నులవేగమువలన; ఊర్పరదోఁపన్ = నిశ్వాసము తెలియవచ్చుచుండఁగా; అద్వ్యేశన్ = అసమయమందు; సభయెల్లన్ = సభనంతయు; అనంగునిపాలుచేయుచున్ = కామపరవశము గాఁజేయుచు; నటియించినిల్చెన్ = నాట్యముచేసినిల్చెను. ఇందు నాయిక భుజలతను మృదంగముమీఁదను, పాదమును దూతీహస్తమునందును, మనోహరముగా నుంచినందున సుకుమారాంగవిన్యాసరూప మగులలిత మను శృంగారచేష్ట యగును.

సింగభూపాలీయములో "శ్రమో మానస ఖేదస్స్యాదధ్వనృత్తరతాదిభిః" అను శ్రమలక్షణమునందు నృత్తశ్రమమున కుదాహరణముగాఁ జెప్పఁబడిన "శ్లో॥ స్వేదక్లేదితకఙ్కణాం భుజలతాం కృత్వా మృదఙ్గాశ్రయాం చేటీహస్తసమర్పితైకచరణా మఞ్జీరసంధిత్సయా। సా భూయః స్తనకమ్పసూచితరయం నిశ్వాసమాముఞ్చతీ రఙ్గస్థాన మనఙ్గసాత్కృతవతీ తాళావధౌ తస్థుషీ॥" అనుశ్లోకమున కీపద్యము భాషాంముగ నున్నదనియు, నం దున్న స్వేదపదంబునకు బదులుగా నిందు శ్రమ

పదంబుఁ బ్రయోగించుట యుక్తము గా దనియుఁ, బూర్వమే వ్రాయఁ బడెను. "ఎడియుఁగ్రమహాంబుశోడి" యనుటయు క్తంబుగాఁ దోఁచెడి.

రెండియు "స్తనకంపసూచితరయంనిశ్వాస మహామువ్చతీ" అనుసంస్కృతపమునకు "స్తనకంపము చేత సూచింపఁబడిన వేగము గల నిశ్వాసముకు విడుచుచున్నదయి," యని యర్థ మగు. అందుకు బదు లిందు "కంపితస్తనపయంబున నూర్పర దోఁప" నని ప్రయోగింపఁబడెను. ఇందు సారాసారంబు లభిజ్ఞాంతరంగసాక్షికంబు లగు నని విరమించెదను.

విచ్ఛిత్తి కుదాహరణము.

చ. పరిమితభూషణంబులును ♦ ఫాలముపై నెలవంకనామముం
బరఁగ నొయారికైన నయన ♦ పర్వ మొనర్చె వధూలలామ తా
విరళగణేయతారలు నవీనతరేందుకలావిలాసము
న్వరుస వెలుంగఁగా విదియ ♦ నాఁటివిభావరి వోల్చు కైవడిన్. 160

టీ॥ వధూలలామ = స్త్రీరత్నము; పరిమితభూషణంబులును = అల్పభూషణములును; ఫాలముపై నెలవంకనామముఁన్ = నుదుటియందు చంద్రవంకబొట్టును; పరఁగన్ = ఒప్పఁగా; ఒయారికైన = విలాసము గలదై; విరళగణేయతారలు = అల్పములై లెక్కపెట్టఁదగునక్షత్రములును; నవీనతరేందుకలావిలాసముఁన్ = లేఁతచంద్రకలయొక్కవిలాసమును; వరుసన్ = వరుసగా; వెలుంగఁగాన్ = ప్రకాశింపఁగా; విదియ... కైవడిన్ = ద్వితీయనాఁటిరాత్రిప్రకాశించుభంగి; తాన్ = తాను; నయనపర్వమొనర్చెన్ = నేత్రోత్సవముచేసెను. ఇందు నాయిక యల్పభూషణములు గల దయ్యు లోకోత్తరముగఁ బ్రకాశించినట్లు చెప్పినందున విచ్ఛిత్తి యగును.

బిబ్బోకవిహృతములకు లక్షణములు.

క. వరునికథయం దనాదర
మరయఁగ బిబ్బోక మయ్యె ♦ ననుమతిఁ బలుకం
దర మగుతగువేళల ను
త్తర మొసఁగమి విహృత మనఁగఁ ♦ దగు నెట్లన్నన్. 161

టీ॥ వరునికథయందున్ = ప్రియునియొక్క ప్రస్తావమునందు; అనాదరము = ఉదాసీనత; అరయఁగన్ = విచారింపఁగా; బిబ్బోకమయ్యెన్ = బిబ్బోకమనునది యాయెను. అనుమతిన్ = అనుమతితో; పలుకన్...వేళలన్ = పలుకుటకు సాధ్యమగునుచితావసరములయందు; ఉత్తరమొసఁగమి = ఉత్తరమియ్యకుంట; విహృతమనఁగఁదగున్ = విహృతమనఁగ నొప్పును. ఎట్లన్నన్.

ప్రతాపరుద్రీయములో, "శ్లో॥ విహృతం ప్రాప్తకాలస్య వాక్యస్యాకథనం హ్రియా" అని లజ్జచేత ప్రాప్తకాలవాక్యాకథనము విహృతముగాఁ జెప్పఁబడినది, ఇం దూరక యకథనమే చెప్పఁబడినది. అది గర్వానాదరాదులచేత నకథనముగానుం దోఁచును గాన వ్రీడాదిబోధకశబ్దముఁ జేర్చుట యుక్తము. ప్రతాపరుద్రీయములో "హ్రియా" యనునది మానాదుల కుపలక్షణము. అట్లు ముందు సింగభూపాలీయలక్షణము వ్రాయఁబడును.

బిబ్బోకమున కుదాహరణము.

చ. అతఁడు గుణాభిరాముఁ డతఁ ♦ డంగజసన్నిభుఁ డంచు నెచ్చెలు
ల్పతి యగుశ్రీనృసింహనర ♦ పాలు నుతింప లతాంగి నీటుతో
శ్రుతులఁ గరాంగుళు ల్సొనిపె ♦ శోభనతచ్చరితాభిపూర్ణమై
యతిశయ మందుకర్ణయుగ ♦ మం దవకాశ మొసర్చనైవడిన్. 162

టీ॥ లతాంగి = స్త్రీ; పతి...పాలుఁ = భర్తయగు శ్రీమంతుఁడైన నరసభూపాలుని; నెచ్చెలులు = సఖులు; అతఁడు...అంచుఁ = అతఁడుసుగుణములచేత నొప్పుచున్నవాఁడు అతఁడుమన్మథునితోసమానుఁడు, ఇటనుచు; నుతింపఁగ = ప్రశంసింపఁగా; నీటుతోఁ = శృంగారగర్వముతో; శ్రుతులఁ = చెవులయందు; శోభన...కైవడిఁ = మంగళమగునానరసభూపాలునిచరిత్రముచేత పరిపూర్ణమై యుబ్బుచున్నకర్ణయుగమునందుఁజోటుచేయుభంగి; కరాంగుళులొల్లోనిపెఁ = చేతివ్రేళ్ళనుదూర్చెను. ధాన్యాదులచే నిండినట్టిగోతము మొదలగువానియందు నవకాశముకలుగుటకై చేతులు మొదలగునవి చొనుపుట లోకప్రసిద్ధము. ఇందు నాయికకుఁ బ్రియునిప్రశంసయం దనాదరము వర్ణింపంబడినందున బిబ్బోకము.

విహృతమున కుదాహరణము.

ఉ. బాలిక యల్కతో మరలి ♦ పల్కక యుండియుఁ బ్రాణనాథుఁ డ
వ్వేళ ఝుతం బొనర్పఁ గడు ♦ వేగ చిరాయు వటంచుఁ బల్కఁగాఁ
జాలక రోషముం బ్రణయ ♦ సంభ్రమము న్మది దొమ్ములాడ నీ
లాలక కుండలద్వయ ము ♦ దగ్రగతిఁ ఘటియించె వీనులఁ. 163

టీ॥ బాలిక = చిన్నది; అల్కతోఁ...ఉండియుఁ = రోషముతోఁదిరిగిమాటాడకుండియును; అవ్వేళ = ఆసమయమందు; ప్రాణనాథుఁడు = ప్రియుండు; ఝుతంబొనర్పఁ = తుమ్మఁగా; కడువేగ = మిక్కిలి శీఘ్రముగా; చిరాయువు...చాలక = చిరాయువుగమ్మనియనఁజాలక; మదిఁ = మనస్సునందు; రోషముఁ బ్రణయసంభ్రమముఁ = కోపమును ప్రీతిసంభ్రమంబును; దొమ్ములాడఁగాఁ = పెనఁగులాడఁగా; నీలాలక = నీలకుంతల; ఉదగ్రగతిఁ = శీఘ్రముగ; వీనులఁ = చెవులయందు; కుండలద్వయము = కమ్మలజతను; ఘటియించెఁ = ఉంచెను. ఇందు

నాయిక ప్రియుఁడు క్షుతముఁ జేయఁగాఁ బల్కవలసిన మంగళవాక్యమును మానముచేఁ బల్కని యెడల విహృతం బగును.

సింగభూపాలీయములో, “శ్లో॥ ఈర్ష్యయా మానలజ్జాభ్యా మదత్తం యోగ్య ముత్తరమ్। క్రియమాణే స్వయం యత్ర విహృతం తదుదీరితమ్॥” అని లక్షణము వ్రాసి. “శ్లో॥ అద్యాపి తన్మనసి సంపరివర్తతే మే రాత్రౌ మయి క్షుతవతి క్షితిపాలపుత్ర్యా। జీవేతి మఙ్గళవచః పరిహృత్య రోషా త్కర్ణేఽర్పితం కనకపత్ర మనాలపన్త్యా॥” అను లక్ష్యము వ్రాయఁబడినది. కర్ణములయందు కనకపత్రార్పణము క్షుత మమంగళమగుట నశ్రావ్యం బని తత్పరిహారమంగళవాక్యప్రతిప్రయోగరూపముగా నున్నది. ఇట్లు పైగ్రంథమునందె లజ్జచేత యోగ్యోత్తరము నియ్య కునికికి, “శ్లో॥ అన్యాసు తావ దుపమర్దసహాసు భృఙ్గ లోలం వినోదయ మనః సుమనోలతాసు। ... మూర్ధకమ్పమయ ముత్తరం దదౌ॥” అని యున్నది చూడవలయు.

చకితహసితకుట్టమితకుతూహలంబుల లక్షణములు.

క. అలుకుట చకితము నవ్వను
నలరుట హసితంబు రతుల నతిసమ్మర్దో
జ్జ్వల సౌఖ్యము కుట్టమితము
లలనకుఁ జపలత కుతూహలం బెట్లన్నన్. 164

టీ॥ అలుకుట=భయపడుట; చకితము=చకితమగును. నవ్వను నలరుట=నవ్వుచుండుట; హసితంబు=హసితమగును. రతులన్=సురతములయందు; అతిసమ్మర్దోజ్జ్వలసౌఖ్యము = అతిసమ్మర్దమైనను సౌఖ్యాతిశయముగ నెంచుట; కుట్టమితము=కుట్టమితమగు. లలనకున్=స్త్రీకి; చపలత=చాపల్యము; కుతూహలంబు=కుతూహలమగును. ఎట్లన్నన్,

ఇందు హసితాదిలక్షణములు సవరింపఁ దగియున్నవి. ఎట్లన, ప్రతాపరుద్రీయములో, "శ్లో॥ ఆకస్మికంతు హసితం యౌవనాదివికారజమ్" అనియున్నది. నిర్హేతుకముగ యౌవనాదివికారముచేతఁ గలుగునవ్వు హసిత మని దీనియర్థము. ఇట్లు "శ్లో॥ యథాయథా హసతి మృగాక్షీ యౌవనలక్ష్మ్యా శిక్షితా మధురమ్। తథాతథా కుసుమేషు శరా వికసన్తి ప్రియ స్యాశాచ॥" అని దీనియుదాహరణము. వికృతవేషభాషాదులచేఁ గలుగుహాస మీహసితము గాదు. ఈనరసభూపాలీయలక్షణము హాస్యరసస్థాయి యగుహాసమును వ్యాపించుచున్నయది.

మఱియు, "శ్లో॥ కేశాధరాదిగ్రహణే మోదమానాఽపి మానసే। దుఃఖితేవ బహిఃకుప్యే ద్యత్ర కుట్టమితం హి తత్॥" అనియు, "సుఖేదుఃఖచేష్టా కుట్టమిత" మ్మనియుఁ, గుట్టమితంబునకుఁ బ్రాచీనలక్షణంబులును, "శ్లో॥ పాణిపల్లవవిధూననమస్త స్సీత్కృతాని నయనార్ధనిమేషాః। యోషితాం రహసి గద్గదవాచా మస్త్రతా ముపయయు ర్మదనస్య॥" అనియు, "శ్లో॥ రోద్ధుం పాణిః ప్రచలతి చిరా దఙ్గుళి ర్నిశ్చలాఽసౌ భ్రూవిక్షేపో భవతి కుటిలో నేత్ర మన్తః ప్రసన్నమ్। గాఢాశ్లేషే భవతి సుతనో రర్ధమాత్రో నకారః కమ్పో మూర్ధ్నః ప్రసరతి ముఖం సమ్ముఖ న్న ప్రయాతి॥" అనియుఁ దదుదాహరణంబులు, నుండఁగా, "శ్లో॥ సమ్మర్దేఽపి సుఖాధిక్యం రతౌ కుట్టమిత మ్మతమ్।" అని ప్రతాపరుద్రీయమందును, "రతుల నతిసమ్మర్దోజ్జ్వలసౌఖ్యము కుట్టమిత" మని నరసభూపాలీయమునందును జెప్పుట సరిగాఁ దోఁచదు.

మఱియుఁ, గుతూహలమునకు, "శ్లో॥ కుతూహలం రమ్యదృష్టౌ చాపలం పరికీర్తితమ్" అని ప్రతాపరుద్రీయములో రమ్యమైనవస్తువును జూచుట యందుఁ జాపల మని లక్షణమును, "శ్లో॥ వీరరుద్ర మ

ధిరూఢసిన్ధురం ద్రష్టు మన్ధ్రినగరీపురన్ధ్రియః । కుర్వతే రచితచఙ్క్రమత్వరా స్తుఙ్గసద్మశిఖరాధిరోహణమ్॥" అని లక్ష్యము నుండఁగా, నిందు "లలనకుఁజపలతకుతూహలం" బని నానారూపచాపలంబును బోధించునట్టిలక్షణముఁ జెప్పుట తప్పుగా నున్నది.

ఇఁకఁ జకితమున కుదాహరణము.

చ. అడు గిడి నిల్చు నిల్చి చెలి♦కానలు వెట్టు నదల్చు సిగ్గునం
దడఁబడుఁ గాంతుఁ డున్నమణి♦ధామ మొగిం జొరఁ జాల కెంతయు
న్వడఁకు గృహాంబు సొచ్చియుఁ గ♦వాటము దాపున నిల్చు నెచ్చెలు
ల్వడిఁ జనఁ జూచినం బెనఁగు ♦ వారిజలోచన మౌగ్ధ్యసంపదన్.

టీ॥ వారిజలోచన = కమలములవంటికన్నులుగలయొకయంగన; మౌగ్ధ్యసంపదన్ = ముగ్ధత్వాతిశయముచేత; కాంతుఁడుఉన్నమణిధామము=ప్రియుఁడున్నమణిమయమందిరమును; ఒగిన్ = వరుసగా; చొరఁజాలక= ప్రవేశింపఁజాలక ; అడుగిడినిల్చున్ = అడుగుఁబెట్టినిలుచును. నిల్చి... పెట్టున్=నిలుచుండిసఖురాలికి ఆనలుఉంచును. సిగ్గునందడఁబడున్=సిగ్గుచేతఁదొట్రుపడును. ఎంతయున్ = మిక్కిలి; వడఁకున్=కంపించును. గృహాంబుసొచ్చియున్ = ప్రియసదనముఁజేరియు; కవాటము దాపుననిల్చున్ = తలుపుదగ్గఱనిలుచును. నెచ్చెలుల్...చూచినన్= ప్రియసఖులువేగముగఁబోవఁజూడఁగ ; పెనఁగున్= మెలిగొనును, వారిఁబోనియ్యదనుట. ఇందు నాయిక యులుకుటవలనఁ జకితంబగును.

హసితమున కుదాహరణము.

చ. వదనసరోజవాసనకు ♦ వచ్చినతేఁటి నదల్చి చూడఁగా
నది యసితోత్పలంబు లని ♦ యక్షుల వ్రాలఁగఁ జే విదుర్పఁగా
నదె మరలం బయోజ మని ♦ హస్తయుగంబున వ్రాల నవ్వె న

మ్మదవతి యేమి సేసినను ♦ మాన ది దేమి యటంచు నెంతయున్.

టీ॥ వదనసరోజవాసనకున్ = ముఖపద్మపరిమళమునకు; వచ్చి న...చూడఁగాన్= వచ్చినట్టితుమ్మెదనదలించి దానింజూడఁగా; అది= ఆతుమ్మెద; అసితోత్పలంబులని= నల్లగలువలని; అక్షులఁబ్రాలఁగన్ = కన్నులమీఁదఁబ్రాలఁగా; చేవిదుర్పఁగాన్ = హస్తముచేవిదిలింపఁగా; అది=ఆతుమ్మెద; మరలన్; పయోజమని= పద్మమని; హస్తయుగంబు నఁబ్రాలన్= చేతులజంటయందుఁబ్రాలఁగా; ఏమిసేసినన్= ఏమిపనిచేసిన ను; మానదు= నివర్తిల్లదు. ఇదేమియటంచున్ = ఇదియేమిచిత్రమను చు; అమ్మదవతి= ఆస్త్రీ; ఎంతయున్ = మిక్కిలి; నవ్వెన్=హసించెను. ఇందు నాయిక నవ్వుటవలన హసిత మగును.

ఇది హాస్యస్థాయి యగుహాసముగఁ దోఁచుచున్నదని మున్నె వ్రాయఁబడెను.

కుట్టమితమున కుదాహరణము.

చ. కెరలి ప్రియుండు మోవిపయిఁ ♦ గెంపులు నింపుటఁ బారవశ్యత
త్పరత నెఱుంగ లేక పిద♦ప న్నిలువద్దము చూచి సిగ్గునం
దరుణి చెలు ల్గనుంగొనినఁ ♦ దా రిఁక నే మని యాడుకొందురో
వరుని నటంచుఁ జిల్కకు న♦వారణ ముద్దులు వెట్టు సారెకున్. 167

టీ॥ తరుణి= ఒకయువతి; ప్రియుండు = వల్లభుఁడైననవరసభూపాలుఁడు; కెరలి=విజృంభించి; మోవిపయిన్= అధరముమీఁద; కెంపులునింపుటన్ = దంతక్షతములునిండించుటను ; పారవశ్యతత్పరతన్= సుఖపారవశ్యమునకధీనయగుటచేత; ఎఱుంగలేక= తెలియఁజాలక; పిదపన్ = వెనుక; నిలువద్దముచూచి= నిలువుటద్దమునీక్షించి; సిగ్గునన్= లజ్జచేత; చెలుల్ కనుంగొనినన్= సఖులుచూచినచో; తారు = సఖులు;

వరునిక్=ప్రియుని; ఇఁకక్ = ఇఁకమీఁద; ఏమనియూఁదుకొందురో=ఏమనిదూఱుదురో; అటంచుక్=అనితలంచుచు; చిల్క కుక్=క్రీడాశుకమునకు; అవారణ=ఆటంకములేనిదై; సారెకుక్ = మాటికి; ముద్దులు వెట్టుక్=ముద్దులిడును. ఇందు నాయిక రతిసమ్మర్దంబున సౌఖ్యపారవశ్యము నొందుటవలనఁ గుట్టమిత మగును. ఈలక్ష్యలక్షణములదోషములిదవఱకె వ్రాయఁబడినవి.

కుతూహలమున కుదాహరణము.

చ. కలికి నృసింహభూవిభునిఁ ♦ గాంచి నవప్రణయాభిరాముఁడై
లలితకరాబ్జకేళికమ♦లంబు భ్రమింపఁగఁ జేసె విభ్రమం
బలవడఁ బ్రాణనాథ హృద♦యాబ్జము ని న్నెడఁబాయ లేక యి
ట్లెలమిఁ భ్రమించుచున్న దని ♦ యేర్పడఁ జెప్పెడిచంద మందఁగక్.

టీ॥ కలికి=స్త్రీ; నృసింహభూవిభునిక్= నరసభూపాలుని; కాంచి=చూచి ; నవ...నై = నూతనమైనప్రీతిచేతనొప్పుచున్నదై ; లలిత...కమలంబు=మనోజ్ఞమగుకరకమలమందున్న విలాసార్థమైనకమలమును; ప్రాణనాథ = ఓప్రియుఁడా ! హృదయాబ్జము=హృదయకమలము; నిన్నెడఁబాయలేక = నిన్నువిడువఁజాలక; ఇట్లు = ఇభ్భంగి; ఎలమిక్=మిక్కిలి;భ్రమించుచున్న దని=తిరుగుచున్నదని;ఏర్పడక్...అందఁగక్=వివరించిచెప్పురీతిగలుగునట్లు; విభ్రమంబలవడక్=విలాసమేర్పడునట్లుగా; భ్రమింపఁగఁజేసెక్=తిరుగునట్లుచేసెను. త్రిప్పెననుట.

ఇందు నాయిక తనహృదయాభిప్రాయమును నిలుపుకొనఁ జాలక ప్రియునకుఁ గేళికమలభ్రమణరూపమునఁ దెలుపుటవలనఁ జపలతయని కవితాత్పర్యముగఁ దోఁచుచున్నది. అయిన "శ్లో॥ కుతూహలం రమ్యదృష్టౌ చాపల" మ్మనుప్రతాపరుద్రీయలక్షణమునకు, "శ్లో॥ వీర

రుద్రమధిరూఢసిన్ధుర" మ్మనుపూర్వోదాహృతతల్లక్ష్యమునకు నీలక్ష్య లక్షణంబులు మిగుల దూరంబు లని పూర్వమే వివరింపఁబడియున్నది.

కవి ప్రతిజ్ఞావాక్యము.

తే. మఱియు శృంగార మంగనా♦ మణులయందు
నంకురితపల్లవితపుష్పి♦తాదిభేద
వర్ణితాకృతిమై దశా♦వస్థ లయ్యె
వీని నామక్రమంబులు♦ విస్తరింతు. 169

టీ॥ మఱియుఁ = ఇంతియేకాక ; శృంగారము—విప్రలంభశృంగారమనుట; అంగనామణులయందుఁ = స్త్రీరత్నములయందు ; అంకురిత...మై = అంకురితమును పల్లవితమును పుష్పితమును ఆదిశబ్దముచేత ఫలితమును అను భేదములచేత వర్ణింపఁబడినస్వరూపము గలదిమై; దశావస్థ లయ్యెఁ=చక్షుఃప్రీత్యాదిదశావస్థలాయెను. వీనినామక్రమంబులు = ఈపదియవస్థలయొక్క—నామంబులవరుసను ; విస్తరింతుఁ=వివరింతును.

నాయికానాయకులకుఁ బ్రథమావలోకనము మొదలుగ నుదయించినప్రీతి సంగమమునకుఁ బూర్వకాలమందు నంకురితాదిభేదములు గలదై చక్షుఃప్రీత్యాదిదశావస్థలకు హేతు వగు ననుట మొదలుగా రతిలక్షణపద్యవ్యాఖ్యానములో వ్రాయఁబడెను. ఈయంకురితాదిభేదంబులు తజ్జన్యంబు లైనదశావస్థలు స్త్రీపురుషసామాన్యములుగా నుండిన నిం దంగనామణులయం దనుట సాత్త్వికభావవిశేషలక్షణపద్యములోఁ జెప్పినరీతిఁ దప్పుగాఁ దోఁచుచున్నయది.

వెండియుఁ బ్రతాపరుద్రీయములో "శ్లో॥ అథ శృఙ్గార స్యాఙ్కురితత్వపల్లవితత్వకుసుమితత్వఫలితత్వహేతవో ద్వాదశావస్థా ని

యాప్యన్తే" అనుదానిచేత శృంగారమున కంకురితత్వాదిధర్మములు గలుగు ననియు, వానివలన నీయవస్థ లుదయించు ననియు స్పష్టపడుచుండఁగా, నిందు శృంగారము దశావస్థ లయ్యె ననుట సుధీమణులచే నాలోచనీయముగా నున్నది. ఇట శృంగార మనఁగ శృంగారరసస్థాయి యగురతియె. ఇట్లు రసగంగాధరములో "రసపదే నాత్ర ప్రకరణే తద్ధేతుః స్థాయిభావో గృహ్యతే। రసస్య సామాజికవృత్తిత్వేన నాయకాద్యవృత్తిత్వాత్ అద్వితీయానందమయత్వేన విరోధాసంభవాచ్చ" అని చెప్పఁబడినది. కాన నిటఁ బ్రేమమానప్రణయాదినామకంబులతో విలసిల్లు రతియే శృంగార మనఁబడు. అయ్యది చక్షుఃప్రీతి మొదలగుదశావస్థ లగునా? దానివలన దశావస్థ లుదయించునా? యను విషయమువిచారింపఁ దగినది.

లేక, కర్తృభేదమునంగీకరించుపక్షమున, వర్ణితాకృతిన్మై యనుచోటి "ఐ" అనుదాని నగుధాతువుక్త్వార్థకరూపముగాఁగ్రహించి, దానికి శృంగారము కర్తగాను "అయ్యె" ననుక్రియకు దశావస్థలు కర్తగాను అన్వయించి, పూర్వాపరభావమునకు హేతుహేతుమద్భావపరతను గల్పించి, శృంగారము అంకురితాదిభేదములుగలది యగుటవలన దానికిఁ జక్షుఃప్రీత్యాదిదశావస్థలుకలిగెనని యర్థముఁజెప్పి, పైదోషమును నివారింపవచ్చును.

మఱియు, "అఙ్కురితత్వ పల్లవితత్వకుసుమితత్వ ఫలితత్వ హేతవః" అనుప్రతాపరుద్రీయవాక్యమునందుఁ గోరకితత్వావస్థయు నైదవదిగా, "శ్లో॥ ఈషదఙ్కురితవిభ్రమచారౌదేహపల్లవితకాన్తిని తన్వ్యాః। యావనే ముకులితస్తనమాత్రే పుష్పితశ్చ ఫలితశ్చ మనోభూః॥" అనుతద్గ్రంథస్థపద్యముచేతఁ జేర్పఁదగినది. ఈవిచారమంతయుఁ బూర్వమే వ్రాయఁబడెను.

## ద శా వ స్థ ల నా మ ం బు లు.

క. ఇలఁ జూచుట చింతించుట
దలఁచుట గుణవినుతి యరతి ♦ తాపము లజ్జా
స్ఖలనము గమనము మూర్ఛయు
నల ధన్యత యన నవస్థ ♦ లగు నెట్లన్నన్. 170

టీ॥ ఇలన్=భూమియందు; చూచుట= అవలోకించుట; చింతించుట=ఆలోచించుట; తలఁచుట=స్మరించుట; గుణవినుతి = గుణములఁ గొనియాడుట ; అరతి = అప్రీతి ; తాపము = సంతాపము; లజ్జాస్ఖలనము=లజ్జాత్యాగము; గమనము=ప్రియునొద్దకుఁబోవయత్నించుట; మూర్ఛయున్=మూర్ఛిల్లుటయును; అలధన్యత= ప్రసిద్ధమగుధన్యతయు; అనసవస్థలగున్=ఇట్లుదశావస్థలగును. ఎట్లన్నన్. అని గ్రంథకర్త్రభిప్రాయముగ నున్నది.

ఇందు గమన మనునది, ,, శ్లో॥ చక్షుఃప్రీతిః ప్రథమం చిన్తాసక్తి స్తతోఽథ సంకల్పః । నిద్రాచ్ఛేద స్తనుతా విషయనివృత్తి స్త్రపానాశః । ఉన్మాదో మూర్ఛా మృతి రిత్యేతే స్మరదశా దశైవ స్యుః॥ దృఙ్మనస్సఙ్గసంకల్పా జాగరః కృశతాఽరతిః । హ్రీత్యాగోన్మాదమూర్ఛాన్తా ఇ త్యనఙ్గదశా దశ॥'' ఇత్యాదులయందుఁ జెప్పఁబడినయున్మాదమునకు మాఱుగ నున్నట్లు దోఁచుచున్నది. ఉన్మాదములో గమనాదులనేకములు గలుగుఁ గాన నున్మాదమనుటయె యుక్తము. తక్కినవిషయము ముందు వ్రాయఁబడును.

### చక్షుఃప్రీతి కుదాహరణము.

మ. అనురాగాంబుధి యుబ్బి వెల్వడినయ ♦ ట్లాపూర్ణఘర్మాంబువుల్
దనువల్లిం డిగ జాఱఁ గన్నుఁగవ తేఁ ♦ దళుకొ ల్పిసాళించుచున్

ననవిలాస—నిపురప్రవేశకలనా ♦ నాళీకదామంబులై
తనరం గోమలి నిన్నుఁ జూచె నరసేం♦ద్రా సాంద్రతేజోనిధీ. 171

టీ॥ సాంద్రతేజోనిధీ=దట్టమైన తేజస్సునకునిధియైనవాఁడా! నరసేంద్రా=నరసభూపాలుఁడా! కోమలి = కోమలాంగియగుచిన్నది; అనురాగ...అట్లు = అనురాగమనెడుసముద్రముప్పొంగిపొరలినట్లు; ఆపూర్ణ...జాలన్ = అధికములైనస్వేదోదకములు శరీరమునుండిదిగఁజాఱఁగా; కన్నుఁగవలేఁదళ్కుల్ = కన్దోయియొక్క—నూతనమైనకాంతులు; పిసాలించుచున్=వ్యాపించుచు; నన...తనరన్=మన్మథుఁడుపురప్రవేశముఁజేయువేళఁ గట్టుకమలమాలలై యొప్పఁగా; నిన్నుఁజూచెన్ = నిన్నవలోకించెను. ఇందు నాయిక పరిపూర్ణానురాగముచేత నరసభూపాలునిఁ జూచుటవలనఁ జూచుట యను నవస్థ యగును.

చింతించుట కుదాహరణము.

మ. అరవిందంబు విలాసమందిరము నీ♦హారాంశుఁ డేకోదరుం
డరయ న్గోత్రవిరోధ మేటికి ననర్హం బంచు నూహించి యి
ర్వురఁ బొందించుపయోధికన్యక్రియఁ జే♦ర్చుం గేలు గండస్థలిం
దరుణీరత్నము చింతచేత నరసేం♦ద్రా సాంద్రతేజోనిధీ. 172

టీ॥ సాంద్రతేజోనిధీ=దట్టమైనతేజస్సునకునిధియైనవాఁడా! నరసేంద్రా= నరసభూపాలుఁడా! తరుణీరత్నము = స్త్రీరత్నము; అరవిందంబువిలాసమందిరము=పద్మమునాకుఁగ్రీడాగృహము; నీహారాంశుఁడేకోదరుండు = చంద్రుఁడుసహోదరుఁడు; అరయన్ = విచారింపఁగా; గోత్రవిరోధమేటికి = సంబంధముగలవారికి విరోధమేల? అనర్హంబంచున్ = ఉచితమ్ముకాదని; ఊహించి = ఊహచేసి; ఇర్వురన్ = ఉభయులను, హస్తరూపపద్మమును ముఖరూపచంద్రుని ననుట; పొందిం

చు...క్రియఁ = కూడఁబెట్టుశ్రీదేవిభంగి; కేలు = హస్తమును; గండస్థలిన్ = చెక్కున; చింతచేతన్ = ఆలోచనచేత; చేర్చున్ = ఉంచును. ఇందు నాయిక ఆలోచనచేతఁ జెక్కిటఁజెయిసేర్చుటవలనఁ జింతయగును.

తలఁచుట కుదాహరణము.

మ. వరభూషాదులపై మనం బిడక దృగ్వ్యాపార మెంతేఁ బర
స్పరసందర్శననాతిభిన్నమయి చూపట్టంగఁ గార్యాంతర
స్మరణం బెమియు లేక నిశ్చలత నీ సాంగత్యముం గోరి మా
హరిణీలోచన యాత్మయందు నరసేంద్రా నిన్ను భావించె రా.

టీ॥ నరసేంద్రా=నరసభూపాలుఁడా! మాహరిణీలోచన=మాచిన్నది; వర...ఇడక = శ్రేష్ఠములైనయాభరణములయందుఁ జిత్తమునుంచక; దృగ్వ్యాపారము=చూపులయొక్కచలనాదిక్రియ; ఎంతేన్ = మిక్కిలి; పరస్పర...చూపట్టంగన్ = ఒకరినొకరుచూచుటకన్నను మిక్కిలి భిన్నముకానిదై యగపడఁగా, అనఁగా దాని చూపు, తన్నుఁ బ్రియుఁడు చూచుచుండఁగాఁ దానాప్రియునిఁ బ్రత్యక్షముగఁ జూచునప్పటిచూపువలెనే యున్నదనుట; కార్య...లేక = మఱియొకకృత్యంబేమియుఁదలఁపక; నిశ్చలతన్ = నిశ్చలత్వముచేత; నీసాంగత్యముంగోరి= నీసంపర్కమునభిలషించి; నిన్నుభావించెరా= నినుస్మరించెనురా. ఇందు నాయిక నరసభూపాలుని భావించుటవలనఁ దలఁచుట యగును.

గుణవినుతి కుదాహరణము.

మ. పలుకుం దోడగువీణలోఁ జెలియ నీపై గీతము ల్మీటఁ దా
య్యాలిమైనీడ మెఱుంగుఁగాయ నిరవై యవ్వీణలో వాణి యో
లలితాంగీ యనచిత్తముం బ్రియుఁడు కోల్ల ల్వేట్టఁ గా యంచు వె
ల్పలికిం దాను బుసాడ వచ్చె ననఁ గన్పట్టు న్నృసింహాధిపా. 174

టీ॥ నృసింహాధిపా = నరసభూపాలుఁడా! చెలియ = నాయిక; పల్కుంబోఁడగువీణలోన్ = పలుకుఁబోఁడగువీణయందు; నీపై గీతములీల్పఁగన్ = నీవిషయమగుగీతములువాయింపఁగా; తొయ్యలిమైనీడ = ఆ స్త్రీదేహముయొక్క ప్రతిబింబము; మెఱుంగుఁగాయన్ = వీణయొక్కతళతళయనుకాంతిగలకాయయందు; ఇరవై = నిల్చినదియై; ఆవీణలోవాణి = ఆవీణయందున్నవాగ్దేవి; ఓలలితాంగీ = ఓమనోజ్ఞమైనయంగముగలదానా! ప్రియుండు = ప్రియుఁడైననరసభూపాలుఁడు; మనచిత్తమున్ = మనహృదయమును; కొల్లల్పెట్టెఁగాయంచున్ = కొల్లలుపెట్టెఁగదాయనుచు; వెల్పలికిన్ = బయటికి; తాను; బుసాడవచ్చెననన్ = మొఱపెట్టుటకు వచ్చెనోయనునట్లు; కన్పట్టున్ = చూపట్టును. ఇందు నాయిక నృసింహుని గీతములు పాడుటవలన గుణవినుతి యగు.

అరతి కుదాహరణము.

మ. నిరతం బాత్మకరాంఘ్రిబాహునఖకాంతిస్ఫూర్తికిం దిగ్గుడై
శరణం బొందుప్రవాళపద్మబిసపుష్పశ్రేణికిం గ్రమ్మఱన్
శరణం బందుట హీనమంచునొ మదిన్ శైత్యోపచారక్రియా
గరిమం బొల్లదు మానినీమణి కడంకన్ శ్రీనృసింహాధిపా. 175

టీ॥ శ్రీనృసింహాధిపా = శ్రీనరసభూపాలుఁడా! మానినీమణి = స్త్రీరత్నము; నిరతంబు = ఎల్లప్పుడును; ఆత్మ...స్ఫూర్తికిన్ = తనహస్తములయొక్కయు పాదములయొక్కయు బాహువులయొక్కయు గోళ్ళయొక్కయు కాంత్యతిశయమునకు; దిగ్గుడై = నికృష్టములై; శరణంబు...శ్రేణికిన్ = శరణుచొచ్చినచిగుళ్ళయొక్కయు పద్మములయొక్కయు తామరతూండ్లయొక్కయు పువ్వులయొక్కయు సమూహమునకు; క్రమ్మఱన్ = మరలను; శరణంబొందుట = శరణుచొచ్చుట; హీనమంచునొ = నీ

చమనితలఁచియేమో; మదిన్ = చిత్తమునందు ; శైత్య...గరిమంబు= చల్లఁదనముగల్గించునట్టియుపచారాతిశయమును; కడంకన్ = యత్నము చేత; ఒల్లదు=ఇష్టపడదు. ఇందు నాయిక పల్లవకమలమృణాళకుసుమ ముల నొల్లకుండుటవలన నరతి యగును.

తాపమున కుదాహరణము.

మ. ధవళాక్షీమణిమేను హేమలత యం♦న్తత్త్వంబు మున్నెల్లఁ ద
త్కవిలోకోక్తి యటంచు నుంటి నది త♦థ్యం బయ్యె నెట్లన్న భ
వ్యవియోగానలతప్తమై నిబిడబా♦ష్పాసిక్తమై డస్సియు
న్నవశోభాతిశయంబుఁ జెందె నరసేం♦ద్రా సాంద్రతేజోనిధీ. 176

టీ॥ సాంద్రతేజోనిధీ = అధికమైన తేజమునకునిధియగువాఁడా ! నరసేంద్రా= నరసభూపాలుఁడా! ధవళాక్షీమణిమేను= స్త్రీరత్నమునొ క్క-శరీరము; హేమలతయన్తత్త్వంబు = బంగరుతీఁగెయనుభావము; మున్నెల్లన్=మునుపంతయు; తత్క-వి...ఉంటిన్= మిథ్యావర్ణనఁజేయు కవిజనులమాటయనితలఁచియుంటేని; అదితథ్యంబయ్యెన్ =అభావముయ థార్థమాయెను. ఎట్లన్నన్ = ఏవిధమున ననఁగా; భవ్య...తప్తమై=మ నోజ్ఞమగువిరహాగ్నిచేఁదపింపఁజేయఁబడినదై; నిబిడ...సిక్తమై=దట్ట మగుకన్నీటిచేఁదడుపఁబడినదై; డస్సియున్ = బడలియున్ను; నవ...చెం దెన్ = అపూర్వకాంత్యతిశయమునుబొందెను. ఇందువలనఁ దథ్యంబ య్యె నని యన్వయము. విరహతాపతప్తమైనం గాంతి మించు నని లోకశాస్త్రానుభవము.

ఇందు నాయికశరీరము వియోగానలతప్తమై నట్లు చెప్పినందు నఁ దాప మగు.

లజ్జాత్యాగమున కుదాహరణము.

మ. చెలి నీమూ_ర్తి లిఖించి చిత్రపలకం♦జెన్నొందు బాష్పాంబువి
చ్ఛిల మాపయ్యెదమీఁదఁ జేర్చుకొన నా♦చిత్రం బలక్ష్యంబుగా
బళిరే కట్టినచీరయుం బగయకాఁ♦బాటించె దైవం బటం
చలినీలాలక యా_ర్తిఁ జెందు నరసిం♦హా యింకఁ బాలింపుమీ.

టీ॥ నరసింహా = నరసభూపాలుఁడా! చెలి=స్త్రీ; నీమూ_ర్తిలి ఖించి=నీయొక్క యాకారమునువ్రాసి; చిత్రపలకన్ = చిత్రపటమును; చెన్నొందు...పయ్యెదన్ = అందమగుబాష్పోదకముచేత వ్యాప్తమగు పైఁటచెఱఁగుమీఁద; చేర్చుకొనన్ = ఉంచుకొనఁగా; ఆచిత్రంబు= ఆచి_త్తరువు; అలక్ష్యంబుగాన్ = అగపడకపోఁగా; బళిరే = ఆశ్చర్య ము! కట్టినచీరయున్=కట్టినవస్త్రమును; పగయకాన్ = శత్రువేయగు నట్లు; దైవంబు; పాటించెన్ = ఘటిల్లఁజేసెను. అటంచున్; అలినీలా లక – ఆయతివ; ఆ_ర్తిఁజెందున్ = దుఃఖమునొందును. ఇఁకన్ = ఇంక మీఁద; పాలింపుమీ = కాపాడుమా. ఇందు నాయిక తానే చిత్ర లేఖనాదిక్రియ లొనర్చుటవలన లజ్జాత్యాగ మను నవస్థయగును.

గమనమున కుదాహరణము.

మ. చెలుల న్వంచనచేసి యొక్కతయు తాఁ♦జెన్నొంద నీయొద్దకు
న్నలినాక్షీమణి రాఁ దలంచి నవర♦త్నప్రోతసౌధాంగణ
స్థలుల న్వే న్చని వచ్చునిర్మలతను♦చ్ఛాయ న్నిరీక్షించి నె
చ్చెలి యేతెంచె నెఱుంగఁ బోలు నని ని♦ల్చెన్ శ్రీనృసింహాధిపా.

టీ॥ శ్రీనృసింహాధిపా = శ్రీమంతుఁడగునరసరాజా! నలినాక్షీమ ణి= స్త్రీరత్నము; చెలులన్=సఖులను; వంచనచేసి = మోసపుచ్చి; ఒ క్కతయుతాన్ = తానొకతయే; చెన్నొందన్=అందమగునట్లు; నీయొ

ద్దకున్ = నీ చెంతకు; రాఁదలంచి; నవ... స్థలులన్ = నవరత్నస్థగితములగు మేడలయొక్క ముంగిళ్ళప్రదేశములయందు; వెన్నని... ఛాయన్ = వెంబడించివచ్చునట్టిస్వచ్ఛమైనతనమైనీడను; నిరీక్షించి = చూచి; నెచ్చెలి... నిల్చెన్ = ప్రియసఖివచ్చెను ఈబిడఁదెలిసికొను నని నిల్చెను. ఇందు నాయిక ప్రియునొద్దకుఁ బోవ నుద్యమించుటవలన గమన మని కవియాశయము.

## మూర్ఛ కుదాహరణము.

మ. బలితం బైనయనంగవేదనలచేఁ ♦ బల్కాలు నిల్పోవ లే
కలినీలాలకప్రాణము ల్వెడలి నే♦త్రాంభోజమార్గంబునం
గలయం బ్రాఁకుచు వచ్చి యన్నెలవునం ♦ గన్నీటయే యడ్డమై
నిలుప న్నిల్చె నృసింహభూరమణ మ♦న్నింపంగఁ బాడింతటన్.

టీ॥ నృసింహభూరమణ = నరసభూపాలుఁడా! అలినీలాలకప్రాణముల్ = తుమ్మెదలవలెనల్లనిముంగురులుగలచిన్నదానిప్రాణములు; బలితంబైనయనంగవేదనలచేన్ = బలిష్ఠములైనమదనబాధలచేత; పల్కాటున్ = మాటిమాటికిని; నిల్పోవలేక = ఓరువఁజాలక; వెడలి = బయలుదేఱి; నేత్రాంభోజమార్గంబునన్ = నేత్రసరోజమార్గమునందు; కలయంబ్రాఁకుచువచ్చి = అంతటనెగఁబ్రాఁకుచువచ్చి; అన్నెలవునన్ = ఆప్రదేశమునందు; కన్నీటియేయడ్డమైనిలుపన్ = కన్నీటిప్రవాహంబడ్డపడి నిలుపఁగా; నిల్చెన్. ఇంతటన్ = ఇంతటితో; మన్నింపంగఁబాడి = మన్నించుటకుధర్మంబు. ఇది నాయికావస్థను దెలుపుదూతీవాక్యము. నాయిక విరహాత్క్రాంతిత, గావున, విప్రలంభశృంగారోచితములగు హృదయసంతాపము పడఁకుట శరీరముకృశించుట ప్రియేతర సర్వవిషయములయం దప్రీతి బాష్పము తనయవస్థదెలిపికొనుట అల

సత గ్లాని దైన్యము నిర్వేదము శ్రమము అపస్మారము ఉన్మాదము జడత మొదల గునవి సంభవించును. కావున నతిసూక్ష్మములై స్వభావచంచలము లగు వాయురూపప్రాణములు గాఢము లైనయిట్టిచక్షుఃప్రీతి చింత సంగమోత్కంఠ నిద్రాభావము కృశించుట మొదలగుమదనబాధలకును, "శ్లో॥ మనోరాగ స్తీవ్రం విష మివ విసర్ప త్యవిరతం ప్రమాథీ నిర్ధూమో జ్వలతి విధుతః పావక ఇవ। హినస్తి ప్రత్యఙ్గం జ్వర ఇవ బలీయా నిత ఇతో న మాం త్రాతుం తాతః ప్రభవతి నచామ్బా న భవతీ॥" యనిమాలతి వచించినరీతిఁ గలుగుతీవ్రాయాసములకును, నీక నోర్చి యుంట దుస్తరము గావున మన్నించ ధర్మం బని పరమార్థంబు. ఇందు నాయికకు మూర్ఛ స్పష్టము.

ఈపద్యమునందుఁ బ్రతిపదస్వారస్యమువలన సువ్యక్తంబుగ నిట్లు ధ్వనించుచున్నది. ఎట్లన. వేదన లనుబహువచనముచేత నొకవిధము గాక యాయాసములు నానావిధము లనుట సూచింపఁబడు. బలితం బనుపదముచేత నవియు నల్పములు గాక బలిష్ఠము లనునర్థము బోధితము గు. ఐన దృఢగాత్రులు కొంతవఱకోర్వఁ గలరు. "ప్రాణము" లనుటవలన, నటుగాక సుకుమారము లైనవాయురూపములు కావున నోర్వఁజాలవని సూచితమగుచున్నది. ఒకపుడు గలుగు నట్టిబాధ లైన నెట్టివారలైన సహింపవచ్చును. "పల్మా" యనుటచే మాటిమాటికిఁ గలుగు బాధలు సహించుట యసాధ్యమనియు, నీవు వచ్చెద వనునాశచే నోర్చి యోర్చి యసాధ్యంబగుట నిల్పఁజాలకపోయె ననియుధ్వనించును. "ప్రాణముల్" అనుబహువచనముచేత "శ్లో॥ న జహాతి మృతం పాపి సర్వ[illegible] ధనంజయః॥" అని మృతశరీరంబు నైన వదలనట్టిధనంజయ మను ప్రాణము గూడఁ బై బాధలకు నిలువఁజాలక వెడలె నని తెలుపఁబడుచున్నది. "[illegible]" యనుటవలనఁ బ్రాణంబులు

మిక్కిలి గాసిపడి శోషించి యెప్పు డెప్పుడు బయలుదేఱుద మంచు నుద్యమించి పోవునంతటిసామర్థ్యము లేక క్రమముగాఁ బోవఁజాలక నేత్రమార్గమున నంతంత నెగఁద్రోఁచె నని వ్యక్తమగుచున్నది. "నేత్రాంభోజ మార్గంబున" వనుటవలన వీరాక కెదురు చూచిచూచి కన్నులలోఁ బ్రాణములు పెట్టుకొని యట్లె మూర్ఛిల్లె నని ధ్వనితం బగుచున్నది. "కన్నీటియేఱు" అనుటవలన దాఁటనలవిగాని నదీప్రవాహంబుగఁ గన్నీరు స్రవించుచున్న దనిసూచింపఁబడుచున్నది. "అడ్డమైనిలువక్" అనుటవలన మరణమున కుద్యమించువారి నేరినైన నెవ్వారైన సాంత్వోక్తులచే నూఱడించి యాప్రయత్నము మాన్పుట ధర్మంబని యచేతనమగు కన్నీరుగూడ స్వానుష్ఠానముచేఁ దెలుపుచున్నదని తెల్పఁబడెను. "భూరమణ" యనుటవలన, ఇట్టియచేతనమగు నుదకమే మృతిఁజెందుట తగ దని నిలుపఁగా, నెల్లవారిని గాపాడవలసినబాధ్యత గలయట్టి నీవు, దాని రక్షించుట యుక్తతరం బనివ్యంజితము. "మన్నింపంగఁబాడింతటక్" అనుటవలన మరణమున కన్న నధిక మగు దుర్దశ లోకమునం గానరాదు గావున నిట్టి యాపద దొలఁగించి కాపాడుట భూరమణుఁడ వైననీకుఁ బరమధర్మం బనిసూచితము. ఇత్యాద్యర్థంబులు వ్యజ్యమానంబు లగును. ఇట్లు లోకోత్తరవ్యంగ్యవ్యంజకమైనందునను, ప్రతిపదస్వారస్య ముండుటవలనను ఈపద్యం బుత్తమకావ్యం బని తోఁచినకొలంది వ్రాయఁబడెను.

ధ్వన్యంతరోదాహరణము.

మ. శుకవర్గం బొకమాటలో మెలఁగ నా ♦ సూనాయుధుం డంతరం
గకుఁడై యుద్ధతి మారాళి మొక్కనడకం ♦ గ్రొవ్వొచ్చి వర్తించెఁ బా
యక పేరె న్నపముఖాబ్జ మొందె శశి మా ♦ యాజ్ఞాస్తి నేరంబుతో
నకలంకస్థితి నీవు గూడ నరసింహక్ష్మారాజకంఠీరవా. 180

టీ॥ రాజకంఠీరవా=రాజశ్రేష్ఠుఁడా! నరసింహా=నరసభూపాలుఁడా! మాయబ్జాక్షిన్ = మాచిన్నదానిని; సేమంబుతోన్ = క్షేమముతో; అకలంకస్థితిన్=నిష్కలంకవృత్తిచేత; నీవుగూడన్ = నీవుచేరఁగా; అనఁగా నబ్జాక్షి బ్రతికి క్షేమముతో నుండినపుడు నీవు గూడఁగా ననుట; శుకవర్గంబు=చిలుకలగుంపు; ఒకమాటలో మెలఁగెన్ = నీ విట్లు ప్రసన్నుండవై యొక మాటలో మెలఁగఁగా నదియుఁ బూర్వవైరంబు మానికలిసె ననుట. శుకములు పలుకుటలో మెలఁగుట సహజమని తాత్పర్యము. అనూనాయుధుండు=అట్లువిరోధించినకుసుమబాణుండు; అంతరంగికుఁడై యుండెన్= నీవనుకూలుండవుకాఁగా ఆప్తుండై యుండెను. కాముం డంతరంగమునందు అనఁగా హృదయమునం దుండువాఁ డగుట సహజ మని తాత్పర్యము. మరాళము=హంసయు; ఒక్కనడకం గ్రేళ్ళుబ్బివర్తించెన్=నీవొక నడకతో ననఁగా నొకవృత్తితో నతిశయించి వర్తింపఁగా హంసయు నొకనడకతోఁ గ్రేళ్ళుబ్బి వర్తించెను, మరాళము నడకలో నతిశయించి వర్తించుట సహజ మని తాత్పర్యము. పాయక = విడువక; శశి = చంద్రుఁడు; వేడ్కన్ = సంతోషముచేత; సుముఖత్వమొందెన్=నీవిట్లుసుముఖతనొందఁగాఁ జంద్రుండును సుముఖత్వమొందెననుట; చంద్రుఁడు సుముఖత్వమనఁగా సౌమ్యభావము నొందుట సహజ మని తాత్పర్యము. ఇది యంతయు నీయనుగ్రహమే కాని వేఱు కా దని ఫలితార్థము.

ఇందు నాయిక ప్రియసంగమము నొందినందున ధన్యత యని కవియభిప్రాయము.

దశావస్థ లయోగవిప్రలంభములోఁ గలుగునవి గావునఁ దదంతఃపాతి యగుదశమావస్థయు నయోగాంగరూపముగనే యుండవలెఁ గాని సంయోగరూపముగ నుండఁ గూడదు. "శ్లో॥ అనుకూలా నిషే

వేతే య త్రాన్యోన్యం విలాసినౌ। దర్శనస్పర్శనాదీని స సంభోగ ఇతీరితః॥" అని యనుకూలతచే నన్యోన్యముగ యువతీయువతులు దర్శనస్పర్శనాలింగనాదులు సేవించుటయె సంభోగ మని చెప్పఁబడినది గావునఁ, బ్రియసంగమరూప మైనధన్యత విప్రలంభోచితము లగుదశావస్థలలో గణనార్హము గాదు. ధన్యతయను నది సకలగ్రంథాదృష్టమైనదియు, నయుక్తమును నని తెలియునది. ఒకవేళ, మరణ మమంగళరూపముగాన నదికావ్యములయందుఁ గూడ దని యిట్లు చెప్పఁబడె నన్నచో, సంచారిభావములలో మృతికి "అగణితమృతియత్న మంత" మని లక్షణమును "వల పెక్కఁగి రాఁ" డని లక్ష్యమును జెప్పినయట్లు, లక్షణము లక్ష్యము నేలఁ జెప్పఁ గూడదు? కాన సర్వసమ్మతముగ మరణోద్యమమే మరణ మని లక్షణముఁ జెప్పి మనుచరిత్రములో నుండు నీలక్ష్యము నుదాహరించుట యుక్త మని తోఁచుచున్నది. అదియెట్లన,

"సీ. చనుగప్పు దొలఁగ వా♦సన గాలి కెదు రేగు, బరువొప్ప నలుఁగుబఁ♦బోఁ జుకరణి। నిడుదవేనలి నూనె♦ముడి జాఱఁ జగురాకు, పొదఁ దూఱుఁ గార్చిచ్చు ♦ గదియు కరణిఁ। బసిఁడిగాజులుపయి ♦ వెసఁ ద్రోచి నును దీఁగ, దెమలించు నురి త్రాడు ♦ నెమకుకరణి। మొలనూలు బిగియించి ♦ వెలఁది వెన్నెలఁజొచ్చుఁ, బిఱుదీయ కేటిలో ♦ నుఱుకుకరణి॥

తే. జడియ దళులకుఁ గురియుపు♦ప్పొడులమునుఁగు, మావికిడ నిల్చు విరులనె ♦ త్తావి గ్రోలు। విషమసాయకు నేఫుల ♦ విసిగివిసిగి, తనువు దొఱఁగంగఁ దలఁచి యా♦వనరుహాక్షి॥" రసార్ణవసుధాకరమునందును,

"శ్లో॥ తన్వీ దర్శనసంజ్ఞయైవ లతికా మాపృచ్ఛ్య సంవర్ధితాం న్యాసీకృత్య చ శారికాం పరిజనే స్నిగ్ధే సమం వీణయా। జ్యోత్స్నామావిశతి విశారదసఖీవర్గేణ కర్ణాన్తికే సిక్తేన వ్యాసపోతశింగస్ప్రపతే ర్నామ్నా పున ర్జీవితా॥" అని వ్రాయఁబడినది. ఇందుకుఁ బ్రమాణంబును నందె యిట్లు వ్రాయంబడినది. ఎట్లన్న, "శ్లో॥ తైస్తైః కృతైః

ప్రతీకారైర్యది న స్యాత్సమాగమః। తస్మాద్యత్స్మరసందోద్యోగః కామాగ్నేస్తత్ర విక్రియాః। లీలాశుకచకోరాదిన్యాసః స్నిగ్ధసఖీకరే। కలకణ్ఠకలాలాపశ్రుతిర్మన్దానిలాశ్రయః। జ్యోత్స్నాప్రవేశవాంఛిన్దమ జారీవీక్షణాదయః॥" ఇందువలన నేతస్మరసభూపాలీయలక్ష్యలక్షణప్రకారంబు చింత్యంబని తెలియునది.

## కవిప్రతిజ్ఞావాక్యము.

తే. తెలియ శృంగార మిదియును ♦ ద్వివిధ మగుచుఁ
బరఁగు సంభోగవిప్రలం♦భంబు లనఁగ
నందు బహుభేదములను గ♦ణ్యంబు గాక
యేకవిధ మయ్యె సంభోగ ♦ మెట్లటన్న. 181

టీ॥ తెలియన్ = తెలిసికోనఁగా; శృంగారమిదియున్ = ఈశృంగారరసమును; సంభోగవిప్రలంభంబులనఁగన్ = సంభోగము విప్రలంభము అని; ద్వివిధమగుచుఁబరఁగున్ = రెండుతెఱంగులై యొప్పును. అందున్ = ఆరెంటిలో; సంభోగము = సంభోగశృంగారము; బహుభేదములను = పరస్పరావలోకనసంభాషణాలింగనాధరచుంబనాదులగు పెక్కు-భేదములచేత; గణ్యంబుగాక = ఇన్నిభేదంబులుగలదియని లెక్క-పెట్టఁదగినదిగాక; ఇందు "నగణ్యంబు గాన నేకవిధమయ్యె" నను యున్నచో యథాశ్రుతమూలపాఠము సమంజసముగ నన్వయించును గాని "అగణ్యంబుగాక" యనుపాఠమునం దన్వయింపదు. ఏకవిధమయ్యెన్ = ఒకవిధముగలదియాయెను. ఎట్లటన్నన్.

## సంభోగశృంగారమున కుదాహరణము.

మ. మరుఁ డాచార్యుఁడు గా విశీర్ణకబరీ ♦ మాల్యాళి పుష్పాంజలి
స్ఫురణ ల్గాఁ దదుపేతభృంగనినద ♦ స్తోమంబు గానంబు గా

వరమంజీరరవంబు తాళగతి గా ♦ వర్ధిల్లుశాతోదరీ
సురతన్యత్యయవేగతాండవ మొన♦ర్చుం జింతితాభీష్టముల్. 182

టీ॥ మరుఁడాచార్యుఁడుగాన్ = మదనుండుశిక్షాగురువుకాఁగా; విశీర్ణ ...గాన్=వీడినకొప్పునందలిమాలికలగుంపు పుష్పాంజలులుకాఁగా; తదుపేత...గాన్ = ఆపుష్పమాలికలనుబొందినతుమ్మెదలనాదముల మొత్తముసంగీతముకాఁగా; వర...గాన్ = శ్రేష్ఠమగుగజ్జెలచప్పుడుతాళాఘాతముకాఁగా; వర్ధిల్లు...తాండవము = వృద్ధిఁబొందు నట్టిసన్నమధ్య యొక్క యుపరిరతమను వేగముతోఁగూడినవాట్యవిశేషము గింతితాభీష్టముల్ = నరసభూపాలుఁడుగోరినకోర్కులను; ఒనర్చున్ = చేయును. ఇందుపరిరతము చెప్పఁబడినది గాన సంభోగశృంగార మని తాత్పర్యము.

సంభోగము పరస్పరావలోకనాలింగనచుంబనాదినానారూపమై విలసిల్లునది గాన సురతరూపమే కాక యితరరూపము నుదాహరణంబు గావచ్చును. అది యెట్లన్న, నమరుకమున, "ఉ. లేమ నిజంబుగా అవికి♦లేకయ జోక వహించు వంచు స। కోమలివేణికం బ్రియుఁడు ♦ గోరిక నంటఁగ సజ్జపజ్జ నెం। తో ముకిపెంపునవ్వోలయు♦తోయ్యలి మాడుకల వేడుక లొందియా। భామనఖజనం బొకనె♦పం బిడి నేగెఁ గ్రమక్రమంబునన్." ఇది పురుషప్రవర్తితసంభోగ మనఁబడును. "మ. విజనం బైననివాసమందిరము ను♦ద్వీక్షించి గొంకింత లే। చి జగత్సుందరి నిద్దురించె నను దృ♦ష్టి న్నమ్మి నాథాననా౦। బుజమెంతేఁ గని ముద్దు లాడి పులక♦ప్రోద్యత్కపోలావళో। కజలజ్జావనతాస్యయయ్యె నగుచుం♦గాంతుండు ముద్దాడఁగన్." ఇది స్త్రీప్రవర్తితసంభోగమున కుదాహరణ మగును. వీనిమూలశ్లోకంబులు రెండును గావ్యప్రకాశమునందుఁ బైసంభోగద్వయమునకు నుదాహృతంబు లయ్యె.

విప్రలంభశృంగారభేద నిరూపణము.

క. పురుషులకుఁ దలోదరులకు
నరయంగా విప్రలంభ ♦ మభిలాషేర్ష్యా
విరహప్రవాసకారణ
పరిణతిచే నాల్గు గతులఁ ♦ బరఁగుచు నుండున్. 183

టీ॥ పురుషులకుఁదలోదరులకున్ = పురుషులకును స్త్రీలకును; విప్రలంభము = విప్రలంభశృంగారము; అరయంగాన్ = విచారింపఁగా; అభిలాష...పరిణతిచేన్ = అభిలాషము ఈర్ష్య విరహము ప్రవాసము అను కారణముల భేదముచేత; నాల్గుగతులన్ = అభిలాషవిప్రలంభము ఈర్ష్యావిప్రలంభము విరహవిప్రలంభము ప్రవాసవిప్రలంభము అనినాల్గు తెఱంగులుగా; పరఁగుచునుండున్ = ఒప్పుచుండును. కొందఱు శాపవిప్రలంభమని యైదవదానిం జెప్పియున్నారు. అందుకు మేఘసందేశాదు లుదాహరణంబులు.

అభిలాషాదులలక్షణములు.

క. కలయుటకు మున్ను కోరిక
యిల నభిలాషంబు మాన ♦ మీర్ష్య విరహ మూఁ
గలసి యెడఁబాయు ట్లదియో
తత్కాలిక ప్రవాసము విదేశ ♦ గతి యొట్లన్నన్. 184

టీ॥ కలయుటకుమున్ను = స్త్రీపురుషులసంయోగమునకు పూర్వకాలమందు; కోరిక = వాంఛ; ఇలన్ = భూమియందు; అభిలాషంబు = అభిలాషమనఁబడును. మానము = ప్రియుఁడన్య స్త్రీసంబంధముగలవాఁడని గలిగెడుకోపము; ఈర్ష్య = ఈర్ష్యయనఁబడును.

“శ్లో॥ స్త్రీణా మీర్ష్యాకృతః కోపో మానో ఽన్యాసజ్ఞని ప్రి

గ్నో" అనిదశరూపకము. ఇందు మ్మానపదముచేతఁ బ్రణయమానమును బోధిత మగుచున్నది. అది యీర్ష్యాశబ్దవాచ్యము గాక విరహములోఁ జేరుచున్న దని కొందఱి యాశయము. మఱికొంద ఱీర్ష్యాపదమున్న చోట మూలమునందే మానపదము నుంచి ప్రణయేర్ష్యామానములు రెండును దాని యర్థములుగాఁ జెప్పుచున్నారు. సర్వమతములయందు నీర్ష్యామానము స్త్రీలకే యనియుఁ బ్రణయమానము స్త్రీపురుషులకుఁ గలుగు ననియు సిద్ధాంతముగ నున్నది. "శ్లో॥తత్ర ప్రణయమాన స్స్యాత్కోపావసితయోర్ద్వయోః" అనియు, "శ్లో॥ స్త్రీణా మీర్ష్యాకృతః కోపో మానో ఽన్యాసఙ్గినిప్రియే" యనియు దశరూపకంబు. ఇట్లు సిద్ధాంతస్థితియుండఁగా నీగ్రంథములో "పురుషులకుఁ బలోదరుల" కని పురుషులకును ఈర్ష్యామానము గలుగునట్లు చెప్పఁబడినది. ఇది యొప్పుగాఁ దోఁచదు. స్త్రీల కీర్ష్యామాన మన్య స్త్రీసంగతిజన్య కోపరూపమగునపుడు, పురుషుల కన్యపురుషసంగతిజన్యకోప మీర్ష్యామాన మని కదా వచింపవలె. అది యసంగత మ్మని వేఱుగఁ జెప్పుట యనావశ్యకము.

కలసియెడఁబాయక = స్త్రీపురుషులుకూడి మఱల నెడఁబాయఁగా ; హృదయోత్కలిక = మనస్సునందుఁగలిగెడునుత్కంఠ, అనఁగానిచ్ఛావిశేషము; "శ్లో॥ సర్వేన్ద్రియసుఖాస్వాదో యత్రాస్తీత్యభిమన్యతే । తత్ప్రాప్తీచ్ఛాంససంకల్పా ముత్కణ్ఠాంకవయోవిదుః॥" అని తత్ప్రమాణవచనము, ఇట్టియుత్కంఠ ; విరహమౌర్ = విరహమగును.

ప్రతాపరుద్రీయములో, "విరహో నామలబ్ధసంయోగయో ర్నాయికానాయకయోః కేనచి త్కారణేన పునస్సమాగమకాలాతిక్షేపః" అని విరహపదార్థము చెప్పఁబడియుండఁగా, నిందుఁ "గలసి

"యెడఁబాయు" నని మాత్రమే చెప్పక, "వ్యాగమోత్కలిక" యని య ధికముగాఁ జెప్పుట విరహలక్షణవిరుద్ధము. విరహోత్కంఠితాశబ్దము నకు విరహకాలమం దుత్కంఠగల దని యర్థము. దీనిమతమందు విర హశబ్దమునకే విరహకాలికోత్కంఠ యర్థమైనప్పుడు విరహోత్కంఠ యం దుత్కంఠ గలు దని యసంగతార్థము గలుగును గదా!

విదేశగతి=నాయికానాయకులకుభిన్నదేశప్రాప్తి; ప్రవాసము= ప్రవాసమనఁబడును. ఎట్లన్నన్.

అభిలాషజన్యవిప్రలంభమున కుదాహరణము.

చ. అనయము శ్రీనృసింహులలి♦తాంకతలంబున నుండ వచ్చు నా
యనఘునఖాంకసంగతుల ♦ నందఁగ వచ్చు నృపాలమౌళితోఁ
జనవునఁ గుల్క వచ్చు గుణ ♦ సంగతి మెచ్చులు చూప వచ్చు నో
వనజదళాక్షి యాకనక♦వల్లకి నైనను ధన్య నౌదుఁ గా. 185

టీ॥ ఓవనజదళాక్షి=ఓకమలపత్త్రములవంటికన్నులుగలదానా! అనయమున్=ఎల్లప్పుడు; శ్రీ...వచ్చున్ = సంపన్నుఁడగు నరసభూపా లునియొక్క మనోహరమైనతొడమీఁదనుండవచ్చును. ఆయనఘు...వ చ్చున్=ఆపవిత్రుండగువాని నఖచిహ్నములసంబంధములఁబొందవచ్చు ను. నృపాలమౌళితోన్ = రాజశ్రేష్ఠుండగు నరసభూపాలునితో; చన వునన్=మచ్చికచేత; కుల్కవచ్చున్ = ప్రకాశింపవచ్చును. గుణసంగ తిన్=సౌశీల్యాదిగుణములయొక్కయు, తంతువులయొక్కయు, సంబం ధముచేత; మెచ్చులు = శ్లాఘనలను; చూపవచ్చున్. ఆకనకవల్లకి నైనను = నేనుఆనరసభూపాలునొద్దనున్నబంగరువీణగానైనను; ధన్య నౌదుఁగా= ధన్యురాలనౌదునుగదా! ఇందు నాయిక నరసభూపాలుని సాంగత్యమును గోరినందున నభిలాషజవిప్రలంభ మగును.

ఈర్ష్యాజన్యవిప్రలంభమున కుదాహరణము.

చ. వదనాగ్రంబున వాణి యున్నది మము ♦ న్వాక్రువ్వ నీ దిందిరా
మదిరాక్షీమణి యున్న దక్షుల మము♦న్మన్నించి వీక్షింప నీ
దదియుం గాక నృసింహ నీవిపులబా♦హాశ్లేష మే నొంద నో
ర్వదు భూదేవి బహుప్రియారత నినుం♦బ్రార్థింప నిం కేటికిన్. 186

టీ॥ నృసింహ=నరసభూపాలుఁడా! వదనాగ్రంబునన్=నీముఖాగ్రమునందు, జిహ్వాగ్రమునందనుట; వాణియున్నది = సరస్వతియున్నది. మమున్=భాగ్యహీనయగునాతో; వాక్రువ్వనీదు= మాటాడనీయదు. అక్షులన్=నీకన్నులయందు; ఇందిరామదిరాక్షీమణి= లక్ష్మీదేవి; ఉన్నది= వసించినది. మమున్ = అభాగ్యురాలగునన్ను; మన్నించివీక్షింపనీదు=గౌరవించిచూడనీయదు. అదియుంగాక=అంతియేకాక; భూదేవి= భూమిదేవియు; నీవిపులబాహాశ్లేషము=నీవిశాలములైనభుజములయాలింగనమును; ఏనొందఁగనోర్వదు= నేనుబొందఁగాసహింపదు. బహుప్రియారత = బహునాయికాసక్తుఁడా! నినున్=నిన్ను; ప్రార్థింపన్= యాచించుట; ఇంకేటికిన్= ఇంకనేమిప్రయోజనమునకు? సంభాషణాలోకనాలింగనాదికృత్యంబులకై నిన్నుఁ బ్రార్థింప సరస్వత్యాదులవశంవదుఁడవై నీవు మన్మనోరథపూర్తి సేయవు, ఇఁక నిన్నుఁబ్రార్థించుట వ్యర్థ మని తాత్పర్యము.

ఇందు నాయిక తనప్రియుం డగునరసభూపాలుండు నాయికాంతరాసక్తుఁ డాయె నని యీర్ష్య నొంది నందున నిది యీర్ష్యావిప్రలంభము.

విరహజన్యవిప్రలంభమున కుదాహరణము.

ఉ. నెచ్చెలి నీనృసింహధర♦ణీవరుఁ డెచ్చెద మంచుఁ బోయి రా

రిచ్చుట నీవురుం గరుణ ♦ యించుక లే కలరంపగుంపులం
గ్రుచ్చెద వేల మత్ప్రియునిఁ ♦ గూర్పుము మన్మథ నీకుఁ దద్విభుం
దెచ్చుటకై యొసంగెద మ♦దీయకటాక్షము లజ్జయాస్త్రముల్.

ఇది నాయికాప్రకరణంబున విరహోత్కంఠితకు లక్ష్యముగ నుదాహరింపఁబడినందున నందె దీనియర్థము వ్రాయఁబడినది. ఇందు నాయిక ప్రియు నెడఁబాసినందున విరహవిప్రలంభ మగు.

ప్రవాసజవిప్రలంభమున కుదాహరణము.

చ. చిరయశ యోబభూవర నృ♦సింహ భవద్రిపుకాంత కాననాం
తరమున కేగి యందు నిజ♦నాథునిఁ గానక మన్మథార్తయై
వరుని సరోజపత్త్రమున ♦ వ్రాయు నెడం గరము ల్చెమర్పఁగా
నరయ నిజాంగకంబె పగ ♦ యయ్యె నటంచుఁ దలంచు దైవమున్.

ఇదియు నాయికాప్రకరణమ్మునఁ బ్రోషితపతికోదాహరణ మగుట నందె వ్యాఖ్యాత మయ్యె. ఇందు నాయికానాయకులకు భిన్నదేశవాసము గలిగినందునఁ బ్రవాసవిప్రలంభ మగును.

రసాభాసమునకు లక్షణము.

క. పలువుర కొకభామినిపైఁ
దలఁపును నొకవారసతికిఁ ♦ దగఁ బలువురపై
వలపును మృగవిహగాదుల
కెలవు రసాభాస మయ్యె ♦ క్షితి నెట్లన్నన్. 188

టీ॥ పలువురకున్ = బహుపురుషులకు; ఒకభామినిపైఁదలఁపును = ఒకస్త్రీయందుఅనురాగమును; తగన్ = ఒప్పునట్లుగా; పలువురిపైన్ = బహుపురుషులయందు; ఒకవారసతికిన్ = ఒకవారాంగనకు; వలపును =

అనురాగమును; మృగవిహగాదులకెలవు= మృగములుపక్షులుమొదల
గువానియనురాగమును; క్షితౌ= భూమియందు; రసాభాసముచ్యేత్=
రసాభాసమనునదియగును. ఎట్లన్నన్.

ఈలక్షణము "శ్లో॥ ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా। యోషితో బహుసక్తిశ్చే ద్రసాభాసస్త్రిధా మతః॥" అను ప్రతాపరుద్రీయమునం దున్నప్రాచీనలక్షణమునందుఁ జెప్పఁబడినవానిలో నేకత్రైవానురాగ మనఁగా స్త్రీపురుషులలో నొకరికే యనురాగము గలిగియుంటయు, పశుపక్ష్యాదితిర్యగ్జంతుగతరతియు, నీచజనాశ్రయంబగురతియు, స్త్రీకి బహుపురుషులయం దాసక్తియు, ననురసాభాసభేదంబులలోఁ దిర్యగ్గతిమాత్రమునకె సంగ్రాహకమై యున్నది గాని తక్కిన యేకత్రానురాగమునకు మ్లేచ్ఛానురాగమునకు స్త్రీనిష్ఠ మగు బహుపురుషానురాగమునకు సంగ్రాహకంబు గాదు. మృగవిహగాదుల యనుచోటియాదిపదముచేత నీచనరాశ్రయ మగుననురాగమునకు మాత్రము గ్రహణ మైనను నితరంబులకుఁ గాదు. ఒకవారసతి కనుచోట వారపదము లేక యొకసతి కనిమాత్ర మున్నచో స్త్రీనిష్ఠబహుపురుష విషయకరతికి సంగ్రహం బగును. విత్తమాత్రోపాధికసకలపురుషానురాగ సామాన్య యని సహజసిద్ధ యగు వారకాంతయనురాగమే రసాభాస మైనపుడు కులటాదినిష్ఠబహుపురుషానురాగము రసాభాస మేల కాదు? కావున నొకవారసతి కనునది యుక్తంబుగాఁ దోఁచదు. ఇట్లు పలుపుర కొకభామినిపై వల పనునదియు యుక్తంబుగాఁ దోఁచదు. ఎట్లన్న, బహుపురుషుల కొకభామినిపై వలపు గలిగినపు డాభామినికిని వారియం దనురాగ ముండెనేని "యోషితోబహుసక్తిశ్చేత్" అని ప్రాచీనులు చెప్పినరసాభాసములోఁ జేరును. ఆస్త్రీకి లేక పురుషులకు మాత్రమె యనురాగ ముండినచో "ఏకత్రైవానురాగశ్చేత్" అని

చెప్పినదానిలోఁ జేరును. కావున నిట్లు ప్రాచీనలక్షణావిపరీతముగఁ గల్పించుటయేగాక వేఱు విశేషము లేదు. మఱియు ననేకస్త్రీల కొకనాయకునియందుఁ గల యనురాగ మాభాసము గాక రసముగాఁ జేయ నప్పుడు, అనేకపురుషుల కొకనాయికయందుఁ గలుగు ననురాగము మాత్రము స్వయంవరాదిదృష్టాంతములచేత రసాభాసము గాక రసరూపమేల కాఁదగదు?

ఇందు రసార్ణవసుధాకరమున, "తత్ర శృఙ్గారస్యారాగా దనేకరాగా త్తిర్యగ్రాగా న్మ్లేచ్ఛరాగా చ్చాభాసత్వమ్। తత్రారాగో రాగాభావః। సచ ప్రాగభావః ప్రధ్వంసాభావః అత్యంతాభావ శ్చేతి త్రివిధః। తత్ర ప్రాగభావే దర్శనాదికారణేషు సంభావితేషు రాగోత్పత్తిసంభావనయా నాభాసత్వ మితరయో స్తు కారణసద్భావేపి రాగానుత్పత్తే రాభాసత్వమేవ" ఇత్యాదిగ్రంథముచేతఁ బూర్వానురాగమం దనురాగోదయసంభావనచే నొకరికి తొలుత రతి గలిగినను రసాభాసత లే దని చెప్పఁబడి యున్నది. ఇట్లనేకపురుషులకుఁ గాని స్త్రీలకుఁ గాని యొకరియం దనురాగము రసాభాసము గా దని యేర్పడుచుండఁగా "బలువుర కొకభామినిపై వలపు" అనుట యుక్తరూపంబుగాఁ దోఁచదు.

అనురాగ మనఁగా రత్యవస్థావిశేషము. అది పరిపూర్ణత నొందినపుడు రసత్వము నొందు నని సిద్ధాంతము గావున నొక చిత్తమునం దనేకవిషయానురాగ ముదయించినపుడు దేనికిని బరిపూర్ణభావము గలుగ దని యాభాసత చెప్పవచ్చును. అనేకచిత్తవ్యక్తులయందుఁ బ్రత్యేకమనురాగ ముదయించినపుడు స్వయంవరాదులయందువలె ననురాగోత్పత్తిసంభావనవలన నాభాసత గలుగ దని పై గ్రంథాశయము. ఇందుననే పరకీయకుఁ బతియందు నుపపతియందు ననురాగ

మున్నచో రసాభాసత ప్రసక్తించు నని శంకించి బలవత్తరమైన పరపురుషానురాగముచేత దుర్బల మగుస్వపురుషానురాగము బాధితమగుటం జేసి రసత్వము నొందు దని "స్వామిన్యేవానురక్తాస్వీయా" యనురసతరంగిణీవాక్యమువ్యాఖ్యలయందు వ్రాయంబడియె.

ఇట్లేకవ్యక్తి కనేకవ్యక్తులయం దనురాగ మాభాసమే యని యేర్పడినచో "శ్లో॥ ఏత త్పరిస్ఫురతిపద్మదృశాం సహస్ర మక్షిద్వయం కథయ కుత్ర నివేశయామి। ఇత్యాకలయ్య నయనామ్బురుహే నిమీల్య రోమాఞ్చితేన వపుషా స్థిత మచ్యుతేన॥ వ్యాపత్రపా శ్చలితా శ్చైవ స్ఫారితాః పరమాకులాః। పాండుపుత్త్రేషు పాఞ్చాల్యాః పతన్తి ప్రథమా దృశః॥" అనులక్ష్యములయందును రసాభాసత ప్రసక్తించును. దీనింగూర్చి గ్రంథములయందిట్లు వ్రాయంబడినది. ఎట్లన్న, "ఏవ మేక స్యానేకవిషయరతీ రసాభాస ఏవ। పరం త్వేషవిశేషః। యస్య స్వవస్థితా బహ్వ్యో నాయికా భవన్తి తత్ర న రసాభాసః। తథాసతి కృష్ణస్య సకలోత్తమనాయకస్య బహుకామినీవిషయాయా రతే రాభాసత్వాపత్తేః। తస్మాత్ అవ్యవస్థితబహుకామినీకవైశికనాయకపర మేతత్। అతఏవ వైశికానాం వేశ్యానాం చ రతీ రసాభాస ఇతి ప్రాచీనమతమ్॥" అనిపూర్వపద్యవిషయమై రసతరంగిణియందును, ఉత్తరపద్యమునుగూర్చి "అత్రపాఞ్చాల్యా బహువిషయాయా రతే రభివ్యంజనా ద్రసాభాస ఏవేతి నవ్యాః। ప్రాఞ్చ స్త్వపరిణేతృబహునాయకవిషయత్వే రసే రసాభాస ఇత్యాహుః" అని రసగంగాధరమునందును వ్రాయంబడినది.

ఇట్లు చెప్పుటవలన, "శ్లో॥ పఙ్క్తేషు క్షితిపప్రతాపలహరీ ప్రీతి స్తదీయా పునః కాసాం న స్తనకాఞ్చనాచలతటే కాశ్మీరపఙ్కాయతే। కాసా మ్మూర్ధని నైవ పఙ్కజదృశాం సిన్దూరరేఖాయతే కాసాం నా

నచ కర్ణయోః ప్రియసఖే మాణిక్యభూషాయతే ॥ అను వైశికవిషయ మందును, "శ్లో॥ స్తునః కం వామాక్షి క్షణమపి వినా యం న రమ సే విలేభే కః ప్రాణాన్ రణమఖముఖే యమ్మృగయసే । సులగ్నే కో జాత శ్శశిముఖి యమాలిఙ్గసి బలా త్తపశ్శ్రీః కస్యైషా మదన నగరి ధ్యాయసి తు యమ్" అను వేశ్యావిషయమందును "శ్లో॥ క్షోణీ నామ త్రికోణీ నదనగనగరగ్రామరుద్ధం తదర్ధం తత్రా ప్యర్ధం తరుణ్యా శ్శిశుగళితవయఃపూరితం తత్ర చార్ధమ్ । త్యాజ్యా స్తత్రాపి పూజ్యా శ్శ్వశురగురుముఖా స్సన్తి శేషాః కియన్తో మిథ్యావాదో మ మాయం దిశి దిశి ముఖరః పుంశ్చలీ పుంశ్చలీతి" అనుకులటావిష యమందును రసాభాసతయే యేర్పడుచున్నది. "శ్లో॥ స్నాతా తిష్ఠతి కున్తలేశ్వరసుతా వా రోఙ్గరాజస్వసు ర్ద్యూతే రాత్రి రియం జితా కమలయా దేవీ ప్రసాద్యాఽధునా । ఇత్యన్తఃపురసున్దరీజనగుణే న్యూనా ధికం ధ్యాయతా దేవే నాప్రతిపత్తి మూఢమనసా ద్విత్రాః స్థితా నాడికాః" ఇత్యాదులయందు దక్షిణనాయకత్వంబును నిరాబాధముగ సిద్ధించుచున్నది.

కొందఱు దక్షిణనాయకునివిషయమై, "దక్షిణస్య నాయకస్య నాయికా స్వనేకాసు వృత్తిమాత్రేణైవ సాధారణ్యం న రాగేణ । త దేకస్యా మేవ రాగస్య ప్రౌఢత్వ మితరస్యాంతు మధ్యమత్వం మంద త్వం వేతి న తదనురాగస్య రసాభాసతా॥" అనిరి వ్రాసిరి. ఈమతము నం బాంచాల్యాదులయందు ననురాగతారతమ్యము గల్పించి బాహ్యవృత్తితౌల్యమువలన నాభాసత పరిహారము చేయవలసి వచ్చును. ఇట్లు చెప్పినపుడు గాఢానురాగమున్నవిషయముననే రసత్వ మనియుం దదితరవిషయమున నాభాసత యనియుం బ్రసక్తించు నని తోంచుచున్నది. మఱియు, వేశ్యాకులటానురాగములకును దారతమ్యకల్పనచే

నాభాసత పరిహార్యమై యతిప్రసంగమగును. కావునఁ బూర్వమందు వ్రాసినసిద్ధాంతమె తగును.

మఱియు నీగ్రంథములో, "శ్లో॥ సామాన్యవనితా వేశ్యా సా ద్రవ్యపర మిచ్ఛతి । గుణహీనే నచ ద్వేషో నానురాగో గుణి న్యపి । శృఙ్గారాభాస ఏతస్యాం న శృఙ్గారః కదాచన । తన్మతం నానుమనుతే శ్రీమాన్ శిఙ్గమహీపతిః । తస్యాః ప్రకరణాదౌచ నాయికాత్వవిధానతః । అనాయికావర్ణనేతు రసాభాసప్రసఙ్గతః" ఇత్యాదులచే సామాన్యనాయికారతి రసాభాసముకా దని వ్రాయఁబడెను. అయినను సామాన్య రక్తావిరక్తాభేదములచే రెండుతెఱంగులు గాన రక్తలగునూర్వశ్యాదులరతి యాభాసము గాకపోయినను మనము చూచుచున్న కేవలభగవృత్తులుగా నుండుదాసులు కులటలు వేశ్యలు మొదలగువారిరతి ఆభాసమే. భగవృత్తులుగాక యనురాగముచేఁ బురూరవునియం దూర్వశివలె వర్తించుకాంతలరతి ఆభాసము గాకుండ వచ్చు నని నా యాశయము.

ఇవి యున్ని యిట్లుండఁగా, రసగంగాధరములో "శ్లో॥ అనౌచిత్యా దృతే నాన్య ద్రసభఙ్గస్య కారణమ్ । ప్రసిద్ధౌచిత్యబన్ధస్తు రసస్యోపనిష త్పరా । తదాభాసా అనౌచిత్యప్రవర్తితాః॥" ఇత్యాదిగ్రంథములనుబట్టి "అనుచితవిభావాలమ్బనకరతిత్వం రసాభాసత్వమ్" అని లోకయాత్రానువిధాయిగ నుండి లోకమున కనుచిత మని తోఁచకుండురతి రస మనియు, లోకగర్హాస్పద మగునది యాభాస మనియుఁ, బరిష్కరించి, తదనుగుణముగ, "శ్లో॥ ఉపనాయకవిషయాయాం మునిగురుపత్నీగతాయాంచ । బహునాయకవిషయాయాం రతౌ తథానుభయనిష్ఠాయామ్" అని యుపపతివిషయకపరకీయారతియు, మునిగురురాజపత్న్యాదివిషయకరతియు, బహునాయకవిషయకరతియు, అ

నుభయనిష్ఠరతి యనఁగా నొకరియందొకరికి గల రతియు, సాభాసము లని వ్రాయఁబడినది. ఇందుఁ బూర్వులు వ్రాసినదానికన్న నుపనాయకరతియు మునిగుర్వాదిపత్నీవిషయకరతియు రసాభాస మని విశేషము గనుపట్టుచున్నది.

అందులోఁ బరకీయ కుపనాయకవిషయరతి ఆభాస మనువిషయమునందు "శ్లో॥ పరోఢాను పరేణోఢా హ్యన్యసంభోగలాలసా । లక్ష్యే క్షుద్రప్రబన్ధేషు సా సప్తశత్యాదికే బుధైః" అనుశింగభూపాలీయము సహాయ మగుచున్నది. ఐనను మునిగుర్వాదిపత్నీవిషయకరతివలెఁ బరకీయకు బహునాయకాసక్తియె యత్యంతానుచితంబై రసాభాసం బగుఁ గాని యొక యుపపతియందే యనురాగమున్నచో నది ఆభాసము గా దనుచుఁ గొన్నియుక్తులు కొందఱు రసికులు వచింతురు. అందలి సారాసారంబులు చర్చించి పరిష్కరించుట గ్రంథవిస్తరహేతు వని విరమింప నాయెను.

ఇఁక మున్యాదిపత్నీవిషయకరతి ఆభాస మనుటకు "అనౌచిత్యాదృతే నాన్యద్రసభఙ్గస్య కారణమ్." అని యనౌచిత్యమె ముఖ్యబీజము. సామాజికసహృదయాంతఃకరణమున కనౌచిత్యము దోఁచుటవలనఁ, దత్తత్కాలమందు గురుపత్న్యాదిగాములకు సుఖానుభవ ముండినను, నది కావ్యనాట్యాదిద్వారముగ రసత్వ మొందదు. ఇట్టిస్థితియందుఁ దారాశశాంకాదులు రసాభాసము లని వేఱుగ వ్రాయం బని లేదు. పెక్కేల? కావ్యప్రకాశములో, "అత్యుత్తమదేవతాదివిషయకత్వేన వర్ణ్యమానా రతి రనుచితా తద్వర్ణనం హి మాతాపిత్రో రతివర్ణన మివాత్యన్త మనుచితమ్." అని మాతాపిత్రాదిరతివర్ణనమువలె నత్యుత్తమదేవతారతివర్ణనమును అత్యంతానుచితంబు గాఁబట్టి రసాభాస మగు నను నాశయము తెలుపఁబడినది.

కావునఁ గావ్యమందును నాట్యమందును గవిచేతను నటునిచేతను లలితసందర్భముతోఁ దెలుపఁబడిన లోకోత్తరదుష్యంతశకుంతలాదినాయికానాయకులచేతను మలయానిలచంద్రికాద్యుద్దీపనములచేతను చింతాదివ్యభిచారులచేతను అశ్రుపాతాదిసాత్త్వికములచేతను సహృదయసామాజికచిత్తములు ద్రవించి తన్మయత్వము నొంది విగలితవేద్యాంతరమగు నిర్భరానందము నొందుటయే రసానుభవరూపమై యుండఁగా, పానకాదిరసములోఁ దృణాదులవలె ననుచితవిభావాదులు దోఁచినపుడు రసాభాసంబు గాక తప్పదు.

తిర్యఙ్మ్లేచ్ఛాదిరతి రసాభాస మనుటకు నిదియే ముఖ్యకారణమని నాయభిప్రాయము. తత్తజ్జాత్యుచితవిభావాదులచేఁ దత్తజ్జాతీయులకు సుఖానుభవమగుచున్నదే యన్నను, సహృదయసామాజికులకుఁ, దద్రత్యాదివర్ణనము సేయునపుడు, దుష్యంతశకుంతలాదిరతివర్ణనమునందువలెఁ దన్మయత్వంబు గలిగి, దాము వర్ణ్యనాయకులుగను వారిస్త్రీలు తమ్ముఁగూర్చి విభావంబులుగను చిత్తము పరిణమిల్లి, రసానుభవంబు గావలెఁ గదా! ఇందు, "తత్కాలవిగలితదుష్యంతరమణీత్వాదిభిరలౌకికవిభావాదిశబ్దవ్యపదేశ్యైః దుష్యంతశకుంతలాదిభిః" ఇత్యాదిగా "అతఏవ పరిమ్లిష్టపరిమితప్రమాతృత్వాదినిజధర్మేణ ప్రమాత్రా" అనునంతవఱకు కావ్యప్రకాశగ్రంథము నవలోకింపవలయు. ఇందే పిత్రాదిరతియు దేవాదిరతియు మొదలగుననుచితవిభావాలంబనరతులు రసాభాసమని చెప్పఁబడెను. ఏలయనఁగా, వారి రతివర్ణనమందు సామాజికసహృదయులకుఁ దమయందు పిత్రాదిబుద్ధియుఁ దద్విభావములందు స్వవిభావబుద్ధియుఁ గలుగవలెఁ గదా!

కావున ననుచితరతి పశ్వాదిరతి మొదలగునవి లోకములో రుచ్యంబులుగఁ దోఁచినను గావ్యనాట్యయోగ్యమగు శాస్త్రసిద్ధరసత్వము

నొందఁ జాలవు. చూడుఁడు శాస్త్రము, "అభక్ష్యో గ్రామ్యకుక్కుటః అభక్ష్యో గ్రామ్యసూకరః" అని భక్ష్యాభక్ష్యనియమంబును. "ఇయం గమ్యా ఇయమగమ్యా" అని గమ్యాగమ్యనియమమును మొదలగున వి విధించి యిట్లనుష్ఠించువారి కభ్యుదయ మగు నని దెలుపుచున్న దే గాని ప్రవర్తించువారిని వారింపఁ జాలదు. వారికెని భక్ష్యమునందు వలె నభక్ష్యమునందును దృప్తి, గమ్యలందువలె నగమ్యలయందును సుఖము, నవైషమ్యంబుగఁ జూపట్టుఁగాక. ఇట్లు లోకానుభవములో రుచ్యములుగాఁ దోఁచినను, అనుచితవిభావాలంబనరత్యాదివర్ణనంబులు శాస్త్రమార్గవిరుద్ధంబులై ఆభాసత నధిగమించుచున్నవి.

ఇఁక రసాభాసంబులకు వరుసగ నుదాహరణంబులు.

అందలి యరాగము రాగాభావ మనియు, నది ప్రాగభావము ప్రధ్వంసాభావము అత్యంతాభావ మని త్రివిధ మ్మనియు, అందుఁ బ్రాగభావమునందు దర్శనాదికారణసామగ్రియుండఁగా రాగోదయం బగు నని సంభావనచే యువతీయువతులలో నొకరికి ముందు రతి గలిగి యితరులకు లేకున్నను రసాభాసము గాదనియు వ్రాసి యున్నాఁడను. అందు "శ్లో॥ భవిత్రీ రమ్భోరు త్రిదశవదనగ్లాని రధునా స మే రామః స్థాతా న యుధి పురతో లక్ష్మణసఖః। ఇయం యాస్యత్యుచ్చై ర్విపద మధునా వానరచమూ ర్లఘిష్ఠేదం షష్ఠాక్షరపరవిలోపాత్పఠ పునః॥" అనునది రాగాత్యంతాభావమున నాభాసత కుదాహరణము.

"శ్లో॥ గతే ప్రేమావేశే ప్రణయబహుమానే విగలితే నివృత్తే సద్భావే జన ఇవ జనే గచ్ఛతి పురః। త దుత్ప్రేక్ష్యోత్ప్రేక్ష్య ప్రియసఖి గతాం స్తాంశ్చ దివసా న్న జానే కో హేతు ర్దళతి శతధా యన్న హృదయమ్॥" అను నది రాగప్రధ్వంసాభావమున నాభాసత కుదాహరణము.

"శ్లో॥ పరస్పరేణ క్షతయోః కయోశ్చి దుత్కంఠితయో ర్న్యవాయో స్వమకాల మేవ। అమర్త్యభావం గతయోః కయోశ్చి దేవాప్సరః ప్రార్థితయో ర్వివాదః॥" అనునది స్త్రీకి బహుపురుషాసక్తివలన నాభాసత కుదాహరణము.

"శ్లో॥ రమ్యం గాయతి మేనకా ప్రతిరుచి ర్వీణాస్వనై రూర్వశీ చిత్రం వక్తి తిలోత్తమా పరిచయ న్నానాఙ్గహారక్రమైః। ఆదత్తే లమిదం త దుత్తమ మితి ప్రేమ్ణా నవో విద్విషా భేజే శ్రీయనపోతశిఙ్గనృపతే స్త్వత్ఖడ్గభిన్నాత్మనా॥" ఇది పురుషునకు బహునాయికాసక్తివలన రసాభాసత కుదాహరణము.

"శ్లో॥ మధు ద్విరేఫః కుసుమైకపాత్రే పపౌ ప్రియాం స్వా మనువర్తమానః। శృఙ్గేణ సంస్పర్శనిమీలితాక్షీం మృగీ మకణ్డూయత కృష్ణసారః॥" ఇది తిర్యగ్గతిగా నైనందున రసాభాసత కుదాహరణము.

"శ్లో॥ ఏత న్మన్దవిపక్వతిన్దుకఫలశ్యామోదరాపాణ్డురప్రాన్తం హన్త పులిన్దసున్దరకరస్పర్శక్షమం లక్ష్యతే। తత్పల్లీపతిపుత్త్రి కుఞ్జరకులం కుమ్భాభయాభ్యర్థనాదీనం త్వా మనునాథతి స్తనయుగం పత్త్రావృతం మాకృథాః॥" ఇందు "కిరాతశబరపులిన్దా మ్లేచ్ఛజాతయః" అని మ్లేచ్ఛయోనివిశేషము లగుపులిందపల్లీపతిపుత్రికలయనురాగము వర్ణితమైనందున మ్లేచ్ఛాలంబనకమగుట రసాభాసతకు నుదాహరణము.

"శ్లో॥ పతిం ముక్త్వా నిద్రాశిథిలభుజబన్ధం చలితయా కవాటం నిశ్శబ్దం లఘు వివృతవత్యా మృగదృశా। క్వచి త్కోణే లీనో ఘనతమసి సాశఙ్కితకిగిరా సమాహూతః స్వైరం విహరతి తయా కోఽపి సుకృతీ॥" ఇది యుపనాయకవిషయకరతి యగుటంజేసి యాభాసత కుదాహరణము.

"శ్లో॥ శతే నోపాయానాం కథమపి గతః సౌధశిఖరం సుభ్రూ

ఫేనస్వచ్ఛే రహసి శయితాం పుష్పశయనే । విబోధ్య తామాఙ్గీం చకి
తనయనాం స్మేరవదనాం సనిశ్వాసం శ్లిష్య త్యహహా సుకృతీ రాజరమ
ణీమ్॥" ఇందు రతి రాజపత్నీవిషయ మగుటం జేసి యాభాసత కుదా
హరణము. ఉదాహరణాంతరంబు లూహ్యంబులు. ఇవి సంభోగాభాసో
దాహరణములు.

"శ్లో॥ వ్యత్యస్తం లపతి క్షణంక్షణ మధో మౌనం సమాల
మ్బతే సర్వస్మిన్ విదధాతి కించ విషయే దృష్టిం నిరాలమ్బనామ్।
శ్వాసం దీర్ఘ మురీకరోతి న మనా గఙ్గేషు ధత్తే ధృతిం వైదేహీకమ
నీయతాకబలితో లఙ్కేశ్వరో వర్తతే॥" ఇది విప్రలంభాభాసమున
కుదాహరణము.

ఇట్లు, కలహశీలకుపుత్త్రాద్యాలంబనముగను వీతరాగాదినిష్ఠ
ముగను శోకము, బ్రహ్మవిద్యానధికారిచండాలాదిగతముగ నిర్వేదము,
కదర్యకాతరాదిగతముగను పిత్రాద్యాలంబనముగను క్రోధోత్సాహ
ములు, ఐంద్రజాలికాలంబనముగ విస్మయము, గుర్వాద్యాలంబనము
గ హాసము, మహావీరనిష్ఠముగ భయము, యజ్ఞీయపశువసాసృఙ్మాం
సాద్యాలంబనముగ జుగుప్సయు, కావ్యనాట్యాదులయందు వర్ణితమైన
యెడ రసాభాస మగు నని యెఱుంగునది. వీనికిఁ బ్రత్యేకముగ నుదా
హరణంబులు గ్రంథవిస్తరభయముచే వ్రాయలేదు.

భావోదయాదినామక్రమతల్లక్షణనిరూపణము.

క. భావింప భావశాంతియు
భావోదయభావసంధి ♦ భావశబలతల్
భావం బడఁగుట పుట్టుట
ద్వైవిధ్యము బహుళ యనఁగఁ ♦ దగు నెట్లన్నన్. 189

టీ॥ భావింపన్ = ఆలోచింపఁగా; భావ...శబలత = భావశాంతి భావోదయము భావసంధి భావశబలత ఇవి వరుసగా; భావంబడఁగు ట...అనఁగన్ = భావముశమించుట భావశాంతియనియు, భావంబు పుట్టుట భావోదయమనియు, రెండుభావములు సమముగ ఘటిల్లుట భావసంధియనియు, ఉత్తరోత్తరములు పూర్వాపూర్వభావోపమర్దకముగ అనేకభావము లొకచోఁ జేరుట భావశబలత యనియు; తగున్ = ఒప్పును. ఎట్లన్నన్.

ఇందు భావం బనునది యడఁగుట పుట్టుట యనువానియం దన్వయించినను, ద్వైవిధ్యము బహుత యనువానితోఁ బ్రథమావిభక్త్యంత మగుట నన్వయింపదు. కాన భావములయొక్క యని పదాధ్యాహారము చేసి భావములయొక్క ద్వైవిధ్యము బహుత యని యన్వయింపఁదగియున్నది. ఇట్లన్వయించినను ద్వైవిధ్య మనుశబ్దము రెండుభావము లొకచోటఁ జేరి యుండుట యనునర్థమును జెప్పదు. మఱి యేమన్న, రెండు తెఱంగు లగుట యనునర్థమును జెప్పును. అట్లు భావ మొకండే రెండుప్రకారములుగ నుండవచ్చుఁ గాన బ్రకృతంబున కుపయుక్తంబు గాదు. ఇట్లు బహుతాశబ్దమును ననేకత యనునర్థమును జెప్పును గాని యనేకభావంబు లొకచో బాధ్యబాధకరూపముగఁ జేరి యుండుట యనునర్థమును బోధింపదు. అట్లనుకూలములగుభావము లనేకములు చేరి నపుడు "అలసాలోలములై" ఇత్యాదులయందు భావశబలత యన వలసి వచ్చును. కాన సవరింపవలయు నని తోఁచుచున్నది.

భావశాంతి కుదాహరణము.

చ. తలఁపఁగ రాజశేఖరుఁ డతండు తలోదరి సర్వమంగళా
కలితవు నీవు మాకు లోక ♦ గాత్రముకై వడిఁ గూడి యాడుచుం

జెలఁగుట యొప్పఁగా కలుగఁజెల్లునె మీకని బోటి మ్రొక్కఁగా
లలనకుఁ దోఁచె బాష్పసలిలంబు నివారితమానపంకమై. 190

టీ॥ తలోదరి = ఓచెలియా! తలఁపఁగన్ = విచారింపఁగా; అతం
డు = ఆనీభర్తయైననరసభూపాలుఁడు; రాజశేఖరుండు = రాజశ్రేష్ఠుఁడు,
చంద్రభూషణుండైనశివుం డనియర్థాంతరము. నీవుసర్వమంగళాకలిత
వు = నీవుసమస్తశుభసంపన్నురాలవు, పార్వతికి సర్వమంగళ యనునా
మాంతరము గావున నట్టి నామము గలదాన వని యర్థాంతరము.
మీరలు = మీరిరువురు; ఒకగాత్రముకైనడిన్ = ఒకశరీరముభఁగి, పా
ర్వతీపరమేశ్వరు లేకశరీరముగ నుండువారు గావున నట్లనుట; కూడి
యాడుచున్ = కలిసిక్రీడించుచు; జెలఁగుట = ప్రకాశించుట; ఒప్పఁగా
క = యుక్తముగాని; మీకలుగఁజెల్లునె = మీకుఁ గోపించుటతగునా?
అంచుబోటిమ్రొక్కఁగాన్ = ఇట్లనుచు సఖి ప్రణమిల్లఁగా; లలనకున్ =
స్త్రీకి; బాష్పసలిలంబు = కన్నీరు; నివారితమానపంకమై = పోఁగొట్టఁ
బడిన మానమనునడుసుగలదై; తోఁచెన్ = ఉదయించెను.

ఇందు నాయికకుఁ గోపం బనెడుభావంబు శమించినందున భావ
శాంతిధ్వని యని తాత్పర్యము, కాని "లలనకుఁ దోఁచె బాష్పసలిలం"
బన్ననే, కోపశాంతి వ్యజ్యమానం బగుచుండఁగా, నివారితమానపంక
మై యని యాయర్థమును వాచ్యముగాఁ జెప్పుట ధ్వనిమార్గవిరుద్ధం
బై దీనికి భావశాంతిధ్వన్యుదాహరణార్హతను దొలఁగించుచున్నది. ఇ
టఁ బ్రతాపరుద్రీయములో "శ్లో॥ లక్ష్మీస్త్వం పురుషోత్తమస్తవ పతి
శ్శ్రీవీరభద్రో నృప స్సృష్ట్యా మమ్బుజవిష్టరస్య సదృశో ర్యోగ శ్చిరా
త్సంభృతః। తస్మా త్కృత్రిమ మ ప్యసాంప్రత మిదం వాం వైమన
స్యం మనా గిత్యాలీం ప్రణతాం విలోక్య వికసద్వక్త్రామ్బుజా మానినీ"
అని యున్నది. ఇందు వక్త్రాంబుజవికసనముచేతఁ గోపశాంతి వ్యంగ్యం

బుగా నున్నది. పై యుదాహరణమునకు దీనికిం గలభేదంబు స్పష్టము.

భావోదయమున కుదాహరణము.

ఉ. మేలము లాడువేళల స | మేలములై చెలు లెల్లఁ గూడి యో
బాలిక శ్రీనృసింహనర | పాలు వరించెదవే యటన్న నీ
లాలక యంగవల్లిఁ బుల | కాంకురము ల్మన లొత్తి నేమనం
జాలక యూరకుండె నసి | శంబు త్రపావృత యైనకై వడిన్. 191

దీనియర్థ మిది హేలోదాహరణ మైనపుడు వెనుక వ్రాయఁబడెను. ఇందు లజ్జారూప మైనభావంబున కుదయము గదితం బయ్యె నని కొందఱు వ్రాసిరి. అది గ్రాహ్యంబుగాదు. ఏమనఁగా “కైవడిన్” అనుటవలనఁ ద్రపోదయమై నట్లు భావంబు గాక కారణాంతరముచే నూరకుండిన దను నర్థము బోధిత మగుచున్నది. కావున వారు వ్రాసినది యొప్పఁ దగదు.

ఒకవేళఁ, బులకోదయమైనందున భావోదయోదాహరణంబు గావచ్చు నని యాశంకింతు రేమో. అట్లును వలను గాదు. ఏమన్న, పులకంబులు సాత్త్వికభావములలోఁ జేరినవి. “శ్లో॥ వ్యభిచార్యఞ్జితో భావః” అనుటవలన ధ్వన్యమాన మైనవ్యభిచారియె భావధ్వన్యపయుక్తభావం బగుఁగాని సాత్త్వికంబు గాదు. “త్రపావృతమైనకైవడిన్” అనుచోటఁ గైవడిపదము మార్చి “త్రపావృతయై వెలుంగుచున్” ఇత్యాదిపదములచే సవరించినప్పటికిని వ్యంగ్యవృత్తిచే బోధింపఁదగినత్రప వాచ్యవృత్తిచే బోధిత మగుటవలనఁ, బూర్వోక్తరీతిగ ధ్వనిమార్గమునకు విరుద్ధమై యుదాహరణానర్హతఁ బొందు నని తెలియునది. ప్రతాపరుద్రీయములో, “శ్లో॥ ముగ్ధేక స్తవ వర్తతే హృది మనో జన్మేన నాన్య శ్శపే స క్వేతస్య కి మత్ర కార్య మపరం

కిం జన్మ సద్మాదరః । కోఽస్య స్తత్ప్రతిబిమ్బ ఏవ నిపుణే జానాసి కామాధికః ప్రేయా న్సుద్రనృప స్తవేతి కథితా నమ్రానన నాఽభూ ద్వధూః” అనియున్నది. ఇందు “నమ్రాననా” యనుటవలన లజ్జోదయము వ్యంగ్యం బని స్పష్టము. ఈ తెలుంగున నుదాహార్యము. ఇట్లు, “వినమ్రముఖాంబుజాతినై” యని సవరింపవచ్చును.

భావసంధిధ్వన్యుదాహరణము.

ఉ. హరి కానంగశరాళినై యరి కవేలాభీలదివ్యాశుగో
త్కరమై శౌరికిఁ బాటలాబ్జకలికాదామంబులై వైరికి
న్నిరతాగ్నిప్రభలై వెలుంగు నరకానీకాధికోల్లాసభా
సురసత్యారమణీకటాక్షములు ప్రోచుం గ్రీనృసింహాధిపుక్. 192

టీ॥ హరికిక్ = కృష్ణునకు; ఆనంగశరాళినై = మదనసంబంధి బాణపరంపరనై; అరికిక్ = శత్రువైననరకాసురునకు; అవేల...ఉత్కరమై = మిక్కిలి భయంకరమై దివ్యమైనబాణసంఘమై; శౌరికిక్ = కృష్ణునకు; పాటల...ఐ = రక్తోత్పలకలికలహారంబులై; వైరికిక్ = నరకాసురునకు; నిరతాగ్నిప్రభలై = అవిచ్ఛిన్నాగ్నికాంతులై; వెలుంగు...కటాక్షములు = ప్రకాశించెడు నరకాసురయుద్ధమందలి యధికోల్లాసముచే భాసిల్లుసత్యభామాకటాక్షములు; శ్రీనృసింహాధిపుక్ = శ్రీనరసభూపాలుని; ప్రోచుక్ = రక్షించుఁగాక.

ఇందు రత్యుత్సాహరూపభావంబులకు సంధి వర్ణింపఁబడియె నని పూర్వటీకాకారులు వ్రాసిరి. అది గ్రాహ్యంబు గాదు. “విభావాదివ్యజ్యమానహర్షాద్యన్యతమత్వం భావత్వం। తదుక్తం వ్యభిచార్యఞ్జితోభావః” అనురసగంగాధరమును “రతి ర్దేవాదివిషయా వ్యభిచారీ తథాఞ్జితః, భావః ప్రోక్తః” అనుకావ్యప్రకాశమును బట్టి వ్యజ్యమా

నవ్యభిచారియు దేవాదివిషయకరతియు నే భావధ్వన్యాదులయందు భావపదవ్యవహార్యం బని సిద్ధాంతితమై యుండ శృంగారవీరస్థాయు లగురత్యుత్సాహముల సంధి యనుట యసంగతము. ప్రతాపరుద్రీయము నందును "శ్లో॥ ప్రతాపరుద్రస్య దిగన్తజైత్రయాత్రాప్రభూతైః పటహప్రణాదైః । ప్రియానులాపైశ్చ తథా భటానాం రోమాఞ్చవర్మావృత మఙ్గ మాసీత్" అనుదానిలో "అత్ర వీరశృఙ్గారకృతయో ర్హర్షయో స్సంధిః" అని వ్రాయఁబడినది గాని వీరశృంగారస్థాయులైన రత్యుత్సాహములకు సంధి యని వ్రాయలేదు. కావున నావ్యాఖ్యాతలు పొరపడిరి. వెండియు, భావద్వయమునకుఁ బరస్పరోపమర్ద్యోపమర్దకభావముచేత నేకాధికరణవృత్తిత్వము వర్ణించి నపుడే భావసంధి యగును గాని వేర్వేఱుగ హరిచిత్తమునందు రతియు నరకాసురునిచిత్తమునందుత్సాహమును దోఁచినపుడు కాఁజాలదు. అట్లగు నని యెంచుటకుఁ బ్రాచీనోదాహరణములు గాని లక్షణములు గాని గాన్పించవు. సత్యభామకే రెండు నుదయించినవనుటకు, ఉత్సాహము యుద్ధదశయందుఁ బరిపూర్ణమై వీరరసభావము నొందియుండఁగా, దానికి సమబలముగా రతి యుదయించుట యసంభవమగుటను వలనుగాదు. వ్యభిచారిరూపముగా రతి యుదయించిన దన్న, నుత్సాహమునకు సమబలముగాని యపుడు భావసంధియె కాదు. కావున, పూర్వవ్యాఖ్యాతలు పూర్వద్వయసంధియె యెట్లయినఁ జెప్పుకొనవలయుఁ గాని వేఱు గతి లేదు.

భావశబలత కుదాహరణము.

మ. చెలులే మందురొ భావవీథి నకటా ♦ శ్రీనారసింహేంద్రుకాఁ
గిలి నాకెన్నఁడు గల్గునో నృపతితోఁ ♦ గ్రీడింపఁగాఁ బోవుచం
చలపుం జిత్తము నేమి సేయుదు గురు ♦ స్వచ్ఛక్తిఁ బ్రార్థింతునో
యలప్రాణేశ్వరుఁ జూడ కున్నఁ బరితా♦పాటోపము ల్మానునే. 193

టీ॥ భావవీథిఁ = అంతరంగమందు; చెలులేమందురో = సఖులేమనుకొందురో! అకటా! నారసింహేంద్రు కౌఁగిలి = నరసభూపాలుని యాలింగనము; నాకెన్నఁడు గల్గునో = నాకెన్నఁడబ్బునో; నృపతితోఁ = నరసభూపాలునితో; క్రీడింపఁగాఁ = విహరించుటకు; పోవు చంచలపుంజిత్తముఁ = పోవునట్టిచపలచిత్తమును; ఏమిసేయుదుఁ = ఏవిధముగానివారింతును? గురుఁ = గురువును; సద్భక్తిఁ = ఉత్తమభక్తిచేత; ప్రార్థింతునో = ప్రార్థనసేయుదునా? అలప్రాణేశ్వరుఁ = ఆప్రాణనాథుండగునరసభూపాలుని; చూడకున్నఁ = అవలోకింపకుండిన యెడ; పరితాపాటోపముల్మానునే = సంతాపాతిశయములు మానునా? యని వనుట.

ఇందు భయాత్సుక్యాదిరూపభావములకు మిశ్రణము వాక్రువ్వం బడియె నని కొందఱు. భయానకరసస్థాయి యగుభయము సంచారులలోఁ జేరనందునను, త్రాసము చేరినప్పటికి భయత్రాసములకు లక్షణపార్థక్య మగుటవలనను, "కింపశ్యత్వ్యపకల్మషాః కృతధియః, పశ్యేత్కశ్చిచ్చపల చపల రే" యనుకావ్యప్రకాశోదాహృతపద్యములయందువలె నిందు శంక కవకాశమే కాని భయత్రాసముల కవకాశము లేనందునను, భయాభివ్యక్తి యగు నన్నది మన్నింపం దగదు.

నవరససంకరమున కుదాహరణము.

మ. జయలక్ష్మీరతమై ప్రతాపయుతమై ♦ శత్రుచ్ఛిదాధుర్యమై
ప్రయతార్త్రావనమై కపీంద్రగతియై ♦ రక్తార్ద్రమై నిర్ఘృణో
దయవిద్యున్నిభమై సకంపమయి పం♦దారుస్పృహాశూన్యమై
నయ మొప్ప న్నరసింహుఖడ్గ మమరు ♦ న్నానారసప్రక్రియఁ. 194

టీ॥ జయలక్ష్మీరతమై = జయలక్ష్మియందు రతిగలదయి; ప్రతాప

యుతమై = శౌర్యముతోఁగూడినదై; శత్రుచ్ఛిదాధుర్యమై=శత్రుసంహారదక్షమై; ప్రయతార్త్తావనమై= పరిశుద్ధులై దుఃఖితులయిన జనులరక్షించునదై, తనయందు ద్వేషమువిడిచి దుఃఖితులయిన, అనఁగా శరణాగతులయిన వారి రక్షించునదై యనుట; కపీంద్రగతియై—చంచలమై యనుట; రక్తార్ద్రమై = రక్తముచేతఁ దడుపఁబడినదై; నిర్ఘనోదయ విద్యున్నిభమై = మేఘోదయములేని మెఱపుతోసమానమై; సకంపమయి=వడఁకుతోఁగూడినదయి; వందారు...ఐ=నమస్కరించువారియందు ఆశలేనిదయి; వారినివదలుచున్నదై యనుట; నయమొప్పన్ = నీతి యతిశయిల్లునట్లుగా; నరసింహుఖడ్గము = నరసభూపాలునిఖడ్గము; నానారసప్రక్రియన్=శృంగారాదినవరసప్రక్రియచేత; అమరున్ = ఒప్పును.

ఇందు వరుసగా శృంగార వీర రౌద్ర కరుణ హాస్య బీభత్సాద్భుత భయానక శాంత రసములకు సంకరము చెప్పఁబడినది. జయలక్ష్మీరతమై యనునది మొదలగువానిచేత నే శృంగారాదిరసములు వ్యజ్యమానము లగుచుండఁగా "నానారసప్రక్రియన్" అనుట "రసాది లక్షణ స్త్వర్థ స్స్వశ్బ్నేపి న వాచ్యః। వ్యభిచారి రసస్థాయిభావానాం శబ్దవాచ్యతా" ఇత్యాదికావ్యప్రకాశరసగంగాధరాది సర్వాలంకారిక గ్రంథవిరుద్ధము, వమనాఖ్యదోషాదికారణమ్మునై రససంకరోదాహరణానర్హత నాపాదించుచున్నది. "శ్లో॥ లక్ష్మీ మాలోక్య లుభ్య న్నిగమ ముపహాసన్ శోచయన్ యజ్ఞజన్తూన్ క్షత్రిం శోణాక్షి పశ్యన్ స మితి దశముఖం వీక్ష్య రోమాఞ్చ మఞ్చన్। హృత్వా హైయజ్గజీవం చకిత మపసరన్ మ్లేచ్ఛర క్తై ర్దిగన్తాన్ సిఞ్చ న్దన్తేన భూమిం తిలమివ తులయన్ పాతు వః పీతవాసాః॥" అనునది యుక్తోదాహరణము.

## రసాధిదేవతానిరూపణము.

సీ. హరికి శృంగారలీ◆లాధిపత్య మొనర్చు
గణనాథు హాస్యసం◆గతునిఁ జేయు
నలికలోచనునిపై ◆ నధిక రౌద్రము నిల్పు,
శక్రుపై వీరర◆సంబు నెఱపు
యమునిపైని దయామ◆యత్వంబు ఘటియించు
జగతి మహాకాలు◆ సభయుఁ జేయు
శర్వరీంద్రుని జుగు◆ప్సారసాన్వితుఁ జేయు
శతధృతి నద్భుతా◆న్వితు నొనర్చు
తే. శాంతి బ్రహ్మంబుఁ జేర్చు ని◆చ్చలు నృసింహు
భువనభరణంబు వరవిఘ్న◆నివహహరణ
మీశతయు భోగము ననేక◆నృపతిహృతియు
ననియు యశమును మతియు బో◆ధాతిశయము. 195

టీ॥ నృసింహు...బోధాతిశయము=నరసభూపాలునియొక్క భూభరణము, విఘ్ననివారణము, ఈశ్వరత్వము, భోగము, శత్రురాజహరణము, యుద్ధము, యశస్సు, మతి, జ్ఞానాతిశయము ననునీతొమ్మిదిగుణములు, వరుసగా; హరికిశృంగారలీలాధిపత్య మొనర్చున్=విష్ణువునందున్న భూభరణమును దొలఁగించి శృంగారవిలాసాధిపత్యము గలుగఁజేయును. గణనాథుహాస్యసంగతునిఁజేయున్=గణపతినిహాస్యముతోఁగూడినవానిఁగాఁ జేయును,నరసభూపాలు నంతటి విఘ్నహారణశక్తిలేనందున గణపతి హాస్యమునకుఁ బాత్రుఁడగుననుట. అలికలోచనునిపై నధిక రౌద్రమునిల్పున్ = శివునిమీఁద ఎక్కుడుకోపముంచును, నరసభూపాలునిప్రభుత్వముకన్న శివుని యీశత్వము తక్కువయనుట. శక్రుపై వీరరసంబునెఱపున్=ఇంద్రునకు వీరరసంబునిండించును, నరసభూపాలు

నిభోగమునుజూచి యింద్రుండు తనకట్టిభోగము లేమిచే వీరరసమునొం దుననుట. యమునిపై దయామయత్వంబుఘటియించుక్ = యమునకు ఎక్కువదయగలవాఁడగుటను కలిగించును, నరసభూపాలుఁడు శత్రు రాజులవధించుటను జూచి యముండును దయవహించునని తాత్పర్య ము. జగతిక్ = భూమియందు; మహాకాలుక్ = కాలరుద్రుని; సభయుక్ = భయముతోఁగూడినవానిఁగా; చేయుక్, నరసభూపాలుని యుద్ధముఁ జూచి మహాకాలుఁడుగూడ భయపడుననుట. శర్వరీంద్రుని జుగుప్సార సాన్వితుఁజేయుక్ = చంద్రునిరోఁతతోఁగూడినవానినిజేయును, నరస భూపాలుని కీర్తి చంద్రునికన్నను ధవళముగానుండుటవలనఁ జంద్రుఁ డు రోఁతకుఁ బాత్రుఁడగునని తాత్పర్యము. శతధృతిక్ = బ్రహ్మను; అ ద్భుతాన్వితునొనర్చుక్ = ఆశ్చర్యముతోఁగూడినవానిఁజేయును; నర సభూపాలునిబుద్ధికి బ్రహ్మదేవుఁడును ఆశ్చర్యముపొందుననుట. బ్రహ్మం బుక్ శాంతిఁజేర్చుక్ = బ్రహ్మమునుశాంతినిబొందించును, ఇతనిజ్ఞానాతిశ యముచే, జ్ఞానస్వరూపమగు బ్రహ్మముగూడ శాంతమగుననుట. నిచ్చ లు = నిశ్చయము. శృంగారమునకు విష్ణువును, హాస్యమునకు గణపతియు, రౌద్రమునకు శివుఁడును, వీరమునకు దేవేంద్రుఁడును, కరుణమునకు యముఁడును, భయానకమునకు మహాకాలుఁడును, బీభత్సమునకుఁ జంద్రుఁడును, అద్భుతమునకుఁ జతుర్ముఖుండును, శాంతమునకు బ్రహ్మ మును, అధిదేవతలని భావము.

ఇందు యమునియందు శోకస్థాయిక మైనకరుణరసాధిపత్యముఁ జెప్పుటకు మాఱుగా "యమునిపైని దయామయత్వంబు ఘటియిం చు" ననుటయు, పైరససంకరపద్యములోఁ, గరుణరసపర్యాయము గాఁ "బ్రియతార్తావనమై" యనుటయు, యుక్తంబుగాఁ దోఁచ దని స్థాయిభావపద్య వ్యాఖ్యానమున వ్రాయఁబడినది.

## రసవర్ణనిరూపణము.

సీ. మరకతానీకదం♦భమున శృంగారంబు
హాస్యంబు ముక్తాఘ♦నౌఘరుచులఁ
గరుణ విద్రుమవర్ణ♦ గౌరవచ్ఛలమున
రౌద్రంబు కురువింద♦ రత్నకలన
వీరంబు గోమేధి♦కారోపితస్ఫూర్తి
భయము వైదూర్యశో♦భావిభవమున
బీభత్స మింద్రనీ♦లాభాగుణంబున
శాంతి నిర్మలహీర♦ కాంతిగతుల
తే. నద్భుతము పుష్యరాగరా♦గాపదేశ
విలసితంబున సాకార♦ వృత్తి గాంచి
నవరసంబులు పొల్చు నీ♦ భవనవీథిఁ
బ్రబల సుబలనృసింహ యో♦బయనృసింహ. 196

టీ॥ సుబలనృసింహ=పరాక్రమమందునృసింహస్వామితో సమానుఁడవైన; ఓబయనృసింహ = ఓబయనరసభూపాలుఁడా! నీభవనవీథిన్=నీగృహప్రదేశమందు; మరకతానీకదంభమునన్ = మరకతసమూహముయొక్క నెపముచేత; శృంగారము = శృంగారరసమును; ముక్తాఘనౌఘరుచులన్ = ముత్తెములసమూహముయొక్క కాంతులచేత; హాస్యంబు=హాస్యమును; విద్రుమవర్ణగౌరవచ్ఛలమునన్=పగడములకాంత్యతిశయముయొక్క వ్యాజముచే; కరుణ=కరుణారసమును; కురువిందరత్నకలనన్=కెంపురాళ్లరీతిచేత; రౌద్రంబు=రౌద్రమును; గోమేధికారోపితస్ఫూర్తిన్=గోమేధికములయారోపింపఁబడినకాంతిచే; వీరంబును= వీరమును; వైదూర్యశోభావిభవమునన్ = వైదూర్యమణికాంతియొక్క నెపముచేత; భయము = భయానకరసమును; ఇంద్రనీలాభాగుణంబు

నన్ = ఇంద్రనీలమణులకాంతులవిధముచేత; బీభత్సము = బీభత్సము
ను; నిర్మలహీరకాంతిగతులన్ = స్వచ్ఛములయినవజ్రములకాంతుల
యొక్కవిధములచేత; శాంతి=శాంతరసమును; పుష్యరాగరాగాపదేశ
విలసితమునన్ = పుష్యరాగములకాంతియొక్కవ్యాజవిలాసముచేత; అ
ద్భుతము=అద్భుతరసమును;సాకారవృత్తిఁగాంచి= ఆకారముతోఁగూడి
నయునికినిపొంది;నవరసంబులు;ప్రబలన్=అతిశయిల్లునట్లు;పొల్చున్=ప్ర
కాశించును. శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానక బీభత్స శాం
తాద్భుతంబులను నవరసంబులు క్రమముగా మరకత ముక్తా విద్రుమ ప
ద్మరాగ గోమేధిక వైదూర్య నీల వజ్ర పుష్యరాగ వర్ణములని భావము.

రస మానందరూప మనుటయం దాక్షేపము.

క. కరుణాభయబీభత్సము
ఖరసంబులు శోకభీతి గాఢజుగుప్సా
కరములు గాన రసములై
తిర మగు నెట్లన్న దీనిఁ దెలిపెద వరుసన్. 197

టీ॥ కరుణా...రసంబులు= కరుణము భయానకము బీభత్సము
మొదలగురసములు; శోక...ఆకరములు= శోకముభీతిదట్టమైనజుగుప్స
మొదలగువానికాకరములు. కానన్; రసములై తిరమగునెట్లన్నన్=ఆ
నందరూపరసములై యెట్లుదృఢపడుననిశంకించినచో; దీనివరుసన్ దెలి
పెదన్ = దీనిక్రమముఁ జెప్పెదను.

ఇందుఁ "గరుణాభయ" యనియు, క్రిందిపద్యమునఁ "గరు
ణావిద్రుమ" యనియు, రసబోధక మగుకరుణశబ్దమును స్త్రీలింగము
గఁ బ్రయోగించుట చింత్యం బని స్థాయిక్రమపద్యమువ్యాఖ్యానములో
మున్ను వ్రాయఁబడియున్నది.

సమాధానక్రమముఁ జెప్పుచున్నాఁడు.

ఉ. భావ మలంక్రియాగుణవి♦భాసితమై వికసద్రసోదయ
శ్రీవినివారితేతరవి♦శేష నివేదనమై యెలర్ప నీ
వావిరి దుఃఖ మైన సుఖ♦వైభవ మైన విటీవిటాలియం
దావలఁ బూర్ణమై సహృద♦యాత్మలఁ గేవలహర్షమై తగున్. 198

టీ॥ భావము=రత్యాదిస్థాయిభావము; అలంక్రియాగుణవిభాసితమై = ఉపమాద్యలంకారములచేతను మాధుర్యాదిగుణములచేతను ప్రకాశించుచున్నదై; వికసత్ . . . ఐ = వికసత్ =వికసించుచున్న, రసోదయ=రసావిర్భావముయొక్క, శ్రీ = సంపదచేత, వినివారిత=నివర్తిల్లఁ జేయఁబడిన, ఇతరవిశేషనివేదనమై=జ్ఞానాంతరముగలదయి, విగలితవేద్యాంతరమైయనుట; ఎలర్పన్=ప్రకాశింపఁగా; ఈవావిరిన్=పైఁజెప్పిన క్రమముచేత; విటీవిటాలియందు=జారిణీజారులయందు; దుఃఖమైనన్=దుఃఖరూపమైనఁగాని; సుఖవైభవమైనన్=సుఖాతిశయరూపమైనఁగాని; ఆవలన్—లోకవ్యతిరిక్తకావ్యములందనుట; సహృదయాత్మలన్ = సహృదయాంతరంగములయందు; పూర్ణమై= పరిపూర్ణరూపమై; కేవలహర్షమై=ఆనందమాత్రరూపమై; తగున్=ఒప్పును.

లోకమునందుఁ దత్తద్రసవిశేషానుభవకాలమందుఁ దత్తదుచితకారణాదిసామగ్రీబలమున ననుభవించెడురామాదులకు శృంగారకరుణాదులు యథాయోగముగ సుఖదుఃఖాదిరూపములుగా నుండినను, గావ్యనాట్యానుసంధాన దశయందు సహృదయులయంతరంగములయందు లలితసన్నివేశచారు వగుకావ్యముచేతను తాదృశాభినయముచేతను సమర్పితంబులయి, తదీయసహృదయతావశోన్మిషితం బగుభావనావిశేషమహిమచే దుష్యంతరమణీత్వాదిధర్మములు మాని సర్వసాధారణముగ విభావాదిపదవ్యవహార్యంబు లగుశకుంతలాద్యాలంబనకారణ

ములును. చంద్రికాద్యుద్దీపనకారణములును, అశ్రుపాతాదికార్యములును, నేకీభావముగఁ జేరి పుట్టించిన అలౌకికవ్యాపారముచేతఁ, దత్కాలమందానందాంశావరణాజ్ఞానము నివర్తితమగుటవలన, పరిమితప్రమాతృత్వాదినిజధర్మములు విగళితములై తన్మయత్వము నొందినదేవదత్తాదిప్రమాతలచే, నెదుటఁ బ్రకాశించుదానివలె, సర్వాంగములనాలింగనము చేయుదానివలె, స్వేతరమగు సర్వమును తిరోధానము చేయుదానివలె, బ్రహ్మానందము ననుభవింపఁ జేయుదానివలె, సాక్షాత్కరింపఁ బడినభగ్నావరణచిద్విశిష్టరత్యాదికము గాని, రత్యాద్యవచ్ఛిన్నభగ్నావరణచిత్తు గాని, కేవలపరిపూర్ణానందరూపమైన రసరూపమై తగును. కానఁ బూర్వోక్తాశంక ప్రసరింపదని తాత్పర్యము.

ఈపద్యమును, "శ్లో॥ గుణాలఙ్కారశ్రీకృతపరికరో భావవిభవస్స్ఫురత్పాకోద్భావః క్రమగలితవేద్యాన్తరమతిః। సుఖం వా దుఃఖం వా నిబిడయతు యూనో స్సహృదయే త్వమస్థానస్థాత్మా పరిణమసి పూర్ణో రసభరః॥" అనుప్రతాపరుద్రీయశ్లోకమును, సర్వరససాధారణ్యముగఁ బ్రవర్తించినవి గాని యొకశృంగారమునుగూర్చి మాత్రము ప్రవర్తించినవి గావు. ఇందుననే, "సుఖం వా దుఃఖం వా నిబిడయతు" అని "దుఃఖమైన సుఖమైన భవమైన" యని చెప్పఁబడినది. ఇట్లుండ "యూనోః" అనుటయు, "విటీవిటాలియం" దనుటయు, తప్పులు. తరుణీతరుణు లాలంబనమగుట శృంగారేతరమునందు సంభవింపదు గావున, "లోకేస్యాదనుకార్యపేవ," "తత్కాలమందైన సత్యము రామాదులయందు," యనునుత్తరపద్యములందువలె సర్వరససాధారణప్రయోగముగ నుండవలయు. మఱియు నీగ్రంథమందుఁ బ్రయోగింపఁబడినవిటీవిటశబ్దము సర్వవిధముల నయుక్తము. ఎట్లన, విటశబ్దము

శృంగారాలంబననాయకసహాయు లగువిటపీఠమర్దచేటవిదూషకులలోఁ జేరినవాని బోధించినంగాని, జారుని బోధించినంగాని, సకలయువమిథునసాధారణాలంబనక మగు శృంగారరసమున కంతకుఁ దగినయాలంబనము గాఁ జాలదు. కావున నయుక్తతమంబు.

కొందఱు "శ్లో॥ కారణా న్యథ కార్యాణి సహకారీణి యాని వై । రత్యాదేః స్థాయినో లోకే తాని చే న్నాట్యకావ్యయోః । విభావా అనుభావాశ్చ కథ్యన్తే వ్యభిచారిణః। వ్యక్తస్స తై ర్విభావాద్యైః స్థాయీ భావో రసః స్మృతః॥" ఇత్యాదులవలన లోకవిలక్షణము లై కావ్యనాట్యములయందు మాత్రము వ్యవహరింపఁబడు విభావానుభావవ్యభిచారులచే సహృదయసామాజికాంతరంగములయందు లోకోత్తర కావ్యనాట్యానుసంధానదశయందుఁ గలుగునలౌకికానందమె రసము, కావున, లోకమునందు విభావాదులు లేమిఁ దద్వ్యతిరిక్తకారణములచే నుదయించుసుఖము రసశబ్దవాచ్యమే కాదు. అట్టి కావ్యనాట్యానుసంధానజన్యపరమానందవిశేషము, సర్వరసనిర్విశేషముగా, కరుణాదులయందును నఖండానందరూపమైయే విలసిల్లుచుండఁగా, లోకమునఁ గరుణాదులయందుఁ గలుగుదుఃఖమునుబట్టి కావ్యనాట్యాదులయందుఁగలుగు నలౌకికానందము దుఃఖదూషిత మని యాశంకించుట చెల్ల దని వక్కాణింతురు. లౌకికసుఖము రసశబ్దవాచ్యమే కా దని పరమార్థము.

ఇ ట్లలౌకికానందము కావ్యనాట్యోభయద్వారముగ సహృదయసామాజికాంతరంగాశ్రయమై విలసిల్లుచుండ "గుణాలంకారశ్రీస్ఫృతపరికరః" అనియు, "భావమలంక్రియాగుణవిభాసితమై" యనియు, గుణాలంకారములను జెప్పుటయు, ప్రతాపరుద్రీయవ్యాఖ్యయందు "గుణాలంకారగ్రహణం వృత్తిరీత్యాదీనాము ప్యుపలక్షణ" మ్మని వ్రాయు

టయు, వాక్యార్థాభినయాత్మకం బగునాట్యమున నలంకారగుణవృత్తిరీతులు సంభవింపమి నసంగతంబులు. కావ్యమునుగూర్చియె యీపద్యద్వయము ప్రక్రాంత మయిన దన వచ్చుఁ గాని, యట్లైన "నాట్యేతుసామాజికే." "నాట్యమునసభ్యావాసమైభాసిలున్," అను నుపసంహారవాక్యమునకు నీయుపక్రమవాక్యమునకు నేకవాక్యత దుర్ఘటం బగును. ఉపక్రమోపసంహారముల కేకవాక్యతానైయత్యంబు శాస్త్రసిద్ధం బైనది.

ఇట్టి రసమెట్లు కావ్యాదుల యందుదయించు నని శంకించి చెప్పుచున్నాఁడు.

తే. అలపదార్థంబు లగువిభా♦వానుభావ
సాత్త్వికాదులఁ గూడి ర♦సత్వమొందు
నవని భావంబు వాక్యార్థ♦మనఁగ నెగడి
తంతువులు గూడి పట మనఁ♦ దనరుకరణి. 199

టీ॥ ఇలన్ = భూమియందు; భావంబు=రత్యాదిస్థాయిభావము; వాక్యార్థమనఁగనెగడి= వాక్యార్థమనునట్లొప్పి, కవిసంరంభగోచరము యి యనుట, "శ్లో॥ కవే ర్వివక్షయా యత్ర ప్రాధాన్యం పరికల్ప్యతే। భవే త్స ఏవ వాక్యార్థ ఇతి నిర్ణీయతే బుధైః॥" అనుటవలన విభావాదులు రసము ప్రధాన మగు నపు డవాంతరవ్యాపారరూపములై పదార్థము లగును, స్వస్వప్రాధాన్యమునందు వాక్యార్థము లగు నని తెలియునది. తంతువులు...కరణిన్ = దారములు గూడి వస్త్రములగు రీతి; అల...కూడి=పదార్థములుగాఁ బ్రసిద్ధము లగువిభావాదులఁ గూడి; రసత్వమొందున్ = రసరూపతనొందును.

"శ్లో॥ యథాహి తన్తవో వేమతుర్యాదిక్రియయాన్వితాః।

పటాత్మతాపరిణతాః పటవాచ్యా భవన్తితే। తథైవ స్థాయినో భావా విభావాదిభి రన్వితాః। రసాత్మతాపరిణతా రసవాచ్యా భవన్తి తే॥" ఇత్యాదిప్రమాణములు తెలియునది.

విభావాదులు ధరయందు లేక కావ్యాదులయందు మాత్ర ముండునవి గాన నిం దిలాశబ్దప్రయోగము చింత్యము, ఈవిషయము మున్నె వివరింపఁబడెను.

ఇఁక నిర్వేదాది స్థితిని మఱల సుబోధార్థము రసస్థితిని జెప్పుచున్నాఁడు.

మ. రమణీయోల్బణతాసమేత మగు నీ రత్యాదిభావాబ్ధిలో
నమరం బుట్టుచు మున్గుచుం దగుఁ దరంగారూఢి సంచారిసం
ఘము లేతత్ప్రతిపన్నమౌ రసము తత్కాలంబునం దైన స
త్యము రామాదులయంద నాట్యమున సభ్యావాసమై భాసిలున్.

టీ॥ సంచారిసంఘములు=నిర్వేదాదివ్యభిచారులు; రమణీయ... అబ్ధిలోన్ = మనోహర మగునుద్రేకముతోఁ గూడినరతి మొదలగు స్థాయిభావము లను సముద్రములో; తరంగారూఢిన్ = అలలభంగి; అమరన్=ఒప్పునట్లు; పుట్టుచుమున్గుచున్; తగున్=ఒప్పును. ఏతత్ప్రతిపన్నమౌరసము=ఈనిర్వేదాద్యుపభోగమునఁబుట్టుశృంగారాదిరసము; తత్కాలంబునందున్ = ఆయావిర్భావకాలమందు, అనఁగా, లోకమునం దనుభవగోచరమగునపుడు; రామాదులయంద = రామాద్యనుకార్యులయందే; ఐనన్=ఉండినను; నాట్యమునన్ = నాట్యమునందు; సభ్యావాసమై= సామాజికనిష్ఠమై; భాసిలున్ = ప్రకాశించును. సత్యము= నిక్కము.

ఇందు విశేషము "శ్లో॥ఉన్మజ్జన్తో నిమజ్జన్తః కల్లోలా స్తేయథా

ర్ణవే। తస్యోత్కర్షం వితన్వన్తి యాన్తి తద్రూపతా మపి। తథా స్థాయిని నిర్మగ్నా హ్యున్మగ్నా వ్యభిచారిణః। పుష్ణన్తి స్థాయినం స్వాంశ్చ తన్నయన్తి రసాత్మతామ్॥" ఇత్యాదిప్రమాణములును, "గుణాలంకారశ్రీ" యని పైఁ బ్రాయఁబడినదియు, "శ్లో॥ రసో వాక్యార్థ స్స స్విలసతి పదార్థాః ఘన రమీ విభావాద్యా యస్మిన్ కిల దధతి విశ్రాన్తి ముచితామ్। అతో భావా ఏవ క్రమసముదితాన్యోన్యపిభవా రసీభావం బిభ్రత్యథచ పటతాం తన్తవ ఇవ॥" అనునదియు, "భావే స్థాయిని వర్ధమానవిభవే రత్యాదికే సిన్ధువ త్కల్లోలా ఇవ సంభవన్తి విలయం చాయాన్తి భావా ముహుః। నిర్వేదాద్యుపభోగభావితనిజాస్వాదాతిరేకో రసో లోకే స్యా దనుకార్య ఏవ కథితో నాట్యేతు సామాజికే॥" అనునదియు, నీమూఁడు ప్రతాపరుద్రీయ శ్లోకములును, తద్వ్యాఖ్యయుఁ బరిశీలింపఁగా స్పష్టమగును. ఇట గ్రంథ విస్తర భయంబున నింతటితో విరమించుట యగును.

ఇట్లు కావ్యాలంకార సంగ్రహంబునఁ

ద్వితీయాశ్వాసంబు

సవ్యాఖ్యానంబు

ముగిసెను.

---

శ్రీ శ్రీధరాయనమః.

శ్రీమద్వేంకటగిరి సంస్థానాశ్రితులలో నొకరగు

శ్రీమాన్ శ్రీమత్కొమాండూరు

శ్రీనివాసాచార్యకవి

ప్రణీతమగు

శ్రీ

# మహాభారతారణ్యపర్వమునందలి

ఉపశ్లోకాంధ్రీకరణముతోఁ జేర్పఁబడిన సంపూర్ణమైన

యక్షప్రశ్నములు.

ఇది

శ్రీమద్వేంకటగిరి సంస్థానాధిపతులచే

సముద్రితగ్రంథచింతామణియందుఁ

బ్రకటనమునకై పనుపఁబడి

తదధిపతులగు

పూండ్ల రామకృష్ణయ్యచే

వ్రాయఁబడిన పీఠికతో ముద్రితమై, ప్రకటితమయ్యెను.

ఎంపరరు ముద్రాక్షరశాల.

నెల్లూరు.

1904.

# ఉపోద్ఘాతము.

శ్రీమన్నారాయణాంశ సంభూతులగు వ్యాసభట్టారకులచే విరచితమైన శ్రీమహాభారతము నాంధ్రీకరించిన కవిత్రయము యథాసంస్కృతముగా వ్రాయక యొక్కొకచోఁ గథను సంగ్రహించుచు వచ్చిరి.

ఏమేచోటుల నెట్లు సంక్షేపించినను ధర్మస్వరూపులైన ధర్మదేవతాధర్మజుల యమానుషములును నత్యద్భుతములును నైనప్రశ్నోత్తరములగు యక్షప్రశ్నములు నాఁ బ్రసిద్ధికెక్కిన వానిలో సగమునకుమించి పానుంగువడియుండుట యొప్పియుండలేదనియు, సంస్కృతము నెఱుంగని యాంధ్రులకు నవి యగోచరంబనియుఁ గొందఱు నామిత్త్రులు, లుపశ్లోకములను దెలింగించమని ప్రోత్సాహపఱిచినందున వానినియథాసంస్కృతముగ నీలకంఠవ్యాఖ్యానము ననుసరించి నానేర్చినవిధంబున వ్రాసితిని.

ఎఱ్ఱప్రెగ్గడగారు తెనిఁగించినవానిని నారచించినవానినిఁ బ్రశ్నోత్తరములామూలాగ్రముగాఁ దెలియుటకై వరుసగా వ్రాసితిని. అందుఁ బూర్వ విరచితములు ప్రాచీనము లనియు, నాయొనర్చినయవి, నూతనము లనియు నాయాపద్య ప్రారంభములయందు వ్రాయఁబడినవి.

ప్రబంధ పరమేశ్వర బిరుదాంకితులగు నెఱ్ఱప్రెగడగారి పద్యముల వరుసలో నాపద్యములుండుట దివ్యవజ్రమణిమాలాంతర్గత కాచమణుల భంగి నొప్పునని నమ్ముచున్నాఁడను.

ఇందలి కథాసందర్భము దెలియుటకై ప్రశ్నోత్తరములకు ముందుఁగొన్నియుఁ గడపటఁ గొన్నియు భారతములోని పద్యములు వ్రాయఁబడినవి.

ఇట్లు సుజన విధేయుఁడు

తే 29 ది అక్టోబరు 1903 సం॥

కొమాండూరు శ్రీనివాసాచార్యుఁడు.
శ్రీ వేంకటగిరి సంస్థానాశ్రితుఁడు.





పూండ్ల రామకృష్ణయ్యచే వ్రాయఁబడిన

## యక్షప్రశ్నముల పీఠిక.

---

1. ఈగ్రంథమును శ్రీమాన్ కొమాండూరు శ్రీనివాసాచార్యులవారు రచియించిరి. వీరిపుడు శ్రీమద్వేంకటగిరియందు నివసించి, వృత్త్యంతరముచే జీవయాత్ర నడపుచు, శ్రీవేంకటగిరిసంస్థానాశ్రితులలో నొక్కరై యున్నారు. ఈగ్రంథమే వీరి ప్రథమకవిత్వము గాదు. వీరు ప్రప్రథమమునఁ గపిలాచిత్రకాయోపాఖ్యానమును వ్రాసియున్నారు. ఇది ముద్రితము. మఱియు, "బేతాళపంచవింశతి" అను విక్రమాదిత్యవిజయము నించుమించు 2000పద్యములుగలదానిని (ఇది యముద్రితము) వెండియు 'యదుశైలమాహాత్మ్యము' అనుదానిని (ఇదియు నముద్రితము, 1600 పద్యములం గలది) ఋతువిలాసమను మఱియొక కబ్బమును ననేకచాటుధారలను రచియించియున్నారు. వీరి వయస్సు 42 వత్సరములుండును. వీరితండ్రిగారును బండితులుగనుండి పూర్వము నెల్లూరిపురమతల్లి యందే నివసించుచుండిరి.

2. ఈగ్రంథకర్తగారు వ్రాసిన యుపోద్ఘాతమువలన విషయమంతయుఁ బాఠకులకుఁ దెల్లమ. కవిత్రయముయొక్క భారతాంధ్రీకరణముంగూర్చి యిక్కడ మేమెక్కువగా వక్కాణింప నక్కఱఁ గలవారము గాము గాని వారనేకఘట్టములలోఁ దమయిష్టానుసారముగా నప్పటి దేశకాలపాత్రముననుసరించి వ్రాసియుందురని తోఁచుచున్నది. అట్టియుక్తపదములలో "భగవద్గీత" లొకటియై యందఱకు నగపడెడి. దీనిని శూద్రాదులు వినరాదనియో, పఠింపరాదనియో, మఱియేకారణమో యూహింపఁజాలము గాని యాంధ్రమునఁబూర్తిగాఁ దెలిఁగింప మానినారు. ఇంక నిట్టిఘట్టము లనేకములున్నవి. వానివిషయము ప్రకృత మనవసరముగాన విరమించితిమి.

3. ఇయ్యక్షప్రశ్నముల నాంధ్రీకరించినవారు శ్రీమన్నృసింహపురాణము హరివంశము మొదలగు గ్రంథరాజములఁ దెనింగించి "ప్రబంధపరమేశ్వరుఁడు" అని

పేరువహించినట్టి యెఱ్ఱాప్రెగ్గడగారు. కారణమేమో తెలియదుగాని, మూలమున నున్న ప్రశ్నోత్తరములనన్నింటిని దెనిఁగింపని విషయము విచారణీయము. ఇది భగవద్గీతలవంటి వేదాంతవిషయముంగలదియుఁ గాదు. మఱియు నాంధ్రీకరించుటకు గ్రంథబాహుళ్యముగలదియుఁగాదు. ఇప్పటిను సంస్కృతమున షుమారు 150 శ్లోకములున్నవి. వీనిలోఁగొన్నింటి నాంధ్రీకరించుటకును, మఱికొన్నింటిఁ దెలిఁగింపకుండుటకునుగల హేతువగపడదు. అట్టిలుప్తశ్లోకముల నాగమాంతార్థములెవ్వియు గోచరింపవు. ఇంతియగాదు. ఒక్కొక్కశ్లోకముననున్నట్టి విషయములఁగొన్నింటిం గైకొని కొన్నింటిమానినారు. ఒక యుదాహరణముఁ గనుఁడు.

శ్లో॥ ఇంద్రియార్థాననుభవన్ బుద్ధిమాన్ లోకపూజితః
సమ్మతస్సర్వభూతానా ముచ్ఛ్వసన్ కోనజీవతి॥

అను నీ శ్లోకమునఁగల పూర్వార్థమునంతయువదలి యుత్తరార్ధమునంగల 'ఉచ్ఛ్వసన్ కోనజీవతి' అనుదానిం బ్రశ్నోత్తరముతోఁజేర్చి యిట్లు

క॥ నాపుడు నతఁ డాతనితో । జీవన్మృతుఁడెట్టివాఁడు చెప్పుమనుటయున్
దేవాతిథిపితృభృత్యుజ । నావళులకు నిడక కుడుచునతఁడని చెప్పెన్ ॥

అని వ్రాసిరి. పైశ్లోకమునకుఁగల ప్రత్యుత్తరము సంస్కృతమున నిట్లు విపులముగ వ్రాయఁబడియున్నది.—

శ్లో॥ దేవతాతిథిభృత్యానాంపితౄణామాత్మనశ్చయః
ననిర్వపతిపంచానా ముచ్ఛ్వసన్నసజీవతి॥

పైపద్యము మూలానుసారిగాదనియెంచి యిక్కవి ప్రశ్నోత్తరశ్లోకముల మరలఁదెలింగియున్నాఁడు. వానిని 3– 4– పుటలలోఁగనవచ్చును.

పైశ్లోకములవరుసయందు క్షత్రియధర్మములు ప్రారంభమైనట్టి 'శ్లో॥ కింక్షత్రియాణాం దేవత్వకశ్చధర్మః సతామివ' అనుశ్లోకము మొదలు వరుసగా 4 శ్లోకములను వదలినారు. అవ్వల మూఁటి నాంధ్రీకరించిరి. తర్వాత రెంటి వదలిరి. మరల రెంటి నాంధ్రీకరించిరి. అపిమ్మట మూఁటిని విడచిరి. పెండియు నొకదానిం దెనింగించిరి. అవల 16 శ్లోముల్ల వదలిరి. సమష్టికిఁ బ్రశ్నోత్తరములు చేరియించుమించుగా 70 శ్లోకములకుఁ బైఁగా నాంధ్రీకరింపకమానిరి. ఇన్నింటిఁ దమయిష్టానుసారముగ మానుటకుఁగలకారణమరయునది. అది వాచామగోచరము.

3. ఎఱ్ఱన గారాంధ్రీకరించిన పద్యములకును మూలమునకుఁ గొన్ని భేదములగపడుచున్నవని వ్రాయుటకు జంకుచున్నారము. అయినను బండితసింహులిదయుక్తమని నిర్ణయించి, యోగుబాగులం దెలిపినంగదా యిట్టివిషయము లోకమునకుం బ్రయోజనకారియగునని మేమిట్టి తెంపరితనము నవలంబించితిమి. ఈ గ్రంథమున 7వ పుటలోనున్న 4వ పద్యమునందలి 'విషమనంగనెయ్యది' అను ప్రశ్నమునకు వెంటనే వ్రాయఁబడిన పద్యమున 'విషమగు విప్రధనము' అని యగపడుచున్నది. మూలమున 'ప్రార్థనా విషమ్' అనియున్నది. ప్రార్థించుట విషమని మూలాభిప్రాయము. ఇట్టిమార్పు నొనర్చుటకుఁగల కారణమరయునది.

మఱియు 6వ పుటలోనున్న ప్రశ్నమగు వచనమునందు "మనుజుం డెయ్యది పరిత్యజించి సర్వజనప్రియుండును, నిశ్శోకుఁడును, నర్థవంతుండును, సుఖియును నగు" అనుప్రశ్నమునకు వరుసగా వ్రాయఁబడిన యుత్తరములలో "విగతవెతర్థాఢ్యుఁడగు లోభ మొనర విడిచి" అనియుత్తరమున్నది. మూలమున "కామం హిత్వార్థవాన్ భవతి" అని యున్నది. పద్యమున లోభమొనరవిడిచి యని యుంటకును శ్లోకమునఁ "గామంహిత్వా" అనియుండుటకును గల కారణ మరయునది. కామక్రోధలోభమోహములకు భేదమున్నదిగదా. కామమనఁ గోరికయని యర్థము. అదియే యాశ. లోభమన్నఁ బిసినితనము. ఇదియు నొకవిధమగునాశయని కొందఱి యభిప్రాయము. ఇందలి యుక్తాయుక్తమును విచారించునది. మఱియు 11వ పుట లోనున్న "సీ॥ శ్యామాంగు నారక్త జలరుహనేత్రు" అనుసీసము స్వేచ్ఛగా వ్రాయఁబడినది. దీనిమూలశ్లోకముల "యస్య నాగసహస్రాణాం దశ సంఖ్యేన వైబలమ్" అని భీమునకు విశేషణవాక్య మగపడుచున్నది. దీనియర్థమే యింటగపడదు. ఇందులకు నాసీసమున 'భీమఫల్గును లతిభీమబలులు' అని మాత్ర మగపడెడి. ఈ సీసపద్యము నాలుగైదుశ్లోకములకుఁ దెలుఁగుగ నగపడుచున్నది.

మఱియు 7వ పుటలోనున్న 'అనిన నతఁడు లోకమున కెయ్యదియ దిక్కు' అను పద్యముయొక్క మూలశ్లోకమునఁ గట్టకడపటిపాదమునందు 'తతఃపిబ హరస్వచ' అనియున్నది. ఈపాదభావమే పద్యార్థమున లేదు. ఇందులకుఁ గారణము మృగ్యము.

4. ఇఁక నీనూతనకవికవిత్వము, రసవంతమై, పొల్లుపదములు తఱచులేక మూలానుసారమై యొప్పుచున్నది. 9వ పుటలోనున్న సీసపద్యమున 'నతుయ్యానరకంబు

ననుభవించుననునది పునరుక్తియని కొందఱకు సంశయమొనరెడిని. ఇది మూఁడు శ్లోకములకుఁ దెలుఁగు. ఆ శ్లోకములలోఁ బ్రతిశ్లోకమునకును గట్టకడపట 'సోక్షయం నరకం వ్రజేత్' అనియున్నదిగాన దీనను ద్విరావర్తము ప్రయోగింపఁబడినది. సంస్కృతమునను న్నట్లే యిందున మూఁడు పద్యములుగా వ్రాసినచో నీపునరుక్తి తప్పియుండుఁగాఁబోలు. 4వ పుటలో నఖిలభూతములకు ననుపద్యమున "మోక్షసాధనం బదెద్ది" అని ప్రశ్న వ్రాయఁబడియున్నది. మూలమునందు "అమృతం కింస్విద్రాజేంద్ర" అనిమాత్రమే యున్నది. మోక్షమెయ్యదియను నర్థమునిచ్చు పదము లందున్నవిగాని మోక్షసాధనమెద్దియను నర్థమునిచ్చుపదములు మూలమున లేవు. ప్రత్యుత్తరమున 'సనాతనధర్మమదే చెలంగు నీక్షితిపయి మోక్షపుం బదమొగిం ఘటియింపఁగఁజేయు మార్గము' అనియును వ్రాయఁబడినది. 'సనాతనోఽమృతోధర్మో' అని ప్రత్యుత్తరము మూలమందున్నది. దీని న్మూల విరుద్ధమనఁజనదు. ఇది సంస్కృత వ్యాఖ్యానానుసారముగ వ్రాయఁబడియున్నట్లు గ్రంథకర్తగారే నిర్ణయించియున్నారుగదా. కొన్ని పద్యములు మూలముతోఁ దులఁదూఁచినట్లున్నవి. అట్టివానిలో నొకదానినిమాత్రమిం దుదాహరించెదము. ఇందు నైనిమిదవపుటలోనున్నట్టి పద్యముం దీని మూలముం గనుఁడు.

క॥ మునులెద్దానిని స్థైర్యం। బనిచెప్పిరి ధైర్యమెయ్యదనిచెప్పిరి నె
  మ్మిని స్నానంబనదెయ్యది। యొనయం దానంబనంగ నెయ్యది చెపుమా॥

శ్లో॥ కింస్థైర్య మృషిభిఃప్రోక్తం కించధైర్యముదాహృతమ్
  స్నానంచకింపరంప్రోక్తం దానంచ కిమిహోచ్యతే॥

5. ఇఁక నిక్కవివ్రాసిన గ్రంథములలోనుండి కవితాశైలి తెలియుటకై కొన్నిపద్యముల నిందుఁ బ్రకటించుచున్నారము.

### ఋతువిలాసము.

చ॥ వికసిత నీరజాస్యయును విస్ఫురితోత్పల భాసురాక్షియు
  వికచ మనోజ్ఞ కాశరుచి విభ్రమితామలచేలయుం బ్రఫు
  ల్ల కుముదకాంతిపుంజ సువిలాసయునౌ తరుణీవతంసమ
  ట్లకుటిలలీలనొప్పు శరదాగమమిం పెనయింపకుండునే॥ శరత్తు

చ॥ సరస సుమాసవావళుల సౌరభముల్జనియించు మోములన్
బరువడిఁ బుచ్చునూర్పుల సువాసన లంగములందుఁ బర్వ నాం
డొరువుల మేనులొక్కటిగ నొప్పఁగ దంపతులొయ్య నిద్రలం
బరఁగిరి కామకేళులను బల్విడిఁ జొక్కి విచేష్టితాంగులై॥ హేమంతము॥

చ॥పులు మడువంగమించు బలు పొన్నలెనున్న మెఱుంగుమేనులన్
గోలుకులక్రేవఁ గెంపుఁజవిఁ గుల్కుచు వీనులనానుకన్నులుం
గలిగి నిశావసానములఁ గాంతలు గేహములందుఁ గ్రాలి ర
జ్జలజ నివాసినీక్రమతఁ జారువిలాసము లేర్పరింపుచున్॥ శిశిరము॥

చ॥కటులను లంబమేఖలలు గబ్బిచనుంగవలందు హారముల్
పటుతరమన్మథాస్త్ర పరిబాధిత కోమలగాత్రవల్లులన్
దటుకునఁ దాల్చి యమ్మధువు దార్కొనఁగోయిల లట్టుపల్కన
క్కుటిల శిరోజ లున్మదిని గ్రోల్కొని రొక్కటఁ బాంథచిత్తముల్॥ వసంతము॥

చ॥విరిసి పిఱుందు లానఁగను జెంపుగఁ గ్రమ్మ శిరోజపాళితోఁ
బరిమళ మంజుల ప్రసవ భాసురవాళి తటాలితోడ బ
ల్సరులను మించుముత్తమగు చన్నులతోడను మద్యవాసనా
కరముఖపఙ్క్తితో రతులఁ గాముకకోటిని దన్పిరంగనల్॥ వర్షర్తు॥

## గ్రీష్మర్తు వర్ణనము.

చ॥ తివిరి నిదాఘవేళ యరుదెంచెను బోఁటి కరంబువేఁడిమిన్।
నెవడెడి వేవెలుంగు భజనీయుఁడుగాఁదగు చందమామయున్
దవిలి మనుంగ నింపగు సుదంబును రమ్యదినాంతసంఘమున్।
సవసవగా శమించిన యనంగుఁడునై కడునొప్పుమీఱఁగన్॥

చ॥ఇరులగమిన్ హరించు రజనీమనిచే మెరిమించు రాత్రులున్।
హరువుగఁ గాడ్పులు చిత్రజలయంత్రములంబోలు పౌరుగేహముల్।
సరసపుఁ జంద్రకాంతమణిజాల వితర్దులుగల్గి చెన్నుగన్।
బరఁగె నిదాఘవేళఁ జనవార మనోజ సుఖోపభోగ్యమై॥

చ॥ అనువుగ నొప్పె గ్రీష్మసమయంబున రాత్రులు చందనాంబులన్
మునుకొను మంచితావుల సమున్నతశైఖరి మించు మేడలున్ ।
ఘనకబరీ ముఖానిల వికంపితమధ్యము లంగజోరుదీ ।
ప్తనమగు తంత్రిపాటలు నవంబుగఁ బ్రోడలకింపుఁ గూర్చుచున్ ॥

చ॥ వలిపపుటొల్లెకట్లఁ జెలువంబగు మేఖలల న్నితంబముల్ ।
మలయజచర్చల న్విమలమౌక్తికహారములన్ గుచంబులున్ ।
జలములనాడి యిడ్డ పలుచందపుఁదావులఁ బొల్చు పెన్నెరుల్ ।
గలిగి ప్రియాళితాపములఁ గ్రన్ననఁ బాపుదు రోజఁ గామినుల్ ॥

చ॥ ఖరకర చిత్రరశ్ములను గ్రాఁగి కరంబు విదహ్యమానమౌ ।
ధరణినిఁ ద ప్తరేణువుల సంతతిరేచి యధోముఖంబుగా ।
గిరిగొను వక్రయానములఁ గేరి పొరిం బుసవెట్టు గాలి య
ప్పరుసున నెమ్మిక్రింద భుజఁ బ్రాఁకెడి సత్ఫణిభంగిఁ గ్రాలెడున్ ॥

చ॥ అనిశము రాగరంజితములై తగు లత్తుక లింపుఁ బెంపఁ జే ।
వ్నెనరెడి నూపురప్రభలనొప్పు రహించు వధూపదంబులన్ ।
మొనసెడి రాకపోకలను మ్రోయు మనోహర హంసకధ్వనుల్ ।
జనముల మానసంబు లవశంబొనరించెను శంబరారికిన్ ॥

ఉ॥ మంచుల మించులం దొలఁకు మౌక్తికహారము లొప్పమీఱఁగా ।
నంచిత చందనద్రవ సమర్పణఁ జేసి వధూకుచంబులున్ ।
గాంచనమేఖలా లసిత గాఢ నితంబము లింపుఁ గూర్చి తే ।
ఱంచె సముత్సుకంబు పృథివీజనకోటి మనోంబుజంబులన్ ॥

చ॥ సవురుగ నింపుఁ గూర్చు తనుసంధుల నెల్లెడ నోలిఁ జెమ్మటల్ ।
దివిరి స్రవించుచుండ బలుతేఁకువ దట్టపువాసము ల్వెసన్ ।
దివిచి యలంతియొల్లియలఁ దిప్పని చన్నులమీఁదఁ గప్పి ర ।
య్యవసరమందుఁ బ్రోడలగు నంబుజపత్రవిశాల లోచనల్ ॥

ఉ॥ గందపునీటితుంపురులఁ గైకొని వీవనఁ బట్టువెమ్మొరల్ ।
సెందిన హారము ల్వొలయ సిబ్బెపుగుబ్బలమీఁది పూఁతలున్ ।

గ్రంథుగ వీణలంబొదమ కాకలి గీత రవంబులప్డు గు ।
న్భొందిన యట్టులుండు మరునుద్ధతి పేల్మిఁ జేయనేరిచెన్ ॥

ఉ॥ తెల్లని మిద్దెటిమ్ములను దిన్నని జవ్వములోలి రాత్రులం ।
దల్లనఁ జొక్కి కూర్కఁగఁ దదాననమల్లడు సుత్సకంబు గం ।
ధిల్లఁగఁ జూచి చూచి కడుఁ దేఁకువ తే తుదలందుఁ దోఁచు జా ।
బిల్లికరంబు సిగ్గుగొను పీఁకను బాండురత న్వహించుచున్ ॥

ఉ॥ ఇంతులఁ బాయుటన్ దలచుటింగల మెంతయు మానసంబులన్ ।
బంతము మీఱ నెర్పఁగఁ బ్రవాసుల సహ్యమరుత్సమాహతా ।
త్యంత పరాగపుంజముల నబ్జహితోగ్రకర ప్రతాపితా ।
నంతను గన్నెత్తి కన రాలరిఁ శోమనఁ జాలరయ్యెడన్ ॥

చ॥ మృగములు పెల్లుబెండెలను మిక్కిలి తాపముఁ జెంది యెంతయున్ ।
దగగొని చేటుపాటులను దాలువు లెండి వనాంతరంబులన్ ।
బొగులుచు నంజన చ్ఛవినిఁ బోలి చెలంగఁగ నీలులంచు పోగిన్ ।
గగనముఁ జూచి నిక్కెడుఁ దగం దలఁపు ల్పోలిపోవుచుండఁగన్ ॥

## బేతాళపంచవింశతిక.

ఉ॥ అచ్చపలాంగి నోపుగతి నందముగా సృజియించి నల్వ దా
నాచ్చెము లేని యీబిడ మహోచిత సౌష్ఠవమొప్పు చూచి యు
న్నచ్చెర మచ్చకంటులను నచ్చుగఁ జేసెదు నాఁడు, నాకు, నీ
మెచ్చుగు నేర్పు గల్గదని మిక్కిలి చిన్నతనంబు నొందెడున్ ॥ ఆ 1.

చ॥ కలదిలఁ బూర్వతోయనిధిగట్టున నొక్కపురంబు దేవతా
నిలయముల న్మనోహర వనీ నిచయంబుల రమ్యభిత్తి కా
వలయిత సౌధ గేహముల భవ్య తటాక సరోవరంబులన్
వెలయుచుఁ దామ్రలిప్తమన పేరుపుతేని పురంబు దంబునన్ ॥ ఆ 2.

చ॥ యువజన మానసంబులను నుద్ధతి కాఁ జిలువుచ్చు నమ్మనో
భవుఁ డసమాన కోపమున వంచిన విండ్లన వల్లికావళుల్
సవురుగ నెక్కుపెట్టు శరజాలమనంగ లతాంతకోటులం
దవిరళలీలఁ గూడ్చు గొనయంబు లనంగ నాసంగె భృంగముల్ ॥ ఆ 3.

క॥ మనసిజ చూత శరార్చులు। మనమున దరికొనఁగ వివశమాన యగుటన
న్ననఁబోడి వీణ మొఱసెను। ననుఁగుం జెలివోలె వ్యాకులాలాపములన్॥ ఆ 4
క॥ మదను విరివారసమ్ములు। కెద యమ్ములపొదిగ నయ్యె నిఁక నో సఖ నా।
మది మోహమున మొనరించిన। మదిరాయితసేత్రఁ గూర్పుమా యెట్లయినన్॥ ఆ 5.

## శ్రీ యదుశైలమాహాత్మ్యము.

ఉ॥ ఆమ. మోముదమ్మి తెలుపారెను బోనమమీఁది వాచవుల్
సన్నగిలెన్ మెఱుంగు వలిచన్నుమొనల్ నలుపొందెఁ దోడుతో
సన్నపుఁగౌను దీఁగ విలసద్గతి బల్పుగడించె నెన్నడల్
దిన్ననఁగాంచె నిద్దుకలు తీఱవి వయ్యెమ నాఁడునాఁటికిన్॥ ఆ 3.
క॥ చిలువ వసించెడు నెలవున। నెలవుకొనవచ్చు, మండు నిప్పల నడుమన్
నిలువఁగవచ్చును హరిభ। క్తుంగలఁచెడువానిఇంటఁ గూడదు నిలువన్॥ ఆ 4.
చ॥ చెలువగు పూవుగుత్తులనఁ జిక్కనిచన్నులు, మల్లికా సుమా
వళియన బల్లదంబులును, వల్లులనన్ భుజముల్ చివుళ్లనన్
దాలఁకెడు హస్తలుంగలిగి తోరపుఁజూపులు సొంపునింపఁ జె
న్నలరు వసంతవల్లరి సురాధిపుఁ గొల్వఁగవచ్చె నయ్యెడన్॥ ఆ 5.
చ॥ విరిసినపూవుగుత్తుల స్రవించెడు తేనియలాని యామునం
బరిగొనియాడు తుమ్మెదల పాటలచే, బలునీటుఁ గాంచె న
ప్పరిసరసీమనుండు నవపల్లవ కుట్మల పుష్ప మంజరీ
పరివృత భూజసంతతులు పర్యుర కుంకువ తచ్చుపట్టులై॥ ఆ 5.
చ॥ బలితపుఁగొప్పు లామ్రనవపల్లవలీలలఁ గ్రాలు హాతెఱల్
వలుదచను ల్బెడంగు నిడువాలికచూపులుఁ బల్కుసేర్పులున్
సలజిగి మించుమోములును నిద్దపుఁజెక్కులుఁ గల్గి రూపవుం
భలు గరువంబు తంబిపొన భామినులొప్పిరి యుర్వి నిక్కలిన్॥ ఆ 6

## కపిలాంఘ్రిత్రకారోపాఖ్యానము.

చ॥ జలజభవుండు గూర్కుతఱిఁ జాపలబుద్ధి శ్రుతిప్రపంచమున్
బలభుజుఁ డర్థిదొంగిలి యభంగురతన్ జలరాశి డాఁగ బ

ల్బలమున రక్కసుం గెడపి చయ్యనఁ బ్రాఁజదువు ల్విరించి క
ర్కిలి దయివాఱ నీగు ఘనమీన విభుండొగి నన్నుఁ గావుతన్॥
మ॥ భువనత్రో భయముగాఁ గుమారుఁ గడు బాముల్వెట్టుచున్ శౌరి నీ
సవిధస్తంభమునందుఁ జూపుమని యా స్తంభంబుఁ జే వ్రేయ నా
ద్భుతమై దుర్మదరాక్షసుం జమరి భక్తశ్రేష్ఠుఁ బ్రహ్లాదుఁ గం
దువతోఁ బ్రోచిన నారకేసరినిఁ గొల్తున్ భక్తిసేవాఱఁగన్॥
మ॥ కనియెన్ గోతిలకం బుదగ్రతరు శాఖానూనప్రచ్ఛాదన
త్వనిగూఢోగ్రతమో వికారముఁ గిరివ్యాఘ్రాది సద్రా విని
ద్ర నితాంతోద్ధిత నాసికాపుట గళద్గాఢ ప్రఘూత్కారమున్
ఘన గర్జోపమ రౌద్రసింహ నినదాక్రాంతంబుఁ గాంతారమున్॥
ఉ॥ కందని మేనితో నిలుఁగుగా నసి డెందముతోడ నశ్రువుల్
జిందని కన్నవన్నెలయు శేరుచితో వినయంపుఁ జెంపుతోఁ
గ్రందున సన్నగిల్లి పతరాల్పడనట్టి యెలుంగుతో భయ
స్పందము చెందక న్నహిత చాతురి నిట్లని ధేనువంతటన్॥

## చాటువులు.

చ॥ మదగజయాన? చెక్కిట నమర్చిన కస్తురిపత్రి భంగమున్
జెదరదు, గుబ్బచన్నులను జెందిన గంధము చిట్ల దత్తులన్
బొదరెదు కజ్జలంపుఁగఱ వోవదు, పెదవు మోవిఁ గెంపుడో
ల్వదల దిదేమి? నీయలుకవల్లనొ, నీపతి చాలఁ డౌటనో॥
ఆ॥ కాంతజాతికళయుఁ గనలేని విభుఁడింద్ర। భోగియైనవాని పొందుకంటె
నతను శాస్త్రవేదియగు కాంతుతోడిస। ల్లాపమొసఁగు ముదము లలనకెపుడు॥
గీ॥ సారము నసార మరయంగ నేరకుండు। యువతిసంభోగ సామ్రాజ్య యుక్తికం
సార విద్యోష్ఠి దుత్కంఠ చారువీక్ష। ణావళులె యౌవనులకింపు నమరఁజేయు॥
చ॥ కలదాకవాపి మింట నటఁ గన్పడు బంగరు మెట్లు నీలపుం
జెలువపుఁ బిన్నత్రోవ పయిఁ జెన్నగు చందనయుక్తి జొదుగా
మల లెసఁగుం గృతార్థి సుగమంబులు మీఁద సుధాంశుసమ్ముఖం
బలవడుచుండుటన్ సులభమా నమృతం బటఁ జేరువారికిన్॥

6. ఈ వేంకటగిరి సంస్థానమువారిదివఱకనేకగ్రంథముల రచియించుచు రచియింపించుచు, నట్టివానిముద్రింపించి ప్రకటించుచుఁ దత్కర్తల సమ్మానించుచు భాషాభిమానులగు విద్యాపేక్షులకుఁదమ గ్రంథములూరక పంపుచు నుండునట్టివిషయమంతయు నందఱకుఁ గరబదరాయమాణము. వీరు చేయించిన "శిశుపాలవధ మహాకావ్యము"ని 1904 సంవత్సరపుఁ బట్టపరీక్షకుఁ జను విద్యార్థిబృందమునకంతయు నుచితముగ నిచ్చినారన్న విషయమే వారి భాషాభిమానితను జెప్పక చెప్పుచున్నది గదా. వీరు విద్యాసాగరమున సత్పోతసహాయతచే సంతతము సంచరించి పులుగడిగినముత్తెంబులఁబోలు పాత్రంబుల నలవఱచికొనుచుందురు. అట్టిగ్రంథములలో నిదియొకటియై యున్నది. ఈగ్రంథము ముద్రించునట్టివిషయములో వారియభిప్రాయ మిట్లు తెల్పఁబఱచిరి.

"మేము పంపినంతమాత్రమున నిది ముద్రణీయంబని యెన్నవలదు. ఇందలి నూతనపద్యములు మూలానుసారములవునా, కావా, కవితయందేదేని లోప మున్నదా, యిదియంతయు నితరులవలనఁ దెలియఁదగినది. మేము చేయించినది మాకునింపుగానేయుండును. అట్లుగాదు. తమవంటివారివలనం దదంశంబులెల్ల నెఱింగి యుక్తముగా నున్నచో ముద్రించునదియనియుఁ గానిచో ముద్రింపఁబని లేదనియు మా యభిప్రాయము."

అనివారు 23-11-03న వ్రాయించిన లేఖ లేఖుల శుభలేఖం బోలియున్నది గదా. మఱియు వీరిట్టి లోకోపకారకములైన కార్యము లనేకములు చేయుచునే యున్నారు. విద్యావిషయికమునం బ్రవర్తించువారికి నూర్లకొలఁది సహాయముఁ జేసి యున్నారు. చేయుచున్నారు. చేయఁగలరు. ఇట్టిసంస్థానము సర్వజ్ఞసింగమనీఁడు మొదలుగ నేటిదనుక "విద్వత్సంస్థానము" నాఁ బ్రసిద్ధివహించినట్లె యెప్పటికి నితోద్ధిత సంపత్సమృద్ధితో నిల లలి వెలయఁగావుతమ. ఇట్లు,

పూండ్ల రామకృష్ణయ్య,
"అముద్రితగ్రంథచింతామణి"
పత్త్రికాధిపతి.

నెల్లూరు,
15-2-04.

శ్రీరస్తు.

# శ్రీ మహాభారతారణ్యపర్వమునందలి

## యక్ష ప్రశ్నములు.

---

ప్రాచీనము. మ॥ విను మేనొక్కబకంబ నిక్కొలను పృథ్వీనాథ నా సొమ్మనీ।
యనుజుల్మద్వచనంబుఁ గైకొనక తోయస్వాదులై యిప్పథం।
బునఁ బ్రాణచ్యుతిఁ బొందిరీవునుఁ గడున్మోహంబునన్ సాహసం।
బునఁ గుంజొచ్చిన నట్లయయ్యెదు సుమీ మున్నన్న వారించితిన్॥

ప్రా. క॥ ఏనడిగిన యర్థములకు। భూనుత యుత్తరములిచ్చి పొలుపారఁ బయః।
పానము సేయుము నావుడు। నా నిర్మలచరితుఁ డంబరాభిముఖుండై॥

ప్రా. వ॥ అయ్యా నీవు బకరూపధరుండవైన రుద్రుండవో పావకుండవో పవనుండవో యట్లు గాని నాఁడు కులపర్వతప్రతిములైన నా తమ్ములం బడఁ ద్రోఁచునట్టి బలంబు పులుఁగులకుం గలదే దేవాసురగంధర్వయక్షాదులకు దుర్జయులైన యివ్వీరుల నిట్లు సేసి నీవు కానివాఁడవు పోలెఁ దొలంగియున్నవాఁడవు నాకు నద్భుతభయంబు లొక్కటం బొడమెడు నీ వెవ్వఁడవు నీ తలంపెయ్యది చెప్పి నా హృదయవేదన నపనయింపవే యనిన నదృశ్యభూతం బిట్లనియె॥

ప్రా. ఆ॥ కౌరవేంద్ర బకముగాను నే విను ముక్క। యక్షవరుఁడ నిచట నస్మదీయ।
నికృతిఁ జేసి పడిరి నీ తమ్ములందఱు। ననుచు నాక్షణంబ యతని యెదుర॥

ప్రా. మ॥ నిలిచెం దాళసమున్నతాంగుఁడు మహానిర్ఘోష సంతర్జితా।
ఖిలభూతప్రకరుండు దీర్ఘవిపులగ్రీవుండు దంష్ట్రాసము।
జ్జ్వలవక్త్రుండు విరూపలోచనుఁడు తీవ్రస్ఫారతేజోఘనుం।
డలఘుం డాసరసీతటాగ్రమున నయ్యక్షుండు ఘోరాకృతిన్॥

ప్రా. వ॥ ఇట్లు నిలిచి కౌంతేయాగ్రజున కిట్లనియె॥

ప్రా. క॥ నాయనుమతి లేకుండఁగ। నీయుదకముఁ ద్రావితేని నెవ్వారైనన్।
ధీయుత చత్తురు నీ వటు। సేయకు సమ్యగ్విచారశీలుఁడవగుటన్॥

ప్రా. వ॥ కావున మదీయంబులగు ప్రశ్నంబులకుత్తరంబులు సెప్పుమనిన నతండు మహా
త్మా నీ నిత్తంబునకు సరివచ్చునట్లుగాఁ జెప్పనాబోటివానికి శక్యంబగునే
యైనను నా నేర్చువిధంబునం జెప్పెద నడుగుమనిన నయ్యక్షుండిట్లనియె॥

ప్రా. క॥ దినకరు నెయ్యది నడపును। దినకరు నెవ్వారు గొలిచి తిరుగుదు రద్దే।
వుని యస్తమించు జేమిట। ననఘ తదాధారభూతమది యెయ్యదియో॥

ప్రా. తే॥ అనిన ధర్మజుఁ డిట్లను నబ్జహితుని। నడపు బ్రహ్మంబు సురకోటి నడచుఁ గొలిచి
ధర్మమున నస్తమితుఁడగుఁ దపనుఁ డమ్మ। హాత్మునకు సత్యమాధారమం డ్రు
వ॥ అనిన విని యక్షుండిట్లనియె॥ [బుధులు॥

ప్రా. క॥ ఏమిట శ్రోత్రియుఁడగు జను। నేమిటఁ గడు మహిమవడయు నిమ్మగఁ బురుషుం
డేమిట సహాయయుతుఁడగు। నేమిట నగు బుద్ధిమంతుఁ డేర్పడఁ జెపుమా॥
వ॥ అనిన నతం డిట్లనియె।

ప్రా. క॥ శ్రుతమువలన శ్రోత్రియుఁడగు। నతుల తపోయుక్తిఁ గడు మహత్త్వము వడయున్
ధృతిచే సహాయయుతుఁడగు। నతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్॥
వ॥ అని చెప్పిన నన్నరదేవోత్తమునకు వెండియు నప్పురుషుండిట్లనియె.

ప్రా. తే॥ ఏమికతమున భూదేవుఁ డెసఁగు దేవ। భావమున నాతనికి సాధుభావ మెవ్వి
ధమున నగు నసాధుత్వమెద్దానఁ జెందు। మానుషుండగు నాతఁ డేదానఁ జెపుమ॥

ప్రా. చ॥ అనవుడు ధర్మజుం డనియె నధ్యయనంబున దేవభావముం। గను నవనీసుప
ర్వుఁ డధికవ్రతశీలత సాధుభావమా। తనికి విశిష్టవృత్తిదిగఁ ద్రావి యసాధు
వనంగనుండు శో। చనియాతిలేక మృత్యుభయసంగతి నాతఁడు మానుషుండగున్॥
వ॥ అనవుడు యక్షుండిట్లనియడిగె.

సూ. తే॥ దేవభావంబదెట్లు క్షత్రియులకొదవు। సత్పురుషులాదు రేధర్మసరణివారు।
మనుజభావంబు వారికేమాడ్కి నమరు। వారలకసాధుభావమేవలనఁ గలుగు॥

వ॥ నావుడు కుంతీనందనాగ్రజుండిట్లనియె-

సూ. ఉ॥ వారికి దేవభావ మనవద్యశరాస్త్రకళావిభూతిఁ జె।
న్నారును సజ్జనత్వమది యజ్ఞమునన్ లభియించు నేయెడన్।
భీరుత మానుషత్వమని పించును నార్తులఁ బ్రోవకుండినన్।
ధారుణిపై నసజ్జనతఁ బాల్పడు వారలు నిక్కువంబుగన్॥

వ॥ అనిన నయ్యజాతశత్రుని యక్షుం డిట్లని ప్రశ్న మొనర్చె.

※ సూ. క॥ యజ్ఞపుసామం బొకఁ డెది। యజ్ఞంపుయజుస్సనఁగ నదియొకఁ డెదియా।
యజ్ఞము నొకఁ డెది నడపును। యజ్ఞం బెద్దానిమీఱ కలరెడిఁ జెప్పుమా॥

వ॥ అనియడుగుటయుఁ బాండవజ్యేష్ఠుం డిట్లనియె॥

※ సూ. క॥ యజ్ఞపుసామము ప్రాణము। యజ్ఞంపుయజుస్సు చిత్తమై యలరెడు నా।
యజ్ఞమును ఋక్కు నడపును। యజ్ఞం బా ఋక్కు గడువ కలరెడి వినుమా॥

వ॥ నావుడు నమ్మానవేంద్రు నద్దివ్యపురుషుం డిట్లని ప్రశ్న మొనర్చె.

సూ. చ॥ అనిమిషత్వప్తికారులకు నబ్బెడు మేటిఫలం బదెద్ది పే।
ర్మినిఁ బితృదేవతల్గనియ మేలెది గల్గు ధరాతలంబునన్।
మనుజున కెట్టి సాధనము మానక కూర్చుఁ బ్రతిష్ఠ సంతతిం।
జనవరశ్రేష్ఠ మెయ్యది పొసంగ నెఱుంగ వచింపు మీయెడన్॥

వ॥ అనిన నజ్జనవల్లభుం డిట్లనియె.

సూ. చ॥ అమరులఁ దన్పువారలకు నబ్బెడు మేటిఫలంబు వృష్టి పే।
రిమిఁ బితృదేవతృప్తి యలరించు ధనోపవనాదివృద్ధి గో।
సముదయయుక్తి సెంతయును సంఘటియించుఁ బ్రతిష్ఠ ధాత్రిపై।
నమరుచునుండు సంతతుల నారయఁ బుత్త్రుఁడు మేలు సూడఁగన్॥

వ॥ అనవుడు నమ్మహాపురుషుండు వెండియు నిట్లని ప్రశ్న మొనర్చె.

◆ సూ. తే॥ ఇంద్రియసుఖంబు లందుచు నిలను బుద్ధి। మంతుఁడయి సర్వభూతసమ్మతుఁ
డును నగుచు। జనసమర్చితుఁ డగుచునే జనుఁడు మనియుఁ। జచ్చనటువంటి
వాఁడగు జనవరేణ్య॥

వ॥ అనుటయు ధర్మనందనుం డిట్లనియె.

---

※ ఈ యజ్ఞమనునది జ్ఞానయజ్ఞము గాని కర్మయజ్ఞము గాదని సంస్కృతభారత వ్యాఖ్యానమున వ్రాయఁబడియున్నది. కాఁబట్టి తదనుగుణముగా నీప్రశ్నోత్తరముల కర్థముం జేసికొనవలయు.

◆ సర్వభూతసమ్మతుఁడు, జనసమర్చితుఁడు, అనఁగా దంభముకొఱకు దానాదులు చేసి పలువురచేతఁ గొనియాడఁబడువాఁడని సంస్కృతవ్యాఖ్యానమునను న్నది కాఁబట్టి పై రెండుశబ్దములను దదనుగుణముగ నర్థముం జేసికొనవలయు.

మూ. తే॥ వేల్పులకు నతిథులకును భృత్యులకును। దనరఁ బితృదేవతలకును దనకుఁ జెప్పి।
నెవ్వరకుఁ బంచికొనకుండు నెవ్వఁ డట్టి। వాఁడు జీవచ్ఛవంబగు వసుధలోన॥

ప్రా. చ॥ విని మగుడంగ వాఁడు పృథివీపతిఁ జూచి ధరిత్రికంటె వ్రేఁ।
కనయగు దాని నాకసముకంటెఁ గడుంబొడవైనదాని గా।
డ్పునకును నెక్కుడై జవముపొంపిరివోయెడు దానిఁ బూరికం।
బెనుదఱచైనదానిని ఘటింపఁగఁ జెప్పుము నాకు నావుడున్॥

వ॥ అమ్మనుజోత్తముం డయ్యక్షోత్తమున కిట్లనియె.

ప్రా. ఆ॥ తల్లి వ్రేఁగు సువ్వె ధరణికంటెను నాక। సంబుకంటెఁ బొడవు జనకుఁ డరయ।
గాడ్పుకంటె మనసు గడు శీఘ్రగతి తృణో।త్కరముకంటెఁ జింతకరము తఱచు

వ॥ అనిన నంబరచరుం డతని కిట్లనియె.

ప్రా. తే॥ మొనసి నిద్రించియును గన్నుమూయ దెద్ది। పుట్టియును జేతనత్వంబు వొరయ దెద్ది।
యరయ రూపుఁ గల్గియు హృదయంబు లేని। దెద్ది వేగంబుకతమున నెద్ది వొదలు॥

ప్రా. తే॥ అనినఁ గన్నుమూయదు సుప్తమయ్యు మీను। పుట్టియును గ్రుడ్డు చేతనంబొరయ
కుండు। హృదయరహితంబు ఱారూప మేఱు రయము। కతన వర్తించునని
చెప్పెఁ గౌరవుండు॥

ప్రా. వ॥ అనిచెప్పిన నయ్యక్షుం డతనితోఁ దెరువునడచువానికి రోగార్తునకు గృహస్థునకు మృతిఁబొందినవానికి నెవ్వరెవ్వరు చుట్టంబులనిన నప్పుడమిఱేఁడు నలువురకుం గ్రమంబున సార్థంబును వైద్యుండును సద్భార్యయుఁ గృతంబగు ధర్మంబును బరమమిత్రంబులని నిర్దేశించుటయు, వాఁడు వెండియు నిట్లనె.

మూ. ఆ॥ అఖిలభూతములకు నతిథి యెవ్వఁడు సనా। తనపు ధర్మ మెద్ది తనరు మోక్ష।
సాధనంబ దెద్ది జగమంతయును నెద్ది। యేర్పడంగఁ జెప్పు మిద్ధచరిత॥

వ॥ అనవుడు యుధిష్ఠిరుం డిట్లనియె॥

* చ॥ అతిథి సమస్తభూతములకగ్ని గవామృతమౌ ఘృతాదులన్।
సతతముఁ జేయు సోమమె సనాతనధర్మమదే చెలంగు నీ।
క్షితిపయి మోక్షపుంబద మొగిం ఘటియింపఁగఁ జేయుమార్గమీ।
యతులితమై తనర్చు జగమంతయు వాయువు యక్షసత్తమా॥

---

* ఈ పద్యము సంస్కృతవ్యాఖ్యానముంబట్టి విపులముగ వ్రాయఁబడినది.

సూ. వ॥ అని చెప్పిన నమ్మహాపురుషుండు క్రమ్మఱ నిట్లని యడిగె.

సూ. తే॥ ఒకరుఁ డెవ్వఁడు విచరించుచుండు నెవఁడు। జన్మ మొందియు వెండియు జన్మ
మొందు। హిమమునకు మందదెయ్యది యేర్పడంగ। నన్నియును నుంచుటకుఁ
బాత్రమైన దెద్ది॥

వ॥ అనుటయు నక్కురుకులోత్తముం డిట్లనియె.

సూ. క॥ ఇనుఁ డొకరుఁడు విచరించును। జనియించుచుఁ గ్రమ్మఱంగఁ జందురుఁడు హిమం।
బునకగ్ని మందు సకలం। బును నుంపఁదగిన పాత్రము భూమి యనంగన్॥

వ॥ వారిచరుండు వెండియు నిట్లని యడిగె.

ప్రా. క॥ ఎయ్యది ధర్మువునకుఁ గుదు। రెయ్యది యాశ్రయము కీర్తికిన్ మఱి మార్గం
బెయ్యది సురలోకమునకు। నెయ్యది సుఖములకు నిక్క మేర్పడఁ జెపుమా॥

వ॥ అని యడుగుటయు.

ప్రా. క॥ అమరంగ దాక్షిణ్యము ధ। ర్మమునకుఁ గుదురండ్రు కీర్తిమహిమ నెలవు దా।
నము సత్యము సురపురి మా। ర్గము శీలము సంశ్రయము సుఖంబుల కెల్లన్॥

వ॥ అని యుధిష్ఠిరుం డెఱింగించిన వెండియు.

ప్రా. చ॥ నరునకు నాత్మ యెవ్వఁడు ఘనంబుగ దైవికమైన చుట్టమె।
వ్వరతనికిం దదీయముగు వర్తనమేమిటు నిర్వహించు భూ।
వర యతఁ డేమి పూని యనవద్యతఁ బొందు నెఱుంగఁ జెప్పుమీ।
వరుఁడుగ నన్న నక్కురుకులాగ్రణి యాతనితోడ నిట్లనున్॥

ప్రా. తే॥ ఆత్మజుఁడు సువ్వె పురుషున కాత్మ యద్యో। నాతనికి భార్య దైవికమైన చుట్ట।
మతనిజీవిక పర్జన్యుకతనఁ జెల్లు। నతఁడు దానముఁ గొని యూఁది యతిశయిల్లు॥

వ॥ అనిన నయ్యమర్త్యుం డిట్లని పృచ్ఛ గావించె.

సూ. తే॥ ధనము నుగడింప మేటి సాధనమ దెద్ది। ధనములందున మేలైన ధనమ దెద్ది।
లాభములయందు నుత్తమలాభ మెద్ది। సుఖములందున వరమైన సుఖమ దెద్ది॥

వ॥ అనుటయు భారతుం డిట్లనియె.

సూ. చ॥ ధనము గడింప నిచ్చలును దాక్ష్యము మేలగు సాధనంబగున్।
ధనములలోన మేలు సతతంబు శ్రుతంబగుచుండు ధాత్రి నో।

యనిమిషవర్య లాభములయందు నరోగము తేమిమేలగుట।
బానరుసుఖంబులందుఁదలపోయఁగఁ దుష్టి సమంజసంబగుట॥

ప్రా. చ॥ అనఘ నిమేటిధర్మమగునట్టిది యెయ్యది యెట్టిదెప్పుడుఁ।
గనియఁగఁబండియుండు వెసకఁబుగ నెయ్యది నిగ్రహించినన్।
దనరుప్రమోదసిద్ధి నియతంబుగ నెవ్వరితోడిసంధియెం।
దును వికలంబుగాదు పరితోష మెలర్ప నుపన్యసింపవ॥

వ॥ అని దివ్యుండు వలికిన నాదివ్యబోధనుండిట్లనియె.

ప్రా. తే॥ వినుమహింసయనఁగఁజనుమేటిధర్మంబు। యోగకర్మమెపుడు నానరఁబండి। యుండుమనసుక్రోధ్వఖండింపఁగా మోద। మెసఁగుసుజనసంధియెడలదెందు।

ప్రా. వ॥ అనిపెలిపిన నయ్యక్షుండు ధర్మనందనుతో మనుజుండెయ్యది పరిత్యజించి సర్వజనప్రియుండును నిశ్శోకుండును నర్థవంతుండును సుఖియును నగు ననిన నమ్మహీపతి యతనికిట్లనియె.

ప్రా. తే॥ సర్వజనసమ్మతుండగు గర్వముడిగి। క్రోధ మడఁచి శోకమునకుఁ గుదురు గాఁడు। వినవె యర్థాఢ్యుఁడగు లోభ మొనర విడిచి। తృష్ణవర్జించిసౌఖ్యంబు తెమువు గాంచు॥

వ॥ అనిన నాయక్షుండు మఱియునిట్లనియడిగె.

నూ. క॥ దానము భూసురునందే। మానటనర్తకులనేమియగు భృత్యులయం।
దైనను నేమగు నృపులం। దైనఁబ్రయోజనమ దేమియగు ధర్మసుతా॥

వ॥ నావుడుఁ బూరుకులుండిట్లనియె.

నూ. తే॥ అవనిసురునందుధర్మార్థమగు దాన। మదియునటునర్తకులనుయశోర్థమరయ। భృత్యులందును భరణార్థ మెసఁగుమందు। నవనిపాలురయందు భయార్థమొనరు॥

వ॥ అనిన నమ్మాయయా విచక్షణుండిట్లని ప్రశ్నమొనర్చె॥

నూ. క॥ జగమావృతమగు దేనను। దగ దేనఁబ్రకాశనుడఁగుఁద్యజియించెడువాఁ
డగుదేనసఖులస్వర్గం। బు గమింపఁగరాదు దేనఁబోలుపుగఁజెపుమా॥

వ॥ అనియడిగిన నప్పుడమితేఁడతనికిట్లనియె.

సూ. తే॥ లోకమజ్ఞానవృతముగుఁ బ్రాకటముగఁ। దమమునఁ బ్రకాశమలరదుదగఁ
దృజించు। మిత్త్రిముల లోభము ననుగమింపరాదు। సంగమునఁ జేసి స్వర్గం
బసంగ వినవె॥

వ॥ అనవుడునయ్యమరవరుండు పదంపడిప్రశ్న మొనర్చె॥

సూ. క॥ పురుషుఁడుమృతుఁడెట్లయ్యెడ। నరయఁగ రాష్ట్రంబుమృతమునయ్యెడ నెట్లు।
ధగశ్రాద్ధమెట్లుమృతమగుఁ। బరికింపఁగయజ్ఞమెట్లుపరఁగుమృతంబై॥

వ॥ అనిన ధర్మాత్మజుండిట్లనియె.

సూ. క॥ మృతుఁడగుదరిద్రపురుషుఁడు। మృతమనధపరాష్ట్రమెన్నమృతసూత్రవతిసం।
యుతుఁడౌదవనిశ్రాద్ధముసం। తతమును సవనంబుమృతము దక్షిణలేమిన్॥

ప్రా. తే॥ అనిన నతఁడు లోకమునకెయ్యదియుదిక్కు। జలమునన్నమానెట్టాన
సంభవించు। విషమునంగనయ్యది శ్రాద్ధవిధికినెద్ది। సమయమనిన నిట్లని
చెప్పెజనవిభుండు॥

ప్రా. తే॥ సజ్జనులుదిక్కుసూవెయాసర్వమునకు। నభముధరణియు జలమునన్నమ్ము
నుద్భవించు నెలవులు విషమగువిప్రధనము। లమరశ్రాద్ధకాలము బ్రాహ్మ
ణాగమంబు॥

వ॥ అనిన నయ్యక్షుండమ్మహీపతి నిట్లనియడిగె.

సూ. క॥ తపమునకులక్షణంబెది। యుపమింపఁ దమంబచెట్టు లానకడి క్షమయె।
ట్లుపలుకఁబడువివరింపుము। త్రపయనఁగానెద్ది పాండురాజకుమారా॥

వ॥ అనిన సద్ధర్మకోవిదుండిట్లనియె.

సూ. తే॥ తపమనఁగ నైజధర్మవర్తనముదమము। నాఁగనుమనోదమంబద్వంద్వముల
నోర్చు। టరయ క్షమనాఁగఁబరఁగునిద్ధరణియందు। వఱలుత్రపనా నకార్య
నివర్తనంబు॥

వ॥ అనిచెప్పిన నిర్జరవరుండిట్లనియడిగె.

సూ. క॥ జ్ఞానమనఁగనెయ్యదియగు। మానుగ శమమనఁగనెద్ది మఱిదయ యన నే।
జ్ఞానునఁదగునది యోయమ। సూనుఁడ యార్జవమదెద్దిచొప్పడఁజెపుమా॥

వ॥ అనినఁబాండవాగ్రజుండిట్లనియె.

సూ. తే॥ సరసతత్త్వార్థమెఱుఁగుటజ్ఞానమౌను। శమమునాఁగనుచిత్తప్రశాంతతయగు

దయయన సమస్తజీవసుఖాభిలాష। సర్వసమచిత్తవృత్తియార్జవము సూవె॥

వ॥ నావుడు నమ్మహాపురుషుండు మఱియు నిట్లని యడిగె.

నూ. తే॥ ఎవఁడు నరులకజయ్యశత్రువు వచింపు। పెద్దిషదలేని తెగులయి యొసఁగు
చుండు। సాధువన నెట్టిఁడగును నసాధువనఁగ। నెట్టివాఁడయి యుండు
ధాత్రీశముఖ్య॥

వ॥ అనవుడు భరతర్షభుండిట్లనియె.

నూ. తే॥ అలుక దుర్జయశత్రువౌ నంతమొంద। నట్టితెగులు లోభంబగు నఖిలభూత
హితుఁడు సాధువ సాధువై యొసఁగుచుండు। నదయుఁడైన నట్టివాఁడు మహాత్మయసన॥

వ॥ యక్షుండు మఱియు నిట్లనియడిగె.

నూ. క॥ ఎయ్యది మోహంబనఁజను। నెయ్యదిదగు మానమనఁగ నిల నాలస్యం।
బెయ్యదియగు శోకంబన। నెయ్యదియగుఁ జెప్పవలయు నిద్ధవిచారా॥

వ॥ అనిన మానవేంద్రుండిట్లనియె.

నూ. తే॥ మోహమనధర్మమూఢత మొనయుచుండు। మానమాత్మాభిమానిత్వమాను
నలస। భావమగుధర్మనిష్క్రియత్వంబు శోక। మనఁగ నజ్ఞానమని చెప్పనగును దేవ

వ॥ అని చెప్పినవిని యతనినద్దివ్యుండు క్రమ్మఱ నిట్లనియడిగె.

నూ. క॥ మును వేద్దానిని స్థైర్యం। బని చెప్పిరి ధైర్యమెయ్యదని చెప్పిరి నా।
మ్మని స్నానంబన నెయ్యది। యొనయం దానంబనంగ నెయ్యది చెపుమా॥

వ॥ నావుడు నయ్యిందువంశభూషణుండిట్లనియె.

నూ. తే॥ స్థిరత నిజధర్మమున నుంట చెల్లు స్థైర్య। మనఁగ నింద్రియదమనంబ యమరు
ధైర్య। మిలమనోమలినత్యాగ మొసఁగు స్నాన। మమరు భూతావనమె దాన
మమరవర్య॥

వ॥ అని యుపన్యసించిన నద్దేవోత్తముండు వెండియు నిట్లనియడిగె.

నూ. క॥ అరయఁగఁ బండితుఁ డెవ్వఁడు। పురుషులనాస్తికుఁ డెవండు మూర్ఖుం డెవఁ
డౌ। బరఁగునెది కామమై మ। త్సరమన నెయ్యది వచింపు ధరణీరమణా॥

వ॥ అనినఁ గుంతీనందనుండిట్లనియె.

※ నూ. చ॥ అరయఁగ ధర్మవేదిబుధుఁడౌ సురభూసురులందు నమ్మికఁ।

---

※ ఈ పద్యము వ్యాఖ్యానము ననుసరించి పెంచి వ్రాయఁబడినది.

భారయనివాఁడు నాస్తికుఁడు మూర్ఖుఁడునుం దలఁపంగ వాఁడగుఁ గా।
గరిమఁ దనర్చు సంసరణ కారణ వాసన కామ మెన్న ని।
ర్ధరణిని మత్సరంబనఁగఁ దద్దయు మానసతాపమై తగుఁ గా॥

వ॥ అనవుడు నన్నరవరోత్తము నాసురోత్తముండిట్లని ప్రశ్న మొనర్చె॥

సూ- తే॥ అవనిపాలవర యహంకారమన నెద్ది। దంభమనఁగ నెద్ది తనరుచుండు।
దైవమనఁగ నెద్ది తగును పైశున్యము। నంగ నెద్ది తెలుపు నలువు మీఱ॥

వ॥ నావుడు రాజవరుండిట్లని వచియించె.

సూ- తే॥ కరము నజ్ఞానమే యహంకారమగును। దివిరి ధర్మధ్వజంబు నెత్తించు నదియ।
దంభమగు దానఫలమగు దైవమన్య। నిందయే పిశునత్వమై నెగడు ననిన॥

వ॥ వినియమ్మహాభూతంబు పదంపడి యిట్లని ప్రశ్నంబొనర్చె॥

సూ- క॥ కామము నర్థము ధర్మము। నేమఱును బరస్పరంబు వికటించుఁగదా।
యీ మెయి వైరుధ్యముఁ గను। నీమూఁటికి నెట్టు లొక్కచోటఁ గూడుటగుఁ గా॥

వ॥ అనవుడుఁ గాంగేయాగ్రజుండిట్లని యుపన్యసించె

సూ- క॥ ఒనరఁ బరస్పరవశవ। ర్తనధర్మము భార్యయును బరఁగు నప్పుడు దా।
నానఁగూడు నాకటఁ గూటమి। మునుకొని ధర్మార్థకామముల మూఁటికిఁ గా॥

వ॥ అనిన మఱియునిట్లని యడిగె.

సూ- క॥ భరతకులదీప యక్షుయ। నరకము ప్రాప్తించు దేన నరునకునీ వా।
వర ప్రశ్నమునకు వెసను। త్తరమును వాక్రుచ్చుమనిన ధరణిపుఁడనియెన్॥

సూ- సీ॥ దీనత యాచించి తిరిగెడు భూదేవుఁ దనయంత నాహ్వాన మొనరఁ జేసి
యటు వెన్క లేదని యనువు నెవ్వండు వాఁ డక్షయ్యనరకంబు ననుభవించు
ధర్మశాస్త్రముల వేదముల విప్రుల దేవతలఁ బితృదేవతా ధర్మములను
గావఁడు మిథ్యయటంచును వచించునాతండు నక్షయ్యనరకంబు ననుభవించు
ధనము గలిగియు లోభంబుఁ దగిలి దాన। భోగవర్జితుఁడగుచు నెప్పుడు నెవండు
పదఁపడియు లేదటంచును బలుకు వాఁడు। నక్షయంబగు నరకంబు ననుభవించు॥

వ॥ అనవుడు నమ్మహాకారుండిట్లని యడిగె.

మా- క॥ కులమున నో శ్రుతమున నో। వెలయ స్వాధ్యాయమున నో వృత్తంబున నో।

కలిగెడు బ్రాహ్మణ్యమదెం। దుల దీని వినిశ్చితంబుఁ దోఁపఁగఁ జెపుమా॥

వ- అనిన నతండిట్లనియె-

సూ- క॥ విను కులమధ్యయనము శ్రుత। మును గాదిలఁ గారణంబు భూసురతకు నై

జ్మిన జననుతమగు వృత్తమె। యనఘా కారణము సందియంబేమిటికిన్॥

సూ- తే॥ యత్నమున వృత్తమును బ్రోవనగును నదియు। నవనిసురుఁ డొప్పఁ గాఁచికో

నగును గరము। క్షీణవృత్తుండు గామి నక్షీణుఁడగును। వృత్తనిహతుఁడె

హతుఁడగు నెంచిచూడ॥

సూ- చ॥ శ్రుతులు పఠించువారు నటఁ జొప్పడఁ జెప్పెడువారు నవ్యహా।

హతిఁగల శాస్త్రసంతతులఁ జింతయొనర్చెడువారు నందఱున్।

సతతము మూర్ఖులున్ వ్యసనసంయుతులౌదు రెవండు సత్పథ।

స్థితుఁడగుచుం గ్రియాకలనఁ దేరెడు నాతఁడె పండితుండగున్॥

సూ- తే॥ వృత్తమును బాసి నాలుగు వేదములను। జదివినను శూద్రజనకంటెఁ గొదువ

యతఁడు। సాగ్నిహోత్రుండు దాంతుఁడై యలరు నెవఁడు। వాఁడెపో నిక్క

వంబుగ బ్రాహ్మణుండు॥

వ॥ అని వాక్రుచ్చిన నవ్వనచరుండు క్రమ్మఱ నిట్లని యడిగె-

సూ- తే॥ ఏమి పొందుఁ బ్రియంవదుం డేమి పొందు। విమృశితంబుగఁ బనిసేయు సుమహి

తుండు। యేమి పొందును జెలువు మనేకమిత్రుఁ। డేమి పొందంగలాఁడు

ధర్మైషణుండు॥

వ॥ అని యడుగుటయు నయ్యొడయుండిట్లని నుడివె॥

సూ- తే॥ ప్రియవచనవాది ప్రియుఁడగు నయముమీఱ। నరసి పని చేయువాఁడు జయంబు

నొందుఁ। గడఁకఁ బహుమిత్రకరుఁడు సుఖంబు నడయు। ధర్మరతుఁడైనవాఁ

డు సద్గతిని గాంచు॥

వ॥ వాఁడు నమ్మహాచతురుండు మఱియు నడిగె-

సూ- క॥ ముదమందు నెవ్వఁ డచ్చెరు। వది యెయ్యది పంథ వార్తయది యీనాల్గున్

విదితంబుగఁ జెప్పుము। బ్రదుకుదు రవ్వాలను నీదు బాంధవులనినన్॥

సూ- తే॥ దివసభాగంబులందు నైదిటను గాని। యాఱిటను గాని యాత్మగృహమున

శాకమైనఁ బచనం బొనర్చికొంచు ననృణియగుచు। నప్రవాసియునగు
వాఁడె యగుఁ బ్రమోది॥

సూ. క॥ దినదినమును భూతంబులు। చను మృత్యుసదనమునకు సరగన్ శేషిం।
చినయవి దలఁచు స్థిరత్వము। గనఁగా నాశ్చర్యమింతకన్నను గలదే॥

సూ. చ॥ నిలువదు తర్కమున్ శ్రుతులనేకములౌ మునులెందఱెందఱో
గలరు ప్రమాణమంచు మదిఁ గైకొననౌ మత మిట్టిదానిదో
యలవుగ ధర్మతత్త్వము గుహాంతరమందున నుండుఁ గావునన్
దెలిసిన పెద్దలెట్టి సరణిం జరయ్యది పంథ చూడఁగన్॥

సూ. మ॥ అలరన్మోహమయాబ్జజాండఘటమందంభోజమిత్రాగ్నిచే
విలసద్రాత్రి దినేంధనంబుల నాగి న్వ్రేల్గించి మాసర్తుసం
జ్ఞల దర్వీపరిఘట్టనంబులను వే కాలంబు భూతంబులన్
బొలివోకుండఁగ వండుఁ గాలుఁ డిదియే పో వార్తయై యొప్పెడున్॥

ప్రా. వ॥ అనిన యనంతరంబ యద్దివ్యుండతనితోఁ బురుషశబ్దవాచ్యుం డెట్టివాఁడు
మఱియు సర్వధనియగువాఁ డెవ్వం డని నిశ్చయింపుమనినఁ బాండవజ్యేష్ఠుం
డిట్లనియె॥

ప్రా. క॥ దివిముట్టి ధరణినెంతటు। నివిడి మెఱయుచుండు నెవ్వని యశోరవ మ
ట్టి శిష్టచరిత్రుఁడు య। క్షవరా పురుషుండునాఁ బ్రకాశతనొందున్॥

ప్రా. ఆ॥ ప్రియము నప్రియంబుఁ జెల్లగు సౌఖ్యదుః। ఖములు భూతభావికార్యములును
నెవ్వనికి సమంబులివి సర్వధనియనఁ। బరఁగుఁ జువ్వె యట్టి భవ్యుఁ డనఘ॥

ప్రా. వ॥ అని వివరించినవిని యుధిష్ఠిరుదెసఁ బ్రసాద మహితంబైన యవలోకంబు
నిగుడ నయ్యక్షవరుండు మహాత్మా మదీయంబులైన ప్రశ్నంబులన్నింటికి
సమత్తరంబులిచ్చితివి నీవలనం బ్రీతుండనైతి నీ తమ్ములందొక్కని ప్రాణం
బులిచ్చెద నడుగుమనిన నతండు.

ప్రా. సీ॥ శ్యామాంగు నారక్తజలరుహనేత్రు సాలప్రాంశు నున్నత లలితబాహు
నకులుని బ్రతికింపు వావుడు యక్షుండు భీమఫల్గును లతిభీమబలులు
ప్రియులు నీకెంతయుఁ బృథివీశ యేరిలో నొకనిఁ గోరక యిటు నకులుఁ గోరి

తనుఁడు ధర్మాత్మజుఁడని యెనుమా తండ్రియగు పాండువిభునకు మగువలిరువు
రందుఁగుంతికొడుకునైన మువ్వురిలోన। నేను బ్రదికినాఁడ నింకమాద్రి
తనయులిరువురందుఁ దగనొకరుండిప్డు। బ్రతుకవలదె చెప్పుమ పాడితెలుఁగు॥

ప్రా. ఆ॥ ధర్మనందనుండు ధర్మాత్ముఁడని యెప్డు। దగిలి జగము నన్నుఁ బొగడుచుండు
నట్టియేను ధర్మహానికి నోర్వఁజు। మ్మింతవచ్చెనేని యింత నిజము॥

ప్రా. వ॥ అనిన నీదైన ధర్మజ్ఞతకు మెచ్చితి నీ తమ్ములందఱు లబ్ధజీవితులయ్యెదు మనిన
నాక్షణంబ విగతక్షుత్పిపాసులై యన్నలువురు నిద్రవోయి మేల్కనినట్లు
సముత్థితులైనం జూచి విస్మితుండై ధర్మజుండిట్లనియె.

ప్రా. చ॥ నినునొకయక్షమాత్రుఁడుగ నెమ్మది నమ్మఁగనేర నియ్యెడన్।
జననుత నీవు నిక్కముగ శక్రుఁడవో పురసూదనుండవో
యనలుఁడవో సమీరుఁడవొ యట్లుగాక జగన్నుతుండు మ
జ్జనకుఁడు ధర్మదేవతవొ సత్కృపఁ జెప్పుము నాకు నేర్పడన్॥

వ॥ అనిన నమ్మహాత్ముండు మందస్మితాననుండై యిట్లనియె.

ప్రా. మత్తకోకిల॥ ఏను ధర్ముఁడఁ జూడ్వె రాజకులేంద్ర సత్యము శౌచమున్
జానమున్ దమమున్ శమంబును దాంతియున్ యశమున్ బతి
జ్ఞానయుక్తియు నాదుమూర్తులు సమ్మదంబున నిప్డు మ
త్సూనునుత్తమధార్మికున్నినుఁ జూచువేడుక వచ్చితిన్॥

యక్షప్రశ్నములు సమాప్తము.

---

శుద్ధపత్త్రము.

| పుట | బంతి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 7 | నుంపఁదగిన | నుంపందగిన |
| 6 | 1 | యందు నరోగము | యందున రోగము |
| 6 | 12 | నమ్మహాపతి | నమ్మహీపతి |
| 7 | 2 | లోభము ననుగమింప | లోభమునను గమింప |
| 7 | 5 | నెట్ల | నెట్లి |

# భామినీవిలాసము.

ఇది

పండితరాయలను బిరుదుగల జగన్నాథకవిచేత

రచియింపఁబడిన సంస్కృతగ్రంథమునుండి

బులుసు పాపయ్యశాస్త్రిచేతఁ దెనిఁగింపఁబడినది.

రెండవకూర్పు

కాకినాడ:

శ్రీబాలసరస్వతీముద్రాక్షరశాల.

1902

వెల రు. 0-4-9.] 

శ్రీ

పరబ్రహ్మణేనమః॥

---

కృతిసమర్పణము.

---

ఉత్పలమాల.

శ్రీహరిసేన యా నొరులసేమముకై తనువొప్పగించుటం
చూహనెఱింగి సంతతపరోపకృతివ్రతమూని ధన్యుడై
శ్రీహరిపాదపద్మముల చెంతకుఁ జేరినసాధుమాళికిన్
శ్రీహరికిన్ సమున్ దనయ శేముషి బెంచినమేనమామకున్.



శ్రీరస్తు.

# భామినీవిలాసము

## ౧ భాగము.

## ప్రాస్తావిక విలాసము.

---

తే. గీ. శ్రీపరబ్రహ్మమును మదిఁ జేర్చి డిల్లి। రాజరాడ్దత్త పండితరాజబిరుద
యుతజగన్నాథకవివిరచితము భామి। నీవిలాసము నిప్పుడాంధ్రీకరింతు.

క. ధారుణినతిమధురంబును। సారస్వతజలధిమథన జనితమునగుమ
త్సారకవితామృతమ। వ్వారిగసుఖమొసఁగునానువారలకెల్లన్. 1

తే. మత్తకరులెల్లనాశాంతవృత్తులయ్యెఁ। గరిణులు దయాస్పదములు, మృగమ్ములసమ
శీలములు; భువి నెవరిపై సింహమిప్పుడు। ఖరనఖమ్ములపాండిత్యగరిమఁ జూపు? 2

మ. మునుపుత్ఫుల్లసహస్రపత్ర వితతిప్రోద్యత్పరాగోత్కరం
బున సౌరభ్యముఁ గన్న నీటను సరోముఖ్యంబునన్మానసం
బుననున్నట్టి మరాళభర్త యిపు డెట్లోవల్కన్వసింపంగ నే
ర్చును భేకాకులమైన పల్వలమునన్ బ్రోన్మత్తశైపంకాంబులన్. 3

ఉ. తూరుపుఁబట్టు పప్పిగొని తొంవరచూపులతోఁ జకోరముల్
కైరవముల్ వికాసమును గాంచెడి, మారుఁడు విల్లుదాల్చెడిన్
వారిరుహాస్యలన్విడిచి పాఱఁగఁ జూచెడి మాన, మిప్పు, డో
నీరజనూత్రి, చందురుని నీరదపంక్తుల నేలగప్పెదో. 4

ఉ. ఓవికచాంబుజంబ, మదమొప్ప భవద్విగళన్మరందముల్
ద్రావెడిభృంగమింపగు విధంబున జుమ్మనిపాడుఁ గాక; నీ
తావులనెల్ల దిక్కులను దానొక కోర్కెయులేక యే కడు
న్వీచఁగనేగు వాయువిఁక వేఱువిధంబగుచుట్టమౌఁ గదా. 5

క. నినువిధివశమునఁ జేరిన। దనిభృంగము నెడలఁ, గుటజమా, యవమానం
బును జూపకు; మధుపూరిత। వనజాతంబులకు నద్ది బహుమాన్యమగున్. 6

క. అలికులసమాకులంబై। యెలమావితలిర్చ్చవఱకు నెందేనియుఁ, గో
కిలమా, నీరసదివసం। బులను వనాంతరమునందుఁ బోయికడపుమా. 7

క. రసమెఱుఁగని కొంగలచేఁ। బొసఁగెఁ దిరస్కారమనుచుఁ బొగులఁగ నేలా?
భసలములు మధురసజ్ఞము। లెసఁగుతఁ జిరజీవులగుచు నెప్పుడుఁ గమలినీ. 8

క. అలినీచమైలినను చున్। వెలనొందదు మెప్రువగాని, పెనుకూపంబా;

సతతము సరసహృదయమవు। నితరగుణగ్రాహివగుచు నెనసెదు గానన్. 9

క. ఘనమధుసంభృతవికస। ద్వనజాతమునందుమందు వాసరములు వే
డ్క నుగడపినభృంగమునకు। మనసెట్టులు కుటజమునకు మరలెనో, యహహా! 10

క. ఓమలయజమహీరుహమా,। నీమహిమము నెవరు పొగడ నేర్తురు భువిలో?
నేమియన, విషముఁ గ్రక్కెడు। పాములఁ బోషింతు సౌరభంబు వెలుచుచున్. 11

క. కనఁగలరే యెవరును, జం। దనభూమిరుహంబ, యెయ్యెడ నలఘుమహిమమున్?
నినుఱాతనఱుగఁ దీసెడు। జనులకుఁ, బొడియయ్యుఁ, నిడుదు సౌరభపుష్టిన్. 12

క. ఓరాజహంస, నీర। క్షీరవివేకోద్యమంబు సేయక నీవే
యూరక యుండిన, నిలనె। వ్వారు భవత్కులమొనర్చు పని సేయుదురో. 13

క. జనులొకకొందఱు, వెలికిన్। సునిశితకరవాలధారచొప్పున నహికం
బెనుగూర్చులగుచుఁ, గేవల। మనుపమకరుణాప్రపూర్ణులై యుందురులోన్. 14

క. అరవిందమ, తేంట్లుభవ। న్మరందమును దనివిదీరఁ గ్రావి మొఱయుఁగా,
కొఱఁడు ప్రవీణుఁడు లేఁడిలఁ। బరిమళములు దెసలనెఱపఁ బవనునికంటెన్. 15

చ. వేగము సేనుదీక్ష్ణమగు వేసఁగి యెండల నెండ, వేడిచే
నేగఁగ నెద్ది తావోకద యీపయిఁ బాంథులు, కస్మనోవ్యథ
న్గ్రాగుచు, మార్గమధ్యమునఁ గ్రాలుకొలంకుల జీవనంబులే
యాఁగదధన్యముల్, తలఁపనంబుధిజన్మము చేలకాల్పనా? 16

క. కొలనా, నీవెండినఁ, బ। క్షులుగగనతలంబుఁ బట్టుఁ, గూఁబౌభృంగం
బులు సేరురసాలసుమ। మ్ములఁ, నిఁకనతిదీనమీనములగతియేమో. 17

క. జలజిని, మధుపమునందుం। బలెవాయువునందు సౌరభవిలోభంబుం
దలఁపకు; ఘనుఁడయ్యును, లో। కులమోదముకొఱకె, యాచకుండౌఁడయ్యెన్.

క. మాలతి, పోనముఁ బూనకు। మాలలితరుతుల్ మిళిందమాలాపింపన్;
దాలుచువదాన్యగురువులు। మాళిన్సురతరువులెంతొ మన్ననదానిన్. 19

క. మలయజమా, గుణనిధివై। చెలఁగునినున్ జేరరానిస్థితిఁ ద్రోయుద్విజి
హ్వాలనుంభరించెదవు, మా। కలవియెఱయెన్నంగఁ దాపకౌన్నత్యంబుల్. 20

క. వనమఖిలముఁ దిరిగెను, రో। సెను మధుపంబెల్లయెడలఁ జెట్లన్నియు, నీ
కెనయగు వృక్షమ్మును గ। న్గొనఁ జాలనిదయ్యె నెంతయు, రసాలంబా. 21

క. పరపరిమళకథ మాకే। కరింగుసురతరులవినులఁ గాలూనియు, నీ
వరయుదు వేనిప్రసూనం। బిరమ్ములు, సోమాంశకదంబ, ధన్యంబ, యహహా. 22

క. పావనవయి వింధ్యజవగు। నీ వెండుచునున్నయప్పుడేనియు, నేఁడా,
భావింపుతఁడవు తగునే। మోవీథులఁ బాఱునీరమున్నోఁగొనుటల్. 23

క. ఫలపత్రపుష్పలక్ష్మి। న్వెలయఁగనినుఁగాన మెపుడు, పృథుకంటకసం
క్తులనిండియుండు వేయా। ఖలతోడన్నిన్నుఁ జేరఁజను, నోతుమ్మా. 24

క. కోకిలమా, నీవిన్వని। నేకంబవు, కూయఁబోకుమీమధురముగాఁ
గాకులు నిష్కరుణంబులు। నీకాపద సేయకుండ నిజకులశంకన్. 25

క. తరుకులశోభంగాల్చుదు। ధరఁబ్రాణులకార్తిఁ గూర్చితగుమంచువనే
సురుచిరగుణముంగని, భూ। ధరరాజమ, శిరమునందుఁ దాల్చెదుదాసిన్. 26

క. కలభంబా, నినుఁజేరిన। యళినవమానింపఁబోకుమాయెన్నండున్;
ఇలదానమహితదంతా। వళములునద్దానినెత్తి పైఁ బెట్టుకొనున్. 27

క. సురధరణీరుహసుమనః। పరిమళసేవాఖిలార్థపరిపూరణమై
పరఁగెడితేఁటికిఁ గుసుమాం। తరసేవనమిదివిడంబనము కేవలమున్. 28

క. కోకిలనికరమునడిగెను,। లోకంబున నెల్లతరువులుంగనె నైనన్
నీకెనఁగనలేదయ్యెను। మాకందమహీరుహంబ, మధుపం బెందున్. 29

శా. ఆరామాధిప, స్వల్పతోయములలో నైనం, గృపాత్మందవై,
ఘోరంబైననిదాఘకాలమున నీక్షోణీజమందీవు చె
న్నారం జేసితివెట్టిపుష్టి, యదిసేయంజాలునొక్కో జలా
సారంబుల్ నలుదిక్కులన్నెఱపువర్షావారిదంబేనియున్. 30

మ. ధరనిస్సారము; దిక్కులంబొదివెవాత్యల్; చండమార్తాండమ
ర్మురమయ్యెన్; మతిహీనుఁడయ్యెను వనీపాలుండు; సంపంగికి
న్మరుభూమిన్నయదంబెసర్వమిటు, లైనన్, దోఁపఁజేసెంబయో
ధరవర్యా, యమృతంబుఁజిల్కెడినినుం దాబ్రహ్మయెందుండియో. 31

మ. విగళద్దానమిళన్మిళిందమగు కుంభివ్రాతమె గ్గోటని
ల్వఁగలేదో భయలోలనేత్రమయిపూర్వ, మ్మాలుకన్మౌక్తిక
మ్మగుద్వారమ్మున నిప్డు, డమ్మృగకులాధ్యక్షుమ్ము సింహమ్ముస్వ
ర్గగతమ్మాట, నయో, సృగాలములుసంరావంబుగావించెడిన్. 32

క. తరులన్నిటియెడఁ దుల్యా। దరుఁడైవనపాలుఁ డేమ్చనయవకుళమునం
బోరయింపఁ, డైననదిసుమ। పరిమళముల దెసలనళిరవంబుల నింపున్. 33

చ. వలమగుమ్రానుబంధననిబద్ధము; గొమ్మలు మెండుదిట్టలున్,

నిలయమగవ్యపర్వతము;। నీకుభయంబేటికి? గాని, యీపవ
జ్జ్వలనుఁడు, జ్వాలలంబఱుపువాఁడు, కృపారహితుండు, ఘస్మరం,
బెళుకదరించు నా మనమునందొకరుండు, మహీజరాజమా. 34

చ. జలజహితుండు గ్రీష్మమునఁ జండకరంబులమండఁ జేయఁగా,
జలదమ, నిన్దలంచు మను జాతక మెట్టులొ దీర్ఘవాసరం
బులు గడపెన్; లభించితివి పుణ్యమునన్, నడిగింక నీరాల్చని
స్తులకృపఁబూనితే, నెవరితోనిఁక నిప్పుడు చెప్పవచ్చునో? 35

క. పరిగళితలతాతతిగాను। తరునికరముదావకీలదగ్ధముగాఁగన్,
గిరిశిరముల్గఁగురిసెదు, జల। ధర, మెండుగ, నేమిశ్రేయము మొసఁగి, కహహా! 36

క. మనుభీకరగర్జలముక్। విని, పాంథుఁడా, మనమునందు నిజసంకుచివిగా;
వినవో, జగదార్తివారణ। మునకుం జీవనము దానము జేయుంగావున్? 37

చ. నిరుపమమైనచీఁగలుగు, నీదగు కీర్తి దిగంతవర్తి, త్వ
త్పరిమళమున్ త్రిలోకవిదితం, బయినన్, వినుమొక్కమాట, యీ
వరగుణపంక్తినెల్లవిషపానకకీలలఁ గ్రక్కుకోటరాం
తరసముపాశ్రితోరగవితానము మ్రింగుఁ, బటీరభూజమా. 38

తే. గీ. లేదవేతఁకు; దాక్షిణ్యములేదు; ప్రీతి। లేదు; సంగతిగ్రాహ్యము లేదొకింత
అట్టులయ్యును, సన్నుతుండైన ఘనుఁడు। తాపహారించును లోకములతాపములను. 39

చ. రమకిరవైన, నిర్మలసరస్సునఁ బుట్టిన, నిందిరేశుహ
స్తమునవసించినన్, సురలఁ దావులరంజిలఁ జేసినం, సద
న్యములగుసద్గుణంబులిఁక నెన్నియుఁ గల్గిన, నబ్జమా, ద్విజో
త్తమమగుహంసయందు రతిఁదాల్చిన సన్నుతి యబ్బియోఁజునీ. 40

ఉ. తీరమునందుదొర్లెడిని దివ్యమణుల్ వడిగ్రావపంక్తితోఁ,
నీరవరాశితోడ హరినిద్రను జెందును నీజలంబునన్,
క్షీరమహాంబుధీ, యిటుల నీయవివేకము నీమహోన్నతిన్
ఆరసినింద సేయుదునో, యట్టులు గాక నినున్ స్తుతింతునో? 41

క. ఏలాయీరత్నంబులు?। ఏలా నీలాభ్రసన్నిభ మీనీ మేనున్?
ఓలవణాంబునిధీ, చేరఁ। జాలదు నీనీరు తృషితజనములనోఁప. 42

ఉ. ఇంతటినీరసంపద వహించియు నార్తులతృష్ణ దీర్పవో
క్కింతయు నిష్ఠురేగపద పేని నిదాఘమునందుఁ బొర్మిని

కాంతుఁడు సర్వలోకములుఁ గాల్చుచునుండఁ, బయోధరంబ, నీ
వెంతయుఁ జిక్కిపోయి, యపుడెవ్వరి తృష్ణను మాన్ప నేర్తువో? 43

క. అలిగెదవు, లేనియెడలం । బలుకుదు నే నొక్కమాటఁ, ద్వద్యాచకుఁడౌ
జలదుఁడు విడిచిన నీరం । బుల నేనియు నీవు విడువవు, మహాంభోధీ. 44

తే. గీ. వానకాలపు బేఁటి, గంగానదీప్ర । వాహమునుఁ జేరఁ జనునిను వలచనము,
గానియద్దాని ముందు రంగత్తరంగ । తతులఁ బ్రకటింతు, వదినీకుఁ దగదు సుమ్ము. 45

చ. అమరులు నందనమ్మున సురాగసుమంబుల, నెద్దియానఁ బ్య
క్తములగు వానినే, యెపుడుఁ దామును మూర్కొనుచుం బ్రాయ న్మిళిం
దము మధుకాంక్షఁ జేసి, నిను దైవవశంబునఁ జేరినంత, లో
భముఁ బ్రకటించుచు వేని, నిను, వారిజమా యిఁక నేమి పల్కుదున్. 46

తే. ఎండలిప్పుడాలముల్ భుజియించి, జలముఁ । బీల్చి, యంభోజములను సేవించినావొ,
అట్టికాసారమునకు నేమైన మాఱు । మేలు గావింపఁగలవె, మరాళవర్య? 47

మ. భ్రమరంబా, మధుమాసవాసరము ప్రారంభంబునం, దేనిపు
ష్పములం దాడుచుఁ దాను చుప్పనము నింపం జేసితో, యారసా
లమహీజాతము, దైవయోగమున, లీలంబాయ, మర్యాద వే
గముగా వీడుదు వేని, తుచ్ఛమిఁకఁ నీకంటెన్ మఱేదిమ్మహిన్? 48

మ. హరిణీసంఘములోన నీవు గురుగర్వాంధుండవై యిన్వనాం
తరమందేటికిఁ, గృష్ణసార, విహృతిన్ గావింతు? నిర్భిన్నకుం
జరకుంభోద్గతనవ్యమౌక్తికవిరాజన్మార్గమైనట్టిభీ
కరపంచాస్యవిహారభూమి యిది నిక్కంబంచు నూహింపుమా. 49

క. పేరాఁకలినిఁ బసియు, గజ । వైరియగు మృగాధిపుండు, భయరహితంబై
చేరువఁ దిరుగుచు నున్నను, । సారంగకులంబు నెట్లు చంపఁగ నేర్చున్? 50

క. కరికుంభంబులఁ జీలిచి । ధరఁ దన్మౌక్తికవిభూషితం జేసిన యా
హరి నేఁడు చెప్పఁ గలుఁగునె । హరిణంబుల యెదుటఁ దనపరాక్రమ, మకటా. 51

మ. కరియూథేంద్ర, మదాంధలోచనుఁడవై, కార్కొన్నయిక్కానసాం
తరభూమిన్ వసియింప కొక్కక్షణమైన న్నివిఁక, నెన్నచ్చెలీ,
హరినాథుండు మహత్తరోపలనికాయింబు న్నఖాగ్రంబులన్
ద్విరదభ్రాంతిని గల్చి భూధరగృహన్నిద్రించుచున్నాఁడిటన్. 52

క. గిరిగహ్వరములఁ దిరుగను । గురుగర్వముతోడఁ, బంటికానయయిన యా

హరిశిశువు లేచినన్, భుజ। కరిణీశిశుంబెటుగును, గజశాబంబా. 53

చ. భువిని నిసర్గమార్గమున భూరుహసంతతిఁ బెంచుచున్, సదా
పవనమునన్ బనీవిభుఁడు పాఁతెను దా; ఏకుళంబు నొక్కెడన్
ఎవఁడెఱుఁగింగ నోపు నది యేకొసనోపడియుండి దిక్కులె
ల్ల వికచమంజరీసురభిళంబులుగా నొనరించు నంచు వెన్? 54

ఉ. ఏయది యిట్టటుంగవల నెల్లెడఁ దుంగతరంగవిభ్రమం
బాయతమందరభ్రమణమన్ భ్రమ దిక్కరిమానసంబులన్
జేయునొ యట్టిరాఘునము స్ఫీతతిమింగిలభక్షణక్షమం,
బేయెడ నల్పుఁ గేలిఁగలపింపి పయోనిధిఁ బాసియేగినన్? 55

ఉ. కాననమందుఁ గొంతగజఖాదితమయ్యెను, గొంతిమంచునన్
న్యూనతనొందెఁ, దక్కినది యుగ్రముసన్ ఖరభానుతప్తమై
మ్లానతనొందె, మూలఁబడి మంగళసౌరభ మెల్లదిక్కులం
దీనెడియాలవంగలత నేర్పు దవానల, మక్కటకక్కటా. 56

ఉ. మానితదేవలోకసుషమాకరమైతివి, కల్పభూమిరుట్
స్థానమవున్ శచీంద్రసుకృతంబుఫలంబవునైతి, సత్యమే,
కాని, సతంబు, నందనము, ఖాండవమేర్చిన పావకుండు మా
రాన మెలంగుఁగాక యని ప్రార్థన సేయుము రాప్తులవ్విధిన్. 57

చ. జనులు స్వకీయకార్యముల సంపడినుండి ననున్విడంగఁద
ల్పునగొనముక్కునంబొడిచి పోయెదఁ బంజరమున్ దొలంగినే,
ననుచు శుకంబభీప్సితమయాప్యతమానుచునుండ లోనికిం
జనియెను హస్తిహస్తసదృశంబగు సర్పవరేణ్య, మక్కటా! 58

ఉ. శైలతటంబులన్మెలఁగు చంచలచిత్తమృగంబులార, మీ
రేలతరంగసంకులము నీతటినింజొరఁబూనినారు? పా
తాళముఁ జేరె నిండె ద్విరదప్రభు వుచ్చలదంబు నిర్ఝరా
లోలములైన పెన్సుడులలోఁబడి గండశిలావిధంబునన్. 59

ఉ. ఓమృగరాజశాబమ, మదోత్కటకుంజరబుద్ధి దిక్కులం
దేమిటి కాగతింబరుషదృష్టి నిగిడ్చెదు? త్రాగుస్తన్యము;
శ్యామములైన సర్వభువనంబుల తాపము నెల్ల నార్చుచున్
శ్యామవినూత్నమేఘమిది సల్పుచునున్నది ఘీరగర్జలన్. 60

క. జలధరమ, ధీరగర్జలు। సలుపంగాఁబోకు; మదగజములను బుద్ధిన్,
నెలగడచినదాగర్భము। చలించుచున్నయది నాదుజఠరములోనన్. 61

క. కొనగోళ్ళమత్తగజముల। ఘనగండస్థలులఁ జీల్చుకౌశలమును నే
ర్చినహరి హరిణంబుల కే। మని తెలుపంగలదు తనపరాక్రమ, మకటా! 62

చ. అమలజలంబులం జనితమైయువతీముఖసామ్యమంది, దై
త్యమథనుహస్తమంపమరి, తావులదేవముఖంబుసేసి, కా
వ్యములకుశంబరారికఖిలార్థమవై, తగునీ, కహో, పయో
జమ, మధుపాళిఁ బ్రీతికొనసాగినచో, నిఁక నేమియందునిన్. 63

క. కరిరాజ, కనులమోడిచి। యుఱసుఖమున నిట్లు నిద్రనొందెదవేలా?
పరిణామవిషమమగు కే। సరితోఁ బగ హెచ్చుచున్నజాడం గనుమీ. 64

తే. తగనితొందరతోఁ బండితప్రకాండ। వదనములవెడలిమాఁటలావలకుఁ బోవు;
పోయెఁబో మఱి వెన్కకెప్పుడును రావు; । సమదదంతావళముల దంతములపగిది.

మ. కలశాబ్ధిం జననంబుదారత త్రిలోకకఖ్యాతి, మావాసమున్
విలసన్నందనమందుఁ దావిదివిషత్త్రీప్రతిప్రపం బిట్టు క
ల్పలతానామకదాత్రుమత్వగుణముల్సర్వోత్తమంబుల్ సుమీ
కలదే నొక్కవివేక మర్థివరకాంక్షల్ దీర్చఁగా నెంతయున్. 66

ఉ. నమ్మినప్రాణికోటుల ఘృణారహితాత్మతఁ ద్రుంతునంచు డెం
దమ్మునఁ జింతపూనియనుతాపమునొందకు, వ్యాధ; దొడ్డ తే
త్రమ్ముల, రాజసన్నిధులఁ, దార్కొనరే, నినుఁబోలె గూఢభా
వమ్ములతోడ, సాధుగణవైరిజనుల్, ఖలు, లెంప లెంపటో. 67

తే. మధురవాగ్గుంఫనముల నమ్రతదలిర్ప। సాధుజనులనమ్మించి వంచనముసేయు
వారినిన్ భరియించెదు, పాఱిపోయె। నీవివేకంబుగూడ, భూదేవి, తల్లి. 68

చ. అనుపమమౌ జగద్ధితమయుం బగుమానసవృత్తి, కేవలం
బనుపమితంబగు న్మతియు నద్భుతవాగ్రచనావిలాసముల్,
అనితరసాధ్యమౌఁ గృతియు, నాకృతియు న్సుమనోమనోజ్ఞమౌఁ
జనులలఁ బండితోత్తముల సర్వముమాటల కందరానిదై. 69

క. ఘనుఁడగు మనుజుండిడుముల। నెనసియును నపూర్వమహిమనిలఁ బ్రకటించున్
అనుపమపరిమళమును నెఱి। పును కాలాగురువుదహనమున దగ్గంబై. 70

క. లలితగుణాన్వితులగుని। ర్మలచిత్తులయులుక గూఢ రమణీయమె యా

వెలయును రమ్యంబై పరి। మళభరితంబైన కుంకుమము కాలంబున్. 71

శా. కేళీలుంఠితశారదానగరలక్ష్మీమండితుల్ పండితుల్
గాఢిన్ బ్రోలసరస్వతీసదననిర్యత్క్లేశచోరుల్ జడుల్
ప్రేలన్ జాలిన నెత్తిఁ ద్రొక్కు ఫణిరాడ్విద్వంససింహంబుల
న్నాలన్ బాలశకుంతముల్ శశముఖు న్వ్యాఘ్రసంబులుగా జెప్పెదన్. 72

క, గురువులపరుషవచనములఁ। దిరస్కృతిని జెందిమహిమఁ దేలుదురు జనుల్;
వరమణులు సానదాఁకక। నరనాథుల శిరములందునన్ మెఱుఁగవుగా- 73

తే. చందనము వహియించును జందఘనుల। దీపమాపలఁ దాల్చుచుషీపటలముఁ
బూర్ణచంద్రుండును గళంకమును ధరించుఁ। బృథివిపతిఁ గరియించును భువనజనులు- 74

క. కోరంబడకయె సుజనుఁడు। దారచరిత్రమున జగముఁ దనుపును; శశియె
వ్వారడిగినఁ దనకరములఁ। గైరవిణీకులమునకు వికాసంబొసఁగున్- 75

క. పోసినపాలం బోలె। న్జేసినమేలన్న లేక నెఱిఁగుడిచియు వే
వేసమకట్టును జంపుట। కై సర్పసమానుఁడైయినఖలజనుఁ డిలలోన్. 76

చ. విడిచివివేకమున్ బరిఢవిల్లఁ బఠించి నుతుల్ సహించిక
ట్టిడుమలు దుర్లభంపుఁబదమేని? గూర్చితివాఁడటన్ దినం
పడియుప్రదమ్మహాపకృతిపంక్తిఁ దలంపక క్రూరచిత్తుఁడై
యెడదవిరోధభావము వహించినవాని కేమిచెప్పఁగున్ ? 77

తే. జగములో మానవు లపాయశంకఁ జేసి। దూరమునె నే పరిత్యజింతురు సతంబు
ఖలజనునివాని కపటము కారణమున, । విషయుకతన నాశీవిషవిభునిఁ బోలె. 78

తే. స్వార్థమణఁచి పరార్థసంసక్తియందు, । నెనసిగుణభూతన స్త్వగ్జదకతాస్తిఁ
దనరనంతస్స్ఫురితమైయుదాత్తమహిమ, । తత్పురుషుఁదతంసము సముద్ధతఁ దలిర్చు 79

తే. జనుఁడు, వంశజాఁడును గుణశాలియైన। జెందుఁ బూజను సంగవిశేషమునను;
అవనిఁ దుంబీఫలాపేతమైనవీణ। కత్తమహిమను గాంచదుగాదె యెప్పుడు. 80

క. ఒకదోషమున్నచో, గుణ। నికరముగలవస్తువైన నింద జెందున్,
సకలరసాయనమహితా। త్మకమయ్యును బాడుకంపుపమై నుల్లి సెలెన్. 81

క. తానాపద పాలయ్యు। న్మానక మేల్సేయుసుగుణమహితుం డెప్పుడున్;
దీనికి మూర్ఛం బడిమృత। మైనట్టిది పారదం బుదాహరణమగున్. 82

మ. పనసీమున్విహరించుమన్ శశకడింభంబున్వెసంజూచితో
డనభీతాత్మకయై భయంబులను జెందెంజాలు ప్రాణేశు చెం

తను జేరంజను సీత, రావణునిచేత న్నిహతయై, ఘోరం
బ్రునిశాటాళి పరీతయై వివశయై ప్రాపించెడిన్ దుర్దశన్. 83

ఆ. వె. వీరమెంతొ పలికె వేల్పుల యెదుట, ము। క్కంటినేయ వింటినంటుటయును,
వేల్పుచెలులకనుల వింపగు మమమేను। కాలిబూదియయ్యెఁ గంటిమంట. 84

తే. శాఖిశాఖలు పేశలాసనములగును,। చీత్కృతి పరంపరలు సుభాషితములగును.
త్రిస్రనఖదంతపళిన మాతిథ్యమగును;। తగునుగపయిది మర్కటాధముల సభల. 85

ఉ. ఏయది తల్లి? మచ్చుమతి? యేయది తీర్థము? విష్ణుభక్తియే;
యేయది శాస్త్రి? మెద్దివినసేగునొ శైవ్యతతమం, బదేసుమీ;
యేయది మేలొనర్చెడి సుహృత్ప్వర? మాత్మమహానబోధమే;
యేయది దుఃఖమిచ్చి యలయించెడి శత్రువు? దుష్టవాసనల్. 86

క. ఎనయఁడు సాగుబ్బేముసు। జ్ఞునఁడిల వేదాంతవిద్య సకలమెఱిఁగినన్,
వనధింజిసమగ్నంబ। య్యును మైనాకంబు మృదుతనొందని మాడ్కిన్. 87

క. పరమెపుడును నైర్గుణ్యము,। ధరగుణగౌరవముఁ దాల్పఁ దగదెవ్వారున్;
పెరుఁగు నితరభూమిరుహాళి। త్కరము, పటీరద్రుమంబు ఖండితమె యగున్. 88

ఆ. వె. అలపరోపసర్పణానంతచింతాహు। తాశనజ్వలచ్ఛిఖాశతమున
నంటఁ బడని యంతరంగంబు లెవ్వార। బ్రితుకుసాధురీతిఁ జాదపములు. 89

క. తనగుణసంతానముచే। తనువివరంబులను గప్పిదాఁచుచు, శూన్యం
బున సైపము గుణజ్ఞువ, మ్మొనరించుచు, సుజనుఁడొప్పు నూర్ణాయుగతిన్. 90

క. ఖలజనుఁడు సుజనతూలం। బులఁ బ్రోచుటలోననగ్నిఁ బోలినవాఁడై,
న్యులదుఃఖపుంహిమ్మా నాప్పఁగ। నిలవాయుసునిభుఁడు, పొగడ నెవ్వండోపున్. 91

క. పరగుహ్యనిగూహనత। త్పరము, గుణియు, లోకవాంఛితము, నౌలలితాం
బరముం బోలిన సుజనో। త్కరమున్ ఖలజనుఁడు మూషికము వలెఁ జెఱుచున్. 92

ఆ. వె. స్వపస్సుహితకీర్తి సౌరభ్యలేపనంబు,। శాంతిశిశిరతా కృశానుమూర్తి,
సపయు భావనసుమజలసరమార్గంబు। ఖలుఁడు, సుజనదుఃఖకారణంబు. 93

తే. పుష్పఫలపత్రచయభారమును వహించి। శైత్యపీడను ఘర్మరుజన్ భరించు,
నన్యహితమున కాత్మదేహంబునిచ్చు,। నట్టితరువును దెలతు నౌదార్యగురువు. 94

క. కాలాగ్నిన్ ముట్టుగొనన్,। వ్యాళాధిపుఁ గౌఁగిలింప, హాలాహలమున్
గ్రోలం, జూటురు, సుజ్ఞను। నోలిస్వోపఱచుకొనఁగ నూహించుజనుల్. 95

క. కనఁబడనిది విపేకము,। చనదహ. దుర్మదము. వేషవారలకడు సెం

క. ఖలులయిన వారలెంతయు । వలఁతులు సాధుహితకార్యభంగమునందున్,
ఇలనిర్దోషుల ప్రాణం । బులను హరింపంగ సర్పములుకుశలంబుల్. 110
క. నాలుక నెనమున నిల్పె । న్వ్యాళింబ్రహ్మజుఁడు ఖలులవదనము లందున్,
ఏలా, కాకున్నన్, జనుఁ । డీలుగు, నదిముట్ట, మంత్రిహీనుండగుచున్. 111
క. ఒనరించితి వీవెంతయు । ఘనకార్యము, మంచిపేరు గడియించితి, వో
యనుఁగుఁజెలికాఁడ, దీవిం । తునుపద్దయు నేనునినుఁ బ్రతుకునన్నాళ్లున్. 112
క. నిరతపరకార్యపరస । త్పురుషులపలుకులు సుధామధురములు, మనముల్
శరనిధిగంభీరమ్ము, । ల్శరదిందువికాస నిర్మలంబులు యశముల్. 113
క. పునరుజ్జీవితముగఁ జే । యును జైత్రుఁడు వచ్చుచ్చిరోపహతరుత,
మ్మనితలఁచుచున్నకోకిల । మును వ్యాధుండేసె హృదయమున నొకకోలన్. 114
క. సురుచిరగుణహీనుండగు । నరుఁడు మహాడంబరుఁడయినను శోభింపం,
డరసినయంతనె శోభా । స్ఫురితములగు పూలవెలుఁగు బూరుగుభంగిన్. 115
గీ బురదలేక కొలను పొలుపొందు నెంతయు, । సభదలిర్చు పిశునజనులఁదొలఁగి,
పరుషవర్ణములనుబాసి కావ్యముదగు, వెలయుమనసు విషయములను విడిచి. 116
క. ధరఁగావ్యమ్ములలోకో । త్తరతత్త్వమెఱుంగువాఁడు తఱచుండఁడు; పు
ష్పరసమ్ముల మర్మమ్ముల । నొరుఁడెఱుంగంగలఁడె మధుపమొక్కఁడు దక్కన్?
క. సరజస్కయు మణియునుబాం । డురవర్ణయుఁ గంటకావళులుగలదియునై
పరఁగెడికేతకి, నోమధు, । కరమా, సేవింతువె, ట్లకట! సిగ్గఁడివై? 118
క. తానమ్ములేనిరాగము । మానములేకున్నయట్టి మానవపతియున్
దానమ్ములేని హస్తియు । జ్ఞానములేనట్టి యతియుసములీధాత్రిన్. 119
గీ. నరులసద్గుణగణమది యొరులవలనఁ । గాకతనయంతనే వన్నెఁగాంచు నెపుడు;
గట్టిగానొక్క చెప్పిన కారణమునఁ । దెలియవచ్చును కస్తూరివలపుతలఁప. 120
క. పొరయకుమీ గర్వమ్ముం । బరిమళరాజమగు సౌరభముగలదంచున్,
గిరిగుహడాఁగినదీనున్ । బొరియించును పండ్రినిదియొపో, కస్తూరీ. 121
గీ. దుర్మతులఁబాయఁగాఁజేయు, నిర్మలముగఁ । జేయుఁజిత్తంబు, ఘనతతిమాయఁజేయు,
మఱియు ఘాతపయును గడునెఱయఁజేయు, । సుజనసంగతిఁ గనరానిశుభములెవ్వి?
క. నిరతముపరోపకృతిత । త్పరములు విమలములునగు నెదల్ గలుగుమహా
పురుషులపలుకులు మంచుల । కరణిన్ దోఁచెడిని మొదలఁగటువులయికడున్. 123
గీ. తేఁటిమాటువలిఁ బాడుపాటలందు । పసనుతుల్ వినఁబొడమిన వినయమునను

ఆకలరేకవిశదరమధురాననంబుఁ, । దలఁపనామదినిపుడు సుస్మారవశువు. 5

క. గురులకుఁ బ్రొద్దున మ్రొక్కెడి । వరవర్ణిని, వారు, పుత్రవతివగు, మనఁగా,
నరసెంబ్రమోదపూర్ణా । దరమైకేడిగంటఁ గెలనదయివారు ప్రియయున్. 6

గీ. గురుజనుల భీతిచేతనన్నరయునపుడు । పుట్టుచున్నవ్యాకులతనుబూని యొప్పు
హరిణనృశయరవిడిన తామరలఁబోలి । మెఱయుకన్దోయి, నక్కటా! మఱవ నెపుడు—

క. సుదతీ, యనుక్రమమునం । బవరామలకాంబ్రమదాడిమశ్రీఁ గొనియు
మ్మదురోజమ్ములు గైకొనఁ । గదిరెడిశుండాలశాబఘటసంపత్తిన్. 8

గీ. నీలనీరేజదళనేత్ర, నీయురోజ । పాళిజంబీరఫలముల లీలనేలి,
భాసమానసువర్ణకుంభములనణఁచి, । స్వర్ణభూమిధరంబుతో స్పర్థపూను. 9

క. జలజాయతాక్షి, నీచె । క్కిలియుత్తరదిశయటంచుఁ గీర్తింతుమదిన్,
లలితాలకమగునటరా । జిలునురువై శ్రవణలక్ష్మి చెన్నదలిర్పన్. 10

గీ. వేకువవెలుంగుఁ గనుఁగొని విడినపోక । ముడినిజేఁ బట్టి పొన్నును విడువఁ బోవు
పాలఁతిమిన్నపొందామరపొట్టఁ బోలు । పొక్కిలి మెఱుంగునామదిఁ దక్కెదిపుడు.

గీ. ఆటవేళ్కలోన బోటికత్తియలందు । నడరి నాదుపల్కులనుకరించు
చున్నముగుదవవ్వనుండి నామాటల । విని మెఱుంగుఁ దీవవిధమునొందె. 12

గీ. చనుటకై నేను వట్టిదోసంబుఁగట్టి । కల్లకోపముతోడఁ గేకలిడుచుండ,
నమ్రమైబాష్పపూరితనయనకమల । యైలతాంగిననుంబతిమాలఁ దివిరె. 13

గీ. మృగవిలోలవిలోచన దృగ్విలాస । మంతరంగంబుఁ జొరకుండు నంతవఱకె,
స్మృతులు శాస్త్రిముల్ పురాణమ్ములు వెతకి వెతకి । పడసినట్టి వివేకంబు స్వాస్థమగును.

గీ. పతియరుగుదెంచెనని చెలుల్పల్కుటయును । గడపలోనికి నచ్చెరువడుచువచ్చి
వెన్నెలవితానసెపుడు నాకన్నుదోయిఁ, । జల్లఁబఱుపంగలదొ మృగశాబనయన? 15

క. అనినగడపైన తోడసె । దినాంతపుర గడపవంక దృష్టినిలిపినేఁ
జనుదేరఁగ నపుడారసి । యనంతరము రమణివికసితాననయయ్యెన్. 16

గీ. ఇట్టికెంగేలఁ జనుమొనముట్టి తొలఁగి । దవ్వరిగినట్టి ప్రియుమోము దమ్మినంకఁ
గొమ్మకెంపలరారెడు కొనలనొప్పు । కనుల జెప్పలవాల్చక కాంచుచుండె. 17

క. గురుజనపరివృత యయ్యున్ । గరితనను నళీకగంపకండూయనత
త్పరయై హేమలతాసుం । దరభుజమరదోఁపఁ గాంచెఁ దాఁగడగంటన్. 18

గీ. గురుజనుల కడనుండఁగ, సరసిజాత । కోరకమునసే నల్లనఁ గొట్టుటయును,
అతివమండలయుగమించుకంతగదలఁ । గనుబొమల్ వాంచినఁ గాంచికలఁతనొంది

ఉత్సాహ. వినతిసేయఁ గన్నుదోయి వెలయుఁ గెంపులెంతయున్,
బ్రణతిసేయ, నయయొ, బాష్పవారిధారలొల్కెడిన్,
జనఁగఁడంగ, నకట, ప్రాణసంశయంబు దోఁచెడి,
న్వనితరో యెఱుంగనీమనం బదెట్లు చేయునో. 20

మ. కరుణాహీన, మృషాభిభాషణవిదగ్ధా, వీడుమీ కొంగు, నా
కరయం గ్రొత్తలె నీదు కూరిములు, హా, మ్మంచున్నదాని, న్నిరం
తరబాష్పాకుల, ముక్తభూషణయు, నొంతన్వి, న్సముద్వీంపనే
ర్తురె నీవొక్కఁడు దక్కనాకొరులె చంద్రున్, భద్రనిద్రాయిటన్? 21

గీ. తీరమందునఁ గోమలి స్మేరముఖము,। నీరమందున వికచసరోరుహంబు,
నారసి మరందలుబ్ధముగ్ధాళిపోత,। వారమిటటికి నటటిఁ బరువులిడును. 22

క. అంబురుహనయన ప్రియువ। క్షంబునఁ దనసఖిదత్తసరమొత్తిన చి
హ్నంబుఁ గనితోడనె భుజా। గ్రంబున నున్నట్టి తనకరముఁ దీసికొనెన్. 23

గీ. తలఁప, జిర, మీఁదదానమత్కంధరంబు,। దరనిమీలితలోచనసరసిజంబు,
నధికనిశ్వాసభారఖిన్నాంగకంబు,। అంగనాసంగమంబు పాయదు మనంబు. 24

గీ. అలి! పోయె రెండుయామములకు వచ్చి। ద్వారమందు మాఱువేరు సెప్పు
నన్నెఱింగి తరళనయన లోపలినుండి। వచ్చె మెల్ల మెల్ల లచ్చిభంగి. 25

చ. హృదయమునందు శైవలము నిమ్ములఁ దాలిచి, సారెసారెకున్
బదములు హస్తముల్ శిరముఁ బ్రక్కకుఁ బ్రక్కకు నెత్తివైచుచున్,
బెదవులు తామయై ప్రియునిఁ జేర్కొనుచుండఁగ, లక్ష్యమూఁదును
న్నదియిదిబోటికత్తియల యక్కటికమ్మును జిమ్ము చూడ్కికిన్. 26

గీ. తలఁతు, నిందుండి యోసిజనిలయమునకు। నేగి గురుపరివృతయైన యింతివదన
కమలమును, బరివర్తితకంధరమ్ము। నానతభ్రూలతము, దరహాసితయుతము 27

చ. మలయభుజంగమోద్వమితమారుతపోతము లంతకోపమ
మ్ములు పటలెంచుచున్నయవి; పుష్పితబాలరసాలశాఖపై
సలలితరీతిగానములు సల్పుచుఁ బ్రాణముఁ గ్రోలుచున్న దీ
యళియును; జీవితాశయిఁక నారయనాకెటుగల్గుఁ జెల్పుమీ. 28

క. జీవితముం గొనువాఁడవు। గావున హాలాహలతుల్యుఁ గానెంతు నినున్;
ఏ వెడఁగు జనుఁడు పలికెను। నీవు సుధాకరుఁడవనుచు, నీరజవైరీ? 29

గీ. పఱచుపెట్టపావురమును బట్టి, బలిమి,। నఱచుమగపార్శ్వమునకు ముందఱను నిల్వ

నన్నుఁగని మెల్లమెల్లనఁ బిన్ననవ్వు। చెన్నలరుమోము వమ్మి వంచెను వెలంది. 30

గీ. ఎవటనున్న రెసలయిరుల నడంచును,। గాకఁ గ్రాగువారికాకనార్చు
నీదుమోము వెలుఁగు, నెలఁతలతలమాని। కిమ్మ, తమ్మిసొబగువమ్మ నేయు. 31

క. చనుదోయి నడుమ నాగో। ర్మోనొక్కులఁ బులకలెగయఁ, బొడఁగనుచుంజ
న్వని, జాలకమున మోమిడు। ననుఁగని, తలవంచితత్క్షణమయిలుసొచ్చెన్. 32

క. ననఁబోఁడితనకపోల। మ్మునుమన్నవనానుకూలముగ నిడిహృదయ
మ్మునవ్రాలి నాఁడు సుతా। మునియనుపమరాజ్యవిభవమును గీన్వఱిచెన్. 33

క. ముహురర్థితసిద్రాంత్య। పరిహారార్పిత సుతనుగండపాళింగేలన్
రహినంటునంతఁ గరుణా। విహీనుఁడయ్యెన్, గటా! రవియునావిూఁదన్. 34

క. పరిశీలితనిఖిలశ్రుతి। పురాణములఁ దాపశాంతివాడమదుకేళీ
భరఖిన్నసుతనుముఖపం। కరుహోద్యద్రుచిరతరనకారమునబలెన్. 35

క. అవలీలనీకపోలము। లవలీపళిములను గోమలతముద్గొనన్,
గవిసెనుమహాభయమ్ము। ల్లవళాంభోజాతబంక్తులకు నల్లడలన్. 36

గీ. యౌవనోద్గమముననులజ్జాన్వితములు। శౌర్యబలశీలసౌందర్యసస్పృహములు
నైజనకపుత్రిలోచనాంభోజరుచులు। మొగిడె వికసించె శ్రీరామమూర్తియందు. 37

క. గిరిశునిచాపంబెక్కిడి,। పరితాపంబార్చిబంధునర్గంబునకున్,
నిరపాయంబుగసీతం। బరిణయమగునొక్కయిక్కుమారుం, డకటా! 38

గీ. వరునిచేదృఢబాహుపంజరమునందు। నొంటగ్రహియింపఁబడిన నవోఢవధువు
బెదరి, యప్పుడ వలఁబడ్డపిల్లలేడి। కరణిఁ, గంపించుచున్నదగ్గలముగాను. 39

క ఆనితినుపనిషదమృతముఁ। బూనితిగీతార్థమఖిలమునుమది, నకటా,
ఐనం, జంద్రవదనము। న్మానససదనమును విడిచినడవదు పయికిన్. 40

క. అకరుణహృదయా, ప్రియతమ,। యిఁక నేనినుఁ గవలిపోవనీయనటంచున్,
వికలాంతరంగయైచెలి। సకియకరాంబుజముఁ గొనివెసంబ్రిలపించున్. 41

క. చిల్లరగవ్వలకొఱకై। చల్లమ్మంబోద్రుగుంతు సమయమువఱకున్
ఇల్లిల్లుఁ దిరుగుగొల్లల। పిల్లకు హరినీలమణిలభించెం ద్రోవన్. 42

గీ. మౌనసిరూపారుచిని బాపుకొనఁ దలంచి। హరిముఖాంబుజలావణ్యమానునంత,
నకట, స్వశరీరసహితమానఖిలజగము। నందునరవిందలోచన కరుచిపుట్టె. 43

గీ. నీదునెమ్మేను స్వర్ణసన్నిభమటంచుఁ। బ్రేలు, టక్కట, నిజముగ బేలతనము;
ఆహతాశముతాను హుతాశునందుఁ। బడుసెనేషభవత్తనూరోపసౌభాగ్యసందు. 44

గీ. పలుమఱును నుత్సుకత్వమువలన మేళ। నమ్ము, సిగ్గుకతన విరాలనమ్ముఁ, జెందు
లోచనాంభోరుహములపరిడవు వెలంగుఁ। గరము తరుణులపరిభవసంగమమునందు.

గీ. వరరుహావిలోచనల కుచద్వంద్వమునకు। గౌరవమ్ము నర్పించి లాఘవముఁ జెందు
తరుణపురుషుల ధైర్యమాదరవివేక। హీనమౌ, యిదె మ్రొక్కుచున్నాను నీకు. 46

క. పలుకులతీయఁదనంబున్। విలసద్గతివిభ్రమములు వెలయింతురుమి
క్కిలియున్ సారసదళనయ। నలు బాల్యము జారిజవ్వనము పొడసూపన్. 47

క. నిరవధికమ్మగు శోభా। గరిమం దనరారు పాలఁతికన్నులు దనరుం
దరళములై తాము పర। స్వరవీక్షానందవిరహభారమునవలెన్. 48

క. ఉవిదగురుపరివృతయయి యున్నవేళ। మృత్తికాశకలములతో వ్రేయఁబోవు
ననునివారించెఁ దరళితనయనకమల। ధైరదనయంత్రితాత్మజిహ్వాంచలమున. 49

క. నయనాంచలవిక్షేప। మ్మయినను మున్నెపుడు సయిపనట్టిది పయనం
బయియున్న వల్లభుఁడు మెయి। మెయిఁ జేరిచియలముకొన్న మిన్నకయుండెన్, 50

గీ. ముదితమానముచేఁ బెడమోము పెట్టి, । నిద్రవోవుచునున్నదానివలెనలస
కంధరాబంధముత్థితకరమునొప్ప। నిలిపెఁ జెక్కిలిఁ బ్రియుకరనీరజమున. 51

క. నయనపరిఫుల్లకమల। వ్యాయమంవలిలోభమునను దరళితచిత్తం
బయి నీలలాటమందువె। లయు నళి కస్తూరికాతిలకదంభమునన్. 52

క. గురుజనులు రాత్రియెట్లో। వరుచెంతకుఁ జేర్చునంత, వనరుహదళసుం
దరలోచన, యిఁకనెయ్యది। జరగఁగలదోయని తలంచు జంకుచు నెదలోన్. 53

శా. చింతాక్రాంతమనస్కుఁడం గజాఁడు, నీచేటుల్ విహీనప్రభ,
ల్కాంతుండుం బ్రణయాకులాత్మఁ, దదిరెల్లం బోవనిమ్మట్టు, లో
కాంతారత్నమ, విన్నవింతునిదియొక్కండున్ మదీయాక్షిమ
న్నింతేఁ, గోపము మానుమీ, వదనమున్నీతాంశుఁ డోడించెడిన్. 54

చ. శ్రుతులనలంకరించుకొను నో మొదలన్ వ్యథ మొందుగల్గనీ
త్కృతిసహితంబుగా మొగముఁ ద్రిప్పుమృగీపృశపాణిపద్మచే
స్థితములఁ బూర్వపుణ్యచయసిద్ధములన్ సుఖియించు నీజగ
న్నుతిపదమైన జన్మమునమున్ గరిమన్, లలితావతంసమా. 55

మ. అరుణించెన్ శశి, నిండె వెన్నెలలతో నాశాంతరాళంబు, సుం
దరులిం ట్లెంపదపుష్ విభూషణములన్ గైసేయుచున్నారు, చే
లరో, నీమానమునుమానవిస్ఫూర్తను నల్కన్ జేసి, యోచెల్ల! తా

మరలేఁదూఁడులకన్నసన్నమగునీమై గ్లానిమైఁ దూలెడిన్. 56

చ. వెడలెడువేళ నింటఁ గలపెద్దలుమంగళవాక్పరంపరల్
వలుకఁగఁ గేళిమందిరగవాక్షమునన్ముఖపద్మమంచియూ
ర్పులనధరంబువాడఁగ, నురోజతటంబున నశ్రులొల్కఁగం
చలమగుచూడ్కిఁబాలిక నిజప్రియునారయుచున్న దక్కటా. 57

గీ ఎపుడువల్లభుండుపృష్టి పథమునకుఁ। గ్రూరదైవఘటన దూరమయ్యె,
నపుడెమొదలుగామదంగంబు లెల్లను। స్వీయకృత్యములను జేయఁ జొరవు. 58

గీ. నిదురయుండిపె నాకునిన్న దూరాగత। వల్లభుండురాత్రియెల్లఁ గథల,
మిగులఁ బలుకనోప, మిన్నకుండుము। చెలీ, నీదుజిహ్వలోహనిర్మితంబు. 59

గీ. ఎపుడునూతునోకొక్కొయేణీవిలోచనా। స్నిగ్ధనయననీలనీరజంబు
విగళదశ్రువారిబిందునిరోధనం,। త్యక్తతరళభావతారకంబు. 60

క. అనలినయనననాకున్। గానంబడదేని లక్ష్మణా యిఁకనేలా
యీనిశ్చేతనజీవిత। మీనిష్ఫలమైన విశ్వమెల్లన్నాకున్? 61

క. రమణీమణి యిలుసొచ్చుచు। గమనాజ్ఞాలేశలాభకౌతుకమైమా
ర్గమున నిలుచు తరుణనికా। యముపైఁ గృప నయనజలరుహములం బఱపెన్. 62

ఉ. జానకిఁ గానకంపికలుషంబొనరించితినే దురాత్ముఁడన్,
మానిని, యక్కటా, బ్రతుకనాననుఁ బాసి? సుశీలకోటిమో
మేనెటు నూడనేర్తు? నను నేమనువారొకొ వారు? రాజ్యమం
భోనిధిలోనముంచినను మున్గఁగని, మ్రింగనొల్లఁ బ్రాణముల్. 63

క. రమణుండనసపత్నినిశాం। తమునుండి నిశాంతమందుఁదనుఁ జేరుటయున్
రమణికినయనాంబుజకో। ణములన్ గెంజాయతత్క్షణమయుదయించెన్. 64

క. వినతిన్ దయితుండు క్షమా। పణముఖ్యపదమ్ములైన పదముల వ్రాలన్,
వనరుహదళలోచనలో। చనశోణితకాంతులపుడె శాంతములయ్యెన్. 65

క. లలనలతాలిమి నెల్లం। గలఁచెడిశ్రీకృష్ణరూపుఁ గన్నయువిడబి
ట్టలుక, చిరాగస్సప్రియమాం। సలమయ్యును, దాఁబట్టెక్షణకాలములోన్. 66

క. అతివరో, పాంసులసను మ। త్ప్రతికూలుండయిన రాజువలననాకుం
దలభీతియిపుడు సముప। స్థితమయినది వసతినొసఁగితీర్పవె దాసన్. 67

క, మలయానిలమనలమ్మను। విలసన్మణిమంటపమ్ము విపినము నయ్యెన్,
లలనారత్నముతాని। జ్జలమీనమ్మయ్యె, విరహసంతాపమునన్. 68

క. కాలాగురుద్రవమ్మున్। హాలాహలమనితలంచనత్యంతమ్మున్,
నీలోత్పలమాలికన। బ్బాలికవ్యాలాళియనుచుభావించుమదిన్. 69

క. రమణునిసంకేతనిశాం। తమునకుఁ బోనైతిదుష్టదైవోపహతిన్,
రమణీ, జగతీశుఁడున। స్సమశరుఁడిపుడేమి సేయునో కద, యకటా! 70

క. విరహవ్యాకులమతియై। తరళాయతనయన, దయితదయితాయని, నం
దురుచున్ జూచును, జెంగటి। కరుదెంచిన, నతనిఁబరిచయములేనట్లే 71

గీ. జాబిలియడంగు, వెన్నెలచాయమాయుఁ
గలువలందెల్ల మాలిన్యమలముకొనును
దెసలవెలుఁ గొప్పుఁ, జెలులుసంతసముఁ గందు,
రువిద, నీమోముఁదమ్మితెల్వొందునేని. 72

చ. కరువలిచందనద్రుభుజగప్రవరోచ్ఛ్వసితంబు పోలికం
గరమును వేఁడివీచెడిని, గన్నులనేర్చెడిఁ దామ్రచూడ, మీ
పరభృతమున్ హాలాహలమువైచెడిఁ గూజితకైతవంబునన్,
దరుణి, మృణాళమృద్వి, యసుధారణమేగతిఁ జేయనేర్చునో. 73

చ. గరితలచిత్తముత్సుకముగానొనరించుచు రాత్రివచ్చె, నే
కరణినినాయెదన్నలువఁ గల్గునొకోయిఁకమాన, మంచునం
బురుహదళాయతాక్షి తలపోయుచునుండఁగ నంతలోపల,
న్స్మరనృపునాతపత్రమొయనన్, శశిబింబముదోఁచె వెల్గుచున్. 74

ఉ. ప్రాణవిభుణ్ ప్రభాతసమయప్రభఁ గన్గొనకుండఁ జేయగాఁ
బూనితదీయనేత్రముల మూసితిలీలఁ గరద్వయమ్మునో,
నైననతం డెఱింగె వికచాంబుజషండసుగంధబంధుర
బైనసమీరణంబున సహస్రకరోదయ మెంతొనూటిగా 75

గీ. దవ్వునన్ విస్మయస్తిమితంబు, కొంత। దఱియఁదరళంబు, బిసనితాంతకాంతి,
గురులయెదుటికేనేగ హ్రీఘూర్ణతార। కంబు నయ్యెమృగీదృశకన్నుదోయి. 76

గీ. పులకితకపోల మిట్టె నేముట్టుటయును। లోనలేనగవొప్పు విలోలనయన
వదనసరసీరుహముమోడ్చి పలికినట్టి। త్రేనెలూలు క్రొపలుక్రొలనెట్లు తెలుపనగును.

ఉ. ఎవ్వఁడుమున్ను నిన్ను సృజియించెనొ రాజుగ, నోకశానిన్,
యవ్విధివృద్ధతన్ దనసమస్తబలంబును బోసియుండుటన్,
బువ్వుబుతుండునాఁ బరఁగు నూత్నవిధాత్రుఁడు నిత్యలక్ష్మియౌ

జవ్వనియాననమ్మున కొసంగెడి నిప్డు త్రిలోకరాజ్యముల్. 78

ఉ. ఎప్పుడు గానవచ్చె నిఖిలేక్షణకర్షణకార్మణజ్ఞమై
యొప్పెడి నంతసూనుమధురోజ్జ్వలరూపము, నాఁటనుండియున్
గప్పెఁ గపోలమున్ ధవళకాంతులు, దీర్ఘములయ్యె శ్వాసముల్,
దప్పె మనఃప్రవృత్తి, కులతామరసాయతలోచనాళికిన్. 79

చ. కులసతి శౌరిపేర్మి ముదిగొల్లల మాటలనాలకించి, వే,
పులకలు ఘర్మవారియుఁ గపోలతలమ్మున నంకురింపఁగాఁ,
దెలుపు సవిస్మయమ్ముగ సుదీర్ఘవిషాగ్నులఁ గ్రక్కుచున్నచి
ల్వలయెకిమీని పెన్బడగపై నొనరించిన తాండవక్రియల్, 80

గీ. బాల్యము క్రమమ్ముగా జాఱఁ, బడఁతిమేనఁ
గంతుఁ డఖిలేశుఁ డరుదేరఁ గడఁగి, పసుప,
నపుడె యమృతేందు సరసీరుహములు మంద
హాసముఖలోచనముల తాదాత్మ్యమందె. 81

గీ. అతివ శైవలశయ్యాశయానయై, న। వీనసీతాంశులేఖ చందానఁ గాంతి
శేషయై, చెంతకేగుదెంచినను మధుర। వీక్షణమ్ముల నే గారవించుఁ బ్రియుని. 82

క. జితపల్లవ మగునధరము,। నతిలంఘితచంద్రబింబమగు నాస్యం, బ
ప్రతిమమగు మేనుఁ దెలుపవు। సతియీ జలజాతభవుని సర్గమటంచున్. 83

చ. ఒకక్షణమేమియో వదరు, నొక్కక్షణంబు భజించు మౌనము
న్సకలపదార్థమండలమునన్ నిగిడించును శూన్యదృష్టి, యం
గకములఁ బట్టు గానఁ, డధికంబుగ శ్వాసముఁ జిమ్ము రావణుం,
డకట, మహీసుతావిరహజాతిఁ గడున్ వికలాంతరంగుఁడై. 84

క. ఉదయించెఁ, జంద్రబింబము,। గదిరెన్ వగపపుడె విరహిగణముల కెల్లన్,
ముదమెసఁగె ముదితలెవ్వని। మొదల తలన్ దాల్తు రట్టి పూవిల్తునకున్. 85

గీ. అంబువాహము దయమగు నంతఁ గజ్జల। మలినమయ్యె గగనమండలంబు,
రక్తమయ్యె పథికరాజియుల్లము, మాన। వతికపోలపాళి పాండువయ్యె. 86

క. తిలకింపుము కాసారము। జలరుహసంవృతము నసదృశము నిద్దానిన్,
జెలికాఁడ, మిన్నకుండుము,। లలనలనయనములు నన్నలందురఁ జేయున్. 87

గీ. అలుకమానవిప్పుడైనను, భామిని,। యుదయమయ్యెనిదె పయోదమాల,
అనుప్రియోక్తులా వరారోహ నయనాబ్జ। కోణశోణరుచులఁ గొల్లవెట్టె. 88

గీ. సుందరీ, నీవదనమును మందహాస। కందళితమునుగని, యరవిందమనిమి
ళిందసందోహముఁ, జకోరబృందముతోఁగ। విందనియు, డెందమందు నానందమందు.

గీ. హాసమనరాదు రుచిరవికాసమిద్ది,। ముఖమనఁగరాదు సురభిళపుష్పమిద్ది,
స్వర్ణఫలయుగ్మమిది స్తనద్వయము గాదు,। భ్రమరభజనీయ లతయిది రమణి గాదు.

గీ. భండనాభిముఖహతభూపతివిభిన్న। మధ్యవివరోన్మిషన్నభోమలినభావుఁ
డుగ్రకరములభువి నేర్చుచుదితుఁ డయ్యె। వీఁడెరవి, చంద్రుఁ డనుమూఢుఁ డేఁడివీని?

గీ. లలనకనులస్వరూపంబు నలుపుఁ దెలుపుఁ। గాపదిహాలాహలంబు నిక్కంపుసుధయు;
కానిచోఁ దన్నిపాతనమైనతోనె। యేలయొనపూరుషాళి సోలు, నలరు? 92

గీ ఎందుమధుకరంబో, మృగమో, విలోచన। మో, యొకందు వెలయుచున్నదట్టి
యిదిపయోరుహంబో, మృగధరమండల। మో, మరాళయానముద్దుమొగమొ. 93

క. సువిరళముక్తాతారవు,। ధవళవిభారాశిభాసిపదుకూలజ్యో
త్స్నవు, వదనపూర్ణశశిబిం। బవు, రాకవు, నీవువాస్తవము, లలితాంగీ. 94

గీ. అప్రతిమరూపనీర, లోలాక్షిమీన,। నాభికావర్త, నీలవేణీభుజంగ,
సత్పురుషనికురుంబమజ్జనపదంబు,। నైనయిత్తరుణీధుని యధికవిషము. 95

క. రమణీ, నీవదనసరో। జమునన్ శోణాధరాంశుసంభిన్నములై
విమలతమదంతకాంతులు। రమణీయమ్ములగుఁ గేసరమ్ములమాడ్కిన్. 96

క. లలనా, కేసరములెభా। సిలునీదంతావళీరుచివ్యాజమునన్,
అలకచ్ఛలమున మకరం। దలాలసములౌమిళిందతతులు సెలంగన్. 97

గీ. ఆప్రఫుల్లనీరజాయతలోచన। తాఁదిలోత్తమావిధమునఁ బరఁగ,
నెదఁదలంచిచూడ నిమ్మర్త్యలోకంబు। నాకలోకమయ్యె యయ్యెనాకు. 98

గీ. లలన, మృగనాభిపంకాంకమలికతలము। నందుఘరియించి యున్ననీయాననంబుఁ
గాంచియానందమంది రెక్కలనువిప్పి। నోరుసారించుఁ జిరముచకోరవితతి. 99

గీ. ఎట్లునీరరుహముహిమముచేతను, దివ। సమ్ముచేతనెట్లు చంద్రబింబ,
మట్లుకినుకచేత నందమెడలుచున్న। యది లతాంగి, తావకాననంబు. 100

క. చలదళిజలజము పోలిక। నలరెడి యాతరళలోచనాననముఁ గన
న్గలిగిన, నిఁక నాకాపూ। విలుతుఁడలుగఁ నిమ్ము దానవెఱపేమిటికిన్? 101

క. అమృతమయమూర్తి యగునా। ప్రమదకు దంభోళికఠినభావుఁనుసన్మి
త్రముగాసృజియించినయ। కమలభవున్ వికలహృదయుగా నెన్నఁదగన్. 102

గీ. ఫాలతలమునందుఁ గాలేయ తిలకంబు। దిద్దియున్ననీదుముద్దుమోము

రంగెసంగునంతరాసు ప్రభృంగపు। ల్లాంబుజాయితంబు కంబుకంఠి- 103
గీ. కాంతినద్వితీయుఁ గానిన్ననీవెభా। వించుకొంచుసంతసించెదేల?
ఎవ్వఁ డిమ్మహామహీమండలమ్మెల్ల। సరసినాఁడు, శీతకిరణమూర్థ- 104
గీ. అసితచేలాంచలావృతమై చెలంగు। హరిణశాబకలోచన యాననంబు
యామునగభీరనీరపూరాంతరమున। వెలయు మృగలాంఛనప్రతిబింబమట్లు. 105
గీ. తామరసలోచన కపోలతలమునుండి। కుచతటమ్మునఁ బడుచూర్ణకుంతలమ్ము
మించుశశిమండలమునుండి మేరుశిఖరి। పైకి వ్రేలాడుకాలసర్పమ్ము పగిది- 106
గీ. పూవుగుత్తులనంగిన తీవెకీవు,। స్తనభరానమ్ర, యెప్పాటసాటియైతొ,
పల్లవితవల్లరియును నప్పాటసాటి, స్మయవతీ, యరుణాధరవయిననీకు- 107
క. సుమగుచ్ఛానతలతలన్। గమనీయంబైన యివ్వనముసంతతసే
వ్యమయగుఁ, గుచభరనతలగు। ప్రమదలచేనెదహరింపఁ బడదే, నకటా. 108
గీ. నాదురాకకునిర్భరానందమంది। సరసిజానన రేయెల్ల జాగరమునఁ
గడపివేకువ వవన సౌగంధ్యలోలు। పాళిబోధితయయ్యెఁ దెల్వొందదయ్యె- 109
గీ. భావనాతీత శక్తివైభవసమన్వి। తుండనిప్రసిద్ధిఁ గన్నకంతునిప్రభావ
మునఁ, దలోదరి, నీముద్దుమోముచంద్ర। భావమును గన్నదోయియబ్జతయుఁదాల్చె-
క. అరయఁగ లోచనమీనయుఁ, గరతలపాదతల వికచ కమలయు, వేణీ
భరశైవాలయు, నగునీ। సరసయయిన సుందరాంగి సరసియవుఁ జుమీ- 111
క. మందమతీ, పాంథా, యీ। చందంబున నేలనీవు సంతాపంబుం
బొందెదవు! పయోధరసే। వందడయకొనర్పు, శాంతి, వడసెదు దానన్- 112
గీ అఖిలభువనసమూహంబునమలకాంతి। మండితముఁ జేయునయ్యతిమాత్రతన్విఁ
గనినజనులమనంబులఁ గలిగెసంశ। యంబు వెన్నెలయోమించొయనుచునిట్లు- 113
గీ. ఉల్లసత్పాణిపదయయి యొప్పునీస్మి। తాస్యఁగనువారలకు మదులందుఁ బొడమెఁ
బల్లవితపల్లియో, యిదిఫుల్లనీర। జాతపద్మాకరమో, యనుసంశయంబు- 114
క. నయనాభిరామమగున,। ద్దయితామణి మోముచూచితత్క్షణమునసం
శయమందిరి నిఖిలజను। ల్పయోజమో, చంద్రమండలంబో, యనుచున్- 115
క. కనకద్రవశోభాకాం। తను కాంతనుగూడియున్న దాశరథింగ
న్గొనిచాతకపోతకము। ల్వనినాడెఁ దటిత్సమేతవనదభ్రాంతిన్. 116
క. వనితయనియీమెనెల్లరు। ననియెదరు జనంబు, లట్లయందురుగా, కే
మానమునఁ దలఁచెదనిదియా। వనవత్పుష్పాళినోముపంటయటంచున్- 117

క. దరహాసభాసురాస్య। స్వరపఙ్క్తినచటఁ గాంచినవివిధయైయిందిం
దిరములను జకోరములుం। బరతరసంతోషభరితభావములయ్యెన్- 118

గీ ఆస్యకమలముచేదరహాసలేశ। మేనిమిషమందునీవుచహింతొ, యింతి
యానిమిషమందె పంచసాయకునిచేత। నఖిలజగము జితమ్మయ్యెననితలంతు. 119

గీ. యమునలో నరమున్గిబిట్టార్చుచున్న। యవిబకమ్ములు! పగఁ జేసియంధతమము
చేతఁ బ్రమింగంబడుచుఁ జంద్రశిశునికాయ। మార్తిఁ గుయ్యిడుచున్నదియనితలంతు 120

క. తరుణియురోరుహయుగళము। పరస్పరాసంగసౌఖ్యభరితంబైపే
వరతరమయ్యెఁ, దదున్నతి। భరియింపకనడుము స్రుక్కెఁబడె, వనితలఁతున్. 121

క. సఖియరో, వదనేందుద్యుతి। నికరమటంబర్వమునికినిఖిలజగన్మో
హాకరఘనతిమిరముభవ। చ్చికురాకృతినెసఁగుననిమదిఁ భావింతున్. 122

గీ. వనజముకుళాళికుత్తుకబంటిసీట। రాత్రిపగలు దివాకరారాధనంబు
సలుపుచు విలాసవత్యురోజత్వలబ్ధి। కయితపంబాచరించుచున్నయదియొకొక్కొ.

గీ. ఓవియోగిని, తీవ్రవియోగవహ్ని। కుండమగు నీహృదయమునఁ జండతరము
గాఁదపించుచునుండెముక్తాసరంబు। ప్రియజనాసంగసుఖసమాపేక్షఁబోలె- 124

గీ. వికలుఁడుంబోలె విధినిన్నుపేక్షిసేసి। కాంతిహీనుశశిన్ రాజుగానొనర్చు
టరయ లావణ్యనిధియౌత్వదాననముస్ఫ। జించిపెనుమోహమందెనటంచుఁదోఁచు.

క. లలనా, వక్షోరుహము। ధ్యలసద్రత్నచ్ఛలమున ననురాగసమా
కలితమ్మగు నీచిత్తము। వెలువడెఁగాఁబోలుఁ బ్రియుని వీక్షింపంగన్. 126

క. మదదంతావళిగామిని। వదనవ్యాజమ్మునన్ గువలయప్రియుఁడే
యుదయించెనొక్కొ యెఱుపుచు। సుధాంశుజాలమ్ము నివ్వసుంధరనింపన్- 127

క. తిమిరమ్మును గౌముదియున్। గమలమును సుధాకరుండు గంధఫలియుని
ద్రిమమును నెపుడేఁ గూడిన। సమమనఁగావచ్చుఁ గళలసకిమోమునకున్. 128

గీ. నెయ్యమునఁ బ్రియుండు, నెచ్చెలీ, విడువు వి। పాదమనుచుఁబలుక సకియక పుడ
కన్నుదోయినుండి కడుబాష్పధారయు। మనమునుండి మానమును దొరంగె. 129

గీ. అసమసాయకుని మహారాజ్యపట్టాభి। షేకమెటిఁగితా సుధాకరుండు
ధారుణీతలము సుధారసమునఁ బూయు। చున్నపగిది దోఁచుచున్నదిపుడు- 130

గీ. పేర్వింఖదలకభారవృతమయి యొప్పారు। హరిణశాబనయన యాననంబు
లీలఁగనిభ్రిమన్మిళింవసందోహమై। తనరు నీరజాతమును స్మరింతు- 131

గీ. గురుజనములతోడ నరుగుచు దరహాస। కందళాంచితాస్యకమలముగుచు

నింతికంధరమ్మొకింత ప్రక్కకుఁ ద్రిప్పి। చూచెనద్దిజగము సొచ్చిడుస్సె- 132

క. కనుఁగాక ఖంజనమ్ము। ల్వనితామణికన్నుఁగవవిలాసము, రుచిరా
ననమున కస్థిరసంప। ద్వనజాతమ్మెట్లు సాటివచ్చుఁ దలంపన్- 133

గీ. చందనమృణాళశైవాలమందమారు। తాంబుజోశీరములు, విరహమునఁ జేత
నమ్ముఁగోల్పోయినట్టి జనమ్ములందు। శీతలత్వములేక ప్రతీతిఁ జెందు, 134

క. దిననాథుండు ప్రభాత। మ్ముననిజకరముల స్పృశించిముకుళీభూతా
ననయగుపద్మినికివిబో। ధనమొనరించుచు నెసంగుఁ దతరాగమునన్- 135

ఉ. ఆనతయై నితాంతమధురాలపనమ్ముల నెంత వేఁడిన
న్మానకదూరదేశగమనంబునకే నలుకన్ గడంగఁగా,
మానినియాక్షణంబున నె మార్గనిరోధ మొనర్చె, నొంటుపి
ల్లానక వ్రేలిసన్నలమెలంగెడిపెంపుడుఁ బిల్లికూనచే.

గీ. విషమశరచాపమహిమ నిర్విఘ్నమయ్యెఁ,
జూసెఁ దిమిరముతో నెప్పపాటు జనుల;
కువిదనీమోము సుధఁజిన్కుచుండెఁ; బొండుఁ
జేలదోఁచునో దినదినమీవిధుండు. 137

గీ. మింతురెంతయు, యౌవనవంతులకువి। వేకులకునైన శస్త్రిమ్ములేకెహృదయ
భేదనముసేయుఁ జాణలు, విపులకపట। మయమధురలీల లసితాబ్జనయన, లుర్వి.

గీ. జవ్వనమువిలాస సదనము పూర్ణసు। ధాంశువదన కెప్పుడంకురించె,
నపుడె యువజనాళి యంతరంగములు వ। హ్నిప్రసక్తిలేకెయెరియఁ దొడఁగె. 139

గీ. కనదుకనులెత్తి, నగుచుఁ బల్కు, దిదిగాక
కనుబొమల్ గూడముడుఁచు నీకథలు విన్న,
నని ప్రియునకింతి సవతికథను వచింపఁ,
దనపయింగల రాగబంధంబు సడలె. 140

గీ. హాలహాలమువలె బడబాగ్నిఁ బోలె। వ్యాళనికరముతో మకరాళితోడఁ
గలసిపెరిఁగిన యామినీకరుఁడునరుల। కుసుఖతోఁజఁగించువాఁడు గాకుండుటెట్లు?

గీ. నరునకుత్తమసతి పుణ్యముననబ్బు; । నామెకుదయింతురు పవిత్రులగు సుపుత్రు,
లాసుతులచేనొదవు నిత్యమమలయశము; దానశాశ్వతస్వర్గపదవిలభించు. 142

గీ. దొరయొ రైయెనను యాచింపఁ దొడఁగునేని
తోనె లాఘవమొందు, నో తోయజాక్షి

అధరమును నేను బ్రార్థించినంతలోనె
విముఖివగుచు నిరాశుఁ గావించితీవు. 143

గీ. అమృతజలపూర్ణకుంభంబు హ్రదమునుండి । తెచ్చుచున్నట్టినీదుతత్త్రిరసుంజ
గూఢసురతోత్సవము నెఱుంగు సుమనోభ । వుండు భగవానుఁ డొక్కఁడె పూవుఁబోఁడి

గీ. పాంథ, నీవలె నా ప్రాణవల్లభుండు । పథికుఁ డైక్లేశములు ద్రుమావళులఁ గడపు
చున్నవాఁ, డేను జీవించియున్నదాన, । నింతకంటెను గుశలమిం కేమిగలదు? 145

క. లలనా యేల కృశించితి? । తలపెట్టఁగ నేల నీ కితరకథ; లైనన్
దెలుపుము నాముదమునకై; । తెలుపంగల దింట నీసతీమణి పాంథా 146

క. వనితా, నీకుపమానముఁ । గనకెప్పుడు గాని మిగుల గర్వింపకుమీ,
వనములలో నెన్నెన్నో । తనరారును ఫలభరానతల్ రుచిరలతల్. 147

గీ. క్రొత్త కాంతినింపు గుల్కెడి నీమోము, । కన్నుదమ్ములకు వికాసమొదవె.
క్షితిఁ బయోదమయముఁ జేయుచు నీలమే । ఘుం బెచట నేనిఁ గానఁబడెనె? 148

గీ. సంజమొదలుగ రవి నుపాసన మొనర్చి । వారిమధ్యమ్మునందుఁ దపంబుచేసి
జలరుహం బది యించుక సామ్యమందె । హరిణలోచన, యిప్పుడు, నీయాస్యమునకు.

క. సుందరి, నీవదనంబున్, । మందస్మిత మధురముగ నొనర్చుచ వేళన్,
జందురుసామ్రాజ్యమయో, । యందెడిని సమాప్తి నిపుడయనుచుఁ దెలియుమీ. 150

గీ. మత్తుఁ దూరకెంతో మధురము గానవ్వు, । లోనవల్లనేమొ కొన్నిప్రేలు,
నఖిలమైనజగము హల్లకాయితముగా । నెల్లయెడల శూన్యసృష్టి నెఱపు. 151

గీ. మధురసమ్ముకంటె మధురమౌ నీమోవి । నునుపు నాదు వచనముసు లతాంగి,
పట్టుకొనుము నాదు పాణిపద్మము కేలఁ । బడపడడితి, నహాహ, పుప్పుపుపుడమి. 152

మ. అలఘూపాయము లెన్నొపన్ని యెటులో హర్మ్యాగ్రిముం జేరి, యం
దలినవ్యామృతఫేనకల్పసుమనస్తల్పమ్ము నందొంటిమైఁ
జెలువారన్ బవళింపలేపి, చకితాక్షిన్ స్మేరవక్త్రాబ్జ, నూ
ర్పులతోఁ గౌఁగిటఁ జేర్చు రాజరమణిన్ బుణ్యాత్ముఁ డిద్ధారుణిన్. 153

క. అరిగిన లుగడల మధుర । స్వరములతోఁ బాడుఁ, జేరుపకుఁ బరువెత్తున్,
మరలున్, గిరగిర దిరుగున్, । సరోవరములందు లాలసమధుప్రతముల్ - 154

గీ. ఎంతయనురాగభరమున నిందుసుంద । రాననము నేను సేవించినానొ, యంత
యింతితత్త్వకథయుఁ బోలె నేకరసునౌ । నర్చనన్నింటినుఁడియు ననుమరల్చి- 155

క. వాలుంగనుగవతోని । ల్లాలెచ్చటఁ గానఁబడదొ, యయ్యది, యఖిల,

శ్రీలంబూర్ణంబయినను,। వాలాయముననమకాని భవనం బెట్లో? 156

గీ. వల్గదలకాళిలోలవృక్ష్పన్మలీల। నిఖిలజనములచూపుఁ గ్రాల నిలువరించి,
సంజతటిఁ గాంతునింటికిఁ జనుచునున్న। యింతిగతి యేనిమదిహరియింపకుండుఁ?

గీ. విమలరదకాంతికాంతమ్మ, వికచజలజ। సంపదపహారకమ్మును సాంద్రసుధము,
నగుయువతి మోము సృజియించి వ్యర్థుఁ జంద్రు। నేలదూరీకరింపఁ డోవృద్ధు ధాత?

క. అనురాగాఢ్యముఁ జతురము। ననుకంపాన్వితము సాధుతార్ద్రిమ్మును నౌ
వనితమనోవ్యాపార। మ్మనయముహరియించునంతరంగము, నయయో. 159

గీ. ముంగురులు వ్యాళశాబకములకు బోఁటి,। కనుగొనల్ వాడిగలసాయకములపాటి,
తానుజపలకుసాటియై తనరు బోఁటి,। సౌఖ్యసాధన మెట్లగుజగతి, నకట. 160

క. కోమలి, మాధుర్యము ను। ద్దామకృపయు నెందు మున్నదనరె నెపుడు, నీ
యామోమునననయ్యోవన। వ్యామతియొకరీతి తోఁచుచున్నదియేలా? 161

గీ. అనిశమును జూపఱకు నయనాభిరామ। మైపొలుపుమీఱునీసస్మితాస్యమునకు
నిశివినిస్సరల్లక్ష్మియా నీరజమ్ము। నెట్లుపోల్పఁగవచ్చు నొక్కింతయేని? 162

క. సుకుమారతరములగునం। గకములనక్కలికి విరులకలిమిహరింపన్,
వికలముఁ జేసెడిసుచుసా। యకుఁడు శరావళులనాదు ప్రాణ, మ్మయయో. 163

గీ. పృథునితంబభారముననమ్మృదుపదాబ్జ। దయ్యుచున్నది త్రోవ వెంటఁ జనుచుండి,
అక్కటకట, తదీయరూపాతిశయముఁ। గాంచిదయ్యుచునున్నాఁడఁ గలఁగిమదిని.

గీ. మధురకేతేరఁ గడఁగనమ్మాధవుండు,। ప్రాణభారార్తలగువరిజభామినులకు
నిండుపున్నమ ప్రలయవహ్నియయితోఁచె। మందిరాభ్యంతరమువార్ధిమధ్యమయ్యె.

చ. అలిగిలతాంగి కేళిగృహమందుఁ బరుండఁగనొయ్యఁ జేరి నె
చ్చెలులనుసైగలన్ దొలఁగఁజేసి సురంటిని వీచుచున్నవన్
దెలిపియుఁ, దానెఱుంగనిగతిన్ గనుదమ్ములు మోడ్చియోసఖీ,
యలసితివంచు నాకరము నానుకొనెం దనపెన్నురంబునన్. 166

గీ. గతియుబాల్యమ్ముతోనె మందతనుబొందె,। మనముతోడనె రక్తమైతనరెమోవి,
మఱియునమ్ముగ్ధలోచన పిఱుఁదుపుష్టి। శరునితోడ సర్వాధికగురుతఁ గాంచె.

క. కలదో లేదోయూపిరి,। సలుపుపడియెఁ జూపు, వలిగొనియెనంగంబుల్;
చెలికథ మిత్రమ, యియ్యది,। తలఁపకుమతి, యొద్దియే నితరకథఁ జెపుమీ. 168

గీ. సీతచేయి శ్రీరాముఁడు చేతఁబట్టు। స్వేదకంపాన్వితంబయి చెన్నుమీఱె,
మంచుచేఁ జెనుగాలిచే సంచలించు। ప్రాతరంభోరుహంబుశోభనుపహించి. 169

శ్రీ ర స్తు.

# భా మి నీ వి లా స ము.

## 3. భాగము.

## శాం తి వి లా స ము.

---

గీ బహుళవిషయాటవీజ్వాలజ్జ్వలనతప్త। మైననామది శ్రీరమ్యమగుముకుంద
మధురవదనసుధాకర మండలమ్ము। నెదురను జకోరమట్లయి యొసఁగుఁగాక! 1

గీ. అధికచింతాగ్నితప్తుఁడనైననన్నుఁ। జల్లఁబఱుపును, శ్రీనేత్రజలజసదన
ప్రాతరంభోజకాంతి గర్వమ్మడంచు। లోచనముల జగత్త్రియీరోచనముల. 2

చ తలఁచినయంతనే జనులతాపము సత్కృపఁబాపునట్టిదై,
నిలుకడగల్గు మైజిగులనించెడి మించులఁ గూడుకొన్నదై
వెలయు కళింద జాతరుల వ్రేలునపూర్వపుమేఘమాల ని
చ్చలు నమదీయచిత్తమున సంగతమై చెలువొందుఁ గావుతన్? 3

మ యమునాతీరవనాంతరమ్మునకుఁ జాయల్ గూర్చుచున్ బ్రాణిబృం
దముగత్యాగతిఖేదమున్నతతమున్ దారిన్నివారించుచున్
గమనీయాకృతినొప్పుచున్ బహులతాగ్రామావృతంబౌతమా
లనుహీజాతముమచ్ఛమమ్ములను వైళంబార్చుఁ గాకెంతయున్. 4

మ. భువనంబంతయుఁ గాంతిరూపకసుధాపూరంబునన్ నించిమా
నవతాపత్రయమెల్ల నొక్కత్రుటిలోనన్ దీర్చుచున్ నమ్రిదా
నవవిద్విణ్నికరావృతమ్మగుమ బృందాకాననావాసమా
నవజీమూతము నాదుస్వాంతమున ధ్వాంతమ్మన్నివారించుతన్! 5

గీ. గ్రీష్మచండాంశుకైవడి భీష్మతాప। మయిఁసంస్పృశిఁ దప్తుఁడనైననాదు
వేదనన్ బాపుఁగావుత వృష్టివరుఁడు। ప్రావృషేణ్యంబయిన వారివాహమట్లు. 6

ఉ పారములేనియీవిషయబంధురకానన మార్గఘోరసం
సారమునన్ నిరంతరముఁ జాలభ్రమించి నలంగియున్ననా
యారటమెల్లసూర్యతనయాతటనీతటభాసమానమౌ
శ్రీతమాలభూరుహము శాంతముగానొనరించుఁగావుతన్! 7

గీ. మన్వపుఁ బ్రియంగులతచేఁ దమాలమట్లు। యబ్ధిసుతచేసమాశ్లిష్టుఁడైనదేవుఁ
డబ్జనాభుఁడు నాహృదయమునవెలయుఁ। గాక నామేను వ్రాలెడికాలమందు. 8

క. పాప్రనుగావృత నాసం। తాపమ్మును నయనములకుఁ దతసంతోషం
బాపాదింపఁగ జెంపఁగ। నోపునొకానొక్క నవపయోదాళి పడిన్. 9

శా. ఏవిన్నన్ మధురోక్తులన్ దెలిపితో, యే, స్వప్నమందేనహం
భావావిష్టుఁడనై, యలజ్జుఁడఁ, దలంపన్ దాని, నట్లయ్యు, నన్
నీవాఁడంచు భరించుచుండు విటులెన్నే నేరముల్ సేసిన,
న్దేవా లేఁడిఁక నన్ను మీఱుజడుఁడున్ నిన్మిఱుప్రేమాఢ్యుఁడున్. 10

చ. అరుగురసాతలంబునకు, నాకపురమ్మునకేగు, మేరుభూ
ధరమును నెక్కు వారిధులు దాఁటుము, కోర్కులు దీరవప్పుడున్;
బరువడి నాధివ్యాధియును బాసిసుఖంపదఁ గోరుదేని శ్రీ
హరియను నౌషధంబుగొను, మన్యములైన శ్రమంబు లేటికిన్? 11

గీ. వెలవెలఁది బింగళను నజామిళునిఁ బతితు। నేలినట్టినీ, కక్కట, యెప్పుడు గాని,
భవమరుస్థలిలోఁగాసి పడుచునున్న। యేనుపేక్ష్యుఁడఁగానుసుమీ దయాబ్ధి. 12

చ. పలుమఱుసంస్మృతిన్ బొరలి పాలును జక్కెరగోస్తనీఫల
మ్ములుఁ జవిచూచి, తద్దివికిఁబోయి సుధారసమాని తంపముల్
గులికెడురంభమోవియును గ్రోలితి, వెందును గృష్ణనామమం
దలిమధురత్వమున్నదె, యథార్థము సెప్పు, మదీయజీవమా. 13

మ. భవరోగంబునకున్ మహౌషధము, పాపక్షోణిభృచ్ఛ్రేణికిన్
బవి, యజ్ఞానమహాంధకారమునకున్ భానూదయం, బార్తిఁజాగ్రు
క్షువితానంబునకున్ దవానలమహాజ్వాలాళి, కైవల్యహ
ర్మ్యవరద్వారము, కృష్ణనామశుభవర్ణద్వంద్వమెల్లప్పుడున్. 15

మ. విను, మోచిత్తమ, తెల్పెదన్ హితమిదే, బృందావనిన్ గోగణం
బునుగాపాడుచునుండునొక్కఁడు నవాంభోదాభుఁ, డవ్వానిపాం
దునఁబోకా, తఁడుపిన్ననవ్వున నెకాంతుల్ సిమ్మి మోహింపఁజే
సి సినున్ నీప్రియమైన యర్థవితతిన్ శిక్షింపపోకార్చెడిన్. 15

ఉ. ఏయదిలోనమగ్నమయి యెన్నఁగరానిసుఖంబొసంగునో,
యేయదికంఠలగ్నమయి యేపడఁగించునొ లోనిచీఁకటిన్,
దీయనకేది ద్రాక్షలనుతింగనునో, యదికృష్ణనామ, మా
ప్యాయముగల్గఁగా, రసన, పల్కుమునీవు రసజ్ఞవైనచో 16

గీ. పృథివిఁజక్కని పక్షులెన్నెన్నొకలవు, వానిలోఁజాతకమునందఁబ్రాఁతి నాకు,

ఆప్తమేఘునిఁ బలఁపించునద్దికంటఁ । బడినఁ గృష్ణాభిధబ్రహ్మమెపుడుఁ బ్రోఁచు. 17

ఉ. ఎవ్వనిసర్వగప్రతిభ నెల్లజగంబులు వెల్గుచుండునో,
యెవ్వఁడహమ్మటంచెలుఁగు నెల్లరకున్నిభృతావలంబమో,
యవ్విభుఁ గంగనన్ స్వహృదయమ్మునెఱుంగని వారలన్యులన్
నివ్వెఱఁ బ్రశ్న సేయుదురు, నేర్తుమె మర్త్యులమౌఢ్యమెన్నఁగన్? 18

గీ హృదయమా కొల్వుగోరితే శ్రీశుఁ గొలువు, । తలఁపనభిలాష గలదేని తలఁపు హరిని,
వేడ్కయేఁ జెప్పఁ జెప్పుము విష్ణుకథల, । నిద్రవలదేని నిర్వృతిన్ నిద్రవొమ్ము. 19

గీ. భవనిదాఘచండాతపబాధితులయి । బల్మినజ్ఞాననిగళంబుఁ బాయఁబుచ్చి
యస్పృహాశీతలాత్మామృతాచ్ఛసరసిఁ । జొత్తురపగతకలుషులు సుకృతులవని. 20

చ. క్రతుముఖకర్మపాశనికరంబునొనర్చు బంధముక్తికై,
మతశతచింతఁ జేసెడిని మానసశాంతికినై ప్రభూతదు
ర్గతిజలరాశిపారమును గాంచఁగ తీర్థములన్మునుంగు, సం
సృతిభ్రమియించుమర్త్యుఁ, డిదియెల్లఁ బ్రమాదభవంబచూడుమీ. 21

గీ. మొదటహరిపాదయుగళంబు ముద్దులాడి । యోలిజంఘులు జానువులూరువులును
నాభిహృదయంబునాలింగనమ్మొనర్చి । యాస్యకాంతులనామదియాడుఁగాక! 22

గీ. మలయపవనునందు నలహోలహాలమందుఁ । జెలువకురులయందుఁ జిలువలందు
మాలయందుఁ దమ్మిచూలియందొకటయి । బ్రహ్మమందుమనసు పరఁగుఁగాక! 23

గీ. అఖిలమైనజగము నస్థిరం, బందులో । మిగులనస్థిరంబు మేను మరల,
నట్టులయ్యుదానికై యెంతయోపరి । శ్రమమువడుచునుండ్రి జనము, లకట! 24

క. దినదినమును మృత్యుముఖ । మ్మునుజొచ్చుచున్నలోకములఁ గనుఁగొనియున్
మనసేమొ విషయములనుం । డినివృత్తముగాద యిప్పటికిని, గటకటా. 25

గీ. అడఁగుఁగాక రాజ్య, మడివముపయిఁబడుఁ । గాక, శిరముఁ ద్రుంచుఁగాక యముఁడు;
ధర్మపథమునుండి తప్పకుండునుగాక । మన్మనంబు లేశమాత్రమేని! 26

గీ. మచ్ఛరంబునందు మారుతుఁ డెప్పుడు । జ్వలనశిఖలు రగులుకొలుపుఁగాక,
ఖడ్గధారవైచుఁ గాక, సుమంతయు । నోటరాదుతప్పుమాటనాకు. 27

క. తరణోపాయముగానక । యెరిసెదుదుఃఖానలమున నేలా, జీవా?
ఆకుదేరఁడె యీచేత । న్స్మరణిన్ శ్రీకృష్ణుఁడొక్కసారెయు నెపుడున్. 28

గీ బహుళహస్తిఘటాదిసంపదలునాకు । నొక్కక్షణమేనిఁ గల్గకయుండుఁ గాక!
వానిలోమున్గ ఘనమదిరానిమీలి । తాక్షులకుహరిపదసేవయబ్బునుగద. 29

గీ. మృత్యువిదె చేరవచ్చె నిద్రింప నేల। యిటువయశ్శేషమున భయం బెసలి నీవు?
అయిననేమి నిద్రింపుము హాయిఁ గొలన। మేలుకొనియున్న దిదె తల్లి మిన్నువాక 30

క. గరసెనిట్టటుఁ బలుమఱుఁ। బరుగెత్తుచు నెదను బాధఁ బొందఁగ నేలా!
పరమేశ్వరుండు హరినా। శిరమందున్ సంతతము వసింపుచునుండెన్. 31

క. మనసా! మనోజరిపుపద। వనజములకు మ్రొక్కు నన్ను భవగర్తమునం
దునఁద్రోసెదేల? నశియిం। చునె యింతటితోను బ్రతిశోకము నీకున్? 32

క. మరకతవసుధాధరమో,। తరుణతరమ్మగుతమాలధరణీజమొ, యిం
చరసిరిదూరమునన్ దా। శరథిం గనుఁగొన్న మునులు సందేహమునన్. 33

గీ రాముమైబిగిఁ గనినవారలకు మొదట। "యమునయో యిది? కాదు, తోయమయయద్రి;
మరకతాభరయొ? కా, దడిమధురయగుట। రెయి?" యనుచు సంశయము గలిగె నెల్లరకును

గీ. తోయవచ్యుతచపలయో, ద్రుమముఁ బాసి।
నట్టిలతయో, యనుచు సంశయాత్ముఁడయిన।
వానరుం, డామె దీర్ఘనిశ్వాస మరసి।
నిర్ణయము సేసెను వియోగిని యని పిదప. 35

ఉ. హీనులయిండ్లఁ గల్మి, ధనహీనత విప్రులయిండ్ల, సాహసం।
తానమునష్టమాట, కుజనప్రతతుల్ చిరజీవులౌట, నీ।
కానితనంబుఁ జూచియలుకన్ గడుఁ గ్రాగుదు, నట్టులయ్యు, సే।
దీనుఁడ నీవు సర్వజగతీపతి వేమియొనర్పఁజాలుదున్? 36

క. ఏవపుఁ బుట్టువుగలమా। యావులు తామపహరింతురను వెనుభీతిన్
గావించితి మత్ప్రశ్నము। జీవితతికి నివ్విధమున నేమంజాలన్ 37

సమాప్తము.



శ్రీ

# భామినీవిలాసము

ఇది

పండితరాజ బిరుదాంకితుఁడగు జగన్నాథకవిచే

విరచితమయిన సంస్కృతకావ్యము నుండి

రాజమహేంద్రవరము నందలి దొరతనము వారి

మొదటి తరగతి బోధనాభ్యసన కళాశాలయందుఁ

ప్రధానాంధ్రోపాధ్యాయుఁడగు

వడ్డాది సుబ్బారాయుఁడు

తెలిఁగించినది.

ఇందుఁ గరుణావిలాసమున నొక యనుబంధముకూడఁ జేరియున్నది.

మొదటికూర్పు 1000

సత్తిరాజు సీతారామయ్యగారిచే

దేశోపకారి ముద్రాక్షరశాలయందు ముద్రించబడినది

ఏలూరు.

1902



వెల రు0-10-0

# శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨ | ౨౦ | గ్రాము | గ్రాఁచు |
| ౩ | ౪ | ముసుం | మసుం |
| ౫ | ౨౯ | సాఁ; | సా |
| ౬ | ౨౫ | గిరి | గిల |
| ౭ | ౪ | చింత | చింతి |
| ,, | ౨౭ | యుయుంగౌ | యుయుంఁతె |
| ౯ | ౭ | త్తై | తై |
| ౧౦ | ౧౩ | భవము | భము |
| ౧౨ | ౨౨ | యొఁడ | యొడఁ |
| ౧౪ | ౨౯ | ధూ | ధూ |
| ౧౫ | ౨౯ | లసు | నసు |
| ౧౬ | ౩ | జెయిజాలెఁగు | గయిజాలెఁ |
| ,, | ౭ | దాయ | దాయా |
| ౧౭ | ౧౦ | మధ | మధు |
| ౧౯ | ౨౦ | దక్ష | దక్షి |
| ,, | ౨౪ | సేనునటంచుఁదల | ప్రస్త్వని సేననిరొ |
| ,, | ౨౭ | తది | దితి |
| ౨౦ | ౬ | యు॥ | యున |
| ,, | ౧౩ | సధ | స్థ |
| ౨౪ | ౩౦ | మ్మి | మ్మిఁ |
| ౨౫ | ౧౨ | మఁ | మ! |
| ,, | ౧౯ | ష్ఖ | ష్ప |
| ,, | ౨౫ | ము, | ముఁ |
| ౨౬ | ౨౦ | వాళి | వ్యాళి |
| ౨౭ | ౨ | ల్లెదు | ల్లెదుఁ |
| ,, | ౧౫ | ము ? | ము, |
| ,, | ౧౭ | థ | థ |
| ౩౦ | ౨౨ | ప్ర | బ్ర |
| ,, | ౨౩ | వేఁఫ | వేడ |
| ౩౧ | ౧ | గారినీరు | గారునీరి |
| ,, | ౧౧ | కన్యా | గన్యా |
| ౩౨ | ౨౦ | యు | యు |
| ౩౩ | ౬ | తుం | తుఁ |
| ౩౫ | ౧౧ | కక | కరి |
| ,, | ౨౪ | బు | బులు |
| ౩౭ | ౪ | చె | క |
| ౪౩ | ౧౫ | గం | గున్ |
| ౪౪ | ౧౩ | ? | ; |
| ,, | ౨౮ | భున్ | భుల్ |
| ౪౬ | ౧౫ | గుఃఖ | కష్ట |
| ౪౭ | ౮ | బు | పు |
| ,, | ౯ | లూ | లూ |
| ,, | ౨౦ | మును | ము |
| ,, | ౨౩ | శాంతి | శాంత్య |
| ౫౪ | ౧౭ | మం౧సు | ముందు |
| ౫౫ | ౧౩ | బొల్లుదు | బల్లుదు |
| ,, | ౧౪ | నాఁటి | నాఁటి |
| ,, | ౧౭ | ౦డు | ఁడు |
| ,, | ౧౯ | ౦డా | ఁడా |

## పీఠిక.

---

సంస్కృతకవులచరిత్రమును సరిగాఁ దెలియఁబఱుచుగ్రంథము లేవియు లేనియీ కాలమున భామినీవిలాసకృతికర్తయగు జగన్నాథపండితునికాలనిర్ణయాదుల నించుమించుగాఁ దెలిసికొని, యాయనజీవచారిత్రమునుగూర్చి యసంపూర్ణముగా నయిన విశ్వాసపాత్రమగు చరిత్రమును వ్రాయుట చదువరుల కొకయింత సంతోషము గలుగఁజేయకపోదు. హిందూదేశమున బహువిషయములయందుఁ గల్పనాకథ లెన్నియో యుత్పన్నములయి కాలక్రమమున దట్టముగా నల్లుకొని విజృంభించి, యొకానొకప్పు డెవ్వరేని నిజమయిన చారిత్రమును జెప్పినను దానియందు జనులకు నమ్మకము గుదురనీయనంత దృఢముగా వేళ్లుపాఱియున్నవి. ఇటీవల కాలములో బ్రసిద్ధినొందినజగన్నాథపండితునిచరిత్రముగూడ నట్టియసంగతపుఁగట్టుకథలకు బుట్టి నిల్లయినందున యథార్థమురూపుమాసినది. అయినను దత్పండితవర్యునిచే వ్రాయఁబడినగ్రంథము లామూలాగ్రముగాఁ జదివిచూచితిమేని నిజమైన తచ్చారిత్రము గొంత సంపాదించుట దుర్లభము కాదు. జగన్నాథకవి గ్రంథరచనయందు విద్వద్బృందములో నెంతవన్నె కెక్కినను బాపమాయన విరచించినకబ్బములుమాత్రమంతగాఁ బ్రఖ్యాతినొందినవి కావు. అవి చదివినవారు కొందఱుమాత్రమే కలరు.

ఈపండితుని గుఱించి యనేకు లనేకవిధములుగాఁ గట్టుకథలను లోకమంతట వ్యాపింపఁ జేసిరి. సత్యాసత్యము లెట్లున్నను వినుటకు మాత్ర మవి మిక్కిలి మనోహరములు కాఁబట్టి యీయన జీవితమును గూర్చి చర్చింపక పూర్వ మాకథలయం దనేకులు చెప్పుకొను వాని నిట నుదాహరించుచున్నాఁడ.

(౧) జగన్నాథపండితుఁడు మిక్కిలి ప్రఖ్యాతికెక్కినవాఁడయి తనకుఁ గర్ణాటరాజ్యాధిపతులవలనఁ దగినంతసన్మానము కాని కతమున, విత్తార్జనమున కుత్తరహిందూస్థానమునకు వెళ్లి జయపురపుసంస్థానమున ననేకపండితుల నోడించి యచ్చో శాస్త్రిపరిశ్రమముకొఱకొక కొత్తయేర్పాటు కావించెను. ఆకాలమందు డిల్లీసంస్థానమునుండి విస్తార శాస్త్రి పరిచయము గలఖాజీ యొకఁడు హిందూదేశ మంతటను సంచరించి తాను వెళ్లినప్రదేశములందెల్ల మతవిషయికవాదములు జరిపి విద్వాంసుల నోడించుచుఁ బ్రపంచమునందు మహమ్మదీయమతమే సర్వోత్తమమని స్థాపించుచుండెను. ఈమత వివా

దములను గూర్చియుఁ దత్కారణమున ననేకులగు హిందూసంస్థలు మత భ్రష్టులగు చుండుటను గూర్చియు, మిగుల నాలోచించి జగన్నాథపండితుఁడు పట్టుదలతోఁ దానొ కసంవత్సరములోపలఁ బారసీభాష స్వనగ్గళముగా నేర్చుకొని మహమ్మదీయమతగ్రంథ ములను జదివి యాఖాజీతోఁ బ్రసంగము చేసి యుక్తియుక్తమగు తన వాదము చేత నోడించి మహమ్మదీయులయందుఁ బుట్టినవారి కట్లుండిన నుండెఁగాక యితరమత ములవారి నాకర్షించుటకుఁ దగినవిశేషమేమియు నీమతమందు లేదని చెప్పి యప్పటి తురుష్కచక్రవర్తిని మెప్పించెను. తన్మూలమున జగన్నాథపండితునియందు మహానుగ్ర హము గలిగి చక్రవర్తి యీయనను దనయాస్థానవిద్వాంసునిఁగాఁ జేసికొనియె.

(౨) ఆకాలమున నష్వరుచక్రవర్తికి రాజపుత్రస్త్రీవలనఁ గలిగినయధిక సౌందర్య వతియగు లవంగిక యనునొక కూఁతురు గలదు. ఆమె పరిపూర్ణతారుణ్య మనోహరాం గి యయి తనకు సహజమన్మథ వికారము లంకురించుచుండఁగా, తన తండ్రియా స్థానమందు నిరంకుశపాండిత్యప్రకర్షము గల మనోజ్ఞరూపయౌవనసంపన్నుండు జగ న్నాథుఁడను మహాకవి యొకఁడున్నాఁడని యాలించి యతనిసందర్శనంబున నేత్రసా ఫల్యంబు గావించుకొన వేచియుండెఁ గొండొకనాఁడు రాజసభాగారంబున జనవాలెక నె ఱవేఱుదు నప్పొంగి లవంగిక పెండ్లియాడిన జగన్నాథపండితునే పెండ్లియాడవలెను. లేదా యవివాహితగా నుండవలెనని తనమనంబున నిశ్చయించుకొనెను. అట్లుండ నొక్క దినం బున నష్వరుచక్రవర్తియు జగన్నాథకవియుఁ జదరంగము నాడుచుండఁ జక్రవర్తి దప్పి గొన్నవాఁడయి పానీయము గొనితెమ్మని యానతియ్య నాస్త్రీయుఁ బోఁడి జలపూర్ణ మయిన బంగారుభృంగారువును శిరంబునందుంచుకొని మురిపంబునఁ దండ్రిచెంతకుఁ నేఁగుదెం చెను. అప్పుడా చక్రవర్తి తనకూఁతు పక్కనసనమున నప్పొంగి లవంగికను భృంగారుసహి తముగా వర్ణింపు మనికోరిన జగన్నాథపండితుఁడు తోడనె యీక్రింది శ్లోకమును జదివి నాఁడు.

శ్లో॥ ఇయం సుస్తనీమస్తకన్యస్తకుంభా
కుసుంభారుణం చారుచేలం వసానా
సమస్తస్య లోకస్య చేతఃప్రవృత్తిమ్
గృహీత్వా ఘటే న్యస్య యాతీవ భాతి ॥

పం॥ బలే! పెడంగుఁజంద్రకావిసారసం ధరించి యీఁ
దలం గళంతికన్ వహించి దారిఁజబ్బరంబ్రుగు
బ్బలాడి యీమె పోవుచున్న ప్రపంచచిత్తవృ
త్తులన్ హరించి దీననుంచి పోన కాంచుఁబోవు నానె ॥

అట్లు చదువఁగానే రసవంత మయిన యాయాశ్చర్యకరవచనములకు నానందపరవశుండయి చక్రవర్తి కవిరాజా నీయిచ్ఛ వచ్చిన దెద్ది యేనిఁ గోరు మిచ్చెద ననియె. జగన్నాథకవి యంగుమీఁద నాతుగతిని మరల నీక్రింది శ్లోకములఁ జదివినాఁడు.

శ్లో॥ నయాచే గజాళిం నవా వాజిరాజిం
నవిత్తేషు చిత్తం మదీయం కదాచిత్
ఇయం సుస్తనీ మస్తకన్యస్తకుంభా
లవంగీ కురంగీ దృగంగీ కరోతు ॥

శ్లో॥ యవనీ నవనీతకోమలాంగీ । శయనీయే యది లభ్యతే కదాచిత్
అవనీతల మేవ సాధు మన్యే । నవనీ మాఘవనీ వినోదహేతుః ॥

భుజంగ॥ తురంగంబులం గోరఁ; దుంగేభసంఘం
బరం బొందఁ; యాచింప ద్రవ్యంబు; నేత
త్కురంగీదృశం, దోయకుంభోత్తమాంగన్
బరింతున్ లవంగిన్ నవప్రాయభంగిన్ ॥

కం॥ నవనీతమృదులతను వీ । యవనీమణి యున్న శాశయనమం దలనాఁ
డవనీతలమే మేల్ ; మా । ఘవని వని వినోదహేతుకం బని తలఁపన్ ॥

అని పలుకఁగాఁ దాను స్వప్నమందయినఁ దలంచుకోనియిట్టివిపరీతపుఁ గోరికకాచక్రవర్తి యద్భుతవిషాదగోచరుండయి తనవాగ్దానము దప్పలేక యప్పండితునితో నీవు మాతోఁ బొత్తున భుజించితివేని గన్యనిత్తునని యుత్తరంబిచ్చెను. జగన్నాథకవి లవంగికయందలిమోహంపుఁబారవశ్యంబున జాతిబహిష్కరణమున కయిన వెనుకఁదీయక చక్రవర్తితో సహపంక్తిని విందారగించెను.

(3) ఈపండితుఁడు డిల్లీచక్రవర్తియాస్థానమున నున్నకాలములో వేఱొకమహారాజు తనసభయందు పండితుఁడుగా నుండుమని యీయనకు జాబు వ్రాయఁగాఁ గవి దానికిఁ బ్రత్యుత్తరముగా నీక్రింది శ్లోకము లిఖియించి పంపెను.

శ్లో॥ దిల్లీశ్వరో వా జగదీశ్వరో వా
మనోరథాన్ పూరయితుం సమర్థః
అన్యైర్నృపాలైః పరిదీయమానం
శాకాయవా స్యా ల్లవణాయవా స్యాత్ ॥

క॥ కోరికలను బూరించెడు । వారొకఢిల్లీశ్వరుండుఁ బరమేశ్వరుఁడే
భూరమణు లితరు లిడునది । కూరాకునకౌనొ యుప్పు కొసరకునౌనో ॥

(౮) జగన్నాథపండితుఁ డొకనాఁడు తారగానేని నారాధింపఁగా నాదేవి ప్రత్యక్షంబయి యీక్రింది శ్లోకముచే నాయనను నాశీర్వదించినది.

శ్లో॥ అపరదేశం వినగేః మా కురు పరవాదినిర్జయే శంకామ్
స్వీకురు వరమేకం మే వ్యాకురుష్వ భో వత్స ! శాస్త్రాణి ॥

కం॥ అపరుదేశము దిరుగుము; । తేఁకువ పరవాదినిర్జితిం బొరయుము; నా
యేకవరంబును జేకొను; । వ్యాకృతి గావింపు శాస్త్రతతికి వత్సా ॥

(౯) ఆధునిక ప్రసిద్ధవైయాకరణుఁడైన నాగేశభట్టునకు నుపాధ్యాయుఁడగు హరదీక్షితుఁడు చక్రవర్తి కడ నేనేని బహుమానము పడయఁ గోరి యొకప్పుడు డిల్లీ పట్టణమునకుఁ బోయి పాదుషాను సందర్శింపక మున్న పండితరాజును గలసికొని వ్యాకరణశాస్త్రమున నీతోఁ బ్రభుసన్నిధిని బ్రసంగింపఁ గోరుచున్నాననెను. అందుకు జగన్నాథకవి యంగీకరించి రేపు దర్బారునకు విచ్చేయుమని చెప్పెను గాని వ్యాకరణశాస్త్రమందు హరదీక్షితుఁడు తనకంటె నధికుఁడని తెలిసినవాఁడు గాన మఱునాటిదినమునఁ దానొక మంత్రపుఁగడియమును ధరించి సభకుఁబోయి యాక్రొత్త పండితుఁడు రాఁగానే యాయనను ప్రేమగలవానివలె గాఢముగాఁ గౌఁగలించుకొనెను. అందువలన వెంటనే యతనికొకవిధమయిన బుద్ధిమాంద్యము సంభవించి ప్రసంగారంభముననే హరదీక్షితుఁడు పరిహాసాస్పదములయిన ప్రశ్నోత్తరములకు దిగినవాఁడయి తుదకు నలువురలో నవమానపడి యింటికిఁ బోయెను. ఆయన యంతటి పరాభవము రావలసినవాఁడు కాఁడు గావున నారేయెల్లఁ గన్నుమోడ్చక విచారించి ప్రతివాదిజయమునకుఁ దగినసాధనము తనకు సమకూడనియెడల నాఁటిరాత్రి ప్రాణత్యాగముఁ జేయువాఁడుగాఁ బ్రతిజ్ఞచేసికొని భక్తిపూర్వకముగా నిష్టదేవత నారాధింపఁగా నాదేవత యాతనిం దత్కాలకము దెలిపియూఁదించి ప్రతిక్రియను బ్రసాదించెను. మఱునాఁడు మరల నుభయపండితులు సభకుఁ విచ్చేసినప్పుడు మాయోపాయము పనిచేయనందున హరిదీక్షితునకే గెలుపుగలిగెను. అయినను దొలునాఁడు గెలిచినాఁడు గావునఁ బండితరాజు హరదీక్షితునిచేఁ బరాజితుఁడు గాఁడని సభ్యులెల్ల నుద్ఘోషించిరి.

(౧౦) పండితరాజు తనపరువపుఁ బ్రాయమంతయు హాయిగా డిల్లీశ్వరుని సంస్థానమందు యవనవనితతో వెళ్ళఁబుచ్చి తుట్టతుదకుఁ దనచరిత్రను గూర్చి పశ్చాత్తప్తుఁడయి తనయాయుశ్శేషము నక్కడఁ గడపవలయునని వారణాసికిం బోయెను. అప్పుడు శ్రోత్రియశ్రేష్ఠుండగు నప్పయదీక్షితుఁడు తత్పుణ్యక్షేత్రమునకు యాత్రవచ్చి యొక్కనాఁటిమధ్యాహ్నమందు జగన్నాథకవిని జూడఁబోఁగా నతఁడాకాలమున యవన

యువతితో నేకశయ్యను బవ్వళించు కానఁబడియె. అప్పయదీక్షితుఁ డందు కతివిస్మితుఁడయి తా నాతని నెఱుఁగ నట్లుగా నభినయించుచు నీక్రిందియర్ధశ్లోకమును జదివెను.

శ్లో॥ కిం నిశ్శఙ్కం శేషే. శేషే వయసః సమాగతో మృత్యుః॥

తే॥గీ॥ ముగిసెఁ బ్రాయము మృత్యువు మెగిసె నకట!
నూట లేకిప్పుడా నిద్ర యోరిజీవ! ॥

అదివిని పండితరాజు శయ్యదిగి యప్పయ్యదీక్షితున కెదురువోయి తోడితెచ్చుచు శ్లోకార్ధము నీక్రింది విధమునఁ బూరించెను.

శ్లో॥ అథవా సుఖం శయీథా నికటే జాగర్తి జాహ్నవీ జననీ ॥

తే॥గీ॥ అయినఁ గొదవేమి నిదురింపు మాద మఱవి
కడనె యున్నది తల్లి గంగాభవాని ॥

(౨) కాశీపట్టణములోని విద్వాంసు లందఱును జగన్నాథుని వ్యాసక్రమములను మన్నించి యాయనను కులములోఁ గలుపుకొనుటకు నిష్టపడిరి గాని తనకుఁ బ్రాణపదమయిన లవంగిని దోలఁగుట కంగీకారము లేనందునఁ బండితులు చెప్పిన పద్ధతుల యందెద్దానికిని బండితరాజు సమ్మతించినాఁడు కాఁడు. యవనీసంపర్కము గలిగి యుండఁగా నీతనిఁ బునీతునిఁ జేయుట యనుకూలపడనందునఁ బండితరాజు చెప్పినపద్ధతులలో నెద్దానికిని బండితులును సమ్మతించినవారు కారు. అనంతర మొకనాఁడు జగన్నాథపండితుఁడు లవంగియుం దానుఁ గొండొక గంగాఘట్టమునందుఁ బయి మెట్టునఁ గూరుచుండి యా పవిత్రవాహినిని ధ్యానించి శ్లోకరూపముగా స్తోత్రము చేసెను. ఆఘట్టమున నేఁబది రెండు మెట్లు కట్టఁబడి యున్నవి. ఆశుధారను బండితరాజు చదివిన ప్రతి శ్లోకమునకును గంగాదేవి యుప్పొంగుచు శ్లోకమున కొక్కసోపానముగా నేఁబదిరెండు శ్లోకములకేఁబదిరెండు సోపానములును దాఁటి వచ్చి వారల నిరువురను దాఁకి పునీతులను గావించెను. వారిరువురు గంగలో మునింగి యదృశ్యులయిరనియుఁ జెప్పుట గలదు. పండితరాజు రచియించిన యాయేఁబదిరెండుశ్లోకముల స్తోత్రము ఆగంగాలహరి యను పేరితో హిందూదేశమందంతట సాధారణముగాఁ బాఠము చేయఁబడుచున్నది.

జగన్నాథపండితునిఁగూర్చి పూర్వోక్తప్రకారమున ననేక కథలు లోకమంతట వ్యాపించియున్నవి. అయినను వాని నున్నవిధమున నమ్ముటకుఁ గొన్నిచోట్ల నవకాశము లేదు; కావున నం దెంతవఱకు సత్యమున్నదో విచారింతము. ముందుముందు వెల్లడి కాఁగల యీయనతండ్రిగారి పేరినిబట్టియు, నాడీభేదమును బట్టియు మఱికొన్నియితరాంశములనుబట్టియుం జూడఁగా నీపండితుఁడు మనగోదావరిమండలమువాఁడనియుఁ జిరకా

బహుత్తరహిందూస్థానమున వసించినాఁడనియు రూఢమగుచున్నది. పారసీ భాషయందీ
యనకు విశేషప్రవేశము గలదన్నమాట నమ్మవచ్చును. సగము సంస్కృతముతోను సగము
పారసితోను నీయనరచియించిన శ్లోకము లనేకము లున్నవనియు విశేషించి పారసీ భా
షయందలి యొకానొక జ్యోతిశ్శాస్త్రగ్రంథమును సంస్కృతములోనికీయన మార్చినాఁ
డనియుఁ జెప్పుచున్నారు. ఈ భామినీవిలాసము కడపట, నీయనపూర్వవయస్సంతయు
ఢిల్లీచక్రవర్తియాస్థానమునఁ గడపినట్లు తెలియ వచ్చుచున్నది గాన, సంస్కృత భాషా
పోషకు లని ప్రసిద్ధిగాంచిన పాదుషాలలో నెవరో యీయనయందు విశేషాభిమా
నము వహించియుండవచ్చును.

రెండవప్రవాద మక్బరుచక్రవర్తితో సంబంధము కలిగి యున్నది. ఆచక్రవర్తిని
గూర్చి యేస్వల్పాంశమును గూడ విడువకుండ వ్రాసిన "ఐనెయక్బరీ" యనుచరిత్ర
ములో నీపండితుని ప్రశంసగాని లవంగికసంగతిగాని గానరాదు. మహమ్మదీయుఁ డయి
న యక్బరుచక్రవర్తి తనకొమార్తె నొకవైదికబ్రాహ్మణునకిచ్చి పెండ్లి చేసినమాటయే నిజ
మైనపక్షమునకుఁ దచ్చరిత్రములో గ్రుచ్చవలసినముఖ్యాంశములయందింతకు మించిన విలు
వగలవి చరిత్రకారునకు వేఱొక్కఁ డుండఁ డని నిశ్చయముగా వక్కాణింప వచ్చును.
మఱియు మితి మీఱిన రాణివాసముగల మొగలాయిచక్రవర్తి తాను జల కలశమును
దలమీఁదఁ బెట్టుకొని కొలువుకూటములోనికి వచ్చినదని చెప్పుమాటయందు వివేకముగ
లవారి కెవ్వరికి విశ్వాసము పుట్టును? మహమ్మదీయ ప్రభువులలో హిందువులకు మిగుల
ననుకూలుఁ డయినవాఁడును వారిచే నెచ్చుగ మెచ్చఁ బడినవాఁడును నక్బరు చక్రవర్తి
గావునఁ దమకుఁ బరిచిత మయినపేరు, పండితరాజు నాదరించిన చక్రవర్తికి మనవారా
రోపించి యుందురు. ఇంతియ కాని యీపండితునకును నక్బరు చక్రవర్తికిని లేశమును
సంబంధము లేదు. యీకథలో నతికి యున్న శ్లోకములు పండితరాజు రచియించిన యే
గ్రంథము నందును గానరా వని తత్కర్తృత్వ మీకథయందు ననుచుట నొకానొక ర
నుమానించుచున్నారు; కాని వారి కట్టియనుమానము పుట్టవలసినపని లేదు. చాటుధా
రా శ్లోకములు లోకమందే ప్రాఁకి యుండును గాని గ్రంథములయం దెప్పుడు నిమిడి
యుండవు.

విమర్శించి చూడఁగా నీకథ యంతయుఁ గేవల కల్పిత మని చెప్పుటకంటెఁ గా
సంత లేనిదే గంపంత కా దనులోకోక్తిని బట్టి జగన్నాథ పండితునకు యవనీ సహ
వాస మున్న దనియే తలంచుట మంచిది గాఁ దోఁచుచున్నది. ఈ భామినీవిలాసమంద
లి కరుణవిలాసము సర్వము నీకవికిఁ దటస్థించిన భార్యావియోగదుఃఖమునే ప్రకటిం
చుచున్నది గదా! మహమ్మదీయ చక్రవర్తిగారి దివాణము నాశ్రయించి యున్న యీ

మూఁడవకథ జగన్నాథ పండితుని ప్రభుభక్తిని సూచించుచున్నది. కనుక న ద్దానిని విశ్వసించుటకుఁ బ్రమాణాంతర మనావశ్యకము.

నాలుగయిదు కథలు హేతువాదమున కందక కేవల విశ్వాసముమీఁద ప్రేలాడుచున్నవి. దేవతాసాక్షాత్కారాదులయందు నమ్మకము గలవారే కాని లేనివారు వానినంతగాఁ బాటిసేయరు. ఈ రెంటిలోఁ గడపటి దానియందు నాగేశభట్టునొక నామము వినఁబడుచున్నది. నాగేశభట్టునతఁడు జగన్నాథపండితవిరచిత మయినరసగంగాధర మనునలంకారశాస్త్రమునకు గురుమర్మప్రకాశ మను వ్యాఖ్యానము చేసియున్నాఁడు. ఆవ్యాఖ్యానముపేరిఁ బట్టి యాలోచింపఁగా నాగేశభట్టునతఁడు హరిదీక్షితునకుఁ గాక జగన్నాథపండితునకే శిష్యుఁడేమోయని తోఁచుచున్నదిగాని తద్వ్యాఖ్యానముఖశ్లోకమున ''నత్వాగంగాధరం మర్మప్రకాశం తనుతే గురు,, మ్మనియున్నందున నందులకు మరల సందేహముగలుగుచున్నది హరిదీక్షితాదుల కాలనిర్ణయమును గురించి ముంబాపుర ప్రకటితసంస్కృతభామినీ విలాసమునందలి యాంగ్లోభాషాలిఖిత పీఠికయందు నధికముగా వివరింపఁబడి యున్నది. వలయువా రందుఁ జూచుకొనునది.

ఆఱవకథవిషయమున—

శా. జల్పించెం గడవెళ్ళ శాస్త్రములు; నిష్కర్ష సల్పె నిత్యక్రియల్;
డిల్లీవల్లభపాణిపల్లవమునన్ లేఁబ్రాయముం బెర్; గడున్
డుల్లన్ వాసన లిచ్చెడిన్ మధురయందుం గొల్చు గోవిందు; హా
యుల్లోకంబుగఁ జేసెఁ బండితసమూహోత్తంసుఁ డన్నింటిని ॥

అను భామినీచతుర్థవిలాసపద్యమునందుఁ బండితరాజు తనయంత్యదినములను మథురయందుఁ గడపినట్లు కనఁబడుచున్నను వారణాసియందు వసియించినాఁడని చెప్పుటకుఁ గూడఁ గారణమున్నది. క్రీ. శ. 1637సం॥ ప్రాంతమున సుప్రసిద్ధుఁడైయున్నట్లు తెంచఁబడిన ద్రవిడపండితుఁ డప్పయ్యదీక్షితుఁడు పండితరాజున కక్కాలమునఁ బ్రతిపక్షిగ నున్నవాఁడు ''నేదం రూపకం, రూపకేచ బింబప్రతిబింబభావో నాస్తీతి కే-నాప్యాలంకారికంమన్యే ప్రతారితస్య నసదుక్తి రత్రద్రష్టవ్యా,,. అని రసగంగాధర రూపక ప్రకరణము. దీక్షితశబ్దేనాలంకారకౌస్తుభ్రద్రావిడ సాప్పయ్యదీక్షితస్య అని యయినా క్యములోనిమాటకు నాగేశభట్టువ్యాఖ్యానము. పండితరాజున కప్పయ్యదీక్షితుఁడు ప్ర

తిపక్షియనుటకుఁ బూర్వోక్తసంస్కృత వాక్యమే సాక్షి. ఇట్టిస్థితిలో నీపండితు లిరువురును గథలోఁ జెప్పఁబడిన చొప్పున నెప్పుడయినఁ గలసికొనిరా యను విషయమే పరమసందిగ్ధము. ఇంక శ్లో॥ కింనిశ్శంకం శేషే (ముగిసెఁబ్రాయము ఇత్యాదిదాని తెలుఁగు) అను నార్యను వారిద్దఱును గలిసి చెఱిసగము రచియించిరను విషయము చెప్పవలసినదేమి? ఇంతియగాక యీశ్లోకము రసగంగాధరమున నాక్షేపప్రకరణమునందును గానవచ్చుచున్నది. దీనంజేసి తదార్యయుం దప్పయ్యదీక్షితునకు భాగమీయ బొత్తిగ నేవలనుపడదు. ఏమనఁగా జగన్నాథపండితుఁడు తనరసగంగాధరమునందు.

శ్లో॥ నిర్మాయ నూతన ముదాహరణానురూపం
కావ్యంమయాత్ర నిహితం నపరస్య కించిత్ ;
ఆఘ్రాయతే సుమనసాం మనసాపి గంధః
కస్తూరికాజననశక్తిమతా మృగేణ ॥

దీనికిఁ దెలుఁగు.

చ॥ కొననిటఁ గొంచె మేనియు నొకొండుఁ రచించిన దాని; నేనె నూ
తనముగఁ జేసి యుంచితి నుదాహరణానుగుణంబుఁ గావ్యముల్ ;
మనమున నైన మూరకొను నా సుమనస్సులతావిఁ గస్తురిం
జననము నొందఁ జేయఁగను జాలుమృగంబు జగంబులోపలన్ ॥

అని గొప్పప్రతిజ్ఞ చేసికొన్నాఁడు. కంఠోక్తిగాఁ దెలియవచ్చుచున్నయీప్రతిజ్ఞకు విరుద్ధముగాఁ బుక్కిటిపురాణమును విశ్వసించుట వివేకపక్షము గాదు.

కడపటికథయందుఁ బర్యవసానము రెండంశములుగాఁ దేలుచున్నది. మొదటిది జగన్నాథపండితుఁడు జాతిబహిష్కృతుఁడయ్యె ననుట. రెండవది గంగాస్తవము గావించి యావెంటనే లవంగికతోడ నాతఁడు గంగలో మునింగి యదృశ్యుఁడయ్యె ననుట. ప్రథమాంశమును గురించి కొందఱయభిప్రాయ మేమనఁగా గంగాలహరియందలి కొన్ని శ్లోకములు ముఖ్యముగా ౬, ౨౫, ౩౦, ౩౬, ౩౪, ౩౯, ౪౬, ౪౭ సంఖ్యలు గలవి, తత్కథను మెఱుఁగువెట్టునట్లు కనఁబడుచున్నవిగాని యవియొక ప్రమాణము కానేరవు. అంతకన్నను దీనముగా ననేకకవులు స్తవములను జేసియున్నారు. అనునదిగా నున్నది. అయినను.

చ॥ భవ మనుపాడునూతఁబడి బాముల నొందెడు నన్ను నిగతిం

దవుసె యుపేక్ష సేయఁ గరుణావరుణాలయ ! శౌరి ! తొల్లిసీ
పవన మొనర్ప నెట్టు లకటా ! ప్రకటాఘును బింగళాఖ్యవా
రవనిత, దుష్టవర్తనుని భ్రష్టు నజామిళభూసురబ్రువున్ ॥

భామి. శాంత. ౧౭.

అను నర్థముగల మూలశ్లోకమును జదువునప్పుడు తత్కృవి తన్నును దనలవంగికి నుబాఁనులం జేయుమని భగవంతుని గూర్చి మొఱ్ఱవెట్టుకొనినట్లు లెవరు తలంపకుందు రు? ఇట్టిప్రార్థనము వేఱొకరిది మనము వినము. ద్వితీయాంశము కేవలము విశ్వాసానర్హముగానున్నది. కొందఱు చెప్పెడులాగునఁ బండితరాజు నిజముగా గంగాలహరి రచియించిన శోడనే గంగాప్రవేశ మయిన పక్షమునఁ దదనంతర మాయన వేఱొక గ్రంథము విరచించుట కవకాశము గలుగదు గదా! ఈక్రింది యంశమును బట్టి విచారింపఁగా గంగాలహరికిఁ దరువాత నాయన తనకృతుల నన్నిట నుత్కృష్టతమ మనఁదగిన రసగంగాధర మను నలంకారశాస్త్రమును విరచించి నట్లు కనుపట్టుచున్నది. అగ్రంథమునం దన్వయప్రకరణమున.

" ఉదాహరణ మమృతలహర్యాఖ్యే మదీయే గంగాస్తవే—

శ్లో॥కృతక్షుద్రాఘౌఘా నథ సపది సంతప్తమనసః
సముద్ధర్తుం సంతి త్రిభువనతలే తీర్థనివహాః
అపి ప్రాయశ్చిత్తప్రసరణపథాతీతచరితా న్
నరా నూరీకర్తుం. త్వమివ జనని త్వం విజయసే॥

పైసంస్కృతమునకుఁ దెలుఁగు

మదీయ మగునమృతలహర్యాఖ్య గంగాస్తవము నం దుదాహరణ మని

చ॥ పొనరిచి సూక్ష్మపాతక సమూహము లుమ్మలికించు వారలన్
మనుపఁగ నున్న వెన్నొ భువనత్రితయంబునఁ దీర్థసార్థముల్ ;
జననినరో! నిను నీవెసుమి సాటివి నిష్కృతిమార్గదూరవ
ర్తనములు గల్గుమర్త్యసముదాయము నైనను నుద్ధరింపఁగన్॥

అనునర్థమిచ్చుపయిశ్లోకమును జేర్చియున్నాఁడు. గంగాస్తవముగంగుఁ గడపటిదయిన

శ్లో॥ఇమాం పీయూషలహరీం జగన్నాథేన నిర్మితాం

యాః పాకే ప్రత్యగ్రస్య జాయంతే సుధాసంపదః॥

అనుశ్లోకమునందుఁ జెప్పఁబడినచొప్పునఁ దద్గ్రంథము పీయూషలహరియనవలసియుండఁగా నీయనన్వయప్రకరణమున 'అమృతలహర్యాఖ్యే' యని యుండుట లేఖకాదిప్రమాదముగాఁ దలంప వలసినది. పండితరాజు రచియించినది యమృతలహరియని వేఱొకటి యున్నది. అదియమునాస్తవముగాని గంగాస్తవముగాదు. ఉదాహృతశ్లోకము గంగాస్తవమునందుఁ గానఁబడుచున్నది. పీయూషలహరిలోని ప్రథమశ్లోకమునను గంగ యుపాసింగుచు వచ్చెననుమాట తల్లహరీమాధుర్యశాలియ ద్యోతకముగు సత్కృతినిగా విచక్షణులు భావించుకొందురుగాక.

కథలవిషయ మిట్లు ముగిసినది గనుక నిటుపిమ్మటఁ గాలనిర్ణయము చేయవలసియున్నది. అందును గుఱించి నిర్వివాదముగా నిశ్చితాభిప్రాయ మిచ్చుటకు జగన్నాథపండితుఁడు రచియించిన గద్యపద్యములే సిద్ధముగానున్నవి. కొన్నిట్టి వానిని క్రింద వ్రాయుచున్నాను.

౧ శ్లో॥ సురాంగనా మారామా దిహాయుశితి ఝుంఝానిలహతాః
పతేయుః కాశీంద్రా యది తదఖిలో సంపతి జనః
కి మోభిర్గ్వాకార్యం శివశివ వివేకీనవికలై
శ్శ్రీఖండీ వన్యాస్తా మధ్యధరణి దిల్లీనరపతేః॥
రసగంగాధరము. ఆక్షేపప్రకరణము.

౨ శ్లో॥ సృష్టిస్సృష్టికృతా పురాతిల పవిత్రాతుం జగన్మండలం
త్వం చింతాపవిరహదాం దహసి యజ్ఞాప్రాణిహృద్గోచరః
సంరంభారుణ లోచనో రణభువి ప్రస్థాతుకామోన్యసా
జానీమో భవతా న హంత విదితో దిల్లీధరావల్లభ॥ ర. గం. ప్రతీపప్రకరణము.

3 శ్లో॥ మాహాత్మ్యస్య పరోవధిర్నిజగృహం గంభీరతాయాః పితా
రత్నానాం మహతామనేకవిభునానేకోపరో మాతృకః
ఇత్యేవం పరిచింత్య నాస్తి సహసా గర్వాంధకారం గతో
దుగ్ధాబ్ధే భవతా సమో విజయతే దిల్లీధరావల్లభః॥ ర. గం. ప్రతీపప్రకరణము

౪ శ్లో॥ అనుకూలభావమథవా పరాఙ్ముఖత్వం స్వహైవసమరలోకే
ఆవశ్యావిహితమంత్రా విధదిల్లీవల్లభో బహుధా॥ ర. గం. సహోక్తిప్రకరణము

౫ గ॥ మూర్తిమతేవ నవాబాసఫఖానమహః ప్రసాదేన ద్విజకులసేవాహేవాకినా
జ్ఞానః కాయేన మాథురకులసముద్రేందునా రాయముకుందేన నాదిష్టేన సా
ర్వభౌమ శ్రీశహాజహాం ప్రసాదాధిగతపండితరాజపదవీవిరాజితేన తైలింగకు
లావతంసేన పండిత జగన్నాథేనాసఫవిలాసాఖ్యేయ మాఖ్యాయికా నిరమీ
యత. అసఫవిలాసపీఠిక.

౬ శ్లో॥ శ్యామం యజ్ఞోపవీతం తవ కిమితి మషీసంగమాత్ కృత్రజాలైః
సోయం శీతాంశుకాన్త్యాపయసి కథమసూ త్యుజ్జ్వలం కజ్జలాక్తం.
వ్యాఖ్యాస్య న్నారసేశ క్షితిరమణ రసైశ్చ క్షోణిభృత్పక్ష్మలాక్షీ
లక్షాక్షీణా శుభారాసముదితసరితాం సర్వతస్సంగమేన॥ ఉత్తరప్రకరణము

౭ శ్లో॥ భూమీనాథ శహాబుద్దీన భవతస్తుల్యో గుణానాం గణై
రేతద్బ్రహ్మాండ భవప్రపంచవిషయే నాస్తీతి కిం బ్రూమహే
ధాతా నూతనకార్యకౌశల్యవిధి పునస్సృష్టిం నవాం భావయే
త్సన్స్యాదేవ తథాపి తావకతులాలేశం వధానో నరః॥ అసవప్రకరణము.

పై సంస్కృతమునకు తెలుగు

౧ వ॥ అమరారామమునుండి క్రిందబడఁగా నత్యుగ్ర ఝంఝామాత
ద్రిమరాజంబులు సంభవింతురు జనుల్ తోరంబుగా; నైన లా
భ మదేమీ యకటా! వివేకవికలత్వం బొందునవ్వానిచే
త్సను, ఢిల్లీనరనాథ బంధుర్లై తెలమిన్ పైనాత్మకుంచరద్యోతనన్॥

౨ శా॥ పాలింపంగదరా ధరావలయమున్ భానూ! ననుం జేసెన
న్నాళీకాసనుఁ డేస్తు నిర్దయతఁ జంద్రత్వాక్రజ్వాల; ను
ద్వేలాటోపతి రక్తనేతుఁ డగుచుం ఢిల్లీక్షమావల్లభుం
డాలంపుందని బైలుడేటు నను టీవాలింప వేమో కటా॥

౩ శా॥ మాహాత్మ్యంబున కెల్లఁ; లోఁతునకు ధామంబున్, బిన్నర్నసం
దోహంబంతకు; మాన్యశౌండు జగమందుం గ్లినే యున్నఁడం
చూహం జేయుము దుర్మదాంధుఁ డవు గాకా క్షీరవారాశీ; ది
ల్లీహంపీరవలెంస మున్నెట్లు భవల్లీలన్ బ్రిపద్ధిల్లెడున్॥

౪ క॥ ఢిల్లీవల్లభుఁడును విధి యెల్లపు మన్యోన్య మతి విహితమంత్రిత వ

ర్తిల్లును సుముఖత విముఖత । యిల్లోకులలోన వహింతు రిద్దఱు గూడన్

౫ గ॥ మూర్తిమంతంబగు నవాబాసఫు ఖానుమనః ప్రసాదంబు నాఁ జనువాఁడు, ద్విజకుల సేవాహేవాకి వాఙ్మయకాయుండు, మాధురకులసముద్రిందు, రాయముకుందుండానతియ, సార్వభౌమశ్రీశహాజహాంప్రసాదాధిగతపండితరాజపదవీవిరాజితుండు త్రైలింగకులావతంసుండునగు పండితజగన్నాథుచే నాసఫవిలాసాఖ్య మీయాఖ్యాయిక నిర్మింపంబడియెను.

౬ ఉ॥ జన్నిది మేల నల్లనిడెఁ జాలె? వషీయులె; నేఁడఁ గట్టెఁ? జెం
తన్నులకన్నెతోయమునఁ; దజ్జలమం దెటుకజ్జలాప్తిఁ? దు
ష్యన్నుతనూరసీనరపాలరిపుక్షితిపాంగనాళివా
ల్గన్నులఁ గాటుకనీరు పెనుగాలువలై ప్రవహించి కూడుటన్॥

౭ శా॥ ఖ్యాతోర్వీశ! శహాబుదీన! గుణసంపూర్ణంబుగాన్ బోల ని
న్నేతద్భూతభవప్రపంచమున లేఁ డెవ్వండు వాఁ డెవ్వనే
లా? తా నూతనకారణంబుల నవంబౌ సృష్టి భావించినన్
ధాత్రిం దప్పఁడు నైతముండఁడు సుమీ త్వత్తుల్యుఁ డెవ్వం డెటన్॥

“నూరుద్దీన్ మహమ్మదుజహాంగీర్”, “శహాబుద్దీన్ మహమ్మదుషాజహాన్”, అనునవి వరుసగా జహాంగీరునకును షాజహానునకును బూర్ణనామములు. ప్రస్తుతము దాహాకిం మాటకు దొరకలేదుగాని పండితరాజు షాజహానుననుంగుఁబెద్దకుమారుఁడగుదారాషుకోనుబొగడుచు జగదాభరణమను చిన్నకావ్యమొకటి రచియించియున్నాఁడు. ఈగ్రంథమును గూడఁగలిపి యీ పూర్వోదాహృతసంస్కృతగద్యపద్యములలోని యంశములు నాలోచించినపక్షమునఁ బండితరాజు జంహాంగీరుషాజహానుదారా లనుముత్తరముల వారిపొత్తుగలిగి వారిమెప్పులకుఁ బాత్రుఁడయినట్లు కనుపట్టునుగదా!

షాజహాను తనతండ్రి చనిపోయినతరువాత ననఁగాఁ గ్రీ-శ- ౧౬౨౮ సం॥ సింహాసనమునకు వచ్చినవాఁడగుటచే, జహాంగీరును గూడ సేవించియున్నట్లు కనఁబడు నీ పండితుఁ డంతకు మును పదినిమిదియేండ్లక్రిందట నయిన నక్కడఁ జేరియున్నట్లు మనము దలంపవలెను. తదాస్థానమునఁ బండితుఁడుగాఁ జేరునప్పటికిఁ బండితరాజునకుఁ గనీసము ౩౦ ది యేండ్లప్రాయమయిన నుండకపోదుగాన షాజహాను సింహాసనమునకు వచ్చునప్పటికే యీకవికిం ఇంచుమించుగ ౫౦ ది సంవత్సరములు వయస్సుండవచ్చును. షాజ

హాను రాజ్యము చేసినది ౩౦ ది సంవత్సరములు. ఆకాలమంతయు నీయన తదాస్థానమందుండి, యౌరంగజేబు (షాజహానుని తృతీయపుత్రుఁడు) తనతండ్రిని జెఱపెట్టిన కాలముననో యన్నయగుదారాను సంహరించిన కాలముననో తన్నాదరించుమంచిప్రభువు లేక పోవుటచేత వార్ధకమున మథురయందు గోవింద సన్నిధానమున దినములు వెళ్ళఁబుచ్చి యుండును. రసగంగాధరము చేసిన కాలము షాజహానుని ప్రభుత్వమధ్యమునందలిదే కావచ్చును. గావునఁ దద్గ్రంథముకంటెఁ బూర్వపుదియగు గంగాలహరి రచియించునప్పుటికిఁ బండితరాజు ముసలి యయి యుండఁడుగాని "ముగిసెఁ బ్రాయము మృత్యువు మొగిసె" నిత్యాద్యర్థమిచ్చు శ్లోకమునుబట్టి చూడఁగాఁ "గాశ్యాంతు మరణాన్ముక్తిః" యను వచనము ననుసరించి యవసానమునకు నతఁడు వారణాసిఁ బ్రవేశించి యుండునేమో యనియుఁ దోఁచుచున్నది. పండితరాజు జహాంగీరునికడపటి కాలమునఁ దదాస్థానమునఁ జేరియుండునను కొన్నను దత్పుత్రుఁడగు షాజహాను రాజ్యాంతమునప్పటి కాయన కనిమిదవపది సమీపించి యుండవలసివచ్చును. ఇట్టిస్థితిలో షాజహాను పితామహుఁడగు నక్బరు చక్రవర్తికడ నీయన పండితుఁడుగా నుండెననుమాట యెట్లుపొసఁగును? భామి.శాం. ౪౪ శ్లోకమునందు "దిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః" యని తన యౌవనప్రాయమును దిల్లీశ్వరుని కిచ్చినట్లు కంఠోక్తిని జెప్పుచున్నాఁడు. ఈదిల్లీశ్వరుఁడక్బరుచక్రవర్తియేయైన యతనిపాణియందే పరిపూర్ణసకలశాస్త్రపాండిత్యాతిశయ సంపాదనాంతర మీయననవీనప్రాయం బీయనచేత నీతమయిన పక్షమునందు నక్బరుమీఁదఁ బండితరాజు చెప్పిన శ్లోక మొక్కటియేని లేక పోవుటయు షాజహాను మీఁదఁ జెప్పిన వనేకము లుండుటయుఁ గైగా నీకడపటిచక్రవర్తిచేతనే యతనికిఁ బండితరాజబిరుద మీయఁబడుటయు నెట్లు సంభవించును? పూర్వోక్తప్రకారమున ముత్తరముల చక్రవర్తి సంఖ్యలమీఁదనే కాక షాజహానున కేలాగుననో సంబంధముగలసిసవాఁడగు ఆసఫఖానుమీఁదఁగూడ నొకయాఖ్యాయిక పండితరాజు రచియించినట్లు చదివియుంటిమిగదా! అక్బరుకాలమున నీపండితుఁడున్నయెడల నాయన వర్ణన మీయన చేయుచుండుట సర్వథా యసంభవము. కాఁబట్టి రసగంగాధరమునందుండి పైనుదాహరించిన ౧,౨ ౩,౪, శ్లోకములలోఁ జెప్పఁబడిన దిల్లీవల్లభుఁడు నిశ్చయముగా షాజహానే కాని వేఱొకరు కారు. తత్కారణమునఁ బండిత జగన్నాథునిమహోచ్ఛదశ క్రీ॥శ ౧౬౨౦ మొదలుకొని ౧౬౬౦ సం॥ వఱకు నైయుండవచ్చును.

జగన్నాథపండితుని తండ్రిగారిపేరు పేరుభట్టనియుఁ దల్లిపేరు లక్ష్మియనియు నీయన తెలుఁగునాఁటివాఁడనియు సకలశాస్త్రపారంగుఁడగు జనకునియొద్దనే విద్యలన్నియు నభ్యసించెననియు నీ క్రిందిశ్లోకముల వలనఁ దెలియవచ్చెడును.

౧ శ్లో॥ తైలింగాన్వయమంగళాలయమహాలక్ష్మీదయాలాలితః
శ్రీమత్పేరమభట్టసూనురనిశం విద్వల్లలాటంతపః
సంతుష్టః కమఠాధిపస్య కవితామాకర్ణ్య తద్వర్ణనం
శ్రీమత్పండితరాజపండితజగన్నాథో వ్యధాసీదిదమ్ ॥ ప్రాణాభరణము ౫౨

౨ శ్లో॥ పాషాణాదపి పీయూషం స్యందతే యస్యలీలయా
తం వందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాంతం మహాగురుమ్॥ ర. ౧౦. పీఠిక.

3 శ్లో॥ శ్రీమజ్జ్ఞానేంద్రభిక్షోరధిగతసకలబ్రహ్మవిద్యాప్రపంచః
కాణాదీరాక్షపాదీరపి గహనగిరో యో మహేంద్రాదవేదీత్
దేవాదేవాధ్యగీష్ట స్మరహరనగరే శాసనం జైమినీయం
శేషాంకప్రాప్తశేషామలభణితిరభూత్సర్వవిద్యాధరో యః॥ ర గం. పీఠిక

వీనికిఁ దెలుఁగు.

౧ మ॥ స్రుతలక్ష్మీకరుణోపలాలితుఁడుఁ బేరుంభట్టసూనుండుఁ బం
డితరాజాంకుఁడుఁ ద్రిలింగకులుఁడౌ విద్వల్లలాటంతపుం
డతితుష్టిన్ గని కామరూపవిభుని న్యంచత్కవిత్వంబుఁ, ద
త్ప్రతి వర్ణింపు మదుఁ జేసెఁ బండితజగన్నాథుండు దా నీకృతిన్ ॥

౨ క॥ పాషాణమునుండియుఁ బీ । యూషము స్రవియించు నే మహాగ్రిమలీలన్,
భూషించుము నా లక్ష్మీ । యోషావిభుఁ బేరుభట్టు నొజ్జను దలుతున్ ॥

3 మ॥ గ్రహియించెన్ సతబ్రహ్మవిద్య విమలజ్ఞానేంద్రయోగీంద్రుచే,
గహనంబైన కణాదగౌతములవాక్యంబుల్ మహేంద్రాగ్నిచే,
మిహి కాశీపురి ఖండదేవువలనన్ మీమాంస, శేషాంకుచే
నహిరాడ్భాష్యముఁ; బేరుభట్టఖిలవిద్యాశాలి సామాన్యుఁడే ॥

మఱియు జగన్నాథపండితుఁడు రాజమహేంద్రవరమండల నివాసి యని తద్వంశ్యుఁడగు నొక కాశీపండితుఁడు వ్రాసియున్నాఁడు. పండితరాజు తండ్రి పేరుభట్టు గదా! అన్యదేశీయున కట్టిపేరు సాధారణముగా నుండ నేరదు. కాఁబట్టి యా కాశీపండితుఁడు వ్రాసినమాట నిజమే కావచ్చును. జగన్నాథపండిత విరచితములగు గ్రంథములనుగుఱించి కూడఁ గొంచెము వివరించి యీపీఠిక ముగించుచున్నాను.

ఈయన గంగను, యమునను, లక్ష్మిని, విష్ణువును, సూర్యునిస్తోత్రము చేయు చు వరుసగా, ౫౩, ౧౦, ౪౧, ౯౦, ౩౦ శ్లోకములుగల పీయూషలహరి, యమృతలహరి, లక్ష్మీలహరి, కరుణాలహరి, సుధాలహరియని పంచలహరులను రచియించినాఁడు. వీని లోఁబీయూషలహరిని గంగాలహరియని సాధారణముగా వ్యవహరింతురు. సుధాలహరి యనునది మయూరకవిరచిత సూర్యశతకమువలె స్రగ్ధరావృత్తములు గలిగి యున్నది.

రసగంగాధరము. ఇదియొకయలంకారశాస్త్రము. జగన్నాథపండితుఁడు రచి యించినగ్రంథములం దన్నిట నిది యుత్తమము. సరస సాహిత్యసంపాదనాభిలాషుల కి ది యవశ్యపఠనీయము. మనీషులు దీనిని గవి కల్పకమని సన్నుతింతురు.

మనోరమాకుచమర్దన. ఇది భట్టోజీదీక్షితుఁడు సిద్ధాంతకౌముదికిఁ జేసిన మనోర మ యనువ్యాఖ్యమీఁద ఖండనగ్రంథము.

అశ్వధాటి. ఇది రామానుజునిప్రార్థనముచే గవి రచియించిన ట్లీక్రిందిశ్లోకమువ లనఁ దెలియవచ్చు చున్నది. శ్లో॥ రామానుజః స్వపౌత్రస్య కామనాపూరణోత్సుకః అశ్వధాటీం జగన్నాథో విశ్వవ్యాప్యాద్యా మకీరచత్ ॥ ఇది యమకప్రధానము లగు ౨౫ శ్లోకములు గల బహుదేవతాస్తవ గ్రంథము. అశ్వధాటీవృత్తములనుబట్టి దీనికా పేరుపె ట్టఁబడినది.

ప్రాణాభరణము. ఇదికామరూపదేశాధీశ్వరుఁ డైన ప్రాణనారాయణుని పరాక్ర మాదులను వర్ణించుచు రచియించిన చిన్నగ్రంథము. ఇందలిశ్లోక మొకటి యీవిజులోఁదె లుఁగుపద్యముతోఁగూడ నీపీఠికలోనే వ్రాయఁబడియున్నది. అది చదివిచూడఁగా నీగ్రం థముఁ గామరూపాధిపునికవిత్వమున కలరి పండితరాజు రచియించినట్లు గోచరించెడును. ఈగ్రంథమందలి మొదలిశ్లోకము భామినీవిలాసమందలి ౪౭ శ్లోకము నొక్కటిగానున్నవి.

జగదాభరణము. ఇది షాజహానుజ్యేష్ఠపుత్రుఁ డగుదారాషుకోను వర్ణించుచుఁ గవి రచియించినది. దారా సంస్కృతభాషాపోషకుఁ డగుట సుప్రసిద్ధము.

ఆసఫవిలాసము. ఇది కేవలగద్యకావ్యము. కవి దీని నాసఫఖానను నబాబునుగూ ర్చిరచియించినాఁడు. ఈసంగతి స్పష్టపఱుచునొక వాక్యము తద్గ్రంథపీఠికలోని దని యింతకుఁబూర్వ మీపీఠికలోనే యుదాహరింపఁబడియున్నది.

భామినీవిలాసము. ఇది భర్తృహరివిరచితమైన సుభాషితరత్నావళివంటిది. ఇం దు నానారసప్రధానములయిన మనోజ్ఞశ్లోకములు గలవు. జగన్నాథపండితుఁడు తన ర సగంగాధరములో లక్ష్యములుగా నుదాహరించుకొనుట కీగ్రంథము రచియించినాఁడ నియు, గంగాలహరీప్రముఖనిజగ్రంథములలో దొరకనిలక్ష్యముల నిందుండి గ్రహించు చు వచ్చెననియుఁ జెప్పుదురు. రచనాకారణము నెవరేమి చెప్పినను గ్రంథముమాత్రము

సరస మైనది ఇందలి శ్లోకము లలంకారాదులకు లక్ష్యములుగావున వీనిని జదువుటవలనఁ దత్తద్విషయములు స్ఫురణకు వచ్చుచుండును.

ఇదిగాక చిత్రమీమాంసాఖండనము మొదలుగాఁగలబహుగ్రంథము లీపండితరాజు రచియించెనని చెప్పుదురు. వసుమతీపరిణయము రతిమన్మథము ననురెండు నాటకములు గలవు వానినిరచియించిన కవి జగన్నాథుఁడని యందున్నదిగాని యాజగన్నాథుఁడీజగన్నాథుఁడు గాఁడని నిశ్చయముగాఁ దలంపవచ్చును. ఆనాటక ప్రస్తావనలయందుఁ గవి తండ్రిపేరు బాలకృష్ణుఁడని యుండుటయేకాక విశేషించి వసుమతీపరిణయమందుఁ దన్నాటకమప్పుడు రాజ్యముచేయుచున్న పేష్వాబాలాజీబాజీరాయనియాజ్ఞచొప్పున రచియించినట్లు చెప్పఁబడినది. ఇందువలన నీనాటకద్వయకర్తయగు జగన్నాథుఁడు బాలాజీ బాజీరాయని కాలమందనఁగా 18 వ శతాబ్దము నడుమ నున్నవాఁడని తేలుచున్నది. భామినీవిలాసకర్త 17 వ శతాబ్దము నడిమివాఁడనియు నతని తండ్రిపేరు పేరుభట్టనియుఁ బూర్వమే తెలుపఁబడెను గదా!

భామినీవిలాసమందలి కడపటిపద్యములవలన జగన్నాథపండితుఁ డాత్మస్తుతిపరాయణుఁడని స్థూలదృష్టిని దోఁచునుగాని సూక్ష్మదృష్టి నాలోచించినచో సర్వశాస్త్రపారంగత ప్రజ్ఞగల యావిద్వాంసునకట్టి యుక్తులు స్వభావోక్తిగావని తోఁచనే స్ఫురియింపకపోదు. పండితరాజు తనకవనమందుఁ బ్రసాదము సాధారణగుణమని యీక్రిందివాక్యములవలనఁ జెప్పియున్నాఁడు. "శ్రుతమాత్రా వాక్యార్థం కరతలబదరమివ నివేదయంతీ ఘటనా ప్రసాదస్య. అయంచ సర్వసాధారణో గుణః, ఉదాహరణాన్యత్ర ప్రాయశో మదీయాని సర్వాణిపద్యాని." ర. గం - ఆననము ౧. ఇట్టికవనమును సరిగఁ దెలిఁగించుట యావశ్యకమే యయినను మనీషులు గుణగ్రాహులను నమ్మికతో నేనీప్రయత్నమును జేసినాఁడను జగన్నాథపండితుని గురించి కొంతవివరముగా వ్రాయుటకై నాకు, ఎల్, ఆర్, వైద్యులనువారు ౧౮౮౭ సం॥ ప్రకటించిన సంస్కృత భామినీవిలాసములోని యాంగ్లోపీఠిక విశేషసాహాయ్యము చేసినందునఁ దత్పండితులకు నేను మిగులఁ గృతజ్ఞుఁడనగుచున్నాను.

ఎన్నఁడో నాయొద్ద నేర్చుకొన్నదో కొంచెపాటి తెలుఁగునకై సదా నాయెడల గురుభావము వహించి యీగ్రంథము ముద్రితప్రతి గయికొనకయే యచ్చొత్తించిన దేశోపకారి పత్రికాధిపతి నల్లిరాజు సీతారామయ్య ప్రధానునిఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యాది సంపన్నునిఁ జేయుఁగాక యని కోరుచున్నాఁడను.

రాజమహేంద్రవరము.
1902 సం॥ డిసెంబరు.

వడ్డాదిసుబ్బారాయుఁడు.

## అవతారిక.

---

సతీస్మృతి యనఁగాఁ బతివ్రతను గూర్చిన స్మరణము. వేణీసంహారాద్యాంధ్ర గ్రంథకర్త యయిన వడ్డాది సుబ్బారాయకవి తనభార్య యగు నన్నపూర్ణాసతిచరమకాలమునఁ దజ్ఞాపకముగా దీనిని రచియించినాఁడు. పండితరాయఁడనుబిరుదునామముతోఁ బూర్వము షాజహా నను డిల్లీచక్రవర్తి యాస్థానమున విద్వాంసుఁడుగా నుండిన జగన్నాథకవి సంస్కృతమున రచియించినభామినీవిలాసమనుచతుర్విలాసగర్భిత మయిన గ్రంథముఁ దానాంధ్రీకరించినందునఁ దద్గ్రంథమందలి తృతీయముకరుణవిలాసము జగన్నాథపండితుని ధర్మపత్నియగుకామేశ్వరి మరణమును స్మరింపఁ జేయునది యగుటచేత విషయసాదృశ్యమును బట్టి కవిచే నీగ్రంథము భామినీవిలాసకరుణవిలాసమున కనుబంధము కావింపఁబడినది. ఇందు మొదటినుండి నలుబదియేడు పద్యములు కేవలము కవి విలాపమును దెలుపునవి యయినను దత్తదవస్థాభేదమును బట్టి యవి ప్రథమ ద్వితీయ తృతీయ తురీయ విలాసములని నాలుగు భాగములు చేయఁబడియున్నవి.

భార్య లంకణములు చేయుచున్న పిడుగు సమాచారము దెలుపు నొకయుత్తరము నరసాపురము సమీపమున వసిష్ఠాతీరమం దొకపల్లెయయిన కలగముపూడి పోలవర మనుతన యత్తవారియూరనుండి రాఁగాఁ దత్క్షణమే కవి యచ్చటికిఁ బోయి, నాఁటి కేడులంకణములయితెన్నానవాలు పట్టుపాటి తెలివి యయినను లేక సంధిచే నేమేమో కలవరించుచున్న ప్రియురాలిని జూచి, యింక జీవింప దనుధైర్యముతో, నామె సప్రాణయయియుండఁగా శోకించుట ప్రథమభాగమును, మృతసతికి దహనసంస్కార మాదినముననే జరిగినను సంచయనకర్మనిమిత్తము తత్పోలవరగ్రామమునఁ గవి మఱి నాలుగు దినము లాఁగవలసి వచ్చినందునఁ బ్రాణోత్క్రమణానంతర మాయూర దారుణ జరిగించినకర్మములను నామెవిలాసాదులను దలంచుకొని దుఃఖించుట ద్వితీయభాగమును దద్గ్రామము నుండి రాజమహేంద్రవరమువచ్చి నిజగృహమున మృతసతీప్రతిచ్ఛంద దర్శనాదులవలన మనోవైకల్యముగలిగి బహువిధముల విలపించుట తృతీయభాగమును, స్త్రీదక్షతలేమి మొదలుగాఁగల పలుకారణములవలన రాజమహేంద్రవరమున జరపవలసి ప

డక, కవి తనకుమారుని (తృతీయకళత్రసంజాతుని) మాతామహస్థానమయి నలువదిరెండు మయిళ్ళదూరమున నెల్లూరికాలువపరినున్న సుప్రసిద్ధమగు నుంగుటూరుగ్రామమునకు బోయి నిజజాయ కక్కడఁ బారలౌకికక్రియలు నిర్వర్తించుచు నార్తిఁబొందుట చతుర్థ భాగమును దెలియఁజేయుచున్నవి.

తురీయకళత్రవియోగము ప్రాప్తమయినప్పుడనఁగా నైదేండ్లక్రిందటి దుర్ముఖి సంత్సర శ్రావణమాసమున సీయన్నపూర్ణాసతియక్కగారగు సుబ్బలక్ష్మియను కళత్రము కాలము చేసినప్పుడామెను స్మరించుచు నీకవిసతీస్మృతియను పేరితోఁ గొన్నిపద్యములువ్రాసి యందు ద్వితీయకళత్రములపద్యములుకూడఁ జేర్చి యచ్చొత్తించెను. కాని దీనింబోలె దానిని గరుణ విలాసానుబంధమని పేర్కొనలేదు. ఈకవి భామినీ విలాసము నప్పటికే కొంతవఱకుఁ దెలిగించియుండెను. అయినను గరుణవిలాసములోని విషయమిట్టిదని నాఁటికిఁజూచియుండలేదు. ఇటీవల నయ్యంశము దెలియ నయినందున బూర్వకాలమునఁగూడఁ గళత్రవియోగవిషయమునఁ గవులిట్లు గ్రంథరచనసేయు నాచారము గలదని సూచించుట కిదిదానికనుబంధమొనర్చినాఁడు. ఇయ్యనుబంధగ్రంథమునందలి పద్యములలోని భావములు గొన్నిచోట్ల గూఢములుగా నున్నవి. పవిత్రమయినచరిత్రము గలిగి బహిఃప్రాణమయిన భార్య పరలోకమున కేగినప్పుడు కవియగుభర్త యామె పేరు శాశ్వతము గావించుటకుఁ జేయవలసిన దింతకన్న వేఱుకార్యము లేదు.

వసురాయకవి మున్నొకసారి తురీయకళత్ర వియోగ సాగరమం దీఁదులాడుతఱిఁ బరామర్శించుచు నొక మిత్రుఁడు వ్రాసి ప్రకటించుటకు నాయొద్దకుఁ బంపిన పద్యమొకటి యీక్రిందఁ బొందుపఱుచుచున్నాను

చం॥ వరకవితాలతాంగి నవపద్యములిచ్చి గవగూడి రేపగల్
చిరతరసౌఖ్యకీర్తులను జెందుచుఁ దన్మొక రీతిఁజూడనీ ।
సురుచిరగాత్రలందఱది చూచి సహింపఁగలేక గాదెదు ।
ర్భరతరచింతతోడ నెడఁబాసిరి మిమ్ములనిట్లు మిత్రమా ॥

ఏలూరు.
ది 10 ఫిబ్రేవరు 1903. } సత్తిరాజు సీతారామయ్య

శుభమస్తు.

# భామినీవిలాసము.

## ఇష్టదేవతాప్రశంసనాదికము.

క॥ శ్రీకళ్యాణగుణాకరు । లోకైకాధారు సకలలోకారాధ్యున్।
శోకహరుం గరుణామయుఁ । బ్రాకటకైవల్యాసుం బరాత్పరుఁ గొలుతున్॥ ౧.
క॥ వినయవివేకాదుల భూ । జనులమది న్నాటుకావ్యసంతతి గలిగిం।
పను నిర్మితంబు లగుచే । తనవిద్యాయంత్రములను దలఁతు సుకవులన్॥ ౨.
క॥ పండితరాజు జగన్నా । థుం డమరోక్తుల రచించెఁ దొల్లిట ఢిల్లీ।
శుం డైనషాజహానుని । నిండుసభం బొలిచి భామినీవిలసనమున్॥ ౩.
క॥ రాజమహేంద్రాఖ్యపురీ । భ్రాజితబోధాభ్యసనకళాశాలఁ దెలుం।
గోజ వసురాయఁ డాకృతి । రాజము నాంధ్రీకరించు రసికుల కెక్కన్॥ ౪.

## భామినీవిలాసము—ప్రాస్తావికవిలాసము.

క॥ శ్రీమన్మాధుర్యపరమ । సీమను సారస్వతోరుసింధుమథనజన్।
మామకమృదుకవితాసుధ। నీమహిలోఁ గ్రోలువారి కెసఁగు సుఖంబుల్॥ ౧
చ॥ మదమలినార్ద్రగండగజమండలి యుండదు దిగంతమందు; లోఁ।
గదిరెడు జాలి హస్తినులఁ గన్న; మృగంబు లతుల్యకక్ష్యముల్।
గద; యిపు డీజగంబున నిఁకన్ స్వకఠోరనఖాగ్రపాండితిన్।
విదితముగా మృగాధిపుఁడు వేనిపయిం బ్రకటీకరించెడున్?॥ ౨.
ఉ. మానససారసాకరముమధ్యమునన్ జలజస్థలస్థధూ।
శీనుతసౌరభాంబువుల లీలగఁ గాలము వెళ్ళఁబుచ్చునీ।
మానితపుష్కరాళి మిట మండుకమండలసంకులోదకం।
బైనసపంకపల్వలమునం దెటు నిల్వఁగ నేర్చుఁ జెప్పుమా॥ ౩.
ఉ॥ చూడఁ జకోరు లేఁకరినచూపులఁ దూరుపువైపు, గల్వలు।
న్వీడుచు నుండ మానమును, విగ్గాను చుండ మరుండు, నూహసిం।
బాడఁగఁ జూచుచుండ నభిమానవతీజనమాన మిట్టిచోఁ,।
గూడునె భాత చందురునకున్ ఘటియింప ఘనాపరోధమున్?॥ ౪
చ॥ తొరగెడునీమరందమును ద్రుమ్మలు ద్రుల్లఁగ నెప్ప డానుచున్,।

స్ఫురదరవిందమా! దరిని సొంపుగఁ దుస్స్వద తేమొ పాడెదం!;
బరమహితుం డనంగఁ బవమానుఁడె సుమ్మొకకోర్కె లేక నీ
బరిమళముల్ నిరంతరముఁ బర్వఁగ జేసెడు సర్వదిక్కులన్॥ ౫.
క॥ ఏతెంచెను దైవికముగ । నీతుస్స్వద యిటకు నక్కటే కుటజంబా;
చాతిగ మకరందము గల । వాతామరపూలు దీని నొదలఁ బూనన్॥ ౬.
తే,గీ॥ తేఁటికూటువతో నొండు దీయమావి । మొక విలసిల్లునందాఁకఁ గోకిలంబ!
వెడలఁ బుచ్చుము నీ వెటో, విరస మైన । వాసనము లివి, కానవాఘ్యంబరమున॥ ౭.
క॥ బకము లవివేకములు; దలఁ । పకు నీ కవి నలుపుపరిధానము లిల జైవా!
తృకములు గావుతఁ గమలిని!। మకరందసుధారసైకమూర్తికము లసల్॥ ౮.
తే,గీ॥అయ్యయో! నేను గడునీచమైతి ననుచుఁ। గూపమా! యెప్పుడును నీవు గుందఁబోకు?
సరసహృదయంబ వగుచును బమలగుణము । లెల్ల కాలము నీవు గ్రహింతు గాదె?॥ ౯.
క॥ విరివిగ మకరందము గల । విరవన్నిని వాసనములు వెదలించినను
భర మిప్పుడు కటకట! యె। క్కరణిని కుటజంబుచెంతఁ గడపునొ దినముల్?॥ ౧౦.
క॥ హరిచందనమా! యెవ్వని । గిరలకు గోచరము తాపకీనమహిమ? యీ
గరళంబు గ్రోయుచిలునలఁ। బరిమళములు బుగులుకొలిపి భరియింతువుగా॥ ౧౧
క॥ పాటీరమ! తానకపరి । పాటిని చాటింపఁ గలద పాటన మొదనం
దోటిల్ల కొరయునరులకుఁ। బాటు వాటిచి పెంచె పయ్యెఁ బరిమళ మిదా వే?॥ ౧౨.
ఆ,వె॥పాలు నీరు నేఱుపఱుచుటలోన రా। యంచ! నీవ యాలసించితేని
లోకమందు నెవ్వఁడో కులవ్రత మింకఁ। బాలనంబు సేయువాఁడు నేఁడు?॥ ౧౩.
ఆ,వె॥పైకి గత్తివాతిపగిదిని, జెనుచొప్పి మఁ। బాములట్లు కూర్రభంగిఁ దోఁచి,
లోన గోస్తనీసమానులై సలుపెడు। వారుఁ గొంద ఱుఁడ్రి వసుధయందు॥ ౧౪.
ఉ॥ పానము సేయు చెప్పుడు భవ స్మకరందరసంబు స్వేచ్ఛనై
గానము సేయుఁగాక గమకంబుగఁ దెంగటఁ బడరికమల్,
నీనిరవద్యసౌరభము నిచ్చలు సర్వదిగంతరంబులన్ ।
మానితిభంగి నింపఁ బవమానుఁడె సుమ్ము ప్రసీదఁ బద్మినీ!॥ ౧౫.

చ॥ కొలకొల మంచు నెల్ల పులుఁగుల్ దివి నేగును, దీయమావిమో౹
గ్గలగమి జుమ్మజుమ్మనుచు గండుటళుల్ వెస మూఁగు, నీవు కో౹
పిలఁగఁ; గొలంక! యిం కెవరిఁ జేరు ని దింపెన తీఱుఁగా కయో౹
కలుకు మునుం గదా వసను, గాంచిన నీయలిదీనమీనముల్॥ ౧౭.

క॥ తుమ్మెదవలె సౌరభలో౹ భమ్మున నిన్నుఁ జేరె ననుచు భావింపకు మీ౹
తెమ్మెరను; లోకహితముగఁ౹ దమ్మీ! యితఁ డిర్గియగు నుదారుం డయ్యెన్॥ ౧౮.

క॥ మానముఁ బూనకు మాలతి! ౹ మానుగ గుంతిరదు సలుపుమగుకరగు నెదన్; ౹
దానకళాగురువులు సం౹ తానలతన్ను లెల్ల దీనిఁ దమాలఁ దాల్చున్॥ ౧౯.

ఆ॥వె॥ సకలగుణము లున్న, సాగుసేస్యతె లేక ౹ పోరు, చేస్వాదిస్వాదులకతమున౹
వానిని స్వహింతు, పాటీర! తాపకా ౹ న్నర్వ్య మహహ! యేమనంగ వచ్చు?॥ ౨౦.

క॥ గహనము సకలము వెదకెను; ౹ బహువిధముల భ్రమరకు లన్ని పరికించె; నొహో౹
సహకార! యొక్కడను మధు౹ లిహము ధనత్వము గాంచ లే దీజగతిన్॥ ౨౧.

క॥ కలపూలతావి, దనకడఁ౹ దలపెట్టఁగ నాని దేవతరుకుసుమము పై౹
నిలిపి పద మొందు విరి పొం౹ తల పోఁ దలపోయ నేని, ధన్యుఁడవె యళీ॥ ౨౨.

క॥ పావనివి వింధ్యసంభవ ౹ వోవాహిని! యివురుచున్న నుచితమె యిది? లో౹
భావించి చూడు లెస్సగ;౹ నీవీగులకలుష,బలము లీవు గ్రహింతే?॥ ౨౩.

క॥ పండులుఁ బత్రంబులుఁ, బూ ౹ లుండును దెన్నండు లే దయో! బర్బురమా!౹
ముండుల నెప్పుడు నిండుక ౹ యుండెదు; నిన్నెవరు గోరి యుపసర్పింతుర్?॥ ౨౪

క॥ ఈకానను, గోకిలమా! ౹ యేకాకివి; కం మెత్త కట్టె మనుమా;౹
కాకు లివి నిర్దయంబులు ౹ నీ కెగ్గొనరింప కుండు నిజముల మనుమా॥ ౨౫.

క॥ స్ఫురితతరువిసరసుషమా ౹ పరిహారక మఖిలజంతుబాధాకర మీ౹
యురుతుహినము, నేగొనమున ౹ భరియించెద వెపుడు విడక పాన్వాదిజనకా॥ ౨౬.

క॥ నీమొద్దను చేతెంచిన ౹ యీయళికి నవజ్ఞ సేయ కేమఁగుగున్నా!౹
నేయమ్మున దాన స్తన ౹ నియమ్ములు కరులు, దీని నెత్తిని బూనున్॥ ౨౭.

క॥ దేవతరుకుసుమసౌరభ ౹ సేవం గోరికలు దీతి చెలఁగెడునళిన్౹
బూ వన్య మైనదానిని ౹ సేవించుట కేవలంబుఁ జిట్టకము గదా॥ ౨౮.

క॥ గాలించె నెల్ల భ్రమరకుల ౹ నాలించెను గోకిలముల నడిగి రసాలా!౹
పోలింప నీకుఁ జాలిన ౹ దీలోకములోనఁ గాన విందిందిరముల్॥ ౨౯.

చ॥ నెనరున నోయిమాలకరి! నీ వుదు కెంపల మండువేసఁగిం౹
గనుఁగొని కొంతెపాటి యుదకంబు నొసంగి యొనర్చుప్రీతి యీ౹

ననిచిన మొక్కకెల్ల భువనంబును జల్లుల ముంచుమేఘునా।
ఘన మయినన్ యథార్థముగఁ గల్గఁగఁ జేయ నశక్యమాఁ జామీ॥ ౩౦.

ఉ॥ వెంగలి తోఁటవాఁడు? పృథివిం గలతేమ హరించిపోయె; వా।
త్యం గడు కావిరుల్ గవిసె నాశల; నెండలు మెండు లయ్యె; సం।
పంగియ కీమరుస్థలి నపాయకరంబులె యన్ని; యిట్టు ల।
య్యుం గమలాసనుం డెచట నుండియొ నిన్ననిచెం బయోముచా!॥ ౩౧.

ఉ॥ ఏకడ దానవార్భ్రిమ దనేకమిళింపము లేనికల్ భయో।
ద్రేకవిలోలలోచనత దేహబలం బఱు, మౌక్తికవ్రజం।
బేకడఁ బొర్లుచుండెడు, మృగేంద్రుఁడు దాఁ బరలోకమేగ, నా।
హ్వాకిట నిత్తటిన్ శివ శివా! చెవి సోఁకు శివావిరావముల్॥ ౩౨.

ఉ॥ మాకరి ద్రుమాఁకు లన్నిటి సమానపుఁ బ్రేమునె పెంచెఁగాని, ప్ర।
త్యేకముఁ జూపఁ డీపొగడ కెక్కువయిక్కటికంబు; నైన ని।
ష్మోక క్రమప్రవృద్ధ మయి పూచి, నితాంతలతాంతసౌరభో।
త్సేకముచే దెస ల్పూనరిచెన్ మధుపారవపూరితంబుగన్॥ ౩౩.

చ॥ వలమ మొదల్కొడుం; దిటము పోఁతు, పటీష్టము లెల్ల కొమ్ములున్;।
నెల వొరు లెక్కరానివల; నీ కిఁక నేబెగ డోనగాధిపా!।
పెలుకుటఁ బుట్టునైన వెలివేఁకి యొకం డెదనెంచ; నిర్ఘృణుం।
డొలసెడు భుగ్నకీలల మహోగ్రజవాంసఘనాస్త్రయం డహో॥ ౩౪.

ఉ॥ వేసఁగి వేళ వేవెలుఁగు వేఁడివెలుంగుల వేఁగి, దీర్ఘ్యసు।
ల్పాసరము ల్పినున్ మదిఁ దలంచుచు నెట్టకొ నెట్టి, నెట్టకేఁ।
జేసినలోంటి పున్నెముసఁ జేసి కనంబడి నేఁడు? నీరదా!।
గాసిలు చాతకంబుఁ గరకంబుల మొత్తను జిత్తగింతువే?॥ ౩౫.

చ॥ దరికొని కారుచిచ్చు మిను దాఁకెడు మంటల నేర్పుటం, గటా।
పెరసినతీవియ ల్పడలి బిట్టుగ మాఁడుచుఁ జెట్టు లుండ, నీ।
సిరిగరువంబిదేటిది? వచింపుము నీలపయోద! సర్వదా।
గురిసెదు కొండకొమ్ములనె కుండల ముంచిన లాగు సోనలన్॥ ౩౬.

[illegible] తెరువరి! వెఱవకు! దారి నితని పరుషగర్జితము చెవి సోఁకన్;।
[illegible] ద్రిపారణ। కారణజలదాత యితఁడు ఘనుఁడని వినవో?॥ ౩౭.

ఉ॥ సౌరభమా జగన్నుతము; శైత్య మికం జెప్పనేమొ త్తరంబె పో;।
కీరితి దిగ్వధూనిలయశ్శీలన మైనను జందనద్రుమా!।
ఘోరవిషానలార్చులను గోటరకోటిని గ్రాయుచుండ క్రూ।
రోరగముల్ త్వదీయసుగుణోత్కర మెల్లను గ్రింగెదుం గటా॥ ౩౮.

క. కోరిక, మోమోటమి, చెలి। కారము, గూరిమియు నేది గానము; మైనన్।
ఘోర మగుభువనతాపము। దూరము గావించు చున్నతుండు ఘనుండౌరా॥ ౩౯.

ఉ॥ అచ్చపుగొల్లం బుట్టు; రవిహస్తమునన్ విడిమట్టు; లచ్చికిన్।
రచ్చవు; నాంచు వేల్పులమనంబులం దావి; మ తేంగొనంబులం।
దొచ్చెము లేదు; నచ్చిక ద్విజోత్తమహంసము నాదరించు మన్।
వచ్చిన, నింతకన్న నెఱవాసికి నెక్కుడు నీవు పద్మమా॥

ఉ॥ ప్రొద్దున కుద్ది యౌమణులు పొల్లెడు వేలను జాలటాలతో;।
నిద్దురవోవు లచ్చిదొర, నీరచరంబులతో జలంబులన్;।
బెద్దతనంపుసొంపు నవివేకము నీకడ రెండుం దోంచు; నిం।
దద్ద పయోధి! భూషణ మొనర్తునొ? దూషణముం బొనర్తునో?॥ ౪౧.

క॥ నీయీమణు లేమిటి కి। బ్భాయిత మీకాయ మేల? రత్నాకరుండా!।
వా రొండినవారలకున్। నీయొద్దను బచ్చిమంచినీ ళ్ళొదవవుగా॥ ౪౨.

ఉ॥ నీరము లిన్ని యుండంగనె నీవు తృషార్తులదప్పిదీర్పంగా।
నేరవ యేని, యొల్లెడల నిప్పుకలం గురియించుకొంచుం గా।
సారమ! మందువేసంగి వెసం జనుడే, పఱుపట్లు పట్టునాం।
గేరిపగన్ హరింపం గల వించుక లోం బరికించి చూడుమా॥ ౪౩.

క॥ కోపం బెప రాదుగదా। కూపారమ! నిన్ను నే నొకొంత దనియెద; నీ।
చాపునం గొని ఘనుం డొసంగెడు। నా పోషుము గూడం బట్టి హరియింతు పయో॥ ౪౪.

ఆ వె. వేల్పుటేటిలోం బ్రవేశించునిన్ను మే। మూంగం బోము గాని వాంగుకాన!।
యొక్కమాట విను మయుక్త మానదిమ్రోల। నీతరంగలీల నెగడం జేయు॥ ౪౫.

ఉ॥ వాసవునందనంబునను వాసికి నెక్కినయీగి మ్రాంకులన్।
వాసనం జూచి తా విడుచు ప్రొవిరులన్ దెఱగంట్లు మూరుకో,।
భాసిలు తేంటి, నిన్ను విధివక్రతం గోరంగ, లోభి వేచుం బు।
ష్పాసవ మీయ లే వహహ! యంబుజమా! నిను నేమనంగలన్?

క॥ బిసవిసరము మెసవితి సా;। రసముల సేవించి తసమరస మానితి; నీ।
వసమొ కలహంస! మరు మే।లిసు మంతయు సలిపికొసంగ నీసరసునకున్॥ ౪౭.

ఉ॥ కన్నులపండువై ననకారున దోఁచినపూవుగుత్తులం
దు న్నెఁ అపాటఁ బాడుచు, మనోజ్ఞత నీవు ఘటించినట్టి యా
చిన్ని రసాలశాఖ, విధిచెల్లుని నేఁడు కృశింప, దీని-గోఁ
దిన్నర వచ్చి వర్తిలినఁ, జేఁటి! త్వదాస్యము నీవు ముంచునే ?॥ ౪౮.

చ॥ గరునముచేత నిత్రి! కను గానక నీ విటు లేటి పెంచుకో,
సరసవిహారఖేలనము సల్పెద వీవహహంగా ; జూ దుకో,
గురునఖరప్రభిన్నకరికుంభగళద్రుధిరార్ద్రమా క్తిక
స్ఫురితము దీనిఁ గేసరికిశోరవిహారగృహాగ్రసీమముం ॥ ౪౯॥

క॥ ఆఁకట నకనకపడియును । వేఁకువ లే కెదురుపడిన వేహవ్య గాంభీ।
వీఁకను బోకార్చునె కరిఁ । దాఁకి కెరపు బొబ్బరింతము దానుత్సేకఁగన్ ?॥ ౫౦.

క॥ భిన్నకరికుంభముక్తా । చ్ఛన్నవసుంధరము, సింహస్రస్తు మోట్లున।
విన్నపము జేసికొను మృగ । సన్నిధి, నాస్త్మీయశౌర్యసాహసగరిమన్ ?॥ ౫౧.

ఉ॥ ఓరిమదాంధవృష్టి! గజయూథప! సంగడికాఁడ! ఘోరదరా।
తారముమధ్యమం దిట తృణంబును నిబ్బరక పాటిపోర ; స్తం।
బేరమబుద్ధి శాతనఖభిన్నమృగేంద్రపలక్షీర మైరకం।
తీరవశేఖరంబు శయనించిన దీగిరిగహ్వరంబునన్ ॥ ౫౨.

క॥ గిరిగహ్వరములఁ గలధను ! । గురుగర్వమునం జరింపకుము ; హేరింపన్।
హరిశిశువు పాలకంముడు, । కరిణీపరిశేషితంబు గహ్వరగంధిన్ ?॥ ౫౩.

ఉ॥ మొక్కలు పెంచువాఁడుకను, బుణ్యాంశము నాకెను దోఁటవాఁడు, దా
నొక్కెడ మూలగాఁ బొగడపోయుచున్ పవమందు ; నిదే మొలుంచి వాఁ।
డక్కడ నుండి యూ మొలక, యంతట రెక్కని చక్కఁబూఁది పుం,।
పెక్కిన కమ్మతావులను నెల్ల జగంబుల ముంచెనొక్కటన్ ॥ ౫౪.

శా॥ స్త్రీకాంతఃపరిఖేలనభ్రమితపాథోలోలకల్లోలమా।
లాకోలాహలమున్, హరిద్విరదము ల్యంకాద్రి సంక్షోభ నం।
చాకర్షించుతిమింగిలాంగగిలనప్రౌఢాస్య మారాఘనం।
బీకంధిం బొలయల్పి వీడు నెడనిం కేవోటఁ గ్రీడించెదున్ ? ॥ ౫౫.

ఉ॥ కొన్నిటి నేనుఁగు ల్విఱిచెఁ ; గొన్ని నెగళ్ళకు భిన్నమయ్యెఁ ; బ।
ల్కున్నవి గ్రీష్మభానుకిరణౌఘముచే మసి యయ్యెఁ జెట్టు లి।
ట్లన్నియుఁ బోవ, మూలఁ గన నొనిది గూడ లవంగవల్లి, కా।
నన్నిళు లయ్యెదున్, దవమునన్ భువి దావి బుచ్చులాకసన్ గటా॥ ౫౬

ఉ॥ నాకముమౌళిమానికము వచ్చుతధామము నీగిచెట్లకున్,।
శాకవిరోధికిన్ శచికిఁ బండిన పున్నెపుఁ బంటపైనయో।
ప్రాకటనందనంబ! బుధవర్గము, ఖాండవరంగతాండవా।
స్తోకనటుండు నీకు శిఖి దూరము గా, విధి నెన్న వేఁడెదన్॥ ౫౭.

చ॥ తనతనవ్యాప్యపృక్తం జనము దారిన నాకడనుండి, చంచుకో।
టిని బగిలించి తల్పున్, బ్రహీన మెువచ్చెద గూఁటినుండి నే।
నని, శుకపోత మిట్టులు మనోమృతపానము సేయుచుండ, లో।
ననుగరితుండ సన్నిభఫణాధర ముద్ధతిఁ దూఱెఁ దాయనన్॥ ౫౮.

చ॥ కడిఁది కరళ్ళు పెల్లెగయ, గట్టులు పొట్ట నడంగఁ, బొల్చని।
క్కడలిపడంతుకన్ నెడమెకంబులు డిగ్గఁ దలంతు రేల? యి।
క్కడనె సముచ్ఛలచ్ఛటులకాండమునన్ సుడిగుండమందుఁదాఁ।
బడి, గిఱు గిఱ్ఱునం దిరిగి, భద్రగజం బదె గంటె నెంటనే॥ ౫౯.

చ॥ కోపమ! శమించి పొల్గుడుచుకో; కటకుంగడకంటిచూపులన్।
మదకరిబుద్ధి దిక్కులను మాటికి నేటికిఁ జిమ్మె దీవు? హ్లా।
ల్లాదనెడుమూఁడులోకములయుంబరితాపము శాంతి వొంపఁగాఁ।
జపల నవాంబు వంబుదము శబ్దము సల్పెదొ ధీరధీరతన్॥ ౬౦.

క॥ చాలింపుము నీగర్జిత। మాలించిమనీయగర్భమం దొక నెల పో।
చూలిది గదలెడు మదనుం। డాలర జనునచ్చలంబునం జలధరమా॥ ౬౧.

క॥ వేదండగండకండూ। చ్ఛేదనపాండిత్యరుహితసింహము, దా నా।
వేదించు నేమి శౌర్యము, । మేదిని క్షుద్రంబు లైనమృగములతోడన్?। ౬౨.

చ॥ జల మమలంబు పుట్టినిలు; చామలపద్మములఁ గేరు పొరు; గా।
ములదొరకేలు గీము; క్రతుభుజ్ఞిచోరము సౌరభంబు; పే।
శలకవివాక్ప్రభాండమవు; సర్వధనంబవు నూనధన్వికో।
జలజమ! నీ వయో మధుపజాతికిఁ గూర్చిన నేమనం గలన్?॥ ౬౩.

క॥ నయనములు మొగిచి లీలగ। శయనించెద వేమినిదుర? సామాజమ! నీ।
కయినది పగ హరితో; ని। ర్భయముగ నిది పెరిఁగి పెరిఁగి చావైమూఁడున్॥ ౬౪.

ఆ, వె, విబుధులనోటనుండి వేవేగ నిడుపులు। వెడల వెట్టి నీని వెడలెనేని।
మాటలఁబడవ్వుసుమ్మి, మాతంగపోతంబ। నడవనమున మనోజ్ఞరచము లన్ని॥ ౬౫.

శా॥ ఔదార్యంబు జగత్ప్రతం బశ్లిజనం బంభోనిధానంబు; నా।
నాదిత్యాశ్రయహారి సౌరభము; శభ్రాంగాము మాధాంస మో।

మ॥ గోదావర్యాఖ్యనియోగివంశజుఁడు నాకున్ రామదాసుండు సం
గడికాఁడై యిట బోధసాధ్యసనపుంగాలేజి నీయేఁడు, నే
ర్పడఁగన్ నీడను జూచి వ్రాసినత్వదీయాలేఖ్యమున్ నిల్పితిం
బడ కింటం; గని మెచ్చ వే మతినిశిల్పం బన్నపూర్ణాసతీ ॥ ౩౪

శా॥ మాసా లన్నిట శుక్లకృష్ణము లనం బక్షద్వయం బుండు సం
డో సాధ్వీ! యదినిక్కమంచు మది నే నూహింప లే నయ్యెడన్;
నీసాంగత్యము గల్గునాళ్ళ నెల లన్నిన్ శుక్లరాత్రంబు లి
ప్డో సర్వంబును గృష్ణరాత్రములు నా కో యన్నపూర్ణాసతీ ॥

శా॥ అయ్యయ్యో! కొన్నినాళు లుండి వెస రా న ట్టింగఁ బుట్టింటికిన్,
దయ్యం బెత్తుక పోయెనే చెలియ! నిర్దాక్షిణ్యతన్ నిన్నటన్?
కుయ్యో! మొఱ్ఱో! యనంగ నాలుమగలన్ జోడుల్ విడం గొట్టున
క్కొయ్యం బాపము గొట్టదే? కుడుపదే గో డన్నపూర్ణాసతీ ॥ ౩౬

మ॥ చదువన్ వ్రాయను నేర్చి మూన్నెలల దీక్షన్, ప్రేమ నీవ్రాసిన
ట్టిది జాబేను సువర్ణపత్ర. మని పెట్టెం దాఁచితిం, గాన నేఁ
డది కన్నీటను దద్దయుం దడిపెదన్; హా! యేరి కంపింతు నీ
పెదమైజార్జలతా దుచీరలను? సాధ్వీ! యన్నపూర్ణాసతీ ॥ ౩౭

శా॥ కానం గుత్తుక నల్పి పెంటిఁ గొని పోఁగా బోయ, నీడంబునం
దానుం బిల్లయు మేఁత మానుక కపోతం బున్నచందంబునన్,
నేనుం బిడ్డఁడు నింట నుంటి మలఁతన్, నిస్త్రిత్రి గొంపోవఁగా;
హా! నా కప్పటియస్వ్రయే మరల దిక్కా? యన్నపూర్ణాసతీ ॥ ౩౮

మ॥ జడుప్రం. గొల్పుమహాసముద్ర మనుచున్ సంసారముం బల్కెనన్,
బెడఁ గోఁ గంటికిఁ బాన్పు నీకతన మున్ ఫేనాకృతిన్ నాడు; ని
ప్పుడో విస్ఫూర్జిత ప్రాల్క్రియోత్థఫణి రాడ్భోగంబునుం బోలె న
న్నడలం బెట్టుచు నున్న దయ్య సమకీడా! యన్నపూర్ణాసతీ ॥ ౩౯

శా॥ మీరున్ మల్లిక గూరుచుండుఁ దనుదాన్ చేరిసునన్ గేళికా
గారంబం దిడుపాద మొక్కనిసి వేగస్ వెన్కకుం దీయవే?
యూరే మల్లిక మాని యెంతుఁ గద నిన్నే; చేర రా వే మరో!
స్త్రీనుత్తమాంచనగ్రసవిలాసా! యన్నపూర్ణాసతీ॥ ౪౦

మ॥ నిను సన్మంపుఁజివుళ్ళపాట్లమునకున్ దీనైననీపట్టిటన్
జెపఁగుంగొన్నిర్విరవాజిమొగ్గలగమిన్ నిండించుశాల్యన్నమే
న్నఁడు సద్యోదితపత్రిభాజనమునన్ వడ్డించి నీ వర్తిలిన్
గుడుపాఁగుడు పింకఁ బెట్టవు గదా నా కన్నపూర్ణాసతీ॥ ౪౮

## పరలోకబంధుపరిసంగము.

---

శా॥ బంగారంబున కన్నెఁ గావి యన రూపశ్రీకిఁ దో డౌచు నీ
కుం గల్యాణగుణౌఘము ల్మిసుకృపం జేకూర్చి విలోకించి, చె
ప్పం గాంక్షించితిఁ గొన్నివాక్యములు; దివిన్ బంధుల్ గలా రందఱో;
పొంగింప న్వారె వారి నీమెలఁకువన్ ము న్నన్నపూర్ణాసతీ॥ ౪౯

మ॥ సచలుల్ నల్వురతోడ నీ వెనయఁ బంచత్వంబు ప్రాప్తించెనే?
కవుఁగింటం దొలుతన్ ఘటించు వనె యక్కన్ సుబ్బలక్ష్మిన్ వెసన్?
మిప్పులన్ మన్నన సేయుమీ విజయలక్ష్మిన్; దన్నిమిత్తంబునన్
దివియుం బిత్రిపతీనివాస మొదవెన్ మా కన్నపూర్ణాసతీ॥ ౫౦

శా॥ కోరంగిం బిసనాఁటఁ దండ్రి తల్లి మాకుం గూఁకటుల్ గొల్చి చే
యారం బొమ్మలపెండ్లి సేయఁ బసునా ఆ నేఁట నీ సేవ సం
సారం బన్తె సమాప్తి గాఁ బ్రసన నై సం తేది మున్ సన్నుచి
న్నారన్ వేంకమ నీ వెతింగి యొరఁగన్ ల గ్గన్నపూర్ణాసతీ॥ ౫౧

శా॥ నీవాక్లన్నల నీరు గాఱ వినవే నేఁ బ్రీయసీరత్నతా
రావళ్యాఖ్య రచించి యచ్చుచిన పద్యశ్రేణిఁ గ దాద్యన్నగా
శ్రీవాసిం గని చన్నరత్నమువరాంశుప్రవ్యంవ్యముల్ సోఁక నీ,
లావణ్యాకర మైన నీకుటిలఫాలం బన్నపూర్ణాసతీ॥ ౫౨

మ॥ పటుసందర్శనజాత మాపరిచితిం బ్రత్యక్షనిర్ధ్యాన ము
త్కటముం జేయఁగ రాసె, యక్క! యని తన్ గారామునన్ మ్రొక్కఁ గాఁ
గిటి కాసింపఁగ నీవు, నావిజయలక్ష్మీదేవి నైవేద్యదే
వటు మొ మా దివిఁ; దేర్పు మా మె ననసూయా! యన్నపూర్ణాసతీ॥ ౫౩

మ॥ పరమాత్మా! భవదీయశీతలకృపాపాఙ్గానిధానైకశీ
కరమే చాలును మామకోగ్రభవదుఃఖజ్వాల చల్లార్పఁ; జె
చ్చెర నేతెంచిన చిన్నచీమకడుపుంజిచ్చార్చి రక్షింపఁ, దుం
పుర గా కేటికిఁ దేనె బానెఁడును శంభూ! భక్తచింతామణీ॥ ౬౦

మ॥ భవనైదాఘదురాపతాపము శమింపం ద్వత్కృపాపారసిం
ధువుతీరంబున భాగ్యవంతులు వసింతుర్! పేద నౌనాకుఁ ద
త్సవిధంబం దిసుమంత నిల్వ వసతిన్ స్వామీ! ప్రసాదింపవే?
భువనాధారుఁడ వేమి నీకుఁ గొద? శంభూ! భక్తచింతామణీ॥ ౬౧

గద్యము.

ఇది యాస్తీయతురీయానంతర
ద్వితీయాకస్తిక సంస్థితటస్థ
మనస్సాన్వస్థ్యాంతిరాయ
వడ్డాది సుబ్బరాయ
ప్రణీతము
సతీస్మృతి.

భామినీవిలాస కరుణవిలాసానుబంధము.

సమాప్తము.

## శాంతవిలాసము.

---

చ॥ గురువిషయాటవీవలయఘోరవిలగ్నదవానలప్రస
త్వరబహుళార్చులన్ వికలభావము నొందిననామనంబు, స
త్వరము చకోరమట్టు లగుతన్, మిళదిందిరమాధురీధురం
ధరకమలామనోహరకనన్ముఖచందిర మండలంబునన్॥ ౧

చ॥ జలనిధిసార్వభౌమతనుజానయనాంబురుహావలంబనా!
జ్వలనవిజిత్వరజ్వరజవత్వరభంగురుఁ డైననన్ను శీ
తలునిఁగఁ జేగ సేయఁగదె తండ్రి! జగత్ప్రియరోచనంబు లౌ
లలితవిభాతసారసదళ స్మయహారివిలోచనంబులన్॥ ౨

ఉ॥ పంబినజాలి నాతపముఁ బాపుచు లోకులకుం దలంచుమా
త్రంబున, విద్యుతుల్ బహుళతంబు లభంగరుచిన్ వెలుంగఁ, జి
త్రం బగునంబుజప్రియసుతాతటకల్పనగావలంబితా
దంబిని, మామకప్రణిపత న్నతి మంబిని గావుతన్ సదా॥ ౩

చ॥ అలరఁ గళిందశైలతనయాఘనతీరవనాంతరంబు, ప్రా
ణుల కుడుగన్ గతాగతతనుశ్రమ మధ్వమునన్, లతాశతం
బలముకొనంగఁ దన్, మధుర మారుచిఁ గ్రాలుతమాలభూజ మ
గ్గల మగుమామకశ్రమముఁ గ్రిక్కునఁ దా హరియించుఁ గావుతన్॥ ౪

మ॥ భువనవ్రాతముఁ జంద్రికామయసుధాపూరంబునం దన్పుచున్,
త్రివిధం బౌపరితాపమున్ నరులకున్ శీఘ్రంబ చల్లార్చుచున్,
ద్రివిషద్బృందసదాభినంద్య మగుచున్, బృందావనం బున్కిఁ గాం
తవుమాత్మాంబు ధరంబు మామకమనోధ్వాంతంబు మాయించుతన్॥ ౫

తే.గీ॥ గ్రీష్మచండాంశుమండలభీష్మకీల । మైనసంసారమున ననయంబు వేఁగు
నట్టినా వేదనను, ప్రావృడంబుదంబు । మాడ్కిఁ జల్లార్చు, వృష్ణికుమారవరుఁడు॥ ౬

చ॥ విసుఁగు విరామమున్ గనక, వేమఱు దుస్తరసంసృతిన్, మలీ
మసవిషయాటవీవిషమ మార్గమునన్, గమియించుచున్, దగన్
వస మఱినన్నుఁ జేర్చుతను, వారిజబాంధవనందినీతటా
వసథము నందగోపకతపఃఫలబాలతమాల మాడటన్॥ ౭

క॥ జగమే సర్వము నశ్వర । మగు భంగుర మంతకంటె సంగము ; కట్టా ?
మిగుల శ్రమపడెద రవ్విధ । మగుదానికి జను లి దేమియవివేకంబో?॥ ౨౪

క॥ దినదినమును మృత్యుముఖం । బునఁ జొచ్చెదు నెల్లమానవులఁ గనుఁగొనుచున్
మనము విరమింప దిప్పటి । కిని దా విషయములవలనఁ గించి త్తైరన్॥ ౨౫

తే,గీ॥ పాయనీ రాజ్యలక్ష్మి, కృపాణధార । లట్టె పయిపయిఁ బడనీ, భయంకరముగఁ
దల యముఁడు దీయనీ ; సుంత ధర్మపథము । దప్ప కుండెడుఁగాత డెందంబు నాది॥

క॥ పగవాఁడు నెత్తిమీఁదను । బగబగ మండింపుఁ గాక పావకు, నపిచేఁ
దెగఁ గోయుఁ గాక కాయము, । తగ వెడలిపలుకు నేఁ బదర లేశంబున్॥ ౨౬

క॥ తరణోపాయము నాకుం । దొరకద యని యేల పొగిలెదుర ? జీవుఁడ ! నీ
స్మరణంబున నెన్నఁడు సుం । దరనందకుమారునాననము దగుల దొకో?॥ ౨౭

ఉ॥మాకు నిమేషముల్ వలదు, మాద్యదనేకపదానమత్తభృం
గీకలఝుంక్రియారుచిరఖేలనహృద్యము లైనసంపదల్ ;
కైకొనువారి నెల్ల నవి గన్నులు గప్పి, రమామనోహర
శ్రీకరపాదయుగ్మసరసీరుహసేవకు దవ్వు సేసెదున్ ;॥ ౨౮

తే,గీ,,ముగిసెఁ బాల్యము ; మృత్యువు మొగిసె ; నకట ! । యొూట లే కిప్పుడానిద్ర ? యోరిజీవ !
గ్రొనఁ గొవ వేమి ? నిమకింపు మాద మఱచి ; । కడనె యున్నది తల్లిగంగాభవాని ;॥

క॥ ధారుణి నిట్టటుఁ బఱచుచు । నారాటంపయిన నేటికి కంతఃకరణం
బారూఢుఁ డెపుడు నందకు । మారకపరమప్రభుండు మచ్చిత్తమందున్ ;॥ ౩౦

చ॥ మనస ! ననుజ్, మనోభవవిమర్దనపాదసరోజయుగ్మపూ
జన మతిభక్తి సంతతము సల్పెదువానిని, నాజవంజవం
బను పెనుగర్తమందు నకటా ! పడఁ ద్రోసెద వింతమాత్రచేఁ
దనయవియోగదుఃఖశిఖితాపము నీకును గాక పోదు సూ ;॥ ౩౨

క॥ మరకతమణిభూధరమో, । తరుణతరం బగుతమాలతరువో యనుచున్,
బొరసిరి శంకను మునిగణ । జరు లనలోకించి రామచంద్రుని దొలన్ ;॥ ౩౩

చ॥ ఇది యమునాతరంగిణి యొ ? యొట్లది తోయమయస్వరూప యౌఁ
గద ; యిది పచ్చతాతలుకొ ? కా దది మాఁపురిఁ గాంచు నెట్టు లం
బెపలను సంశయంబు జనియింపక యుండెడు నేరి కాదియం
దుదితకుతూహలంబున రఘూత్వహు నెన్నెయిచాయఁ జూచునో ?॥ ౩౪

ఆ॥వె॥ మేఘమునకుఁ బాయు మెఱుపుఁదీఁగయొ, యామినీపాంథునకును బాయు పుష్పలతయొ
యని తలంచి, పిదప హాహయానుఁ డెటఁగ వి యోగినిగను నిడువయూరుపులను॥

ఉ॥ సంపద నీచగేహముల; సద్ద్విజులిండ్ల లేమిగోల; పు
ణ్యంపుజనుల్ గతాయువులు; చిరాయువులు పాపులు; నీయనీతి వీ
క్షింప మహో(గ్రకోపశిఖికీలలు పర్వెడు; నైన నేను గా
వింపను నిన్ను? దీనుఁడను; విశ్వవిభుండవు నీవు; శంకరా!॥ ౩౬

## కృత్యంతమున జగన్నాథునిస్వోత్కర్షము.

మ॥ అమరాగారనగంబుఁ దొట్టి మలయాహార్యాన్తాంభోధుల
లమునాకం గలకావ్యకల్పనచణుల్! శంకింప కీ రానటిం
డి; మదన్యం డురుగోస్తనీరసధునీనిస్సీమమాధుర్యసు
ర్యమృదూక్తి ప్రభుతాపవానుభవధన్యాత్మండుబు వాఁ డుండునే? ౩౭

ఉ॥ వీనులఁ దా సుధానుయము వీనివగోరస మూని వాణి, చేఁ
బూనినవీణాతంతుచయముం బలికింపఁ దలంప మానుఁ, ద
ద్ధ్యానితపండితేశు(శ్రుతిభూషణభాషణ మాలకింప, నె
వ్వానిశిరంబు కంపిలదు, వాఁడు ద్విపాత్పశు వెద్దుమొద్దగుణ్ ౩౮

ఉ॥ తేనెయు ద్రాక్షపండు సుధ స్త్రీయధరామృత మేని యైన, నె
ట్లైన ముదంబుఁ దార్చనివి యైనను, బండితరాజవాణి యే
మానిసి కీదు మోద మలమంథుఁడు ప్రాణము బొంది నుండెనేన్,
బీనుఁగు నిశ్చయంబుగను బీనుఁగు పీనుఁగు పీనుఁగే సుమీ॥ ౩౯

మ॥ కమియం బండి (స్రవించుద్రాక్షరసపుంగర్వంబు వాపన్ సమ
ర్థము లౌవాక్కులఁ, గావ్యకల్పన మెయిన్ గర్వ్యక్ నీకు నే ద్రుష్ట ప
క్షమునన్, జెప్పను దాని మాదృశసమాక్షింబంకు; లేకున్న డెం
దమునందుండి వెలార్పఁ బోవు మది, మిత్రా! త్వత్కృతాభ్యర్థియన్॥ ౪౦

ఉ॥ నాకవితాకుమారి! వదనమ్మును వాంచకువమ్మ, నిన్నుఁ బ
ల్గాకి నిరాకరించు ననిఁ; కాలును వాఁ డటు లోర్వ లేఁ; డీ
కాకథ యేల? కావ్యకమలాంతరసీధుఘనీమధుప్రవా
హీకము మోమలం జెలఁగి నిత్యము కృత్యము నీ విందర్పవే!॥ ౪౧

మ॥ పరవాక్యాఖ్యనవపక్షమం దనిశము౯ వాచంయముల్ పండితుల్;
ధరణీశుల్ కమలావిలాసమదిరాతంద్రామదాఘూర్ణితుల్;
స్మరపీడాలసనౌరయోషిదధరస్వారస్యధిక్కారి మ
ద్వరవాణీపరిపాక మేరసికుజిహ్వా౯ సల్పు లాస్యం బిల౯? ౪౨

క॥ ద్రాక్షేక్షుక్షీరసుధా। మాక్షికములనిరుపమానమధురిమలుగు, దా
మీక్షితిఁ బండితరాజవ। చోక్షరమాధురి కహా! జోహారొనరించు౯, ౪౩

శా॥ జల్లించెం గడవెళ్ళ శాస్త్రిములు; నిష్ఠ౯ సల్పె నిత్యక్రియల్;
ఢిల్లీవల్లభుపాణిపల్లవమున౯ లేఁ బ్రాయ ముంచె౯; గడు౯
దుల్లన్ వాసన లియ్యపర్వ౯ మధురయందుం గొల్చి గోవిందు; హా
యుల్లోకంబుగఁ జేసెఁ బండితసమూహోత్తంసుఁ డన్నింటినిన్ ;॥ ౪౪

క॥ లంజలకొడుకులు హరియిం। పం జాతురు మామకీనపద్యపుమణు లం
చుం జనియించిన శంక౯। మంజూషను దీనిఁ జేసినాఁడం డాండీ॥ ౪౫

శా॥ కబ్బం బుల్లదు; దైన నాకురచనోగ్రవ్యాఘ్రదంష్ట్రాళి కీ
నబ్బబ్బా! కవితాలతాంగి నెర సేయం జాల; నానాటికిం
జబ్బంజాలఁగ గోరసాదు విడుకొంచుం బెంచి, యబ్బాలచే
నబ్బింతు౯ రసికాంతరంగముల; బి ట్టూరింతు విద్వాంసుల౯;
సుబ్బారాయఁడ; మేఘవేణిసుమనస్స్రాస్త్యాదు లస్మత్కృతుల్;॥

ఇది యాఱువేలవంశాభ్యుదితుండగు
ఐ. సు. రాయండాంధ్ర మొన
రించినయట్టిది భామినీ
విలాస నిగదితము
తుదిశాంతనామ
క విలాస
మగు౯

శ్రీరస్తు.

# కిరాతార్జునీయము

ఇది

గోపాలుని-సింగయకవిచే

సంస్కృతమునుండి

యాంధ్రీకృతము.

చెన్నపురి:

శ్రీ వైజయంతీ ముద్రాశాలను

ముద్రితంబును బ్రకటితంబు.

1908.

 [వెల 12 అణాలు.

శ్రీరస్తు.

# కిరాతార్జునీయము.

---

## ప్రథమాశ్వాసము.

శా. శ్రీరామామణియంకమందలరఁగాఁ ♦ జెల్వొందు వక్షస్స్థలిన్
సారశ్రీకవలిష్ఠకుంకుమవిరా ♦ జత్కౌస్తుభం బొప్పఁగాఁ
గారుణ్యామృతపానమత్తనిజభ ♦ క్తవ్రాతముల్గొల్వఁగా
నారూఢింగరుడాద్రినుండునరసిం ♦ హస్వామిఁగీర్తించెదన్. ౧.

సీ. అఖిలలోకాలోక ♦ నానందకరములౌ, కరములు నాఁగటా ♦ క్షములు వెలయ
నంతరపరిదృశ్య ♦ మైనట్టికందు నాఁ, జెలువైనకస్తూరి ♦ తిలకమమర
నిర్నిద్రధవళిమో ♦ న్నిద్రచంద్రిక నాఁగ, దరహాసవిస్ఫూర్తి ♦ దనరుచుండ
వరసుధారసము ♦ త్కారవిస్ఫురదోష్ఠ, ధళ్యంబు నాఁజిగి ♦ దలఁకుచుండ
పలుల నంపూర్ణశశిమాడ్కి ♦ వదనమొప్ప, హారినిజకామినీవృక్ష ♦ కోరతృష్టి
గొలుపఁజేయుమనోభళి ♦ గిరివసించి, చెలఁగు దేవుండు కృతిసాగఁ ♦ జేయుఁగాత.

ఉ. చల్లనిపుట్టినిండ్లుగల ♦ చానలురంబున మేనమామనం
దల్లపుతుష్వసించికడు ♦ నింపులుగుల్కఁగఁ బ్రేమమీఱను
త్ఫుల్లమనోజ్ఞతన్ బ్రకట ♦ మూర్తియునై సగ మైవిలీన మై
తెల్లమినుండుమూర్తులను ♦ దీర్ఘకటాక్షనుతియింతుమువ్వురన్. ౩.

సీ. వ్యాసవాల్మీకిసం ♦ యమివరప్రోక్తప, ద్ధర్మతత్వార్థసం ♦ దీప్యమాన
సకలేతిహాసశా ♦ స్త్రపురాణసంగుప్తి, స్ఫూర్జితాన్వయసమ ♦ ద్భూతరాజి
తామ్రలవిగ్రహ ♦ వ్యాప్తనిర్మలశార, దాంబుదహీరనీ ♦ హారభూధ్ర
గంగాజటాజూట ♦ కైలాసతారకా, నీకాధినాథస ♦ న్నిభయశంబు
కరణినెన్మోవినత్కాంతి ♦ నలువుచుండ, వనముఖాంభోజమాత్మని ♦ వాసముగు మ
వెలయుజగదంబశారద ♦ వేదకాశీన, భీష్టసంసిద్ధిమత్కృతి ♦ కిచ్చుఁగాత. ౪.

సీ. తాటంకమణిగణ ♦ ధగధగరోచులు, గండభాగములపైఁ ♦ జెండవింప
దరహాససంజాత ♦ ధళధళదీప్తులు, కౌముదీకాంతులఁ ♦ గ్రమ్మునింప

నిరుపమమధురోష్ఠ ♦ నిగనిగాయతకుచల్, విభ్రమద్యుతులను ♦ నీఁగనొత్తె
సలలితాలకసాంద్ర ♦ చకచకదీధితుల్, హరినీలములఁ జిగిఁ ♦ బరిభవింప
విభుఁడు దనమీఁదఁ గలమూర్తి ♦ వెలయఁజేయు, కరణి సెప్పఁగ నవ్వనితయుం ♦ గనుసనిల్చి
సిరులు వెలయంగ భక్తుల ♦ నరయుచుండు, కలిమిచూపులసిరిభామఁ ♦ బలఁతుఁ బ్రేమ. ౫.

సీ. వెలువృష్టశైలాన ♦ శిఖరభాగంబునఁ, నిర్మలమణిమయ ♦ హర్మ్యములను
విలసితశశికాంత ♦ వేదిపై నేకలక్ష్యం, గారంబుమీఁగా ♦ గారసీమను
సురసిద్ధసాధ్యకి ♦ న్నరయక్షగంధర్వ, పరులును బ్రమథులు ♦ [illegible]గొల్వ
మేఘంబుమీఁది క్రొ ♦ మ్మించు తేజంబు నా, భూషణద్యుతి మీఱ ♦ బొల్పుమీఱ
నిండుగొల్వుండి కన్నుల ♦ పండువుగను, నచ్చరలయాటపాటల ♦ నలరుచుండు
మంచుమలపట్టి హరుఁడును ♦ మించు రాణి, సార్వతీదేవి కలితభ[illegible] ♦ బ్రణుతి సేతు.

చ. ఘులుఘులుమంచుఁ బాదకట ♦ కంబులు మ్రోయుచుఁ దాళమానములు
దెలుపఁగ గండసాలికలఁ ♦ ద్రిప్పురుచుండు మదాళిఝంకృతుల్
తెలియఁగ గానసౌష్ఠవము ♦ శివుఁగనొప్పఁగఁ బాదమెట్టినల్
వెలయు మృదంగనాదముల ♦ పేఁకఁ జెలంగఁగ నృత్యబంధముం
దెలమి నటించుచుండెడుఁ గ ♦ ణేశుని భక్తిని మ్రొక్కి కొల్చెదన్. ౭.

క. వల్మీకజనితసుచరితుఁ, గల్మషవిరహితుని నాది ♦ కావ్యవిరచితున్
వాల్మీకి భక్తిఁ గొల్చెదఁ, గేల్మోడ్చుచు మ్రొక్కి వినయ ♦ కీలితబుద్ధిన్. ౮.

క. భూసురకులసంజనితుని, భాసురనిగమార్థవేదిఁ ♦ బరతత్త్వజ్ఞున్
వాసిష్ఠపౌత్రు వేద, వ్యాసుని మదిఁ గొల్చి భక్తి ♦ వర్ణన సేతున్. ౯.

క. ద్వాదశనామస్కంధో, త్పాదితభాగవతదివ్య ♦ తరుశాఖలపై
వేదార్థమె నిశ్చయమని, వాదించు శుకాఖ్యమౌని ♦ వలగొని కొల్తున్. ౧౦.

తే. అరయ గీర్వాణకవివర్యు ♦ లైన కాళి, దాసభవభూతిమాఘుస ♦ త్కవిమయూర
దండిబాణాదులైనట్టి ♦ దండికవులఁ, దలఁచి కీర్తించి మఱియును ♦ దనము నొంది. ౧౧.

తే. శబ్దశాసనబిరుదుచే ♦ జగతిమీఁదఁ, బ్రౌఢిఁ గాంచిన నన్నయ ♦ భట్టుఁ గొల్చి
సోమయాజిని గీర్తించి ♦ సుస్థిరముగ, భాస్కరాహ్వయు మదిలోనఁ ♦ బ్రస్తుతించి.

ఆ. పరమభాగవతుని ♦ బమ్మెరపోతన, నాత్మలోపలఁ గొని ♦ యాడి మఱియు
నంధ్రకృతులకర్త ♦ లైనట్టి సుకవుల, మనసులోఁ దలఁచి ♦ నమస్కరించి. ౧౩.

క. భారవిభట్టు రచించిన, భారవియను కావ్యమవనిఁ ♦ బ్రఖ్యాతిగఁ దా
నారూఢిని దెనిఁగించెద, ధారుణి నాచంద్రనిత్య ♦ తారార్కముగాన్. ౧౪.

చ. లోఁడితెడు పొట్టకై యొరుల ♦ లుబ్ధత నెప్పుడుఁ గొల్చియున్న యా
జడమతి యంతయుం దొలఁగ ♦ జన్మమునన్ మఱియన్యవాఙ్మయమ్మున్
బుడమిఁ బవిత్రమై వెలయు ♦ భూరిశుభంబుల నెల్లఁ బొందఁగా
గడఁగియ హేళాబలేశునకుఁ ♦ గట్టుదు నీకృతి నేను బట్టమున్. ౧౫.

క. పంచాంబకజనకునకును, బంచాయుధధారునకును ♦ బలిసుతకరటీ
పంచాననవిక్రమునకుఁ, బంచాననసన్నుతునకును ♦ బరమాత్మునకున్. ౧౬.

క. శరనిధినిమగ్ననిగమో, ద్ధరణునకును మందరాద్రి ♦ ధారునకును భూ
భరణునకుఁ గనకకశ్యప, హరణునకును నిఖిలదైవ ♦ తారాధ్యునకున్. ౧౭.

క. వటువేషధారునకుఁ బ్ర, స్ఫుటతరనక్షత్రియౌఘ ♦ భూరుహహననో
ద్భటపరశుధారిణునకును, బటుతరహలధారునకును ♦ బలధీరునకున్. ౧౮.

క. దశకంఠకంఠలుంఠన, దశరథవరనందనునకు ♦ దాశార్హునకున్
నిశితాసిదళితవరపా, రశికాద్యుతభావికల్కి ♦ రాహుత్తునకున్. ౧౯.

క. శ్రీస్తనకుంకుమచిహ్నిత, కౌస్తుభవక్షునకు వికచ ♦ కంజాక్షునకున్
దుస్తరఖలశిక్షునకును, బ్రస్తుతయోగీంద్రదిష్ట ♦ పరిరక్షునకున్. ౨౦.

వ. సమర్పితంబుగా నారచియింపం బూనిన కిరాతార్జునీయం బను మహాకావ్యంబునకుం
గథాక్రమం బెట్టి దనిన. ౨౧.

శా. శ్రీరంజిల్లువిచిత్రభూరుహలతా ♦ శ్రేణీసమాకీర్ణమై
శారీకీరమయూరకోకిలకుల ♦ శ్రావ్యప్రలాపారవమై
సారాబ్జాసవమత్తభృంగవిలస ♦ ఝ్ఝంకారకాసారమై
మీఱుం ద్వైతవనంబు చూడ మునిస ♦ న్మిత్రోజ్జ్వలావాసమై. ౨౨.

క. అమ్మహితవనమునందన, తమ్ములు సతి గొల్వనుండు ♦ ధర్మతనూజుం
డమ్మహిఁ దుర్యోధనునకు, నమ్మతి జూదమున నోడి ♦ సమయము కొఱఁదిన్. ౨౩.

క. అతఁడొక్కనాఁడు తమ్ములు, హితులును దను బలసి కొలువ ♦ నెలమి దనరి గ్రప్పన్
జతురతరవచనరచనలఁ, గుతుకము మీఱంగ నిండు ♦ కొలువుండు తఱిన్. ౨౪.

ఉ. శ్రీయును రాజ్యపాలనముఁ ♦ జిత్తనివృత్తి జనానురాగముం
బాయని యా సుయోధనుని ♦ పాలికి మున్ను రహస్యవృత్తి మైఁ
బోయి యెఱింగి రమ్మనుచుఁ ♦ బూనిక నంప వనేచరుండు దా
నాయెడ కేగి యాత్మ నది ♦ యంతయు నారసి వచ్చెఁ గ్రమ్మఱన్. ౨౫.

తే. వచ్చి ధర్మజుఁ గాంచి యా ♦ వనచరుండు, సవినయంబుగ సాష్టాంగ ♦ మవనిఁ జాఁగి
మ్రొక్కి వేలేచి కరములు ♦ మోడ్చి నిలిచి, విన్నవింపంగఁ దొడఁగెను ♦ వివిధముగను.

సీ. అవధారు దేవ మీ ♦ రానతిచ్చిన యట్లు, కరినగరంబున ♦ కరిగి యచటి
వృత్తాంత మెల్లను ♦ విశదంబుగా బ్రహ్మ, చారివేషముఁ గాల్చి ♦ సరగఁ దెలిసి
చెచ్చెఱ వచ్చితిఁ ♦ జిత్తగింపుము మన, రాజ్య మెల్లను ధార్త ♦ రాష్ట్రుఁ డాక్ర
మించె నంచును బల్కె ♦ మేదినీశుని తోడ, నేమని చెప్పుదు ♦ నిట్టి మాట
యనుచు మనమున శంకయిం ♦ తైన లేక, యవనిపతి త్రోసి నా ప్రస్తుతి ♦ నట్టివారు
లరసి చూడంగ దబ్బర ♦ లైన మాటఁ, బూని వినిపింపఁగా రాదు ♦ గాన యిపుడు. ౨౮.

క. ఈరీతిఁ బల్కి మఱియును, నా రూఢార్థోక్తి మీఱ ♦ నాధ్యాపితుఁడై
వైరివిదారణశీలుం, డౌ రాజున కిట్టు లనుర ♦ హాస్యము సంధుల్. ౨౯.

సీ. జననాథ విను ప్రయో ♦ జనములం గుని యుక్త, లైన ప్రత్యక్షములు ♦ కరసి చూడఁ
జారచక్షువు లైన ♦ జగతీశ్వరుని కుపం, చనఁ జేసి మాటలాడఁ ♦ గంగ రాదు
కానఁ బల్కితి నిమీ ♦ మానసంబున కిది, ప్రియ మైనఁ గానిమ్ము ♦ ప్రియము కాని
సైరణ సేయుమో ♦ స్వామి యిది యుగాక, యతిహితంబగు మనో ♦ హరమ్ము లైన
పలుకు లరయంగఁ గడు దుర్ల ♦ భములు గాక, హితవు వినిపింపకుండునా ♦ చేటి హితులు
హితుల మాటలు విననిచోఁ ♦ జేటి రాజు, రాజు మంత్రులుఁ గూడుచోఁ ♦ దేజమగును.

వ. అది యునుంగాక నిసర్గదురోధంబు లైన రాజచరిత్రంబు లెక్కడ, నావంటి యజ్ఞాన జంతువు లెక్కడ! ఇపుడు నిగూఢార్థంబైన విపక్షనీతిమార్గంబుఁ దెలిసి వచ్చుట భవదీయసామర్థ్యవిశేషంబె యైనను, నాపోయి వచ్చిన కార్యంబు సవిస్తరంబుగా విన్నవించెద సావధానుండవై యాకర్ణింపుము. ౩౦.

సీ. దుష్టాత్ముఁడైన యా ♦ దుర్యోధనుండు నీ, చేత గెల్చిన ♦ ధరిత్రి యెల్లఁ
బట్టాభిషిక్తుఁడై ♦ పాలించుచుండియు, వనమున నున్న నిన్ ♦ దలంచి
మనమున భయపడి ♦ మహి యెల్ల మీకంటె, నీతిపరుండు ♦ ఖ్యాతి మీఱఁ
బాలించి తనకను ♦ కూలంబుగాఁ జేసి, కొనెడు నంచు ప్రయత్న ♦ మునఁ గాఁ జేయు
చున్నవాఁడు గాని ♦ యున్మత్తుఁడై యున్న, వాఁడు గాఁడు రాజ ♦ వర్యుఁ డిట్టి
వానికిట్లు సుజన ♦ వైరమేల యటంచు, ననియెదే నివిను ♦ మాత్మ నిపుడు. ౩౧.

క. గొనకొని భూమిని సంపద, ఘనతరముగఁ జేయుచున్నట్టి ♦ ఘనవిద్వేషం
బొనరఁగ దుర్జనసంగము, మునకన్న ను వరము గాదె ♦ భూవరముఖ్యా. ౩౨.

క. ఈరీతినీతిపద్ధతి, వారక పాలించి భూమి ♦ వశముగఁ జేయం
గోరుట భయపడుటయుఁ గా, కారయఁ బౌరుషము విధమె ♦ యనియం డేనిన్. 33.

మ. అరిషడ్వర్గము ముందె గెల్చి జనమా ♦ ప్రాగమ్యమైనట్టియా
పరమన్వాదుల పద్ధతిన్నడపఁగా ♦ వాంఛించి తా రేవగల్
వెరవున్ గార్యవిభాగపౌరుషములున్ ♦ విఖ్యాతమౌనట్లు గాఁ
బరఁగం జేయుచు జాగరూకుఁడగుచున్ ♦ బాలించెడున్ భూవరా. 3౪.

వ. అని మఱియును బ్రజాపాలనవిధంబును, ద్రివర్గోపాయవ్యాపారంబును, బలపరాక్రమ
సంపత్తియు నెఱింగించువాఁడై యిట్లనియె. 3౫.

చ. కొలిచిన భృత్యకోటినను ♦ కూలత నొప్పెడు మిత్రులట్లు మి
త్రులు మఱి బంధువర్గముల ♦ తోసరిగాఁగను బంధుజాలమున్
వెలయఁగ స్వతాధిపత్యమున ♦ నిత్యము మైత్రినిఁ బోలె సాదరం
బలరఁగ తృప్తయుండఁగను ♦ నారయు లెస్సగ సంతతంబునన్. 3౬.

తే. అలరు ధర్మార్థకామంబు ♦ లను త్రివర్గ, మతఁడు సమభక్తి విభజించి ♦ యరయు నట్టి
గుణవిశేషితసఖ్యంబుఁ ♦ గోరిచేసి, నట్టులనన్యోన్యమును గూడి ♦ యలరు నధిప. 3౭.

ఉ. సామము దానవర్జముగ ♦ నెల్పుట లేద లభూరిదానమున్
దామఱి సత్క్రియావిరహి ♦ తంబుగఁ జేయఁడు సద్గుణాంచితం
బౌ మహనీయసత్క్రియయు ♦ నర్థము లెఱుంగక సేయఁ డెన్నఁడో
సామి సుబోధనుండతని ♦ జాగ్రతనేమ నివిన్నవించెదన్. 3౮.

మ. ధనకాంక్షన్ మఱికోపకారణమునన్ ♦ దండింపఁ డెవ్వారినిన్
దన రాజోచితనీతిమార్గమునకా ♦ ప్తప్రజ్ఞుండు బోధించిన
ట్లనయంబున్ మఱి సూనుఁడేని యపుఁడుం ♦ దో నేనియుం దుర్నయం
బునవర్తించిన దండనంబు పలువున్ ♦ భూమీశ నిర్లోభతన్. 3౯.

సీ. పరరాజులకు మది ♦ భయమునందియుండియుఁ, బరభేదనప్రౌఢిఁ ♦ బరఁగు గూఢ
చారుల పనులకే ♦ శములంగు నియమించి, పరులకుఁ దాభయ ♦ పడుట గాన
రాకుండునట్టిని ♦ యాకారమున నుండి, పరరాజులోపలి ♦ వారినెల్ల
వసులఁ గాఁ జేసియు ♦ వ్వారిలో వారె యొం, డొరుపుల భేదింప ♦ నొనరఁ జేసి
చారులంపు పనులు ♦ సఫలంబుగా నెఱింగి, వచ్చినపుడు దేవలయు ♦ వస్తువిచ్చి
మెచ్చి జనులఁ దన్ను ♦ మేలు మేలు కృతజ్ఞుఁ, డనఁ బొగడ్త వెలయు ♦ సమ్యగ్గ మెపుడు.

చ. పరఁగును పాయముల్ దగిన ♦ పట్టున నెంచుచు దాని యోగముల్
సరసతఁ జేయుచేయు నెడ ♦ సత్క్రియ నొంది పరస్పరంబుగా
మొరయుచు సేయులీలను మ ♦ హోత్తరకాలయుతార్థసంపదల్
తెలుచుగఁ గూర్చెఁ బోతమకుఁ ♦ దామె యజస్రము ముందుముందుగన్. ౪౧
వ. అదియునుంగాక. ౪౨
సీ. అగణితరాజన్య ♦ హయరథాందోళప, ల్యంకికాగజసైన్య ♦ సంకులంబు
నిఖిలదేశాయాత ♦ నృపతిభూషణకన్య, కావిష్టనత్ప్రరా ♦ గాన్వితంబు
నతఫాలతిలకస ♦ త్కృతమృగీమదసిక్త, పాదపీఠప్రభా ♦ భాసురంబు
వేత్రహస్తోద్భట ♦ వేత్రవిన్యాసని, శ్చలపార్శ్వజనపాల ♦ కలితంబు
నైనయట్టియతని ♦ యాస్థానమంటపా, జిరము కామ్రళివ్వ ♦ కరిఘటాఘ
దానసేకమున నె ♦ ధరణీశపంకిలం, బగునిఁకేమిచెప్ప ♦ నతనిసిరిని. ౪౩
తే. మఱియు నాతండు పాలించు ♦ మహిమచేత, మహితగుణశ్లాఘనీయ ♦ మాతృకంబు
లగుచు హాలికులు కృషి సేయ ♦ కలరఁబంటు, సస్యసంపత్తి చేనాస్య ♦ జనపదములు.
క. నిరుపప్లవముగ సదయత, నరయుచుఁ దైపాలనమున ♦ నుదయంబు గాంచెడిన్
నెఱిగొను ధనదనిభుండగు, కురువిభునకు ధనము దాని ♦ గురియు మహీయున్. ౪౪
క. మానధనుల్ ధామవృత్తులు, భూమతధనికులు నయోధ ♦ బుద్ధులు రణ
శీనిపుణులు మఱి సమయం, బైనను బ్రాణములనిత్తు ♦ రంగుగ భటులున్. ౪౫
సీ. అదిగాక మఱియును ♦ సాంగవహాపరంపర, కార్యముల్ వంగగాల్ ♦ గాని దుష్టి
చారులచేసవి ♦ స్థిరముగావించుతాఁ, జేయుకార్యము బ్రస్తు ♦ తప్రస్తుతోత్త
మనుకూలఫలయుక్త ♦ మైనయప్పుడె యిలుంగు, నట్లుగాఁ జేయుమ ♦ నతఁడుఁగాను
విల్లందిరొక నాఁడు ♦ విక్రమించక యుద్ధ్యో, గోపమ్ముకోరాంగముఁ ♦ బూనుకొన్న
మాన్యచారిత్రతనగుణ ♦ మహిమచేత, మహిప మైనట్టిసర్వప్రశ్న ♦ మాలఁబోల
ధరణిపతులెల్ల తనయాజ్ఞఁ ♦ దలను మోచి, నవవఁగాఁ జేసియుఁగకల్పి ♦ నరపరేణ్య.
వ. వెండియు నిర్విఘ్నంబున నప్రతిహతశాసనుం డగు నా దుర్యోధనుండు ధర్మాగ్రహుండై నవయౌవనోద్ధతుండును, రాజ్యభారవహనయోగ్యుండును నగు దుశ్శాసనుని యువరాజ్యభారంబునకు నియమించి, నిజపురోహితానుమతుండై హావిర్భాగంబుల నగ్నిదేవుం దనుపుచుండు; నిర్విఘ్నంబున నుత్తరకాలఫలనుస్థిరంబగు నా సముద్రపర్యంత మహీమండలంబు నిష్కంటకంబుగాఁ బాలించుచు సార్వభౌముండై యుండియుఁ ద్వదాగమనభయచింతితుండై యుండు నింకేమని విన్నవింప నేర్తు! బలవద్విరోధంబు దురి

తంబైనది గాదె! అదియునుంగాక సభాసదులైన జనులు కథాప్రసంగంబుల మిమ్ముం జేరి పల్కినవి విని యా ఖండలసూనువిక్రమంబు మనంబునం దలంచుకొని విషవైద్య మంత్రపదంబునం దోఁచు వైనతేయపాదవిక్షేపానుస్మృతం బగు దుష్టోరగంబు చందంబున నతఁడు ఖిన్నుండగుచు మనఃపరితాపితుండై మీ మీఁదఁ గపటంబు సేయ నుద్యోగించుచుండు; నట్లుగావున మీరును నా దుర్యోధనుని మీఁదం జేయవలయు ప్రతిక్రియ శీఘ్రంబునం జేయం దగుం గాని యితరంబు గాదు. నా యెఱింగినయంతయును దేవరకెఱింగించితి. ఇటమీఁదటి కర్తవ్యంబు మీరే యెఱుంగుదురు. మా చేయు ప్రయోజనం బింతియ కాదే యనిన విని ధర్మనందనుండు సముచితసత్కారంబున బహూకరించి నిజనివాసంబునకుం బొమ్మని యాజ్ఞాపించిన నవ్వనేచరుండును సాష్టాంగవినతుండై నిజనికేతనంబున కరుగ. ఆ ధర్మసూనుండును గొలువు వీడ్కొని యనుజసమేతంబుగా ద్రౌపదీమందిరంబునకుం జని తద్వృత్తాంతం బంతయు వివరించిన. ౪౮.

క. ఆపల్కులు విని యప్పుడు, ద్రౌపది తన పాటు దలఁచి ♦ తాళుకొనంగా
నోపక కోపోద్యోగో, ద్దీపకముగఁ బల్కె నాయు ♦ ధిష్ఠిరుతోడన్. ౪౯.

మ. అనఘా మీరు నయజ్ఞులైన నిపుడే ♦ నాత్మన్ విచారించి ప
ల్కిన పల్కుల్ పరికించి చూడమిము నా ♦ క్షేపించి నట్లుండున
ట్లని యున్నన్ సమయాపహంబులగు నా ♦ యాత్మవ్యథల్ పల్కఁగా
ననుఁ ద్రోచేరె చెడిఁ జిత్తగింపుఁడు మదిన్ ♦ నామీఁదఁ గోపింపకన్. ౫౦.

మ. చిరకాలంబుననుండి తాపకతుల ♦ శ్రేష్ఠుల్ మహేంద్రోపముల్
భరతాదుల్ తగ నేలు భూమి కిడుపం ♦ బాలయ్యె నీ చేత నేఁ
డెరయం గా మదగంధసింధురము బా ♦ నాత్మీయహస్తంబుచే
ధరియింపంగ నలేక పీడుసుమనో ♦ ద్యానంబు చందంబునన్. ౫౧.

వ. అది యెట్లంటేనిం జెప్పెద నాకర్ణింపుము. ౫౨.

శా. మాయోపాయులతోడ నెవ్వరలలో ♦ మాయల్ తగం జేయరో
యా యజ్ఞానులచేఁ బరాభవ సముద్రా ♦ వశ్యంబౌన దెట్లున్న నా
మాయాశీలురు మాయవాదులు నవ ♦ ర్మస్థంబులో నంగము
ద్ఘాయం గాల్చెడు వాఁడిబాణములచే ♦ లంగూల్తు సర్వేశ్వరా. ౫౩.

క. కావునఁ గపటాత్ములయెడ, నీవింతయుఁ గపటబుద్ధి ♦ నరపనికతనన్
నీవలన మానినటువలెఁ, దాపల మైయూరుపుష్టి ♦ దలకొనియున్న పా. ౫౪.

మ. ఇదిగాక న్సమయంబు భంగమగునం ♦ చెంతే భయంబందితే
నదిలేదింతయు శత్రురాజుల పకా ♦ రాయత్తులై యుండఁగా
నుదయంబొందఁగఁ గోరు నీకు రిపునా ♦ శోపాయ మూహింపఁ గ
మదిలోన న్సమయావరోధము దలం ♦ పం బాడియే భూవరా. ౨౫.

చ. సమయము చేతను న్విధిప ♦ శంబున నీవిపదంబు రాశిలోఁ
భ్రమను మునింగి తేజమును ♦ బాయుచు నావసువృత్తిహీనమై
తను సముపంటి శత్రుబల ♦ దర్పము గెల్చి సమృద్ధిఁ బొందుని
న్నమరది నాఁడిలక్ష్మియును ♦ యాస్కుని బోలెను బొందుఁ గావుతన్. ౨౬.

వ. అని పల్కి యా ద్రుపదరాజనందన యుపసంహరించెను. ౨౭.

ఉ. అంతట భీముఁ డిట్లనియె ♦ నా ద్రుపదాత్మజ పల్కులన్నియు
త్యంతహితార్థబుద్ధికము ♦ లంచు మనంబున నిశ్చయించి యీ
క్త్యంతరబాధ లేక మహి ♦ తార్థ నిసుంభనయుక్తి మీఱఁగా
నెంతయు నీతిపద్ధతిగ ♦ నిష్ఠయి సంపదగు ధర్మరాజుతోఁ. ౨౮.

ఉ. ధర్మజ వింటివా యిపుడు ♦ ద్రౌపది యెంతయుఁ బ్రేమ నిష్ఠఁ దా
నిర్మలబుద్ధి నెంచి సవి ♦ నీతిగఁ బల్కిన పల్కు లెంతగా
నర్మిలి నెంచి చూచినబృ ♦ హస్పతి కైనను వాగతీతమై
మర్మ మెఱుంగరాక యును ♦ మానుగ విస్మయ మొందఁ జేసెనున్. ౨౯.

ఉ. నీతి గ్రహింపదుస్తరము ♦ నేను మనట్టియు పాయబోధ్యమౌ
నాతఁడు దెల్పఁగా విని జ ♦ లాశయమందు గఁ జొచ్చిన ట్లయా
నీతి గ్రహింపవచ్చు మతి ♦ నేర్చెడివారలు జ్ఞానబోధ్యయా
నాతఁడు గల్గుట బ్రమిది ♦ యాత్మ నెఱుంగుము ధర్మనందనా. ౩౦.

ఉ. హీనబలాఢ్యులౌ నరుల ♦ కెల్లను సంగ్రహణావధానముం
ధానకమాచు నంత్యఫల ♦ దాయకమై మహిఁ జిస్తృతోపమా
యూనయయుక్తి యుందమది ♦ నెంచుమహా వగమంగు సంబటన్
గానఁగ నయ్యెడు న్గుణవి ♦ కాసబహుత్వము గాఁగ ధర్మజా. ౩౧.

చ. అతిరుచిరార్థయుక్తి యిది ♦ యాదరణీయము నిశ్చయంబుగా
నతుల గుణాఢ్య నీకు నిది ♦ యంగన పల్కిన యిప్పుడంటి వా
మతిగల పండితోత్తములు ♦ మాటలలోఁ పలి యర్థమే విని
శ్చితముగ నాదరింతురల ♦ చెప్పెడివారి విశేష మెంతురే. ౩౨.

క. ఒప్పుచునున్నదియెంతయు, నిప్పుడునీపల్కినట్టి ♦ యీయర్థమున
విప్పగిదినైనఁజేయుము, తప్పకయనియంటివేని ♦ ధన్యవిచారా. ౧౦౯.

క. చతురతనీవిపుడెన్నిన, హితకార్యంబింతవినియు ♦ హృదయంబునఁబ్రో
త్తతనిపుడునిర్ణయము నే, నితికెదు ధీవంతమునను ♦ వినుమనఘాత్మా. ౧౧౦.

వ. అదియునుంగాక సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయంబులనెడు షడుపా
యంబులం బ్రయోగించునట్టి విశేషోపాయంబులనుం జెప్పెదనయినప్పుడు. ఎట్లనను
నేమి కార్యప్రవర్తకుండవు గమ్మని యంటివేనిం జెప్పెద నాకర్ణింపుము. ౧౧౧.

క. ఆలోచించక క్రియలను, బాలసుఁడై చేయునేని ♦ బహుమానసమ
స్తాలమగుఁ దెలిసి చేసినఁ, జాలసుఖాశ్రయము గాన ♦ సంపదలందున్. ౧౧౨.

క. గొనకొని సాహసికునకును, ననువుగ ఫలసిద్ధిగానె ♦ యగునని యునికిన్
వినుకాకతాళనిర్ణయ, మనుబోలెను నొక్కవేళఁ ♦ బొందును నిజమే. ౧౧౩.

చ. వలనుగనిర్మలోదకము ♦ వంటివివేకము చేతనిస్ఫురిన్
వెలయఁగ నెవ్వఁడైనఁదన ♦ విత్తులవంటియుపాయముల్ ప్రవ
ర్తిలఁగను జేసినన్ గృషివి ♦ధిన్ బంటికుండు సమగ్రవస్తు స
త్ఫలమును గాంచినట్లతఁడు ♦ తానును గాంచు సదాఫలశ్రియున్. ౧౧౪.

క. అనిమతియును స్వర్గజుఁడి, ట్లనుఁదావచియించునట్ట ♦ ననిలసుతుండున్
విననింపుపుట్టుకొలఁదిగ, మనమునఁదలపోసినీతి ♦ మార్గము నిట్లన్. ౧౧౫.

చ. అనిలజసంప్రదాయసుచి ♦ ద్యుమణి పాండుసుతుండు ప్రీతితోన్
తనువునలంకరించుమతి ♦ దానికలంకరణంబు శాంతిగా
వినుమతిశాంతికిన్ సమయ ♦ విక్రమమాధరణంబు గానికిన్
అనువగుభూషణంబగున ♦ య్యూర్జితసిద్ధిదలంప నెంతయున్. ౧౧౬.

ఆ. వినుప్రయోజనముల ♦ వేగిరించక యెన్ని, తెలిసి సేయుమనుచుఁ ♦ బలికితిపుడు
తెలివియొందువలనఁ ♦ గలదనియంటివే, నవినయముగ వినుము ♦ పోలఁగనుమ. ౧౧౭.

చ. తెరసితమంబువంటిమతి ♦ భేదముగప్పఁగ సద్వివేకికిన్
జోరఁగనశక్యమైపరఁగు ♦ చుండును పాయములందు శాస్త్రమే
తిరముగఁజీఁకటింటికడ ♦ దీపము బోలెడు నర్థదర్శనం
బిరవుగఁజేయుఁగానమతి ♦ యింతకు మూలము శాస్త్రమేసుమీ. ౧౧౮.

వ. ఇవ్విధంబున విచారించి సేయువానికి దైవవశంబున నొక్కయవాంతరంబు ఘటిల్లెనేని,
నేమగునంటివేని లోకపూజ్యులైన మహాత్ములు వర్తించువిధంబున నడవ నిశ్చయించు

వానికి విధివశంబున నిర్హేతుకంబుగా నవరోధప్రాప్తియైన నదియును, నౌన్నత్య సమానంబగుంగాని యితరంబుగా దదియునుంగాక, యిపుడు విచారించి సేయు ప్రకారంబునుం జెప్పెద. విజిగీషుండై ప్రవర్తిల్లువాఁడు, విజితక్రోధుండై గరిష్ఠంబైన భావికార్యంబు ఫలవంతంబగునట్లుగా విచారించి తనపురుషకారం బనుకూలోపాయ విషయప్రవర్తకంబుగాఁ జేయునది. అది యట్లుండె. సమర్థుండైనవాఁడు విజితక్రోధుండు గావలయు నేయని యంటివేని. ౧౧౯.

చ. ఉదయముఁ బొందఁ గోరినపృ ♦ థ్వీశ్వరుఁ డొప్పు వివేకబుద్ధిచే
మొదల నెరోపజంబగుత ♦ మోగుణముఁ ద్యజియించు టుత్తమం
బది యెటులంటివేని యుద ♦ యంబగు భానుఁడు ముందుగా నెఱా
సదమల కాంతి చేఁ దిమిర ♦ సంఘముఁ బాపు సమృద్ధినొందుగా. ౧౨౦.

క. బలహీనుఁడైనవానికి, నలవడునీరీతిఁ జేయ ♦ నధికబలుండై
వెలసెడువానికిఁ గ్రోధము, వలననెజయమానటంచుఁ ♦ బలికెద వేనిన్. ౧౨౧.

మ. బలవంతుండగునేని యెవ్వఁడిలఁ గో ♦ పప్రాప్తమౌ తామసం
బులయం బొందఁగఁ జేయఁడో యతఁడెపో ♦ మూర్తిశశాంకాంశువుల్
పొలియం జేసెడు కృష్ణపక్షము క్రియం ♦ బోఁగొట్టుఁ నానెంతయున్
లలితంబైన త్రిశక్తిసంపదలనె ♦ ల్లం గార్యహీనంబుగాన్. ౧౨౨.

వ. ఇట్లుంగాక విచారించి సేయు ప్రకారంబునుం జెప్పెద. ౧౨౩.

క. సమయంబగుతఱి నెవ్వఁడు, సమముగ మృదుతీక్ష్ణవృత్తి ♦ సలుపునతఁడు దాఁ
గమలాప్తుపగిది లోకము, విమలంబగు తేజమునను ♦ వినుము వసించున్. ౧౨౪.

సీ. ఈరీతి నెంతయు ♦ నెంచి సేయక యున్నఁ, జిరకాలమును వశీ ♦ కరములగుచుఁ
బొలఁగక సంపదల్ ♦ నిలుచుట యెక్కడ, కల్లరితేజీల ♦ కరణిఁ జంచ
లములైన పంచేంద్రి ♦ యములవశ్యంబేడ, రెండును నొకచోట ♦ నుండవగయు
నదియెట్టులన్నను ♦ నతిచంచలత బహు, వ్యాజప్రవర్తనం ♦ బగఁగుచుండు
సంపదల నిర్జితేంద్రియ ♦ సమితి చేత, సరసి లెస్సగ రక్షింప ♦ నలవిగావు
పృథమి నొకవేళఁ బొందిన ♦ పొందుగాని, నిలిచి యుండవు వినుమది ♦ నీతునొప్ప.

ఆ. ఇట్లుగావున నను ♦ యేతరంబగువేళ, నుదరిపడుచుఁ గ్రోధ ♦ ముత్కటముగఁ
జేయుచీవు ధైర్య ♦ జితపయోనిధివిష్ణు, పెద్దజేసెదేల ♦ జేలపగుచు. ౧౨౫.

ఆ. తనకుఁ జిల్లియుండఁ ♦ దానిట్టు లేటికి, నింద్రియములనిగ్ర ♦ హింపనలయు
ననుచుఁ బల్కెదేని ♦ యనిలతనూభవ, వినుము తెలిపెదను ♦ విశదముగను. ౧౨౬.

తరణిచేతవిభాగ ♦ తనుబొందుకమలాక, రములుబోలెనుభేద ♦ గమితులగుచు
మనతోడనిలుతురు ♦ మఱియుఁదక్కినరాజు, లనుకూలమగుదురే ♦ యనెదవేని
కడఁగిదుర్యోధనునిమద ♦ గర్వమునను, జులకగాఁజూచునటుగాన ♦ సులభముగను
భేదపడుదురదెట్లన్నఁ ♦ బృథివిలోనఁ, బ్రకృతిజనుఁడునునవమాన ♦ పడఁడుగాన.

ఆ. శౌర్యవంతులైన ♦ జననాథులైనచోఁ, జులుకదనమునోర్చి ♦ తొలిచియుండు
రనుచుఁజెప్పనేల ♦ యటుగానవారల, భేదపుచ్చవచ్చు ♦ వేగిరంబె. ౧౩౮.

చ. కరముసుయోధనుండుమద ♦ గర్వముచేతనుగొల్చువారలన్
గుఱుతరవృత్తిఁజూడఁడని ♦ కొంకకపల్కుటవిష్టమున్ననే
చఱుఁదటుదెల్పఁడేతనదు ♦ సభ్యులనుంబలెఁజూచునంచున
ట్లరసెడువాఁడునేఁడుమద ♦ హంకరుఁడెట్లగునంటివేనియున్. ౧౩౯.

ఉ. ఆరసికృత్యవర్తనము ♦ సాంగతఁజేయనియట్టియాయహం
కారులసంపదల్వినుము ♦ కార్యవశంబుననాదరార్థమై
వారితవేగవన్మదము ♦ వర్ధితమైకనుపట్టఁజేయఁగాఁ
గారణమౌనసుమ్మదియుఁ ♦ గాకనువెండియునెంచిచూడఁగన్. ౧౪౦.

ఆ. చనమదాత్తమాన ♦ సమునవెంగలియగు, నృపతిమూఢుఁడగును ♦ నిజముగాను
నృపతిమూఢుఁడైన ♦ నీతిహీనుండగు, నీతిరహితుఁజులుకఁ ♦ జూతురవని. ౧౪౧.

వ. అట్లుగావున. ౧౪౨.

ఉ. ఓలిమదంబుచేవికల ♦ మొందితనంతపలాయమానమౌ
మూలబలంబుగల్గురిపు ♦ భూపతినిస్త్రిమారుతాహతిన్
మూలములెల్లఁగూలఁగను ♦ బొందిచలించెడుభూరుహంబునుం
బోలెసహిష్ణుఁడొప్పెయినె ♦ ముట్టివధింపవలంతియౌఁగడున్. ౧౪౩.

క. అంతర్భేదముఁబొందిన, యంతనెరిపులెట్లుసాధ్యు ♦ లౌదురటంచున్
జింతించిపల్కితేనది, యంతయువిపరింతుఁదలియు ♦ మనిలతనూజా. ౧౪౪.

చ. అరయుఁగనాస్తవర్గజని ♦ తాగ్రహమెంతయునల్పమైననున్
జెలుచునుభూపతిన్నిజము ♦ శీఘ్రముగానదియొప్పులంటివా
తరునికరప్రభూతశిఖి ♦ తప్తముగాఁగమహీధరంబుదా
నురువడిఁగాల్పదేవినుము ♦ కోదరయంతయుమూలముట్టుగన్. ౧౪౫.

క. ఎనయుఁగనిటువలెనైనను, మునుకౌనిశాత్రవుఁడువృద్ధి ♦ పొందుచునుండిం
గనుఁగొనుచునూరకుండఁగ, నొనరునెయ్యినియంటివేని ♦ యునువినుమనఘా. ౧౪౬.

క. మతిమంతుఁడనీతిరిపున్, న్నతియోప్చుననీతిహీన ♦ నరనాథసము
న్నతిమతివిపదంతమగుక్, అతనిజయింపంగసుకర ♦ మయ్యెడికతనక్. ౧౪౭.

వ. ఇట్లు దుర్నీతుండైన శాత్రవు నెట్లు సాధింపనచ్చునని యంటివేని. ౧౪౮.

చ. వెలయులఘుత్వవృత్తికడు ♦ ఛేదితులౌసుహృదాదిబాహ్యులున్
అలసచివాదమతైనతన ♦ యాప్తులుగల్గనివిపక్షభూపుమం
డలముసమీపషైత్రనర ♦ నాయకుఁడాఁగినదీరయంబుదా
గులగులలైనెరల్విడుచు ♦ కూలముమంబలేఁదాహరించుఁగా. ౧౪౯.

క. ఈకరణిరిపులఁదునుమఁగ, నాకులపడుభీమునకున ♦ నాకులముగఁదా
సాకల్యంబుగనయబో, ధాకరణము సేయుమందు ♦ ధర్మజుకడకున్. ౧౫౦.

సీ. అతులితకరుణార ♦ సార్ద్రవీక్షణముల, వివిధమామృగపక్షి ♦ వితతినెల్ల
వశముగాఁజేయుచుఁ ♦ బాపసంచయదాహ, కంబునుదర్పని ♦ యుంబునగుచు
దిక్కులవెలుఁగొందు ♦ దివ్యతేజంబును, ధరియించియాశ్చర్య ♦ కరిముగాఁగఁ
బుణ్యసంచయమెల్ల ♦ మూర్తివహించిని, ల్చినరీతివాంగొ ♦ నర్థిఁబోలె
నాగమోద్ధారియతులత ♦ బోధిసందు, పరమతత్త్వజ్ఞుఁడనుపమ ♦ శరతనూజుఁ
డర్థినేతెంచినిలిచెఁబ్ర ♦ త్యక్షముగను, ధర్మసూనుండుజూచిసం ♦ తసమునంది.

వ. ఇట్లేతెంచిన వేదవ్యాసమహామునింగాంచి యాధర్మనందనుండు సంతోషభరితాంతఃకరణుం డగుచు, మేరుమహీధరశిఖరంబునఁబొల్చునగుణకిరణప్రభాభిరాముం డగు భానుండునుంబోలె, విధూతతరుణపల్లవాగ్రుం డగుచు సమున్నతకాంచనసింహాసనంబు దిగ్గన డిగ్గి యప్రమత్తుండై యమ్మహానుభావు వినయ్యక్త్రప్రకారంబునఁ బూజించి యనంతరంబ తదనుజ్ఞాతుండై ... యలంకరించుచుఁదొంతియునుంబోలె, నాత్మసింహాసనాసీనుండై దరహాసప్రభావిభాసితాధరోష్ఠుండును, దీర్ఘభాముండును నై చెలువొందు నత్తపోధనసత్తమున కభిముఖుండై తేజోవిరాజితుండైన బృహస్పతిసన్నిధానంబున నొప్పుసంపూర్ణచంద్రు ననుకరించుచు నాశ్లాఘకరోగ్రవ్రసహాతాంశుజాలోన్నతుండును, పిశంగానిలజటాధరుండును, విద్యుత్సంకలితాంబుదసంకాశదేహుండును, సమగ్రసౌమ్యతావిటపిచ్ఛాయాశీతలుండును, వపుఃప్రకర్షతాపరచితజనమనస్సంజాతస్నేహార్ద్రభావుండును, శాంతస్వరూపప్రకటితవివిక్తాంతఃకరణవ్యాపారుండును, ధర్మప్రతిపాదకాధుచ్ఛిద్రశ్రుతిస్వరూపుండును, సుఖోపవిష్టుండును, కరుణాకటాక్షవిరచితకుశలప్రశ్నుండునునుంబోలెఁ బ్రకాశించు నమ్మహానుభావు రాకకుం గారణంబు తెలియ నిశ్చయించినవాఁడై యిట్లనియె. ౧౫౧.

క. మునినాథపుణ్యహీనుల, కనయముఁ బొందంగరాక ♦ నపగతరజమై
కనుపట్టుమీదుదర్శన, మొనరెను వీతాభ్రభవ్యప్రాప్తి ♦ యనుబోలెఁగడున్. ౧౫౩.

సీ. క్రతుకర్మములుకోరి ♦ కలనీగసాగెను, బ్రహ్మాలాశీర్వాద ♦ ఫలితులైరి
భవబంధములనెల్లఁ ♦ బాసినేనెంతయుఁ, బూజ్యుండనైతిని ♦ బుడమిలోనఁ
బరమేష్ఠివలెజగ ♦ ద్గురువనైవిఖ్యాతి, నెలకొన్న వరతపో ♦ నిధినిబరమ
శాంతుసాక్షాద్భగ ♦ వంతునాగమువిభో, గునినిన్నునేఁడుగ ♦ న్గొనుటకతన
సంపదలుహెచ్చెఁబాపముల్ ♦ సమసెసుఖము, లెదురుకొనెఁగీర్తిదిక్కుల ♦ నెల్లనిండె
నేమిఫలమింకరానున్న ♦ దోమహాత్మ, యిన్నికయుపోవునేనేను ♦ మిమ్ముఁగనుట.

చ. అమృతమరీచిఁజూచియును ♦ హర్షముఁబొందనిచక్షురింద్రియం
బమరఁగనిన్నుఁజూచిముద ♦ మందెడినేఁడిదెచిత్తముంగడున్
బ్రమదముఁబొందెబంధువులఁ ♦ బాసినదుఃఖముఁబోవనాడుచున్
శమదమసత్యతత్వశుచి ♦ సారపరాశరమానినందనా. ౧౫౪.

ఆ. నిస్పృహాత్ములైన ♦ నీయట్టితపసుల, కేమిసేయునట్టి ♦ దేమిలేదు
వినవనీదుపలుకు ♦ లతిసుభంబులునాకు, హితముగానవినఁగ ♦ నిచ్చపుట్టె. ౧౫౫.

క. అనవుడుఁగృష్ణద్వైపా, యనుఁడిట్టులువిజయకాంక్ష ♦ నతిశయమునన్
గొనియాడుచుండునయ్యమ, తనయునితోఁగూర్మిమీఱఁ ♦ దానిట్టులనున్. ౧౫౬.

వ. ఇట్లు పలుకందొడంగినవాఁడై యా తపోధనుం డాత్మీయంబైన యామునగ్యస్తదోషంబు
పరిహారంబుసేయువాఁడై యిట్లనియె. ౧౫౭.

సీ. వినుధర్మనందన ♦ మనమునవిహపరం, బులయశోభూషణ ♦ మునుఘనంబు
నైనసంపదఁబొంద ♦ నభిలషించినవారి, కాత్మబంధువులందు ♦ ననవరతము
నొప్పఁగానమవృత్తి ♦ నుండుటయుడియుక్త, మందులోఁదపసుల ♦ కరసిచూడ
నిజముగావలయును ♦ నెఱినట్టులయిననేఁ, జనఘనీగుణవిశే ♦ షాతిశయము
కతననీమీఁదికూరిమి ♦ గడలుకొనఁగ, నిరుపమానందవైభవ ♦ భరితనుగుచు
నిలిచియున్నదియిట్టట్టు ♦ వోలఁగకిపుడు, నాదుహృదయంబునీయుధి ♦ ష్ఠిరునుజెంది.

ఆ. ధరవిరక్తులైన ♦ తపసులకెల్లల, పక్షపాతమునుచుఁ ♦ బలికెదేని
మొనసినిస్పృహులకు ♦ మోక్షకాములకును, నరయఁబ్రీతిగుణముల ♦ యందకాదె.

వ. అని మఱియును నా ధర్మనందనుగుణాతిశయంబును, ధృతరాష్ట్రదుశ్చరితంబునుం
బ్రకటించి యుత్సాహంబుపుట్టించువాఁడై యిట్లనియె. ౧౬౧.

క. వీరలుధృతరాష్ట్రునకుఁగు, మారులుమతిగారాబుద్ధి ♦ మంతులుగారో
యూరకవిడనాడెనుమిముఁ, బోరుచుభోగేచ్ఛమోహ ♦ మునుజేయునెకా. ౧౬౨.

మ. అనయంబీగతిమూఢచిత్తునకున ♦ ర్థావాప్తియత్నానదె
ట్లనినన్ సౌబలకర్ణముఖ్యకృత ♦ కార్యార్థీనుఁడైనాఁడుదు
ర్జనసంసర్గజితాంతరాయమునుని ♦ స్సారంబునాపత్ప్రదం
బును గాన్మతియర్థహానియులయం ♦ బుంబొందునాకష్టునిన్. ౧౬౩.

చ. పాడిఁదొలంగిద్రౌపదిని ♦ బాములఁబెట్టఁగనద్దనంగనో
రాడకయూరకేసభికు ♦ లందఱునుండఁగనీవువారిపైఁ
గీడుదలంపకుండితివి ♦ కేవలశాంతినయిట్టినీకుఁజే
కూడదెకార్యసిద్ధినయ ♦ కోవిదపాండవవంశవర్ధనా. ౧౬౪.

చ. నిరుపమశాంతశీలునకు ♦ నీకునమిత్రులునాత్మనీనపై
పరఁగుమహాపకారమునఁ ♦ బ్రాప్తమొఱుంగకక్రూరబుద్ధిపై
నెరయఁగఁజేసిరందునను ♦ నీమతిశీలమతిప్రకాశమై
కరముప్రసిద్ధికెక్కెనుప ♦ కారులెపోమతినీకువారలున్. ౧౬౫.

చ. చటులపరాక్రమంబునవ ♦ శంబగుభూమియుదెచ్చులంటినా
పటుబలశౌర్యభాణములఁ ♦ బ్రస్తుతికెక్కినవారుశత్రులీ
పటువలెఁగావుననీవునుమ ♦ హత్తరయత్నముసేయనొప్పును
త్కటమగుబల్మిగల్గునెడఁ ♦ దావిజయాసనలక్ష్మిఁబొందుగా. ౧౬౬.

వ. అదియునుంగాక. ౧౬౭.

చ. ఇరువదియొక్కమాఱుధర ♦ ణీశులఁగొట్టినయట్టిమేటిన
ద్గురుఁడనిజామదగ్న్యునకుఁ ♦ గొంకకెదిర్చియునంబకాకడున్
దురమునఁబాఱఁదోలితన ♦ దోర్బలమాగురుఁడాత్మలోనన
చ్చెరువడియెంచునట్లుగను ♦ జేసినభీష్మునిగెల్వశక్యమే. ౧౬౮.

మ. అదిగాకాతనికెంచిచూచిననిజా ♦ త్మాయత్తపంచత్వమం
చెదలజ్జించుచుశక్తిలేకజముఁడు ♦ న్నెంతేపరాభూతుఁడై
మదిభీతిల్లునునట్టిభీష్ముఁడనిభీ ♦ మంబైనవిల్ద్రిప్పుచున్
గదియన్భీతిఁదొలంగకేరునిలువం ♦ గానోపువారీధరన్. ౧౬౯.

చ. రణమునునుగ్రసాయకప ♦ రంపరలన్నిగుఁగుర్లుగ్రక్కుచున్
గొణకనుజంవలోజ్జ్వలశి ♦ ఖిల్ఖునజిహ్వలయట్లుగాఁగఁదా

గణఁగి జగంబు మ్రింగు బలు ♦ గాంచును మందుఁడు గాంతవహ్నినాఁ
దొణఁగి మహోద్ధతిన్ నడుచు ♦ ద్రోణుని నైనను నోర్వ శక్యమే. ౧౭౦.

మ. పరమాటోపనిరస్తధైర్యరిపుభూ ♦ పాలుండు శూరుండు స
ద్గురుభావాశ్రితజామదగ్న్యుఁడు లస ♦ ద్దోర్దండుఁ డా కర్ణునిన్
బరఁగం జూచి సుసంస్తుతంబగు భ ♦ యప్రాప్తిన్ వెసం బొందుచున్
బరువెత్తుం గతిమృత్యువేని యతని ♦ న్మర్దింపఁగా వచ్చునే. ౧౭౧.

వ. అని పల్కి తదనంతరకరణీయంబగు కృత్యంబును నిజాగమనప్రయోజనంబునుం దేట
పఱచువాఁడై యిట్లనియె. ౧౭౨.

మ. విను దేవాధిపమంత్రరూపమగు నీ ♦ విద్యన్ దపోవర్తినై
ఘనమాపాశుపతాదిదివ్యశరశి ♦ క్షంబొంది శూరుండునై
పెనుపన్ క్రతనూజు చేత నిపుడీ ♦ భీష్మాదులెల్లన్ రణం
బున మ్రందం గలరీవు జూడఁగను ని ♦ ర్మూలంబుగా నందఱున్. ౧౭౩.

మ. ధరణీనాయక నీకు నేఁడు సుమహ ♦ త్త్వప్రాప్తికై దేవతా
వరమంత్రాంకితమున్ మహత్తరసుర ♦ వ్రాతప్రసాదోదయ
స్థిరసామర్థ్యము నైన విద్య ఫలసి ♦ ద్ధింబోలె నే నీయఁగా
నరయం బాత్రుఁడవీ వెయంచు మదిలో ♦ హర్షించి యేతెంచితిన్. ౧౭౪.

శా. ఈ రీతిం దగ నెంచి పల్కుచును నెం ♦ తేనిం బ్రసన్నాత్ముఁడౌ
పారాశర్యుని సన్నిధానమునకున్ ♦ బ్రత్యుద్గతస్వాంతుఁడై
శూరుండగ్రజుఁ డేగుదెంచెఁ బ్రియశి ♦ ష్యుండుం బలెం బొమ్ము చే
కూరం జేయుమటంచు ధర్మజుఁడు దాఁ ♦ గూర్మిం దగం బల్కఁగన్. ౧౭౫.

వ. ఇట్లేతెంచిన యనంతరంబున. ౧౭౬.

ఉ. వ్యాసముఖంబున న్వెడలి ♦ వహ్నికణోజ్జ్వలగౌరవర్ణమై
వాసవమంత్రరూపమున ♦ వార్తకు నెక్కినవిద్య యగ్రజనో
ద్భాసితవక్త్రమధ్యమునఁ ♦ బర్వుచుఁ బొందె దినోదయంబునన్
భాసిలుసూర్యదీప్తివిరి ♦ పద్మమునుం బలెఁ గాంతిపుంజమై. ౧౭౭.

చ. ప్రకటముగాఁగఁ దన్నియమ ♦ భాసురయోగవిశేషదేశమున్
అకలుషసత్ప్రభావమున ♦ నప్పుడె సేసెఁ దదీయసిద్ధిచేఁ
బ్రకృతిమహాత్ములన్విదిత ♦ భావము గన్నడె మాలముట్టుగా
వికసితమయ్యె సాదగువి ♦ వేకము దృష్టియు నద్భుతంబుగన్. ౧౭౮.

చ. ఒనరఁగ నా మునీంద్రుఁడు జ ♦ యోదయ మైన తపస్సమాధిఁ బా
ననువుగఁ గూర్పఁగాఁ దలఁచి ♦ యాత్మకు నెంతయు సానుకూల మై
తనరుచు భూరిలాభకథి ♦ తంబగు నాకృతిఁ దాల్చియున్న య
ర్జునకు నిట్లను న్నియమ ♦ సూచక మై తగునట్టు లెంతయు౯. ౧౨౯.

శా. ఏనీ చెప్పిన యోగమార్గమున నెం ♦ తే సుప్రకాశుండ నై
మౌనాభ్యాసులపద్ధతి౯ దెలిసినీ ♦ మార్గంబ దెవ్వారికి
న్గానన్రాక నిగూఢ మై పరఁగఁగా ♦ స్నానోపవాసవ్రతా
నూనం బైన జపంబుల౯ సలుపుమీ ♦ సోగ్రాస్త్రశస్త్రుండ వై. ౧౩౦.

చ. సరభసవృత్తి నింద్రుని ప్ర ♦ సన్నత నోరు మ యోగనిష్ఠ చేఁ
బరఁగఁగ నీవు సేసెదు త ♦ పంబున కుందగు నింద్రకీలము౯
సురగిరి దాని నీక్షణమె ♦ చూపఁగలం డిదె పేఁడె యక్షుఁడుం
చను దుగఁ బల్కి వెల్చె వొక ♦ యక్షుఁడు దానఁ బుష్పకంబుగ౯. ౧౩౧.

క. ఇప్పగిది నప్పగించుచు, నప్పుడె యోగానకాని యదిగె ♦ నంత వ్యాసుఁడుం
తప్పక ముని యాజ్ఞ యుఁ బలె, నప్పార్థుని ప్రోలనిల్చె ♦ నయ్యక్షుండు౯. ౧౩౨.

వ. అంత. ౧౩౩.

మ. నయ మొప్పంగను యక్షుఁడుం బ్రణతుఁడై ♦ నవ్యానురాగంబు చేఁ
బ్రియవాక్యంబులు పల్కుచుండు నరుతోఁ ♦ బ్రీతాత్ముఁడై స్నేహము౯
నియతాత్ముం డగఁ జేసె నంతట నెయరా ♦ నే సంగముం బెట్టు నం
శయ మున్న౯ మఱి సాధుసంగమమున౯ ♦ సఖ్యక్రియ ల్పొందఁగా. ౧౩౪.

ఉ. అంతట నింద్రసూనుఁడు ద ♦ యాప్తికి నై యొడఁబాయ ముందభా
స్వంతుఁడు నట్లు నేచనఁగఁ ♦ జాఱుబృహద్ద్యుతి మేరుగిరుఘా
భ్యంతరసీమలం బలెయ ♦ మాత్మజుఁ డాదిగఁ బాండవేయుల౯
గొంతతమంబు బొందెమది ♦ కొంకుచుఁ దాఁ బ్రసభాత్మలాభ మై. ౧౩౫.

సీ. రమణీయ కార్యగా ♦ రవవిలోకనతము, స్పరిహరింపంబడి ♦ తిగుగ భ్రాతృ
వాత్సల్యమునఁ బొందఁ ♦ బడి వారియందుని, భాజ్యమానంబు గాఁ ♦ బ్రాప్త మైన
యాదుఃఖ మతిభార ♦ మైన దేని విభాగ, ములఁ బొందుకతమునఁ ♦ బాలక మైన
యట్లు వారికిఁ దోఁచి ♦ యతిధైర్యమునఁ బరాం, శరవాక్యసామర్థ్య ♦ గరిమ నెమ్మిఁ
బరుల చేఁ బుట్టు తీవ్రశో ♦ కము ననుని, పూరతయు నెంచుకొనుచుండు ♦ వారి యందు
కాంచి చూడంగ నాస్పద ♦ మింత దైన, గలిగి వసియింపఁగా లేక ♦ తాలఁగె నపుడు.

తే. తొలఁగిశోభిల్లువారల ♦ నలుగురినిని, బగటిజాములనాల్గింటి ♦ బలెనువిడిచి
యంధకారంబునిశిఁబొంది ♦ నట్లుకృష్ణ, నేక మైపొం దెనాఖేద ♦ మెల్లఁగూడి.

మ. అపుడా ద్రౌపదిచూచు ప్రేమయధికం ♦ బైనన్ సబాష్పంబునై
చపలోత్ఫుల్లతుషారతోయకణసం ♦ ఛన్నోత్పలాభంబునై
విపులంబౌకనుదోయిమీలనముగా ♦ వింపంగలేదయ్యెఁబా
ష్పపరిస్రావముబుట్టదానదొసఁగుల్ ♦ ప్రాపించునానెన్నుచున్. ౧౮౮.

చ. అకలుషితానురాగసుర ♦ సాంచితముల్ లలనార్పితంబునన్
బ్రకటితదృక్ప్రియంబునగు ♦ ద్రౌపదిచూపవుషస్సునందుఁదా
వికసితమానసాంజలిని ♦ వేడుకతోడుతఁగూర్మి మీఱఁగా
సకలమునుంగ్రహించెఁబధ ♦ సంబలముంబలెవాంఛితాత్ముఁడై. ౧౮౯.

వ. ఆ సమయంబున నవ్విజయుండ నభిముఖంబుగా నిలిచి కోపం బుత్కటంబుగాఁ జేయం
దలంచి. ౧౯౦.

తే. వనగజము చేతనాశర ♦ ద్వ్యాహినిబలె, విగతధృతి చేతమాలిన్య ♦ వేవడైన
ద్రుపదరాట్పుత్రికన్నీరు ♦ గ్రుక్కికొనుచు, వరునితోఁబల్కెగద్గద ♦ స్వరముదొలఁక.

ఆ. పంకసన్నిభంబు ♦ పరులు చేసినయట్టి, కపటమునను మునుఁగు ♦ గౌరవంబు
నొగిని సంపదలను ♦ నుద్ధరింపఁగలవు, నీవుమష్టుఁబాసి ♦ నిర్మలాత్మ. ౧౯౨.

క. ఆసుల నెల్లమదొలఁగఁగ, బాధించెడు నీతపంబు ♦ పరిపక్వంబై
సాధింపఁబడినదాఁకను, మాధవుఁదలపోయుచుండు ♦ మదిఁగలఁగకుమీ. ౧౯౩.

చ. అతులయశంబుఁబొందసుఖ ♦ మందఁగనైనమనుష్యసంఖ్యదా
నతికరియింపనైనమది ♦ నాస్థదలిర్పఁగనిర్మలాత్ములై
సతతమునుండువారలకుఁ ♦ జయ్యనఁబొందును నర్థసిద్ధిదా
మతినసురాగియైనయల ♦ మానినియుంబలెఁదన్నిజాంకమున్. ౧౯౪.

సీ. వినులోకరక్షణ ♦ మునకు బ్రహ్మసృజించు, క్షత్రతేజంబెల్ల ♦ సమసిపోవ
నధికతేజోవంతు ♦ లనుమాట ప్రాణసం, కాశాభిమానంబు ♦ నాశమొంద
నాత్మకృత్యంబంచు ♦ నచటిరాజులుసంశ, యించినవ్రతనిచ్చ ♦ గించిమాడ
నతిదిగ్వికీర్ణమై ♦ యలభూవితానంబు, లెల్లనొప్పుయశంబు ♦ లేర్పడంగ
శూరకర్మంబువిఖ్యాతి ♦ చూఱఁబోవ, నాయతులుదూలమనకిపు ♦ డగులు సేయు
పరిభవమునిన్నునేఁడెడఁ ♦ బాయుకతనఁ, దలఁచిమదినుచ్చరింపను ♦ దరముగాదు.

మ. మదినీవిప్పుడుమమ్ముఁబాసి చనఁగా ♦ మామీఁదివాత్సల్యతన్
గదియున్ విఘ్నములెన్నియేనవియుమ ♦ గ్నంబొందఁగా భక్తినీ
హృదయంబందునుపాస్తిసేయుమలజే ♦ పేంద్రుండునీకెంతయున్
సదయుండై వెసఁ జేయుఁగా కతపమున్ ♦ సాఫల్యతన్ బొందఁగన్. ౨౦౬.

క. జనరహితమంగళస్థల, మున నొకఁడవెయుండి మోస ♦ మునఁ బొందకుమీ
వినుమత్సరరాగాత్ములు, చెనఁటులు సాధువులనైనఁ ♦ జెఱుతురు జగతిన్. ౨౦౭.

మ. అదిగానన్ మఱియప్రమాదమున నా ♦ వ్యాసోపదేశంబున
న్మృదమొప్పంగను వేగఁ జేసి దయతో ♦ మాకోర్కెలీడేర్చుమీ
తిదుదంచత్ఫలసిద్ధినీవు కృతకృ ♦ త్యత్వంబునున్ బొందిరా
ముదితాత్మున్నినుఁ గౌఁగిలింతుఁ గుచముల్ ♦ మోవంగ నేసత్తతిన్. ౨౦౮.

క. అని పరిభవంబు మఱి నూ, తనకృతమైతోఁచ నిట్లు ♦ ద్రౌపది పల్కన్
విని కవలియుత్తరాయణ, దినకరుఁడుం బోలె నరుఁడు ♦ దీంద్రించెఁగడున్. ౨౦౯.

ఉ. అంటుశత్రులందనని ♦ జాగ్రమునంగనుఁగొన్నయట్లుదా
నెంతయు భీషణాకృతివ ♦ హించెఁ బురోహితదత్తశస్త్రిఁడై
వింతగసౌమ్యుఁడయ్యు నిజ ♦ విగ్రహమందుల మారణక్రియన్
మంతుకు నెక్కినట్టిఘన ♦ మంత్రముఁబోలెఁ బ్రచండమూర్తియై. ౨౧౦.

వ. అంత. ౨౧౧.

సీ. సౌమ్యుండుమంత్రపూ ♦ తంబుగానట్టిచ్చు, నిశితఖడ్గముఁగేల ♦ నెఱయఁదాల్చి
ప్రస్ఫుటాస్త్రసంధాన ♦ పటుతరజ్యాకర్ష, ణామోఘమైనవి ♦ ల్లమరఁబూని
కవచానల్ బిగియించి ♦ నవరత్నఖచితమై, యింద్రాయుధత్విషతుల్ ♦ సాంద్రతేజ
మునఁగ్రొత్తిచేతఁబో ♦ లెను సారెఁగడుపుచు, తారకోజ్జ్వలనభో ♦ తరముమాడ్కిఁ
దనరు కవచంబు ధరియించి ♦ ధనవభృత్య, విదితమాంగల్యహిమశైల ♦ పదవి నడచె
నపటిమానులు ధర్మజుం ♦ డనుపలేక, కొంతవెతఁబొందఁగా వారి ♦ కంత్రముక్కి.

వ. ఇవ్విధంబున నవ్విజయుండు ప్రయాణోన్ముఖుండై చను సమయంబున. ౨౧౩.

క. కురిసెను బువ్వుల వానలు, మొరసెను సురలోకదుందు ♦ భులతోదిక్కుల్
శరనిధిప్రియసూచకుఁడయి, వరుణుంబలెఁబొంగి వెడలి ♦ వసుమతిఁగదిసెన్. ౨౧౪.

వ. తదనంతరకథాక్రమంబు విన్నవించెద. ౨౧౫.

క. కరనిశితనఖవిదారిత, పరకాంచనకశిపువక్ష ♦ పాండవపక్షా
కరిరక్షాఖిలశిక్షా, నరభక్షణహరణదక్ష ♦ నరహర్యక్షా. ౨౧౬.

మత్తకోకిల. రాజహంసను నేత్రకోసల ♦ రాట్సుతాపరపుత్రవి
భ్రాజమానసుగాత్రకౌరవ ♦ రాజసన్నగవేత్రది
గ్రాజసన్నుతసత్యకీర్తివి ♦ రాజమానచరిత్రస
ద్భోజరాజసుతామనోహర ♦ పూజ్యమానదయానిధీ. ౨౧౭.

గద్యము. ఇది శ్రీమదహోబలలక్ష్మీనృసింహకటాక్షలబ్ధకవితావిచిత్ర మౌద్గల్యసగోత్ర గోపాలునికులపవిత్ర భాస్కరామాత్యపౌత్ర వీరనమంత్రిపుత్ర సరసభాగవతపూజావిధేయ సింగయనామధేయప్రణీతం బైనకిరాతార్జునీయంబను మహాకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

# ద్వితీయాశ్వాసము.



క. శ్రీరాజితఘనవక్షా, సారాంబుజసన్నిభాక్ష ♦ సంయమిరక్షా
ధారాగరుడాధ్యక్షా, నారాయణనయవిచక్ష ♦ నరహర్యక్షా. ౧.

వ. అవధరింపు మవ్విధంబున నా ధనంజయుండు శుభనిమిత్తంబులు గనుంగొనుచు ద్వైతవనంబు వెడలి శరత్కాలోపశోభితంబై కూజద్రాజహంసమాలికాకాంచికయుఁ బరిపక్వసస్యాహితపాండుతాగుణంబునం బరిపూర్ణయౌవనంబున సఖీపరివృతయై యొప్పు ప్రియురాలుం బోలెఁ బ్రకాశించు జనసమీపప్రదేశంబు డాయం జని వినమ్రశాలిప్రసవాభిరామంబై యపగతపంకిలత్వంబునుం బొందుచు, నకలంకపంకరుహసంకలితాభంబులై యుపాయనీభూతశరత్కాలసంపదలం బొదలు నుదారంబులైన యకృత్రిమకేదారంబులం గని యానందించుచు విస్మయాకులత్వంబునను న్మీలితాంభోరుహలోచనంబులైన సరోవరంబులచేతం దిలకింపంబడుచు, నిజాంగనావిలోకనవిలాసవిభ్రమానుకారంబులు గాఁ బొరలు శఫరీవివృత్తంబులయందుఁ జిత్తంబు హత్తించుచు, మఱియు సవారిజంబైన కేదారవారియందు విరాజమానంబగు శాలిరామణీయకం బవలోకించి సుదుర్లభంబైన యనురూపసంగమం బింత యొప్పుసేయని యుత్కర్షలక్ష్మీవిలాసంబు నగ్గించుచు, కింజల్కవిష్కృతఫేనపుంజోదకంబైన కంజంబులయందు రంజితస్థలపంకేరుహాశంకాంకురితమానసుండై తత్క్షణసాక్షీనోల్లుంఠితోపలక్షితాంబువుల వలన నశంకితుం డగుచు, ననుదినక్షీయమాణంబులై పర్యాయక్రమంబునం బ్రకాంతరయంబులైన తోయంబులచేతం గృతోర్మిరేఖాకారంబులై నెరికలఁ జెలువారు వెలిపట్టుపుట్టంబులమాడ్కి నతిశుభ్రంబులై కనుపట్టు విమలనదీపులినంబులం గని సంతోషించుచుం జని చని ముందట. ౨.

సీ. భ్రూమధ్యమునను బు ♦ ప్పొడిమీఁదవింతగాఁ, దాల్చినబంధూక ♦ దళముఁగాంచి
యావకరపదయుక్త ♦ మగుచునింపులుగుల్కఁ, పల్లవాధరశోభ ♦ నుల్లసింపఁ
గుదురుచక్కనిగబ్బి ♦ గుబ్బలునిండఁగా, మాటికిజల్లుతో ♦ మరసరజము
నెరసినచెమటచే ♦ వరపద్మరాగసం, కలితమౌక్తికహార ♦ గరిమనెఱపఁ
గలితకర్ణోత్పలద్యుతుల్ ♦ గలసివెలయు, చారురుచినేత్రిశుభగాత్రి ♦ శాలిగోప్త్రిఁ
గాంచికడుమెచ్చెనాశరత్ ♦ కాలమహిమ, నేఁడుసాఫల్యమునుబొందెఁ ♦ జూడననుచు.

వ. వెండియు, ౩.

మ. జననాథోత్తమనిర్మలాభ్రయుతమై ♦ స్వచ్ఛాంబుకల్లోలినుల్
దనరం గాశుభదైవదానఫలకా ♦ లంబుంబలెన్ లోకముల్
ఘనసాఫల్యతనొందఁజేసెడుశర ♦ త్కాలంబునీకెంతయే
ననుకూలంబుగఁజేయుఁగాకవిజయో ♦ ద్యల్లక్ష్మినింద్రాత్మజా. ౧౩.

సీ. అవెచూచితేదేవ ♦ నదులెల్లనౌద్ధత్య, రహితలై కనుపట్టె ♦ రమ్యలగుచుఁ
బరిపక్వఫలములై ♦ పైరులెంతయునొప్పె, ధరయెల్లరహితక ♦ ర్దమతఁబొంచె
వర్షాగమాసక్త ♦ వాంఛయంతయువీడి, శరదృతుపతిగుణా ♦ సక్తమయ్యె
ఘనపదంబుబలాక ♦ గమనంబులునునింద్ర, చాపనీలాభ్రసం ♦ చారములును
సారిదిలేకున్ననిర్మల ♦ స్ఫూర్తిచేతఁ, దనరుచున్నదియెట్లన్నఁ ♦ దనకుఁదానె
వెలయుచున్నట్టివస్తువు ♦ వేఱైతలఁప, నన్యగుణములఁదాఁగోర ♦ దనఘచరిత. ౧౪.

సీ. విగళితతటిల్లతల్ ♦ వెలయునంతరమున, గళితకాంచనహార ♦ గరిమనెరవ
నిర్మలత్వంబున ♦ నెఱయుశుభ్రతదుర్బ, లతనుబొందినపాండు ♦ రతనుదెలుపఁ
దనరుచుండెడుపయో ♦ ధరములుకుచలీల, నమరఁగాపర్యస్త ♦ వనెడుపతిని
నెడఁబాసివిరహాన ♦ నెంతయుఁగృశియించు, లలనలవలెదిక్కు ♦ లలరుచున్న
వలఘుచారిత్రశుభ్రాభ్ర ♦ కలితమగుచు, నవిగొకనుఁగొంటెకడువిస్మ ♦ యంబయారి
తలఁచివర్ణింపనీశర ♦ త్కాలమహిమ, తరమెయెవ్వారికైనను ♦ మఱియువినుము.

మ. మసరాహిత్యత నెంతయుఁన్ వికలమా ♦ మాయూరవుంబల్కులై
నిదవేఁడిప్పడువాంఛసేయుచుమనం ♦ బెంతేనినావీనులున్
మదహంనస్వరలగ్నలయ్యెనదియె ♦ న్నంగాగుణవ్రాతముల్
విదితంబైననవప్రియాస్పదములై ♦ వీడుంగదాస్నేహముల్. ౧౬.

మ. జననాథోత్తమచూడుపెన్బొదరులై ♦ సంపూర్ణపాకంబులన్
వినుతంబైనపిశంగతన్వెలయుచున్ ♦ గేదారక్షోయాంతరం
బునవిప్పారునవాసితోత్పలఘనా ♦ మోదెచ్ఛనుంబోలెరా
జనముల్ పంటలవాలియున్నవిజనుల్ ♦ సంతోషముంబొందఁగన్. ౧౭.

సీ. కలమాబ్జబినదళ ♦ కాంతిసమ్మిశ్రత, వరపిశంగారుణ ♦ హరితరుచులు
నెరయఁగాఁగలిగిన ♦ చరదింద్రచాపఖం, డాభంబులైనవో ♦ యములుగాంచి
యేడాకటనఁటుల ♦ నెగయుపుష్పాదిజాలు, పైటబోలెనుసారె ♦ మాటుకొనుచుఁ
గాటుకద్దిర్చిన ♦ కన్నులల్లార్చెదు, గతినెల్లగంటెనుల్ ♦ గదలుచుండ

వెలయుకుసుమంబులను నవ్వు ♦ లొలుకుచుండ, గురుకుచంబుల గతిఁ బొల్పు ♦ గుత్తులమర
నలరు కదళీలపుష్పంధ ♦ యములు ఏవర, వనితలను బోలు వనప ఙ్క్తు ♦ లొనరఁజూచి.

సీ. తటిదగ్నిదీప్తియుం ♦ దయుతేకశుభ్రాంబు, దచ్ఛదచ్ఛాదితా ♦ తపములొలయఁ
బంకజామోదసం ♦ పర్కవాతోన్నత, తనుసీకరాస్పృతాం ♦ తరగతనలరు
కడుశుభంకరమునౌ ♦ గగనమార్గముఁ జూచి, మీఱితొలుచుఁ జేరి ♦ బారుదీఱి
యటునిటునన్యోన్య ♦ మరుదెంచు రాయంచ, పదుప్పపల్కు లలగిలిఁ ♦ బ్రబలుచుండఁ
గడఁగి మేఘావరోధని ♦ ర్గతములగుచు, నేటికనోన్యమును జూచి ♦ మాటలాడఁ
గలిగెనంచనుభాషించు ♦ గతినిదిక్కు, లలరుఁగనుఁగొంటివే పార్థ ♦ యనుచు మఱియు.

చ. గొదగొనిబీళ్లనుండి నిజ ♦ ఘోషములం దలివాం ప్రమీఱఁగాఁ
గదుపులఁ బాసి ముందరను ♦ గ్రక్కున వచ్చిన ధేనుజాలముల్
సదయత లేఁగలం గలసి ♦ చన్నులవెంటను బాలు గాఱుపెక్
బొదుగుల గాన్కలుం బలెను ♦ మాఱ్కొనియుప్పెదుఁ గంటివే నృపా. ౨౦.

క. జగదేకపావనంబై, జగదుద్భవహేతుకమును ♦ సద్వాత్సల్యయుతం
బగు ధేనుసమితి యొప్పెను, నగణితఘనమంత్రసంయు ♦ తాహుతిరీతిన్. ౨౧.

క. జితబర్హిణీస్వనాంచిత, తతమగు గోపీసుగీత ♦ తత్పరతనువి
స్మృతిఁజెందిమృగకదంబము, లతులితసస్యములు మేయ ♦ వవెక్కఁగొంటే. ౨౨.

క. ఆనతమైనసుబద్ధిని, తానిక్కయునాస్థచేన ♦ ధత్కృతిసేయున్
సూనశరతప్తకైవడి, ధీనుతకలమములు పాండు ♦ దీధితినొందెన్. ౨౩.

క. సరసిజరజములు జలశీ, కరములుపరిగొనెడు వాయు ♦ గతిఁ జెందినవిప
త్పరివృతులగు దుశ్చరితుల, కరణినిభ్రమరములు గఱులు ♦ గానవు కంటే. ౨౪.

సీ. పవడంపుఁదునుకల ♦ భంగినొప్పెడు చంచు, పులశాలిశిఖులెల్లఁ ♦ గలయఁగొలికి
కటుచుకకొనిపోవు ♦ వరశుకంబులుశాలి, సాలికలదనింప ♦ సాలిసొగసి
బారుగా విరిగివే ♦ పటుచుఁజూపట్టెఁ, బత్తదీధితులాకు ♦ పచ్చగాఁగ
సరిచంచుపులజీగి ♦ వరుసరక్తిమగాఁగ, సరవిఁదద్గతమైన ♦ శాలిశిఖల
జిగిపిశంగతనొప్పంగఁ ♦ జిత్రవర్ణ, కలితసాంద్రేంద్రచాపసం ♦ కాశమగుచు
నభిగొకనుఁగొంటివేయని ♦ యత్తుఁడిట్లు, పలుకుచుండఁగఁదత్సమీ ♦ పమున నంత.
సీ. [illegible]లతోఁ ♦ గలతేజముల్లను, శాశ్వతమొకఁడుపట్టు ♦ రమణఁదోఁచఁ
[illegible] ♦ ...మహైశాచలమొన్దు, శిఖరశాంతరంబు నభో ♦ ల్లిఖితమైనయు

విగళితజలభార ♦ విశదాంబుముక్పంచ, యంబకోయనిపిస్త ♦ యమునఁజూచి
నాసన్నభూముల ♦ నలరునల్లనివన, చ్ఛాయనీలాంబర ♦ సామ్యమొంద
నుపరిభాగంబున ♦ నొప్పమంచుకరళ్ల, చేతగౌరత్వవి ♦ ఖ్యాతమగుచు
సీరపాణివిధంబునఁ ♦ జెలువుమీఱి, యమరకిన్నరగంధర్వ ♦ యక్షముఖ్య
విరచితావాసమై చూడ ♦ నొఱపుమీఱు, హిమగిరీంద్రంబుగనుపట్టె ♦ నింద్రజునకు.

వ. ఇవ్విధంబునం గనుంగొని డాయం జని మేరుమహీధరవిజయదిగంతావలోకనరభసనభో
విలంఘనేచ్ఛాసముత్పతితం బైనతెఱంగున సమున్నతంబై భానుమండలప్రభావిభాసిత
పురోభాగనిబిడాంధకారసమాచ్ఛాదితాపరభాగం బగుచు లలితాట్టహాసనిరస్తతమ
స్తోమాగ్రతలానుగతగజాజినశ్యామలపరిధానాలంకృతశంకరోపమితంబై, యితరేతరా
దర్శితనరనభశ్చరసురనికరకృతవితతయుచిరతరవివిధమణిరచితభాసురావాసంబును, భుజ
గఘూమణిప్రభావప్రకటనార్థాభినిర్మితజగత్త్రియప్రతిబింబానుకారంబును, నాగేంద్ర
ధవళితనభోవ్యాపితజాంబూనదరాజివిరాజమానాపహసితసౌదామినీసహితశారదనీరద
సముదయాంచితశిఖరసముచ్ఛ్రితంబును, వివిధమణిగణఘృణిజాలపతాకాంశుప్రదీపి
తామయ్యపభోగితలతిశాగ్రహోదితలతాకాంతకాంతారోపలాంతరగోపురోపశోభిత
నగరసంకాశప్రదేశంబును, ననవరతప్రవర్షితజలభారపాండురితాపవర్జితతటిద్గర్జితోభ
యపార్శ్వకటకసంవ్యాపితాభ్రనిచయోదితపక్షలక్ష్మ్యుపలక్షితంబును, నాకజగజ్జవజా
హతసంరుగ్ణసమవతారసమవిషమతటస్ఫుటతద్వ్యగోపలక్షితోదకవికసితనిష్యంద
మకరందబిందుసందర్భనానందపరిభ్రమితమిళితభృంగసందీపితారవిందసందోహసము
ద్దీపితవివిధవిహారానుకూలకూలసంజాతమంజులనికుంజపుంజోపరంజిత శీకరనిరర్గళప్ర
వాహాభిరామనిర్ఝరోపశోభితంబును, అభినవసమున్నిద్రజపాకుసుమసంకాశప్రభాభి
శోభితపద్మరాగమణిగణోపరంజితహాటకకుడ్యకాదాచిత్కసానుసంకల్పితసంధ్యారా
గాభిరామధామంబును, ఆలోలనీలతమాలమాలికావిలాసకదంబనికురుంబసముజ్జృం
భితంబును, నీహారతుషారపరిప్లుతంబును, విస్తీర్ణకర్ణవ్యాపారసంజాతవాతోద్ధూత
మదగంధానుబంధబంధురపుష్పంధయసంశోభితగండస్థలమూర్తికాభిరచితతనుత్రాణాయ
మానసీహారబిందుసందోహసమావృతోత్తుంగాంగాభిరామసముద్దండశుండాదండవిఖం
డితశశధరమండలప్రకాండమదవేదండతండోపమండితంబును, నానావిధానర్ఘ్యమణి
ప్రభాభిరామసముత్తుంగశిఖరోపశోభితంబును, అపరిమితకుసుమితలతాగృహసంకలిత
ఘనగహ్వరప్రదేశంబును, కూర్మప్రపాదరాజహంససంచారసైకతనితంబసరోవరనాళీ
విపరచక్రవాకకోకనదకంబుగ్రీవబిసబాహుజలజాతకరాననోత్పలపత్రనేత్రరోలంబమా

లాలకవేణీవేణికావిలసితయువతిసమానసమంచితసరిత్సంశోభితంబును, కుసుమశరని కరప్రవాళకుతారబాలకగదానంకలితసుకేసరిసైంధవసంశోభితలతాగృహచ్ఛాయమానా నూనసహకారాశోకతరుప్రదీపితంబును, కలక్వణితకాంచీనిరాజితవిలాసవతీపృథు నితంబసంశోభితనదీవిలసితంబును, దయితోద్యమానలతికానికేతనాశ్రితదర్వీకరనిక రోపశోభితంబును, బహువిధానర్ఘ్యమణిప్రభాభాసురహేమశృంగనికరశంకాం కురితేంద్రచాపసంకలితవిరహితజలశుభ్రగర్జితసంసూచితాభ్రవిభ్రమితంబును, అనవరత వికసితారవిందసందోహసమాశ్రితకలకలాయమానమధుమత్తమధుకరమాలికావిరాజమానా మలమానససరోవరోపశోభితంబును, ప్రకుపితోద్యమానారాన్నాయమానశ్రేణియుక్కలహంస యుక్తమనోహారానుకూలవిహారమాణప్రమథగణపరివృతశంకరవిహారాలంకృతం బును, స్వర్లోకాభిముఖప్రజ్వలితాయమానానిత్యానలవప్రగృహావశిష్టవిమానజాతో పధిసముద్భూతకృతానుప్రతిష్ఠానుస్వర్గమార్గత్రిపురహరబహుముఖభవసేవ్యమా నానూనప్రమథగణోపరంజితంబును, గండశైలాపతనశృంగనిపతితశీకరనికర పరివృతజలవిరచితామలచామరధారణక్రమసముపలక్షితసమున్నతసానుసమాహితానర్గ ళప్రవాహసంశోభితజాహ్నవీవిరాజితంబును, ఘుర్ఘురధ్వనాభ్యుత్పతనశాబకసమూ హకబళనాగతతరక్షుకులఘలాయమానప్రతిఘటితసమాహ్వానధ్వనరాదూతశాద్వలఘన వనకేళీసమాచరణశ్రమజనితజలపానార్థనదీసమాగతితత్పరీడౌకితోరుశ్శృంగాంతరప్రలీనస్థి తకిరాతనిశాతశరాహతసంజాతక్రోధోద్ధతధ్వనితనిజయూథగానుగతమహావరాహని వహాంచితంబును, దర్పోద్రేకసముత్పాటితపటువిటపచ్ఛటాకలితకుంభదంతావళమండిత మందోద్దండపేవండతండోద్భటఘీంకారసంకులంబును, పరస్పరవిరోధాభిముఖీకృతా భిఘాతితరుధిరవినిస్సృతానోన్యశృంగవిదారితజర్ఝరీభూతదవనానసమీరనీలశైల సంకాశదీర్ఘదేహాపశోభితమదలాలసలులాయసముదయవ్యాకీర్ణంబును, ఉద్ఘూర్ణ శార్దూలధ్వానపలాయమానపృషతకసమూహసహితాభ్యుత్పతితానుధావన్నవిదితవిలో కితకురంగకులాకులప్రదీపితంబును, కంఠీరవనఖవిదారితమదకుంభికుంభస్థలవిగళితముక్తా ఫలవ్యాపితతారకాకీర్ణగగనసంకాశశాద్వలప్రదేశప్రభావిభాసితంబును, అత్యంతక్షుధా సంకలితానతముఖవల్మీకవివరాంతరస్థితపిపీలికాసంగ్రహణార్థప్రసారితదీర్ఘజిహ్వాంచిత ధ్వనితబహుళభల్లూకనివహాంచితంబును, సముద్ధతనిర్ఝరప్రవాహాధ్వానమృదంగనాద ప్రమోదితలతికాలతాంతసంవ్యాపితమదబంధురపుష్పంధయఝుంకారగానప్రవర్తితనర్తకీ సమానపరివర్తితవిస్తారితబర్హిబర్హనివహప్రకాశితంబును, తండోపతండదర్పోద్దండగండ [illegible] శార్దూలకాఖడ్గగవయానేకమృగాదివివిధమృగమండలమండితంబును,

వరశాస్త్రంబులచేతఁబోలెనఘముల్ ♦ వారించునీయద్రిచే
నరనాథార్యభవచ్ఛిదంబులగువి ♦ జ్ఞానంబులుంబొల్చెడున్. ౩౨.

* * * * * * * * * *

చ. జగములలోపలన్ మిగుల ♦ సన్నుతికెక్కినయీనగస్థితా
త్యగణితమోహనస్థితియ ♦ యనర్నిశముల్ నరనీతిసాగుం
డగుపృథునందునొప్పెడుమ ♦ హాస్త్రసంపదలుంబలెంగడున్
సుగుణసమృద్ధిచేనవిగొ ♦ శోభితమైకననయ్యెఁజూచితే. ౩౩.

ఉ. శారికలింపుమీఱఁగను ♦ సారెకుఁబల్కఁగఁగూర్పఫారఁగం
భూరుహరాజినమ్రతను ♦ బొందినవింతయునట్టియుత్తమై
నీరములొప్పఁగానలరు ♦ నిర్మలసైకతరాజహంసవా
నీరయుతంబులౌనదులు ♦ నెమ్మిఁగరేఁగాలకింపునింపెడున్. ౩౪.

చ. ఘనతరచూతపుష్పనవ ♦ గంధనిభంబగువాసతోయనా
ననలకుఁదేంట్లుమూఁగినల ♦ సత్స్వరదంతిసహోలుకస్మముల్
గనుఁగొనఁగావసంతబుతు ♦ కాలముగానియకాలమందునన్
న్హొనసిపికాళికిన్ మదము ♦ బుట్టఁగఁజేసెనుఁగంటెపొన్నపా. ౩౫.

లయవిభాతి.

మఱియును దిచూడుసుగ ♦ తరుణులు మెలంగుసుగు, చిరకటకదేశములఁ ♦ బరఁగుఘనవిద్యా
ధరమధురగానముల ♦ కెరవగుచు మ్రోయుచును, గుహసమములొప్పఁగను ♦ గరవటులునీభూ
ధరమునసహేంద్రునకు ♦ నరయహితమైనసుధ, గరవిడిచియుండుటను ♦ గరమసుగుణాఁగన్ ♦
సురనగముకంటెగుగు ♦ తరమగుచుఁదేజమున, మెఱసికనుపట్టెడిద ♦ నరవినుతకంటే.

చ. అనుపగుసంపదంబొదలు ♦ నట్టిలతాగృహరాజియోషధుల్
తనరఁగఁబెట్టుదీపముల ♦ లాగునవొప్పఁగమించుదివ్యచం
దనవపల్లవోజ్జ్వలిత ♦ తల్పములొప్పసరోజవాతముల్
మనములదేవకామినుల ♦ మర్వఁగఁజేసెనునాకిలోకమున్. ౩౬.

చ. హరునిమనంబులోఁదలఁచి ♦ యుద్భటలీలజలంబులోపలన్
మెఱసితపంబుసేయునల ♦ మీనవిలంఘనలోలనేత్రనా
గిరిజనుజూచిమేనుబుల ♦ కింపఁగసంతసమున్ త్వరోదయ
స్మరుణదలిర్పఁగాభవుఁడు ♦ మోదముతోడుతఁదొల్లియిచ్చటన్. ౩౭.

చ. కరమున జాఱుచుండు నహి ♦ కంకణము న్గనికంపమందె మే
గరుపొడువంగఁ దాభయము ♦ గ్రమ్మఁగ మాటికిఁ జూచుచున్ యవాం
కురములు చేతఁ బట్టి కడు ♦ కూరిమి పెండిలికూఁతు రైనఁ దా
మురియుచుఁ జెట్టబట్టెఁ దన ♦ మోమున లేనగ వంకురింపఁగన్. 3౯.

వ. అదియునుం గాక. ౪౦.

మ. అరుదారంగ సురాసురౌఘములు మ ♦ న్నర్థిన్ సుధాప్రాప్తికై
పరఁగంగా నలవార్ధి భగ్నజలధి ♦ స్పష్టాహిలోకంబుగా
సొరిదిం ద్రచ్చుచు నాగత్రాడు గతి నాఁ ♦ జుట్టంగఁ జుట్టున
య్యురగేంద్రాంకితమా చు మందరనగం ♦ బొప్పారెడున్ జూచితే. ౪౧.

ఉ. భానుకరప్రసారపర ♦ భాగతలస్ఫురదింద్రనీలసం
తానవిరాజమానరజ ♦ తస్ఫటికాంచితకుడ్యదీధితుల్
మానుగ నెంచి చూడ దిన ♦ మధ్యమునందును గౌముదీభ్రమన్
భూనుత మాటిమాటికిని ♦ బుట్టఁగఁ జేసెడు చూడుమీగిరిన్. ౪౨.

చ. మలయసమీరపాతమున ♦ మందగతిన్ జలియించు తామరల్
పొలఁతుల భ్రూవిలాసముల ♦ పోల్కి తరంగిత మైకొలంకులన్
బొలుచు జలాంతరంబునఁ బ్ర ♦ ఫుల్లము లై సవిలాసవైఖరిన్
దలఁకొని నృత్యమాడెడువి ♦ ధంబున నొప్పెడుఁ జూడుమబ్జనా. ౪౩.

క. వినువీధి కెదురు నిగుడు మ, నను వగు నీస్ఫటికకాంతు ♦ లర్కాంశులతో
నొనఁ గూడి తత్సహస్రా, ఖ్యను మిగులఁగఁ జేయుఁ గరణి ♦ నలరెడుఁ గంటే. ౪౪.

చ. హరునకు సంతసంబుగ ధ ♦ నాధిపుఁ డున్నతిమీఱ మహాపురం
బిరవుగఁ జేసియుండిన మ ♦ హీధర మీరజతాద్రి యల్లదే
మెఱసెడు మించి చూడుము స ♦ మీపమునం జరియించు చండభా
స్కరునకు నస్తమానమున ♦ కాలమునందును బుట్టఁ జేయుచున్. ౪౫.

ఉ. సానుచయంబులం బొలుచు ♦ చారుమణిద్యుతులీనగంబునన్
ధీయుతవప్రమధ్యముల ♦ దిద్దిన గోడలొయుంచు మశంకలోఁ
బూనఁగఁ జేసెడున్న దియుఁ ♦ బోవఁగ నొత్తెడు మందమారుతం
బే నగమందు నైన విను ♦ మిట్టి విచిత్రముఁ గంటివే నృపా. ౪౬.

తవిలిజనించునాబలభి ♦ దభ్రపథాంచితచాపసంహతిన్
బ్రవిమలలీలనిండికను ♦ పట్టఁగఁజేయఁగఁజాలిపొల్చెడున్. ౫౩.

చ. హరునిశిరంబునందుఁజెలు ♦ వారుచునుండెడుచంద్రరేఖయీ
గిరివనమధ్యభూములను ♦ గృష్ణనిశీసమయంబునందునన్
వరతరువల్లికాభినవ ♦ పల్లవసిక్తసుధాస్రవత్ప్రభో
త్కరములచేతవెన్నెలలు ♦ గాసెడుఁగంటివెయీవిచిత్రమున్. ౫౪.

మ. అరుణైయొప్పెడుచూడుమల్లదెత్వదీ ♦ యంబైనయీరాకకున్
ఇరవైనట్టిదియున్ భవత్పితృమనో ♦ భీష్టంబునైక్రాలుభూ
ధరరాజంబలయింద్రకీలములస ♦ త్కాంతారసంవ్యాప్తకం
ధరభర్మద్యుతియుత్తరీయసుమహా ♦ ద్వాసంబెపోలెందగున్. ౫౫.

చ. హరిసుతయిమ్మహాద్రినని ♦ లాహతిచేలతికానుషంగముల్
విరియఁదదంతరంబులను ♦ వేగముతోద్విగుణీకృతంబులై
యురువడిఁజొచ్చుభాస్కరమ ♦ యూఖములన్ఘనభర్మతీరవి
స్ఫురగురుకాంతులన్మెఱుఁగు ♦ శోభలఁబోలెడుఁబార్థచూచితే. ౫౬.

చ. భయపడిసర్పముల్ చెదరి ♦ పాఱెడునట్లుగఁగంపమొందనెం
తయునొరయంగనంటుకొను ♦ తన్మదవాసనకున్మదేభసం
చయములుచేరనట్టిహరి ♦ చందనముల్ పరికించిచూడని
శ్చయముగనింద్రునేనుఁగిట ♦ ఛాయకువచ్చినజాడఁదెల్పెడున్. ౫౭.

ఆ. గహ్వరాంతరముల ♦ ఘనబృందసాంద్రేంద్ర, నీలరుచివిభిన్న ♦ నిచయమగుచుఁ
గలయఁబర్వనట్టి ♦ గతినొప్పరవిదీప్తి, తిమిరయుతవిభాతి ♦ నమరెఁగంటె. ౫౮.

ఉ. శాంతుఁడవయ్యువ్యాసముని ♦ శాసనపద్ధతిశస్త్రిధారివై
యింతయుమోసపోకనిపు ♦ డీగిరిమీఁదఁదపంబుసేయుమీ
యెంతయునిష్ఠఁజేసినను ♦ నిస్తరలోకశుభంబులొందన
త్యంతముదుష్కరంబటమ ♦ హాత్తరసిద్ధులొందుఁగావుతన్. ౫౯.

వ. అని పల్కి నిజనివాసంబునకుం బోవం దలంచి యిట్లనియె. ౬౦.

సీ. అనసీశనీయింద్రి ♦ యాశ్వముల్ దుష్పథ, గాములుగాకుండుఁ ♦ గాకయెప్పుడు
నధికతపఃక్లేశ ♦ మైనచోసాధనో, త్సాహమిచ్చునుగాక ♦ శంకరుండు
నఖిలదిక్పాలకు ♦ లర్థి నీతపో, బలముఁగాచుచుమహా ♦ త్ఫలయుతముగ
నిర్మలంబైయొప్పు ♦ నీమనోరథమును, ముదముతోడుతనుజే ♦ యుదురుగాక

చ. సలలితమైనతత్కనక ♦ సానుమరీచులచేతరక్తిమం
బొలుచుతరంగసామ్యమునఁ ♦ బొందినవల్లభుఁగానలేక తాఁ
బలుమఱుఁ బ్రేమమీఱు వెడ ♦ బల్కులనారయుచక్రవాకపు
న్వెలఁదినిగాంచి సంతసిలె ♦ వేడుకబుట్టదెకూర్మిఁజూచినన్. ౭౧.

చ. ఒనరఁగనన్నదీవిచల ♦ దూర్మికలంగనలంకృతంబులై
తనరెడు కాంతిపుంజములు ♦ తజ్జలమగ్నమణీసమూహమున్
అనువుగఁదెల్పవా నృపున ♦ కాత్మగతంబగునట్టిచేష్టలన్
ఘనమగు నాకృతుల్ దెలుపు ♦ కైవడి నెంతయువిస్మయంబగున్. ౭౨.

మ. చపలోత్థూతతరంగమాలికలపై ♦ నుద్వేగవాతాహతిన్
జపలంబైమతివిస్తరించుచుఁగడున్ ♦ స్వచ్ఛోల్లసత్కేతకీ
విపులాగ్రాభతనొప్పుఫేనముసరి ♦ ద్వేల్లత్ప్రహాసంబొయం
చపుడాపాంథుఁడుచూచెనెంతయుఁబ్రమో ♦ దాశ్చర్యతందేలుచున్. ౭౩.

చ. జలములుఁద్రావవచ్చుపవన ♦ సామజగండమదాంబుబిందువుల్
సలిలముమీఁదనిండిపిల ♦ నచ్ఛిఖిపింఛసమానవర్ణమై
యలరుచువేడ్కఁజేసెనపు ♦ డగ్గజబృందముఁజూడవచ్చిన
య్యలఘుసరిద్విలోచనన ♦ హంసముమాడ్కినిరాజమాలికిన్. ౭౪.

మ. ప్రతిబోధత్వముచేవిభిన్నముఖమై ♦ పాతాచ్ఛముక్తామణీ
తతితోఁడంగళితాశ్రుబిందుయుతమై ♦ తల్పంబుపైనొప్పున
య్యతివంబోలెడుసిక్తసైకతముపై ♦ నాయూథిఁగన్పట్టెనా
క్షితినాథాగ్రణిసంతసంబుననిరీ ♦ క్షింపంగవాముండటన్. ౭౫.

చ. జలములయందుఫేనతను ♦ సాంద్రలవావృతమైతనర్చుచు
న్నలరుప్రవాళపల్లవమ ♦ నంగవశాత్మతఁజూడనొప్పన
త్కులనతిదంతకాంతి వెలుఁ ♦ గొందెడునమ్మధురాధరోష్ఠమున్
దలఁచుకొనంగఁజేసెనుగ ♦ నంజయునిన్మదిసంతసించుచున్. ౭౬.

చ. తరళతరంగసంకలిత ♦ దానసుగంధముఁగ్రోలిరోషముల్
నెరయజలంబులందిగచుం ♦ నీరుజగంబులసాభిముఖ్యతన్
సరిపెదురేగుదెంచుప్రతి ♦ సామజయూథముఁబోలెఁజూచున
వ్వరవనదంతిసంఘముల ♦ వారకచూచెనరుండువేడుకన్. ౭౭.

మ. ఘనశస్త్రంబులు దాల్చియున్నిగులని ♦ పాకాపట్యుఁడై సత్యవ
ర్తనలన్మౌనులమీఱుచున్మృగములన్ ♦ రంజిల్లఁగాఁజేసెన
య్యనఘుండెన్నఁగ దారజోగుణవిహీ ♦ నాత్ముండునై యట్లకా
యనుకంపాదిగుణంబులెవ్వరినిజే ♦ యన్ లేవు రంజిల్లఁగన్. ౭౬.

సీ. అనుకూలపాతమం ♦ దానిలం బంతట, వీవంగఁ జేయుచు ♦ వెలయుఋతుగు
ణావధీరితభాస్క ♦ రాంచితదీధితుల్, గురుసుఖస్పర్శగా ♦ నెరపఁజేసి
పుష్పాపచయవేళ ♦ భూరుహంబులు పల్ల, వాంజలులై మ్రోల ♦ నానతములు
గాఁజేయుచును శయ్యఁ ♦ గా భూమి నవతృణా, స్తరణతఁ బ్రతినిశీ ♦ సమయములను
గడఁగి సేయుచు విగతాభ్ర ♦ గగనవిపతి, తాంబుకణరాజి భూరేణు ♦ వణఁగఁజేయు
సదయుచేఁబోలె నిజతప ♦ శ్చర్యచేతఁ, బ్రతిదినంబును బరిచర్యఁ ♦ బడసెనతఁడు.

వ. ఇవ్విధంబున నధికఫలోదయంబునకై సస్యాగ్రంబునం బుట్టు కుసుమంబులుంబోలె నిజాగ్రంబునం గనుపట్టు నాశుభనిమిత్తంబులు గనుంగొని యాతండు విస్మయాధీనత్వంబునం బోధకుండయ్యె. అశ్లోకదా, జితేంద్రియులైన వారిప్రభావగుణంబులు ధీరత్వంబును దెలుపవుగదా. అది యట్లుండె నట్లు మహత్తరతపోవర్తనుండై యప్పార్థుండు సేయు తపఃప్రభావం బితరుల కలవి యగునే యని నిశ్చయించి యవ్వనేచరు లత్యంతఖేదాయత్తబుద్ధులై యాఖండలుసన్నిధానంబునకుం జని, తదనుమతిం బ్రవేశించి సాష్టాంగదండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిచి ఫాలతలంబులం గదియించి మధురవాక్యంబుల నిట్లని విన్నవింపం దొడంగిరి. దేవా భవదీయంబైన యింద్రకీలాద్రియందు జటావల్కలధారణుండై సూర్యచంద్రాగ్నిప్రతినిభుండైనయొక్క మహాపురుషుండు జగంబు తపియింప విజయార్థంబు శత్రుభీషణంబుగా శస్త్రాస్త్రంబులు ధరియించి వేదవిద్యానుష్ఠానంబుల సదాచారసంపన్నులైన మునుల నతిశయించుచు, నత్యాశ్చర్యకరంబైన తపంబు సేయుచున్నవాఁడు. అతనితపఃప్రభావంబున మారుతంబులు శైత్యమాంద్య సౌరభ్యంబులై యత్యంతసుఖావహత్వంబు గావించెడు. భూమి నవతృణాస్తరణంబై శయ్యాసనాదులయం దనుకూలం బయ్యెడు. గగనంబు మేఘధూమరహితంబై జలధారావర్షంబున భూపరాగంబు నడంగించెడు. ఇవ్విధంబునం బృథివ్యాదిపంచభూతంబులు నతనికి మనఃపూర్వకంబుగాఁ బరిచర్య గావించునట్లున్నయవి. ఇంకేమని విన్నవింప నేర్తుము. మృగంబులు సహితము పరస్పరవిరోధంబులు మాని శిష్యవర్గంబు సద్గురుం గొలిచినట్లు సంతతంబును సేవించుచున్నయవి. పుష్పా

పచయసమయంబున వృక్షజాతులు పుష్పితంబులై యనుకుఁ దామె సనమ్రత్వంబునం బొందెను. అన్నగంబును భవదధీనం బైనవిధంబున స్వప్రాపోషితవస్తువున కధికవశం బై యున్న యది మఱియును. ౬౭.

చ. శ్రమరహితత్త్వమే ప్రబల ♦ సత్త్వము దెల్పెను హావ్యశరీరమా
సమరజయంబుఁ జాటుమతి ♦ శాంతుఁడ టంచు ననూనంబుగా
సముఖుఁ జేరినన్ బ్రభువు ♦ సన్నిధిఁ బోలె భయంబుపుట్టినా
విమలతపోమహత్త్వమిది ♦ విస్మయమయ్యెడు మాకు నానవా. ౬౮.

ఉ. ఇట్టితపంబు సేయఁ ఘనుఁ ♦ డే కులజాతుఁడో యున్న నేమునా
పుట్టువునవ్వవాయమును ♦ బుద్ధి నెఱుంగము రాకాలంబునన్
బుట్టినవాఁడో కాకముని ♦ పుంగవజాతుఁడో దైత్యజాతుఁడో
యెట్టికులంబువాఁడో దివి ♦ జేశ్వర యాఘనుఁ డెంచి చూడఁగన్. ౬౯.

క. ఎన్నేని కారణంబుల, నెన్నియు మతి నెఱుఁగలేక ♦ యిప్పుడు మీతో
విన్నపము సేయుతప్పిది, మన్నింపుము మంచిదేని ♦ మఱి కాపన్నన్. ౭౦.

క. హిత మేల తెలుపరన్నను, నతటి మునవనములను దిరుగు ♦ జడులెక్కడివిన
స్మృతులేడ నెంచి చూచిన, క్షితిలోపల నింతపట్టు ♦ సిద్ధంబన ఘా. ౭౧.

వ. అంత. ౭౨.

చ. వనచరులిట్లు దెల్పినను ♦ వాసవుఁ డప్పుడు కూర్మి మీఱఁగాఁ
దనయుని సత్తపంబు మది ♦ తాల్మియు నవ్వని విస్మితాత్ముఁడై
మనమున నుబ్బు హర్షమును ♦ మానుగ నాఁచెను రాజచిహ్నముల్
తనరఁగ నీతిమార్గములు ♦ తప్పవు గాఁగ నాలించి చూచినన్. ౭౩.

మ. ఇరవొందంగ ననంత నింద్రుఁడు మనం ♦ బేకాగ్రతన్ నిల్పియా
నరుపై భక్తి నిదస్మదస్థిర రతిఁగా ♦ నంగామదిం గోరి తా
నెఱిఁ గేయుండిమ క్షేమిదుం దెలియన ♦ శ్లేసంత నంబాప్పఁగా
సురనారీతతిఁ బిల్చి యిట్టులనియెన్ ♦ జోద్యంబు వేద్యంబుగాన్. ౭౪.

చ. యువతివతంసలార వినుఁ ♦ డొక్కటి చెప్పెద మీకు బోలెనే
యువని నిమర్మభేదులగు ♦ నస్త్రములందతి కోమలంబునున్
అవిహితమున్న మోఘమును ♦ నత్యమరూపము దూరపాతినాఁ
బ్రవణ [illegible] నస్త్రిమిఁక ♦ భావజ గెల్వుమ కొండుగల్గునే. ౭౫.

తే. ధరణిసంసారముక్తికై ♦ తమము విడిచి, నట్టిమానులరాజన ♦ మనుపరాగ
మణఁచునవబోధవారిమీఁ ♦ దైనలోచ, నాంజలులఁ ద్రావఁబడినట్లు ♦ లణఁగిపోవు.

చ. జగములయందు మున్వివిధ ♦ సామ్యములందగు సుందరత్వముం
దిగిచి విధాత మిమ్ముఁ దన ♦ నేర్పుమీఱ సృజించియిచ్చుటన్
దగవసియింపఁ జేసిన త ♦ తంబుజనాభుమునిందుఁ జేరఁగా
నోగిముదమందఁ జేసెనిఁక ♦ నుర్విన సౌఖ్యమె మీకు నెవ్వియేన్. ౯౭.

వ. కావున. ౯౮.

ఆ. కళలనిపుణులైన ♦ గంధర్వులనుగూడి, యరిగియతనితపముఁ ♦ జెఱచిరండు
ఎలమినిప్పుడప్సరలను ♦ నెల్లగెల్చెదు మీకు, నీసుఖాత్మ గెల్చు ♦ టెంతయరిది. ౯౯.

క. ఈకరణి నుగ్రమగుతప, మేకాగ్రత సేయునతఁడు ♦ హృదయంబునఁదా
నేకరణి సుఖముఁ గోరును, బ్రాకటముగ నంటిరేని ♦ పడఁతుకలారా. ౧౦౦.

క. వినుఁడతఁడీగతిఁ జేసెడు, ఘనతపముది ముక్తికొఱకు ♦ గాదిది నిజమ
య్యనఘుఁడు రిపువధచేతను, గనుఫలమును మదినిఁ గోరి ♦ కానితలంపన్. ౧౦౧.

క. అదియెట్లన్నను నెంతయు, విదితంబుగఁ దాల్చినట్టి ♦ విల్లెక్కుడ సౌ
ఖ్యదమగు ముక్తియు దెక్కుడ, మదిలోపల నెంచిచూడ ♦ మానినులారా. ౧౦౨.

చ. తలఁపమహారాజుఁడౌనతఁడు ♦ తక్కినమానులు బోలె నాత్మలో
నలిగిశపించునోయనుభ ♦ యంబును లేదదియెట్టులన్ననున్,
వెలయుయశంబులెన్నవయు ♦ విక్రమశాలులబుద్ధులెంతయున్
లలనలయందునింతయుఁ ద ♦ లంపవు కీడొకవేళ నేనియున్. ౧౦౩.

వ. అని యిట్లు సకలదేవతాసమక్షంబున నాజ్ఞాపించి వివిధాంబరాభరణాదుల బహూకరించి, పొందు కార్యంబు సాధింపుఁడని యాఖండలుండనుప నాయచ్చరలత్యంత సంతుష్టాంతరంగులై, యాసహస్రలోచనులోచనసహస్రంబునకు విస్మయంబాపాదించు తేజంబున బ్రకాశించుచు వినమితశిరస్కలై వినయంబున నయ్యాస్థానమంటపంబు వెలువడి. ౧౦౪.

క. వనితామణులుత్తుంగ, స్తనభరనమితాంగులగుచుఁ ♦ దడయక యపుడిం
పెనయఁగ నిజసదనములకుఁ, జనిగమనోద్యుక్తలగుచుఁ ♦ జయ్యననంతన్. ౧౦౫.

క. సైంధవగజరథములతో, గంధర్వులు వెంటనడువఁ ♦ గట్టాయితమై
దింధిమ్మని మ్రోయించిరి, బంధురగతి మర్దళమ్ములు ♦ పటురవమెసఁగన్. ౧౦౬.

క. ఆరవముదిశలఁబర్వఁగ, భూరివిమానౌఘవివర ♦ పూరితమై తా
బోరనఁబ్రోయుమఁబురిలో, నారూఢిగఁజాటెఁదత్ప్రయాణము దెలియన్. ౧౦౭.

వ. ఇవ్విధంబునఁ బ్రయాణోన్ముఖులై నిఖిలబృందారకసందోహంబు లానందంబునం గనుంగొనుచుండఁ దత్పురంబు నిర్గమించి నడచునెడ. ౧౦౮.

ఆ. భానుమండలంబు ♦ పైవచ్చుకతనన, ప్పరసలకును నాతి ♦ పరణముగ
నమరఁబట్టినట్టి ♦ యాతపత్రంబులు, సార్థకతను బొందె ♦ వయ్యెనపుడు. ౧౦౯.

చ. ఎదురుగదుర్నిమిత్తముల ♦ కెల్లను హేతువుగాఁగవీఁచున
య్యుదుటుదువాలిగాలినరు ♦ ణోత్పలమాలనన్నిభాస్యులై
పదములుదొట్రిలన్నడుచు ♦ భామలచెక్కులభాసదీప్తిచే
నొదవినరక్తిమంబలము ♦ చోద్ధతకాంతినిజేసెనయ్యెడన్. ౧౧౦.

క. దివిజానుభావమునను, జవనాశ్వాకృష్టసురథ ♦ సంచయములు న
క్రవివర్తనంబులేకయె, దివినివిమానములరీతి ♦ దృఢగతిఁబోవన్. ౧౧౧.

వ. అప్పుడు. ౧౧౨.

చ. లలనలగంధసారముల ♦ లందమిటారిమెఱుంగునగ్గవల్
పులకితమైగగుస్పొడువఁ ♦ బుట్టుపరిశ్రమబిందురాజిత
త్తిలకపరిమ్యుతాస్యములఁ ♦ దీర్చినమౌక్తికభూషణాకృతిన్
దెలిపెనుసుందరాంగులకుఁ ♦ దేజమెాఁ దవికారమేనిచుట్టున్. ౧౧౩.

మ. పతితోల్కార్చిసమానదీధితులుప ♦ ర్వంగానవిచ్ఛిన్నరూ
పతసౌవర్ణనికాషగౌరరుచులిం ♦ పారన్నభోవీధిరా
జితమైయొప్పెడుతద్రథధ్వజపట ♦ శ్రీమించివిస్తారముల్
అతివిస్తారముసేయురీతిఁగనఁగా ♦ నయ్యెన్ స్వయంబొప్పఁగన్. ౧౧౪.

తే. కుసుమసుకుమారగాత్రులౌ ♦ కొమ్మలాత, పమునకోర్చుటగంధర్వ ♦ పతులుచూచి
కమలభవుచిత్రసంసృష్టి ♦ కౌశలమున, కచ్చెరువునొందిరయ్యాగ ♦ యమునమనపుడు.

సీ. శృంగారములుదీర్చు ♦ సిందూరరాగంబు, తరుణార్కరోచులఁ ♦ బ్రస్తరింపఁ
గవకంబుపెంపొందు ♦ కక్ష్యబంధప్రభ, లిరువంకమెఱుపుల ♦ కరణిఁబరఁగ
నిర్మలమణిమయ ♦ భర్మవర్మప్రభ, లింద్రచాపద్యుతు ♦ లీనుచుండ
ఘణఘణంఘణయను ♦ ఘంటికారావముల్, ఘనగర్జితంబుల ♦ కరణిఁబ్రోయు
వనసనప్రస్థలంబులఁ ♦ గురియుచుండు, కలితమదధారజలవర్ష ♦ గతినిదెలుప
సరభసంబున[illegible] ♦ కరిఘటాళి, పాలిచెలిమాతృబృందంబు ♦ పోల్కెఁదనరె.

క. త్వరితగతిఁ బంచ ధారా, స్ఫురణల్ దనరంగఁ దురగ ♦ ములు నడతెంచెన్
దురగాభిధానమప్పుడు, మురువొప్పఁగ సార్థకతను ♦ బొందిన కరణిన్. ౧౧౭.

చ. పరఁగ దురాసదంబగు ప్ర ♦ భాకరమండలమిట్లు దాఁటి యా
తెరణులు వాహినీతతులుఁ ♦ దాము సుదూరము వచ్చి యయూర్మికల్
నెరయఁగ దిగ్వధూతతికి ♦ నేర్పవదిద్దినయేకవేణి నాఁ
బరఁగు వియన్నదిం దిగిరి ♦ బంధురమర్దళవాద్యఘోషతోన్. ౧౧౮.

క. సమదాళిపరివృతాంచిత, కమలరజోవ్యాప్తమగుచు ♦ గగనధునీభం
గములం దోఁగుచుఁ దత్రా, పము దీఱఁగ నపుడు మలయ ♦ పవనము వీఁచెన్. ౧౧౯.

చ. కరితురగావగాహనము ♦ క్రిందున నెంతయు ఘూర్ణమానమై
పొరలి విమానభిత్తులగు ♦ ఘల్లనఁ దాఁకుచు నేటికైననున్
దరిఁగని మంటిమించు మను ♦ దంబునఁ బొంగినరీతి నూర్మికల్
నెరయ సురాపగావిమల ♦ నీరములత్తఱి నొప్పెఁ జూడఁగన్. ౧౨౦.

క. సురభవనవేదులి సుసుల, నొరయుచు నిరుగడలఁ బడఁగ ♦ నుడుమార్గంబున్
సరిగడచి మేఘములపైఁ, బఱచెదురథనేములపుడు ♦ భ్రమణతనొందెన్. ౧౨౧.

మ. ఘనదంతాహతిచేత వర్షిలు ఘనా ♦ ఘంబుల్ పథశ్రాంతిచే
తను నేతెంచు గజవ్రజంబులను మో ♦ దంబందఁగాఁ జేసె నె
ట్లని నన్ భూమిఁ బరోపకారులగు ధ ♦ న్యాత్ముల్ ప్రవర్తించు వ
ర్తనముల్ సేవలు సేయువారియెడలన్ ♦ దాత్పర్యమే సేయుఁగా. ౧౨౨.

చ. వరుసను పచ్చుచుండు సుర ♦ వారవధూకటిరమ్యవస్త్రముల్
వరుఁడగు వానిచేత బలె ♦ వాయువశంబున సారె జాఱఁ దా
పరమణిమేఖలాంశువుల ♦ వారిగఁ బర్వుచు నూరుమధ్యమం
దొఱపగు చల్లడంబుగలె ♦ నొప్పె నఖాంశుకలీలవింతఁగన్. ౧౨౩.

ఉ. సారతుషారవర్షమునఁ ♦ జందనపుందిలకంబు లెల్లనుం
జాఱఁ బరిశ్రమంబుడిపి ♦ సంతసమందఁగఁ జేసి మేఘముల్
వారలచేత సత్కృతులు ♦ వారక పొందెను నట్లకాదె యీ
ధారుణిఁ జేసినట్టిసుకృ ♦ తంబె సఁబాపునె యల్పదోషముల్. ౧౨౪.

చ. కలితతరోర్మిరేఖలఁ బ్ర ♦ కాశములౌ పులినస్థలంబులుం
బఱెఁజెలువారు పీతజల ♦ భారపయోధములందు భిన్నమై

పొలుచు సురేంద్రచాపమును ♦ బూన్కిఁ జేసెను దత్పురాంగనా
నలలితభూషణద్యుతులు ♦ సంధులఁ బర్వుచు సొంగ మేర్పడన్. ౧౨౫.

వ. ఇవ్విధంబున మేఘమండలంబు నిర్గమించి విహంగమమార్గంబున నగడచి నిర్గమనప్రయోజనవిషయంబు లైనభావికరణీయకార్యపర్యాలోచనంబు లైనసల్లాపంబులు సేయుచు, జలధరపటలంబుచేతం గప్పంబడక యధిక స్నిగ్ధత్వంబునం గనుపట్టు నాకస్థానసముజ్జ్వలం బగు నింద్రకీలశైలేంద్రంబుఁ బ్రవేశించి విలాసినీముఖనలినంబు, నాఘ్రాతస్ఫుటవిశదాతపత్త్రఫేనంబును, దూర్యరవగంభీరంబును నగుచు నాకంబునుండి ప్రవహించు మందాకినీప్రవాహంబుచందంబున నా సహస్రాక్షుపంపునం జనుదెంచు గంధర్వవాహిని తచ్ఛిఖరప్రదేశంబున విడువిడిసె నప్పుడు. ౧౨౬.

ఉ. అగ్గల మైనవేగమున ♦ నర్థచయంబు లెసేతు నైతగన్
బగ్గము లెంత యుంగుడియఁ ♦ బట్టిన మోములవాంచి భూమికిన్
గ్రుగ్గితురంగముల్ నడుమ ♦ బోరనఁ బొలుచు సూతులార్వఁగా
డిగ్గిరథావళుల్ గరరు ♦ రీవిదలిర్పనతిప్రయాసతన్. ౧౨౭.

చ. ఇరుగడ మేఘముల్ దనర ♦ నింద్రనగంబున కాభిముఖ్య మై
యొఱపడినంతరిక్షమున ♦ నుండి వెసం దిగుసామజోత్కరం
బిరవుల పక్షకంపనమె ♦ కింతయు లేకయ యుష్ఠి నుండు భూ
ధరవరసామ్య మొందుచును ♦ దచ్ఛిఖరంబునఁ బొల్చె నెంతయున్. ౧౨౮.

క. వినువీథిఁ బఱచు కాశల, మునసమవిషమముల నేక ♦ మగు నగ్గిరిపైఁ
జను సైంధవఖురసరణులు, గనుపట్టె నదీసమీప ♦ గతపులినములన్. ౧౨౯.

క. సెలయేఱుల ప్రతిరవములఁ, గలసిగభీరము గ్రామాయు ♦ ఘనరథారవముల్
జలదస్వనమని యుద్గత, గళపింఛతవినుచు నీల ♦ కంఠములాడెన్. ౧౩౦.

ఉ. ఉన్నతశైలకూటముల ♦ నుండి గుభిల్లనమ్రోఁకి పొలుచున్
జెన్నగు పార్శ్వవప్రహరి ♦ నీలమణిద్యుతితోడ నేక మై
పన్ని నభోంతరంబునవి ♦ భాగము బొందినరీతి వింత దై
యున్న జలప్రవాహ మొక ♦ టొయ్యనఁ జూచిరి ముగ్ధలప్పటన్. ౧౩౧.

చ. అదలుచు మావటీలఁ దమ ♦ యాత్మ గణింపక ప్రాంతసంచర
న్మదగజగంధలుబ్ధమగు ♦ మారుతమొయ్యన పీవఁ గ్రోధితం
బొదలి కరేణుసంఘముల ♦ నుందరఁ జూచితదా త్తచిత్తతన్
గదిరి యతి ప్రయాణమున ♦ దంష్ట్రగజంబులు ద్రావురు త్తతన్. ౧౩౨.

చ. జవమునవచ్చుసాంద్రరథ ♦ చక్రవిఘట్టనచేజనించియ
న్నవసలిలంబులీలనరు ♦ ణంబగురేణువునిండఁదోఁగియ
ద్దివిజవరేణ్యువాహినియు ♦ దీర్ణతపర్ణవివర్ణయైనజా
హ్నవివలెనవ్యపల్లవప ♦ నంబులునిండదిగమ్మహోర్భటిన్. ౧౩౩.

చ. అలరినివాసయోగ్యమగు ♦ నట్టివనంబులుపూచిపుష్పముల్
వెలయఁగరాలుతావులను ♦ విస్తృతమౌక్తికసైకతంబులన్
జెలువగుశాడ్వలస్థలులఁ ♦ జెన్నగుచుండెడుదివ్యవాహినీ
సలలితతీరభూమివిల ♦ సచ్ఛిబిరంబుగనిల్చెసైన్యముల్. ౧౩౪.

మ. కరమొప్పంగనుజాహ్నవీతటమునం ♦ గంధర్వసైన్యంబులీ
కరణిండిగ్గినవేళమద్దిరికిను ♦ త్కర్షంబగంజేసినా
వరసంయోగముదైవయోగమునసొ ♦ ప్పంజేయుఁగాగౌరవం
బరయన్ సత్పురుషానుకూలతనసా ♦ ధ్యంబెద్దిభావించినన్. ౧౩౫.

చ. పొలుపుగఁబూచిఘుమ్మురను ♦ భూరుహముల్ విజనప్రదేశముల్
కలయఁజిగిర్చినట్టిలతి ♦ కావిసరంబులుదేవకామినీ
లలితతరోపభుక్తిసభ ♦ లత్వముఁబొందెనునెట్లటన్నఁదా
జెలఁగిపరోపకారమును ♦ జేసినదేకదకల్మియొన్నఁగన్. ౧౩౬.

చ. అలసియుసౌఖ్యమేదియుని ♦ జాగ్రతలస్థితసర్వసూత్కృతో
చ్ఛలితనవప్రవాళహరి ♦ చందనసంగతిదుష్టసేవకుల్
దలముగనున్నయట్టివిభు ♦ దండనుబోకెనుదత్సురాంగనల్
నిలకతిరస్కరించిరిల ♦ నిందితమేకదదుష్టసంగతుల్. ౧౩౭.

చ. అలసకడానిజీనిపని ♦ యాస్తరణధ్వజకంకటాదులున్
వలనుగడించితెచ్చుప్రియముఁ ♦ బాపుటకైధరమావటీలుదా
ర్కొలుపనిస్తులన్ గదిసి ♦ కుంజరయూథముపాల్చెనత్తఱిన్
బ్రళయసమీరభగ్నగహ ♦ నద్రుమవిస్తృతశైలరీతులన్. ౧౩౮.

మ. ఘనమాతంగమనోకరూటిట్లునిజమా ♦ ర్గశ్రాంతిచేనొందుని
ద్రనుఁబాలించితొలంగినట్టిశయన ♦ స్థానంబునన్ దానవా
సనఁగ్రోలన్ ఝుణమందుభ్రామలునచల ♦ ద్భ్రాంగబాలంబులే
చినవేగంబునఁబారుశృంఖలగతిన్ ♦ జెన్నొందెఁజిత్రంబుగన్. ౧౩౯.

క. నిరతము సప్తస్థలముల, ధరణిరజంబణఁగఁ దొరఁగు ♦ దంతావళిస
త్కటగంధనిరసనైలా, పరిమళమదగంధమపుడు ♦ పవనముదాల్చెన్. ౧౪౬.

వ. ఉదరిమృగేంద్రయూథములు ♦ హుమ్మనిప్రోయుచునిద్రమేల్కొనన్
జెదరకగర్జితభ్రమను ♦ జెంది సముద్గతకంధరంబులం
బొదలిచకోరకేకికుల ♦ ముల్ జలభూములనాలకింపఁగా
నుదితసురేభబృంహితము ♦ లొప్పెను మేఘునినాదవైఖరిన్. ౧౪౭.

మ. ఘనచిత్రాంబరభూషణోద్వహనశా ♦ ఖల్ మీఱిమార్గశ్రమం
బునదివ్యాంగనలాతురత్వ మెసయన్ ♦ మున్మున్ను గానచ్చటం
దనరంగా విభజించికట్టినగృహ ♦ స్థానంబులన్ రమ్యమై
తనరెన్ దద్వనపాదపంబులు పురో ♦ ద్యానప్రభన్మీఱుచున్. ౧౪౮.

వ. తదనంతరవృత్తాంతం బెట్టిదనిన. ౧౪౯.

క. నరకిన్నరవరచారణ, గరుడోరగసిద్ధసాధ్య ♦ గంధర్వాపకిం
పురుషామరమునివందిత, చరణాబ్జదయావిలోల ♦ శౌరినృసింహా. ౧౫౦.

మాలిని. అమలకమలనేత్రా ♦ యాంత్రకృద్బ్రహ్మసూత్రా
విమలశుభచరిత్రా ♦ విస్ఫురద్గౌరగాత్రా
వినుతతిమిరమిత్రా ♦ వీరలక్ష్మీకళత్రా
సమదదనుజజైత్రా ♦ సన్మునిస్తోత్రపాత్రా. ౧౫౧.

గద్యము. ఇది శ్రీమదహోబలలక్ష్మీనృసింహకటాక్షలబ్ధకవితావిచిత్ర మౌద్గల్యసగోత్ర గోపాలునికులపవిత్ర భాస్కరామాత్యపౌత్ర వీరనమంత్రిపుత్ర పరమభాగవతపూజావిధేయ సింగయనామధేయప్రణీతం బైనకిరాతార్జునీయంబను మహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

---

క. అత్తఱినొకసతితుమ్మెద, మొత్తంబులురుఝుమ్మురనుచు ♦ ముసరినఁగరముల్
తత్తఱపడివిదళింపఁగ, బిత్తరిమఱియొకతెదానిఁ ♦ జేసన్నఁగనిపల్కెన్. ౯.

ఉ. మానితనవ్యపల్లవస ♦ మానములౌకరముల్ విదుర్చుచున్
బూనివృథాపరిశ్రమముఁ ♦ బొందకువేమదిఁగల్పవల్లికా
నూనపరిభ్రమన్మధుప ♦ యూథములొయ్యనయాశ్రయించెని
న్నానకయెట్లునీవిఁకను ♦ మాన్పెదవేభయపెట్టిమానినీ. ౧౦.

ఆ. ప్రణయకుపితయగుచుఁ ♦ బతిఁబాసివేఱొక్క, తరుణిమరలఁగలయఁ ♦ దలఁచియున్న
గానిభావమెఱిఁగి ♦ తరుణివేఱొక్కతె, పలికెనిట్టులనుచుఁ ♦ బ్రౌఢివెలయ. ౧౧.

ఉ. కోపముమానవేవిభుని ♦ గొబ్బునఁగూడవె కాకతక్కినన్
జాపలమైననీమనము ♦ చాలతపించును ముందుబోలె నే
నాపలుకెంతయున్నిజము ♦ నాతిరోయంచునిట్లు నేర్పుమైఁ
దీపురఁబల్కియల్కవెసఁ ♦ దీర్చినచ్చెలిగూడెనాథునిన్. ౧౨.

సీ. గురుకాశసూనదు ♦ కూలసారసకల, క్వణితరేఖాకాంచి ♦ కస్వజఘన
సన్నిభతీరదే ♦ శప్రభూషితకుంజ, పాన్థోధియోషిత్స్రి ♦ వంతికలను
అతిమనోరపాతభే ♦ దితనిర్ఝరస్రవ, త్ప్రీతియాతవల్లభో ♦ త్సంగశీత
లాచ్ఛమౌక్తికవన ♦ హాసోపలక్షిత, నిర్మలోదకబిందు ♦ నివహములను
నచలదళిపుంజమృగులాంజ ♦ నాభిశారి, తప్రసూనాక్షిసాదర ♦ తానిరీక్ష్య
మాణనమ్రాంగలతికాస ♦ మాజములను, సంతసంబునఁజూచుచు ♦ నంతమఱియు.

క. వారణమదకలితాంగణ, సారస్థిరగండకషణ ♦ జాతక్వాణా
హారమనోహరచందన, భూరుహములుజూచిరంత ♦ ముందరఁజనుచున్. ౧౪.

చ. తరుణులువేడ్కనోఁజెలఁగి ♦ తామనుబూవులుగోయనుండియున్
బరుసపుకారముల్ భ్రమకు ♦ వారకచేసెడులీలనిచ్చున
వ్విరులను నాథులందుఁగల ♦ ప్రేమలఁగైకొనిరప్పుడెంతయున్
మురియుచువల్లభుల్ప్రియముఁ ♦ బొందెదువట్లుగసాదరంబుగన్. ౧౫.

క. మఱియొకమానినినాథుఁడు, విరులిష్యనుసవతిపేర ♦ బెట్టుగబిలువన్
జరణమునసేలఁబ్రాయుచుఁ ♦ గరమల్కనుబల్కకుండెఁ ♦ గన్నీరొల్కన్. ౧౬.

చ. సరసములాడునాథుడిన ♦ సన్ముఖమైతనదృష్టినిల్పితా
నరిమురిపీడిజాఱెడుని ♦ జాంశుకమున్మఱికట్టకయ్యెడన్

గొప్పముడివిడికురు ♦ లుప్పరములెగయుచును, గప్పుచును మోమునను ♦ గప్పినను బలిపక్
దప్పి నిలనాతఁడును ♦ దెప్పనను గూడనది, ద్రిప్పినను మోమునను ♦ గుప్పె రజమొప్పన్.

లయగ్రాహి.

కొమ్మమఱియొక్కరితె ♦ తమ్ములను నేర్చి పయిఁ, గ్రమ్మి తన నాయకుని ♦ నెమ్మొగము నేయన్
దమ్ములనలంచు నల ♦ తమ్మి పగదాయయని, యమ్మొగముఁ జూచి యువి ♦ పమ్మియిననాతం
డమ్మగువ నేర్చికుము ♦ దమ్ములను నేయనవి, క్రొమ్మెఱుఁగు గ్రమ్మరుచు ♦ లమ్మిహరు తేజం
బమ్మయనియంతవిత ♦ ధమ్మయిన నెంతియును, సమ్మదము నొందిరల ♦ కొమ్మయునతండున్.

తే. తరుణియొక్కతె వరుని క్రొ ♦ వ్విరుల నేయ, నాతఁడయ్యింతి మరలంగ ♦ నప్పుడేయ
విరులు తలనిండి చూపట్టె ♦ వింత యగుచు, నలరులను గట్టుసూసక ♦ మనఁగఁ దనరి. ౩౭.

ఉ. పుష్పాడినిండఁ దోఁగియల ♦ మూఁపునఁ గ్రొమ్ముడి జాఱి పెన్నెరుల్
గప్పలలాటమందిడిన ♦ కస్తురిబొట్టుదలిర్పఁ జూడఁగా
నప్పడు పొల్చె వెండియొక ♦ యంగన సామజకృత్తివాసుఁడై
యొప్పలలాటలోచనుఁడొ ♦ కోయన నెంతయు వింతమీఱఁగన్. ౩౮.

తే. వెండియొకయింతి గనుపట్టె ♦ వింత యగుచు, వరుఁడు పైనేయఁ గ్రొవ్విరుల్ ♦ శిరము నిండి
తారకాకీర్ణమగు నభోం ♦ తరము మాడ్కిఁ, గొప్పగను పట్టునొక వింత ♦ యొప్ప మీఱి.

వ. ఇవ్విధంబున విహరించి తత్ప్రతిసాను సమీపమార్గములనుండి వెలువడి యలసయానంబులం జను దెంచు బృందారకసుందరీసందోహంబులు కరికరస్థూలోరుకాండభారంబున నత్యంతచిరకాలంబునకుం గూడ నడుచు నపపల్లవకోమలత్వంబున సమస్థలి నైన నడువ నోపక మదవిహ్వలత్వంబునం బోలె, నడుగడుగునకుఁ దొట్రుపాటు గదుర మెట్టెడు మృదుపదంబులను బ్రవిసారితకాంచికానవరత్నప్రభాసముద్భవమనోహరోత్కర్షం దనరి సుకుమారవస్త్రలత్వంబున నతిశయిల్లుచు విమలపులినంబులం గెల్చి నిలిచినట్లలరుచు నత్యంతగౌరవంబులై పథపరిశ్రాంతిఁ బొంది కన్పట్టు జఘనంబులును, సముచ్ఛ్వసత్పంకజకోశకోమలంబులై తనరారు నాభిప్రదేశంబుల చేత నివి సమీపంబుల నత్యంత కాంతిజనకంబులగు వళిమధ్యలగ్నంబులయందు స్తనాతిభారంబున నమ్రత్వంబొందు నుదరంబులను, సమంతతఘర్మాంబుకణపరివృతంబులై యవికచలోచనంబులం దనరారుచుఁ దుషారపరిష్కృతాస్ఫుటదళసరోరుహసదృశంబులైన ముఖంబులును విస్త[illegible]ంబుగా నిరూపించుచుం జూచు ఖేచరుల కపూర్వవిలోకనకౌతూహలంబు పుట్టించుచు [illegible]గంగాతీరంబుఁ జేరం జనుదెంచి జలక్రీడాసమారంభంబునం బొదల నప్పుడు. ౩౯.

చ. చలదురుమీనఘాతజల ♦ జత్వముదృఙ్ముఖచేష్టయైతగన్
దోలఁకుతరంగముల్ కరవి ♦ ధూనతఁదెల్పఁగహంసనిస్వనం
బులుపలుకుల్పలెందనరఁ ♦ బొల్చెసురాపగమత్తటంబుని
ర్మలమిదెయంబుకేళికిటు ♦ రమ్మనిపిల్చినలీలనత్తటిన్. ౩౯.

చ. మలయుచుఘర్మశాంతిగను ♦ మందగతిం బ్రసరించివీచుత
జ్జలజసుగంధగంధియుల ♦ సజ్జలశీకరసంయుతంబునై
యలఘుతరంగచారియును ♦ నైనసమీరముతత్సురాంగనా
వలికిఁగరావలంబనము ♦ వారకయిచ్చినలీలమీఱఁగన్. ౪౦.

వ. అప్పుడు. ౪౧.

మ. సవిలాసంబులమీఱుయానములహం ♦ సశ్రేణిసంచారము
న్నవలావణ్యనితంబయుగ్జఘనవి ♦ స్తాణంబునన్ సైకత
చ్ఛవిదీర్ఘాంచితలోచనాననములన్ ♦ సారాంబుజాతంబులన్
అవమానించుచుఁబొల్చిరెంతయునుది ♦ వ్యస్త్రీలుశోభిల్లుచున్. ౪౨.

వ. అంత. ౪౩.

క. జలకేళికాయితంబుగ, వలిపపుఁజేలములుగట్టి ♦ వకులగుగంధ
ర్వులువేదుర్గ్రహభయమున, కలరఁగమునుదిగినపిదప ♦ నతివలువేడ్కన్. ౪౪.

చ. అళికివిభిన్నయూథతను ♦ భ్రాంతములన్వెసఁబాఱుమీనముల్
గలుగుజలంబులద్దివిజ ♦ కాంతలుమున్నుపయోవిహారముల్
సలుపనిచోటుగానమనిఁ ♦ జంచలమందుచుఁజాలభీతిజొ
త్తిలఁగనుజొచ్చిరొయ్యనన ♦ తిప్రసభాత్తతమాటికుల్కుచున్. ౪౫.

చ. ఉరుతరయత్నభారమృదు ♦ లోజ్జ్వలవర్తులితోరుకాండవి
స్ఫురదమరీసమూహమటు ♦ చొచ్చినమాత్రనెఘూర్ణమానమై
పొరలితరంగమాలికలు ♦ బోరునఁదీరములాక్రమింపఁగా
నిరవుగనుండుహంసకుల ♦ మెల్లనుబెగ్గిలిపాఱఁజేయుచున్. ౪౬.

మ. కరమొప్పంగశిలాసమానవిలస ♦ ద్గంధర్వవక్షోహతిన్
సురనారీపృథులస్తనాహతులపీ ♦ చుల్వ్రీలితత్తోయముల్
దరికిం జేరుచరోపతంగదియుఁచం ♦ దానంగలంకత్వమున్
బొరసెన్మైదినిఁగర్కశాహతులచేఁ ♦ బటాత్మకుల్లగ్గరే. ౪౭.

ఉ. కొప్పులువీడఁగా నడిచి ♦ గొజ్జఁగిదండలుజాఱఁగొట్టియున్
గప్పురగంధముల్ చెదరఁ ♦ గా వెసఁదాఁకియుఁబెక్కునేరముల్
తప్పకయీగతిన్ సలిపి ♦ తత్పతులందలిభీతిచేబలెన్
దెప్పరమైనకంపమునఁ ♦ దేలుచునుండెనువీచులత్తఱిన్. ౪౮.

చ. నవతుకఁజూడఁజాలదని ♦ చయ్యననొక్కతెకుంకుమంబుచ
న్గవకునలంకృతంబనుచుఁ ♦ గన్పడకుండఁగఁబూసిదాఁచు నా
నవనఖరక్షతంబులుగ ♦ నంబడెఁగుంకుమబోవజిక్కుత
ల్లవములుబోలెనప్పుడువి ♦ లాసముమీఱఁగఁజూడనొప్పుచున్. ౪౯.

సీ. అళులుకనీనిక ♦ లట్లులీనతనున్న, వజ్జపత్రములాలో ♦ లాక్షికనులా
ఝుంకారరహితమై ♦ చలియింపకున్నవి, యళిబృందమోపక్ష్మ ♦ లాక్షికురులా
దరహాసవిస్ఫుట ♦ దంతకేసరమైన, దిదివిరిపద్మమో ♦ యింతిముఖమొ
కరకంజసంగతా ♦ గ్రతనొప్పుచున్నవి, పటుబిసంబులొ కాక ♦ బాహులొక్కొ
యనుచు నీరీతిసందియ ♦ మందియంత, నలినవనమునఁదాఁగిన ♦ పొలఁతిఁ గాను
నిశ్చయించిరిమదిలోన ♦ నిపుణలైన, సకియలొకకొందఱప్పుడ ♦ త్క్షణమునందు. ౫౦.

చ. వెలఁదియొకర్తునాయకుఁడు ♦ వింతగఁగూర్చిసపత్నిసన్నిధిన్
వలుదకుచాంతరంబునను ♦ వైచినపువ్వులదండఁదాజలా
విలమగునట్టిదేనియును ♦ వీడకతాల్చెనుసల్లికాగుణా
వలివసియించుఁబ్రేమగల ♦ పట్టుననిల్వవుప్రేమలేనిచోన్. ౫౧.

సీ. కాంతలుదీర్చిన ♦ కాటుకల్ నెరయుంగఁ, బత్త్రాంతరక్తిమఁ ♦ బర్వకుండ
సరికట్టుటకుగాని ♦ యదినిశ్చయంబుగా, శోభితార్థముగాదు ♦ సూతలంప
గుఱుతిందుకదియుటఁ ♦ గరఁగిపోరక్తిమ, నెఱసిలోచనముల ♦ నెఱుపునించె
శోభయొప్పటియట్ల ♦ చూపట్టుచున్నది, యదిశోభితార్థమే ♦ య్యైనదేని
దానిశోడశోభ ♦ తలఁగకయుండునే, యనఁగఁజూడనొప్పి ♦ రతివలపుడు
జలములందుఁగేళి ♦ సవిలాసవైఖరి, సలుపుచుండివింత ♦ చెలువుమీఱి. ౫౨.

చ. పొలఁతులుకొప్పులన్ దుఱుము ♦ పువ్వులబంతులు వేగయుక్తమా
జలములచేతలోభమున ♦ జాడ్యులచేబలె నావృతంబులై
కలయఁగఁదెప్పదేలియధి ♦ కారముమారునమాత్యులుంబలెన్
దలఁకుచునత్తఱింబొలసెఁ ♦ దత్క్షణసంభవశోభనత్వమున్. ౫౩.

చ. గతమకరీకలాపనవ ♦ కజ్జలయావకగండదృక్స్తనం
చితమధురోష్ఠలయ్యుఁగడు ♦ చెన్నువహించుచునుండునట్టియా
యతివలఁజూచిఖేచరులు ♦ హర్షమునొందిరితద్వపుఃప్రక
ర్షతయెవిభూషణంబులకుఁ ♦ జాలనలంకృతియంచు నెన్నుచున్. ౫౪.

వ. అప్పుడు. ౫౫.

చ. అలరువిలాసినీసముద ♦ యంబటమున్ననురక్తిమీఱఁగాఁ
జెలువులొనంగుసొమ్ములను ♦ జెన్నుగఁదాల్చియుఁజేయదయ్యెఁద
త్సలిలతరంగసిక్తనవ ♦ చారునఖక్షతజాతకాంతిచేఁ
దెలియసపత్నిజాలముల ♦ దృష్టితపింపఁగఁజేయుకైవడిన్. ౫౬.

చ. అలరుమొగంబులుంజలిత ♦ హారములున్నరుణాంగశోభలున్
గలిగినసౌరభామినులు ♦ కన్గొననొప్పిరిపద్మయుక్తమై
చలితసుఫేనముల్గలిగి ♦ సంక్రమితా * గ్నిశిఖాచయంబులై
పొలుచుతరంగసామ్యమునఁ ♦ బొందుచునింతయు వేఱులేదనన్. ౫౭.

మ. కరమొప్పంగనునొక్కచేతనుబుకం ♦ గాఁదోసివేఱొక్కచేఁ
జలవన్మర్దళవాద్యలీలజలముల్ ♦ సారధ్వనిన్మ్రోయఁగా
భరతప్రక్రియమీఱుతాళగతులన్ ♦ బాగొప్పఁగానృత్యమున్
గరిమన్జేసెడులీలఁగంపిలునుద ♦ త్కాంతాకుచద్వంద్వముల్. ౫౮.

చ. విమలతమీఱివారలకు ♦ వేడుకతోవిహరింపయోగ్యమై
యమరుచుఁదత్సతీసదర ♦ హాసహసజ్జలజానుబింబితా
స్యములనలంకృతంబగుచు ♦ నంబువులొప్పఁగఁబొల్చెగంగదా
నమలతమన్ఫలంబుఁగని ♦ నట్టులుజూడఁగనట్టివేళలన్. ౫౯.

క. పొరలుచుమీనములూరువు, లూరసినభయమందిచూడ్కు ♦ లుచ్చలితముగాఁ
గరములువడఁకఁగఁదత్సతు, లూరమైపెనఖులకును సహిత ♦ మొప్పిరిచూడన్. ౬౦.

ఉ. మానినియోర్తుతోయముల ♦ మత్స్యసమూహాలిచేభయంబులో
నూనినదింబలెన్మదము ♦ నొందఁగవల్లభుఁగౌఁగిలించెనాఁ
జూనలకృత్రిమప్రియుర ♦ సభ్రమవోజ్జ్వలహావభావకృ
త్స్వానితకైతవక్రియల ♦ మానసముల్హరియింతు రేకదా. ౬౧.

---

* అగ్నిశిఖా = కుంకుమము.

క. జలకేళివలనమిక్కిలి, చలియించెడుకురులు రెండు ♦ చక్కులఁగప్పన్
జెలులముఖంబులువొలిచెను, నలికులములుమూఁగినట్టి ♦ యబ్జములనఁగన్. ౬౨.

క. జలములులోఁత్రైవదిబలె, నళుకుచుముదమందికరము ♦ లార్చుచునలమెన్
జెలువునినొకసతిసకియలు, బలుచేరజమనుచుదూఱి ♦ పల్కకయుండన్. ౬౩.

మ. కరతోయంబులచేవిలాసములరన్ ♦ గాంతుల్ నివారించినన్
వరవృత్తస్తనయుగ్మముల్ నిబిడని ♦ శ్వాసంబులంగంపిలన్
గరమొప్పారెడువిభ్రమంబులఁగరా ♦ గ్రంబుల్ చలింపంగన
త్తఱిఁజూపట్టెవిలాసినీజనము సా ♦ ర్థత్వంబునన్బొందెనాన్. ౬౪.

చ. అనునయమొప్పఁజేసికఠి ♦ నత్వముఁబాసిప్రసన్నగా మొగం
బునఁబతినీరుజల్లినను ♦ మోడ్పుఁగనుంగవత్తోడనొక్కజ
వ్వనిముఖమొప్పెనెంతయును ♦ పత్నిమొగంబునమీఱుకాంతియున్
దనువెనఁబొందినట్లగుచుఁ ♦ దన్ముఖమత్తఱిఁజిన్నబోవఁగన్. ౬౫.

సీ. వరునిమీఁదటఁజల్ల ♦ వనితదోయిటనెత్తు, సలిలంబువ్రేఁదట్టి ♦ చెలువుఁడంత
నవలంబనము సేయ ♦ నంగజాతవికార, మడరియంగముపుల ♦ కాంకురముగఁ
బరవశత్వముఁబొంద ♦ భామగట్టినచల్వ, వలిపచేలమునీవి ♦ వదలియపుడ
జాఱినవెసఁజక్క ♦ సవరించుప్రియసఖి, చెలువునసత్తఱి ♦ సలిలములను
నానుటను జేసిబిగువైన ♦ నవ్యరత్న, లలితకాంచనకాంచిక ♦ లాపమడరి
ప్రేమదళుకొత్తనింతికిఁ ♦ బ్రియముదొలఁక, మానమూనంబుగాకుండఁ ♦ బూనినిల్పె.

సీ. అత్తఱినొకమోహ ♦ నాంగిబంగరునిగ్గు, లీనుచుండెడుతన ♦ మేనియందుఁ
దీరైనకాటుకల్ ♦ జాఱియోరగఁజూచు, బెళుకుకన్నులువింత ♦ చెలువునెరప
యావకరసమెల్లఁ ♦ బోవపల్లవశోభ, నుల్లసిల్లెడుమృదు ♦ లోష్ఠచలన
మొకవింతకాంతిని ♦ బ్రకటంబుగాఁజేయఁ, గస్తూరితిలకంబు ♦ కరఁగిపోయి
ఫాలఫలకాంతరంబునఁ ♦ బ్రస్ఫుటముగఁ, దళుకులీనుచునుండెడు ♦ వళులువింత
సొబగునెరపంగనెంతయుఁ ♦ జూడనొప్పెఁ, జెలులకవయవకాంతియే ♦ చెలువుగాదె.

సీ. వెలఁదివేరొక్కతె ♦ విభుఁడువేడుకమీఱ, సవతిపైజలములు ♦ చల్లియాడి
యంతటఁదనమీఁద ♦ నరసిచల్లినపుడు, నెంతయుఁగోపించి ♦ కాంతుఁడప్పు
డనునయవాక్యముల్ ♦ వినయంబుతోఁబల్క, సంతసింపకయుండె ♦ నింతదైన
నదియెంతయునునిచ్చ ♦ య్యముగ్ధదానుదిల్లోన, నరసిచూచినలోక ♦ మందునిపుడు

గాఢమైనమూర్ఛ ♦ గలజనంబులమది, నడరినట్టికోప ♦ మంతకంత
కినుమడించుఁగాదె ♦ యనునయించినయంత, నేమిహేతువొక్కొ ♦ యెఱుఁగరాదు.

సీ. చెలువులసన్నిధి ♦ సలిలంబులోపల, మునుఁగుచుఁ దెప్పపై ♦ నెనయుచుండఁ
గించిత్స్ఫుటాపాంగ ♦ కుంచితార్ధనిమీలి, తావర్తితకనీని ♦ కాదిలక్ష
ణాకేకరసులక్ష ♦ ణాలోలనేత్రత, నడుగక మేనులు ♦ వడఁకుచుండ
సతతనిశ్వాసకం ♦ పితసమున్ముఖపీన, కుచకుట్మలంబులు ♦ కోమరుమిగుల
సతులకత్తఱి సలిలమ ♦ గ్నతను జేసి, శ్రమము మఱి కాకపతిసమీ ♦ పమునఁ జేసి
పుష్పచాపవికారంబొ ♦ పొడమినట్లు, చూడనొప్పారి నొకవింత ♦ సొబగుమీఱె. ౧౯.

వ. మఱియును. ౨౦.

క. అత్తఱినొకబిత్తరి చెలి, కత్తియలను మీఱి వేడ్క ♦ గడలుకొనంగా
నొత్తిగిలియీఁదెదనమో, మెత్తుక నాథునకు మోద ♦ మిగులొత్తంగన్. ౨౧.

తే. వెలఁదియొక్కతె విభునిపై ♦ జలముఁ జల్లి, యతఁడు మఱి చల్లనూహింప ♦ నచట మునిఁగి
దూరమునఁ దేలెఁ గమలంబుఁ ♦ దొడరి నెరయ, ముసరు తేఁటులగతిఁ గురుల్ ♦ మోము నిండ.

తే. ముదితయొక్కతె నెమ్మోము ♦ ముంచి పూత్కృ, తంబు చేసిన బుడబుడ ♦ ధ్వని చెలంగె
నభ్రరవమంచు నదియపు ♦ డాలకించి, తటములందుండు బర్హిసం ♦ తతి నటించె. ౨౩.

లయగ్రాహి.

బోరగిలియీఁదెనొక ♦ నారి చెలి కత్తియలు, మీఱియిరువంకలను ♦ బారుగొనియీఁదం
గా రయము తోడుతను ♦ వారలను మీఱి నపు, డారమణివల్లభుఁడు ♦ నేరుపుననడ్మన్
దూఱికడువేగమున ♦ దూరమునమున్గి చని, చేరి కనుదేలుచును ♦ యారమణి మోము
వ్వారి నటుముంతునని ♦ చేరనది పొంచి కని, దారి పయిఁ జల్లినను ♦ బాలెమురలంగన్. ౨౪.

ఉ. చేతులు మీఁది కెత్తికొని ♦ చేడియయొక్కతె యీఁదె నిల్వగా
నాతత చేటికాకరస ♦ మాహతసంభవతోయనిస్వనం
బాతతి మర్దళధ్వనిగ ♦ నబ్జసముద్గతచారుబంభర
వ్రాతరవంబు చాలశ్రుతి ♦ భాతిగ నత్తఱి వేడ్క మీఱఁగాఁ
బాతరలాడు లీలఁ బతి ♦ భావము నమ్మదమంది చూడఁగన్. ౨౫.

చ. పదములు మోముఁ జన్గవయు ♦ బాహులుఁ గన్పడఁ దోయమందు నె
మ్మదిఁ బవళించి సూర్యునకు ♦ మాటికి మాటికిఁ దా నమస్కృతుల్
వదలక చేయుచుం జెలఁగి ♦ వారిజలోచన యీఁదె నేర్పుతో
నిదికడు వింతయంచుఁ జెలు ♦ లెల్ల సువిస్మయమంది చూడఁగన్. ౨౬.

చ. లలనలుమెట్టునిల్చుభుజ ♦ లంబులుమీఁదికినెత్తిచల్లఁద
త్సలిలకణంబులొప్పెసుర ♦ దానవసంఘముపాలవెల్లిదా
జిలుకఁగమీఁదికిన్నెగయు ♦ చిన్కులలీలఁదదంతరంబునన్
వెలసినలక్ష్మినానొకతె ♦ వింతగఁబొల్చెనుసాబ్జహస్తయై. ౨౮.

తే. ఒనరసీరీతివిహరించి ♦ యురుకుచోరు, జఘనకలితాంగనలుద్రోయ ♦ జలముదల్లె
వారివిడలేకపొంగుచు ♦ వచ్చుకరణి, ముందుగనెయూర్ములుపొంగి ♦ ముంచెదరులు.

చ. బెదరిరథాంగయుగ్మములు ♦ ప్రేమలఁబాయుచునన్యతీరముల్
గదియఁదటంబుచేరిసుర ♦ కాంతలుతత్సరిదంబుఘాతమై
సదమలపంకజాతవన ♦ సంపదమీఱుతారహారముల్
బాదలఁగఁబొల్చిరుల్కములఁ ♦ బొల్పెసలారెడురాత్రులోయనన్. ౨౯.

సీ. కులుకుగుబ్బలఁబూయు ♦ మలయజరసమున, నొకవింతరూపంబు ♦ ప్రకటమగుచు
విచ్ఛిన్నభూషామ ♦ ణిచ్ఛన్నదీధితుల్, బహుచిత్రవర్ణంబు ♦ పరిఢవింపఁ
గాశ్మీరగంధంబు ♦ గలసియొక్కొకచక్కి, యావకరసమంటు ♦ రేవఁదెల్ప
విడిజాటిపైనిండు ♦ విరులదండలచేతఁ, దరఁగలుచక్రప ♦ ద్ధతులవెలయ
నలరుగంగోదకంబంతఁ ♦ బొలిచెనపుడు, వలనుమీఱంగఁజొసీతి ♦ బంధగతుల
వేల్పుటింతులుక్రీడించి ♦ విడిచినట్టి, తల్పలక్ష్మివిలాసంబుఁ ♦ దాల్చినట్లు. ౩౦.

తే. పడఁతులీరీతిసలిలంబు ♦ వెడలివచ్చి, తడిసివలిపంపుచేలంబు ♦ లొడలులంటి
యవయవంబులుబయలైన ♦ యట్టులుండ, నొండొరులఁజూచిదరహాస ♦ మందగొనఁగ.

క. గడిమడతలిడియుముందా, మడుగుకడనెయిడినయట్టి ♦ మడుఁగులువెసనొ
క్కడుగుననేచెరిమడతలు, దుడిదుడినటువిచ్చికట్టఁ ♦ దొడఁగిరివరుసన్. ౩౧.

ఆ. నీలవేణియొకతె ♦ నిండుకుచ్చెలదీర్చి, నీలియుదయరాగ ♦ మొలిగట్టెఁ
బుష్పగంధియోర్తు ♦ పొందుగానవరించి, పొగడచెరుగుచీరఁ ♦ బొగడఁగట్టె. ౩౨.

ఆ. చంద్రవదనయోర్తు ♦ సవరించెనరిగంచు, చంద్రకావిచీర ♦ సరసముగను
నవలతాంగియోర్తు ♦ నవ్యమైకనుపట్టు, తీఁగెపనిపటంబుఁ ♦ దీర్చికట్టె. ౩౩.

ఆ. మృగవిలోలనేత్ర ♦ మెలఁతయొక్కతెగట్టె, జల్లిమృగములలరు ♦ చల్వచీర
మహితలీలనొక్క ♦ మత్తేభగామిని, యేనుఁగడుగుచీర ♦ నెలమిఁదాల్చె. ౩౪.

క. నవమోహనాంగియొక్కతె, సవరించెనుజిలుఁగుచల్వ ♦ చక్కఁదనముఁదా
వివరింపలేనివానికి, నవియువిగాకేలవెలయు ♦ నంగనకంచున్. ౩౫.

క. హరిమధ్యయొకతెయలరిచె, నెఱిసింహతలాటపటము ♦ నేరుపుమీఱన్
హరిమధ్యంబున గెల్చిన, బిరుదలరఁగ నెరుకదీర్చి ♦ పెంపుదలిర్పన్. ౮౭.
క. సతియొకతె దాల్చెఁ దనదగు, చతురత దాన ఫలయింప ♦ నరసతమీఱన్
జతురుత్తరాష్ట్రబంధము, లతులితముగ వ్రాసినట్టి ♦ యంబరమెలమిన్. ౮౮.
ఆ. సన్నుతాంగియొకతె ♦ పన్నెకోకలుగట్టి, నంగకాంతి వెలయ ♦ దంచునెంచి
పరఁగనచ్చమైన ♦ పైరాణిగళితంపు, జిలుఁగుచల్వఁ గప్పెఁ ♦ జెలువునోలఁక. ౮౯.
క. ఈరీతి నింతులందఱు, నేరిచి వస్త్రములుగట్టి ♦ యెలమిదలిర్పన్
పోరపుఁ జిక్కఁ బెలనుగురు, లారిచి పాపటలుదీర్చి ♦ యంతటవరుసన్. ౯౦.
క. అద్దములు చూచి యొఱపుగ, దిద్దిరి కీల్కొప్పుజడలు ♦ తీరగు కీల్గం
ట్లద్దిరయన జడసుళ్లెము, లొద్దిక ముమ్మూలకొప్పు ♦ లురుతరలీలన్. ౯౧.
వ. అంత. ౯౨.
క. కప్పురగంధియొకర్తుక, యొప్పుగఁ దిలకంబుఁ దీర్చె ♦ నుజ్జ్వలగతులన్
జొప్పడ ఘనసారంబునఁ, దప్పక తన పేరిచిహ్నఁ ♦ దాల్చినకరణిన్. ౯౩.
క. మృగనేత్రయొకతె తిలకము, మృగనాభిని నేర్పుమీఱ ♦ మించు ముకురమున్
దగఁ జూచి నిటలసీమను, దగుగుమ్మడివిత్తుకరణిఁ ♦ దనరఁగ దిద్దెన్. ౯౪.
క. చిక్కంబె నామ మొక్కతె, చక్కఁగ నిటలమునఁ దీర్చెఁ ♦ జంద్రరజమునన్
జుక్కల జిగినను చుక్కని, యక్కజమగు గోటికొనల ♦ నద్దిరయనఁగన్. ౯౫.
క. అగిశాకు నామ మొక్కతె, మొగిఁ దీర్చెను గుంకుమమున ♦ ముకురముఁ గేలన్
దగఁ బట్టి సారెసారెకు, సొగసుగఁ గొనగోట దిద్ది ♦ చూచుచు నెమ్మిన్. ౯౬.
ఆ. నాతియొకతె నిమ్న ♦ నాభితాఁ గావున, ముదముతోడఁ గన్న ♦ బొమలనడుమ
నాభినామమిడియె ♦ నఖరేఖయును బోలెఁ, గుంకుమమునఁ దీర్చి ♦ పొంకముగను. ౯౭.
క. రాజాస్యయొకతె నేర్పున, రాజిల్లెడు నుదుటఁ బూర్ణ ♦ రాజనిభముగా
రాజరజంబునఁ దీర్చెవి, రాజితమగు చుక్కబొట్టు ♦ రహిమీఱంగన్. ౯౮.
క. ఈరీతి బహువిధంబుల, నేరుపుమీఱంగఁ దిలకి ♦ నీమణులెల్లన్
వారికి వారికి నింపుగఁ, దీరిచి తిలకములు దిద్ది ♦ దీధితిమీఱన్. ౯౯.
క. మలయజమునఁ గుంకుమము, కలయఁగఁ బన్నీటఁ దీసి ♦ ఘనసారంబున్
వెలయు జవాదికదంబము, లలరెడు కస్తూరియున్న ♦ మాంశలు గాఁగన్. ౧౦౦.
క. సకియలు కలపంబీగలెఁ, బ్రకటంబుగఁ గూర్చి మించు ♦ పరిమళమడఁపన్
లికుచఫలమొకటి నడినిడ, సకలంబునఁ బరిమళములు ♦ సమమగునంచున్. ౧౦౧.

క. వెసదానిఁబుచ్చివైచుచుఁ, బొనఁగఁగఁగలపములుబూసి ♦ పొలఁతుకలంతన్
మిసిమిగలరత్నభూషా, విసరంబులుదాల్చిమిగుల ♦ వేడుకమీఱన్. ౧౦౨.
క. మించులనవరత్నంబుల, కంచెలలనుదొడిఁగిరపుడు ♦ కదనోన్ముఖులై
మించెడువీరులుదొడిఁగెడు, నంచితముగుజోళ్లరీతి ♦ నందఱునంతన్. ౧౦౩.
వ. అంత. ౧౦౪.
సీ. కస్తూరిచేనల్కి ♦ కపురంపుముగ్గుల, వలనొప్పఁగారంగ ♦ వల్లివ్రాసి
పన్నీటఁబుప్పొడి ♦ పదునిచ్చిమేదించి, నడుచక్కిసింహాస ♦ నంబుఁదీర్చి
మృగనాభిపదునిచ్చి ♦ మెదిచికంతునివ్రాసి, కాశ్మీరమునవన్నె ♦ గలయఁగూర్చి
వామభాగంబున ♦ వామాక్షిరతివ్రాసి, కెలఁకులవిధువసం ♦ తులనువ్రాసి
కీరసారంగపవనకో ♦ కిలమరాళ, శారిపారావతాదుల ♦ సరసవ్రాసి
కడఁగిపుష్పాదిపూజోప ♦ కరణములొనఁ, గూర్చికూర్చుండిమన్మథుఁ ♦ గూర్చితలఁచి.
సీ. ధ్యానంబుమనసిజు ♦ నావాహనమనంగు, నాసనంబనిరుద్ధు ♦ నర్ఘ్యపాద్య
ములుకంధికన్యక ♦ ముద్దుకుమారుని, నవగాహనముమక ♦ రాంకకేతు
మధుపర్కయుగమల్ల ♦ మధుసహాయునిబ్రహ్మ, సూత్రంబునాబ్రహ్మ ♦ సూతితాత
ఛందనంబురతిభు ♦ జంగుపూజలుపుష్ప, శరునిధూపముసురభి ♦ చరితుదీప
కలితనీరాజనములధి ♦ కతరతేజు, మహితమధురోపహారంబు ♦ మధురచాపు
మంత్రపుష్పంబురతిశాస్త్రి ♦ మంత్రవేదిఁ, దలఁచియర్పించికాయజుఁ ♦ దలఁచిమ్రొక్కి.
చ. ఇసుకనుగౌరిఁజేసిచెలు ♦ లెల్లనుగూడుకభక్తిమీఱఁగాఁ
బొసఁగమహోపచారములఁ ♦ బూజలుసేయుచుధూపమిచ్చియిం
పెసఁగఫలోపహారమిడి ♦ యెంతయువేడుకమీఱఁగోరికల్
కొనరుచుమ్రొక్కిలేచికడుఁ ♦ గూరిమితోడుతనోలలార్చుచున్. ౧౦౫.
సీ. శాంకరిమాకెల్ల ♦ సౌఖ్యమిచ్చిననిన్ను, వెలయఁదేల్తుముసౌఖ్య ♦ జలధియందుఁ
గామాక్షిమాకోరి ♦ కలఫలింపఁగఁజేయ, నలరించెదమునిన్ను ♦ ఫలరసమున
శ్రీగౌరిమముజయ ♦ శ్రీతోడఁగూర్చిన, నోలలార్తునునిన్నుఁ ♦ బాలవెల్లి
మాధవిమాకార్య ♦ సాధకంబైనను, దేలించెదముపువ్వు ♦ తేనియలను
ననుచునీరీతినాచెలు ♦ లాత్మలందుఁ, గోరికలుగూరియుందఱు ♦ గుంపుగూడి
యిందుధరుదేవినలవేల్పు ♦ టేటినీట, నోలలార్చిరిగంగప ♦ లీలమ్రొక్కి. ౧౦౬.
క. సురతపుసన్నాహంబుల, మెరయించరమించుకోర్కె ♦ మీఱఁగనెంతే
యరియించువచ్చెడుతత్పర, తరుణులనత్తటినిఁజూచి ♦ తరణియునంతన్. ౧౦౭.

క. వారికిఁ బ్రియముగ సమయం, బారసి కడదొలఁగఁ దలఁచి ♦ నట్టులు చరమాం
భోరాశి సమీపమునకు, జాఱెను జెలులెల్లఁ జాల ♦ సమ్మదమొందన్. ౧౧౦.

వ. ఆసమయంబున. ౧౧౧.

చ. సలలితహారమధ్యమణి ♦ సన్నిభ మైప్రసరత్కరౌఘముల్
దొలఁకఁగ నాకభాగమునఁ ♦ దోయజమిత్రుఁడు గ్రుంకుచుండఁగా
వెలయఁగఁ దాల్చె నంబరము ♦ వెన్కకు మర్లి చలించు హారముం
బలెఁ బగ లెంతయుం గడచి ♦ భాసురమాదినలక్ష్మి నత్తఱిన్. ౧౧౨.

క. అధికపిపాసను బద్మజ, మధువుఁ గరంబులను గ్రోలి ♦ మత్తిలు మాడ్కిన్
బృథివిం గదియుదు దేహము, ప్రథితంబుగ నెఱుపు దాల్చె ♦ భానుఁడు మాడ్కిన్. ౧౧౩.

క. వనజాతమిత్రుఁ డీగతిఁ, గనుఁగవ కెఱుపగు మమిగులఁ ♦ గన్పడుచుండన్
బెనుతాపము ధరవీడుచు, మొనసెను జక్కవల హృదయ ♦ ములనవ్వేళన్. ౧౧౪.

చ. తరణి నగంబు గ్రుంకఁగను ♦ ద్వ్యక్తసమాశ్రయతన్ లఘుత్వమున్
బారసి విముక్తపూర్వమయి ♦ పొల్పతియొక్కెడ గుంపుగూడి త
త్కరసముదాయమత్తఱిఁ బ్ర ♦ కాశిలకుండెను రాజులేని యా
నరనికరంబు వోలె నుమ ♦ నంబున నత్తఱి నెంచి చూడఁగన్. ౧౧౫.

ఉ. సాయమలంకృతిత్వరను ♦ జయ్యనఁ జేయుచుఁ గుంకుమంపు బ
ల్ఛాయల జాలమార్గముల ♦ చక్కఁగఁ జొచ్చిన భానుదీధితు
ల్నాయకులంపు దూతికల ♦ లాగున నత్తఱి సాదరంబునం
బాయక చూడ నొప్పె సుర ♦ భామలకెంతయు వేడ్కసేయుచున్. ౧౧౬.

మ. కమలాప్తుండపుడస్తశైలశిఖరా ♦ గ్రస్థానసానుప్రదే
శమహీరుట్ప్రికరావలంబదరుణ ♦ స్ఫారాంశుఁడై పొల్చి త
త్సుమహోత్తానసీమనో జలధినో ♦ చూడంగ నబ్భూమినో
కమియం జొచ్చెను శీఘ్రపాతమగుటం ♦ గన్పట్టవాస్థానమున్. ౧౧౭.

వ. అంత. ౧౧౮.

క. చలవిహగకులరవాకుల, కలితానుదితౌషసీయ ♦ ఘనరాగంబై
జలజహితరహితపాండుత, విలసిలె సాయాహ్నముదయ ♦ వేళను బోలెన్. ౧౧౯.

క. జలదములఁ గప్పి విప్పగు, నలసంధ్యారాగమునను ♦ నపరాంబరను
స్థలమపుడుష్మోర్మివిద్రుమ, విలసద్రుచినొప్పు జలధి ♦ విధమునఁ దనరెన్. ౧౨౦.

ఆ. పరగనమ్రములగుచు ♦ సంధ్యానురక్తిచేఁ, జేతులెత్తిమ్రొక్కు ♦ శిష్టజనుల
యెడలఁగలుగుప్రేమ ♦ విడిచితొలఁగెసంధ్య, దుర్జనుండుమైత్రిఁ ♦ దొఱఁగునట్లు.

క. ఉదయాతపభయమునబలె, నొదిగిదినాంతమునబలియు ♦ నురుతమమంతన్
బొదివెసమస్థలులెల్లను, వదలకనిమ్నములనుండి ♦ వచ్చుచువరుసన్. ౧౨౨.

శా. ఈరీతిన్ దమమెల్లనిండిసకలం ♦ బేకీభవింపన్మహో
దారప్రస్ఫుటపర్వతాదిసుపదా ♦ ర్థజ్ఞానమున్నిచ్చలం
దాఱూపింపఁగరాకయుండెనొకటై ♦ నన్ భూమిపైవస్తువుల్
నీరేజాప్తుఁడుగ్రుంకుచుండితమలో ♦ నిక్షేపమున్ జేసినన్. ౧౨౩.

చ. తరుణులఁబాయకెప్పుడును ♦ దంబునముండెదమంచునాత్మలో
నెఱిఁదలపోయుచుండురజ ♦ నీవిరహాకులచక్రయుగ్మముల్
కరమువియోగమందెమఱి ♦ కాలనియోగముఁద్రోయశక్యమే
హరిహరపద్మజాదియమ ♦ రావలికైనఁదలంచిచూచినన్. ౧౨౪.

చ. తలపఁగఁజక్రవాకములు ♦ దగ్గఱనుండునిజాంగనాలితోఁ
బలుకులెకానిసంగతికిఁ ♦ బాఱకయుండెనువానిదుర్దశన్
దెలియఁగఁజూచిపద్మినియుఁ ♦ దేజముదక్కుచుమోమువాంచిన
ట్లలకమలంబువంచెవిర ♦ హంబుగనన్ సఖిచిన్నవోవదే. ౧౨౫.

సీ. అంతంతకెక్కుడౌ ♦ నంధకారముచేత, వివిధభూరుహశైల ♦ వితతులెల్ల
నొగిరంజితంబయ్యె ♦ నొక్కొకగగనంబు, కలయప్రాలెనొలేక ♦ కప్పఁబడెనొ
ధరమీఁదనిమ్నోన్న ♦ తములుపూరితముగాఁ, గడఁగిసమముచేయఁ ♦ బడెనొలేదొ
దిశలెల్లనేకమై ♦ తెలియరాకుండను, మించియన్నియునాక్ర ♦ మించఁబడెనొ
యనఁగనీరీతిబ్రహ్మాండ ♦ మెల్లనిండి, ధరణియుదివిమిన్నగిరులివి ♦ తరువులనుచు
నరయరాకుండనద్వైతీ ♦ యత్వమొంది, నిండెనవ్వేళఁజీఁకటి ♦ మెండుగాను.

ఉ. అప్పుడురాత్రిరాఁగమలి ♦ నావికసజ్జలజాతజాలమున్
దప్పకవీడుచున్వరళి ♦ తారకమైతగునంబరంబునం
దొప్పుగనిల్చెశోభమఱి ♦ యుర్విఁదలంపఁగనెల్లవారలున్
దెప్పరమేమిలేనియెడ ♦ నిల్వఁదలంతురుగామునంబులన్. ౧౨౬.

సీ. కరమొప్పఁగానిశా ♦ కరసముజ్జ్రీతమాఁచుఁ, గేతకీవరపుష్ప ♦ కేసరముల
పగిదినీపాండుర ♦ ప్రభమీఱిమిక్కిలి, తేజరిల్లుచుఁదూర్పు ♦ దిక్కునందుఁ

గిరణసమూహంబు ♦ గిరిగొని వ్యాపించెఁ, బ్రేమతోఁ గాంతపైఁ ♦ బ్రియుఁడు జల్లు
ఘనసారరజమూది ♦ గాఁగల్గువరచూర్ణ, ముష్టిరీతి నిమహః ♦ పుష్టి మెఱసి
యంతనా చెంతవంతంత ♦ కబ్జవైరి, వెలయుచుండంగఁ దమమెల్ల ♦ విరహదుఃఖ
గతినివిడనాడికడుఁ బ్రస ♦ న్నతను మెఱయు, ప్రాచిదిశల నాగనగుమోము ♦ పగిదిఁ దనరి.

మ. స్థిరపూర్వాచలహూటుద్ధతనుఁడై ♦ శీతాంశుఁడొప్పారఁద
త్కిరణౌఘంబు తుషారశుభ్రతమహ ♦ త్కృష్ణాభ్రరూపాంబరం
బుదారంగను నిండుచుం బొలిచెన ♦ య్యంభోధితోయంబులో
నెరయన్నింపుచునుండు దైవతధునీ ♦ నీరంబు చందంబునన్. ౧౨౯.

ఆ. గగన మెల్లఁ గప్పి ♦ ఘననీలరుచి నొప్పి, శీతభానుకరవి ♦ ఘాతమాన
పూర్వమగుచుఁ దమము ♦ వొల్చె శంకరకరో, చ్ఛాననాగచర్మ ♦ శోభ గలిగి. ౧౩౦.

చ. మెఱసి శశాంకుఁ డిట్టులున ♦ మీపము చేరినఁ దత్కరౌఘముల్
నెరయఁగ శంకలేక దివి ♦ నిండ దిగంతము లత్తఱిం దమో
భరమును నిర్గమించికడు ♦ భాసురలీల సజీవితంబులో
కరణి నివిస్ఫుటంబగుచుఁ ♦ గన్పడె నత్తఱిఁ గాంతి మీఱఁగన్. ౧౩౧.

చ. శితకరుఁ డంతవిద్రుమరు ♦ చిం దనరారెను నాత్మసత్కళన్
జతురతఁ బాఱఁ దోలె నది ♦ సాంద్రతమిస్రము నాదిసూకరం
బతులసువర్ణటంకరుచి ♦ రాయణ మైతగు దంష్ట్రిచేత వి
శ్రుతముగ భూమి యొక్కెడకు ♦ దోఁచిన వైఖరి మీఱ నత్తఱిన్. ౧౩౨.

ఉ. అంతట నంబరంబు కిర ♦ ణౌఘము చే విలసిల్లఁ జేయుచ
త్యంతము కుంకుమారుణరు ♦ చా భతనుత్వత నొప్పి యున్నిశా
కాంతుఁడు మెల్లనే వెడలెఁ ♦ గాంచనకుంభము వ్రాలెఁ బ్రాక్సము
ద్రాంతరసీమనుండి విర ♦ హార్తులు దన్గని శంక సేయఁగన్. ౧౩౩.

వ. ఆసమయంబున. ౧౩౪.

సీ. ఉదయించుచుండెడు ♦ సుడు రాజబింబంబు, గళితాంశుకానన ♦ క్రమతఁ దనర
నిండారుతత్కాంతి ♦ నెమ్మేనలఁదిన, కుంకుమగంధంబు ♦ కొమరు దెలుపఁ
గలయఁగ నిండుచు ♦ క్కలు నిక్కకీల్కొప్పు, చిక్కుముత్తియముల ♦ చెలువు మీఱ
నంతకంతకు జాఱు ♦ నంధతమిస్రంబు, పీడెడు మను సిగ్గు ♦ విధము గాఁగ
రజనిగనుపట్టెనతితృప్తిఁ ♦ బ్రజలు చూడ, పాసఁగ నిడినట్టియా మేలు ♦ ముసుకుజాతి
మోముగనుపట్టనొకవింత ♦ గోము మీఱ, సిగ్గుచేఁ గొంకునూతన ♦ స్త్రీవిధమున. ౧౩౫.

ఆ. రాజు చేతనభము ♦ రాజిల్లకుండెను, దమము దీతివనము ♦ దరలకుండె
దిఙ్ముఖములు శాంతి ♦ ద్రిప్పించకుండెను, నైనఁగాని రాత్రి ♦ యలరె నపుడు. ౧౩౬.

సీ. ఈరీతి నుదయించి ♦ రేరాజమతియుండఁ, బ్రణయకలహము చేఁ ♦ బతులఁబాసి
విరహానలంబుచే ♦ వేగుచు మదిలోన, నుసురంచు నిట్టూర్పు ♦ లుచ్చికొనుచుఁ
గోకనదచ్ఛాయఁ ♦ గొమరొందు కన్నుల, వెచ్చనిబాష్పముల్ ♦ వెడలుచుండఁ
గలహాంతరితనాయి ♦ కాజనంబులు రోష, భీషణాకృతిమీఱ ♦ బిట్టుచూచు
చుఱుకుఁ జూపులు తనమీఁద ♦ సోఁకు కతన, వెఱచిమదిఁ జాలభీతిల్లు ♦ విధుని మీఱ
మెల్ల మెల్లనె నభమాక్ర ♦ మించె నపుడు, హిమమయూఖుండు సెగకుఁదా ♦ నెట్టులోర్చు.

తే. కరములటు చాఁచి తారకాం ♦ గనలఁ జేరి, చెలఁగి యుపకంఠసీమల ♦ నలము విధుని
ప్రసరదరుణాయతోదయ ♦ రాగమొప్పె, రాజితాశ్లేషలసదంగ ♦ రాగలీల. ౧౩౭.

వ. వెండియు నా రాజకుమారమండలంబు గండుమెఱసి దుండగంబున నవ్వేల్పుటండజయానల నిబ్బరపుటిఱుకు సిబ్బెపుటుబ్బుగబ్బిగుబ్బబంతుల యుబ్బరఁపుఁగాంతులం గలసి కందుకక్రీడావినోదంబులు సలుపుచు, ముద్దుమొగంబులతోడం బెన్నుద్దియై యద్దరి పాటున నయనాంబుజంబులు ముకుళింపఁ జేయుచు, నిద్దంపుఁ జెక్కుటద్దంబుల నుద్దీపితంబగుచు శ్రవణపుటంబులు చొచ్చి నెఱితురుముల నమరఁ దురుము విరులదండల నండలుగొనుచుఁ దాఁగిలిమూఁత లాడుచు నిటలభాగంబులం బటుతరంబులుగా మెఱయుచుఁ, జేరుమక్కుముత్తియంబులతోడ వెన్నెలకుప్ప లాడుచు, నాకేకరలక్షణవిలక్షితాయమానకటాక్షవీక్షణంబులతో వధూచరక్రీడలు సల్పుచుఁ, దోరంబులగు ముక్తాహారంబులతోడం బేరెంబులు వారుచుఁ, దాటంకఖచితమౌక్తికరోచులం గలసి గండపాళికలపయిం బింపిల్లు గురియుచు, సుకుమారకరనఖరకాంతినికరంబులం గలసి పరిభ్రమణక్రీడావిశేషంబులు గావించుచు, హారికంకణహీరవారోరుదీధితులతోడ సయ్యాటలాడుచు, నధరమాధుర్యయాచ్ఞార్థసమాగతసుధాబిందుసంకాశంబులై చెలువొందు నాసామౌక్తికంబులఁ దరంగలించు మెఱుంగులం దరంగితం బగుచు, దరహాసవిలాసంబులతోఁ జెడుగు లాడుచుఁ, గమనీయకబరికావేష్టితకుసుమగుళుచ్ఛచ్ఛవిం గలసి కీలిగుడుచుచుఁ, బటుతరకటిసూత్రహీరమరీచులపయిం బిల్లమేరంబులుగొనుచు, పదనఖరకాంతిభంగంబులమీఁదఁ జౌకళించి కుప్పిగంతులు వైచుచు, భాసురంబులగు నాసికపుముత్తియంబులఛాయల నావిగొని జడచిక్కుశక్తిజభ్రుకుభల వెంబడి నితంబద్యుతులపర్యంతంబు హస్తక్రీడావిశేషంబుల జరుగుచు, బాహుశాఖలపై కరికి కేయూర [illegible] గలసి పదకటకఖచితమౌక్తాఫలశోభలపై లంఘించి తరుచరక్రీడావిశే

పంబులం జెలుంగుచుఁ, గుచతటసమాచ్ఛాదితసమంచితకంచుకాంచలంబుల నంచితంబులగుతారవారంబులం దురంగలించు మెఱుంగులం బైకొని నాభిప్రదేశంబులఁ జెలంగు విహంగనామతాళికాహీరకాంతిపుంజప్రహాదంబులలోపలం దుముకుచు, జలక్రీడావినోదంబుల ననుమోదించుచు, నివ్విధంబున బాల్యక్రీడావినోదంబుల నభివృద్ధిం బొంది, నవయౌవనోన్ముఖుండై సాముసేయం దొడంగిన తెఱంగునం గడానిమెఱుంగుబంగారంపుబలుఁరంగులం దొలంగం జడియుచుం జెలంగున మ్మెఱుంగుబోఁడుల బెడంగుటంగకాంతిపుంజంపుగరిడీలు చొచ్చి, యురస్థలంబుల నిండార నలందినకుంకుమంపుఁగెంపుమట్టిలం దోఁగి, తారహారంబుల నిగనిగలం గలసి దండంబులు ద్రోయుచు, పదకటకపటుహీరమరీచులం గలసి పల్లటీలు వైచుచుఁ, గరకంకణశుక్తిజచ్ఛవిం గలసి ముష్టిఘాతలు సేయుచు, బాహుభూషణదీధితులం గలసి పెనంగుచు, వివిధభూషణమణిగణకాంతిజాతంబులను గోతంబుల మేలిమిం గొనుచు, మెఱుంగుచన్నుంగవలరంగుల సంగడంబు లెత్తుచుఁ, గరనఖరకాంతులం గటారికోలలు జిమ్ముచు, మృదులోరురంభాస్తంభశుంభచ్ఛోభలం బెనంగుచు, నూర్ధ్వప్రసారితకటాక్షవిక్షేపశరలాఘవదరహాసధవళకాంతి సంచయబిరుదకుంచికానమంచితోభయపార్శ్వప్రదీపితంబగువిజయధనురాకృతిం దనరారుభ్రుకుటీవిలాసంబుల ధనుర్విద్యావధానంబు లభ్యసించుచుం గడకంటిచూపులం గడసాదనలు నెరపుచుఁ, గుచరోమావళికాంతినిచయంబుల ఖేటకఖడ్గాభ్యాసంబులు సేయుచు, సమగ్రసమంచితయౌవనోద్ధతంబైనవిధంబున నాజవ్వనులమోముల నివ్వటిల్లెడునవ్వులం బొదలుచు, నిద్దంపుఁజెక్కుటద్దంబుల ముద్దులం బెద్దయగుచుఁ, గర్ణపత్రమయూఖంబులం గలసి మంతనంబులు సేయుచు, మృదురదనకాంతులం బొదలుమధురాధరరుచులం జవిమీఱుచుఁ, గమనీయకంఠసూత్రోరుముక్తామణిప్రభావిశేషంబులం గలసి రతికూజితంబుల విరాజితంబగుచు, భుజమూలంబుల మెఱుంగులం గలసి యాలింగనంబులు సేయుచు, నుత్తుంగంబు లగుచన్నుంగవలవెలుంగుల నాటి మెలంగుచు, స్థూలంబులగు కటిస్థలగభస్తినికరంబులం గరంబుల నిమురుచు, మనోభవాలయంబులఛాయలం బుఱుకుకరికరస్థూలోరుకాండంబులు దంశితంబులు గావించుచుఁ, గళానిపుణత్వంబున మెఱయు విటశిఖామణియునుంబోలె రత్యుద్దీపకత్వంబున నత్యంతంబు భాసిల్లుచు, మలయపవనమనసిజు లనుచరులై విహరించుచుండ నిచ్ఛావిహారంబున నెక్కుడ చూచినం దాసరై, యింద్రనీలస్తంభోపరిస్ఫాటికసమాచ్ఛాదనవిద్రుమవిటంకవలభికలం జెన్నొందుచుఁ, జంద్రకాంతకుట్టిమంబులను, మరకతవితర్దికోపరిపరికల్పితమరాళతూలికానల్పతల్పోజ్జ్వలత్ప్రవాళ

సంఘటిత సంశోభిత డోలాలాలితఖట్వాంబులను, ఘనసారనీహారవాఃకుంకుమచందన కస్తూరికాదిబహువిధపరిమళవస్తుసమ్మిళితఘుమఘుమితపద్మరాగస్ఫటికవిభూపలధాత్రికావిస్తారితంబును, నవవికచవివిధకుసుమవిసరపరికల్పితఘుమఘుమమాయతప్రసూనజవనికానికాయంబులను, జాళితిసురతవిశేషవిరచితమణిపుత్రికాసమంచితచిత్రలేఖావిచిత్రపాళికాసంకలితంబును, గుసుమవిసరోపశోభితశయ్యాసమీపస్థితకరదీపికాయమానమాణిక్యఖచితకనకపాత్రికాసమంచితహస్తనిస్తులచామరవ్యజనకీలితకరకలితతాంబూలపేటికాసంభరితప్రపూరనీహారజలకలశమణిప్రదీపితముకురపాదుకాదిపరికరనికరోపశోభిత వీణామృదంగోద్వహనపాణిప్రకాశితయంత్రపాంచాలికాసంచయంబులనుం జెలువొందు కేళికాగృహంబులను, జంద్రశాలాంతరాళంబులను, గృతకశైలోపరిస్థలంబులను, భర్మహర్మ్యపరిభాగంబులను, బరిమళపేటిక లనఁ జెలువొందునుద్యానవాటికలను మెలంగుచుం బరిపూర్ణయౌవనుండై కువలయాధిపత్యంబునుం దాల్చిన తెఱంగున నుదయగిరిం బట్టాభిషిక్తుండై కుముదంబులకు ముదంబులం గావించి, తదీయం బైనతేజోవికాసంబు రాజీవంబుల కొసంగి దినరాజస్తమితుం డయ్యె నని విని యొదరు వేచి యేతెంచి తత్సారసంబుల నసారంబులం జేసి తత్తేజంబుఁ గువలయంబుల కొసంగిన తెఱంగున వికసింపఁ జేయుచు, దిగంతవిశ్రాంతంబుగా భూమండలం బాక్రమించుచు నేతెంచినం గని దిగ్వధూతిలకంబు లెదుర్కొని చల్లుసేసముత్తియంబులచందంబున నందంబై యుండు బృందంబులు పరివేష్టింప, ననర్గళం బగుతేజంబునఁ బ్రకాశించుచు, శుకపికమదమన్మధుకరపరివారపరివృతుండై యన్యోన్యంబును గలహించి కూటువలకుం బాసియుండెడు నాయికానాయకసముదయంబుల యితరేతరమనోవైకల్యంబులు మాన్చి, రతులకుం దార్కొని సతీపతిన్యాయంబున వర్తింపఁజేయుచు, దండనాయకాధిపత్యనియమితుండై విలసిల్లు నల్లునిం గని సముల్లాసంబున దరహసించిన తెఱంగున మెఱుంగుఁ జంద్రికం బరఁగించుచు, నాత్మజాభ్యుదయాతిరేకంబునకుం గలశవారాశి యుప్పొంగి వెల్లివిరిసినచందంబున భూమండలం బంతయు స్థావరజంగమాత్మకంబుగా సుధాసారంబు లగుకిరణసమూహంబుల నాక్రమించుచుఁ, బరబ్రహ్మంబునుంబోలె, నద్వితీయంబగు తేజంబునం దేజరిల్లుచు, సమవిషమనిమ్నోన్నతంబు లేకీభవింపఁ జేయుచు విజృంభించిన యనంతరంబున. ౧౩౬.

శాంకరాజ్యపవిస్తారితాంశువులుసాం ◆ ద్రీభూతతామిస్రము
సాంద్రద్విరేఫపతిశాలివిమలవిభూషా ◆ క్షీరవారాశి

స్ఫారోదంచితసాంద్రఘూకహవిరా ♦ జత్త్రీరసంవ్యాప్తమా
నారామంబునుబోలెనస్తతిమహా ♦ హంకారమున్మీఱఁగన్. ౧౪౦.

ఆ. శబలవర్ణమగుచు ♦ సాంద్రద్రుమచ్ఛాయ, సోమకిరణదీప్తిఁ ♦ జూడనొప్పె
నెరయశుక్లబలులు ♦ నిండారఁబెట్టిన, నలరుయాజ్ఞికాజి ♦ రాభమగుచు. ౧౪౧.

ఉ. ఇంతులతోడఁగూడిపగ ♦ లెండలయందునునాత్మలోనన
త్యంతముహర్షమందెడుది ♦ నాంతవియోగములైనజక్కవల్
ఎంతయునోర్వకుండెనల ♦ యిందుకరంబులనెట్టులన్ననన్
జింతిలుచుండువారలకుఁ ♦ జిత్తముగానవసహ్యమేకదా. ౧౪౨.

మ. కలితోద్ధూతవికాసితోత్పలపరా ♦ గంబైమహాత్సౌరభో
జ్జ్వలమైనిర్మలతోయశీకరసము ♦ ద్వాహంబునన్నైనని
శ్చలశాఖాంతరలీనపక్షికులవి ♦ స్ఫారోరుకాంతారపం
క్తులనొక్కింతఁగదల్చెఁదద్వహగముల్ ♦ దోధూయమానంబుగాన్. ౧౪౩.

చ. మలయుచుయామినీరమణి ♦ మారునకున్విజయాభిషేకమిం
పొలయఁగఁజేయ నెత్తునసి ♦ తోత్పలసంయుతరౌప్యకుంభముం
బలెఁజెలువొందెఁబూర్ణశశి ♦ భాసురతోయములీలనంశువు
ల్దలముగఁబర్వవిప్పగుక ♦ ళంకసితోత్పలలీలనొప్పఁగన్. ౧౪౪.

వ. అంత. ౧౪౫.

తే. అధికతేజస్వినైనన ♦ హాయరహితు, తావరింపదుజయలక్ష్మి ♦ తథ్యమింత
చూడువిభుఁడయ్యెవలరాజు ♦ సోమకిరణ, వితతసాహాయ్యుఁడైయెత్తె ♦ విజయధనువు.

వ. అప్పుడాసన్ననుత్సాహంబునం బొదలు నయ్యమరకామినీసముదయంబు సరభసంబున.

సీ. వెలయూటకొలుదీర్చు ♦ నిలువుటద్దంబులు, జలతారుపనివింత ♦ చందువలను
వింతచిత్తరువుల ♦ విలసిల్లుపకినేల, నలరెడుతూఁగుటు ♦ య్యాలలహంస
తూలికాతల్పముల్ ♦ కీలుబటుతలాడ, లలకప్పుదుప్పటు ♦ లలరుతెరలు
కపురంపుసురటులు ♦ గంధంపుఁజిప్పలు, పరిమళిపేటులు ♦ పైఁడిగద్దె
సొగసుటడపంబుముత్యాఁపు ♦ సున్నగుడుక, తమ్మపడిగంబుచేదివ్వె ♦ బొమ్మసలిల
కళశములుపాదుకలుగల్గి ♦ వెలయుకేళి, మందిరంబులుమఱియును ♦ బొందుపఱిచి.

క. హెచ్చినతమకముచేతను, వచ్చిరియిదెరమణులనెడు ♦ వార్తలువినియున్
నెచ్చెలులనెదురుబుచ్చఁగ నిచ్చంగోరుదుతుమోహా ♦ మేమనవచ్చున్. ౧౪౬.

క. రంగుగ నవరించుకయును ♦ సంగతికిని బ్రియులువచ్చు ♦ సంబరమునను
ప్పొంగుచు మఱియును వింతఁగ, శృంగారము దీర్చికొనిరి ♦ చెలువలు వేడ్కన్. ౧౫౦.

ఆ. అట్టివిరహవేళ ♦ నరుచియయ్యెను వారి, కలరు హారచంద ♦ నాసవంబు
లెట్లటన్న భూమి ♦ నీవస్తువులకన్నఁ, బ్రియముచేయుఁగాదె ♦ ప్రియులరాక. ౧౫౧.

సీ. ధవులన్యభామలఁ ♦ గవయుటకోర్వక, మానినుల్ తామెపో ♦ మనకులాఘు
వము వచ్చునిపుడుపో ♦ వద్దనిఖండించు, సఖులమాటలు మది ♦ సరకుగొనక
రమణులయిండ్లకు ♦ రభసంబుతో నేగి, యాచుల్కఁదనమప్డు ♦ దోఁచకుండ
నబలలుగావున ♦ నప్పుడులాఘవా, పహ్నవయుక్తమై ♦ పరఁగుకతన
ధైర్యహానియుమతికార్శ్య ♦ తయును జేయు, నట్టిదేనియు నపకారి ♦ యనక యంత
మత్తతను బొందిదేహముల్ ♦ మఱచినిలిచి, సోలుచుండిరి యొకవింత ♦ సోయగమున.

సీ. భావజుకేళికై ♦ పతులసన్నిధికిని, రాయబారములంపు ♦ రమణులపుడు
సంతసంబునఁ బ్రాణ ♦ సఖులతో వినయోక్తి, నంతరంగపుమాట ♦ లాదిగాయైన
బహువిధసందేశ ♦ భాషలు చెప్పుచు, విరహాతురతమున్ల ♦ నెఱుక లేక
పతులయిండ్లకుఁదామె ♦ వచ్చిరి వారునఁ, బెన్నిధుల్ పేదలు ♦ గన్నయట్లు
మారువెట్టిచేత ♦ మతిచెడ్డవారికిఁ, బుడమిలోనఁదప్పు ♦ నడవడియును
బరఁగనెంచిచూడఁ ♦ దఱచుగానుపకారి, యగును గాదెయెట్టి ♦ పగిదినైన. ౧౫౩.

క. త్వరితగతిఁ బతులసన్నిధి, కరిగెడు కామినులమోము ♦ లావృతపులకాం
కురముల్వ్యామృష్టపత్రతఁ, బరిపూర్ణసుధాంశుఁబోలి ♦ భాసిల్లెఁగడున్. ౧౫౪.

వ. ఆ సమయంబునం బెచ్చు పెరుఁగు విరహంబునకుం బిచ్చలించి యయ్యచ్చరలు నెచ్చె
లులం బతులసన్నిధికిం బుచ్చం దలంచి తమకంబున. ౧౫౫.

సీ. చెలువుఁడురాఁడాయెఁ ♦ జెలియిప్పుడేపోయి, వారపారలులేక ♦ దూఱఁగదవె
మగనిమీఁదటనింత ♦ తెగువేలనంటివా, యొడఁబాటుగాఁబల్కు ♦ తోడుకరమ్ము
విప్రియంబులుసేయు ♦ విభునూఱడింపఁగా, నేమన్న నచటికి ♦ నేగనేల
సుభగాభిమానవు ♦ సుదతి నీవటుగాన, నటువంటిపతియబ్బ ♦ టబ్బురంబు
మనకునలుక లేల ♦ చనవలెనంటివా, సకియ యిదియెయుక్తి ♦ చనుమటంచు
ననెడునతులమాట ♦ లటఁబొంచి వినిప్రియుల్, సంతసిలిరివింత ♦ వింతరుచుల.

ఉ. అంతటఁ గాంతులంగలసి ♦ యంగనులన్ బులకాంకురంబుల
త్యంతము బుట్టనూతనస ♦ మాగమసంభవమైనఘర్మముల్

వింతగఁ జేరవత్తుములఁ ♦ బ్రేమలఁ బ్రాలెడు తత్సురాంగనా
సంతతికిన్ విమండనమె ♦ చాలనలంకృతియయ్యె నత్తఱిన్. ౧౫౭.

* * * * * * * * * *

ఉ. అంతటఁ దెల్లవాఱెనరు ♦ ణాంశుచమూతతి పూర్వశైలదు
ర్గాంతికసీమ ముట్టికొన ♦ నచ్చటి రాణువమూకవ్రాలెఁ దా
నెంతయు వెల్లబాఱియల ♦ యిందుకరౌఘము విచ్చిపాఱెఁ ద
త్కాంతలు వోలెఁ జీఁకటులు ♦ గహ్వరసీమలలోన దాఁగఁగన్. ౧౫౮.

సీ. తురగరింఖాముఖో ♦ ద్ధూతరేణువులీలఁ, గలయంగనుదయరా ♦ గంబు బర్వ
మేదురమాగధ ♦ నాదంబు గతిఁ బద్మ, నిర్గతసారంగ ♦ నినదములర
సకలవాద్యములఘో ♦ షములీల నెల్లెడ, విహగారవంబులు ♦ వెలయుచుండ
రమణీయకాహళా ♦ రావంబు గతిఁ దామ్ర, చూడధ్వనులు మిన్ను ♦ సోఁడుముట్ట
బలసి తనుఁ గ్రమ్మి నడతెంచు ♦ బలములీలఁ, గిరణనిచయంబు నిగుడుచుఁ ♦ బోరిగొనఁగ
నడరి దినరాజరేరాజు ♦ నంటఁ దఱుము, కరణి నెంతయు నుదయాద్రి ♦ మెఱసె నపుడు.

క. నిక్కానునీడలు పడమటి, దిక్కునకును దిశలు వెలసెఁ ♦ దేజము మీఱన్
జక్కవలు జోళ్లు గూడెను, జక్కఁగ సంధ్యాదికర్మ ♦ సంతతి నెరసెన్. ౧౬౦.

క. వనజంబులు వికసించెను, దినసతిపతి దూరమరుగ ♦ దీనాననయై
చను దెంచె మఱలననివిని, కనుఁగొన ధృతి మీఱవిచ్చు ♦ కన్నులు వోలెన్. ౧౬౧.

క. వెలయఁగఁ బ్రాక్సతి ప్రొద్దునఁ, జెలువుగ ముఖమజ్జనంబు ♦ చేసుకనుదుటన్
వలనుగ దిద్దిన కుంకుమ, తిలకంబన నొప్పె నపుడు ♦ దినమణి మింటన్. ౧౬౨.

శా. అంతన్ దైవతవారసుందరులు రా ♦ త్ర్యంతాంగశృంగారముల్
వింతల్మీఱఁగ మందయానములఁ దే ♦ వేంద్రాత్మజాన్వేషవి
భ్రాంతుం జేసెదమంచు నొండొరులతోఁ ♦ బంతంబులం బల్కి త
త్స్వాంతోద్యానము చేరవచ్చిరి రతి ♦ ప్రాచుర్యముద్రాంగులై. ౧౬౩.

సీ. గగనసంచారలా ♦ ఘవముచేఁ బృథుకటి, స్తనజానుభరతమం ♦ దతలు మీఱ
నడుగామడలుగమ ♦ ల్లిడు పాదయుగళంబు, యావకరసమంటి ♦ యచటి భూమి
యింద్రగోపావృత ♦ సాంద్రశోభ దలిర్పఁ, గాంచనరత్నసం ♦ ఘటితమంజు
మంజీరకాంచికా ♦ శింజానినాదంబు, పర్వతగుహలలోఁ ♦ బ్రతిరవించి
హంససారసకూజితం ♦ బనుకరింపఁ, గానులసియాడఁ బిఱుఁదులు ♦ గదలియాడ
జడలు చిరిబాడవారముల్ ♦ సరసమాడ, సంచరించుచునుండిరా ♦ మించుఁబోండ్లు.

సీ. పరిపక్వఫలసుమా ♦ పచయసంసూచక, తరుణతాకలితకాం ♦ తారములను
దేవపూజలు చేసి ♦ దినమునుద్వాసించు, పరిభుక్తమాల్యాది ♦ పరికరములు
ఘాతుకవ్యాఘ్రాది ♦ కములతో నేకమై, మెలఁగెడుహరిణాది ♦ మృగచయములు
నటసమీపము చేరి ♦ నంతనే భయమొంది, చెదరియదరుతమ ♦ హృదయములును
మఱియున న్యోన్యవైరముల్ ♦ మానియచట, నెలవుకొని యొక్కటొక్కటి ♦ గలసియుండు
నఖిలసత్వంబులును వారి ♦ కపుడు దెలిపె, నెలమి ఋష్యాశ్రమంబునా ♦ యిదియటంచు.

క. రాతపసిప్రాంతభూమియు, యాతరుణులతేజమెల్ల ♦ నడఁచె మహాత్మో
పేతులగు ఋషులమహిమకు, నాతలనవిలంఘ్యమైన ♦ యట్టిదిగలదే. ౧౬౬.

సీ. అమలసైకతముల ♦ నతిమానుషములుగా, ధ్వజచక్రరేఖలు ♦ దనరమెట్టు
నలలితార్జునపాద ♦ సరణిఁ గాంచుచు విస్మ, యమునఁ దేలుచుఁ గుసు ♦ మాపచయము
చెలువొందువనములో ♦ నలరెడుతరులతల్, ఋతువును గ్రహియించు ♦ రూఢిమీఱఁ
బార్థతాపససత్ప్రి ♦ భావంబు గ్రహియించి, నవ్యపల్లవభరో ♦ న్నమితశిఖలఁ
దగునశోకంబు లివియెంత ♦ ధన్యలొక్కొ, సజ్జనులు సేవ జేసిన ♦ సద్గుణాతి
శయముగలుగును గాక సం ♦ శయమె యనుచుఁ, బరవశతనందిచూచుచుఁ ♦ దఱియనరిగి.

చ. యమనియమాదియోగకృశ ♦ తాత్మతనుండియు సుస్థిరాంగుఁడై
యమరున నేకసాధనస ♦ మగ్రతనొప్పి శమాగ్రతాగురు
త్వములఁ దలిర్చు మంత్రములు ♦ తత్తదుపక్రియ కొప్పమూఁడు వే
దములను నేర్చికూర్చినయ ♦ థర్వణవేదము లీలనొప్పుచున్. ౧౬౭.

సీ. నయనాభిరామమై ♦ నభమాక్రమించెడు, దీప్తిచే నొకసాను ♦ దేశమునను
నివసించియుండియు ♦ నెరయుతత్కూటంబు, లావరింపుచుఁ జంద్రుఁ ♦ డనఁగమించి
హవిరర్థియై వేది ♦ కాంతరంబున శిఖా, వళులచే నొప్పెడు ♦ వహ్ని పగిది
నమరాపగాతీర ♦ మందు జయముఁ గోరి, యరణితాయతసజ్జ ♦ టాంచితముగ
నాకృతికిఁ దగుయత్నంబు ♦ యత్నమునకుఁ, దగినక్రియయును దదనుగుణ ♦ మగుఫలంబు
ఫలమునకు యోగ్యమైనట్టి ♦ యలఘుతపము, తపమునకుఁ దగుసంపత్తి ♦ దనరుచుండు.

సీ. చిరకాలఘనతప ♦ స్స్థిరవృత్తి డస్సియుఁ, గులశైలనిభమైన ♦ బలిమి మీఱసి
యేకాంతమున నొక్కఁ ♦ డే కూరుచుండియుఁ, బరివారయుతుఁడైన ♦ పగిదిఁ దనరి
మునియయ్యు నసమభావ ♦ మున నమించి యెదిరికి, భయమొనర్చెడునట్టి ♦ ప్రభఁ దలిర్చి
[illegible] ♦ ద్రిపురఁ బోలెదక్షత్వ, మునమించు తేజంబు ♦ ననువెలుంగు

నర్జునిఁ జూచి యాత్మలో ♦ నమరతరుణు, లమరనీ తండు సేయుత ♦ పోధికార
విజయఫలయత్నమిది యెల్ల ♦ విఫలమయ్యె, నను చుఁ దలపోయుచును జేర ♦ నరిగి రపుడు.

ఆ. అల్పబలము గలుగు ♦ నాతపస్సులు సేయు, మునులు రక్కసులును ♦ మొనసినపుడె
మోసపుచ్చు మమ్ము ♦ వాసవుఁ డిటు బంపె, నధిక యత్నమిదియ ♦ టంచుఁ బోగడి.

ఆ. మోసపుత్తమనుచు ♦ మొనసియర్జునుఁ జూచి, నంతలో నెమ్మన ♦ ధాభివేశ
మడరి తామె మోహి ♦ తాత్మలై రానతుల్, జవ్వనులకుఁ జిత్త ♦ చలనమరుదె. ౧౭౨.

వ. అంత నా బృందారకసుందరులనిర్దేశంబున గంధర్వవరులు చెలంగి. ౧౭౩.

సీ. సరిగమపధనిస ♦ సనిధపమగరిస, రిగమపధనిసని ♦ రిగరిగమప
ధనిసనిధపమప ♦ ధనిధనిసనిధప, మపధనిసనిధప ♦ మధనియనుచు
సరిగమపదనిసా ♦ త్స్వరపఙ్క్తి యారోహ, ణావరోహణతను ♦ నాదినుండి
యొక్కొక్కసారికి ♦ నొక్కొక్క వర్ణంబు, విడుచుచు నీరీతి ♦ విశదముగను
దానమూర్ఛనమిశ్రవి ♦ స్తారతలును, గ్రామగరిమలు దీపింపఁ ♦ గాను జెలఁగి
వల్లకీముఖ్యఘనతంతు ♦ వాద్యఘోష, కనుగుణంబుగ రాగంబు ♦ లలరఁ బాడి.

సీ. తత్తరిదాగుకుదాం ♦ తరికిటిదాగుడుదాం, దొడుతకతకతక ♦ తొంధిమికిటి
ధిక్కతోంధిమిధిమి ♦ తక్కుఝుంతరికిణ్ణ, ధింధిమద్ధిమధిమ ♦ ద్ధేయటంచు
సరవి నేకోత్తర ♦ శతతాళగరిమయు, సూళాదిభేదవి ♦ స్ఫూర్తియుఁ దగఁ
బ్రస్తారతావ్యాప్తి ♦ పారీణతలు మీఱ, జక్కిణిప్రాబంధ ♦ సరణు లలర
మర్దళంబులు మ్రోయించి ♦ మఱియు వేణు, వాద్యవిద్యావిశేషంబు ♦ వఱలుచుండ
గానములు చేసి రపుడేక ♦ కాలమున నె, వెలసె బుతుషట్కసన్నిధి ♦ విరళగతిని.

వ. అంత వర్షర్తుప్రభావంబున. ౧౭౬.

తే. అంబరంబునఁ గనుపట్టె ♦ నంబుభరత, మెఱపుఁ దీఁగెలు విలసిల్లె ♦ మేఘసమితి [మె.
సురతకలహోపశమహేతు ♦ కరము గాఁగ, నుఱుములుఱుముచు దశదిశాం ♦ తరము లల

క. పలుచని మొగ్గలు జాతుల, వెలసెఁ దదారామవిపిన ♦ వీధుల నెల్లన్
జలవర్షము చిటిపాటిది ను, కులచే భూరేణువణఁచెఁ ♦ గోమలలీలన్. ౧౭౮.

క. కకుభసుమసౌరభాన్విత, కకుభాంతాయాతవాత ♦ గతమదనకృతో
త్సుకతాతిరేకసురమిత, ప్రకటతధృతి దఱిఁగె జీవ ♦ రాజి కివింతై. ౧౭౯.

తే. పాసఁగ జంబూఫలంబులు ♦ మెసఁగి క్రొవ్వి, చెలఁగి దుఃఖించువారల ♦ చిత్తమైన
సంతసము నొందఁ గోకిలల్ ♦ వింతవింత, రాగములు మీఱఁ బల్కె నా ♦ రజము గాఁగ.

చ. వికసితసత్కదంబసుమ ♦ వేల్లితవాసనమీఱఁ దెమ్మెరల్
ప్రకటముగాఁగఁ బల్కుమద ♦ బర్హిరవంబులఁ గూడిచిత్తము
న్నికటము చేసినన్ ధృతివి ♦ నిశ్చలబుద్ధి నెనిల్చెజిష్ణుఁడా
సుకరము లేతపోనియమ ♦ సుస్థిరచిత్తులభంగపెట్టుటల్. ౧౮౧.

వ. అంత వర్షాశరత్సమయాంతరంబున. ౧౮౨.

క. బిసవలయకుముదసుమవస, నసబాణప్రసవవిమల ♦ నళినత్సుకరో
ల్లసితశరత్సతిఘనసమ, యసువరుఁడటు చెట్టబట్టి ♦ నటువలెనలరెన్. ౧౮౩.

ఆ. మత్తబర్హిరవము ♦ మదమరాళధ్వని, తరుణకుముదవనక ♦ దంబతతులు
నొక్కటొకటిఁగూడి ♦ యుజ్జ్వలంబైపొల్చె, ఘనుల స్నేహమెందు ♦ గౌరవంబె.

చ. కెలనఁగదంబరేణుపరి ♦ కీర్ణతనొప్పెడు కేతకీసుమం
బులనిరసించిమానిమధు ♦ మోదిమధువ్రతరాజియాసవా
భిలషతనీలవృంతములఁ ♦ బేర్చినసర్జకసూనరాజిపై
మలినతమించప్రాలితమి ♦ మద్యముఁగ్రోలుచుఁగప్పెనెక్కలన్. ౧౮౪.

ఆ. సలిలశీకరయుత ♦ శాడ్వలస్థలులందు, నింద్రగోపకాంతి ♦ సాంద్రమగుచు
బంధుజీవకుసుమ ♦ భాసమగడుమించి, వికచకింశుకాభ ♦ వెలసెనపుడు. ౧౮౫.

వ. అంత శరత్సమయహేమంతాంతరంబున. ౧౮౬.

క. కించిత్కుసుమితకుందసు, మాంచితసౌరభ్యవాసి ♦ తాయతఫలినీ
సంచలితతుహినపవనస, మంచితహేమంతమలరె ♦ ననమయుగుణమై. ౧౮౭.

తే. వెలయులవలీలతానూన ♦ విలసనంబు, లోధ్రసురభితపవనంబు ♦ లోభపఱుప
వికృతినొందకయుండెన ♦ వ్విజయుఁడవని, నీతివిడుచునెవిజిగీషు ♦ నెమ్మనంబు.

వ. అంత హేమంతశిశిరాంతరంబున. ౧౯౦.

సీ. అతిసౌరభంబుగా ♦ నతిసౌరభంబులొ, కించుకించుకఁబూచి ♦ యింపుమీఱ
సింధువారములొక్క ♦ చెలువమబుదలుకొత్తఁ, గొంతకొంతచిగిర్చె ♦ కుసుమితముగఁ
బలుచనైపర్వుచుఁ ♦ బ్రాలేయబిందువుల్, తనుశీకరావృతాం ♦ తరతనలర
సరవిహేమంతావ ♦ సానమర్త్యోవసంత, సమయమన్యోన్యటంచుఁ ♦ జాటుకొనుచు
ఘెండుబుతువులధర్మముల్ ♦ నిండఁగలిగి, కడఁకమీఱంగవచ్చునం ♦ గజవజీర
మైత్రితాప్రాణకాశ ♦ న్మిత్రమగుచు, శిశిరఋతువు నొప్పెనంతయుఁ ♦ జెలువుమెఱసి.

వ. అంత శిశిరవసంతాంతరంబున. ౧౯౨.

చ. వనిచితలిర్చువృక్షముల ♦ నవ్యములైనవనంబులెక్కఁగా
మనమున వఁగోరిమాతనవ ♦ మానితపల్లవముష్టినూఁత గాఁ
దన సఖి వ్రాలెనూనిరణి ♦ తద్భ్రమరాంచితనూపురత్వమిం
పౌనరవసంతలక్ష్మిపద ♦ మూనె సరోజవనంబులందఁగన్. ౧౯౩.

సీ. ఉన్నిద్రకుసుమాఢ్య ♦ రోస్మితహాసియించు, తరుణిబోలెనుదమిఁ ♦ గురవకములఁ
జూచుచుఁగోమలా ♦ శోకపల్లవశయ్యఁ, బువ్వుటమ్ముధరించి ♦ పవ్వళించి
శృంగారవీరత్వ ♦ సంగతినలరెడు, మారుఁజూచినలీల ♦ సౌరసతులు
అమృతపల్లవపుష్పి ♦ తాశోకనునుజూచి, విరహాంబుమనముల ♦ నిరవుకొనఁగ
మతిదయునను ధ్యానతాయాత ♦ మలయపవన, చాలితోపేతనిజయూధ ♦ తాలికులము
సరసిజప్రాంతములనిండి ♦ సంచరింప, మొగము పైనొప్పుముంగుర్ల ♦ పగిదిఁదనరె.

మ. శ్వసనోచ్చాలితపల్లవప్రోష్ఠమధునం ♦ వాసప్రసూనాసవో
ల్లసితేర్ష్యాంధగుసాలలాలితలతా ♦ లావణ్యశోభాంగనన్
బ్రసభోల్లాసిగనీర్ష్యమాన్చిరమియిం ♦ పన్మోముఁజుంబించిన
ట్లెసఁగం గామధుపాళియుద్ధుగొనియె ♦ న్నింపొందునూనాస్యమున్. ౧౯౪.

ఆ. అపుడుపసుని గెల్వ ♦ నసమర్థమైయుండె. నెట్లటన్ననిర్జి ♦ తేంద్రియాత్వ
మాత్మరక్షిగాదె ♦ యఖిలచైత్రువసంత, మతని గెలువలేక ♦ వితథమయ్యె. ౧౯౫.

వ. అంత వసంతగ్రీష్మాంతరంబున. ౧౯౬.

సీ. వర్షాదిఋతువుల ♦ వలెమానిచేఁదిర, ప్రకృతిఁబొందితింక నే ♦ రీతిఁబుడమి
నాదరించెవరుని ♦ న్ననివసంతంబును, గేలిపెట్టిహసించు ♦ లీలమీఱ
వికసితమల్లికా ♦ విలసనంబునమించు, గ్రీష్మకాలమతని ♦ గెల్వదయ్యె
నధికంబునయ్యున ♦ న్యోన్యవైరముగల్గు, సైన్యంబుపరుగెల్వఁ ♦ జాలనట్లు
భువనముల నెల్లనవిరళ ♦ ముగను గెల్చు, ఋతువులాఱును నొక్కటై ♦ యతనిమనము
నొక్కక్షణమైనభ్రమపెట్టి ♦ యున్ముఖంబు, సేయఁగాలేకవితథంబు ♦ లాయెనపుడు.

సీ. శ్రవణసుఖంబుగా ♦ జంత్రగాత్రములొప్ప, గంధర్వవల్లకీ ♦ గానములును
లలితపల్లవసూన ♦ ఫలమనోహరచిహ్న, లమరెడుఋతుకాల ♦ సముదయములు
శైత్యమాంద్యవిచిత్ర ♦ సౌరభాకలితమై, విసరుమలయమరు ♦ ద్విసరములును
నింద్రసూతిభ్రమింప ♦ సాంద్రంబుగాఁజేయు, హరిభూరిమనోవి ♦ కారములును
విబుధయువతులఘనముల ♦ విస్తరించి, మన్మథావేశమడరించె ♦ మగుడవిరిగి [గాదె.
కినుకఁబరునొంపఁగాఁబ్రయో ♦ గించుఫోంతి, పరుఁడుదుర్దసైనముగుడితన్ ♦ జెఱచుఁ

వ. ఇట్లు సహాయప్రకటితచేష్ట విఫలం బగుటకు నెమ్మనంబుల నమ్మలికంబు గ్రమ్మిన, నా స్సారవారనారీపరివారంబు నిజప్రభావప్రకటనంబుగా హావభావాదిశృంగారచేష్టావిశేషంబులు నెరపం దలంచి తత్ప్రదేశంబున నతిసౌరభ్యంబునం బ్రకాశించు ఘనసార కదళికాగుళుచ్ఛచ్ఛదంబులను, గిరిమల్లికాదికుసుమనికరంబులం గనుంగొన నెఱుంగక లోచనకమలంబులు వికసితంబులుగా నతనిం దప్పక చూచుచుం, దదవయవ సౌందర్యాతిశయంబునకుం జక్షుఃప్రీతి జనించి నిజసౌందర్యాతిశయంబున నతని వశీకరింపం జేసెద మనుచు డాసి యతని యసమానసుందరత్వంబునం గందర్పోద్రేకంబు రెట్టించి మనస్సంగంబునం బొంది ప్రయోజనానుకూలంబగు ఫలంబు దురభిగమంబు గదా, కొన్నియెడల సంభవించు, నొక్కొక్కయెడల నసంభవం బగు, వేఱొక్కయెడల సానుకూలంబుగాక యన్యప్రకారంబుగాం బరిణమించునని వితర్కించి నృత్యంబు లాడం దలంచి మొదల నతనియందు సవిలాసంబుగా హత్తించిన దృష్టి ప్రస్తుతాభినేతవ్యవిలాసానుసారంబుగాం జేయ నెఱుంగక తత్తత్ప్రకారప్రచలితాంగుళీయకంబుగా హస్తవిన్యాసంబును సేయ నెఱుంగక, లాక్షారసస్ఫురితారుణితచరణతలంబులం గోకనదభ్రాంతిం బ్రసరించిన చంచరీకసంచయంబు నించుకయు వారింప నెఱుంగక, రంగస్థలంబున నాట్యముఖంబునం బుష్పాంజలు లొసంగిన కదంబ మృదుకేసరకుసుమవిసరోపరిన్యస్తంబులగు పదతలంబుల నలంకృతంబగు యావకరసంబు విరహతాపభరంబున ననురాగరసంబు గఱంగి వెలి కుఱికి మూర్తీభవించినచందంబునం దోంప, నర్తనపటిమ నెఱపుచు, శృంగారచేష్టావిశేషంబు లుప్పతిల్ల నతనిం బరివేష్టించి నిలిచి యొక్కమనోహరాంగి పరిజనంబులమాటునం దాంగి, యతిమనోహరంబులైన తద్గోపితప్రదీపితనిజాంగంబు లీషద్దర్శితంబులు గావింపుచుం, దదాయత్తంబగు చిత్తం బుత్తలంబగునట్లు మరుమాట లాడుచు, నొక్కజవ్వని పవనప్రేరితంబై కట్టినపురఃపటంబు దొలంగ నూరుమూలంబులు బయలుపడం జూచి సపత్నియు సహితంబును విస్మయంబునం బొందునట్లు సిగ్గున దిగ్గున మఱలం గప్పుచు, నొక్కయొసపరికుసుమచాపాభితాపంబునం జందనచర్చామచర్చికాపాండుగండస్థలంబుం బాణితలంబునం జేర్చి మధుమదరహితంబులయ్యును విరహవిధురంబులయిన లోచనంబులం దేలం జూచుచు, నొండొరుల దంతనఖక్షతతాడనపీడనచుంబనాదిసురతసంస్కారవిశేషంబు లుచ్చరింపుచుం, దదుద్దీపనహేతుకంబుగాం జేఁజఱచి సరసంబు లాడుచు, దరహాసంబులు దొలంక భ్రూసంజ్ఞలు నెఱపుచుం, గింశుకనఖక్షతాలంకృతంబులయిన స్తనాంతరప్రాంతంబులు భుజకీలిపమునందాక జాఱు పయ్యెదలు సవరింప మఱచిన ట్లురండి యొదిరిపడి యల్పవ

రించువిధంబునఁ గనత్కనకమణిమయకరవలయరవంబులు వెలయ సవరింపుచుఁ, జేరు ముక్కలు చక్కనలవరింపుచు, భ్రమరకంబు లమర దువ్వుచు, సుకుమార బాహుమూలంబులు గనంబడ వళిత్రయంబులు మెఱయ నాభీప్రదేశంబులు గనంబడ నిచ్చలంపుఁ గుచ్చెల కుచ్చులు పిచ్చలింప నద్దిగల యొడ్డాణంబుల నుదీనంబగు మెఱుంగుల మొగుపుల బిగి మానంబులు తగుపాటి కంకణఝణత్కారప్రకటనంబుగా సవరింపుచు, భ్రూసంజ్ఞావిలాసంబుల వెలయం జేసన్నలం బిలుచుచు, హాసవిలాసానుకారంబుగా స్మరశరాయమాణంబులగు కడకంటి యోరచూపులఁ గడుబిత్తరం బగునట్లుగా జంకించి చూచుచు, బింకంబులు మెఱయం జంకించి పలుకుచు, సురతబంధకళావిశేషవ్యాఖ్యానప్రకటనంబుగా శృంగారశాస్త్రప్రసంగంబు లాండోరులతోడం బ్రసంగింపుచు, మఱియు నానావిధంబుల బచ్చి మెఱయు ప్రేమానుబంధ మధురవాక్యంబులఁ దదాకర్ణనీయంబులగునట్లుగా సల్లాపించుచు, నెవ్విధంబునను నతని మోహపుట్టింపంజాలకున్నఁ దత్ప్రియసఖు లతనిం గనుంగొని. ౨౦౦.

మ. మునినాథోత్తమ నేఁడు మామగువని ♦ న్మోహించిరావే సఖీ
నినునేవేఁడెదఁ బ్రాణనాథునిటకున్ ♦ నెయ్యంబునం దేఁగదే
యనినన్నం బెనుమున్నెమానసముని ♦ న్నంటుంటభావంబునన్
గనదే మోమతివ్యర్థమం పెనసుమా ♦ కంజాక్షివల్పెట్టిదో. ౨౦౧.

చ. చిరముగ నాత్మయోజనము ♦ చేసినముచ్చటలెల్ల నాకుఁదా
నిరవుగఁజెప్పవచ్చిముఖ ♦ మెంతయుఁ శోషిలి మోహతాపసం
జ్వరమునమూర్ఛవోవసఖి ♦ జాలముచిత్తములందుకన్నులన్
నెరసెను శోకబాష్పములు ♦ నిర్దయనీమనసెంతగట్టిదో. ౨౦౨.

సీ. సురభికోమలపుష్ప ♦ పరికీర్ణమైయొప్పు, నించుశయ్యనుబవ్వ ♦ ళించదమాని
కిసలయవిసరసం ♦ కీర్ణమై చెలువొందు, భూశయ్యనొక్కింతఁ ♦ బొరలిరోసి
సుఖదమై చల్లనై ♦ శోభిల్లునీమృదు, లాంకసీమనునుండ ♦ ననవరతము
నిచ్చలోఁగోరుచు ♦ నెంతయుఁగృశియించు, ననఘాత్మనీకుఁగా ♦ ప్రాణములను
విడుచుముందుగానె ♦ వెలఁదుకయట్లైన, హత్యవచ్చునీకు ♦ ననఘనామ
మెట్లుచెల్లునవని ♦ నిపుడునీతపమును, విఘ్నమౌనటంచు ♦ వెఱవవలదు. ౨౦౩.

ఆ. తపములెంతఘనములై ♦ తర్వాతఁజేసికో, వచ్చుఁగానియిట్లు ♦ వలచివచ్చు
మోహనాంగివొరకఁ ♦ బోదుసూనాబుద్ధి, వినుము వెఱ్ఱిబుద్ధి ♦ విడిచియిపుడు.

ఆ. అనినఁబల్కకున్న ♦ నచ్చెలియోర్వక, కదసిపలికెనింత ♦ కఠినచిత్త
మేలవిడువుపల్క ♦ మిలతాపసులహృద, యములుఋభువిఁగృపాన్విత ♦ తములుగావె.

క. వలచినజవ్వనినిటువలెఁ, గలయకమఱియెవ్వఁడైనఁ ♦ గాదనఁబోనే
యిలలోఁపలదౌర్భాగ్యులు, నెలకొనిప్రాపించుఫలము ♦ నిరసింతురె కా. ౨౦౬.

చ. లలితవివర్తితత్రికవి ♦ లాసయుమీఁఱఁగనొక్కచేఁగురుల్
కలయఁగఁజక్కఁజేస్వుచును ♦ గాకనుమన్మథజైత్రబాణలీ
లలవిలసిల్లుచూపులవి ♦ లాసముగానవమోహనాంగిదా
తెలియఁగఁజూచెనర్జునునిఁ ♦ దేఁటమిటారియొకర్తెయొంగన్. ౨౦౭.

ఉ. పూఁచినమావికొమ్మయొక ♦ పొల్తుకకేలనునందిపట్టియా
రాచతపస్వికట్టెదుట ♦ రాజితలీలలనిక్కినిల్చెనా
రాచముఁగూర్చిపట్టివల ♦ రాయఁడుదాఁదెగనిండఁదీసిచే
యాఁచకవీడనిక్కెడుశ ♦ రాసనముంబలెగుబ్బలుబ్బఁగన్. ౨౦౮.

ఉ. నీవికవీడగుబ్బలఱ ♦ నిబ్బరముబ్బఁగఁగాల్లనందియల్
మ్రోవఁగవేణిమన్మథుని ♦ పుష్పకశాభతనాడనోర్తుదా
భావజుతేజరీతినసు ♦ పైనుఱుకన్ మొలనూలుజాఱిని
ల్పావడవీడభీతగతిఁ ♦ బట్టుకనిల్చెనుజక్కఁజేయుచున్. ౨౦౯.

సీ. ఓమునికులవర్య ♦ నీమదిఁగట్టిగా, శాంతినొందిననిట్లు ♦ చాపమేల
దొంగవువిషయాను ♦ సంగతుండవుగాని, ముక్తిపైనీకునా ♦ సక్తిలేదు
ఆత్మలోనీమనో ♦ హరరమైనకామిని, జేరియుండెవ్వరిఁ ♦ జేరనీమ
యేతదర్థముకాదె ♦ యీనీప్రయాసంబు, కావుననసుమది ♦ గణనసేయ
వనుచుఁగోపమడరి ♦ యధరంబుగంపింపఁ, జుఱుకుఁజూపుచూచి ♦ గురుమనోభి
మానములనుసిగ్గు ♦ మదిగణింపకకర్ణ, కువలయమునసేసెఁ ♦ గొమ్మయొకతె. ౨౧౦.

క. మఱియొకసతితనసకియన్, దఱియఁగవినయమునవచ్చి ♦ దరహాసాలం
కరితకపోలతనొక్కఁగ, మఱియుచునాకర్ణనయన ♦ ములఁజూచెఁదమిన్. ౨౧౧.

సీ. అంతనందఱుఁగూడి ♦ యతనిముందరనిల్చి, యత్యంతదీనత్వ ♦ మడరఁజేసి
సిగ్గులుజోనాడి ♦ చిత్తంబుగఱఁగంగ, జెల్మికిగామన ♦ సిచ్చివేఁడి
శృంగారములుమీఱ ♦ చేష్టలీగతిఁజేసి, కన్నీరుధారఁగంగ ♦ ఖిన్నలగుచుఁ
బ్రకట్టలెదయున్నంత ♦ వెక్కివెక్కేడ్చిరి, చేయునట్టిదిలేక ♦ చేష్టలుడిగి

# చతుర్థాశ్వాసము.



క. శ్రీకర భక్తచకోరసు, ధాకర దురితౌఘహరణ ♦ దానవవీరా
నీకతమిస్రదివాకర, నాకౌకసదివ్యరక్ష ♦ నరహర్యక్షా. ౧.

వ. అవధరింపు మివ్విధంబున నయ్యమరవారవధూయూధంబు గంధర్వవరులం గూడి నాకంబునకుం జని పాకశాసనుం బొడగాంచి తద్వృత్తాంతం బంతయు విన్నవించిన.

తే. అంత నైసర్గికంబును ♦ నతులధైర్య, సారమును నైనయాధనం ♦ జయుజితేంద్రి
యత్వమయ్యచ్చరలు దెల్ప ♦ నప్పుడింద్రుఁ, డర్జునాశ్రమభూమికి ♦ నరుగుదెంచి. ౩.

సీ. నరవెండ్రుకలు నిండ ♦ నెరయు కెంజడలతోఁ, శశికరవ్యాప్తమౌ ♦ సాంధ్యరాగ
మున మించు సాయాహ్న ♦ మును బోలి వంగుచు, ఫలితమై వ్రాలు ఱె ♦ ప్పలను గప్పి
పలితమౌ నేత్రాంత ♦ ములు నీరు గ్రమ్ముచుఁ, బ్రాలేయశీకర ♦ పతితమైనను
దళము లెల్లను వాడు ♦ జలజముల్ గలఁగిన, కమలాకరము లీలఁ ♦ గానఁబడును
నతికృశములైన వేనియు ♦ నవయనంబు, లధికభారంబులైనట్లు ♦ లౌధనికుఁడు
తనకు ననుకూలమౌ కళ ♦ త్రమును బోలె, నూఁతగా దండమొక్కటి ♦ చేతఁ బట్టి. ౪.

తే. గూఢరూపంబుఁ దాల్చియు ♦ రూఢదీప్తి, నభ్రసంఛన్నుఁడయినట్టి ♦ యర్కుపగిది
వృద్ధముని రూపధారియై ♦ విజయు నెదుట, ననుగుణంబుగఁ గనుపట్టె ♦ నమరవిభుఁడు.

తే. ఎదురుకొనె నర్జునుఁడు నెన ♦ రోదవనప్పు, డంతలోన నె సెనగొందు ♦ టవనిమీఁద
నెట్టుటన్ననుబంధుత్వ ♦ మెఱుఁగఁ డేని, మదినిఁ దద్వాసన స్నైన ♦ రౌదవుఁ గాదె. ౬.

తే. అంతనయ్యింద్రుఁ డతివిన ♦ యంబు మీఱ, నర్జునుఁడు సేయు నాతిథ్యే ♦ యార్చనములు
చిత్తముల రంగఁగొని సుఖా ♦ సీనుఁడగుచుఁ, గూడియూరసియతనిఁ జే ♦ ర్చానుచుఁ బలికె.

తే. ఇంతవృద్ధచిత్తుఁడవయినీ ♦ విట్టిపూర్వ, వయసునందు నెఘనతపో ♦ వర్తివైతి
వలరమావంటి బహువార్ధి ♦ కులముఁ గూడ, భ్రమను బొందుదు మల హృషీ ♦ కముల చేత.

క. శ్రేయస్కరగుణసంపద, నీయాకృతి యిపుడు గాంచె ♦ నిరుపమ సౌంద
ర్యాయతరమ్యత సులభమ, యీయధికగుణార్జనంబె ♦ యిలఁ దొడ్డగదా. ౯.

సీ. శారదనీరద ♦ చ్ఛాయలచందాన, జవ్వనము సిరులుఁ ♦ జంచలములు
తలపోయ విషయముల్ ♦ తత్కాలసుఖదముల్, కడపట సంతాప ♦ కరము లెన్న

సంతతాధివ్యాధి ♦ సంక్లేశమునఁ బొందు, ప్రాణికోటికి మృత్యు ♦ బాధ నిజము
సంసారమెల్లని ♦ స్సారమంచనుముని, ఘనుఁడు నీవలెను మో ♦ క్షమును గోరు
విపులమతి వంచు నీ విట్లు ♦ తపము సేయుఁ, బూనితిది నీకు శుభమైన ♦ బుద్ధి వొడమె
నింక నిశ్చయమిపుడు నీ ♦ యీ విరక్త, వేవ మొక్కటి సందేహ ♦ పెట్టు ననఘ. ౧౦.

వ. అది యెట్లంటేనిం జెప్పెద. ౧౧.

సీ. కదనోన్ముఖులిలఁ ♦ గవచ మేల ధరింప, మునులకు వల్కలా ♦ జినము లుండ
జంతుభీకరమైన ♦ చాపతూణీరముల్, ప్రాణికోటికి మృత్యు ♦ బాహులీలఁ
గడుభయంకరమైన ♦ ఖడ్గంబు లేల, గ్రహియింపనివియాత్మ ♦ రక్షకన్న
నెమ్మి ముక్తినిగోరు ♦ నిస్పృహులకు నాత్మ, రక్షయేటికి శత్రు ♦ శిక్షకొఱకు
కాక యున్నఁ గ్రోధ ♦ కారణంబగు నాయు, ధంబు లేడ శమద ♦ మంబు లేడ
ఇట్లు నాల్బులెల్ల ♦ నివి నీ మహింసాది, గుణగణంబులకును ♦ గొఱఁత సుమ్ము. ౧౨.

మ. ధరని శ్రేయము హేతు కాంచిత తపో ♦ దానాది సత్కర్మముల్
పరులం గ్రుంమటయే ఫలంబని మదిన్ ♦ భావించి తాఁ జేయువాఁ
డరయన్ మూఢుఁడు సూ పరిశ్రమహరం ♦ బాత్మ ప్రాణాన్నమా
సరిదంభంబులఁ బంకముం గలపుచు ♦ శ్చారిత్రు చందంబునన్. ౧౩.

వ. అదియునుం గాక యర్థకామంబులు ధర్మమోక్షంబులుం బోలెం బురుషార్థంబులు గావు. ఏతన్నిమిత్తంబు తపంబు చేసిన దోషం బేమని యంటివేనిం జెప్పెద. అర్థకామంబులు గోరువాఁడు హింసాదినీచకర్మంబులకుం జొచ్చుటకు వెఱవఁడు. గావున నర్థకామంబులం బోషింపరాదు. అవి మోక్షసాధనభూతం బైనతత్త్వజ్ఞానంబునకు విరోధంబులు కావునఁ బురుషార్థానర్థకంబులని యర్థకామంబులం బరిహరింపం దగుంగాని యితరంబు గాదు. అదియునుం గాక ధనశ్రీకాముం డైనవాఁడు సంపదర్థంబు లార్జించి తటినీసమాగమస్థానం బైన సముద్రంబు చందంబున నాపత్సంప్రాప్తపాత్రుం డగుంగాని వేఱొండు గాదు ఆ సంపదలును సాహసధైర్యాది సత్సాధన సహాయుం డగువానిచేత ననుగమింపం దలంచి యితరుల కలవి గాదు. ఐనను దత్సంపత్తులవలన సంరక్షణాది క్లేశంబును నన్యాహరణభయంబును సంభవించు ఆపదలవలన నిసర్గదుఃఖంబును నగుం గావునఁ దత్సంపత్సంబంధవస్తువంబు లాపత్కార్యంబులుం బోలె దుఃఖభాజనంబులు గాని తెల్వి యట్లు గావు. సంపదర్థంబు లనేకానర్థమూలకంబు, లదియునుం గాక దురాసదం బైన విశ్వాపజనులయెడం బుట్టిన వివాహంబునకు హానిం జేయు. అట్లు గాక ధనభోగంబులు నిజముష్టిగతం బైన యిహభోగంబు సంతుష్టిణేచ్ఛావిరహితుం డైనను

వానిచే చెఱుపంబడం బలాత్కారంబునం బడవేట్టునదియునుం గాక, సంపదలు నీచానీచ విశేషాంతరానభిజ్ఞంబులు కోరనివారి ననుకూలంబై యుండు. కోరినం జేకూడవు. అట్లైనను జనంబులు మూఢత్వంబునం గోరుదురు, ఇది దుర్వారస్వభావంబునం బ్రవర్తించు పురుషదోషంబుగాని సంపద్దోషంబు గాదు. అదియునుం గాక యవిపూజ్యులైన మహాత్ముల యందు వసియించియుండవు. దుఃఖంబులయం దనుగమించియుండు నట్లగుటం జేసి యతిచాంచల్యంబులైన తత్సంపదలే నిందితంబులగుం గాని యమ్మహాత్ముల కపవాదంబేమి! కావున నెల్లభంగుల నర్థకామంబులు పురుషార్థానర్థకంబులని పరిహరింపం దగుం గాని యాచరింపం దగదు. అట్లుగాక, శత్రుసంహారంబు సేసి పరధర్మం బధిక్షింపం దలంచెద నంటివేని యదియును బరపీడామూలకంబు గావున నయుక్తంబు. ఎట్లంటేని ననిష్టవస్తుసంయోగంబునకు దుఃఖంబువిధంబున నిష్టవస్తువియోగంబునకు నేతజ్జన్మంబునందునుం గృశియించి యనాగతజన్మంబులయందును దుఃఖింపంబడు ప్రియజనసమాగమంబున స్వజనుండును, బూర్ణత్వంబునం బొందుం గావునఁ బ్రియసమాగమం బఖిలావస్థలయందును సుఖకరంబు. అట్లు గావునఁ బ్రియవియోగంబగు నెట్టి మనోహరం బైనపదార్థంబును, నత్యంతహేయంబై యుండు. ప్రియంబులైన ప్రాణంబులు సహితంబును శల్యంబులవిధంబున నసహ్యంబులగు. బంధుసహితుండగువాఁడును నేకాకియైనట్లుండును. అట్లుం గాక హితోపేతత్వంబునకుం బరితోషత్వంబునుం దదపేతత్వంబునకుం బరితప్తత్వంబునుం బొందు. అట్లు గావున "ఆత్మవత్సర్వభూతాని" యను న్యాయంబున నీ యాత్మకుం బీడం బొందుట హితంబై యుండునేని నీవునుం బరులం బీడింపుట కుద్యోగింపుము. అదియునుం గాక, సంపదలుం బోలె శరీరంబు లస్థిరంబులని విచారించి వివేకించి నీవును న్యాయానుకూలంబుగాఁ బ్రవర్తింపుము. సానుకర్మంబును బాధింపక వర్తింపుము. సాధువులైన పెద్దలు న్యాయమాధారులు గారె? అట్లు గావున నెన్నివిధంబుల నీవును రణోత్సాహంబు విడిచి శాంతుండవై జన్మసోత్సేసంబగునట్లుగాఁ దపంబుఁ గావింపుము. నిశ్శ్రేయసంబైన మోక్షంబు సాధింపుము. అట్లుం గాక, విజయకండూతిని వారింప నలవిగా దంటివేని దుర్జయంబులై యంతశ్శత్రువులైన పంచేంద్రియంబులం జయించిన నెల్లలోకంబులు జయించినట్లు. జితేంద్రియుండైనవానికి విజయంబు సులభంబు. అట్లుం గాక యింద్రియనిగ్రహంబు లేనివాఁడు స్వార్థసాధకంబునకుఁ బరాధీనుండై నీచకర్మంబుల నోర్చి లజ్జావిహీనుండై యనడ్వాహంబునుంబోలెం బరవిధేయత్వంబునం బొందుం గావునం గామాదివిషయంబులు సద్యస్థాలానుభవంబు లుత్తరకాలస్మరణీయంబులు. అవి స్వప్నసమానంబులుగాని నిత్యంబులు గావు. అదియునుం

గాక, యత్యంతకుత్సనీయంబులై యున్నట్టుండియు విప్రియజనకంబులై పొల్చు పురుషుని విడిచి పోవు మనతెంపు విడువలే కుండునట్లుగా మోహప్రవర్తింపు. అతికుత్సితాంతశ్శత్రువు లివ్విషయంబులం బరిహరించి యత్యంతవివిక్తంబైన యీ గంగాతీరంబునం దతిపవిత్రంబైన యీ యింద్రకీలశైలంబున నిరాయుధుండవై తపంబు గావింపు మని పల్కిన నా సునాసీరుపలుకుల కలరి యా సౌనాసీరి మృదుమధురగంభీరభాషణంబుల నిట్లనియె. ౧౪.

సీ. అవఘలోకప్రపి ♦ ధ్యానంబులైనట్లు, తగరిసమానసం ♦ దర్శమగుచు
నర్థగుంభనము శ ♦ బ్దాడంబరముగల్గి, గతదోషమగుచు నా ♦ కాంక్షనలరి
గురుతరోక్తులమించి ♦ బహుసన్నధ్యాహార, దోషరాహిత్యమై ♦ శ్లేషితార్థ
తను బొందక ఖిలార్థ ♦ తత్త్వబోధకమునై, నిరుపమనీతివి ♦ స్తరత నలరి
సరవి వాదించు ప్రతివాది ♦ జనులచేత, నధరితమొనర్పంపనింతైన ♦ నలవిగాక
శాస్త్రములమించియాగమా ♦ సక్తిలేక, వేదవాక్యోపమంబులై ♦ వెలయుచుండ.

సీ. మతియు న న్యాయలంఘ్య ♦ మహనీయయుక్తిచే, నలరి యగ్రామ్యయు ♦ క్తులకుమిగుల
నంభోధిపరిగభీ ♦ రార్థయుల్ వెలయంగ, నతులమౌవాక్యవ ♦ ద్ధతులు దనర
నధికార్థసంపద ♦ నణిమాదిసిద్ధులఁ, దనరెడుమానిచి ♦ త్రంబువ్రాలె
ధ్వనులశబ్దశ్లేష ♦ వరవిపుతోల్లేఖ, సహితసమాసోక్తి ♦ సమయములను
సకలగుణములు వెలయఁగాఁ ♦ జనువు దెలిసి, పలుక మీవంటి పెద్దల ♦ కలవిగాక
యితరసామాన్యజనులకు ♦ నెట్టులలవి, నైన నాబుద్ధిఁ దెలియక ♦ నంటివనఘ. ౧౬.

క. గురునంతవానికైనను, వెరవెఱుఁగక పల్కుపల్కు ♦ విఫలంబౌనీ
తిరహితుమద్యోగము బలె, బహునిమనం బెఱిఁగి పలుక ♦ వలెనటు గానన్. ౧౭.

క. విను సద్గురూపదేశం, బనఘా మతిచెట్లు విఫల ♦ మౌనని యున్నన్
వినుమూసరభూమినిడి, త్తినఘన బీజంబులైన ♦ దీల్పడుఁగా వే. ౧౮.

క. నీపలుకతి శుభమగు నే, నే పాత్రుఁడఁ గాకపోతి ♦ నిరధికరణతన్
దీపితతారానభమున, కేపారఁగ రాత్రి గాని ♦ యితరంబగునే. ౧౯.

ఉ. క్షత్త్రియజాతుఁడన్వినుత ♦ సత్త్వుఁడఁ బాండుకుమారుఁడన్ బృథా
పుత్త్రుఁడభీరుతమ్ముఁడను ♦ బుద్ధిధనంజయుఁడన్ దలంపని
శ్శత్రుఁడు మాను కాగ్రజుఁడు ♦ శత్రులు తన్నిల వెల్వరించినన్
ధాత్రిఁ దొలంగివచ్చినను ♦ దజ్జయశీలతఁ బం పెనన్నిటన్. ౨౦.

పస్గురుగర్వమోర్వసుల ♦ భంబది వేఱొకవేళ నైననీ
సద్గుణ నాదినింద్యతయె ♦ చాలఘనంబుగ దాతలంపఁగన్. 30.

ఆ. అహులఁ ద్రుంపనృపుల ♦ కపవాదముగునెట్లు, మిగులయశమె కాక ♦ జగతిలోన
ననుమఁదలఁచెదేని ♦ ననఘాత్మ వినిపింతు, మునివరేణ్య తెలియ ♦ వినుము తగను.

క. ఇలలోనఁదలఁపజలధుల, జలములు సుస్థిరములమాన ♦ సంబులుమర్యా
దలుదప్ప వెఱచి కావే, కలఁచఁబడియు స్వచ్ఛముగుచుఁ ♦ గన్పడు ననఘా. 3౨.

ఆ. ఇకిలన్నృపులలోన ♦ జాతశత్రుండన, వెలుఁగు ధర్మజునకు ♦ స్వజనవైర
మెట్లు వంఘటిల్లె ♦ నిటువలెనన్నను, వినుము తెలుపువాఁడ ♦ విశదముగను. 33.

క. ఆతతధృతరాష్ట్రతనూ, జాతులతో నేము సేయు ♦ సౌహార్ద్రమెయీ
రీతిని వైరమునకుఁదా, హేతుకమైపగను బెనిచె ♦ నెంతయుఁగినుకన్. 3౪.

క. ఆనముసౌహార్ద్రముమఱి, వైరమునకు హేతువనిన ♦ వ్యాఖ్యానమునుచున్
మీరలుమదిశంకించిన, సారమతిం దెలియ వినుఁడు ♦ జగతిఁదెలంపన్. 3౫.

క. అరయఁగదుర్జనసంగతి, నెఱివిడిపడు నేటియొడ్డు ♦ నీడలుసుమహా
హారమె చేరినఁబైఁబడి, చెఱచినక్రియ మైత్రినుండి ♦ చెఱచు నెకాదే. 3౬.

క. వారలన్యాత్తము మొదట నె, సారమతిం దెలియు కెట్లు ♦ సాంగత్యంబున్
మీరలు చేసితిరన్నను, దారగుణా తెలియవినుము ♦ ధారుణిలోనన్. 3౭.

ఆ. నిందలకును వెఱక ♦ నిగ్రహానుగ్రహ, ములను సామ్యవృత్తి ♦ మెలఁగునట్టి
దుష్టవర్తనంబు ♦ దుర్విభావము గాదె, దైవగతియుఁ బోలెఁ ♦ దలఁచి చూడ. 3౮.

క. మీరిట్లభిమానులు వా, రారీతింబరిభవింప ♦ నసమర్థులయి
ట్లేరీతి నోర్చియుంటిరి, యూరకయుని యుంటివేని ♦ యనువినుమనఘా. 3౯.

చ. అహులు తిరస్కరించుటను ♦ నప్పుడె నాహృదయంబు నష్టమై
యరిమురిఁబోనెపోవునపు ♦ డాచనురోషము తత్ప్రతిక్రియా
కరణకరావలంబనము ♦ గ్రక్కుననిచ్చుచు నట్లుగాననా
వెరపువనిల్చెఁగానిమఱి ♦ వేఱొకమైనను నిల్చియుండునే. ౪0.

సీ. పరిపంథులకునోడి ♦ పరిభవంబును బొంది, హరిణాదిమృగసము ♦ త్కరముకరణి
వన్యఫలాహార ♦ వర్తనంబున డస్సి, యనోన్యముననేము ♦ నైదుగురము
లజ్జించి యత్యంత ♦ లాఘవంబుననుంటి, మటుమున్నె సహగరు ♦ లనఁగ నేల
నైననీకొకనికి ♦ నభిమానమేమని, యనియెదవేనిమ ♦ హాత్మ వినుము

కడఁగియుగుమనీచేతనీ ♦ కార్యమనుచు, వ్యాసమునిసల్కు నిచటికి ♦ వచ్చియిట్లు
శత్రుజయ మొందమదినిని ♦ శ్చయము చేసి, యింటినీరీతిఁ దపియించు ♦ చున్నవాఁడ.

గీ. అరయదుఃఖైకభాజనం ♦ బాత్మశత్రు, వైరియభిమానమదివిడు ♦ మనెదవేని
శక్తివికలతలఘుఁడని ♦ స్సారుఁడైన, మానహీనుండు తృణముస ♦ మంబుగాదె. ౪౨.

వ. అదియునుంగాక యభిమానంబు విడిచిన దోషం బేమని యంటివేనియు మహీధరసంబంధంబులైన తటశృంగాదికంబుల యౌన్నత్యంబు విచారించిన నౌన్నత్యాభిమానంబు ప్రియంబు గాకుండు టెట్లు? అభిమానవంతుండయి యశస్కరుండైనవాఁడు పురుషుండని యెన్నంబడుంగాని యితరంబు గాదు. అట్టివాని పేరు పురుషగణనాప్రస్తావంబున మొదట నెన్నంబడి ద్వితీయసంఖ్యం జెందదు. అదియునుంగాక దురాసదంబులైన వనంబులచేతం బరివేష్టింపఁబడియున్న పర్వతంబు నైనను నధిగమింపనెంచుంగాని మహాజస్కుండై ప్రతాపాభిమానోన్నతుండైన పురుషుని నతిక్రమింప శక్యంబు గాదు. అట్టివాఁడు స్వాభిమానంబుచేతనే నిజవంశజాతులకు రఘుదిలీపాదులుం బోలెఁ బ్రసిద్ధి సంపాదించునట్టి పురుషుల ధరియించుటం జేసి యివ్వసుంధరయు నన్వర్థనామంబునం బ్రశంసింపంబడు. అట్టివాని కీర్తియు శశాంకమండలంబుం గళంకత్వంబునం బొందించు నట్టి యశంబును నభిమానవంతునకుంగాని సంభవించ నేరదు. అదియునుంగాక, యెవ్వని కోపంబు కృశానుసన్నిభంబై శత్రులం గీఁటణంగించు నట్టిపురుషుండు రఘురామాదులుం బోలె విజయాశీర్వాదంబులం బొందనగ్గుం డట్లు గావున నెల్లభంగుల నభిమానంబు విడుచుట యుక్తంబు గాదు. అదియునుంగాక, విజయాభిమానంబున నఖిల భూతాభిద్రోహంబునకుఁ జొచ్చుట యుక్తంబే యని యంటివేనియు, నే నిప్పుడు తరంగిణీ భుజంగతరంగచంచలంబగు సుఖంబునుం గోరుట లేదు. త్రికాలనిత్యంబై నిర్బాధకంబైన బ్రహ్మపదంబును వాంఛించుట లేదు. ఇం కేమని యంటివేనియుఁ గపటంబున శత్రుకృతంబైన యపకీర్తిపంకంబు వైధవ్యంబునం దపించు నరాతివనితాజన లోచన వినిస్సృతంబులైన జలంబులఁ బ్రక్షాళనంబు సేయం దలంచి యున్నవాఁడ మఱియును. ౪౩.

మ. ననుఁగాదని యుఁబండితుల్ సభలలో ♦ నన్నవ్వి నన్నవ్వని
మ్మనఘా నాదగుబుద్ధి యెల్లవికలం ♦ బౌనే నిఁగాని మ్మునీ
పునఁ నీమార్గనకేల తెల్పితి వృథా ♦ యోగ్యుండు గాఁడంచుఁ జిం
తనులజ్జన్వహింబొంచెదేని వినుమీ ♦ ధనాఖ్యాత్మ నే నెంతయుఁ ౯. ౪౪.

ఆ. అరులనెల్లఁద్రుంచి ♦ యన్యాయవృత్తిని, నుద్ధరింపకాత్మ ♦ నొందుదలఁప
మోక్షమైనవిజయ ♦ మునకంతరాయంబ, టంచుఁదలఁతుఁగాని ♦ యనఘవినుము.

మ. అరయంగానిదిపోదురాగ్రహమటం ♦ చంచేని నేవీరుఁడి
ద్ధరలోశత్రులుపుచ్చుకొన్నయాశముం ♦ దానెంతకాలంబుపే
శరజాలంబులయేపుసూపిమగుడన్ ♦ సాధింపఁడందాకనా
నరుఁడేపుట్టుటకల్లపుట్టెననుకో ♦ న్నంజచ్చువాఁడట్లుకా
కిరవైనిల్చినఁబూరితోసమమువాఁ ♦ డేభంగిపూర్ణాఖ్యుఁడో. ౪౬.

ఆ. వీరధర్మవృత్తి ♦ విడిచినదోషమే, మన్న నెవరికోప ♦ మరులఁద్రెంప
కుపశమించునతని ♦ కూరకేపురుషోక్తి, చెల్లుటెట్లునీవె ♦ చెప్పుమనఘ. ౪౭.

ఆ. పురుషశబ్దమునకె ♦ పుంవ్యక్తిమఱిలేదె, యానిజజాతిమాత్ర ♦ మైనపురుష
శబ్దమునను నేమి ♦ చాలించుపశ్వాది, జంతువులనుబురుష ♦ జాతిలేదె. ౪౮.

క. కావునఁబురుషార్థముమఱి, భావింపఁగలేనివాని ♦ బ్రతుకేటికివాఁ
డావలనేటికిఁగొఱమఱి, భూవినుతా తెలియవినుము ♦ పురుషునివిధమున్. ౪౯.

మ. తనరంగాసభసద్గుణాఢ్యుఁడనిపె ♦ ద్దల్ పక్షపాతంబునన్
గొనియాడన్వినువారితేజముదలం ♦ గన్ సామ్యహీనంబుచే
ననఘాత్మామఱివాఁడెపూరుషుఁడుప్ర ♦ ఖ్యాతుండునున్ వానిపే
రనయంబున్వినిశత్రువైననుబ్రమో ♦ దాశ్చర్యతందేలెడున్. ౫౦.

ఆ. అయిననీకొకనికి ♦ యభినివేశంబేమి, భీముఁడాదియైన ♦ పెద్దలుండ
ననుచుఁదలఁచెదేని ♦ యదియునువినిపింతు, ధన్యచరితవినుము ♦ తథ్యముగను. ౫౧.

చ. తలఁచుప్రతిజ్ఞకుండగఁగఁ ♦ దద్రిపులన్ రణరంగభూమిఁదా
గెలువఁగనెంచిధర్మజుఁడో ♦ కింముకకూరిమిఁగార్యమంతకుం
దలముగనన్నుమోపినక ♦ తంబుననెంతయుఁదృష్ణనొందువాఁ
డిలకుజలాంజలిందలఁచి ♦ నట్లుదలంచునుగానఁబూనితిన్. ౫౨.

ఆ. ఏడధర్మతనయుఁ ♦ డీకష్టమేటికి, నీస్వకార్యమిపుడు ♦ నిర్వహించు
కొనుటయుక్తమనుచు ♦ ననెదేనివినవయ్య, తాపసేంద్రసావ ♦ ధానముగను. ౫౩.

క. ధరనెవఁడాపదవేళల, నరయకతనరాజునాజ్ఞ ♦ వ్యర్థము సేయున్
మఱివాఁడేకులఘాతకుఁ, డరయవిమలశశికళంక ♦ మట్లుతలంపన్. ౫౪.

వ. అదియునుంగాక రణోత్సాహంబు విడిచి శాంతుండవై యతివిగమ్మని యంటి విది
ధర్మవిరోధం బెట్లంటివేని మొదల బ్రహ్మచర్యాశ్రమంబును దదనంతరంబున గృహ

స్థాశ్రమంబు నంత వానప్రస్థవృత్తియుం నటమీఁదట యత్యాశ్రమంబునుం దగు నని శ్రుత్యనుసారంబుగా మన్వాదులైన పెద్దలచేత విధింపంబడియుండు. అట్లాశ్రమానుసారంబుగా నడుచుట యుక్తం బనియును దద్వ్యతిరిక్తాచరణం బయుక్తం బనియును, పండితులవలన వినంబడు. కావున నీవు గృహస్థుఁడ వై యుండియు, మునిత్వంబు ధర్మవిరోధం బనెద వంటివేనియు గృహస్థుఁడ నయ్యును, తత్కర్తవ్యంబులైన కృత్యంబు లాచరించి కృతకృత్యుండ నైనవాఁడం గాను. కావున మునిత్వంబు ధర్మవిరోధంబుగాదు. అదియునుం గాక నీతిగరిష్ఠనిష్ఠావిశిష్టుండును, శిష్టాచార్యుండును మదగ్రజుండును నైన యుధిష్ఠిరుం డుండ నాకు నాశ్రమాంతర స్వీకారంబునకు స్వాతంత్ర్యంబులేదు. ఇప్పు డవశ్యకర్తవ్యంబుగా మోచియున్న వైరనిర్యాతనభారంబును దూరంబై యున్నయది. మజ్జననియు నట్లనె దూరంబున నున్నయది. తదనుజ్ఞ వడయక తపస్యాచరణంబున కధికారంబు లేదు. క్షత్రధర్మంబు విడిచి రాజు లాజులం బలాయమానం బగుదురె! ఇంతకంటెను ధర్మవిరోధం బొం డెద్ది? పలుమాటలేల? నా నిశ్చయంబు వినుము. మరుద్వచ్ఛిన్నాభ్రంబునుం బోలె నేత ద్గిరిశృంగంబునం గృశియించితినైనను, దపంబున సహస్రాక్షు మెప్పించితినైనను నీ యపకీర్తి యనెడుహృదయశల్యం బుద్ధరింపం దలంచియున్నవాఁడ. నీ వింక నితరశంకలు చాలింపుము. ౫౫.

క. ఈసరణిఁ బల్కునర్జును, వాసవుఁడలదివ్యమూర్తి ♦ వహియింపుచు న
త్యాసక్తినిఁ దనకౌఁగిట, భాసురముగ బిగియఁ జేర్చి ♦ పలికెం బ్రీతిన్. ౫౬.

క. అనఘాత్మభూతికోఱకై, ఘనునిభవోద్భవునిశివుని ♦ గాంక్షించితపం
బొనరింపుము నీవనుచును, దనరఁగనుపదేశమిచ్చె ♦ దయపైవారన్. ౫౭.

వ. అంత. ౫౮.

చ. శివుఁడుప్రసన్నుఁడైనఫల ♦ సిద్ధినిబొందుచుశత్రునాశనం
బవిరళలీలఁ జేసివిజ ♦ యావహలక్ష్మినిబొందిలోకముం
దవిహతమైనతేజమున ♦ నప్రతివారితశౌర్యధుర్యతన్
బ్రవిమలలీలనొందుమని ♦ పల్కితిరోహితుఁడయ్యెనింద్రుఁడున్. ౫౯.

ఉ. అంతటనింద్రుఁ గాంచిరుచి ♦ రాననుఁడైతగునర్జునుండు దా
నెంతయునింద్రవాక్యగతి ♦ నీశ్వరుఁ గూర్చిపరిశ్రమంబులే
కాంతరశుద్ధిమీఱనియ ♦ తాత్మతనొప్పఁగశాస్త్రపద్ధతిన్
సంతతమున్ దపంబులను ♦ సల్పఁగసాగెనుయోగమార్గుఁడై. ౬౦.

క. గవికాగురునిల్చిసుస్థితి, భువినొకపాదంబునిల్పి ♦ బుద్ధిస్థిరతన్
దవిలినిరాహారతబహు, దివసంబులుతపముసేసె ♦ ధృతవిజయుండై. ౬౧.

క. నరుఁడిట్లుశరీరేంద్రియ, పరితాపకనిరశనాది ♦ వ్రతములడయ్యన్
గిరిపోలదృఢతవెలసెను, ధరఁబెద్దలధైర్యములవి ♦ తర్క్యంబులుగా. ౬౨.

మ. పరిపక్వంబుగఁబండిసౌరభముచే ♦ భాసిల్లికైవ్రాలిద
గ్గరనేవ్రేలుఫలంబులందుమలస ♦ త్కేదారశైత్యంబుతో
పరిశుద్ధాంబువులందువాంఛయిడదద ♦ ప్పార్థాత్మదానెట్టిదో
నరధన్యాత్ములకున్సుధారసముగా ♦ దానత్తపంబెన్నఁగన్. ౬౩.

మ. తనరంజేసితినిట్టిఘోరతపమున్ ♦ దానంచులెక్కింపఁడే
కననైతిన్ఫలమింతకైననుచున్ ♦ గర్హింపఁడున్బేలవం
బునఁబొందంగరజస్తమంబులునువి ♦ స్ఫూర్తిన్విడంబించునా
ఘనసత్త్వంబునుమించకుండెనిలన ♦ త్కార్యుండుధీరుండుగా. ౬౪.

తే. వెండియాతఁడునిసివేళ ♦ మండువహ్ని, పగిదినొప్పుచునుజ్జ్వల ♦ ప్రభలునిగుడ
మించికనుపట్టెవార్ధిగం ♦ భీరగుణత, నతిశయించుమభూధరో ♦ న్నతిఁదనర్చి.

మ. అరుదారంగరహస్యవృత్తిఁదగజ ♦ ప్యంబైనమంత్రంబుభా
సురలీలంబఠియించుచుండరదన ♦ స్తోమాంశుసంకీర్ణమై
నరువక్త్రంబురుకాంతిమీఱుచునదె ♦ న్నంబొల్చెనవ్వేళఁదాఁ
బరివేషావృతభీషణార్కఘనబిం ♦ బంబట్లుతేజోగ్రమై. ౬౬.

చ. వెలయఁగజోడుఁబాల్చియుప ♦ వీతపదంబునసజ్యకార్ముకం
బలరఁదగిల్చినిల్చునల ♦ యజ్ఞుఁడొప్పెనునింద్రచాపశోం
తులఁతనచుట్టుఁబర్వఁగను ♦ తుల్లనికాననవేష్టితంబునై
పొలుచుమహీధరాధిపుని ♦ పొందికసత్తతినందమైతగన్. ౬౭.

మ. సతతస్నానములాదియైనసకలా ♦ చారంబులందీర్పఁగా
నతికార్శ్యండతఁడేగుమండఁగనతి ♦ స్వల్పత్వముంబొందిన
ట్లుతుషారాద్రియుభూమిలోనపుడుతో ♦ డ్తోఁజొచ్చినట్లుండెని
ట్లతికార్శ్యంబుగురుత్వమున్వెలయుటె ♦ ట్లంచున్మదింపోఁచినన్. ౬౮.

క. ధరలోనంతస్సారము, గురుతందగఁజేయుఁగాదె ♦ గురుకాయాదుల్
అరయఁగగురుతనుబొందవు, మురువుప్పిగఁబసిఁడిదూది ♦ ముద్దలువోలెన్. ౬౯.

చ. అరుగుగనూర్ధ్వబాహుతను ♦ నర్జునుఁడొప్పఁగఁ బచ్చిరంబునన్
నెరయుచు భూనభోంతరము ♦ నిండీదురానదమైన తేజమా
సురమునియుత్కృత్యశశి ♦ సూర్యులు బెగ్గిలదేవమార్గముల్
వసనమునద్దకట్టినని ♦ వారితశోభదలిర్పనత్తతిన్. ౨౦.

ఉ. అన్నరు మేనఁబుట్టినమ ♦ హాత్తరతేజము చేతఁగాంతిసం
భిన్నతనొందియుంతరవి ♦ బింబము లజ్జతనొందినట్లుదా
మిన్నునుమంచునిండుటయు ♦ మేఘనిరోధమునిట్టిదోషముల్
ఎన్నఁగలేకయుండియుర ♦ హింపకయుండెను గాంతిహీనమై. ౨౧.

చ. అలరుసముద్గతారుణజ ♦ టాంశువులొప్పఁగ సజ్యకార్ముకం
బలవడఁబూనినిల్చినల ♦ యర్జునుఁడంతటఁజూడనొప్పెఁదా
నలత్రిపురంబులం గెలువ ♦ నాత్తఁదలంచుచునుద్యతోద్ధతిం
బొలుచు లలాటలోచనము ♦ పుట్టనిరుద్రుఁడొయంచుఁజూడఁగన్. ౨౨.

మ. అమరేంద్రుండొమహోగ్రపావకుఁడొతి ♦ గ్మాంశుండొయీరీతిఘో
రముగాఁగందపమాచరించునితఁడొ ♦ రామస్త్యఁడాగాఁడటం
చుమదిన్మౌనివరేణ్యులెల్లఁదమలోఁ ♦ జోద్యంబునంబొందఁగా
నమరంజేసెనునర్జునుండుతపమి ♦ ట్లత్యంతరౌద్రంబుగాన్. ౨౩.

చ. అరుదుగనిట్లుపొల్చినల ♦ యర్జునుతేజముకాననంబులన్
దరికొనికాల్పనగ్నిగతిఁ ♦ దప్పకయట్లెచలంబునందివా
కరుఁడునుబోలెశోషిలఁగఁ ♦ గ్రాఁపదుతాపససిద్ధకోటికిన్
గరము సహింపరాకయధి ♦ కప్రభమించెనలౌకికంబుగన్. ౨౪.

ఆ. అంతశరణుగాన ♦ కందఱుదుర్నీతి, హరలనత్స్వభావు ♦ లతులనియతు
లలఘుశబ్దసమితి ♦ యులప్రమాణముఁబోలె, హరునిశరణుబొంది ♦ రమరమునులు.

ఆ. అపుడుసురలుమునులు ♦ నధికతేజంబున, బలిమిసూర్యదీప్తిఁ ♦ బరిభవించు
హరునిఁగాంచిచూడ్కు ♦ లాతేజమునమిఱు, మిట్లుగొనఁగభయమ ♦ మేతులగుచు.

వ. అంత భూతభవిష్యద్వర్తమానాధీశ్వరుండైన యీశ్వరుండు ప్రత్యక్షం బగునట్లుగా
స్తోత్రంబులు చేసి యిట్లు పూర్వోక్తంబైన యమ్మహాతేజంబునందు నేత్రత్రయంబు
విలసిల్ల సపారభార్గ్రిచందనంబై యత్యంతసుఖావహంబై యొప్పు నచలరాజకుమారికా
కుచమండలంబునుంబోలెఁ బ్రకాశించువిశాలవృషభేంద్రాంసకూటంబు నిజహస్తావల
నంబు గావించి యత్యున్నతంబైన తుషారకుధరకూటంబున నధిష్ఠించియు భువనా

తీతంబైన తేజంబునం బ్రకాశించుచు, నభ్రమార్గసంవ్యాపకంబైన సజలాభ్రంబునుం బోలె విశ్వవ్యాపకత్వంబున నుద్దీపించుచు, జానుమధ్యావలగ్నంబైన మహోరగంబు చేతం బరివేష్టింపంబడి యువశుక్తికాననంబునం బ్రకాశించుచు, సూర్యతేజంబునకుం బర్యంతభూతంబైన లోకాలోకాచలపరివేష్టితంబై పొల్చు నిఖిలలోకంబునుంబోలె హిమానీవిశదంబై యజ్ఞోపవీతసూత్రత్వంబునుం బొందియున్న శేషాంశునికరంబు నిజప్రభావిశేషంబున నైల్యత్వంబునం బొందుచు, నీలకంధరంబు దీపింప జాతికుసుమంబులచందంబున నందంబైన కపాలమాలికాసంకీలితంబైన శిశిరోరుహనివహంబు చేతం బ్రదీపించుచు, లోకంబులం బ్రవహించి, చిక్కనకుముదసుమసముదయసంకీర్ణంబైన సురసరిత్ప్రయోవశేషరేఖానుకారం బగు చంద్రరేఖం బ్రదీపించుచు, కరకంకణాయమాన భోగిభోగోపరిన్యస్తప్రశస్తవిస్తారిత నిస్తుల మాణిక్య మయూఖంబులు వృషభేకకుథాస్తరణంబునకు గుణోత్కర్షంబు పెనుప, కనత్కనక మణిమయభుజావిభూషితభూషణమణిగణఘృణిజాలంబు లుభయపార్శ్వమహీధరకూటతటప్రవిసారితజలధరపటలంబునకు సాంద్రేంద్రచాపకాంతిం బ్రకటింపఁ బదకటకనైగనగ్యంబు లిరువంకలం బర్వచుఁ వృషభాస్తరణరత్నకిరణవిస్ఫురణానుకారంబులై వెలుంగ, గండమండలసముస్కండనాయమాన కుండలితకుండలిశిరోమండితతాండవితరత్నకాంతిమండలచాకచక్యంబు లుభయపార్శ్వంబులం బట్టిన ఛత్రచామరాలవట్టధ్వజవ్రజంబులకుం జిత్రత్వంబు సంపాదింప ననర్ఘరత్నకాంచనసంఘటితవిచిత్రరజతఘనప్రదేశప్రవిభూషితరశనాసూత్రప్రభాధాళధళ్యంబులు దిగంతరాళంబుల నావరింపం జిత్రపటకాంతిపటలంబు లాకసంబునం బర్వచు నకాలతారకాకీర్ణత్వంబుఁ బుట్టింప, నందిభృంగిరిటితండ్వాదిప్రమథగణంబు లిరుదక్కి నెక్కొన్నభక్తిం జేరి వినుతింప, మహర్షిసంఘంబులు, జయజయశబ్దంబులం బ్రస్తుతింప, డమరుశూలపరశుపట్టసధనురాది సాధనంబులు మెఱయ, విబుధవారాంగనానర్తనప్రవర్తనంబులు చెలంగ, గంధర్వగానంబు లనూనంబులై ప్రవర్తిల్లం గోటిసూర్యప్రభావిభాసితుండై యొప్పునమ్మహాపురుషుం గాంచి సాష్టాంగదండప్రణామంబు లాచరించి, నిటలతటఘటితకరపుటులై నిల్చి నయనవినివేశనచోదితకుశలప్రశ్నంబునం బొందుచు నా ధనంజయతపస్సంజనితజగదుపద్రవం బామూలంబును నతనికిం దెలియునట్లుగా నిట్లనిరి. ౭౭.

ఆ. ఓమహానుభావ ♦ యొకఁడెవ్వఁడోకాని, వృత్రసన్నిభోగ్ర ♦ విగ్రహుండు
బలిమిసూర్యదీప్తిఁ ♦ బరిభవించితపంబు, సేయుచున్నవాఁడు ♦ చిత్తగింపు. ౭౮.

ఆ. అతఁడుజోడువిల్లు ♦ నసివల్కలేషుజ, ఘనజటానుషోట ♦ కములుబూని
మునివిరోధవేష ♦ మునసుండియునువిరా, జిల్లుచుండునయ్య ♦ చిత్రగతిని. ౭౯.

ఆ. అతఁడుసంచరింప ♦ నవనికంపించును, నొనరఁగాసమాధి ♦ నున్నయప్పు
డనిలతారకాగ్ర ♦ హోమరాశాముఖ, కలితమైనభంబు ♦ గదలకుండు. ౮౦.

వ. అదియునుంగాక, ౮౧.

క. ఎంచఁగనీగతినాతఁడు, కొంచెపుఫలమేమిమదిని ♦ గోరితపముగా
వించెడునోయనిసంశయ, మించుకయునువలదువినుమ ♦ హేశ్వరతెలియున్. ౮౨.

చ. బలిమిజగంబులెల్లనొక ♦ పారిగెల్వఁగనెంచినాఁడొకో
కలఘుతపఃప్రభావమున ♦ నన్నియుముంచనెయెంచినాఁడొలే
కలరెడుమోక్షమందమది ♦ నాస్థదలిర్పఁగఁగోరినాఁడొకో
తెలియదుమాకుమేమతని ♦ తేజమునోర్వఁగలేముశంకరా. ౮౩.

ఉ. ఏలయుపేక్షసేసెదవ ♦ హీనపరాక్రమనీవెఱుంగవే
యేలికవీవెమాకభయ ♦ మీమనఁగఁజాలుదువిట్టినీవెమ
మ్మేలఁగమాకునింకభయ ♦ మేటికినొందఁగనంచునిట్టుల
వ్వేలుపుమౌనిసంఘములు ♦ విన్నపమొప్పఁగఁజేసియున్నెడన్. ౮౪.

క. శంభుఁడుపల్కెనునంతట, సంభిన్నాంభోధితోయ ♦ సంభూతసము
త్తంభితకకుభాంతసము, జ్జృంభితగంభీరరవము ♦ చెలఁగమృదూక్తిన్. ౮౫.

చ. అమరమునీంద్రులారవినుఁ ♦ డాఘనుఁడాబదరీవనాంతరా
శ్రమముననుండువాఁడువిల ♦ సజ్జగదుద్భవనాశహేతునై
యమరెడునాదిపూరుషుని ♦ యంశసముద్భవుఁడౌనసుండుగా
నిమనుజుఁడంచునెంచకుఁడు ♦ నెమ్మివిలాసతఁబుట్టెభూస్థలిన్. ౮౬.

ఆ. దివిజులారయితఁడు ♦ దేవేంద్రుబలమెల్లఁ, దఱిగిపోవనీల్లు ♦ తద్విమతుల
గెలువఁదలఁచినన్ను ♦ కేవలమునుగోరి, తపముసేయుచుండు ♦ ధరణివణఁక. ౮౭.

క. ఇతఁడునుగృష్ణుఁడునరులై, చతురాన్యప్రార్థనమున ♦ జగములుగావన్
దితిజులఁద్రుంపనుబుట్టిరి, క్షితినరనారాయణులుప్ర ♦ సిద్ధులువీరల్. ౮౮.

క. ఈకరణిఁదపముసేయుట, నాకులకొఱకంచుఁదలఁచి ♦ నరునివధింపన్
మూకాసురుఁడదెవచ్చెను, భీకరమగునీవరాహ ♦ వేషముతోడన్. ౮౯.

శా. ఈపాపాత్ముఁడుమూకదానవుఁడుదా ♦ నీదైత్యరూపంబుచే
నీపార్థుండిటులొంటియున్నయపుడే ♦ నేగెల్వలేనెట్లుమా

యోపాయంబునఁ గెల్తునంచు నువరా ♦ హోగ్రాకృతిం దాల్చి తా
నేపారంగను వచ్చునంచు మదినూ ♦ హింతున్ దదుద్యోగమున్. ౯౦.

ఉ. ఏను గిరాతరాజనయి ♦ యీకిటిరూపముఁ దాల్చివచ్చు నా
దానవునిన్ వధింపఁగను ♦ దానును నప్పుడె వానిమీఁదటన్
బూనినిశాత హేమమయ ♦ పుంఖశరంబొక టేసి నాతోఁ దా
నానకుఁ డాచరింపఁగలఁ ♦ డందులకై బలు వేటకయ్యమున్. ౯౧.

చ. అరిదితపంబులన్ గృశత ♦ నంది సహాయము లేక యొంటిగా
దురమున నుగ్రకోపసహి ♦ తుండగు పార్థునిజాస్వభావిక
స్ఫురదతులోగ్రశక్తి విసఁ ♦ జూడుఁడు మీర పుడందఱోలి నో
సురముని వర్యులార మదిఁ ♦ జోద్యముఁ బొందెద రయ్య వేడుకన్. ౯౨.

క. అని యిట్లు పల్కి శంభుం, డనునయవాక్యముల మునుల ♦ నాదర మొప్పన్
గనునూఱడించి యంతట, ననువొందఁ గిరాతరాజ ♦ నయ్యోదనను మున్. ౯౩.

సీ. ఘనమైన నెఱిగుంపు ♦ వెనుకకొదుఁగ దువ్వి, పూని గేలను సిగ ♦ బొంక పఱిచి
నెమిలిపింఛముఁగపో ♦ లములకీర్గడఁ జెక్కి, కెంపుకన్గవ మోము ♦ సొంపు నింప
విపులవక్షమునగం ♦ ధపువక్రరేఖలు, పొంకంబుగాఁ దీర్చి ♦ భుజములందుఁ
గరికుంభజనితము ♦ క్తాహారసూత్రంబు, పగమీఱ జన్నిదం ♦ బుగను దాల్చి
యాతపము చేతఁ బులకిత ♦ మైనయట్టి, గాత్రమలరంగ ఘననద ♦ త్కాండ సహిత
శార్ఙ్గకముఁ బూని మేఘపం ♦ ఘాతరీతిఁ, దగి కిరాతకపరివేష ♦ ధారియయ్యె. ౯౪.

క. హరువకుఁ బ్రియముగఁ బ్రమథులు, నరిది కుఠారములు విండ్లు ♦ నమ్ములు శూలో
త్కరములు బూని కిరాతక, వరులై పుట్టించిరట్టి ♦ బలమధికముగాన్. ౯౫.

వ. అప్పుడు. ౯౬.

సీ. మైలచల్లడముల ♦ పైలీలఁ గట్లన, బలునీలిదట్టిచిం ♦ గులను బెనఁచి
గట్టిగా మొలనంటఁ ♦ గట్టినవంకిణుల్, పొసఁగ దాపటఁ జెక్కి ♦ బొట్టెకోల
మెకము వాకట్టుమూ ♦ లికచుట్లదండలఁ, గట్టినకురువింద ♦ పట్టెడలును
సంజోకసెలవిండ్లు ♦ సరగనిర్గడఁ బూని, యింపైన గన్నెరా ♦ కంపపాదులు
మేలుపందీఁ టెలొఱపైన ♦ పీలిచెండ్లు, బాగుగాఁ గట్టుముక్కోపు ♦ పాఱుటాకు
బొమిడికంబులుఁ దలముళ్లు ♦ బూని నిల్చె, భూతపతి ప్రోలన పుడాకి ♦ రాతబలము.

చ. గడుసరి వాయువేగిసుర ♦ గాలి మెకంబుల మిత్తిపోతురా
జుడుములదిండి భైరవుఁడు ♦ నుబ్బరికాఁడ సహాయశూరుఁడున్

బిడుగుల రాయంకుశంబులును ♦ బెబ్బులికత్తెరగాఁడటంచుఁ జే
ర్పడుఘనజాగిలంబులను ♦ బట్టెడలందగఁబట్టిరావెసన్. ౯౮.

క. భైరియుఁగనె సరిలదుగును, వారణమును బోచిసాళు ♦ పను చంచలమన్
పేరులుగలబలు డేగల, దోరెంబులఁబట్టిబోవు ♦ దొరలేతేరన్. ౯౯.

క. చట్రాతిమీఁద నొకశిలఁ, గాఁ జేఁడనినిలిపికొలిచి ♦ కడుఁజెలఁగు మనా
గట్రాజనవికిఁదనుతమ, పొట్రాజునఁ జేపుకొనుచు ♦ బోయలునడువన్. ౧౦౦.

చ. గిరికొనఁగొంగయీఁ కెలితి ♦ కించినపోగులు వాలుట్రొల్లికా
లురులురిగోలలున్ వలలు ♦ నుగ్గునుగొమ్ములు చోపుగట్టెలున్
యిరవులనుండు బోనులడు ♦ గత్తఁగ నేర్చినజాడకాండ్రు రాఁ
దరలెను బోయశంకరుఁడు ♦ తద్గిరిభూమికి మాయ వేఁటగన్. ౧౦౧.

వ. ఇట్లు మాయామృగయావినోదంబు గాఁ దరలి యాతుషారకుధరకాంతారంబుఁ దఱియం జొచ్చి చుట్టునుం దిరిగి రాపోగువారించి నిరంకువలకొంకులమృగయానిరంకుశులగు లెంకలఁ గాపుంచి, పచ్చికలపట్లు మచ్చులు చల్లించి, కాలురులు గీలుకొలిపి, డొంకల వంకలన్ గొమ్ములుం దమ్మటమ్ములిమ్ముపఱచి, కొలంకుల కెలంకులం బరివేష్టించి మాటలుగా నేటుకాండ్ర నియమించి, పోటరులైన మేటిభటులు వేటుపాటెఱింగిన డేగ వేఁటరులును, సాగుబాగులెఱింగిన జాగిలంబులవారునుం దానును నడుకొని పన్నినించి మృగయావినోదంబు చూపఁ దలంచి. ౧౦౨.

చ. బలమునకెల్ల కాననవి ♦ భాగములేర్పడఁబంపు వెట్టినన్
గలయఁగనంతటంబరువు ♦ కట్టిభయంకరనాదమొప్ప నా
ర్పులు పెడబొబ్బలున్ గహన ♦ భూములుగప్పఁగ భూనభోంతరం
బులు వెసనిండ నార్చుచును ♦ బోరునఁ దర్లెను బోయసైన్యముల్. ౧౦౩.

శా. ఆవేళన్ భయమందుచున్ మృగవిహం ♦ గానీకముల్ భీతి మై
నావాసంబులు జేరి వాచఱవన ♦ య్యాక్రోశ మెల్లంగుహా
దావాభ్యంతర మెల్ల నిండఁగ మహీ ♦ ధ్రంబిట్లు భీతిల్లి తా
వేవేగన్మొఱపెట్టెనో యనమహా ♦ విస్ఫూర్తి మ్రోసెంగడున్. ౧౦౪.

క. మెకములుపత్తులు భయపడి, ప్రకటంబుగనొక్కత్రోవ ♦ బఱచెను వైరం
బొకటైనను మదిఁదలఁపక, యకటా యాపదలు వైర ♦ మణఁచు సెకాదే. ౧౦౫.

ఉ. జల్లి మొగంబులత్తఱిని ♦ జక్కనిరోమములొప్పు వాలముల్
చల్లని వంశగుల్మముల ♦ సందున దాచుక తద్భయంబున సం

ఢిల్లఁగఁ బ్రాణభీతియును ♦ డింబరికింపక వాలఖండనో
ద్వేల్లభయంబుచేతధృతి ♦ దీఁగానిపర్వకనిల్చె వింతగన్. ౧౦౬.

మ. మదకుంభిప్రకరంబులన్ సతతమున్ ♦ మర్దింపఁగానట్టితత్
స్మదగంధోద్ధతకేసరంబులనుభీ ♦ మంబౌబలాఘోషచే
నిదురత్మేల్కొనియావులించువినము ♦ న్నిద్రోగ్రవక్త్రాళిచే
నదగాక్రాంతయులేకయుండెనుమృగేం ♦ ద్రౌఘంబురాజాజ్ఞచేన్. ౧౦౭.

మ. లటముల్ పంకముచేతదుర్గమములై ♦ తత్క్షోభసంభావితో
త్కటకుంభీంద్రవిరుగ్ణచందనరసా ♦ క్రాంతారుణాభంబులన్
బుటముల్మీఱఁగబోరలొడ్డగిలమీనుల్ ♦ సారెకుంబొర్లఁగాఁ
దటినీసంఘమభంగభంగచయయై ♦ తాయాతమైఘూర్ణిలెన్. ౧౦౮.

మ. శితశృంగంబులకాఱుదున్నలువెసన్ ♦ జిమ్మన్విశీర్ణంబులై
నతమాలాగరుచందనోశిరవితా ♦ నప్రాపితామోదవి
స్రుతమైకీరసమానవర్ణితశిలా ♦ సూనాప్తశైత్యంబుచే
నతిమాంద్యంబుగమించెఁదద్వనచరా ♦ యానంబుతోఁ దెమ్మెరల్. ౧౦౯.

శా. ఆసత్వాదపగ్రీష్మకాలగతిన ♦ త్యంతార్తిగావించెన
క్కాసారంబులతోయముల్ మథితముల్ ♦ గాసత్వముల్ బాత్రిషో
నాసమ్మర్దముచేతనివ్వాగలుషం ♦ కాభీష్టమేధాన్యముల్
గాసిల్లెన్ వనజాళివాఁడెఁగదలీ ♦ కాండాళిభిన్నంబుగాన్. ౧౧౦.

వ. అంత నమ్మృగయూ లత్యంతకుతూహలంబునం బఱచుహరిణాదిమృగంబులఁ దఱిచగు వాలంపగములం చూలించుచు, దుష్పాలం దెప్పరంబుగా గుప్పించి కూలఁ గువ్వుచు, వంతంబులు మొఱయఁ గుంతంబుల గ్రుచ్చుచు, కటుతరసటాపటలవిస్ఫుటంబుగా ఘుర్ఘురధ్వానంబున నెదిరించిన మదవరాహవ్యూహంబుల మొఱుంగు బల్లెంబుల గ్రేడించి త్రెళ్లఁగ్రుమ్ముచు, శశకంబుల మశకంబులమాడ్కి గీటడంగించుచు, దెప్పరంబుగా మీఁదికి గుప్పటించు శార్దూలంబుల కెదిరించి వక్త్రంబుల వస్త్రపరివేష్టితంబులైన వామహస్తంబులు నిజశిరోపరిన్యస్తంబులుగాఁ జొన్పి వలకేలం బటుతరంబులుగాఁ గటిప్రదేశంబులఁ గట్టిన దట్టింపుఁజాయల నేడెంబులం బడఁగ్రుమ్మి కూలం ద్రోయుచు, కఠోరంబులుగాఁ గఠారంబుల నఱకుచుం గటారంబులఁ బొడుచుచు, సింగంబులు మీఁదికిం గవిసినం గలంగక మొఱుంగుటమ్ములఁ బరఁగించి సంధానమోక్షుణంబు లెఱుంగరాకుండఁ దక్షణంబులం గూలఁ జేయుచు, ఖడ్గంబుల నఱకుచు, శర

భంబులఁ బొరిగొనుచు, మాటుల నేటుదప్పించుకొని పఱచు వరాహశార్దూలంబులం దఱిమి కుమ్ముచు, కాలువలం జిక్కిన తరుచరహరిణసముదయంబుల గుదులుగట్టుచు, పొంగికలు గని బెదరుచుఁ జెదరి పఱచు లేడిగమిం గని పాటవంబునఁ దఱిమిపట్టి పడవైచుచు, జాగిలంబులు గదిసి సోఁగనియ్యకుండిన మెండుకొని తిరిగి కలగుండు పడం జెందు పుండరీకంబుల నండలుగొని చండకాండంబులం గండడంగింపుచు, నిఱికువలకుం జేరిన వరాహశార్దూలంబుల మాటుకాండ్రొక్కపెట్ట సరికట్టసేసినం గెరలి వరాహంబు వ్యాఘ్రంబునుం బడ నేసినను భయంబునుం బఱచి యుటఁ గూలినం గని కిరలాఘవంబున కచ్చెరువందుచు, నితరేతరలాఘవంబు లుగ్గడించి జాత్యనురూపంబుగా రిక్కలు నెరయం బిరుదంబులు బలుకుచు, పంతంబులు మెఱయఁ గుంతముఖసాధనంబులు జళిపించుచు, పొదల దీలించి నోలినం జెదరి పఱచు శశకంబులఁ జూపి ముష్టివదలి విడిచిన సాళువంబు పక్షినాదగంభీరంబుగాఁ బఱచినం గని యారంబులఁ దూఱినం జేరం జని నిజముష్టియష్టితాడనంబులం జదుపుచు, దోరంబులు నడలి విడిచిన వారణంబులు నిబ్బరంబునఁ బఱచు విహంగంబులపై నూకి పదంబుల నిఱికికొనఁ జంపులం జెంచియుం సెపనెడం బడ్డవైచిన నవి చిక్కంబులఁ జక్కనించియుం, జేనడలి విడిచినం దూరు బైరిం గని బకాదిపక్షినికరంబు లెగయక నిల్చినం దగిలి పట్టి బుట్టలం బెట్టుచు, నివ్విధంబున ననేకమృగవిహంగంబులం గీటడంగించి తదీయంబైన ఖాద్యామిషంబు విశసించి పొటనుచేలం ద్రవ్విన పడియల నడుగున నా పురాకులం బఱచి తత్పలలంబు తింత్రిణీశలాటుల లవణసమ్మిశ్రంబుగా నిక్షేపించి తత్పర్ణంబులు పైఁగప్పి నిండారం బూడ్చి చుట్టును బరివేష్టితంబుగా ననలం బంటించి పక్వంబుగా ననేకభంగులం బాకంబులు సేసి కాంత్రేనికిం గుడువం బెట్టి యుచితాహారంబులం దృప్తులై విహరించు నక్కిరాతులం గాంచి కౌతూహలంబునం బొందుచు. ౧౧౧.

శా. ఈలీలన్ గిరికన్యకావిభుఁడు దే ♦ వేంద్రాత్మజుండుండు నా
శైలంబందలి సానుకాననవన ♦ స్థానోగ్రసత్త్వంబులన్
జాలింబెట్టుచు వచ్చె లేడిగమి త ♦ త్స్వామిప్రవీరుల్లతా
జాలాగ్రంబులు మేయుచున్న దనివా ♦ నస్థానముం జేరఁగన్. ౧౧౨.

[illegible] ♦ [illegible]
[illegible] ♦ [illegible]

వే వేగంధరప్రక్కలింపు మమహా ♦ విస్తార వారాహతే
జోవిస్ఫూర్తిఁ దలిర్చు దానవుని దాఁ ♦ జూచెన్ హయుం డచ్చటన్. ౧౧౩.

మ. ఘనలక్ష్మీపహులన్ దైవయాహయుఁడు గం ♦ గాపల్వలాంతంబునన్
దనరన్ సేవలనిల్పి కొందఱుకిరా ♦ తశ్రేష్ఠులే తేరఁ ద
ద్వనవృక్షంబులు గుల్మముల్ మఱుఁగుగా ♦ వారాహమార్గంబునన్
జనుచుం డెన్ దగ నారెసారెమృగయుల్ ♦ జాడల్ విమర్శింపఁగన్. ౧౧౪.

ఉ. అంతటనింద్రసూనుఁడు మ ♦ హాకృతి చేఁ గుధరేంద్ర భేదనం
బెంతయు సేయఁజాలునని ♦ హెచ్చుపరాక్రమ మొప్పదంష్ట్రిల
త్యంతమునుగ్రమై వెలయు ♦ నానన మొప్ప వరాహవృత్తిమై
నంతిక భూమి నుండునను ♦ రాధిపునప్డె చూచె నెంతయున్. ౧౧౫.

చ. ఉరుతరకోప మెత్తి సట ♦ లుబ్బఁగ నెత్తుక నన్యకృత్యముల్
మఱమ మనన్ను గెల్తునని ♦ మత్సరబుద్ధి నిదవ్వునుండి తా
నురువడి వచ్చెడుం గిటిమ ♦ హోద్ధతి నం మనుదాని గెల్వన
న్నరునకు వేడ్కపుట్టె నుమ ♦ నంబున సారెకు శౌర్య మెచ్చెలన్. ౧౧౬.

మ. తరుమూలంబులు పెల్లగిల్లఁగ వడిన్ ♦ ధట్టించి పెన్ముట్టెచే
వరుసం ద్రోయుచు మాఁ గంధరంబునఁ బడన్ ♦ వక్త్రంబునన్ రాయుచున్
సరిఁ బోరాడఁగ నన్నుఁ బిల్చెడుం గతిన్ ♦ సంఘంబులం బాసి యు
ద్ధురతన్ డిదికి వచ్చె దీనిని వెసం ♦ దున్మాడుటుక్తంబె కా. ౧౧౭.

సీ. ఈయాశ్రమంబున ♦ నిపుడెంచి చూచిన, ఘనతపోమహిమచే ♦ మనములందు
వైరంబు లేకుండు ♦ పసుసత్వంబులు, వ్యాళాదిదుష్టస ♦ త్వములుఁ దలఁపఁ
బరవైరములచేత ♦ బ్రతుకంగ నేరవ, ట్లయ్యు నీకిటియును ♦ యందుమిగుల
మత్సరబుద్ధిచే ♦ మలయుచున్నది, యిదితపోభంగంబు ♦ గడిని సేయ
వచ్చియున్నట్టి విక్రుతరూ ♦ పంబు కాక, దనుజమాయాబలంబున ♦ దాల్చినట్టి
ఘోరతర మైనకిటిరూప ♦ తోయటంచు, మనమున నెంచె నాతపో ♦ ధనుఁడు మఱియు.

తే. అట్లుగాకున్న నిదిపూర్వ ♦ మందు సేయు, వైరమిప్పుడు నన్నుఁ జూచి ♦ వదలకున్న
దెటుఁగినట్టులె నిశ్చయ ♦ మిది యెపూర్వ, బద్ధవైరంబు గల్గురూ ♦ పంబు దలఁప. ౧౧౯.

క. కాకున్న వేలనన్నుం, దాఁకని దేవచ్చునిది యదృ ♦ దద్దయుఁ దారో
షాకలితము గామెకముల, నేకములం జెంగ విడిచి ♦ యీగతి నెదురై. ౧౨౦.

చ. ఇదియొమృగంబుగాదుమతి ♦ యెవ్వఁడొకో నను గెల్వ వచ్చువాఁ
డొదవెడు దీనియందు మది ♦ నూహ యొనర్చ కలంగె నా మదిన్
అదియును నిశ్చయంబు పరు ♦ నైనను మిత్రుని నైన చిత్తమే
చెదరదు నిర్మలంబగు మఁ ♦ జెప్పను గాదె జగద్ధితంబుగన్. ౧౨౧.

ఉ. మానికిఁ గాని శంకయిది ♦ మానెదనన్న నపాపకారినై
మానిగనున్న నాకునది ♦ మానము హెచ్చఁగ నెట్లు భీతిలోఁ
బూనెడు నీతిబుద్ధి యిది ♦ భూతికిఁ గాదిది నిశ్చయంబె కా
మానసబద్ధవైరుఁడగు ♦ మానిసికేద విలంఘ్య మెన్నఁగన్. ౧౨౨.

క. ఈవిధమున నను డ్రుంపం, గా వచ్చిన యట్టివాఁడె ♦ కానిమ్మైనన్
భావింపఁగ నీక్షుద్రపు, జీవము చే నేమి యౌను ♦ చింతింపంగన్. ౧౨౩.

మ. అని యూహించిన వేఁడు దానవుఁడొకో ♦ ఘోరాక్షసుం డొకదా
ఘననీలాకృతి నున్నదిట్లు మృగముం ♦ గా దైన నీ బల్మి యీ
వనసత్వంబుల కేది దచ్చెరువుదు ♦ ర్వారంబుగా నీగతిన్
ఘనకంపంబునఁ బొందఁజేయు గతి నా ♦ క్రాంతోద్ధతిన్ బోల్చెదున్. ౧౨౪.

క. ఇదియే మొ వేఁటకలకల, మొదవిన గతి వినఁగ నయ్యె ♦ నుద్ధతి మీఱన్
ఇదియును మాయాకల్పిత, మదితంబొ గట్టిగాని ♦ రూపణ సేయన్. ౧౨౫.

మ. ఇదె పో మాయను శాంతి నుండు ననుఁ దా ♦ నెంతేఁ బ్రహారింపఁగా
నదనూహించుచు వేఁటలాడుపోలమా ♦ ద్యంతంబునున్ బర్వి చె
ట్టిద మైనట్టి బలార్భటి ప్రభలధా ♦ టిన్ గాననౌఘంబులన్
జెదరిట్టుట్టు మృగావళుల్ బఱవఁజే ♦ సెన్ గాదిశల్ ఘూర్ణిలన్. ౧౨౬.

క. కాదే నెవఁడో సుయోధనుఁ, డాదరమున సత్కరింప ♦ నటు ప్రతికృతిగా
నీదంభతనుఁడును మఁగ, భూదారక్షుభితసత్వ ♦ ములఁ గల సెనుకో. ౧౨౭.

సీ. కాదేని నింకమై ♦ కృకటి పూర్వము చేసు, దగఁ జేయు ఖాండవ ♦ దహనమందు
మావ్యవహారము చేత ♦ నాత్మబంధువులెల్ల, హతులైన తక్షకు ♦ నాత్మజుండు
అశ్వసేనుండు దా ♦ నత్యంతకుపితుఁడై, వైరంబుఁ దీర్చుకోఁ ♦ గోరి యిట్లు
మాయావరాహమై ♦ యీయాశ్రమమునకు, ననుఁ ద్రుంపఁగాఁ బ్రియ ♦ త్నంబుపూని
వచ్చెనో కాక యొక్కఁడైన ♦ వాయుపుత్రుఁ, డైన మాయన్న భీముని ♦ పైని గల్గు
బద్ధవైరంబు చే మాయఁ ♦ బన్ని యుంటి, నిచ్చటను నుండు ననుఁ ద్రుంప ♦ వచ్చెనో కో.

క. ఏవిధినైననునిదిమా, యావియయానన్నుఁద్రుంప ♦ నధికబలముచే
నీవచ్చుమృగముఁదునుమఁగ, నేవలయునుశత్రుభంగ ♦ మిదిలాభముగా. ౧౨౯.

ఆ. తాపసులకుహింస ♦ ధర్మంబుగాదైన, దుష్టమార్గులకును ♦ దుర్గ్రహముగఁ
గడఁగిజయముఁగోరి ♦ కావించుమీతప, మనుచునాకువ్యాసు ♦ లాజ్ఞయీఁడె.

ఆ. ఈయధర్మకృత్య ♦ మెట్లుశాసించెనో, వ్యాసులనిననిపుడు ♦ బలుమెకంబుఁ
దునుమకీతపంబు ♦ తుదముట్టరక్షింప, నలవిగాదశక్య ♦ మరసిచూడ ౧౩౧.

ఆ. అనుచునరుఁడుపోరు ♦ పొంకంబుప్రథమాయు, ధంబునైనవిల్లు ♦ తనరనెత్తి
యొక్కపెట్టిశత్రు ♦ హింసకుగుణయుక్తి, సచివుగతినిదనరు ♦ శరముఁగూర్చి.

సీ. గురుసారయుక్తత ♦ గుణయుక్తమగువిల్లు, హితునట్లువిశ్రుత ♦ మతినివరుఁడు
క్షీణస్వబలుఁడయ్యుఁ ♦ జేనిండఁదీసిన, సానుకూలతనమ్ర ♦ మయ్యెనపుడు
ఘనకాండసంగ్రహ ♦ కర్షణసంజాత, గాండివమౌర్వీప్ర ♦ చండరవము
గుహలుబగులనిండి ♦ కుధరంబుజీవిత, సంశయమునఁబొందె ♦ సకలమునను
అంతలెగనిండఁదీసిన ♦ యట్టిచాప, మండలాంతర్స్థిరమైతగ ♦ నుండిత్రిపుర
హననవేళసుదానుండు ♦ నట్లుపరభ, యంకరతనుండునరుఁజూచె ♦ హరుఁడునపుడు.

ఉ. అంతటశంకరుండునను ♦ హస్తరమాకుధరేంద్రచాపమున్
వింతగఁబాదమూనియతి ♦ వేగముమీఱఁగనెక్కుపెట్టిక
ర్ణాంతముగాఁగవానుకిగు ♦ ణాగ్రముఖోద్గతవహ్నికీలల
త్యంతముఁబర్వఁగాఁదిగిచె ♦ నద్భుతబాణముఁగూర్చిపట్టుచున్. ౧౩౪.

సీ. కదిసియందొక్కరు ♦ గవయయత్నముసేయు, హరధనంజయులను ♦ ధ్యమునసపుడు
సంధిగూర్చెడువేళ ♦ సరిగప్రకృతిప్రత్య, యంబులనడుమఁదా ♦ నమరనిల్చి
యారెంటికభియోగ ♦ మలవడఁగూర్చితా, లయమొందుననుబంధ ♦ లక్షణమున
నవ్వరాహంబుండె ♦ నంతదిగ్గజభయ, ద్రోగంబుగానార్చి ♦ యుగ్రుఁడేయ
సాగివిస్ఫులింగ ♦ చయములునిగుడంగ, దిశలునిండఁబర్వ ♦ తేజమునను
నాకసంబువెలుఁగ ♦ వభ్రనిర్గతమైన, పిడుఁగుకరణివింట ♦ వెడలెశరము. ౧౩౫.

సీ. పరఁగనీరీతిని ♦ బాణంబువెడలుచు, గురుపక్షసంజాత ♦ ఘోషమపుడు
విహగాధిపుఁడువచ్చు ♦ వేగంబుగతినర్వ, హృత్కర్ణపుటివిని ♦ ర్భిన్నమగుచుఁ
బ్రతిరవంబులచేత ♦ బహురవంబుగఁబర్వఁ, గటకంఠవయునని ♦ ర్గతలయాగ్ని
కనదుత్పతచ్ఛిఖా ♦ కల్పమైవిద్యుత్ప్రి, శాళంబుముంటలా ♦ కసముఁగప్ప

హరసమీపభూమా ♦ భ్యంతరవర్తిత, గగనచరులకేక ♦ కాలదృశ్య
మగుచు నపుడె మాన ♦ సాధికరయమునఁ, జటులమగు నఁగపట ♦ కటినిఁ దాఁకె.

ఆ. గగనచారులెల్లఁ ♦ గడుభయంబునఁ జూడ, గురుతమాలనీల ♦ ఘోషనిస్వ
నాటియుపల వెడలి ♦ నదిఁజొచ్చు గ్రహరీతి, నవనిలో నదృశ్య ♦ మయ్యె శరము. ౧౩౭.

ఉ. అప్పుడె పార్థుఁడేయఁ బ్రళ ♦ యాంతకుఁ డర్జనిబోలెఁ జూపఁగా
నొప్పెడుపర్వరేఖలయ ♦ సోగ్రనఖాగ్రమునా శరంబు దా
నుప్పరవీథికిన్ వెడలె ♦ నుద్ధతి మీఱఁగఁ బ్రాణికోటికిన్
దెప్పరమైన భీతి నిజ ♦ నింపఁగఁ జేయుచు భీషణాకృతిన్. ౧౩౮.

సీ. దివ్యాస్త్రమది గాన ♦ దీపితోల్కాయత, తేజమగ్గిరివన ♦ రాజిఁ గప్ప
సంఖ్యమీఱినపక్షి ♦ సంఘంబు వ్రాలెను, గురుగరుత్స్వంజాత ♦ ఘోషమడర
నతివేగమున నల ♦ క్షితనిష్క్రమాగమ, మగుచు మనోవృత్తి ♦ కంటె మును పా
కాకుండె నో యనఁ ♦ గాని మేనంబున, విజయహేతుకమైన ♦ విజయుశరము
శాస్త్రవిహితకర్మ ♦ సాధనదక్షమా, పురుషయత్నమునను ♦ బోలి యపుడు
హరునిశరముఁ దాఁకి ♦ నట్టిగంటి సెనాటి, లక్ష్యకిటివిభేద ♦ దక్షమయ్యె. ౧౩౯.

సీ. అంతటఁ దారత ♦ మ్యంబు లెఱుంగని, యవివేకము నవృథా ♦ యాసమునను
ధనమును జెఱచు చం ♦ దంబున దారిద్ర్య, మును నవాత్మత్వంబు ♦ మొనసి కొలుచు
వారికిఁ బతిమీఁది ♦ కూరిమిఁ దొలఁగించు, నటు పలె దుర్నీతి ♦ యనవధాన
తయునివివిజిగీషు ♦ జయమెందఁ జేయుని, కరణి నిహారనర ♦ శరయుగంబు
దానికరణపటిమఁ ♦ దప్పింపనదియును, జిట్టఁదిరిగి మూర్ఛఁ ♦ జెందియపుడు
పుడమిమీఁదఁ గూలఁ ♦ బడెఁ జూడఁ దరులతో, నుర్విదిరుగుచున్న ♦ హోక్కయనఁగ.

మ. ధరమీఁదన్ బడియున్నరక్తపరిషి ♦ క్తంబట్లు గానుద్ధతిన్
ఖురదంష్ట్రాహతి రాళ్లు చూర్ణములుగా ♦ ఘూర్ణిల్లుచున్ దన్ను చున్
గురురోషంబున నర్జునుం గనుచు నా ♦ క్రోశించుచుం జచ్చె భీ
కరమా కాసురసూకరంబపుడు వే ♦ డ్కన్ దేవతల్ జూడఁగన్. ౧౪౧.

వ. అంత. ౧౪౨.

క. శరములసంఖ్యము గలిగియుఁ, బటువెత్తు మవచ్చునరుఁడు ♦ పోరున గొరువి
స్ఫురణఁ దలిర్చుచుఁ దత్పూ, కరభేదియయిన శరమును ♦ గైకొన వాంఛన్. ౧౪౩.

క. కృతమెఱుఁగువాఁడు గావున, నితవాహనుఁడా శరంబుఁ ♦ జేకొనఁ దలఁచెన్
అతులితబాణములుండఁగ, నితనికిది నిపరమ్ర బేమ ♦ యంతేమియనన్. ౧౪౪.

క. ధరలోపలఁగృతవేదుల, కరయునపుడు మేలుసేయు ♦ నతఁడు ప్రియంబా
కరణిమఱి సేయఁగలవాఁ, డిరవొందఁగఁ బ్రియుఁడుగాఁడ ♦ దేగతి నైనన్. ౧౪౫.

సీ. ఒనరనీచునియందు ♦ నుండనియుపకార, మును బోలెఁగిటిదేహ ♦ మునననునిలక
యవ్వలవెడలితా ♦ ననవలోకితమాఘఁ, గృతపౌరుషంబున ♦ నతులమగుచు
గురుతరలోహాగ్ర ♦ పరతనుస్సుఖముగాఁ, గాత్మపోషపమున ♦ కలరియుంబుక
కరయలజ్జించిన ♦ యటువలెనుండుచు, గురుకాంతినిజకీర్తి ♦ కరణిఁదాల్చి.
పాటవంబుమీఱఁ ♦ బ్రస్ఫీతమైయున్న, శరముఁజూచిసవ్య ♦ సాచియిట్టి
ఘనశరంబుపిడుఁ ♦ గావచ్చు నేయని, యలరిపుచ్చుకొనియె ♦ నాస్థతోడ. ౧౪౬.

ఆ. అప్పుడచటఁగాంచె ♦ నయ్యర్జునుఁడుచెంతఁ, జిత్రజారివార్తఁ ♦ జెప్పవచ్చి
శరశరాసనములు ♦ ధరియించిముందర, సరగనుండువిపిన ♦ చరునిశోకని. ౧౪౭.

తే. అప్పనచరుండునతనికి ♦ నాత్మజాతి, విహితముగ మ్రొక్కి వేవేగ ♦ విన్నవింపఁ
గణఁగియీరీతిఁబలికెస ♦ ఖ్యంబుగదుర, సాంత్వవాక్యంబులను మైత్రి ♦ సరణిబరఁగ.

సీ. ధన్యనీబహిరనా ♦ స్థత్వశాంతత్వమె, సవినయషూమాన ♦ సముసు దెల్పె
ననఘాత్మనీదుతే ♦ జోధిక్యమాతప, శ్చర్యధోఖిమలశా ♦ స్త్రోముసుజెప్పెఁ
దలపోయనీదేవ ♦ తాసమానాకృతి, పరిశుద్ధమానుల్యం ♦ బెఱుఁగఁజాలె
మునివర్యుననుభావ ♦ మునఁబ్రకాశించుచు, గౌరవంబునశైల ♦ ఘనతమీఱి
యిచటనుండియెనీవుదే ♦ వేంద్రుచేత, నఖిలలోకాధిపత్యంబు ♦ నైననదసి
కాంచినిర్బాధకముగనే ♦ లించఁగలవు, గానియితరంబుగాదనీ ♦ దైనమహిమ.

తే. ప్రభుతనొందుచుసకలసం ♦ పదలకెల్ల, నాస్పదుఁడవైతివద్దియెట్టు ♦ లన్ననీవు
జనులనెడఁబాసియొంటిని ♦ చ్చటనునుండ, సచివయుతురీతినీదుతే ♦ జంబువెలసె.

క. అతిజయమంటుటయేమరు, దతులంబగుమూర్తియైన ♦ నఖిసులభమునీ
హితవాంఛితక్షేమైదైనను, జితరాజన్యతామసమ్ములు ♦ జేయువెయ్యనఘా. ౧౫౧.

వ. అంత నిజాగమనప్రయోజనద్యోతకోపాలంభనపూర్వకంబుగా నిట్లనియె. ౧౫౨.

సీ. అధికతేజంబున ♦ నహిమధామునిమించు, యుల్లఘువిక్రమమున ♦ వెలయునీవు
నిశితోగ్రనూశద ♦ నిర్భేదియైనయీ, మార్గణబాణాభి ♦ మ్మాడ్కి నిపుడు
వచ్చిసాహసమునఁ ♦ బుచ్చుకోవచ్చునె, ధరణిమస్వాదిన ♦ త్పురుషులవసి
దేహధాములకెల్లఁ ♦ దేర్చినమర్యాద, దప్పకనడచుటు ♦ త్తమము కాదె
శాకమీవంటిఘనులెయీ ♦ కరణిమేర, మించినడవంగమదినిశ్చ ♦ యించిరేని
మేరఁదప్పకనడచెడు ♦ వారలెవ్వ, రలఘుచారిత్రమఱినీవె ♦ తెలుపవయ్య. ౧౫౩.

సీ. జ్ఞానసంపత్తిచే ♦ జన్మమృత్యువులను, గెలిచినయోగీశ్వ ♦ రులుదలంప
నాబాల్యముననుండి ♦ యావత్ప్రసంబైన, దుర్మార్గవర్తనఁ ♦ దొలఁగుపట్టి
సదుపదేశమె కోరి ♦ సౌశీల్యవృత్తినై, యభ్యసింతురు వినుము ♦ మందువలన
తెలియదుప్పఘనిప్ప ♦ త్రియె కాదు సకలార్థ, సిద్ధియయానెట్లన్న ♦ సిద్ధతపము
సేయువారికిఁబుణ్యంబు ♦ సేయుసుఖముఁ, గోరువారలకుఁదదను ♦ గుణసమృద్ధి
కూడఁజేయునుమతిముక్తిఁ ♦ గోరుయోగి, జనులకెల్లనుమోక్షంబు ♦ తనరఁజేయు.

తే. ఎఱమినీరీతిఁబురుషార్థ ♦ హేతువైన, యట్టిసౌశీల్యమిలలోన ♦ నెందువలనఁ
బనులకెల్లఁబ్రియంబుగఁ ♦ జనునిదెట్లు, కానమారాజుశరమంటఁ ♦ గాదునీకు.

మ. వితథంబైతగురూపరేఖలనుభా ♦ వింపంగనీసాయకా
కృతినొప్పారుచుమాశరంబువినుము ♦ ర్థింబూజనీయుండని
స్మృతివిభ్రాంతునిఁజేయనీవిదియెనా ♦ బోనంచుఁజేకొంటిగా
కితరంబైనను నేలముట్టుదువునీ ♦ వీరీతినిబ్బాణముల్. ౧౫౬.

ఆ. స్థిరుఁడుకడమజనుల ♦ శరచౌర్యమాత్రంబో, నరిసికోరఁదక్కు ♦ వదినయోగాళ
నితరుఁడేయుమృగము ♦ నేసితినేనని, నొడివెదీవుసిగ్గు ♦ పడకమగల. ౧౫౭.

వ. అని మఱియును సవ్యసాచియందు నిజోపకారప్రకటనంబుగా సేతద్విశద్ధసదోషంబుప
హరించువాఁడిట్లనియె. ౧౫౮.

మ. వినుమీమాదొరసచ్చరిత్రులెపుడుల్ ♦ విద్వాంసులుత్కంఠచే
వినిసంతోషముఁబొందిమెచ్చురితరుల్ ♦ వేనోళ్లవర్ణింతురా
ఘనతందావినిరుబ్బఁడింతయుమదిన్ ♦ గాంభీర్యతన్మ్రుఁడౌ
ననఘామానవుసద్గుణావళులన ♦ న్యార్థంబుతొఁజూపఁగన్. ౧౫౯.

క. నిరుపమనిజగుణసంపద, పరనిందయుఁబోలెఁజూను ♦ ప్రకటముసేయం
డరయఁగమాదొరధరలోఁ, బరనిందయునాత్మనుతియుఁ ♦ బరఁగవుగానన్. ౧౬౦.

క. అరయనటులైనకార్యా, తురతనునిర్విణ్ణుకరణి ♦ తుడిఁజెప్పఁటడిన్
ధరఁబెద్దలమర్యాదలు, చెఱచెదునర్థిత్వమేల ♦ చీకాల్పనెకా. ౧౬౧.

వ. అని మఱియు నిజకృతోపకారంబు తేటపఱచువాఁడై యిట్లనియె. ౧౬౨.

క. మాదొరనితశరమునని, భూదారముఁదునుమకున్న ♦ మొనసిబలిమినీ
మీఁదఁబడియేమిసేయునో, యాదుర్వచనంబుఁజెప్ప ♦ నలవియెనాకున్. ౧౬౩.

శా. నేనేచంపితినిమృకంబుననుచు ♦ న్నీచిత్తమందున్నదే
హోనీవప్రజద్భఘాంగతంబ్రబలిపే ♦ గోజ్జ్వలభియానీకటికిన్

జానేయఁగ విననొక్క బాణమున నే ♦ శక్తుండై వండుండుమా
సేనాధీశుఁడు దక్క నీవు మదిలోఁ ♦ జింతింపనిం కేటికో. ౧౬౪.

మ. అటులైన న్మతి యేమి యన్న వినుమీ ♦ యారాజునిన్ బ్రాణసం
కటమౌ నంచును వచ్చి సూకరముఁ దా ♦ ఖండించి రక్షించెనీ
ఇటు గానం బరమాప్తుఁ డంచును తనిన్ ♦ హర్షించి చేకొంచునో
క్కటియై యుంట యొహోలు మేలు మఱవం ♦ గా నేల యోగీశ్వరా. ౧౬౫.

క. వినుమప్పుడర్థమూలం, బున సఖ్యము సేయనొప్పు ♦ భువినందఱకున్
బని లేని సఖ్య మేమిటి, కనియన్న ను వినుము తెలియ ♦ ననఘచరిత్రా. ౧౬౬.

మ. ధరలోనన్ విజిగీషులౌ జనులకున్ ♦ దౌర్లభ్యమై తెస్సగాఁ
బరిరక్షింపఁగ రాక యస్థిరములై ♦ పాటిల్లు నీ యర్థముల్
ఇరవొందన్ సుగమంబు సుస్థిరమునై ♦ యే కోపకారార్త్తమా
గురుమిత్రత్వసమాను కారములు గాఁ ♦ గోర్కెన్ వితర్కింపఁగన్. ౧౬౭.

వ. అదియును గాక. ౧౬౮.

క. ధనమును జంచలము గుభూ, మిని వెనహరియింతురరులు ♦ మిత్రత్వము దా
నణఁగదు నిఖిలధురీణం, బనపాయము దాని మఱవ ♦ నగునే నీకున్. ౧౬౯.

సీ. అదిగాక మోక్షార్థి ♦ యగువాని కేటికి, ననఘ సఖ్యము సేయ ♦ నంటి వేని
స్థిరబుద్ధి నీరీతి ♦ సేయు నీతపమిది, విజయవాంఛను గాని ♦ వేఱు గాదు
కాకున్న నీరీతి ♦ కైదువుల్ బూనునె, ధర మోక్షకామియై ♦ తాపసుండు
కానమౌ రాజుతోఁ ♦ గలసి సఖ్యము సేయఁ, దగునట్టులైననీ ♦ తపము ఫలము
సకలమును గరంబు ♦ సమకూడు నెక్లైన, నీయలంతి సఖ్య ♦ మేమి యనుచుఁ
దలఁచెదేని వినుము ♦ తగనీకు మారాజు, మహిమ తేఁటపఱుతు ♦ మౌనితిలక. ౧౭౦.

చ. ఘనగజవాజిసంజనిత ♦ కాననభూములు మేటిరత్నపుం
గనులధికంబు గాఁ గలవు ♦ కావున నీకలహంబు లేలనీ
కనకపుటమ్ముకంచనినఁ ♦ గాంక్షను గోరుట గాదు నూపఱుం
డెనయఁగ నెక్కుడౌటకున ♦ హింపఁడు మాదొర నెమ్మనంబునన్. ౧౭౧.

క. కావున సఖ్యం బుచితం, బీవిధమున బాణమునకె ♦ యింత పెనంగన్
ఈవనలుబ్ధుకు చెల్మిని, భావింపఁగ నేమి మనకు ♦ ఫలమని యనినన్. ౧౭౨.

చ. ధరణి మహాత్ములౌ వరులు ♦ తామతి రాజసవృత్తినుండియున్
బరులు సగర్వులై గెలుచు ♦ పట్లను రాజసవృత్తి మానితా

మరిమురికోపముందుదురు ♦ యాచకకోటులు వేఁడుకొన్నచో
సిరియును వస్తువంచు మతి ♦ చెప్పఁగ నేటికి జీవమైనని
త్తురు మతి దాఁచు కోకఘన ♦ దోర్బలధుర్యుల చెల్మి రిత్తయే. ౧౭౩.

ఆ. కానతూపు నీవు ♦ క్రమ్మఱనిచ్చిన, నీకు నాతనికిని ♦ నెమ్మి రామ
రవిసుతులకుఁబోలె ♦ రహినినన్యోన్యంబు, దైవఘటితమైత్రి ♦ తగఘటించు. ౧౭౪.

ఆ. శరము లోభమునన ♦ సత్యంబు పలుకకు, మునికి శరము మీఁది ♦ మోహమేమి
యిఁక శరంబు లేదె ♦ యీగిరిపైనన్న, హెచ్చు వజ్రమునకు ♦ నీశరంబు. ౧౭౫.

సీ. అనియీశరంబుపై ♦ నాస్థనీకున్నను, గిరులరాజైనమా ♦ దొంకునీవె
ఇదియెంతపనియని ♦ యిపుడు వేఁడవుగాని, నీవంటిమిత్రుఁడు ♦ నెమ్మినడుగ
నిలయెల్ల గెలిచినీ ♦ కిచ్చు బాణములెంత, యాచకు భంగింపఁ ♦ డనఘుఁడతఁడు
సర్వజ్ఞమూర్తియా ♦ చకభంగ మెల్లఁదా, నాత్మానుభవముగా ♦ నాచరించు
నట్లుగాన నీకు ♦ నడిగిన భంగంబు, దొడరున నెడు శంక ♦ విడువుమిపుడు
ఘనుని వేఁడుకొనిన ♦ ఘటియిల్లుఁగోర్కులు, సందియంబు లేదు ♦ సదమలాత్మ. ౧౭౬.

సీ. బలవంతునకు నేల ♦ పరుని యాచింపఁగా, న నెదవేని సమస్తఁ ♦ డైనవాఁడు
ఘనశక్తిచే నైనఁ ♦ గాదేని ప్రేమచే, నైనను బరధనం ♦ బాక్రమించు
నది గాక బలవంతు ♦ నడుగఁబోవుటయెల్ల, ఫణిఫణామణిఁ గోరు ♦ పగిది గాదె
సమకూడ నేర్చునె ♦ జామదగ్న్యునిమాని, యస్త్రవేదము వేఱె ♦ యభ్యసింప
నలఘుభుజవీర్యశాలియా ♦ నతనికైన, నాయుధంబిలసాధ్యంబు ♦ నగుటగలదె
కావున నుమీకు నటువంటి ♦ ఘనులతోడఁ, జెలిమి సేయుటయొప్పను ♦ స్థిరముగాను.

క. ఇటువలె మీమృగశరములు, చటులత హరియించుటకు ♦ సరి నాతనికిన్
ఘటియిల్లుట నఖ్యము దా, నెటువలెననినీవుదలఁచె ♦ దేనిమహాత్మా. ౧౭౮.

ఆ. తపసి వగుట నిన్ను ♦ దయఁజూచి మారాజు, మృగము నేయు దోష ♦ మిది సహించె
నజ్ఞులైనవార ♦ లటు సేయు దోషంబు, లాత్మనుంతు రేమ ♦ హాత్ములవని. ౧౭౯.

ఆ. ఇట్లు సేయు మైత్రి ♦ నేమి ఫలంబన్న, సత్కులమునఁ బుట్టి ♦ సత్తపంబు
నలుపు నీవు తాప ♦ నవిరోధమానిట్టి, దుష్కృతంబు సేయఁ ♦ దొలఁగు దింక. ౧౮౦.

క. కాదేని దుష్పథంబున, నాదట వర్తించునట్టి ♦ యన్నరుఁ డెందున్
మేదినిని హపరదూష్యము, లైదుస్తరములగునట్టి ♦ యాపదల నఘా. ౧౮౧.

క. పితృదేవపూజకొఱకో, యతులితమైనట్టి పదవి ♦ యందుటకో యీ
గతినీమృగమును నేటికి, వితథంబుగ నేసితి దివి ♦ వేకము లేరుచే. ౧౮౨.

క. మునివరయేమిటికూరకె, తనరంగానీకునింత ♦ తెలుచుగఁజెప్పన్
విను మొక్కటిపరమార్థము, వినిపించెదనీకు నేను ♦ విశదముగాఁగన్. ౧౮౩.
ఆ. ధరవివేకియైన ♦ పురుషుండు చపలత, విడుచునెట్టివాఁడు ♦ విడువకున్న
ప్రళయవాయువబ్ధి ♦ భంగించుగతినిది, చేరిధీరునైనఁ ♦ జెఱచుగాన. ౧౮౪.
క. ఐనను నీతనిబోణం, బేనీయక యున్నవలిగి ♦ యేమిటిసేయం
గానోపున నెదవేరియు, ధీనుత నేనతనిమహిమఁ ♦ దెలిపెదనీకున్. ౧౮౫.
మ. వినుమా రాజుమహోగ్రతేజుఁడుధను ♦ ర్వేదాంగపారీణుఁడున్
ఘనశైలోద్భవశేఖరుండనిశచీ ♦ కాంతుండు భూరక్షకై
వినయంబొప్పఁగఁబ్రార్థనల్ సలుపఁగా ♦ విచ్చేసియీపర్వతం
బుననిట్లుండుఁగిరాతసేనగొలువన్ ♦ భూరిప్రభావంబునన్. ౧౮౬.
వ. అని పల్కి యుపసంహారంబు సేయువాఁడై మఱియు ని ట్లనియె. ౧౮౭.
ఆ. ఇపుడు మృగము నేయు ♦ నీయపరాధంబు, నేనుసైఁచితీవు ♦ మానివగుట
మాననీయుఁడైన ♦ మారాజుశరమిచ్చి, భూరిసంపదలను ♦ బొందుమనఘ. ౧౮౮.
వ. ఇవ్వినంబున విరోధప్రధానంబై యుండుమిత్రత్వంబె సూచియింప నేరదు. తన్మూలం బుగా సంపత్ప్రాప్తి యె ట్లగునంటివేనిం జెప్పెద నాకర్ణింపుము. ౧౮౯.
తే. ఒనరహృదయానుకూలమై ♦ యుండెనేని, యొదవువినయాదిగుణములా ♦ పదలడంగు
నిట్టిబహుఫలహేతువై ♦ నట్టిమూర్త్య, సంగమముగల్గనర్థిత్వ ♦ భంగమెట్లు. ౧౯౦.
మ. ఇదిగా దాతఁడుమారమందునికినం ♦ శేనిన్ బలోపేతుఁడై
యిదెయీపర్వతభూరుహాంతరమునం ♦ దీచాయఁగన్పట్టుఁదా
నుదితోర్మిప్రకరంబుతోసమయువే ♦ లోద్గీర్ణమైపొల్చున
య్యుదధింబోలెమనీకు నేఁడునుమహా ♦ తోద్దీప్యతేజంబునన్. ౧౯౧.
ఆ. అప్పుడతనితోడ ♦ హరితురంగము కేతు, కాంతిమీఱసజ్య ♦ కార్ముకంబు
పూని మైత్రిచేసి ♦ పొందునీవాంఛిత, మనఘనధికఫలము ♦ మునివరేణ్య. ౧౯౨.
వ. అని యక్కిరాతుం డూరకున్న నయ్యర్జునుండు గంభీరస్వభావుండు గావున ధైర్యం బవలంబించి కోపంబునకు సమయంబుగాదని యుపశమించువాఁడునుం బోలె శత్రు స్వభావప్రకటనం బగువాక్పటుత్వంబు మెఱయ న వ్వనచరున కి ట్లనియె. ౧౯౩.
ఆ. అనఘ యిట్లుపల్క ♦ నలవియేయొరులకు, వర్ణభూషగౌర ♦ వతనునలరి
లలితపదవిలాస ♦ కలితమైశ్రీకర, మగుచునీదువాక్య ♦ మలరెనిపుడు. ౧౯౪.

సీ. సభను బెద్దలఁగాన ♦ సాన్మాస్త్రలను మించి, హృదయసూచకముగా ♦ నింపుగుల్కు
విపులార్థగంభీర ♦ నిపుణత వెలయఁగా, విద్వాంసులెల్లను ♦ వినుతి సేయ
వినువారలకు నెల్ల ♦ మనములురంజిల్ల, పరిశుద్ధశబ్దసం ♦ పదదలిర్ప
స్వామికార్యమునకు ♦ సాధకంబై యుండఁ, బలుకులవినయంబు ♦ పరిఢవిల్ల
భయములేకిట్లు పలికితి ♦ ప్రౌఢి వెలయ, వనచరుఁడవయ్యు వాక్పటు ♦ త్వము న వెలయు
బుద్ధిమంతులలో నెల్లఁ ♦ బొగడువడసి, తగఁగణ్యుండవైతివి ♦ వనచరిత. ౧౯౫.

సీ. అలఘుసామోపాయ ♦ మాచరించెడు వేళ, స్నేహాదివినయము ♦ శ్రేయఁగను
అంతభేదోపాయమడ ♦ రించుతఱిఁ బల్కు, వలయును భయపెట్టు ♦ వాక్యములను
వ్యాయార్థికీరీతి ♦ నాచరింపఁగఁదగు, బాణార్థివై వచ్చుఁ ♦ బలికితిట్లు
బాణార్థి వసుఁడైనఁ ♦ బల్కు నేయీరీతి, నీతిమీఱఁగ నేర్చి ♦ నీవు గాఁగఁ
బలికితిట్లు ప్రౌఢి ♦ వెలయంగ నీగతి, నేర్పుమీఱ నొరులు ♦ నేరవగును
దొరకుహితవుమీఱ ♦ దూతత్వమిటు సేయఁ, దగుదు వనచరునీవి ♦ తథ్యమిదియు. ౧౯౬.

వ. అని పల్కి తదనంతరకార్యంబు వివరించువాఁడై యిట్లనియె. ౧౯౭.

తే. అనఘ మామీఁదఁ గీడు సే ♦ యంగ నిట్లు, తలఁచు మీ రాజుతో నీవు ♦ వలనటంచుఁ
దెలియఁగాఁ జెప్పి వారింప ♦ నలవియగునో, కాదొ పరికించి చూడుమీ ♦ ఘనుఁడ నీవు.

క. కామందు పెట్టు కీడుకు, లోకములో మేలునకును ♦ లోనగు నాప్తుల్
చేకొని చెప్పినవింతగతిఁ, గైకొని మఱినడచువారు ♦ గారేన్పతుల్. ౧౯౯.

క. అటులైన ను మద్బాణం, బెటు వొందియు నట్ల శరము ♦ లేసినఁ బోవే
యటు గావునఁ దత్సాయక, మటు నటులీశైలమందు ♦ నరయంగఁ దగున్. ౨౦౦.

క. కాదేని బాణమునకై, యాదటమతినీతిమంతు ♦ లగునార్యులతో
వాదుగొనందగు సజ్జన, వాదంబునఁ గీడు లెంతి ♦ వానికినైనన్. ౨౦౧.

వ. అదియునుం గాక. ౨౦౨.

సీ. నిశితోగ్రసాయక ♦ నిర్భేదియైనయీ, మా రాజు బాణమి ♦ మ్మాడ్కి నీవు
వచ్చి సాహసమునఁ ♦ బుచ్చుకోవచ్చునే, యనియున్న పల్కితి ♦ వనఘ వినుము
ఖాండవదహనంబు ♦ గావింప నుద్యుక్తుఁ, డగు నగ్నిదేవుచే ♦ నపుడు నేను
అక్షయబాణంబు ♦ లందుక సురసాయు, కములయందింతైనఁ ♦ గాంతలేక
యుండునట్టిమాకుఁ ♦ గొంచెలలోనుండు, విపినచరులబాణ ♦ వితతిమీఁద
వాంఛబుట్టి యిటకు ♦ వత్తుమే పుచ్చుకో, నపుడు నీవు తెలియ ♦ కంటిగాక. ౨౦౩

సీ. అదిగాక మాన్యాగ్రు ♦ లైనట్టి పెద్దలు, దేహధారుల కెల్లఁ ♦ దేర్చు మేరఁ
దప్పక నడచుట ♦ త్తమము గాదే యంచు, నాడితి వప్పనె ♦ యార్యజనుల
మర్యాద లెల్లఁ బ్రా ♦ మాణ్యమే యనినను. మమ్ముల నిందింప ♦ నిమ్ము లేదు
పరనింద వడయక ♦ ప్రఖ్యాతమైనట్టి, సజ్జనవాక్యముల్ ♦ సద్గుణములె
యలగఁ బల్కఁగాని ♦ యనృతంబుఁ బల్కనె, యదియెట్టులంగకట్టు ♦ లనృత మాడు
నీకు నిజము లేదు ♦ గాకను మావంటి, వారు మేరఁ దప్ప ♦ వారె యవని. ౨౦౪.

ఆ. పసులబుద్ధి దలఁప ♦ బ్రత్యక్షమాసెట్లు, నీకుఁ దెలిసె మాకు ♦ నిజము లేని
దనుచుఁ బలికెదేని ♦ యాటవికోత్తమ, తెలియ ననుము నీకు ♦ తేఁటపఱుతు. ౨౦౫.

చ. విదితగుణంబు దాఁచుకొని ♦ వేఱొక దుర్గుణ మొదిసజ్జనా
స్పదమును గాక యుండఁగను ♦ సంహరణంబగు దుష్టచిత్తముల్
విదలక ఖడ్గరూపమగు ♦ వారలవాక్య మొగుష్టభావమా
లెదిరిజనాలికిం దెలుపు ♦ నెంతయు మూలము భేదపుచ్చుచున్. ౨౦౬.

ఆ. తపసివగుట విన్న ♦ దయఁ జూచి మారాజు, మృగము నేయఁ దోప ♦ మిది సహించె
నను మఁ బలికితీవు ♦ వనచరోత్తమ వినుము, మందుకేమి తెలియు ♦ నదియు నిపుడు. ౨౦౭.

ఉ. కాననభూమి నుండెడు మృ ♦ గంబుల నెవ్వరిసొమ్ము గావుతాఁ
బూనిక నేసినాతనిది ♦ పోరఁగ నేటికి నాదటంచు నున్
మానక లేనిపోని యభి ♦ మానముఁ బెంచిన మేలు గల్గునే
మానని పట్టియీదురభి ♦ మానము మీకొరకేల మాన్పుమీ. ౨౦౮.

వ. అదియునుంగాక. ౨౦౯.

క. పితృదేవపూజకొఱకో, యతులితమైనట్టి పదవి ♦ నందుటకో యీ
గతి నీమృగమును నేటికి, వితథంబుగ నేసితివి ♦ వేకము తెరువే. ౨౧౦.

క. అనిపల్కఁ తె వివ్వారికిని, గనకుండఁగ వ్రతము నేయఁ ♦ గా నియమించెన్
ఘనుఁడగు వేదవ్యాసుఁడు, నను నీగతి నెట్లు గావు ♦ నను నేనిపుడున్. ౨౧౧.

క. ననుఁ దునుమంగా వచ్చిన, ఘనమృగము నన్నిల్పి చావఁ ♦ గా నేసితి నే
ననువుగ వ్రతసంరక్షయొ, ఘనులకు నిల భూషణంబు ♦ గాదే తలఁపన్. ౨౧౨.

వ. అదియునుంగాక మా రాజు నీ మీఁదికిం జనుదెంచు దుష్టసూకరంబును ఖండించి నిన్ను రక్షించెం గావున నితరజాతుం డైనను నతనితో సఖ్యంబు గావింపు మని యంటివి. స్వకార్యాతురత్వంబున వన్యమృగవధోపజీవితుం డగు లుబ్ధకుండు తాపసుల కుపకారపరుండు గా నేర్చునె! వినను నిద్దఱచేతను నొక్కవేళనే తత్క్షణం

బా మృగంబు హతం బయ్యె నిదియు దుర్లక్ష్యంబు గావున మొదల నెవ్వ రేయు టయుం దెలియరాకున్న యది. అట్లు గావున నితరుం డేయుమృగంబు నేసితి నేనని సిగ్గుపడక నొడివెదవని మమ్ముల నుపాలంభించి పలికితివి. తద్దోషం బీషన్మాత్రం బును మాకుం బనిలేదు. నిరాయుధులైన తాపసులయెడల దయాపరత్వంబు విహి తంబుగాక సజ్యకార్ముకధరులైన మునులయెడల నుపకారంబు ఘటిల్ల నేర్చునే! అదియునుంగాక, అతండు మద్వధార్థం బేతెంచు వరాహంబుఁ బరిమార్ప బాణంబు తూణంబు వెడలం దిగిచె. తచ్ఛరంబునకు నా మృగంబును వధించుటయే ఫలంబు. తత్కార్యంబు సాత్కృతంబైనం బ్రయోగించు నతనికి నధికసాఫల్యంబు గావున నాతండు శరలోభం బెట్లు విడువనేర్చు! అదియునుంగాక తత్స్వామికంబునకు నతని యాచింపుమని యంటివి. దుర్బలుం డగువాని కగుంగాక బలియుం డగు వాఁడు యాచ్ఞాదైన్యంబునకు నెట్లు సహింప నేర్చు! అది యటుండనిమ్మని యుద్ఘా టించి పల్కి భయంబు సూచించువాఁడై యిట్లనియె. ౨౧౩.

చ. వనచరమీవు పుండవృత ♦ వాక్యమునూనుచుబల్మినైనఁ జే
కొనఁగనురానిదుష్కరపుఁ ♦ గోరికిబల్మినిబొందఁగోరెదా
వినుమిదిచిత్రమిద్ధరవి ♦ వేకులకెన్న భయంకరత్వముల్
గనఁబడియున్ననైననుని ♦ నాశమునంజెనుబుద్ధిబుట్టుగా. ౨౧౪.

సీ. ఇట్లుమీదుశరమ్ము ♦ నిచ్చినందున నేమి, గట్టిగామీరాజు ♦ కడఁగివచ్చి
వరశరాసనఖడ్గ ♦ వర్మబాణంబులు, వినయంబుతో నన్ను ♦ వేఁడు వేఁడ
విభజించి యడిగినా ♦ వినుము నేనిచ్చెదఁ, గాదేనిభుజశక్తి ♦ గలిగ నేని
యాచించికైకొను ♦ నదిపౌరుషము గాదు, పౌరుషశాలికే ♦ వగిదినైన
మొనసిబల్మినిబుచ్చు ♦ కొనుటభూషణమొన్ను, నదియుఁగాకతఁడున ♦ త్యాప్తుఁడంచు
తే. నెట్టుమునుపల్కితిలలోన ♦ నేనృపుండు, తాపసులయందుదోషంబు ♦ దలఁచుచుండు
ఘనతపోత్కర్షకోర్వక ♦ ఖలులుప్రకృతి, శత్రువులుగారెమతి ♦ సాధుజనులకెల్ల.

మ. జనవర్ణాశ్రమరక్షణత్వవిహితా ♦ చారుండనై వర్తిరా
జను నే నెక్కడవన్యజన్యమృగహిం ♦ సాజీవితుం డేషనీ
చునితో సఖ్యముసంఘటింపదుమహా ♦ శూరాలికశ్లేకదా
వినుమీనక్కలకుదంతికిం బొసఁగునే ♦ విఖ్యాతిగా సఖ్యముల్. ౨౧౫.

సీ. అరయనీమందున ♦ త్యాప్తుఁడే కాఁడన్న, నజ్ఞానమునమూఢుఁ ♦ డాత్మలోన
నెదిరివారివిశేష ♦ మెఱుఁగకయుండుట, నదియవజ్ఞత గాదు ♦ నవలివారి

ధీరత్వమును బోదు ♦ తెలియ సృగాలంబు, లెఱుఁగకుండినను గే ♦ సరికిఁ బోల
మఱియేమియున్న స ♦ మానవీర్యాన్వయ, పౌరుషంబుల నెన్నఁ ♦ బడుచు నెవ్వఁ
డధికమౌ సపర్య ♦ కవితిరస్కారంబు, మొనసి సింహాయుగళ ♦ మునకుఁ బోల
నెంచి చూడ నైన ♦ నీదృక్ప్రకారంబు, నీచవృత్తి నెట్లు ♦ నిలుచు ననిన. ౨౧౭.

మ. ధరలో నెవ్వఁడు నీచచేతను నిరు ♦ ద్ధంబై యశోహాని దా
నరయంగానగునంత మైత్రియగునా ♦ నవ్వేళ దూష్యంబులై
పరఁగుం బోగుణరాజి యంచు మదిలో ♦ భావించి యానీచునిన్
నిరసించున్నతిబుద్ధిమంతుఁడు మది ♦ న్నీతిన్వివేకించుచున్. ౨౧౮.

వ. ఇట్లు గావున. ౨౧౯.

ఉ. సంధికి విగ్రహంబునకుఁ ♦ జాలఁడు గావున నీవు వానిసం
బంధము గాఁ దిరస్కరణ ♦ భావము దోఁపఁగఁ బల్కు నీయసం
బంధములైన వాక్యములు ♦ భావగభీరత సైఁచి నాఁడుఁ దా
బంధురబాహుశక్తి గొన ♦ భావమునందలపోసె నేనియున్. ౨౨౦.

క. శరమునకు వచ్చు విపక్షీ, కరమగు ఫణిమణులు గొనఁగఁ ♦ గాంక్షించెడు వాఁ
డరయఁగఁ బొందెడు ఫలమును, మఱి తాను బొందునపుడు ♦ మానని కడఁకన్. ౨౨౧.

వ. అంత. ౨౨౨.

శా. ఈరీతిన్ హృదయంబు తేఁటగను నెం ♦ తేఁ బల్కు నప్పార్థుతో
ధీరత్వంబు నిన్ను గెల్వక యపో ♦ దేయంచు నాశైలసం
చారుం డేగను వీరసైన్యాయుతుఁడై ♦ సామీప్యమందుద్ధతా
కారం బొప్పఁగ నుండునట్టియలము ♦ క్కాంతి స్వనం జేరఁగన్. ౨౨౩.

వ. తదనంతరకథావృత్తాంతంబు విన్నవించెద. ౨౨౪.

క. శరణాగత సంరక్షణ, బిరుదాంకవిశాలవక్ష ♦ భీకరదైత్యో
త్కరతిమిరహరణపటురవి, కిరణాయతతేజసావి ♦ కృతమృగరాజా. ౨౨౫.

స్రగ్ధర. జలదప్రస్ఫీతనీలో ♦ జ్జ్వలధమలవళీశి ♦ స్ఫారవిస్తారశోభా
లలితేంద్రోదారచాపో ♦ ల్లసదనమశుభా ♦ లంకృతోద్యద్విభూషా
విలసద్దంభోళిధారా ♦ విలసితనఖరో ♦ ద్విగ్నదైతేయవక్షః
స్థలనిర్యద్రక్తసిక్తో ♦ ద్ధతకరభయదో ♦ దగ్రమూర్తిప్రభావా. ౨౨౬.

గద్యము. ఇది శ్రీమదహోబలలక్ష్మీనృసింహకటాక్షలబ్ధకవితావిచిత్ర మౌద్గల్యసగోత్ర గోపాలునికులపవిత్ర భాస్కరామాత్యపౌత్ర వీరనమంత్రిపుత్ర పరమభాగవతపూజా విధేయ సింగయనామధేయప్రణీతం బైనకిరాతార్జునీయంబను మహాకావ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

# పంచమాశ్వాసము.



క. శ్రీకరకారుణ్యామృత, శీకరసేకానుమోద ♦ జీవితభక్తా
లోకనయుగళచకోరా, నాకాధిపవిజయదక్ష ♦ నరహర్యక్షా. ౧.

వ. అవధరింపు మివ్విధంబున నయ్యగ్రజునుచేతిరస్కరింపంబడి యక్రూరాతుండు చనిన
యనంతరంబ. ౨.

మ. చనియావార్తలు చెప్పినంతట వెయా ♦ శర్వుండుదానాజ్ఞయా
ఘనదర్పోద్ధతసింహనాదములచే ♦ గర్జిల్లినాసైన్యముల్
చెనయంగాలయకాలవాతహతవీ ♦ చీసంహతింబొంగున
వ్వనధింబోలెనునుబ్బునంబొదలెదు ♦ ర్వారంబుగాశూరతన్. 3.

మ. జయకేతుప్రచయంబుచంచలముగా ♦ సాంద్రాంబుదబృందసం
చయసంయుక్తతనొప్పమీఱివిలస ♦ త్సౌగభ్యసంపాదియై
రయమొప్పంగనువీఁచెమారుతముశౌ ♦ ర్యస్ఫూర్తిశోభిల్లఁగా
భయదప్రక్రియఁబొల్చుతద్బలపురో ♦ భాగంబునందత్తఱిన్. ౪.

చ. జయజయయంచువందిజన ♦ సంఘముబల్కెడుమేటిశబ్దమున్
భయదకఠోరబాహుబల ♦ భాసితసద్భటసింహనాదమున్
రయమునసజ్యచాపగుణ ♦ రావముఁగూడుకనేకమైశిలో
చ్చయములనింపుచున్బృథివి ♦ చంచలమందఁగనిండెదిక్కులన్. ౫.

ఉ. అప్పుడుతద్బలాగ్రనిశి ♦ తాయుధకాంతులుసైన్యదేహముల్
గప్పుచుఁబాళవిస్తృతవి ♦ కాసతనొందిదిగంతరాళముల్
గప్పఁగనిండిదీపితము ♦ గావెసఁజేయుమభానుదీప్తులన్
జొప్పననప్పుడెంతయును ♦ శోభిలెఁజూపఱపిండుచూడ్కికిన్. ౬.

ఉ. చండభుజాంతరంబునకుఁ ♦ జయ్యనఁదీసినవిస్తరింపుచున్
మండలలీలనొప్పిఘన ♦ మార్గణపూర్ణతమించునట్టికో
దండముఁబూనుచున్భ్రమథ ♦ తండములోపలనుండిరేనిమా
ర్తాండునిలీలఁగన్పడియెఁ ♦ దద్బలమెల్లనుమించిభర్గుఁడున్. ౭.

చ. సమవిషమప్రచారసమ ♦ సాధకశక్తినివేగిరింపుచున్
దమకుచు నేను నేననుచుఁ ♦ దర్జనలాడుచు నిట్టిపోదమ
న్గమకము సేయుచున్ బ్రమథ ♦ నాథులుమీఱినమర్లఁ బట్టు నా
తుములము చేత వవ్వనము ♦ దూలెనిరుచ్ఛ్వసనాత్తమాగతిన్. ౮.

చ. కలయఁగిరాతసైన్యములు ♦ గ్రమ్మినఁబల్వలకుంజతీరముల్
వెలయఁగనాతిరిక్తతను ♦ వేగమెపొందుచునంతలోనన
బ్బలమటుదర్లఁగానపుడు ♦ పల్వలభావముఁబొందినట్టులై
పొలుచుచునట్టివేళవన ♦ భూమిగనంబడెనుజ్జ్వలాకృతిన్. ౯.

చ. ఉరుకఠినోరుఘాతితస ♦ ముత్పతితోగ్రలతావితానముల్
గురుతరవేగమారుతవి ♦ ఘూర్ణితచందనసాలవృక్షముల్
తఱమగ నెల్లెడన్వడలు ♦ తద్గణనాయకయూథమవ్వనం
బురవడిమీఁదికెన్నగయు ♦ చున్నదియో యనఁజేసెనయ్యెడన్. ౧౦.

వ. అంత. ౧౧.

సీ. దర్పసంయుక్తుఁడై ♦ తపమునఁగృశియించి, మదవినిస్రుతిఁజిక్కి ♦ మత్తగజము
చందంబునను మించి ♦ జగతిరాజన్యుల, వధియించుకొఱకు ప్ర ♦ జ్వలితమగుచు
దిక్కులు గాల్చుచు ♦ దీపించు ప్రళయాగ్ని, కరణి తేజము దిశల్ ♦ గప్పి వెలుఁగఁ
బరునిలెక్కింపక ♦ బాణంబుఁ జేఁబూని, యనుకూలమగు సఖు ♦ నందుఁ బోలెఁ
గదనజయము మీఁదఁ ♦ గాంక్షను సేయుచు, శరమునీకచులక ♦ పఱచునట్టి
జలధిఁ బోలుబోయ ♦ సైన్యంబుపై సారె, కోపదృష్టినిరవు ♦ కొలుపుకొనుచు. ౧౨.

వ. మఱియును నాపత్ప్రతీకారసాధనోపాయంబున నుండు గాండీవిచండకోదండంబును ధైర్యంబునుం బోలె నధిష్ఠింపుచుఁ బ్రకృతిస్థితం బయ్యును నవిలంఘనీయంబై నివాతంబునఁ జలియింపకుండు సముద్రంబునుం బోలె నా సమీపంబునం బడియున్న వరాహంవధనిమిత్తంబునఁ జలియించు విలయకాలాంతకుండనం బ్రజ్వరిల్లుచు ఋత్విక్సమాహూయమానుండై యధ్వరంబునకుం జనుదెంచు నిజపురస్థితపశుత్వంబునం జెన్నొందు రుద్రుండునుం బోలె నైసర్గికధైర్యగుణవినిర్జితేతరగౌరవుండై దురవగాహంబైన గాంభీర్యంబున వీరుల్లతాసాంద్రంబైన యరణ్యంబు పెంపున నతిదుర్గ్రహంబగు భూధరంబు ననుకరింపుచు ఋషభకకుదున్నతభుజాండును స్థూలకంధరుండును బృహచ్ఛిలావప్రకఠినవక్షుండును నై ఖలజనభరాలసంబైన జగంబు దుష్టరాజన్యగర్వార్ణవంబున మునుంగకుండ నుద్ధరింపం గోరుమహావరాహంబుచందంబున నింద్రనీల

శ్యామలవిగ్రహుండై యఖిలసత్త్వంబులఁ బ్రకాశింపం జేయుచు, జలనిర్మలాదర్శం
బునం దేజరిల్లుభాస్వంతునియందంబున మనుష్యభావంబునం బ్రకాశించునప్పురాణ
పూరుషుం డైననారాయణసహచరుం డగునన్నరావతారుం డితం డన నొప్పుచు
నిఖిలక్రియారంభఫలాలంకృతంబై జగద్విజయప్రతాపస్థానత్వంబున నుద్దీపించు న
య్యర్జునునిమీఁద నక్కిరాతబలంబు లుక్కుమిగిలి యొక్కమొగిఁ బన్ని మహాపర్వ
తంబునుం గప్పునీలాంబుదబృందంబుచందంబునం బొదివె నప్పుడు. ౧౩.

క. ఏగతి నైననునితని నె, వ్వేగెల్చెదననుచు మునుపు ♦ నెఱిఁ బల్కెడు నా
నాగణయూథపు లపుడే, మూఁగుచు మోహాంధులైరి ♦ మొగి నాతనిచేన్. ౧౪.

క. ఇటువలె నిశ్చయమే కద, దిటము గఘనుఁ డైనవాని ♦ తేజము మఱియు
త్కటమగుచుఁ బ్రతిబలభట, పటుతరపౌరుషము లీలఁ ♦ బఱచు నె కాదె. ౧౫.

క. ఒండొరుబాసట చేయుచుఁ, జండావష్టంభశక్తి ♦ సాహాయ్యంబు
న్దండతనం దఱుఁగవయుచు, వెండియు నతనికి నెదిరిరి ♦ వీరుల్ప్రమథుల్. ౧౬.

తే. ప్రబలసాహాయ్యయుక్తిఁ ♦ బరఁగునట్టి, కార్యసిద్ధులు దామెట్టి ♦ ఘనుల నైనఁ
గదిసినప్పుడు సైన్యసం ♦ ఘములతోడఁ, గలఁగి తిరుగుడుపడఁ జేయుఁ ♦ గాదె యవని.

వ. ఆ సమయంబున. ౧౮.

మ. వరకాండాసనముక్తలంబకశర ♦ వ్రాతంబు పత్రధ్వనుల్
వఱలన్ స్వర్లోకకానసంబునకుఁ బో ♦ వం గోరి పెన్గుంపులై
కెఱలం బాఱుచు మింటికిన్నెగయు ప ♦ క్షివ్రాతముం బోలె న
త్త్వరలీలన్ దిశలెల్ల నిండి యొగసెన్ ♦ దండోపతండంబులై. ౧౯.

ఆ. శైలగుహల యందు ♦ సానుదేశంబుల, నిండెఁ బ్రతిరవములు ♦ మెండుకొనుచుఁ
జండవేగజనిత ♦ చాపనిర్ఘోషంబు, దిశలు బగుల మ్రోసె ♦ దీర్ఘమగుచు. ౨౦.

ఆ. భూనభోంతరాళ ♦ పూరితోపాంతమై, గహనభూరుహములు ♦ గంపిలంగ
ననిలనూచితాంబు ♦ దాతివృష్టియుఁ బోలెఁ, బ్రమథబాణరవము ♦ బరఁగె దిశల.

వ. అప్పుడు. ౨౨.

చ. అదనబుతుత్రయంబు పవ ♦ నాశనుఁ డౌటను జాలడస్సినన్
వదలుచు జాలుకంచుకము ♦ వార్యరణోత్సుకతాతిరేకతన్
బొదలుచుఁ బొంగి పిక్కటిలి ♦ పూర్ణత నొందఁగఁ జేసె నయ్యెడన్
గదనన తుస్సుఖుండయిన ♦ గాండివి దేహము ఛీవశాకృతిన్. ౨౩.

మ. ధనురుత్కంపితుఁడైనపార్థునిరణో ♦ దగ్రప్రభావృష్టిత
ద్ఘనసైన్యంబువినాశసూచకనిపా ♦ తస్ఫూర్జదులాకృతిన్
దనరస్త్రాగ్రణభూనభోంతరదిగం ♦ తవ్యాప్తమైరోషముల్
బెనఁగంగప్పెనుదుర్నిరీక్ష్యమగుచున్ ♦ భీతిన్వెసంజేయుచున్. ౨౪.

సీ. ఈరీతినబ్బలం ♦ బెల్లనుగప్పుచుఁ, బ్రళయాంతకునిలీల ♦ రౌద్రమగుచు
దిక్కులెల్లనునొక్క ♦ దెసకుఁగూర్చెకులీల, గవిదీప్తినెగఁజిమ్ము ♦ క్రమముమీఱ
ననిలంబుభూగోళ ♦ మంతయునిండుచు, ఘూర్ణిల్లఁజేసెడు ♦ కొమరుమిగుల
నద్రులతోఁగూడ ♦ నవనిగంపిలఁజేయు, కరణినిబహుచిత్ర ♦ గతులనలరి
పార్థుఁడప్పుడుగ్ర ♦ బాహుదర్పంబున, నేనెనేనెగెల్తు ♦ నితనిననుచు
నొక్కపెట్టుగవియు ♦ నక్కిరాతకబల, బహువిధాయుధములు ♦ పరఁగఁజూచి.

క. ఘనకార్యఫలవినాశన, మునుజేసెడునట్టికాల ♦ మునుబోలెనుదా
సునిశితసాయకములనడు, మనెవేగమెతునియ నేసె ♦ మదమెలరారన్. ౨౬.

చ. అవిదితసత్ప్రయోగవిప ♦ దావహకారణమైయదృశ్యమై
తవిలిసమగ్రసత్ఫలయు ♦ తత్త్వవిదూరగతందలిర్చున
య్యవిరళశాంజాలముల ♦ నప్పుడుడస్తతివృద్ధినొందెతాఁ
బ్రవిమలనీతిచేఁజతురు ♦ పాయములందగనొందుకైవడిన్. ౨౭.

వ. అప్పుడు. ౨౮.

చ. అలరఁగభూనభోంతరము ♦ లందొదిగంతములందొకానిలే
కలరవిబింబమందొమఱి ♦ యాధనువందునొయొక్కసారిగాఁ
గలయవిముక్తమయ్యెమఱి ♦ కాకమునీంద్రునిదేహమందునా
వెలసెమునీశరౌఘమిది ♦ వింతనిరొమ్ంచిరితద్గణావళుల్. ౨౯.

చ. అరయఁగమర్మభేదులగు ♦ నట్టివియేనిరుఁదద్గణాధిపో
త్కరములమర్త్యలౌలవెస ♦ గాఁడుచుఁ గ్రుంపకయుచ్చిపాటియా
శరములుస్వామికార్యమును ♦ జక్కఁగఁజేయనివానికైవడిన్
వసుసవధోముఖంబగుచు ♦ వ్రాలెనునాహిమశైలభూములన్. ౩౦.

వ. ఇవ్విధంబునఁ బ్రకాశింపుచు నస్తపోధనధనంజయప్రచండకోదండవినిర్గతమార్గణాసారం బక్కిరాతబలంబుపయిం బ్రసరించి మహాసంకటంబుగాఁ గంకటంబులు దూఱి శా టుచు, పిష్టపేషణదోషంబుఁ దలంచి తద్వ్రణంబులయందుఁ బునఃప్రహారణంబు సేయ

నొల్లక కార్ముకపూర్ణంబుగాఁ దూర్ణప్రయోగలాఘవంబుఁ దెలుపుచు, తద్బలంబు నంతటం గలయం జుట్టుముండి మార్తాండప్రభాజాలంబు పంకజావళింబోలె సంకోచంబు నొందించుచు, స్వరూపప్రచారంబుల నవక్రంబై తేజస్స్ఫారంబులం బ్రకాశించుచు, నమోఘంబై మహారయంబున ఛేదనభేదనపాతనాదికర్మంబుల సమర్థంబై మహావీరోత్సాహంబునుంబోలె నుద్దీపించుచు, నప్రతిహతంబుగాఁ బ్రసరింపం బ్రయోగించుచు, నయ్యర్జునుండు మహోగ్రేషుమయూఖౌఘంబులు వెలుంగ నేకదేశస్థుండై యుండియు ననేకదేశాగతంబైన యయ్యరాతికిరాతబలంబులయందుఁ బ్రతిభటముఖోద్దీపితుం డగుతపను ననుకరించుచు, కోపోద్దీపితుండై మహారయంబునం బ్రవర్షించు శరవర్షంబునం బ్రచండానిలంబుచేతం గ్రీష్మోద్ధితం బైనపరాగంబునుంబోలె, తత్ప్రమథసైన్యంబు విభ్రాంతిం బొంది, యితండు తపోబలంబున బాణంబుల నదృశ్యాకారంబులు గావించి ప్రయోగింపుచున్నవాఁడో, కాదేని తదీయమాయావినిహతంబులై యస్మదీయాయుధంబులు మగిడి మమ్ముఁ దాఁకుచున్నయవియొ, కాక యితనివలని గుణాతిశయంబుననో భయంబుననో తిరోహితులై యమరులు ప్రయోగించుచున్నవారో, కాని యితరంబైన సముద్రతరంగంబులచందంబున నేతత్సాయకంబు లనేకానీకంబులై పరఁగు టెట్లు? ఇతండు ఖండనంబు చాలించెనేని చరాచరంబులకు క్షేమం బగు, అట్లు గాదేని యిప్పుడ జగత్ప్రళయం బాపాదించునని భయంబునం దల్లడిల్లుచు, కోపోద్ధతుం డగువానిచేత శాంతప్రధానం బైనకార్యంబునుంబోలె మదోద్ధతునిచేతం బ్రియవచనంబుచందంబునఁ బ్రబలం బగుదైవంబుచేతం బౌరుషంబువిధానంబున నాజిష్ణునిచేతం బ్రకాశింపకుండె. తత్సాయకసమూహంబులం బలభటనికాయంబులకాయంబులం గప్పి మార్తాండమండలప్రచండప్రభాతండంబు పరిశోషితంబైన జలంబులపయిం బ్రసరించుచందంబున, మండలాకారత్వంబు దిక్కులం బిక్కటిల్లుచుండ మహోత్సాహంబునం బొంగి జగదభ్యంతరపరిచ్ఛన్నంబుగా సంధానమోక్షణంబు లెఱుంగరాకుండ నతండు పరిమండలీభూతంబుగాఁ బ్రయోగించు నిశితాంబకనికురంబంబున నత్యంతభీతిం గంపితవిజయం బగునశ్వపమనయానీకం బయ్యర్జునునిచేత నిర్జితంబై యాయుధంబులు విడిచి రణంబు చాలించి నిజపురోవర్తుండైన శంకరుం గనుంగొన నెఱుంగక భయభ్రాంతిం జెందుచు, నుక్కుచెడి పెక్కుతెఱంగుల నలుదిక్కులం బఱచిన నప్పుడు. ౩౧.

మ. జయవాంఛల్విడనాడుచుక్ బఱచునా ♦ సైన్యంబులంజూచి సత్
దయబుట్టెన్ మదిలోన నర్జునునకుం ♦ దర్కింపనట్లైకదా,

భయములైచిక్కనిచశత్రులదయం ♦ బాటించిరక్షించినన్
నయమున్ గీర్తిమహాత్ములౌనరులకె ♦ న్నంగా దియుద్ధంబులన్. ౩౨.

క. కరవాలచాపబాణో, త్కరములతోఁబఱచు నెడలు ♦ గనితెఱుముచును
గ్రక్కతినిలిచినసాధించుచు, హరుబలమునునొంచి మెఱసె ♦ నతిశుభయుతుఁడై. ౩౩.

క. నరుఁడిట్లుభీతిఁబఱచెడు, పెరసైన్యమువందగతిని ♦ పిఱుఁదందఁటి మెన్
ధరణిమహాత్ములువిరిగిన, తఱుముచుమఱినొంపమదిని ♦ దలఁపరుగాదె. ౩౪.

వ. ఇవ్విధంబున వెఱచఱచి చిచ్చువడి విచ్చిపఱచు తత్ప్రమథానీకంబులం జూచి విస్మయ
మానమానసుం డగుచు సుస్థిరయశుం డగుట నబ్బలంబులు తిరుగుడుపడుటకు నుబ్బ
దక్క తత్సైన్యంబు నిలువరింపం దలంచి యుద్ధంబు చొచ్చి తద్గణంబులకుం జేయి
వీఁచి యెలుం గెత్తి సేనానాయకుండైన కుమారస్వామి యిట్లనియె. ౩౫.

క. సమరముచాలింపకుఁడీ, సమయోధులుమీరలసుర ♦ సంఘము నెల్లన్
సమయింపువారలితరుల, క్రమమునపకీర్తినొందఁ ♦ గా నేమిటికిన్. ౩౬.

క. దినకరకరసంపర్కత, నినుమడితేజమునఁబోలుదు ♦ రీరలువృథగా
ననినోడిపఱచుమీకీ, ఘనఖడ్గముతేలనవ్వఁ ♦ గారణమగుచున్. ౩౭.

క. వనచరసేనలఁగావక, వనమృగములజాడఁబఱచు ♦ వారికిమీకీ
ఘనశరములనగు వేదన, వినఁడెందునమానుననుచు ♦ వెనఁబరికింతున్. ౩౮.

ఆ. అతులమైనకీర్తి ♦ యమితప్రభావంబు, దీలువడఁగనిట్లు ♦ తెఱలుమీకు
నెందువలనఁబోవు ♦ నీయపకీర్తిదా, మెఱసిసాహసమునఁ ♦ దిరుగకున్న. ౩౯.

ఆ. అసురవరుఁడుగాఁడు ♦ నహికులుండును గాఁడు, కొండవంటిరక్క ♦ సుండుగాఁడు
అనికినుత్సహించు ♦ నలరాజసుండైన, పురుషుఁడదియుఁ గాక ♦ భూవరుండు. ౪౦.

క. ఈతనికీగతివెఱచుచు, భీతింబఱవంగనేల ♦ పిఱుతివక బలో
పేతులయియెదిరినిలిచిన, నాతనిమ్ముగ గెలువవచ్చు ♦ నశ్రమభంగిన్. ౪౧.

క. సునిశితబాణాసారం, బనుకంపతమందగతుల ♦ నడరింపుచుఁదా
వెనుకొనిపశువులఁదోలెడు, ననువునమిముఁదోలియాడు ♦ నజ్ఞతగదురన్. ౪౨.

క. హతుఁడైనవాఁడుపురుషుఁడె, హతికివ్వెఱచఱచిపఱచు ♦ నతఁడొకభటుఁడే
పతియును ధామమ్మనవివి, హతుఁడగునాతండుపురుషుఁ ♦ డగుఁగాకెన్నన్. ౪౩.

ఆ. పుట్టుసహజగుణముఁ ♦ బోనొట్టుకొనుకంటె, మిగులమూఢుఁడైన ♦ మేలుఁతలఁప
మణులులేకసేయు ♦ మణిభూషణముల్పాపు చెక్కుమణులు సేర ♦ జెలువుగలదె.

చ. పరబలభంగవిస్ఫురద ♦ భంగశతాంగములిందు లేవున
త్వరితతురంగపఙ్క్తులును ♦ వారణబృంహితగంధసింధురో
త్కరములు లేవ యప్రతిహ ♦ తంబగు సైన్యము లేదయీగతిన్
బలువఁగ నేల శత్రుజిత ♦ పౌరుషులై యపకీర్తి నొందుచున్. ౭౫.

క. దివియందును దైతేయుల, నవిరళగతి గెలిచి విజయ ♦ మందెడు మీకీ
భువినీచులకన్నిరిపులపైఁ, గవియక మతిపాటిపోవఁ ♦ గాఁదగ దిటులన్. ౭౬.

వ. అదియునుంగాక భవదీయాధిపుం డైనశంకరుండు పన్నిన శాత్రవునకు వెన్నిచ్చి పఱచుచుండు మిమ్ముం జూచి దురాచారధారాపరిపాలనంబునం బొందువిధంబున నిష్పౌరుషత్వంబునం బొందుచున్నవాఁడు. పరిపంథినిర్మథనసమర్థంబులై భయంకరాకారంబులం బొల్చుచు నిర్భయంబునం బరిరక్షాదక్షులై దైవమానుషాతీతప్రజ్వలితాన్యోన్యసదృశగుణాతిశయంబులం బ్రకాశించు మీ రిట్లు భేదింపంబడి ప్రతాపాభిమానంబులు విడుచుచుం బఱవ నిమిత్తం బేమి? నిశితాసికాశలంబున నప్రతిహతం బగు తేజంబున వెలుంగుచు, రణపటిష్ఠుల మగుమమ్ముం బ్రతిఘటించి ప్రబలుండై రిపుండు విజృంభించి భాస్వత్కృపచుండును మహోన్నతపక్షుండును నై విశ్వప్రాణాపహరణకారణమహారణనం బగురణంబునం జలంబునం జలింపకున్నవాఁడని రోషణంబున భీషణంబుగా మోహరించి నిలువం దగు; అట్లుంగాక, తదీయఘోరశరాసారవిదారితంబులై యరదంబులుం బఱవఁగా కుండునట్లుగా గుప్పఁగూలం బడియున్న తురంగంబులవలనను, దంభోళిధారాసంభిన్నంబులై కూలిన కుంభినీధరంబులలీలం గనుపట్టు గంధసింధురంబులవలనం బ్రవహించు శోణితధారాప్రవాహంబులచేత నాకులంబై వియచ్చరుల కుత్సాహంబు దీపింప, నాయోధనధూర్వహానవాహినీనివహాన్యోన్యవినిర్జితవిస్ఫూర్జితపరస్పరవాక్కలహంబులను, మదగంధబంధురసింధురఘటాసంభరణవిజృంభణంబునను, ఇతరేతరవిజయోత్సాహంబులను, పరివర్తితానుకారసముత్పతితంబులగు బంధురకబంధంబులం గనుంగొని ప్రకంపితసారథికంబుగా భయాతురత్వంబున నరదంబు లడ్డంబుగా నీడ్చుచుం బఱుచుతురంగంబులవలనను, శూన్యతూణంబులుగా బాణంబులం బ్రయోగించి పరిపంథిమార్గణప్రహారణంబుల విహారణంబు లుడిగి హాహాకారంబుల మొత్తంబులుగాఁ గూలు రాహుత్తులవలనను, మహావీరుల కుత్సాహంబును, భయభ్రాంతులకుఁ గ్రోధోపహారణంబును నగునట్లుగా మహోత్సాహంబునం జెలంగు సింహనాదంబులను, ధనుష్టంకారంబులను, పుంఖానుపుంఖితంబులై యసంఖ్యాకంబులై పఱుగు గురుశరగురుఝ్ఝంపానిత స్వనంబులవలనను, గజఘంటికారావహారావంబులను,

రథనేమినిస్వనంబులను, పటహారవంబులను, భేరీభాంకారనాదంబులను, కేతనపటపటపటాత్కారంబులను, బహుతూర్యనినాదంబులను, బిరుదాంకితశంఖారవంబులను లోకభీకరంబైన సురాసురసంగ్రామంబునుం బోలె నతిఘోరంబుగాని యీ యాహవంబున కోపంటించి పఱచుట కీర్తివంతులైన శూరుల కుచితంబుగాదు. తిరుగుండని యక్కుమారుండు పురికొల్పం దెఱలి యనేకవిధంబులం బఱచు తత్ప్రమథానీకంబుల నిలువరింపుచు మందస్మితసుందరవదనారవిందుండై యంధకరిపుం డగునయ్యిందుశేఖరుండు భండనోన్ముఖుండై గండుమెఱసి యురవడించిన నా సైన్యంబులు రిపుశరాగ్నిజ్వాలాజాలంబుల వేఁడిమిం బోఁడిమిసెడి పరిపంథిబాణార్ణవంబున మునింగి యుద్దియునుం గానక దిగ్భ్రాంతులమై యున్న మమ్ముం దీరంబు చేర్చి రక్షించె నని యకలంకంబుగా నా శంకరుం గొనియాడుచు సంతసంబునం బురికొని వెన్నుదన్ని నిలిచె నంత. ౪౭.

క. హరుఁడు పినాకధ్వని చే, హరిశైలము పగులదిక్కు ♦ లద్రువఁగ నరుపై
శరవర్షముఁ బరఁగించెను, మెఱయుచు భూధరముఁ గప్పు ♦ మేఘము బోలెన్. ౪౮.

క. హరుఁడును నరుఁడును బోరఁగ, ధరణీధరసదృశులైన ♦ తత్ప్రమథులోగిన్
వెఱచఱచిచిత్రరూపుల, కరణిని విస్మయము నొంది ♦ కన్గొనుచుండన్. ౪౯.

క. నరుఁ డురవడించి యేసెడు, శరవర్షంబుడిపి యపుడు ♦ శంకరుఁడుం డిన్
గరలాఘవ మొప్పారఁగ, వరమార్గణసమితిఁ బఱపె ♦ వాసవిమీఁదన్. ౫౦.

క. పురుహూతసుతుఁడు దానవి, కరమురుడుగఁ ద్రుంచి యుద్ధ ♦ కౌశల మొప్పన్
హరుమీఁద బాణవర్షముఁ, గురియుచుఁ జరియించుచుండె ♦ ఘోరాకృతియై. ౫౧.

క. చలితశరాసనముక్తో, జ్జ్వలకాండసహస్రదంశు ♦ చయములు నిగుడన్
వెలుఁగుచుఁ దోఁచెను నత్తఱి, బలభేదనతనయుఁ డపుడు ♦ భానుఁడు బోలెన్. ౫౨.

మ. హరకాండాసనముక్తఘోరశితబా ♦ణాసారముం గప్పిన
ట్టి పురుహూతాత్మజమార్గణావలి విసన్ ♦ బుంఖానుపుంఖంబుగా
పసుసంబద్ధ్వముఁ జండభానుకిరణ ♦ వ్రాతంబులం గప్పుచుం
ధురధారాధరభంగి వింతయగుచుని ♦ ద్యుత్కాంతిదీపింపఁగన్. ౫౩.

క. ఈరీతి నతఁడు పఱపెను, ఘోరశరాసారమడిపి ♦ గురుబాణావ్యా
పారముననదనమార్గము, ధీరతనతఁడ త్రైపురారుఁడు ♦ ధృతిమీఱంగన్. ౫౪.

మ. నవురారా కోపాటోపభయంకరరోషశిఖిపిం ♦ ఛస్తోమసంజాతపుం
ఖములం బోల్చు శరంబు లేర్చి గుణసం ♦ గరంబొప్ప బలిష్ఠుఁడా

నమరంగూరిచిశంభుఁడేయనవియ ♦ య్యాకాశముంగప్పెఁబే
మమయూఖౌఘమువిస్తరిల్లఁగఁదటి ♦ న్మాలాసముద్దీప్యమై. ౫౫.

మ. నరుబాణంబులమీఱటిఘోరముగమే ♦ నన్నాటనవ్వేళవా
వరకేతుండునువిచ్చలింపఁగనగేం ♦ ద్రసూనార్తిశోభిల్లఁదా
హరికాంతుండును భాసితుండునుశివా ♦ గ్రాధిష్ఠితోద్దీప్యను
స్థిరధీరోన్నతదుర్గ్రహత్వవిజయ ♦ శ్రీమాభిరాముండునై. ౫౬.

ఉ. అంతటశంభుచేతవిక ♦ లాంబకుఁడైనరుఁడగ్నివోలెన
త్యంతముమండి పేర్చుచుబ్రు ♦ హజ్జటరాశివెలుంగనోషధీ
సంతతిబ్రజ్జ్వరిల్లుహిమ ♦ శైలముచాడ్పుననొప్పిమార్గణా
క్రాంతముగాఁబురారివిశి ♦ ఖంబులుద్రుంచుచునేసెనుగ్రతన్. ౫౭.

క. హరుఁడపుడుగ్రతఁజూపుచు, దురమునఁగౌశలముమెఱయ ♦ దోర్బలవిజయో
ద్ధురతంబొలిచెడునరుపైఁ, బఱపెనమోఘాంబకోగ్ర ♦ పత్త్రావళులన్. ౫౮.

మ. స్థిరభానూజ్జ్వలబింబసంభవితసం ♦ స్ఫీతాంశుజాలంబుసా
హరకాండాసనమండలాంతరవిని ♦ ర్యద్బాణసంఘాతముల్
మఱలం జేయుచునప్పుడర్జునుఁడుభీ ♦ మంబైనగాండీవని
ష్ఠురనిర్ఘోషశరాళిఁగప్పెధనుర ♦ స్తోకప్రభావంబునన్. ౫౯.

క. శంభుఁడునెంతయురణసం, రంభంబునఁబేర్చితచ్ఛ ♦ రంబులనెల్లన్
సంభిన్నముసేసియవ, ష్టంభంబుననునిఁబొదివె ♦ శరవర్షమునన్. ౬౦.

ఉ. అప్పుడునర్జునుండునుమ ♦ హత్తరశాతహరాంబకౌఘముల్
గుప్పలుగాలమాటికిని ♦ ఘోరతఁద్రుంచిమహాగ్రహోగ్రుఁడై
యొప్పుచుమానిసంఘముర ♦ జోర్వినిజూడననేకఫల్గునుల్
గప్పిరోయంచువిస్మయతఁ ♦ గన్గొనఁజేసెనుజిత్రచారతన్. ౬౧.

సీ. గాండీవమండలా ♦ ఖండనిర్ముక్తప్ర, చండకాండౌఘము ♦ ద్దండమగుచుఁ
జండీశకోదండ ♦ సంభూతమార్గణ, మండలిఖండించి ♦ మెండుకొనఁగఁ
జండదానవజయో ♦ ద్దండులౌప్రమథులు, సొరిదినచ్చెరువంది ♦ చూచుచుండ
శంభుపైఁజెనసియుఁ ♦ జయలక్ష్మిఁజేకొనె, నత్యద్భుతంబిది ♦ యనుచుమునులు
తనువులుప్పొంగిపులకింప ♦ మనములందు, నెంతయునుబిక్కటిల్లెదు ♦ సంతసమునఁ
బార్థభుజవీర్యశౌర్యప్ర ♦ భావములను, బ్రస్తుతించిరిపొగడిరి ♦ పాండుసుతుని.

వ. ఇవ్విధంబునం బోగడు వడసి యవ్విజయుండు శరాసారఘోరంబుగాఁ బోరునప్పు
డారాతికదనకౌశలంబుఁ గనుంగొని కోపోద్దీపితుండై యిట్లని వితర్కించు: ఏత
త్సంగరంబున మదవినిస్రుతశ్యామాయమానానూన కపోలభాగంబులఁ జెలువొందుచు,
మహోన్నతంబులై యాక్షేపించుచు, అక్షీణం బగుదర్పంబున రణదక్షంబులై మహా
పర్వతసన్నిభంబులైన మత్తేభంబుల మొత్తంబులు విహరింపవు. బహువిధకేతనమణి
చ్ఛాయాకలాపంబులం జిత్రభానుప్రదీప్తులకుం జిత్రత్వంబు సంపాదించుచుం బయోధర
గంభీరధ్వానానుకారపటునేమికారటనంబునం బరఁగుమహారథప్రచారంబును లేదు.
సముల్లసత్ప్రస్తోర్మిమాలికావిరాజచ్ఛామలఫేనపుంజంబులను రంజిల్లుసముద్రోదకంబు
వెల్లివిరిసినచందంబున దిక్కులు పిక్కటిల్ల ననర్గళప్రచారంబులఁ బరతెంచుఘోటక
పటలంబునుం గనంబడదు. హతాహతోద్ధతధ్వనితవీరయోధప్రతిభటసముజ్ఝితతటి
ద్దీపితభాస్వద్దివ్యస్వదంశుప్రజ్వలితాయతనిశాతహేతిప్రపాతంబునుం దోఁచదు. విలయ
కాలకాలప్రభాజాలవిశాలఘనరితరథనేమికాకంఖాణరింఖాసంఘాతసముద్ఘాటిత
సముద్ధితోద్ధూతపరాగపటలంబు వియత్తలంబునం బ్రసరింపుచు, వీరవరణోత్సుకా
గతసురవారసుందరీనయనతిరోధానత్వంబున నకాలరాత్రిం జేయదు. పృథుతరనేమి
కానిర్ఘోషభీషణం బగుతురంగమహేషారవంబులం బ్రబలంబుగా నిగుడు నవారణ
మదవారణబృంహితంబులు దుందుభినిర్ఘోషంబులం గ్రిందుపఱచవు. పౌరుషయశోభి
మానులగువీరయోధులాయుధప్రహతుల మూర్ఛిల్లినం దేరునట్లుగా జలవర్షధారా
శీతలం బగుతదనేకానేకపకరశీకరాసారంబునుం గనుపట్టదు. అనర్గళం బగుసేనా
మార్గంబు పంకిలంబై దుర్గమంబై దురవగాహంబగుచు రక్తనదీప్రవాహంబునుం
బ్రవహింపదు. మదద్విరదరదనక్షతంబు లగువక్షస్స్థలంబుల గగననిపతితంబు లగు
బృందారకసముత్సుకోత్సర్జితమందారకుసుమదామంబులు మత్తద్విపంబులకు నెదిరించి
సోలినవీరయోధులకు మూర్ఛలం దోఁప నీకయుండుపుటయుం గానరాదు. కరికర
శీకరనికరపరివ్యాపితాధోరణధారణభర్మనిర్మితవర్మరత్నప్రభాపటలంబుమీఁదటం బన్ని
భాస్కరతేజం బింద్రచాపఖండోత్పాదనంబు గావించుటయుం గనంబడదు. పక్షో
పలక్షితం బగుమైనాకంబుచేతంబోలెఁ బరసామజంబులచేతం గలంచంబడి సైన్యం
బులు దైన్యంబునం బరిభ్రమించుచు సముద్రోదకంబులచందంబున ఘూర్ణిల్లకున్న
యవి. ప్రతిభటసేనాగజంబులమీఁద నతిరయంబుగా నరదంబులు బఱపుమహారథిక
యూథంబులకుం బదావరోధకం బగునట్లుగా మూలంబులకుం దునిసిపడియున్న
హస్తిహస్తంబులును విస్తరిల్లవు. గజారోహకులు ద్రెళ్లినం గూలునంకుశమూలంబుల

బిరుదుచిహ్నంబులుగాఁ గట్టినమయూరపింఛాకలాపంబు కువలయశేఖరంబులం జెలు వొందు నిజకామినీశిథిలబంధం బగు కేశపాశంబువిధంబునం దదీయవక్షస్స్థలవిస్తృతం బునుం గాదు. కల్పాంతకాలంబునుం బోలె నసంఖ్యాకంబుగా మహావీరలోకంబు సమయుచుండ జగద్భక్షణలోలుపదీర్ఘజిహ్వాంచితోగ్రాననంబున నత్యుద్ధతం బైన మృత్యువిహారంబునుం దెలియంబడదు. మహారథికపరాక్రమంబును నిరసించు నస్మదీయసామర్థ్యంబు చంద్రతేజంబుపయిం బ్రచండమార్తాండదీప్తి వెలుంగనియట్లీనీచ సంగరంబునం బ్రకాశింపదు. ఇది విరుద్ధంబును నత్యద్భుతంబును నై యున్నయది. అట్టి మదీయశక్తివైకల్యంబు దైవమాయావిశేషంబో, కాక యస్మద్బుద్ధివిపర్యయంబో, లేక మత్పరాక్రమంబె నష్టం బయ్యెనో, యిట్లుంగాక నే నర్జునుండనుం గానో. మఱి యితరం బైనను గాండీవచండకోదండగుణవిముక్తనిశాతబాణవ్రాతంబు పూర్వంబున శత్రుసమూహంబులమీఁదం బోలె నిప్పుడీకిరాతానీకంబుపయిం బరాక్రమింప కుండు నే! అదియునుంగాక యితండు ధనుర్ఘోషంబున నాకసం బవియింపుచుం గిరాతవేషంబున నుండుమహాపురుషుండు గాని నిశ్చయంబుగాఁ జేష్టావిశేషంబు లూహించినకార్ముకం బెడతెగక మ్రోయునట్లుగా గుణాకర్షణోద్ధరణసంధానమోక్షణంబులు లేనయ్యె. కరలాఘవంబున శరౌఘంబులం బ్రయోగించెడు సుస్థిరానతాంస శిరోధరసంధానం బనాయాసఘటనంబుగా నిర్వికారం బగుముఖంబు సంపూర్ణ చంద్రానుకారం బై పొల్చెడు. కార్యవశంబున నాలీఢాదివిస్తారవిశేషంబుల సుస్థిర దేహుండై సౌష్ఠవంబు మెఱచుఁ జలాచలలక్ష్యంబుల సమపాతంబుగా శరంబుల నాటించెడుసమయం బెఱింగి పగని నొప్పించుచు నాత్మసంరక్షణంబు సేయుచుం బోరునైపుణ్యంబు భీష్మద్రోణాదులయందునుం గనుంగొనుట లేదు. వనచరుల కెట్లు సంభవింపనేర్చు. అట్లు గావున నితం డెల్లభంగులం గిరాతుండు గాఁడు. ఇట్లసాధారణపరాక్రమంబునం బోరునిమ్మహాపురుషుని విక్రమంబు దివ్యాస్త్రమహిమం గాని నివారింప నలవిగాదు. అల్పంబైనను రోగప్రాయం బగుశత్రువివర్ధనం బనర్థంబు గావున సహించుట యుక్తంబు గాదని నిశ్చయించి యనివార్యవీర్యశౌర్యధుర్యుం డగు నయ్యర్జునుండు ప్రమథగణపరివృతుం డగుశాత్రవుం బరిభవింపం జాలు సమ్మోహనాస్త్రంబుఁ బ్రయోగించిన. ౬౩.

సీ. భీమదావానలో ♦ ద్దామగంభీరమై, నీలజీమూతంబు ♦ లీల మెఱసి
తపనతేజోనిరో ♦ ధకలీలభూనభోం, తర మెల్లఁ గప్పియు ♦ ద్ధతి దలిర్ప

నిబిడాంధకారంబు ♦ నెరయంగ వనిఁ గప్పు, తెఱఁగున నయ్యస్త్రి ♦ తేజ మపుడు
హరసైన్యములమీఁద ♦ నడరి బల్విడిఁ బర్వి, ప్రజ్ఞావిహీనంబు ♦ పరఁగఁ జేసి
కడఁకఁ జేష్టలుడిపి ♦ గర్వంబుఁ దూలించి, సమరకౌశలంబు ♦ సమయఁ జేసి
కరణపటిమ దప్పి ♦ కడుభయంకర మైన, నిద్ర నొందఁ జేసె ♦ నెరయ నంత. ౬౪.

క. స్థిరతరగురుసారంబులఁ, గురువంశజులైన మిత్ర ♦ కులమును బోలెన్
వరధనువు లువిడువక యొం, దఱు ద్రూప్పడి యుండి రపుడు ♦ తత్పరవశులై. ౬౫.

ఆ. ధైర్యము వదలకయె ♦ ధరణీజములనూని, పొగరుకన్ను లన్ని ♦ మూసికొనుచు
గజములట్లు క్రిందు ♦ కరములు వ్రేలంగ, వివశులగుచుఁ గొంద ♦ అవనిఁ బడిరి. ౬౬.

ఆ. కాలయముని లీలఁ ♦ గడఁగి యుద్వృత్తి మైఁ, బాండవాస్త్రమపుడు ♦ ప్రతిఘటింపఁ
గర్మఫలము లెంచి ♦ కరములనుండక, కొన్ని యాయుధములుఁ ♦ గూలె నవని. ౬౭.

వ. అంత. ౬౮.

సీ. మాయాతిరోహిత ♦ చ్ఛాయాశశాంకమా, శివుని శిరము నుండి ♦ యవిరళముగ
భానుబింబప్రభా ♦ పటలంబు కైవడి, దీప్యత్త్రిశంగోగ్ర ♦ తేజ మడరి
యజ్ఞానమణఁచుత ♦ త్త్వజ్ఞానమును బోలె, నిర్జరాస్త్రజ మైన ♦ నిద్ర నుడిపి
తెలివి నెకొల్పఁ జేసి ♦ జలదములఁ బాటలి, తంబు గావించివి ♦ స్తరత నొంది
యుదయకాలము గతిఁ జూప ♦ నొప్పు పంధ్య, పగిదిఁ దత్సైన్యముల నేత్ర ♦ పంకజములు
వరుస వికసింపఁ గాఁ జేసి ♦ వఱలె నప్పు, డంతనద్దివ్యబాణంబు ♦ శాంతి నొందె. ౬౯.

వ. అంత. ౭౦.

తే. తెలివి మీఱంగ నా నిద్రఁ ♦ దెలిసి లేచి, మబ్బువిచ్చిన దిక్కులు ♦ మహితమగుచు
నుడుగుణంబులఁ దాల్చిన ♦ యొప్పు మీఱఁ, బ్రమథబలములు వివిధాయు ♦ ధములు దాల్చె.

తే. అంతనా రాత్రి గడచిన ♦ నంతరిక్ష, మబ్బ నెత్తె నుగతి దిక్కు ♦ లుజ్జ్వలతను
వెలసె వర్ణాంశుజాలంబు ♦ విస్తరిల్లె, మొనసి దినలక్ష్మి రెండవ ♦ దినముఁ గదిసె. ౭౨.

సీ. భుజవీర్యశాలియా ♦ విజయుం డున వ్వేళ, సమ్మోహనాస్త్రంబు ♦ శత్రుచేత
దుర్గంబు దిగ్గజో ♦ ద్ధురత చేఁ బోలెను, నప్రయాసతి భగ్న ♦ మయినఁ జూచు
నురగేంద్రబాణంబు ♦ నరి బోసి యేసిన, నదితటిద్దీప్యద్వి ♦ షాగ్ని లెగయఁ
గాలజిహ్వాభీల ♦ చాలనక్రియ మీఱ, గడుభయంబున దేవ ♦ గణములాడుఁగ
నాకసముఁ గప్పి దిగ్గజ ♦ హస్తరీతి, నీలమణిదీర్ఘకాయంబుఁ ♦ బోలి మెఱయ
లీలఁ గగనాబ్ధి కల్లోల ♦ మాలికనఁగ, కాలసర్పాళి గవిసెనా ♦ ఖీలమగుచు. ౭౩.

వ. ఇట్లు ఘోరంబుగాఁ గవిసి యా దుష్టోరగనికరంబు నిజపూత్కారోద్గారితధూమావృతాంశుజాలుండై యుష్ణకిరణుండు శీతకరుండై తోఁప జగత్ప్రాణాపహారణభీషణవిషదృష్టిపాత్రంబు లగు నేత్రంబుల వినిర్గతంబు లైనపిశంగకాంతులు దిక్కులు వెలుంగం జేయుచు, విశాలజ్వాలాకలాపంబులు విస్ఫులింగాభీలంబుగా నిగిడింపుచు, ననర్గళప్రచారంబులు మెఱయు విషాగ్నిధూమాకులదిగ్విభాగంబుగా భోగిభోగచ్ఛటాపరిచ్ఛన్నం బై నభంబు శత్రుపరివృతం బైనపుటభేదనంబు ననుకరింపం జేయుచు, శతసహస్రాయుతసంఖ్యాకంబు లై తద్బలంబులం గప్ప నప్పు డప్పశుపతియును దప్పకతార్క్ష్యోదయకారణమంత్రావిర్భూతం బగు వైనాయకాస్త్రంబు నరనాయకుండు నీతిపారగత్వంబున రిపుకృతనిజమండలావరోధం బుడుపు తెఱంగున నబ్భుజంగాస్త్రంబు భంగింపం బ్రయోగించిన నదియును గరుడశతసహస్రాయుతనియుతాకారంబు లై విద్యుత్సంకాశం బగు తేజంబున నాకాశనయనతిరోధానంబు గావింపుచు నభోభాగంబునం బర్వి గరుత్సంజాతవాతోద్ధూతంబు లై మహాగహనంబులు జీర్ణతృణౌఘంబులునుంబోలె నభ్రమార్గంబునం బరిభ్రమింపం జేయుచు, మనశ్శిలాధాతువిశేషచ్ఛవిసన్నిభం బగు తేజఃపుంజంబు పశ్చాత్పురోభాగంబులం గప్పి గగనంబునం జరించు విహంగమసంఘంబుల కపూర్వోద్ధత్యంబు గావింపుచు, నతీక్ష్ణపక్షవిక్షేపంబునం బరిభ్రమితసానుభాగం బై హిమాచలంబు మదరాగారుణితసురగరుత్కాంతిపూరప్రపూరితమహాగుహాంతరాళత్వంబునం బ్రమత్తత్వంబునుంబోలెం గంపింపం జేయుచు, నక్తందివాంతరం బైనసంధ్యాకాలంబునుంబోలెఁ బ్రకాశించుచు, భూనభోంతరాళంబులం బిశంగత్వంబు నొందింపుచు, నంశుసంతాంతర్హితంబు గావించి వనాంతరంబులం బ్రవేశించుభీమోద్దామధామంబునం బర్వి యధ్వరవిధ్యపచారదోషంబు ప్రాయశ్చిత్తకర్మంబు హరించు తెఱంగున నయ్యురగసమూహంబులం బరిభవించిన. ౭౪.

చ. అసదృశలీలఁ బూర్వకృత ♦ మైనశుభంబునుబోలె శాత్రవా
ల్లసితపరాక్రమంబు సఫ ♦ లంబుగఁ జేయుచు నాగసాయకం
బసదుగ సంహృతంబు యిన ♦ నస్త్రతి నెంతయుఁ గ్రోధదీప్తుఁ డై
యసమశిఖానలాంబకము ♦ నర్జునుఁ డేసె సముగ్రమూర్తి యై. ౭౫.

వ. అప్పుడు. ౭౬.

సీ. దీపితోర్ధ్వాధర ♦ తిర్యక్ప్రసారిత, జ్వాలాంతరాళోగ్ర ♦ నటనగా మెఱయ
నురు మేఘపఙ్క్తులు ♦ కులుకు సింహము బోలెఁ, బ్రాణికోట్లను మ్రింగు ♦ భంగి మెఱయఁ

బ్రళయాగ్ని నిగుడుచు ♦ భానుదీప్తిహరించి, విస్ఫులింగోదయ ♦ ప్రస్ఫురముగ
భిద్యమానాశ్మగం ♦ భీరధ్వనులుమీఱ, జంటపెన్మంటలు ♦ మింటికెగయ
వాయువశమునఁబసిఁడివ ♦ ప్రమునుబోలెఁ, గనకతుంగోగ్రశిఖరివై ♦ ఖరులఁదనరి
కాంచనానూనపట్టణ ♦ క్రమతకింశు, కోరుపుష్పితవనరీతి ♦ మీఱెనపుడు. ౨౭.

ఆ. పల్లవములరీతి ♦ భాసిల్లుశిఖలచే, మెఱసికాల్చునీల ♦ మేఘసమితి
నభ్రమార్గమునను ♦ శుభ్రమై చూపట్టెఁ, బ్రళయకాలరౌద్ర ♦ పటిమ మెఱయ ౨౮.

క. లోలాభీలవిశాల, జ్వాలలనాగ్నేయశరము ♦ సైన్యము నెల్లన్
కాలునిగతిసమయింపఁగ, నాఁటియువరుణాస్త్రమేసె ♦ సుస్థిరభంగిన్. ౨౯.

వ. ఆ సమయంబున. ౩౦.

సీ. పర్వతోభయసమ ♦ ప్రాంతవిద్యుల్లతా, మేదురంబగునీల ♦ మేఘపటలి
దీపితాగ్నేయోగ్ర ♦ తేజంబుమాయఁగాఁ, బటుచటత్స్ఫూత్కార ♦ బహుళమగుచు
దివినుండిగంగదాఁ ♦ బ్రవహించువిధమున, నవిరళజ్వాలిక ♦ లడఁగుచుండఁ
దప్తాయసముమీఁదఁ ♦ దలకొన్నవిధమున, నంబుధారాప్రవా ♦ హంబునోరఁగ
ఫూత్కృతులమించిమింటికిఁ ♦ బొగలునిగుడ, నడరియార్ద్రేంధనంబేచ్చు ♦ నట్లుఫేన
తతులునిగుడంగనభ్రసం ♦ తతులుబర్వి, భీకరాకారనిర్ఘోష ♦ భీషణముగ. ౩౧.

ఆ. చిత్రకేతుచాయ ♦ చీనాంబరములీల, ధూమసంవృతమయి ♦ తోఁచుచుండ
నింద్రచాపదీప్తి ♦ నెసఁగియాగ్నేయాస్త్ర, కాంతులపుడుచిత్ర ♦ గతులఁదనర. ౩౨.

క. జలవర్షముపైఁగప్పిన, బలుపగునిర్ఘోషమడరఁ ♦ బాండుప్రభచే
నలఘుతరధూమపటలము, వెలయంగాశాంతినొందె ♦ వెరవఱియచటన్. ౩౩.

క. సింధూర్మిచయవిభాసిక, బంధాఘోచ్ఛిన్నమగుచుఁ ♦ బావకశరసం
బంధాగ్నులుజలదచ్ఛద, సంధ్యావృతరాగలీల ♦ సమసెంజూడన్. ౩౪.

క. నీలాద్రిసదృశజలధర, జాలంబులుకలయఁబర్వి ♦ సంధ్యావృతమై
యాలోగగనమువికసిత, నీలోత్పలజనితశోభ ♦ నెరయవెలింగెన్. ౩౫.

వ. అంత. ౩౬.

క. నానావిధరణకోవిదుఁ, డానగ్జుఁడపుడుశత్రు ♦ హననోత్సుకుఁడై
నానాశరములనేసిన, వానినిడుచుమాడెహరుఁడ ♦ వారణలీలన్. ౩౭.

మ. హరుఁడీరీతిఁదదీయబాణమునఁబ్ర ♦ త్యస్త్రంబులంద్రుంపఁగా
నరుఁడున్ శ్వేతసరకేశిధ్యేషిమఱియుం ♦ తంబోకదివ్యాస్త్రముల్

నిరసింపఁబడె బాహుదర్పవిలస ♦ ల్లీల స్వసం బోలెదన్
వెరపుం జేవయు లావు శౌర్యము ధరన్ ♦ విఖ్యాతిఁ గాఁ బోలెదన్ . ౮౯.

సీ. అనుచు నూహింపుచు ♦ నాపదల్ బాపఁగాఁ, జాలెడు దివ్యాస్త్ర ♦ జాలమప్పు
డటువంటిమిత్రుల ♦ యందును బోలెను, సంతత శ్లాఘ్యములైన ♦ నంతనరుఁడు
పౌరుషంబును బోలెఁ ♦ బటుశరాసనమున, ధైర్యంబు నూల్కొల్పి ♦ శౌర్యమునను
సమరాభియోగోత్స ♦ వమునదీపించియు, శాత్రవోన్నతి కాత్మ ♦ సైఁపలేక
నుదిరికోపంబునను దేహ ♦ ముబ్బ దజిగి, పొగలఁగప్పిన నగవహ్ని ♦ పగిదిఁ దవరి
శత్రుభీషణవీర్యతే ♦ జములు వెలయఁ, బాదుకొని నిల్చి మతియైన ♦ బ్బాహుబలుఁడు.

ఆ. శత్రుదుర్గమునకుఁ ♦ జంచలంబందక, ధీరభావమపుడు ♦ తేఁటపడఁగ
వంశమానములను ♦ ఎదలనికీర్తిచే, భార్య చేతఁ బోలెఁ ♦ బరితపించె. ౯౦.

క. హిమగిరిఁ గెల్చెడుకొఱవి, షమనయనుఁడు నిగ్రహించు ♦ జాహ్నవిరభస
క్రమమున నపకృతవీర్య, త్వము నొందుచుఁ గోపమహిర ♦ దర్పోద్ధతుఁడై. ౯౧.

వ. ఇవ్విధంబున ధైర్యవీర్యశౌర్యంబుల నవార్యుండై పొల్చి నిల్చి యవ్విజయుండు శాబ్దికుండు శబ్దంబున భావార్థంబు సాధింపం దలంచు చందంబున సాయకంబుల విజయంబుఁ గొనం దలంచి సంగ్రామోన్ముఖుండై ప్రతాపోద్దీపితుం డగుచు పూర్వయుద్ధంబుల యం దిట్లు శక్తివైకల్యం బాపాదించు నే యనుచుం బరితప్తుండై భీషణ శేషోరగముఖోద్గూతమహావిషాగ్ని జ్వాలాకలాపంబునుం బోలెఁ గ్రోధంబు వదనంబున నిండి వెలుంగం గోపారుణిత నేత్రంబుల బాష్పంబులు దొరఁగ సంగరవిభ్రమంబునం బరిభ్రమిత శిరస్కుండై సాంద్రరోషసంతప్తం బగు ముఖంబు శైత్యోపచారంబు సేయం దోఁచు లెఱుఁగున ఘర్మోద్గమంబు నెరయం భృకుటిసంఘటితవికటితచటులాననంబు మెఱయఁ గ్రోధాంధకారావృతుండై నీలనీరదపరిచ్ఛన్నత్వంబున వర్షోన్ముఖుండైకం బగు నూర్ధ్వప్రసారితగభస్తిస్తోమంబులు విస్తరిల్లం బ్రకాశించు చండమార్తాండుండునుం బోలెఁ బ్రదీప్తుం డగు నయ్యాఖండలనందనుండు దిగ్వేదండశుండాదండసముద్దండం బైన బాహుదండంబున భద్రగజం బద్రిశిఖరంబునుం బోలెం బయోధరగంభీరధ్వానంబునం బ్రచండం బగు కోదండం బఖండంబుగా మ్రోయించుచు, నప్పురారాతిపదాతి చేతోజాతంబులం జిత్తజుండు ప్రియజనధ్యానంబుల చేతం బోలెం బ్రళాతబాణపాతంబులం బ్రతప్తంబు నొందింపుచు, నప్రతిహతఘోరశరాసారంబులం బరఁగించిన శాస్త్రిజ్ఞానియందు వాదిత్వంబును, వీతరాగులయెడల గణికాచేష్టయు, నగోచరం బైనపరబ్రహ్మంబునందు వాక్యంబునుం బనిగొనక నిష్ఫలంబున నమ్మహాదేవుని దేహంబునం దత్యా

యుకసముత్కారంబు నిష్ఫలంబై హైమంతభాస్వంతాంశుజాలంబువిధంబున మహోన్నతం బైనశైలంబునుంబోలెఁ బ్రకాశించునప్పినాకపాణి నొప్పింపం జాల దయ్యె. అప్పు డప్పశుపతియును వప్రక్రీడాసముద్ధతం బగుదురంతదిగ్దంతిదంతప్రభేదనపాటవప్రహారంబు హరియించుతెఱంగున నతనియవక్రపరాక్రమం బుపసంహృతంబు గావింపుచు, రణోద్ధరణసమర్థం బగుప్రతాపం బద్దివిజరాజనందనుననుం దల కొనునట్లుగా బ్రహ్మాదిమూలకారణుం డగునాస్థాణుం డపాండవేయుమీఁదివాత్సల్యంబునం దదీయాభిభవంబు సైరింపుచు. ౯౨.

క. ప్రతిహతుఁడయ్యె ననీతఁడు, వితతపరాక్రమము వెలయ ♦ వేడుకతోఁదా
నతులయశంబునుద్దీ, పితుఁడయ్యెడుసూర్యుపగిది ♦ భీకరలీలన్. ౯౩.

ఆ. ఇతనిపౌరుషంబు ♦ నెల్లను జూచుచు, భీతిఁదేజముడిగి ♦ పెంపుదఱిఁగి
కాంతిదఱుఁగుదీప ♦ కళికయుఁబోలెను, దర్పముడిగెసైన్య ♦ తతిదలంప. ౯౪.

క. మదముడుగుదంతిప్రతిగా, నెదిరించినమత్తకరికి ♦ నెంతయు గెలువన్
విదితంబగుగతినితనికి, సదనం గెలువంగసులభ ♦ మగుచుంబోఁ జేన్. ౯౫.

క. అనియీరీతినిశంభుం, డనుపమునగుపార్థుకీర్తి ♦ యరిమధ్యమునన్
గొనియాడుచుమతిక్రమమున, ననినాతనిగెల్చియోడు ♦ నయ్యెడఁదలఁచెన్. ౯౬.

వ. అంత. ౯౭.

సీ. తపసియౌవిజయుని ♦ యపరిమితంబైన, బాణావళినిభూత ♦ పతిబలంబు
నఖిలజీవులుభూమి ♦ నాజన్మసిద్ధమౌ, జాతిధర్మముమించఁ ♦ జాలనట్లు
సైరింపఁగాలేక ♦ సతతంబుభయమంది, యాకులంబగుచును ♦ గోకులంబు
నిశివేళలనువర్ష ♦ నిర్ఘోషమునుబోలె, ఘనబాణరచితాంధ ♦ కారమడర
నతఁడుబరఁగించుశరవర్ష ♦ వితతరవము, వీనులెల్లనుబగిలింపు ♦ వివశమగుచు
వినుచునంతంతనిలిచిక ♦ న్గొనుచునుండెఁ, జిత్రరూపంబుపగిదిని ♦ శ్చేష్టితముగ.

మ. అపుడప్పార్థుఁడుహస్తలాఘవసము ♦ ద్యల్లీలబాణావళిన్
నిపుణుండైపరఁగింపుచున్భయమునన్ ♦ నిర్విణ్ణులైనట్టియా
రిపుసైన్యంబులకుంగనంబడియెభూ ♦ రిప్రక్రియన్ధుష్టరో
గపరీతంబగులోచనాళికినిశా ♦ కాంతుండుపెక్కైగతిన్. ౯౯.

వ. అంత. ౧౦౦.

సీ. సైన్యకంపంబున ♦ శంభుదేహముజలా, శయములకల్లోల ♦ చంచలముల
ఛాయామధ్యంబైన ♦ ఛాయాధిపాకృతి, కరణిభేదతమీఱఁ ♦ దరళమగుచు

నిర్వికారుండౌట ♦ నెఱయఁ బెద్దలచేష్ట, లవితర్క్యములు గాన ♦ నపుడు నరునిఁ
గదిసియుఁ గోపంబు ♦ గదురక ఘనభుజ, విస్ఫార్యమాణమౌ ♦ వింటి నారి
కుపితకాలోగ్రతోద్దండ ♦ గుణవిభాతి, దుష్టతక్షకసింహోగ్ర ♦ తులితగతులు
దనర నాకర్షణము సేయు ♦ చును వెలింగె, నుగ్రుఁడవ్వేళ ఘనరణో ♦ దగ్రుఁడగుచు.

చ. కుడిసెడ మవ్వడిం దిగియు ♦ ఘోరధనుర్గుణచండనిస్వనం
బడరఁగ నత్తఱిం బొలిచె ♦ హస్తిపకుండు వలించి పల్కునన్
గడఁగి మదోద్ధతిం బెరుఁగు ♦ గంధగజంబను శంక పార్థులోఁ
బొడముఁగఁ జేయుచున్ గదన ♦ భూరిభుజావిభవంబు మీఱఁగన్. ౧౦౨.

క. శరవర్షంబున ప్రతిగాఁ, బరఁగించెడు పార్థబాణ ♦ పఙ్క్తి మరల్చెన్
శరనిధి జలచరచయమునఁ, దఱచుగ నదిసెదుఱు వచ్చు ♦ తత్కూలము బలెన్. ౧౦౩.

సీ. పరిపంథిమార్గంబు ♦ ప్రతిబంధముగఁ జేసి, యంతర్విభేదంబు ♦ నాచరించి
వివిధవిధ్వంసన ♦ విధిమీఱ నవిదితో, పాయప్రయోగత ♦ పార్థివుండు
శత్రువిచ్ఛేదంబు ♦ సరగఁ జేసెడు లీల, నగపినయ్యర్జును ♦ సాయకముల
నడరి పైరాకుండ ♦ నడుమ నే భేదించి, శరమోక్షసంధాన ♦ మెఱుఁగకుండఁ
జండకోదండగుణనము ♦ ద్దండరవము, నిండి బ్రహ్మాండమవియింప ♦ నిశితఘోర
సాయకాసారమడరించి ♦ శకలములుగఁ, జేసె నవ్వేళ నాచంద్ర ♦ శేఖరుండు.

క. ఈకరణి వితథమైనను, నాకవ్వడి క్రోధమడర ♦ నడరించు శరా
నీకము రయమున సభయా, నీకంబుగ వ్రాలె విషమ ♦ నేత్రుఁడు జూడన్. ౧౦౪.

ఆ. పార్థుఁడే యనిబిడ ♦ పద్ధతిఁ బరతెంచు, బాణవితతి హరుఁడు ♦ భంగపఱుప
సాధుజనులకనవ ♦ సరమునందును బోలె, నపుడు ధృతిదొఱంగె ♦ నర్జునుండు. ౧౦౫.

క. వరుసన ధోముఖమై పడు, నరసాయకనికరమెల్ల ♦ నడుమన ఱకియా
హరబాణపఙ్క్తి మెఱసెను, నిరుపమ రణకర్మఫలము ♦ నెరయఁగ నంతన్. ౧౦౬.

ఆ. అప్పుడర్జునుండు ♦ నత్యంతలాఘవ, పటిమ మెఱయఁ బఱపు ♦ బాణరాజి
శంభుమార్గణముల ♦ సమయించియాకుల, పడు బలంబు నాఁటఁ ♦ బటురయమున.

క. నరుఁ డెచ్చియురవణించినఁ, బురహరుఁడు నిదాఘవర్ష ♦ మును బోలె నుదాఁ
బరఁగించెను శరవర్షముఁ, గరలాఘవపటిమ మెఱయఁ ♦ గడురభసమునన్. ౧౦౭.

ఆ. హరుఁడు ప్రియచికీర్షఁ ♦ దైపరఁగించెడు, మర్మపరిమృశోగ్ర ♦ మార్గణములు
పరమమిత్రు నర్మ ♦ భాషణంబుల లీల, నరున కపుడు ప్రీతి ♦ కరములయ్యె. ౧౦౮.

ఆ. అప్రమునిజశరంబు ♦ లతిరేకమునఁబొందఁ, గరముశక్తిఁజెఱుఁగ ♦ నరునిబాణ
పఙ్క్తిఁ జూచి ప్రమథ ♦ బలములు పెల్లార్చ, నధికమహిమ వెలయ ♦ హుఁకరించె.

సీ. ఘనతపోవీర్యంబు ♦ లనుసముద్ధతిమీఱఁ, గదచాఁబఁదరియింప ♦ మదిఁదలంచు
నరునిబాణములెల్ల ♦ హరియించెఁదపనుండు, జలములనివిరించు ♦ చందమునను
నంతనర్జునుఁడుబా ♦ ణాంతరిక్తంబైన, శూన్యతూణయుగంబు ♦ వన్యగజము
జలమెల్లఁద్రావిన ♦ శైలాశ్మగర్తంబు, నంచునుద్వృష్టచే ♦ హస్తియొకటి
కరముచాఁచినలీలను ♦ శరములున్న, పనుచుహస్తంబుఁబలుమాఱుఁ ♦ జొనిపియప్ప
డర్థహీనతఁజెప్పనో ♦ రాడకుండు, బంధువునిబోలెఁబలుమాఱుఁ ♦ బరికృశించి.

క. ఘనతరబాణగ్రహణం, బునకైపలుమాఱుతూణ ♦ ములునిజహస్తం
బున వెదకివెదకిశరములు, గనఁబడకుండంగనరుఁడు ♦ గతతేజుండై. ౧౧౩.

క. ధరగెలువఁగమదిఁదలఁచిన, ధరణీశుఁడునీతివికల ♦ తనుగుందునుదా
మతిమతియూహించెడుగతి, శరధులుపలుమాఱుఁదడవు ♦ సరభసమొప్పన్.

ఆ. ఇట్లువెదకివెదకి ♦ యిషులాభమొందక, పరికృశించునరుని ♦ పార్శ్వములను
శూన్యతూణయుగము ♦ జూపట్టెవిగతాంబు, లైనపూర్వపశ్చి ♦ మాబ్ధులనఁగ.

వ. అప్పుడు. ౧౧౬.

ఆ. శూన్యతూణయుగముఁ ♦ జూచియడలెఁగాని, యమ్ములణఁగుటకెద ♦ నుమ్మలింపఁ
డయ్యెనతఁడుపెద్ద ♦ లాత్మదుర్దశమాని, యాప్తశూన్యతకును ♦ నార్తిఁబడరె. ౧౧౭.

వ. ఇవ్విధంబున నాకవ్వడి దివ్యాస్త్రంబులాదిగాఁగల నిఖిలాస్త్రంబులా శంకరుమహి మానుభావంబున నంతర్హితంబులైనం బ్రతిక్రియ సేయ నెఱుంగక కృతోపకారంబు లైనతూణీరంబులవలన మిత్రకులంబువలనం గృతఘ్నుం డైనసాధుజనుండునుంబోలె బలాత్కారంబున విశ్లేషత్వంబు నొంది యపు డయ్యర్జునుహస్తంబు పశ్చాత్కారణంబున నత్తూణీరయుగళంబున కుపకారత్వంబును సంధింపం దలంప నుద్యుక్తం బై యుండె నశ్లేకదా సంభావితుం డగువాఁడు సత్క్రియావైఫల్యం బగునెడం బ్రభుపురోభాగంబునం బెఱితివక నిలుచుట సాహసికత్వం బగుం గావున నివ్విధంబునం బురోవ్యాపారకరవిహీనుండై విగతశరవిహరణంబునం బెఱితివియక నిలుచు నా సంక్రందన నందనుం గినిసి శంకరుం డహంకరించి తత్వార్థవిచారమధ్యంబున నిరుత్తరుం జేసి నిఖిలార్థసంవేది యగునెఱవాది నిగ్రహస్థానంబునం బ్రతివాది నొప్పించుతెఱంగున మహాపావకమయంబు లైనసాయకంబుల నాయంబులు నొప్పించి సత్వరంబుగా మణి గణఘృణిప్రద్యోతితహైమరేఖావిశంకటం బగుతదీయకంకటంబు చండకిరణతిరోహిత

పరిమండలీకృతతటిత్సముంచితమరుద్విచ్ఛిన్నాభ్రఖండంబునుంబోలెఁ బ్రచండకాండప్రయోగలాఘవంబున హరించినఁ బ్రదీప్తుం డగుభాస్కరుండునుంబోలెం బ్రకాశింపుచు మహాచ్ఛాదనోల్లీఢకఠోరాసివిశేషంబునం గంచుకవిచ్ఛిన్నుం డగుమహానాగంబు చందంబునఁ బ్రతిబద్ధద్విపోన్ముఖనిబద్ధక్రోధోద్ధతప్రచండశుండాదండసముద్దండం బగుమత్తశుండాలం బగువిధంబునఁ బ్రావృణ్ముఖమేఘసంఘాతభీషణనిర్ఘోషణసంబోధితమహామహీధరగుహాపనిర్గతనిరర్గళధ్వనితసముద్ధతరంహం బగుసింహంబు ననుకరింపుచు, ధూమరహితజ్వాలాభీలకాలాగ్నిసంకాశం బై మహాతీక్ష్ణత్వవైరనిర్యాతకత్వరణదుర్మదమనస్థైర్యత్వతేజోధికత్వంబులం బ్రజ్వలితుం డై యుండె నప్పుడు తనుత్రాణంబుతోడం గూడం దూణీరయుగ్మం బచేతనం బయ్యును జేతనత్వాపేక్షితం బైనవిధంబున వాఙ్ముఖంబుగా భూతలనిపతితం బయ్యె. ఆ సమయంబున నిర్మలం బగునభస్స్థలంబునం బ్రకాశింపుభాస్వంతుండునుంబోలె సత్వగుణప్రధానుం డై యుండు నగ్గాండీవిం గిట్టి విశ్వకర్మభాస్కరుంబోలె శస్త్రాభిమర్శితుం జేసినం దత్సాయకాసారంబులకుం జలింపక నిజరోషతనుత్రాణాయమానుం డై యానుపూర్వ్యాయతబాహులీల లొప్పనను ప్రవద్రుధిరసంలిప్తగాత్రుం డై పార్ష్ణిప్రఘాతంబుల భూతలంబు గంపింపనార్చుచు మహాశనిసంకాశం బై శశాంకశకలాకారపాండురం బగు గాండీవచండశరాసనాగ్రంబున నయ్యుగ్రుం బొడిచి మదద్విరదంబు మహీరుహస్తంభంబునుం బోలెం బొడిచిన. ౧౧౮.

క. పొడిచినతద్ధనువప్పుడు, మృదునిమొడఁ లీలమయ్యె ♦ మిహిరుని తేజం
బడరె నుజహ్నుమహాముని, యొడనుద్ధతివచ్చుగంగ ♦ యింకినమాడ్కిన్. ౧౧౯.

తే. ఇట్లుచాపంబుపోయిన ♦ నింద్రసుతుఁడు, వితరణాయుతేనిసత్కార ♦ గతినివాజి
కర్మమునకంతశక్తుండు ♦ గాకహరుని, శరవిదూరవిఘాతలఁ ♦ జాలడస్సె. ౧౨౦.

క. ఆసన్నశుభఫలోదయు, భాసురవీరవ్రతాను ♦ పాలకునియతిం
గాసిలెహాయశరములనుప, హాసాదులచేతఁదపసి ♦ పలెనవ్వేళన్. ౧౨౧.

సీ. అంతనయ్యర్జునుఁ ♦ డాపన్నివారక, మగునట్టిశరణంబు ♦ నందురీతి
ఘనకార్యసిద్ధిసా ♦ ధనతఁగాంచినలీల, నన్యదుస్తరితతే ♦ జోధికతను
దీపించుఘనదృఢ ♦ దివ్యఖడ్గంబందె, మూర్తితాహంకార ♦ మునుభజించు
చందంబుననుగేల ♦ నందిశంకరుబాణ, వితతిఖండింపుచు ♦ వివిధగతుల
విలసదర్కాంశుపిహితోర్మి ♦ కలఁదలిర్చు, వారిరాశివిధంబున ♦ ధీరుఁడగుచు
ఖడ్గనిపుణులువిహరించు ♦ గతులుదనర, నరుఁడువిహరించెబీరంబు ♦ మెఱయనపుడు.

మ. సలిలాకాశములందుభానుఁడుప్రతి ♦ చ్ఛాయాస్వరూపప్రభా
విలసన్మూర్తియుగత్వమొందుచుమహా ♦ విస్ఫూర్తిదీపించులా
గులనయ్యర్జునుఁడాకసంబునరణ ♦ క్షోణింబ్రకాశించెవి
రలసద్భాసికరాసికాశలమహా ♦ ప్రావీణ్యతల్ మీఱఁగన్. ౧౨౩.

మ. కఱకంఠుండపుడుగ్రసాయకమునన్ ♦ ఖండింపనప్పార్థుచేఁ
గరమొప్పారుకరాసిదీప్తులడరం ♦ గానంతఁదుత్తున్కలై
ధరమీఁదంబడెభూరిమేఘనిపత ♦ త్సౌదామినీజాతవి
స్ఫురదగ్నిప్రభమీఱభూతగణముల్ ♦ సూడంగఘోరంబుగాన్. ౧౨౪.

క. ఈపగిదినిజఘనఖ, డ్గాపహరతఁగదనవిముఖుఁ ♦ డైనరుఁడంతన్
దీపింపకుండెనుదుహ్య, త్ప్రాపంబునసమరభూమి ♦ దరినవ్వేళన్. ౧౨౫.

ఆ. ఇట్లుభంగమొంది ♦ యెంతయుఁగోపించి, భుజసహాయుఁడయ్యు ♦ విజయవాంఛ
వృక్షసస్ణకరక ♦ వృష్టిఁబోలెనుపార్థుఁ, డశ్మవర్షమప్పు ♦ డడరఁజేసె. ౧౨౬.

ఉ. అడరుశిలావితానముపు ♦ డాహరుఁడుగ్రశరబాణరాజిచే
నడఁగఁగఁజేసెవన్నరుఁడ ♦ హంకృతిమీఱఁగఁబాటవంబులన్
గడువడిభూనభోంతరముఁ ♦ గప్పిదిగంతములెల్లనిండఁగా
బడిబడినేసెబాహుబల ♦ భాసితుఁడైపిఱుతీయకెంతయున్. ౧౨౭.

చ. శకలములైనకొమ్మలను ♦ జక్కఁగుచర్మముడుల్లుపర్ణముల్
వికటతరాలుపుష్పముల ♦ విశ్లథమైనరసాంబుపూరతన్
వికలములైనమూలముల ♦ వృక్షవితానముద్రెళ్లనేసెఁదాఁ
బ్రకటరణోర్వదేవతకుఁ ♦ బారణచేసినలీలశంభుఁడున్. ౧౨౮.

మ. నరుఁడంతన్ సరిదుత్తరన్నకరిదం ♦ దంబొప్పగంగాప్రవా
హరవోద్దండశరప్రవాహమునకై ♦ దానాభిముఖ్యంబుగాఁ
గరమొప్పన్వడివచ్చిశంకరునివ ♦ క్షంబుద్ధతిన్ బాహువి
స్ఫురితోగ్రస్ఫుటముష్టిఘాతలవడిన్ ♦ స్రుక్కించెనౌద్ధత్యుఁడై. ౧౨౯.

సీ. కడఁగియశోలక్ష్మి ♦ గలుగునుపాయంబు, చింతించితాశత్రు ♦ సేనతోడఁ
గినిసిదుర్లభమైన ♦ ఘనపరాక్రమమొందఁ, గోరుచుదగ్గరఁ ♦ జేరునరుని
యౌద్ధత్యమప్పుడా ♦ హరుఁడుశైశవమందుఁ, గడుప్రియుండవుదుఁడైన ♦ కొడుకుచేయు
దుడుకులుజనకుండు ♦ గడుకూర్మిసైరించు, చందానసోర్చెవా ♦ త్సల్యమలర

నంతభుజయుద్ధసన్నద్ధుఁ ♦ డైననరుని, త్రోడ నెదిరించి తలపడె ♦ ధూర్జటియును
ముష్టియుద్ధంబు సేయంగ ♦ మొనసి యపుడు, పరఁగఁ దూణీరధనువులు ♦ పరిహరించి

ఆ. ఘనకఠోరముష్టి ♦ ఘాతల నొప్పించె, నరుని హరుఁడు హరుని ♦ నరుఁడు వోడువ
ముష్టిహతులరవము ♦ మొనసి గిరులయందు, గుహలఁ బ్రతిరవంబు ♦ బహుళమయ్యె.

క. హరుఁ డపుడు రవడిఁ బొడిచెడు, కరనిహతులు నరునకును సు ♦ ఖంబుగ నుండెన్
దురమున రౌద్రత నొందిన, నరునకు సుఖదుఃఖములుమ ♦ నంబునఁ గలవే. ౧౩౨

క. నరవరముష్టినిహతులఁ, దొరఁగెడు రుధిరమున దోఁగి ♦ నోరంతరము
గ్గిరితటమన హరుఁ డొప్పెను, జరఠారుణరాగపిహిత ♦ జలధరభంగిన్. ౧౩౩

క. ఉరుసహ్యగిరితటంబును, దఱచుగ వడిఁ దాఁకు జలధి ♦ తరగలభంగిన్
నరవరముష్టిప్రహతులు, కఱకంఠుని యురముఁ దాఁకెఁ ♦ గడు రయ మొప్పన్. ౧౩౪

మ. కఱకంఠోద్ధతహస్తయుగ్మవిలస ♦ ద్గాఢాయుతాయత్నని
ష్ఠురసంఘాతలఁ గంధరంబగలన ♦ త్తుల్ ఘూర్ణిలన్ సోలుచున్
వెరవొప్పంగను మూడునాల్గడుగులన్ ♦ వెక్కిట్టియప్పార్థుఁడా
హరునిం బాహులు బాహులు న్బెనచియు ♦ న్వల్లీలఁ బట్టెంగడున్. ౧౩౫

ఉ. పట్టినబాహుశృంఖలిత ♦ బంధనవైఖరి మీఱఁ బాదసం
ఘట్టనముష్టిఘాతలఁ బ్ర ♦ కంపితభూధరలీల నిద్దఱున్
గిట్టుచుఁ బాయుచుం జెలఁగి ♦ కేవున నార్చుచుఁ బార్థశంకరుల్
ముట్టును ద్రిప్పి యొండొరుల ♦ స్రుక్కఁగ సేయుచుఁ బోరి రుగ్రులై. ౧౩౬

క. ఇతఁడు నరుఁ డితఁడు శంకరుఁ, డతఁ డీతనిపైనొలేక ♦ యితఁ డాతనిపై
నతిరయమునఁ బడిరో యని, యతిభీతిఁ బ్రమథగణంబు ♦ లనఁ జెనఁగి రొగిన్. ౧౩౭

శా. ఈలీలం దగ వారువోరి రపుడెం ♦ తేతద్భరం బోర్వకా
శైలం బాత్మవిభీతిచే బటెనుద ♦ చ్చాంచల్యతం గంపిలెన్
లీలన్ నిల్చిన నిల్చుచుం గదిసికే ♦ లిన్నిక్కి నన్నిక్కుచున్
గాలోద్యద్భుజదర్పము ల్వెలయ నా ♦ క్రాంతోద్ధతిం బొల్చుచున్. ౧౩౮

వ. వెండియు నివ్విధంబున నొండొరుం గదిసి విశృంఖలవిహారం బొప్ప మల్లయుద్ధ సన్నద్ధులై శృంఖలాయమానంబుగా బాహువులు బాహువులం బెనచి పదంబులు పదంబుల బంధించి మల్లరణకరణనైపుణంబు మెఱయం బట్టువదలి పశ్చాల్లంఘన కౌశలం బొప్ప పిఱిందిదెసకుం బాయ లంఘింపుచు, మల్ల చఱచి కంఖాళించి భుజా

స్ఫాలనంబులు సేయుచుఁ దిర్యక్ప్రసారితవామహస్తమధ్యాంగుళిప్రచాలనంబు మెఱయఁ దదంతరవివర్తితసవ్యకరముష్టిప్రచారంబులు దీపింపం జెందించుచు, పరస్పరోచ్చారితతర్జనభర్జనవీరాలాపంబులు వెలయం బరిభ్రమణంబు సేయుచు, పదఘాతనిపతితతటోత్పతితజలాక్రామితసరిత్పతిస్థలం బగునట్లుగా సముద్ధతిం గదిసి పట్టి యితరేతరకరలాఘవంబులు మెఱయం బటూరయంబున ధరణీధరసహితంబుగా ధరాతలంబు గంపింపం బట్టువదలక భూమిం బడి దృఢముష్టికరంబులు వెలిగాఁ బ్రసారింప నితరేతరశిరఃప్రహరణంబులు సేయుచు, కులాలకచక్రభ్రమణానుకారంబుగాఁ గరచరణకరణపరిచయంబు మెఱయం దిరుగుచు, సముత్పతితోల్లంఘనచాతుర్యంబు వెలయం బట్టువదలి కుప్పించి పాయ నురుకుచు, కరపదపరిమర్దితభూతలముహుర్ముహురుత్పతితోద్ధతిం బొల్చుచు, గగనభాగంబున కెగసి మండలప్రచారంబుల విహరించుచుం బోరు నెడ, వియదుత్పతితుం డగునమ్మదనదమనుపదయుగళంబు నిజకరద్వయంబునం బట్టి భూతలంబు చిక్కం ద్రొక్కి దోర్బలంబు మెఱయ నిక్కి యక్కపిధ్వజుండు ధరణీతలంబునం బడం దిగిచిన విస్మయం బంది యపాపకర్మనాశంకరుం డగుశంకరుండు నశ్రముం డైనయప్పాండుసూనుం బట్టి విశ్లేషాశ్లేషంబున వక్షఃపరిపీడితుం గావించి యతండు గావించుమహత్తపంబునకంటె నత్యంతసంతోషావహం బగునాహవంబునకుం బ్రీతుం డై మహోత్సాహంబునం బొంగె నట్లేకదా మహాత్ములైనవారలకు నిఖిలగుణప్రకాశకారణం బగుతపస్సాచరణంబునకంటె నతిరిక్తం బైన నిజసత్త్వంబును నత్యాశ్చర్యకరంబుగా నుపకారకారణం బయ్యె. ఇవ్విధంబున నవ్విజయుని ధైర్యవీర్యశౌర్యధుర్యత్వంబునకు సంతసిల్లి కిరాతరూపంబు విడిచి హిమవచ్ఛుభ్రభస్మపరిష్కృతాంగుండును శీతమయూఖరేఖావిరాజితజటామకుటశేఖరుండును నవర్ఘమణిభూషణవిభూషితుండును వృషభాధిరూఢుండును నై యత్యంతమనోహరాకారంబునం బ్రసన్నుం డైనయప్పరమేశ్వరుం గనుంగొని యయ్యర్జునుండు పునఃపునఃప్రణామంబు లాచరింపుచు, తత్సాన్నిధ్యవిశేషంబున నిజతూణీరకార్ముకవర్మాసిధారియై పూర్వాకారంబునం బొల్చుటకు విస్మయంబునం బొంది నిశ్చలుం డై యుండె నాసమయంబున. ౧౩౯.

సీ. మందారనవచిత్ర ♦ మహితపుష్పంబులు, భువి నిండ వర్షించె ♦ నవిరళముగ
బోరున సురదుందు ♦ భులు మ్రోసె దివినుండి, తాటింపఁబడక వా ♦ ద్యంబుగాఁగ
నింద్రాదిదిక్పాల ♦ సాంద్రవిమానౌఘ, రత్నావళీప్రభా ♦ రతిమదనరి
తారకావ్యాకీర్ణ ♦ తను బొందినటువలె, గగనంబు సదమల ♦ కాంతి మెఱయ